I

# ఆఱు నదులు

ఖండాంతర విస్తృతిగన్న
భారతీయ సంస్కృతిని
చిత్రీకరించు నవలా రాజము

కవి సమ్రాట్
విశ్వనాథ సత్యనారాయణ
విరచితము

కృష్ణాపత్రికా ప్రచురణలు
పోస్టుబాక్సు నెంబరు 253
హైదరాబాదు - 1

IV

# వి ష య సూ చి క

i

# ప్రవేశిక

ఇది ఒక కొత్త గద్య కావ్యం, నవల అనడానికి వీలులేదు. అన్నా అనవచ్చు. ఎందుచేతనంటే నవల అంటే ఇట్లా ఉంటుంది అనే నిర్ణయంలేదు కనుక. ప్రస్తుతం మనదేశంలో ఉన్న నవలా సారస్వతం పాశ్చాత్య భాషాపఠనంవల్ల వచ్చింది. పూర్వం మనదేశంలో అనేకరకమైన గద్య ప్రబంధాలు ఉండేవి. హేమచంద్రుడు తన కావ్యాను శాసనంలో ప్రవేశికా, ప్రపల్లికా మొదలైన అనేకరకాల గద్య ప్రబంధాలు ఉన్నట్లు వ్రాశాడు. అవన్నీ ఏమైనాయో ? మన గ్రంథాలు చాలా తురకలచేత క్రైస్తవులచేత నాశనం చేయబడినవి క్రైస్తవ మిషనరీలు సంస్కృత గ్రంథం కన్పడితే చాలు తగలబెట్టారట. వాళ్ళ నాగరికత వ్యాపింప జేసేందుకు, మన నాగరికత పోవాలి కదా ! అందుచేత ఇంగ్లీషు చదువుకున్న మన వాళ్ళందరూ తక్కిన నాగరికతా శాఖలమాట అట్లా ఉంచి విద్యా విషయికంగా మనకింత అభివృద్ధిలేదు—అనుకోవడానికి వాళ్ళు మార్గం ఏర్పరచారు.

సృష్టి ప్రారంభం, మన చరిత్ర, ఈ రెండూ ప్రధానంగా తీసుకుందాము. ఈ రెంటిని గురించి పాశ్చాత్యులు కల్పించి నన్ని అబద్ధాలు ఇంకెవ్వరూ కల్పించలేదు. వాళ్ళ బైబిలులో సృష్టి జరిగి క్రీ. పూ. 2 వేల ఏండ్ల క్రింద. కాని మన మహా

భారత యుద్ధం జరిగి నేటికి 5000 ఏండ్లు గడచినవి. వాండ్ల లెక్క ప్రకారం సృష్టి 4 వేల ఏండ్ల క్రింద జరిగింది. ఎలా పొసగుతుంది? క్రైస్తవుల మతం వేరు. వాళ్ళ ప్రకృతిశాస్త్ర పరిశోధనలు వేరు. వాళ్ళ భూగర్భ పరిశోధనశాస్త్రం వున్నది. దాని ప్రకారం భూమి ఘనీభవించి 195 కోట్ల సంవత్సరాలకు పూర్వం అని వారి సిద్ధాంతం. మనసృష్టి జరిగి సుమారు ఇంతే. భేద మేమౌతోందంటే, మన కిప్పటినుంచే సృష్టి ఉన్నది. వాళ్ల బైబిలు ప్రకారం మానవ సృష్టి జరిగి 4 వేల ఏండ్లు. కాని వాండ్ల భూగర్భ పరిశోధనశాస్త్ర ప్రకారం 10 వేల ఏండ్ల క్రిందే భిన్న దేశాలల్లో మానవ నాగరికత వుంది. మెక్సికో త్రవ్వకాలు చేశారు. దానికి మాయన్ నాగరికత అంటారు. అది 10 వేల ఏండ్ల పూర్వాన ఉన్నదని వాళ్లే చెప్పారు. ఈజిప్టు కథ ఉన్నది. అది 7, 8 వేల పూర్వానికే వెళ్తున్నది. క్రీటు ద్వీపంలో త్రవ్వారు. అదీ చాలాదూరం పోతున్నది. వాళ్ళ పరిశోధనలే వాళ్లు పురాణాలనుకున్న వాటిని నిజం చేసినవి. మనదేశంలో త్రవ్వకాలు చేశారు. మొహంజోదారో, హరప్పా త్రవ్వకాలు. అది పెద్ద నాగరికత. అది 10 వేల ఏండ్లక్రితమని వారే చెప్పారు. ఈ మధ్య ఉత్తరప్రదేశ్ ఇలాంటి త్రవ్వకాలు చేశారు. ఇదంతా ఏమి చేస్తున్నదంటే. వాళ్ల బైబిలు సిద్ధాంతాన్ని పరాస్తం చేస్తున్నవి. కాని ఆ జాతి ఏమి జాతో, చమత్కారమైన జాతి—వాళ్ళు చేసిన శాస్త్ర పరిశోధనలవల్ల వచ్చిన జ్ఞానం జ్ఞానమే. వాళ్ళ మత విన్యాసాలు మత విశ్వాసాలే. ఈ జ్ఞానమంతా రాజ్యాల నభివృద్ధి చేసుకునేందుకు ఉపయోగిస్తారు తప్ప వాళ్ళ జీవ లక్షణాలకు పెంపొందించుకునేందుకు చెయ్యరు. ఈ రహస్యం

వాళ్ళమతంలో ఉందేమో. ఉన్నది—దాని విషయం మన కెందుకు ? అదట్లా ఉంచి, భూగోళశాస్త్రం ఉన్నది. గ్రహాలు ఉన్నవి. గ్రహచారము ఉన్నది. భూమిమీద జరిగిన మార్పులు, పొందే వికారాలు ఆకాశంలో జరుగవు. కనీసం ఇంత తొందరగా జరుగవు. భారతయుద్ధం సుమారు 5000 ఏండ్ల క్రితం జరిగిందని, గ్రహమండల సంచారాన్ని బట్టి మనవాళ్లు నిరూపించారు. వ్యాసుడు వ్రాసిన భారతంలోనే ఆ దాఖలాలు ఉన్నవి. వాటిని నిరూపించిన పండితులు ఉన్నారు. ఆ గ్రంథాలు విశ్వవిద్యాలయాలల్లోనూ, పాఠశాలల్లోనూ, పాఠ్య గ్రంథాలుగా పెట్టరు కనుక, మన బి. ఏ. లకు, ఎం. ఏ. లకు, డాక్టరేటులకు తెలియదు. ఇదంతా రాజనీతి. రాజనీతి చాలా చమత్కారమైనది. ఏ గూటి చిలుక ఆ పలుకు పలుకుతుందని సామెత ఉన్నది కదా ! మనం చిన్నప్పుడు ఏది చదువుకుంటే అదే నిజమనుకుంటాము. ఈ లక్షణం మానవ జాతిలో వుంది. మానవ బుద్ధియొక్క లక్షణమిది—ఈ ప్రధానమైన లక్షణం మీద ఆధారపడి, ఒక రాజనీతి పథకాన్ని నిర్మిస్తే మనం ఒక జాతిని గెలచి, దానిమీద అధికారం చెయ్యదలచుకొంటే, వాళ్ళందరియొక్క విశ్వాసాలు అలా త్రిప్పుకోవచ్చు. ఇంగ్లీషువాడు మనదేశంలో ఆ పద్ధతి చేశాడు. ఇప్పటి కమ్యూనిస్టుల పద్ధతికూడా అదే. ఎవరైనా విశేష బుద్ధిమంతులు ఉంటే (వీరిసంఖ్య సృష్టిలో ఎప్పుడూ తక్కువగా ఉంటుంది.) వారు దీనికిమించి ఊహిస్తారు. తత్కాలమందలి అధికారులు దానిని ఎదిరిస్తారు. వారికి నిజమక్కరలేదు. వాళ్ళు ఏ అలవాటు పడతారో అదే ప్రమాణం వారికి. ఇప్పుడు చూడండి. భారత యుద్ధం 5000 ఏండ్లక్రితం జరిగితే అప్పటికి మహా నాగరికత

వుంటే ఇటువంటి నాగరికత కొన్నికోట్ల సంవత్సరాలనుండి మనదేశంలో ఉన్నదని మన గ్రంథాలు చెపుతూవుంటే లేవని వేనిని నమ్మని ఒక జాతిని మనదేశంలో ఇంగ్లీషువాడు సృష్టించాడు. మనకు స్వరాజ్యం వచ్చిందంటే అది ఉత్తిత్తి స్వరాజ్యం. ఇది ఆర్థికమైన స్వరాజ్యం కూడా కాదు. అయితే ఇలా హిందూదేశం కొన్నివేల కోట్ల డాలర్లు ఇతర దేశాలకు అప్పుండ నక్కరలేదు.

ఆ ఇంగ్లీషు వాడేమి చేశాడంటే, ఆర్యులనీ, ద్రావిడులనీ పెట్టాడు. ఆర్యులు ఇక్కడివారు కాదు అన్నాడు. ఎవరో ఎక్కడినుండో దండెత్తి వచ్చారన్నాడు. ఎందుకిలా అన్నాడయ్యా అంటే, ఈ దేశం ఎప్పుడూ ఎవరో దండెత్తి వచ్చిన వారిదే. దానికి స్వాతంత్ర్యం ఎప్పుడూ లేదు అని మనకు అనుకునేటట్లు చేయటానికి. వాడి నీతి అట్లాంటిది. ఈ ప్రశ్నలన్నింటికీ సమాధానాలు మన పూర్వ గ్రంథాలలో వున్నవి. మనుస్మృతి ఉన్నది. మనుస్మృతి అంటే మనదేశంలో చాలా పెద్దవాళ్ళకు కూడా ప్రామాణ్యం లేకుండా చేశాడు. సామ్రాజ్యం మాట అటుంచి. అదంటే విరోధం కలిగేటట్లు చేశాడు. మన మతమంటేనే మనకు ద్వేషం పుట్టేటట్లు చేశాడు. మనకంటే మనలో కొందరికి—ఆ కొన్నికోట్ల సంవత్సరాల క్రిందట మానవు డిక్కడే పుట్టాడు. ఈ సంగతిని చెప్పిన పాశ్చాత్య విద్వాంసులున్నారు. వాళ్ళ మాటలకు వెల లేక పోయింది. మానవుడు ఇక్కడే పుట్టాడు. ఇక్కడినుండే సర్వ దేశాలకూ వెళ్ళాడు. మన సంప్రదాయాలను వ్యతిరేకించిన వాళ్ళని వెళ్ళగొట్టారు. వాళ్ళక్కడికి వెళ్ళి వెఱ్ఱివెఱ్ఱి వేషాలు వేశారు. అవి వేరే నాగరికతలుగా వ్యాపించినవి. ఈ

సంగతి మనుస్మృతిలో ఉన్నది. మన పురాణాలలో కూడా చాలాచోట్ల ఉన్నది. పాశ్చాత్యుల సృష్టి క్రమం, చరిత్ర, అంతా ఊహ. మన పురాణాలలో విషయాలు తీసుకొని వాళ్ళ కనుకూలంగా మార్చివేసి, మనచేత చదివించారు. ఇందాకటి పద్ధతిగా మనం నిజం అనుకుంటున్నాము.

ఈ 'ఆఱు నదుల'న్న గ్రంథంలో ఈ విషయం ప్రధానంగా చర్చింపబడ్డది. ప్రసిద్ధమైన పాశ్చాత్యులు చెప్పేటటువంటి ఈజిప్టు, గ్రీకు, మాయణ నాగరికతలన్నీ మన నాగరికత యొక్క భ్రష్ట స్వరూపాలు అనడానికి దాఖలాలు చూపించ బడ్డాయి. ఇదొక మోస్తరు వాదన. అది నిజమై ఇది కాక పోతుందా ? దీనిచుట్టూ ఒక కథ కల్పింపబడ్డది. మన నేటి ఒక తెలుగు సంసారం వాళ్ళ బంధువులు, నేటి విద్యలు, వాటి పరిణామాలు స్త్రీ, పురుషులయొక్క శీలములూ, పరిస్థితుల కనుగుణంగా ఎట్లా మారుతవి ఇవన్నీ కథాగతంగా చెప్ప బడినవి.

ఈ పుస్తకంలో ప్రధానంగా ఉన్నది కథానాయిక. ఆవిడ ఒక విధంగా సృష్టింపబడ్డది. ఆవిడ శీలం, ఆవిడ ప్రవర్తన అంతా ఆధునికం. ఆవిడయొక్క జీవలక్షణం మాత్రం మన వేద శాస్త్రోపనిషత్తుల యొక్క రహస్యముల యందు గాఢమైన విశ్వాసము కలది. ఇది నేటి మన భారతీయుని స్థితి. దీనికి, ఆమె ప్రతిబింబము. ఆ ప్రతిబింబాన్ని స్త్రీగా ఎందుకు సృజించాలి ? అంటే మనజాతిలో అంతటా మనం నిలువ దొక్కుకునే పురుషత్వం చచ్చిపోయింది కనుక.

ఇంక 'నవల'ను గూర్చి : ఇది నవలయే. పాశ్చాత్య దేశాలల్లోనే, నవలా సారస్వత శాఖారూపం బహు విధాలుగా

మారిపోయింది. ఇంగ్లండులోనే పేపర్లీ నవలల స్వరూపం వేఱు, నేడు వచ్చే నవలల స్వరూపం వేఱు. యూరపులో ఈ నవల ఇంకా మార్పులు పొందింది. కొన్ని విషయములు అనుభూతంగా చెపితే అదికూడా నవలే. క్రానికిల్ కూడా నవలే. ఆధునిక పాశ్చాత్య నవలా విమర్శకులు వ్రాసిన గ్రంథాలు చదివితే గాని తెలియదు. గ్రంథకర్తయొక్క ప్రతిభ మీద ఆధారపడి వుంటుంది. ఒక గ్రంథంయొక్క గొప్పతనం. ఇది ఇల్లాగే ఉండాలన్న నియమంలేదు. వ్రాసినవి ప్రతిభా ద్యోతకంగా ఉండాలి. తత్సంబంధ విషయ పరామర్శకంగా ఉండాలి. భాషా ప్రయోగ నైపుణ్యం ఉండాలి. పాఠకునకు ఉన్ముఖీకరణం జరిగేటట్లు ఉండాలి. 'ఇది నవల కాదు.' అన్నంత మాత్రంచేత ఏమీ ఒరగలేదు. దయచేసి మన్నించండి. ఇదీ నవలయే.



# ప్రథమ భాగము

# గంగానది

## 1

"విన్నారా"

"చెప్పనిదే వినటమెట్లా ; చెప్పాలి, వినాలి, విన్న తరవాత విన్నారా అని అడగాలి".

"విన్న తరవాత విన్నారా అని అడగట మెందుకు ?"

"చెప్పినా వినలేదేమో అని".

"చెప్పకపోయినా విన్నారా అని అడగట మెందుకంటే చెప్పకపోయినా విన్నారేమో అని."

"చెబితే వినకపోవటం ఉంటుందేమో కాని చెప్పకపోతే వినటమెట్లా వుంటుంది ?"

"చెప్పటం ఎవరు ? నేను చెప్పవచ్చు ఇంకోరు చెప్ప వచ్చు."

"అప్పుడు విషయం చెప్పి ఇదివరకు మీరిది విన్నారా అని అడగాలి."

"ఒక్కొక్కప్పుడు చెప్పబోయే విషయాన్ని విన్నారా అని అడగటం ఉంటుంది మన తెలుగువాళ్ళు అట్లా మాట్లాడుతారు."

"అదే తప్పంటున్నాను."

"ఈ తప్పు పట్టించటం నాకా తెలుగుజాతికా ? మీరూ తెలుగువాళ్ళే ! స్వజాతిని దూషించేవాళ్లు యేమైపోతారో మీకు తెలుసు."

"నేను జాతిని దూషించలేదు. ఒక మాటలో నున్న తప్పు చూపించాను."

"అది తప్పుకాదు ఎందుచేతనంటే ఒక్కొక్కప్పుడా మాటకు ఆ అర్థం. మరొకప్పుడు ఆ మాట కింకొకర్థం "విన్నారా" అన్నదానికి మీరు వినలేదు. ఇది వినండి అని అర్థం. కుక్క అంటే నాలుగుకాళ్ళ జంతువులలో ఒకటి అని ప్రధానార్థం. వాడు కుక్క అన్నప్పుడు కుక్కవంటి లక్షణములు కలవాడని అర్థం. నేను ఏమండీ సినిమాకెళదామా అని అడుగుతాను. మీ రెట్లాగూ వస్తారు కాని నన్నుడికించేందుకు నేను రాను అంటారు. ఆ మాటకు వస్తాను అని అర్థం. ఆ అర్థం అనేకతరహాల్లో ఉంటుంది. అలాగే విన్నారా అంటే ఏమిటి అని మీరడగాలి నేను చెప్పాలి. అసలు విన్నారా అని అడగటం ఏదో విశేషమైన విషయం చెప్పబోతూ దానియందు అభిముఖ్యం కలిగించే లక్షణం."

"నీవు పెద్ద పండితుడి కూతురవు. నేను నీతో మాట్లాడ గలనా ?"

"మా నాయనగారు పెద్ద పండితుడు కాడు. భావుకుడు, రసజ్ఞుడు. విచారణాశీలి మందలోపడి ఆలోచనలేకుండా ప్రతిదీ నమ్మడు. ఆలోచిస్తాడు."

"అందరూ ఆలోచిస్తారు."

"పొలంలో విత్తితే మొక్కలు మొలుస్తై. పండుతుంది. కాని అది పొలంకొద్దీని, పట్టులో చల్లితే ఎకరానికి రెండు బస్తాలు రాలేటప్పటికి ప్రాణాలు కడబడతై. మంచి రేగటి మట్టిలో ఎరువువేసి చల్లితే ఎకరానికి ఇరవై బస్తాలు పండుతై."

"ఎరువెందుకు ?"

"సరియైన భావనాశక్తి కలవారు చదువుకోవాలి అని అర్థం. ఆ ఎరువు పట్టులో పోస్తావు. ఎక్కువ పండదా అంటే ఇంకొక రెండు బస్తాలు పండవచ్చు. కాని ఎరువుధర మళ్ళదు."

"ఇంతకు విన్నారా అన్నది ఏమిటి ?"

"అదట్లా ఉంచి ఆ పట్టుపొలం ఒక్కొకప్పుడు ఎరువు యొక్క బరువును తట్టుకోలేదు. ఈచుకుపోతుంది. అలాగా పరమేశ్వరుని అనుగ్రహంవలన చక్కగా ఆలోచించలేని వానికి చదువు చెబితే వాడు విపరీతంగా ఆలోచించటం మొదలెడ తాడు. మూలఘాతుకంగా ఆలోచిస్తాడు."

"సరే విన్నారా అనటం ఏమిటి ?"

"మళ్ళీ అలా ఉంచండి. ఎరువులు చాలా రకాలు ఉన్నాయి. పాటిమన్నున్నది. గొడ్ల ఎరువు వేయవచ్చు. గొర్రెల పెంట ఎరువు వేయవచ్చు. ఎమోనియా వేయవచ్చు. దేనిగుణం దానిదే. ఇప్పుడు చూచారూ రైల్లో వెళుతూ ఉంటాడు. గుండెజబ్బు వచ్చింది చచ్చిపోతాడు, ఇలా ఇప్పుడు ఊరికే గుండె జబ్బులువచ్చి ఎక్కువమంది చచ్చిపోతున్నారు. ఎందు చేత ? మనము తినే పదార్థాలు పండించటానికి. అందులో ఎక్కువ పండించుకోవాలనే ఆబతో వేసే ఎరువుల మహాత్మ్యం చేత. తినేవన్నీ కల్తీ పదార్థాలే. చప్పున గుండె ఆగి ఊరు కుంటుంది, చూడండి గుండె ఆగి ఊరుకుంటుంది అనేమాట ఉంది. దీనికి చచ్చిపోవటం అని ఒక అర్థం. ఆశ్చర్యపడటం అని ఒక అర్థం. అల్లాగే విన్నారా అంటే ఒక ఆశ్చర్యకరమైన విషయం జరిగింది చెబుతాను వినండి అని అర్థం."

"మీనాన్న నిన్ను నాకిచ్చింది నాకు చదువు చెప్పటా నికా నాతో సంసారం చెయ్యటానికా ?"

"మీకొక కొడుకు ఒక కూతురు. నేను మీతో సంసారం చేస్తే వాళ్ళు పుట్టారా చదువు చెబితే పుట్టారా ? అది అట్లా ఉంచి ఒక్కటడుగుతాను చెప్పండి."

"ఒక్కటికేమి కర్మము నీ ఇష్టము వచ్చినన్ని అడుగు. నాకు తెలిస్తే చెబుతాను."

"అన్నీ అడగటానికి వీల్లేదు. ఒక్కటే అడుగుతాను. మీకు తెలుసనే అడుగుతున్నాను. నన్ను మా నాన్నగారు మీకెందు కిచ్చారంటే చాలా కారణాలున్నాయి, మా కెక్కువ ఆస్తిలేదు. ఆయన పెద్దకట్నం ఇవ్వలేడు. తరువాత మీరు బి. ఎ. ఎం. ఎ. ప్యాసైనారు కాని అప్పటికి స్కూలుఫైనలే చదువు తున్నారు. మరిన్నీ మీనాయనగారు మీకు రజస్వలకాని పిల్లనే పెళ్ళిచెయ్యాలని నిశ్చయం చేసికొన్నారు. ఆయన తర్కము వ్యాకరణము వేదాంతము ఆసాంతము కాకపోయినా చదువుకొన్నవారు. కొంత వేదము చెప్పుకొన్నవారు. మీ దారిని మిమ్మల్ని వదలిపెడితే ఏ అమెరికన్ దేశపు స్త్రీని చేసి కొంటారో క్రైస్తవుల పిల్లని చేసికొంటారో అన్న భయం ఉండేది వారికి. అందుచేత నన్ను చేసికొన్నారు"

"సరే చేశారు. నేను నిన్నిప్పుడు వదలిపెడితే ఏం చేస్తాడు ?"

"అది మీ నాన్నగారి నడగండి."

"నిన్నడుగుతున్నాను నీవేం చేస్తావు ?"

"నా కా భయం లేదు."

"కాదొకవేళ జరిగితే ?"

"ఈ పిల్లలు మీ పిల్లలే నంటారా ?"

"అది నీకు తెలియాలి."

"నాకు తెలుసు. మీరు నమ్ముతున్నారా ?"

"నేను నమ్మటంలేదు."

"అయితే నన్నొదిలిపెట్టేసెయ్యండి. నా పిల్లల్ని నేనూ తీసికొని వెళ్ళిపోతాను."

"వెళ్లి ఏమి చేస్తావు ?"

"మీ కెందుకు ? ప్రేమ ఘట్టంపోయి జాలిఘట్టమా ? దాంపత్య వ్యవహారం పోయి అనాథ శరణాలయ సంబంధమా?"

"నీవు వెళితే వెళ్లు. నా పిల్లలని తీసికెళ్ళటానికి వీల్లేదు."

"మళ్ళీ ఇదేమిటి వాళ్లు మీ పిల్లలని మీకేమి గుర్తు ?"

"నాకు గుర్తే. వాళ్లు నన్ను పోలి పుట్టారు, నా లక్షణాలన్నీ వాళ్ళదగ్గర ఉన్నై."

"అందుకోసమే మొదలుపెట్టాను. మీ లక్షణాలు వాళ్ళ దగ్గర ఉన్నై. నా లక్షణాలు కూడ ఉన్నవంటారా ? మీ లక్షణాలు ఉంటే నా లక్షణాలు ఉండాలి. మన ఇద్దరి లక్షణాలు కలిసి ఆ పిల్లల్లో ఉన్నవన్నమాట. ఎందుకు ఉండాలి అనే ప్రశ్న అట్లా ఉంచి ఆ లక్షణాలేమిటి ? ఆ లక్షణాలే మీ పిల్లల్లో ఉండగా మీకు వచ్చే ఆనందం ఏమిటి ? ఉన్నందువల్ల ప్రయోజన మేమిటి ? ఇది విచారించాలి. మీ లక్షణాలు మీ పిల్లల్లో ఉండాలి అనే కోరిక మీకెందుకు ? కాదు — మీ లక్షణాలేమిటో చెప్పండి నాకు."

"ఇవ్వాళ ఆదివారం గనక సెలవు గనక అన్నమక్కర్ లేదంటావా? చాలా అదృష్టవంతురాలవు గనక మా అమ్మ చిన్నప్పుడే చచ్చిపోయింది. అత్తగారి పోరులేదు. మా అక్కగాని నా చెల్లెలుగాని తలచెడ్డవాళ్లు కాదు కనక ఇంట్లో ఆడబిడ్డ రొష్టులేదు. నా గతి నీవు ఉడకేసి పెట్టాలి నేను తినాలి."

"మీకేం నష్టం. నెలకు మూడురోజులు బాకీతో సహా తీరుస్తున్నారు కదా. అందులో ఎట్లా తీరుస్తున్నారు సగం బియ్యం సగం పాయసం. ఉప్పుంటే కారం ఉండదు. కారం ఉంటే ఉప్పుండదు."

"అందుకనే నేను చెబితే వినవాయె. అందరూ చేయటంలే. స్నానం చేసేది ఇంట్లో వంట చేసేది."

"అసత్యంగా మాట్లాడితే ఈ మాటకు సమాధానాలు చాలా ఉన్నాయి, ఇంద్రుడు వృత్రాసురుణ్ణి సంహరించాడు. రాక్షసులు బ్రాహ్మణులు. ద్రావిడులు కారు. అందుచేత ఇంద్రుడికి బ్రహ్మ హత్యా పాతకం చుట్టుకుంది. అందుచేత ఆయన ఆ బ్రహ్మ హత్యని అందరికి పంచాడు. ఒక భాగము స్త్రీలకు వచ్చింది. ఇది ఒక పాతకం. పాపులను ముట్టుకోకూడదు. వ్యాధులు పాతకం చేస్తే వస్తై. మరీ కొన్ని వ్యాధులు వాళ్ళని ముట్టుకోక ముట్టుకుంటే అవి మనకు సంక్రమిస్తై.

"కాని సంఘ సంస్కర్తలలో కొందఱు సంఘ సేవకులుంటారు. వాళ్ళు ముట్టుకుంటారు. వాళ్ళకు అంటుకున్నట్లు లేదు."

"ఈ సంగతి ఆస్పత్రుల్లో చెప్పాండి. వాళ్లు ఏ చిన్న శస్త్రచికిత్స చేసినా మొహానికి గుడ్డలు కప్పుకొంటారు క్రిమినాశ నౌషధాలని తెగవాడుతారు."

"క్రిములకు పాతకాలకు ఏం సంబంధం ?"

"క్రిములకు శరీరాలకు ఏం సంబంధం ? నెత్తురు చెడట మేమిటి? చెడితే పురుగులు పుట్టట మెందుకు? చెడితే పురుగులు పుడతవని తెలుసుగాని ఎందుకు పుట్టాలి అని తెలియదే మనకు ! అది సహజమంటాం మనం. మేమే మంటామంటే పాతకాలు చేస్తే ఈ పురుగులు పుడతయ్యంటాం. అది సహజమంటాం మేం. మీరు కారణం చెప్పరు. మేము కారణం చెబుతున్నాం. మీరు కారణం ఒప్పుకోరు. మేము కారణం అంటున్నాం గనక ఒప్పుకోరు. రక్తం చెడిపోతే పురుగులు పడతవి. ఇంతమట్టుకు ఒప్పుకుంటారు. మేమేమంటామంటే చేసిన పాపంవల్ల రక్తం చెడిపోతుంది. ఇంకా పాపంచేస్తే, పురుగులు పడతవి అంటాం. ఇక్కడ కారణమల్లే కనిపిస్తుందే తప్ప ఇదీ సహజమే. ద్రవ్యంలోంచి ద్రవ్యం పుట్టటం సహజం కాని గుణములోనించి ద్రవ్యం ఎలా పుడుతుందీ అంటారు. చెడిపోయిన నెత్తురు ద్రవ్యం. పురుగులు ద్రవ్యం. అందులోనించి ఇది పుట్టవచ్చునంటే పుట్టటమనేది గుణం. ఆ గుణం ఉంటేగాని

ఆ గుణం జరిగితే గాని రెండు భిన్న ద్రవ్యాలు దీని కది హేతువుగా చెప్పలేము. అందుచేత పుట్టటమనే గుణంలో నించి పుట్టినది కన్పిస్తున్నది. కన్పిస్తున్నది ద్రవ్యం, హేతువు గుణం. అందుచేత గుణమునుండి ద్రవ్యము పుడుతున్నది. పాతకమనేది గుణం. అది వ్యాధి అవుతున్నది. వ్యాధి ఫలితములు కన్పిస్తున్నవి. వ్యాధి కూడా గుణమే. గుణమునుండి గుణము పుడుతున్నది. మనము వ్యాధిని చూడటంలేదు. వ్యాధి లక్షణాలను చూస్తున్నాము."

"మా నాయనగారు తర్క పండితుడా ? మీ నాయనగారు తర్క పండితుడా ?"

"మీ నాయనగారే తర్క పండితులు. ఇదంతా తమరి దగ్గర నేర్చుకొన్నదే. ఆరునెల్లు సావాసం చేస్తే వారు వీరౌతారు. నేను ఆరేళ్లు చేశాను."

"చేసింది సంసారమా ? సావాసమా ?"

"ఈ రోజుల్లో సావాసము కావాలట. సంసార మక్కర్లేదట."

"ఔను. సంసారం ఎక్కడబడితే అక్కడే చెయ్యొచ్చు."

"అందుకనే మిమ్మల్ని నిలవతీసి అడిగింది. మనకు పుట్టిన పిల్లలు మీ పిల్లలంటున్నారు. ఎందుచేత అంటున్నారు. మీ లక్షణాలు వాళ్ళయందు కనుపిస్తున్నవి కనక. ఒకటి పరమేశ్వరానుగ్రహంచేత. రెండు—నేను పతివ్రతనవటంచేత. ఇందులో

ఇంకొకటి ఉంది, మీ లక్షణాలు నా గర్భమునందు భద్రంగా ఉన్నవి. దీనికి రెండు కారణాలు. ఒకటి—నేను మిమ్మల్నే భావించటం; రెండు—నా శరీరగత రక్త ప్రవాహమునందు మీ శరీరగత రక్త ప్రవాహమునందు లక్షణాలకు భిన్నమైన లక్షణాలు లేకపోవటం."

"ఏమిటి మాటి మాటికి లక్షణాలు లక్షణాలు అంటావు?"

"నాకేం తెలుసు మీరే అన్నారు."

"అన్నాననుకో నువ్వు పట్టుక సాగతీస్తున్నావుగా."

"మొన్న పిల్లవాడు వాళ్ళ మేనత్తగారింటికి వెళ్ళాడు. ఎంతసేపటికి తిరిగి రాలేదు, వాడి కైదవ యేడు. మీ అమ్మాయికి మూడవయేడు. మీరు భోంచేస్తున్నారు. పిల్లవాడు రాలేదనుకుంటున్నారు. పిల్ల నాన్నా అని సావిట్లోనించి పిలిచింది. అబ్బాయి వచ్చాడా అని మీరదిరి పడ్డారు. నేను పోయి చూచి కాదు పిలిచినది పిల్ల అన్నాను. ఎందుకు పిల్లవాడనుకొన్నారు?"

"అది పిలిస్తే వాడు పిలిచినట్లే ఉంది."

"వాణ్ణి కొంచెం పెద్దవాణ్ణి కానివ్వండి తమరు మాట్లాడినట్లే ఉంటుంది." "అందాకా ఎందుకు. వాడికయిదేళ్లు. నడుస్తూవుంటే వాళ్ళనాన్నగారికి మల్లేనే చెయ్యాడిస్తాడు."

"అయితే నా కొడుకు నాకుమల్లే ఉండటం తప్పంటావా?"

"అది తప్పైతే ఆ తప్పు మీదికాదు నాది. అది తప్పు కాదు. కాదని వేద శాస్త్ర పురాణాలు చెబుతున్నవి. తప్పని ఇప్పటివాళ్లు చెబుతున్నారు. అట్లాఉండకూడదట. ఉండకండా ఉండే ప్రయత్నాలన్నీ చేస్తున్నారు. మళ్ళీ పెళ్లి చేసికోవాలట ఆ పుట్టిన కొడుకులు తమ కొడుకులే కావాలట. వెళ్ళెందుకో తెలియటంలా."

"బీజ ప్రాధాన్యం క్షేత్ర ప్రాధాన్యం అని రెండు వున్నై. వాళ్ళు క్షేత్ర ప్రాధాన్యాన్ని అంగీకరించరు. బీజ ప్రాధాన్యాన్నే అంగీకరిస్తారు." "ఇందాక మనవి చేశాను కదూ మంచి ప్రాసంగు విత్తనాలు తీసికెళ్లి పట్టులో పోస్తే ఏం ప్రయోజనం ? ఎట్టు జిలమ వడ్లు మంచి ఇసక రేగటి పొలంలో పొయ్యటమెందుకు ?మంచి ఇసక రేగటి పొలంలో ప్రాసంగులో వంక సన్నాలో నంబర్లో ఢిల్లీభోగాలో కిచిడీలో పొయ్యండి: సమృద్ధిగా పండుతుంది. గుణమిచ్చే ఆహారం దొరుకుతుంది."

"మొలకొలుకులు చెప్పలేదేం ?"

"మొలకొలుకులలో నడ్డిలో బాధ కలిగించే గుణం ఉందిట. అది వ్యాధి హేతువంటారు."

"ఇంతకూ నీవు చెప్పదలచుకొన్న దేమిటి ?"

"నే నింక వంట చెయ్యాలి. నేను చెప్పదలచుకొన్నది మీరు చెప్పనివ్వలేదుగా."

"ఇదంతా నేను చెప్పమని అడిగానా ?"

"ఒక్కొక్కప్పుడు అక్కరలేనిది చెప్పినా ఉపయోగ పడుతుంది. అనవసరమని ఒక పని చేస్తాం. అది అవసరంలోకి వస్తుంది. ఒకప్పుడు చాలా అవసరమని ఒక పని చేస్తాం. అది నిష్ప్రయోజనమవుతుంది."

"ఎందుచేతనంటావు ?"

"అది తెలిస్తే అధర్మ మెందుకుంటుంది."

"మరి చెప్పేదేమిటో చెప్పవా ?"

"రాత్రికి !"

# 2

అతనికి నలుగురు మేనమామలు. ముగ్గురు పినతల్లులు. పెద్ద మేనమామ ఢిల్లీలో పెద్ద ఉద్యోగస్తుడు. అతనికి రెండువేల జీతం. వాళ్ళది పూర్వం చాలా పేదసంసారం. అతండ్రి కిందా మీదాపడి ఆ సంసారాన్ని నెట్టుకవస్తూ ఉండేవాడు. వాళ్ళ దగ్గర అప్పుచేసి వీళ్ళదగ్గర అప్పుచేసి, ఈయన పదిరూపాయలడిగితే ఎట్లాగూ వచ్చేదికాదని వాళ్ళకు తెలుసు గనక మొగమాటానికి వాళ్లు నాలుగు రూపాయలు చేతిలోపెట్టి అతనికి అరయెకరం పొలముంటే అందులో నాలుగు బస్తాలు కౌలు వస్తూవుంటే అవి రాకముందే ఖర్చైపోతూఉంటే సంవత్సరం పొడుగునా ఒకటే దారిద్ర్యం వెళ్ళబోస్తూ మగపిల్లవాడి చదువు దానంతట అది వెళుతూవుంటే, వాడు ఎట్లాగో స్కూలుఫైనలు ప్యాసయితే, ఎవడో ఎందుకో ఢిల్లీ తీసికెళితే అక్కడ ఏదో చిన్న ఉద్యోగం దొరికి పైన చదివి పెద్ద ఉద్యోగమై ఇంత సంపాదించటం మొదలెట్టాడు. అతడు బుద్ధిమంతుడై తమ్ముళ్ళకు చదువు చెప్పించాడు. చెల్లెళ్ళకు

పెండ్లిండ్లు చేశాడు. వాళ్ళ ఊళ్ళో మేడ కట్టించాడు. ఒక్క దురదృష్టవంతురాలు వాళ్ళమ్మే. అతని సంపాదన అందుకోక ముందే ఈ అమ్మాయికి వాళ్ళ నాన్న పెళ్ళిచేశాడు. ఒక వెయ్యి రూపాయలు కట్నమిచ్చింది. అప్పటికి అదే గొప్ప అయింది, తక్కిన ముగ్గురు చెల్లెండ్లకి ఆ పెద్దమేనమామే పెళ్లి చేశాడు. ప్రతి చెల్లెలు పెండ్లికి యేడెనిమిది వేలు ఖర్చయినవి. ప్రస్తుతము నలుగురు మేనమామలు గొప్పగొప్ప ఉద్యోగాలలో ఉన్నారు. పెద్ద మేనమామదగ్గిర ఇద్దరు కూతుళ్లు రెండవ మేనమామదగ్గిర ఇద్దరు కూతుళ్లూ ఉన్నారు. వాళ్ళమ్మ ఆ అన్నల కూతుళ్లలో ఒకర్తెని తన కొడుక్కి చేసికొందామను కొంది. తన కొడుకు అయిదవ ఫారం. వాళ్లివ్వనన్నారు. ఇంతలో ఆవిడ పోయింది. వీళ్ళనాన్నకి ఉడకేసి పెట్టే దిక్కు లేకపోయింది. చేసికొంటే తను రెండో పెండ్లి చేసికోవలసి వచ్చింది. లేకపోతే కొడుక్కి పెండ్లిచేయాలి. ఏ పదేండ్ల పిల్లనోచేస్తే మూడేళ్లయితేనే గాని ఆ పిల్ల తన ఇంటికి రాదు. బావమరుదులు తనకేమి సహాయం చేసేటట్లు కనుపించలేదు. పిల్లవాణ్ణి తీసికెళ్ళి చదువు చెప్పిస్తామన్నారు. వీళ్ల నాన్నకి అది ఇష్టంలేదు. పిల్లవాడు చెడిపోతాడని. చెడిపోవటమంటే పెద్ద పరీక్షలు ప్యాసయి పెద్ద ఉద్యోగంలో ప్రవేశించడని కాదు. అది జరగవచ్చు కాని బ్రాహ్మణ్యం చెడిపోతుంది. ఆయన చూస్తున్నాడు. తన బావమరుదులు దొరలకాలుగా మారిపోయినారు. వాళ్ళ ఇళ్ళల్లో స్త్రీలు బహిష్టలైతే పట్టిం

పులు లేవు. మడి కట్టుకోరు. స్నానంచేసి ఉతికిన బట్ట కట్టు కుంటే అది చాలా గొప్ప. చొక్కాలతో భోంచేస్తారు. బూట్లతో భోంచేస్తారు. బల్లలమీద భోంచేస్తారు. ఆ బల్లలమీద శుద్ధి ఎట్లా పెడతారు. నిలుచుండి భోంచేస్తారు. పైగా ఈ ఆచారాలలో యేముంది అంటారు. అది అంతా ఒక అబ్రాహ్మణ మేళమయింది. ఎప్పుడైనా ఆ బావమరుదులు వస్తే ఈయన పొరపాటున ఇవి బాగుండలేదంటే వాళ్ళు లుసకరించివేస్తారు. ఇతను వాదనలోనికి దిగితే వాళ్ళ వాదనకి ముక్కు చెవులు తల తోక ఉండవు. వాళ్ళు వాదనకి నిలవరు. వాళ్ళకి ప్రమాణాలు లేవు. వాళ్ళ ఇష్టానిష్టాలే ప్రమాణాలు. వాళ్ళతో వాదన ఎట్లా. ఆ మతం గొప్పా ఈ మతం గొప్పా అని చర్చవస్తే గొప్ప అంటే ఏమిటి అన్న విషయం తేల్చు కోకుండా నిర్ణయించడం ఎట్లా? అందుచేత వాళ్లు తమ బావ మరిది తమ మేనల్లుణ్ణి పాడుచేస్తున్నాడు అన్నారు, వాడు స్కూలు ఫైనలన్నా ప్యాసుకాలేదు. వాడికి పెళ్లెందుకు? వాడు తన్ను తాను పోషించుకోగలడా పెళ్ళాన్ని పోషిం చేందుకు? ఈ పద్ధతిగా చాలా మాట్లాడారు. వాళ్లు మేనల్లుడి పెళ్ళికి రాలేదు. అందుచేత వాళ్ళకి వీళ్ళకి ఎడమొగము పెడ మొగము. కాని ఇప్పుడితను ఎం. ఎ. ప్యాసయి రెండు వందలు తెస్తున్నాడు. వాళ్ళకి అక్కడెక్కడో ఒక పల్లెటూళ్ళో నాలు గెకరాల మెట్ట, చెరువుక్రింద యెనభై సెంట్ల మాగాణి ఉన్నది. తండ్రి ఆ ఊళ్లోనే ఉంటాడు. అక్కడ వాళ్లకి మంచి చెడ్డ

చెబుతూ ఏదైనా చూచిపెడుతూ కాలక్షేపం చేస్తూఉంటాడు. తానే వండుకుంటాడు. మొత్తంమీద ఇప్పుడు మేనమామల కుటుంబాలతో పినతల్లుల కుటుంబాలతో ఇతనికి సంబంధం లేదు. అనటానికి వీలులేదు పినతల్లుల మొగుళ్లు ముగ్గురు మేన మామలు నలుగురు ఈ దేశాన్నిపట్టి ఈ కాలాన్నిపట్టి మంచి ఉద్యోగాలలో ఉన్నారనాలి ప్రతివాళ్ళకి వేయికి అటో ఇటో జీతాలు మేనమామల కూతుళ్ళు ఒకతె ఇంగ్లండు పెళ్ళి వచ్చింది. ఒకత్తె పెద్ద డాక్టరు. ఒకత్తె ఏదో విశ్వ విద్యాల యంలో ఆచార్య అని. అందరూ ఇట్లా ఉన్నారు. మూడవ మేనమామ కూతురు ఒకావిడ ఉన్నది. ఆవిడ తనపేరు మార్చుకొని సోఫియా అని పెట్టుకుంది. ఆమె పెళ్ళి చేసికో నంది. ఆ ఇళ్ళల్లో ఎవళ్ళ ఇష్టాలని ఎవళ్ళు కాదనరు. మరీ ఆ మూడవ మేనమామ ఇల్లు విచిత్రంగా మారిపోయింది. ఆయన కొడుకు ఒక ఇంగ్లీషు పత్రికలో సంపాదకుడు. అతడు భార తీయ మతాన్ని సంప్రదాయాలని ఆచారాన్ని యథేచ్ఛంగా విమర్శిస్తూ ఉంటాడు. సర్వజనులు సమానమనే సిద్ధాంతానికి అతడు కిరీటంమీధ పెట్టిన మణి. అతను మద్య మాంససేవనము చేస్తాడు. ఇంగ్లీషు భాషలో శక్తిమంతమైన రచన చేస్తాడు. అతడు వ్రాసిన ఇంగ్లీషు కొంద రెగబడి చదువుతారు. అతనికి చాల ప్రతిష్ఠ ఉంది. అతనికి నెలకు వెయ్యి రూపాయలు జీతం. ఈ సోఫియా అతని చెల్లెలు. ఈమె ఎం. ఎ. ప్యాసయింది. ఇంగ్లీషు ఒక్కొక్కప్పుడు అన్నగారివలె వ్రాస్తుంది. తల్లిదండ్రు

ఆమెకు పదివేలిచ్చి ఎవరినైనా బ్రాహ్మణకులస్తుని తెచ్చి పెళ్ళి చేద్దామనుకున్నారు. సాధ్యం కాలేదు. "పెండ్లి తల్లి తండ్రులు చేసేదికాదు. ఎవళ్ళకి వాళ్ళు చేసికొనేది. బ్రాహ్మణులు మడికట్టుకొని కూర్చోటానికి వీలులేదు. దాన్ని దురంత కత్వం అంటారు. (Tyranny) సృష్టిలో ఈ దురంతకత్వం నశించిపోతే కాని సర్వమానవ సౌఖ్యం చేకూరదు" మొదలయిన మాటలు చెబుతుంది. ఆధునికమైన చదువు బాగా చదువుకుంది. ఆవిడ ఇంగ్లీషు మాట్లాడుతుంటే ఆవిడముందు చాలామంది నిలవలేరు. ఆవిడకి వాళ్ల అన్నగారు ఒత్తాసు. నిజాని కావిడకి వత్తాసక్కరలేదు. ఆ అన్నగారు ఒక క్రైస్తవ స్త్రీని వివాహమాడాడు. ఒక యేడాది వాళ్ళకి వీళ్ళకి సంబంధంలేకండా ఉంది. కాని క్రమక్రమంగా రాకపోకలు సాగినవి. ఈ సోఫియా కూడా ఎవనినో క్రైస్తవునినో పరదేశీయునో చేసికొంటుందని అందరూ అనుకొంటునే ఉన్నారు. కమల వచ్చి చిదంబరశాస్త్రితో విన్నారా అని అనక్కరలేదు. కాని ఇలాంటి విషయాలు ఎప్పటి కప్పుడే క్రొత్త.

ఆ రాత్రి చిదంబరం కమలతో అన్నాడు.

"ఇంటాకటి విన్నారా అన్నది ఏమిటి ?"

"ఇందాకటి మాట ఇందాకే ఇప్పటిమాట ఇప్పుడే"

అప్పుడు చిదంబరం "సరే ఇప్పటిమాటే" అని ఆమె కొంగు పట్టుకొని లాగాడు.

కమల "ఇది ఎప్పటి మాటాను. మీరు భర్త నేను భార్యను. మీరు సద్వంశంలో జన్మించారు. నేను సద్వంశంలో జన్మించాను. మన ఇద్దరి నడుమ ఈ శృంగార రసం ఉన్నది. సద్వంశములో పుట్టిన పురుషుడు అసద్వంశములో పుట్టిన స్త్రీ లిద్దరు వివాహమాడారు. వాళ్ళ ఇద్దరిమధ్యకూడా ఈ శృంగార రసం ఉన్నది. పురుషుడు అసద్వంశములో పుట్టాడు. స్త్రీ సద్వంశములో పుట్టింది. పెండ్లి ఆడారు. శృంగారరసం ఉన్నది. భార్యా భర్తలిద్దరు అసద్వంశసంజాతులు శృంగారరసం ఉన్నది. నేనొక కథ చదివాను. మా నాయనగారి దయవల్ల నాకు సంస్కృతాంధ్రములు వచ్చినవి. మీ దయవల్ల ఇంగ్లీషు వచ్చి నది. మీరు ఆరేండ్లు మీ పరీక్షలు మీరు చదువుకుంటూ అర్ధ రాత్రమైనా అపర రాత్రమైనా నేను భార్యనన్నమాట కూడా పరిగణించకుండా శరీరవాంఛకంటే ముందు నా చదువును పరిగణించి నాకు చెప్పారు. అందుచేత నేను మీ దయవలన ఇంగ్లీషులో కూడా అనేక కథలు చదువుతున్నాను.

"అంతేనా నెలకు వచ్చేవి రెండువందలు. పది పదేను రూపాయలు తమరు చదివే ఇంగ్లీషు మేగజైన్లక్రిందే ఖర్చు అవుతున్నవి. అసలు ఏమిటి చెప్పవచ్చావు. ఆఁ అవి. ఏదో కథ చదివానన్నావు."

"ఔను ఇంగ్లీషులో రక రకాల మాస పత్రికలు ఉంటవి. మీరు చదవరు గాని మీకు తెలుసుగా. ఆఫ్రికాలో మృగయా

సంబంధి కథ. ముగ్గురు తెల్లవాళ్లు వాళ్ళల్లో ఒక స్త్రీ. ఆఫ్రికా అడవులలోకి వేటకు వెళ్లారు. ఆవిడ ఒకరోజున తానొక్కర్తె తుపాకి పుచ్చుకొని నట్టడవిలోనికి పోయింది. కొన్ని పొదల నడుమ ఒక గోరిల్లా ఆమెకు తెలియకుండా వెంకనించి వచ్చి పట్టుకుంది. ఆమె తుపాకి పేల్చడానికి వీలు లేకపోయింది. ఆమె పెద్దగా అరచింది. తుపాకి క్రిందపడి పోయింది. ఆమె మూర్ఛ పడిపోయింది. అది మగ గోరిల్లా. ఆవిడ్ని ఎత్తుకపోయింది. ఎక్కడవో అంతకంటె కీకారణ్యంలో ఒక మహోత్తాల వృక్షంమీద తాను నిర్మించికొన్న భద్రమైన మంచెమీద ఈవిడ్ని ఉంచింది. రోజులు గడుస్తున్నవి. నెలలు గడుస్తున్నవి. ఆ గోరిల్లా ఆవిడకి సమృద్ధిగా ఫలాలు తెచ్చి పెడుతున్నది. దొన్నెలతో నీళ్లు తెస్తుంది. ఏడాది అయింది. ఆమె ఎక్కడకు పోవటానికి వీలులేదు. పోతే దారి డొంక తెలియదు. తుపాకిలేదు. అడివంతా క్రూరమృగాలు. ఆ గోరిల్లా ఆవిడతో సంసారం చేసింది. చెప్పదలచుకున్న దేమి టంటే లింగభేదం ఉన్నచోట సంసారం చెయ్యవచ్చు. అందు చేత అది సంసారమా ? ఒక జాతివాళ్ళు ఒక సంస్కారము కలిగిన వాళ్ళు చేసినది మాత్రమే సంసారము."

"ఆ విషయం మళ్లీ మాట్లాడుదాము గాని ముందర ఆ కథ ఏమైనదో చెప్పు."

"అదీ మనకుపయోగించేదే! ఆమె అయిదారేళ్లం దక్కడ. ఆమెకు రెండుసార్లు గర్భమయింది. ఇద్దరు పిల్లలు పుట్టారు. పుట్టిన పిల్లలు కొంత దొరలు, కొంత గోరిల్లాలుగా పుట్టారు. మొదటి పిల్లని గోరిల్లా చంపేసింది. ఆవిడకి కోపం వచ్చింది. భార్యని భర్త బ్రతిమాలాడు. మళ్ళీ సంసారం సాగింది. మళ్ళీ బిడ్డని కన్నది. ఈసారి గోరిల్లా బిడ్డని చంపలేదు. ఆ బిడ్డే రెండేళ్ళు పెరిగి దానంతట అదే చచ్చిపోయింది. ఈ అయిదారేళ్ళల్లో ఒక చమత్కారం జరిగింది. ఆ శ్వేతజాతి స్త్రీకి ఒళ్ళంతా బొచ్చు మొలిచింది. ఆవిడ శరీరమంతా గోరిల్లా శరీరమల్లేనే అవుతూ ఉన్నది. ఆవిడ భాష మరిచి పోయింది. అప్పుడు ఇంకొక వేటకాండ్రముతా ఆ లోని అడవులలోనికి వేటకు వెళ్ళారు. ఆ గోరిల్లాని చంపారు. ఈవిడ కూడా గోరిల్లావలెనే ఎగురుతూ ఉన్నది. దూకుతూన్నది. కాని అంత బాగా దూకటంలేదు. ఎగరటం లేదు. గోరిల్లా వలెనే అరుస్తున్నది కాని మానవ స్త్రీ లక్షణా లెక్కువగా ఉన్నవి. వాళ్లల్లో పరిణామవాదము ఉన్నది కాదూ. కోతుల లోంచి మనుష్యులు వచ్చారన్న వాదం. కోతులకు మనుష్యు లకు నడుమ రెండు లక్షణాలుకల ఒక జంతు సృష్టి ఉండి ఉండవలె అని అనుకుంటారు. ఆ లంకె కనుపించలేక తెగ పరి శోధనలు చేస్తున్నారు. ఆ వేటకాళ్ళు ఆ లంకె ఈమె అని అనుకొని ఆవిడ్ని జాగ్రత్తగా వలలువేసి పట్టుకొని ఆ వేట కాళ్ళు జర్మనీవాళ్ళు జర్మనీదేశం తీసికెళ్ళారు. అక్కడ రెండు

మూడేళ్ళయ్యేటప్పటికి ఆవిడ ఫ్రెంచావిడ ఫ్రెంచి వాళ్ళు వచ్చి మాట్లాడుతుంటే క్రమంగా ఆవిడ కూడా మళ్ళీ ఫ్రెంచి భాష మాట్లాడటం మొదలు పెట్టింది. వాళ్ల లంకె చెడిపోయింది తప్ప ఇంకొక సిద్ధాంతానికేదో ఆధారం దొరికింది. క్రమంగా ఆవిడ ఒంటిమీద బొచ్చంతా రాలిపోవటం మొదలు పెట్టింది. గొరిల్లా జీవితంలో ఆరేళ్లు పెద్దకాలము. మానవ జీవితంలో తక్కువకాలం. ఆవిడ బంధువులు రావటము మళ్ళీ ఆవిడ మానవ స్త్రీ కాపటము దానితో మనకేమీ అవసరములేదు."

"అందుచేత ఏమంటావు. మనకు దేనితో అవసరముంది ?"

"ఇది కల్పిత కథా ? నిజమైన కథా ? వాడు నిజమైన కథ అని వ్రాశాడు. ఒక కథ జరగవచ్చు. ఒక కథ జరగకపోవచ్చు. జరిగిన కథ జరగనట్లు ఉండవచ్చు. జరగని కథ జరిగినట్లు ఉండవచ్చు. ఎందుచేతనంటే మానవులు ఉన్నారు. జంతువులు ఉన్నవి. వాళ్ళ స్వభావాలు ఉంటవి. పరిస్థితులు ఉంటవి. పెరిగినా విరిగినా తరిగినా తిరిగినా అన్నిటియందు ఒక నియమము ఉంటుంది. ఆ నియమములను పాటించటము పేరు ఔచిత్యము. ఔచిత్యమంటే స్వభావమును అతిక్రమించకుండా ఉండటము. భిన్న స్వభావాలుకల ఇద్దరు వ్యక్తుల సమాగమముచేత అధిక బలముకలిగిన వ్యక్తియొక్క లక్షణాలు అల్పబలము కలిగిన వ్యక్తియొక్క స్వభావాన్ని

ప్రకృతి మారుస్తుంది. అన్నది ప్రకృతిలో ఉన్న పెద్దనియమము. ఈ నియమము ఈ మగ గోరిల్లా మానవ స్త్రీల సంబంధంలో కనిపిస్తున్నది. ప్రత్యక్షముగా కనిపిస్తున్నది. ఇక్కడ ఒక్కటే విషయము. అప్రత్యక్షముగా కూడా ఉండేవి ఉంటాయా ఉండవా అనేదే ప్రశ్న. మన పిల్లల ఇద్దరి గొంతుకలు ఒక్కటే ధ్వని విన్నాము గనుక అది ప్రత్యక్షము. పంచేంద్రియముల ద్వారా మనకు ప్రత్యక్షముకాని మన ఏ గుణాలు వాళ్ళయందు ఉన్నవో తెలియవు కదా ! ఈ సంగతి గ్రహించటం పేరు తెలివి.

# 3

అక్కడనుంచి చిదంబరానికి మళ్లీ ఉద్యోగం. పదిగంటలకి నౌకరిలోకి పోవాలంటే ఎనిమిది మొదలు కమల మడి తడి గుడ్డలు స్నానాలు కూరలు తరుక్కోటాలు ఇద్దరి జపాలు నైవేద్యాలు. ప్రతిరోజు ఆదరా బాదరా మెతుకులు నోటికి కొట్టుకోటాలు. అతను వెళితేగాని ఈవిడకి తీరికలేదు. ఈ నడుమ పిల్లలతో బాధ. తండ్రి కొడుక్కి ఏదైనా చెప్పాలంటే చెప్పేదేమిటి? అక్షరాలు వ్రాయించాలి. వాడికి అమిత గారాబం. అయిదేళ్ళ పిల్లవాడికి తొందరేమిటని యాదా లాపంగా దిద్దించటం. చిదంబరం వెళ్ళి సాయంత్రం అయిదు మొదలు రాత్రి ఎనిమిది లోపుగా ఎప్పుడు వచ్చినా వచ్చాడే. అప్పుడు నాలుగు మెతుకులు నోట్లో వేసికోవటము, కొంచెము సేపు ఏదో చదివినట్లు చదివి పడుకోటం. ఇంట్లో ఏమైనా లేవు. అంటే అప్పుడు బజారు పరుగెత్తటం. ఇది దైనందిన చర్య. తీరిక ఎక్కడిది? ఒకరోజున అన్నాడు చిదంబరం. "ఈ

మానవసృష్టి చమత్కారం సుమా ! కష్టజీవులను గురించి మన వాళ్ళు అన్నారు రెక్క ఆడితేగాని డొక్క ఆడదని. ఆ మాట ఎంత నిజము ! కష్ట జీవులంటే ఈ మానవ ప్రపంచములో పదికోట్లమందిలో తొమ్మిదిన్నర కోట్లమంది అన్నమాట. తక్కిన యాభై లక్షల్లోకూడా నలభై లక్షలమందైనా ఏదో విధంగా దీనిక్రిందకే వస్తారు. మన ఒక్క ఊరు తీసికొందాము. లక్షాధికారులై వడ్డీలమీద బ్రతుకుతున్న వాళ్ళని ఇండ్ల అద్దెల మీద బ్రతుకుతున్న వాళ్ళని తీసివేస్తే తక్కినవాళ్ళందరూ దీనిక్రిందకే వస్తారు. ఏదో పెద్ద వర్తకం చేస్తున్నాడు. వాడైనా గుమాస్తాలందరూ వాళ్ళపనులు వాళ్లు చేస్తున్నారా లేదా అని విచారించటమూ ఆ పనులు చేయించటమూ జరక్కపోతే వాడికీ డొక్క ఆడదు. లాభాలు రావు. అందులో అట్లాంటి వాడికి ఇరవై డొక్క లాడాలి. తాత్పర్య మేమిటంటే ఏదో విధంగా సంపాదించకపోతే జీవితము జరగదు అని అర్థం. ఒకడు కూలి నాలి చేస్తాడు. నావంటివాడు కాగితంమీద కలం పెట్టి వ్రాస్తూ ఉంటాడు. ఇంకొకడు పెత్తందారు తనము చేస్తాడు—మంత్రులు మొదలైన వాళ్ళు. ఎవడైనా సంపాదించ వలసిందే. సంపాదించాలి, తినాలి, బ్రతకాలి. లేకపోతే అడుక్కు తినాలి. బ్రతకటమంటే తినటం తినటమంటే గడ్డికరవటం. ఈ ముడి పెట్టాడు దేవుడు. దీనితో సాగుతున్నది ప్రపంచం. ఇది లేకపోతే ప్రపంచము లేదు. ఇది ఏ పూట కా పూట చేసి కోటమా ? కొన్నాళ్ళవఱకు పర వాలేద నేటట్లు చేసికోటమా?

"కోపీన సంరక్షణార్థమయంపటోటోపః" అన్నాసామెత దీనిమీద వచ్చింది. అన్నట్టుగా మా పెద్దమేనమామ ఉద్యోగ విరమణము చేశాడట. ఇదివరకే చేశాడు. కాని కడచిన అయిదేళ్లు ఆయన ఉద్యోగాన్ని పొడిగించారట. ఆయనకేమి కొడుకులు కూతుళ్లు దోసిళ్లాది సంపాదిస్తున్నారు. పెద్ద కొడుకు ఇండొనీషియాలో ఉన్నాడు. వాడి కారువేల జీతము. రెండవవాడు విమానాల్ని నడుపుతాడు. వాళ్ళ ఇద్దరిమధ్య ఉన్నావిడ ఏదో దేశానికి రాయబారి. ఎందుకు చెప్పానంటే ఆయన నేను పుట్టకముందు నుంచి ఉద్యోగం చేస్తునే ఉన్నాడు. ఆయన ప్రొద్దున్నే ఎనిమిదింటికే స్నానంచేసి ఇడ్లెన్లు కాఫీ చేస్తాడు. ఆపాట్న కారుమీద ఆఫీసుకి వెడతాడు. రాత్రి తొమ్మిదింటికి వస్తాడు."

"మరి భోజనం ?"

ఆఫీసులోనే వాడెవడో బంట్రోతు ఉన్నాడు వాడు తీసికెడతాడు."

"బంట్రోతంటే బ్రాహ్మణుడా ?"

"బంట్రోతంటే బ్రాహ్మణుడే అనే రోజులు ముందరున్నై. తొందర పడతావేమి ? కలి కాలము ఇప్పటికైదు వేల చిల్లర గడిచింది. మనము తెలుగు దేశములో పుట్టాము. నీ అదృష్టము కొద్ది నాకు ఏ మహానగరములోనో పెద్ద ఉద్యోగము రాలేదు. అందుచేత మనము శాస్త్రాలు చెబుతాము. బ్రాహ్మణ ధర్మాన్ని గురించి మాట్లాడుతాము. వేద

శాస్త్రాలలోని అర్థాలను గురించి ప్రసంగించుకొంటాము. తిండి
లేకపోతే తెలుస్తుంది."

"మనకేనా వాళ్ళకి మాత్రము తెలియదూ ? డబ్బు
వలుకుబడి ఉద్యోగాలు ఉంటేనే వారైనా ఆ సిద్ధాంతాలను
గురించి మాట్లాడేది. కడుపునిండినవాడు సిద్ధాంతాలను
గురించి మాట్లాడుతాడు."

"అంటే ఈ ప్రపంచాని కింత ద్రోహం చేసిన వాళ్ళెవ
రంటే కడుపు నిండిన వాళ్లన్నమాట."

"కడుపెందుకు నిండుతున్నది ? భూమి పండుతున్నది.
వృక్షాలు ఫలిస్తున్నవి. ఇది చాలక చేపలని జంతువులని తింటు
న్నారు. మానవుడికి కడుపునిండే మార్గాలు సహజంగా
ఉన్నవి. కొందరు అదరగొండి మనుష్యులు. మేము రాజ్యాలు
చేస్తామని ఎక్కువ తీసికొంటారు. అన్నంలేని వాళ్లు కొందరు
తయారౌతారు. మేము రాజ్యం చేస్తాము అనేవాళ్లు లేకండా
లోకము సాగదు. దొంగతనాలు చేసేవాళ్లుంటారు. దొంగలను
శిక్షించేందుకు రాజ్యాలు చేసేవాళ్లుండాలి. ఆ రాజ్యాలు చేసే
వాళ్లల్లో దొంగలుంటారు గనక ఏ రాజ్యము న్యాయముగా
సాగదు. ఇప్పుడేమయిందో చూడు. ఇంతమంది మానవు
లున్నారు. సంవత్సరానికి ఆహార పదార్థం ఇంత ఉన్నది
అందరము సమానముగా తీసికొందామనే నేర్పు అకలిని
సృష్టించిన భగవంతుడు మానవుణ్ణి ఆ నేర్పు లేకండా సృష్టిం
చాడు గనక అదరగండం మనుష్యులు వాళ్లంతట వాళ్లు

ధ్యాజులుగా ఏర్పడ్డారు. రాజు కాకపోతే వాడి ప్రతాప్య
మ్నాయా కొందఱు. కనుక పాలించేవాడు పాలింపబడేవాళ్లు
అనే రెండురకాల మనుష్యులు తయారయినారంటే ఎవరు
తయారు చేశారు ? అందరూ అన్నం తినాలి అన్న ప్రశ్న
తయారు చేసిందన్నమాట. కనుక మానవుని ఆకలే రాజ్య
నిర్మాణానికి హేతువు ఇల్లాగే అన్నీ పెరిగినై. ఒకచోటినించి
ఇంకోచోటికి ఆహార పదార్థం పంపించాలి. దానికోసం వర్త
కుడు పుట్టాడు. ఒకచోటి పదార్థం ఇంకోచోటికి తీసుక వెళ్లేం
దుకు వ్యయమవుతుంది. వాడి డొక్క ఆడాలి. అందుచేత
లాభం వేసికోవాలి. ఇక్కడి అణా వస్తువు అక్కడికి వెళ్లే
టప్పటికి మూడణా లవుతుంది. అందుచేత ఆకొనేవా డెక్కువ
సంపాదించాలి. దీనితోపాటు మానవుడి ఆశ ఉన్నది, ఆకలీ,
ఆశా, ఇంక చెప్పావు, రాజ్యాలెందుకు ఉద్భవించవు ? మోసా
లెందుకు కలుగవు ? శిక్ష లెందుకుండవు ? క్రౌర్యమెందు
కుండదు ? అహంకార మెందుకుండదు ? అది ఉంటే ధర్మ
మెందుకుంటుంది ? నీవు నా భార్యవు, నేను భర్తను నేను
సంపాదిస్తూవుంటే నీవు తింటూ ఉన్నావు. నేను నిన్ను ఏమే
అంటుంటే, నీవు నన్ను ఏమండీ అంటున్నావు. మొదటిది నీ
ఆకలి సృష్టిలో ఇది మొదటి దోషము. మానవులను హింసిం
చేందుకు భగవంతుడు నేర్పిన విద్యలో ఇవి ఓనమాలు.

"చదువుయొక్క చివరి భాగమేమిటి ?"

"మన మిద్దరము కలిసి సంసారము చెయ్యటము, బిడ్డ లను కనటము."

"నా కర్థము కాలేదు."

"అవులిస్తే ప్రేవులు లెక్కపెడతావు. నీవు నాచేత శృంగార రసం మాట్లాడిద్దామనా ? నీకు తెలుసుగా ? దాన్నిగురించి విచారణచేస్తే శృంగారరసం శృంగార రసం కాదు. భగవంతుడు సృష్టిని స్త్రీ పుంసయోగముగా చేశాడని తెలిసి ఒప్పుకున్నా సరే, తెలియక ఒప్పుకున్నా సరే. ఆలోచించ కండా జంతు లక్షణములచేత గ్రుడ్డి ఎద్దు చేలో పడ్డట్టు వెళుతూ ఆ అసభ్యమైనదానిని అనగా పాశవమైన ప్రవృత్తిని సుకుమారంగా మధురంగా మెత్తగా అత్తరులు మొదలైన సుగంధ ద్రవ్యాలతో పట్టెమంచము పరుపులతో నవ్వులతో అపాంగ వీక్షణములతో ఒకరిని గురించి యొకరు ప్రేమిస్తు న్నామనటంతో ఆ ప్రేమని పవిత్రమని తమరిని తామే మోస గించుకోటంతో అది శృంగార రసమవుతూంది. ఇంతకూ అది లేకపోతే సృష్టిసాగదు. కనక సృష్టికి ఇది మొదలు. ఆకలి తరువాతది. లేకపోతే ఇవి రెండు ఒకదాని నొకటి ఆశ్రయించి ఉన్నవేమో ! దీనిని అన్యోన్యాశ్రయ దోష మందాము. అంటే సృష్టే దోషములోనించి ఉద్భవించిన దన్నమాట. సృష్టియేఒక దోషము. ఇది జరుగుతున్నది. నీవేమీ చేయలేవు. తెలిసినదా?"

"సహజముగా ఒక దోషము ఉన్నది. దానిని నివారించు కొనుటకు ప్రయత్నము చేయవచ్చును గదా."

"ఆ ప్రయత్నము సృష్టి మొదలు ఇప్పటివరకు సాగుతూనే ఉంది. ఆ ప్రయత్నం లేకండా ఎప్పుడూ ఏజాతి లేదు. ఆ ప్రయత్న మక్కరలేదన్న జాతి ఇప్పుడే క్రొత్తగా పుడుతూ ఉన్నది. 'అనాదినించి పాలిస్తాము. మానవులకు సుఖము కూరుస్తాము' అనే అదరగండముగల కొందరు మనుష్యులు ఎప్పుడూ పుడుతూనే ఉన్నారుగదా. అట్లాగే ఈ మానవ సృష్టిలో సహజమయిన ఒక దోషము ఉన్నది. దాని పేరు జనన మరణాలు. ఈ దోషాన్ని నివారిస్తామని కొందరు మనుష్యులు కూడా ఎప్పుడూ పుడుతూ ఉంటారు. మానవ సృష్టి మిశ్రమ లక్షణాలు కలది. జనులందరు సుఖపడాలి. పండించుకున్నది సమానంగా అనుభవించాలి, అనేది మంచిభావం. ఈ భావాన్ని ఆచరణలో పెట్టేందుకు కొందరెప్పుడూ పుడుతూ ఉంటారు గదా! వాళ్ళు అధికారభావంచేత అహంకార భావంచేత దురాశా భావంచేత కలుషితమైతే రాజ్యం చెడిపోతుంది. అల్లాగే ఈ జనన మరణాదులనే దోషం నివారించాలి అన్న ఔదార్యభావంతో కొందరు ప్రవర్తిస్తారు. వాళ్ళు అహంకారంతో సహజమైన కొంత అజ్ఞానంతో ప్రవర్తిస్తారు. అహంకారం విచిత్రంగా ఉంటుంది. లోకంలో సృష్టిలో సహజంగా అనేక భేదాలు ఉన్నవి. దోషాలు సృష్టికి ఎంత సహజమో

భేదాలు అంత సహజమే. ఈ ధాత్రియే ఒకచోట మెరక, ఒకచోట పల్లము. ఒకచోట పొడినేల. ఒకచోట తడినేల. ఈ మెరక పల్లాలలో పొడి తడులలో ఎన్నో భేదాలు. మనుష్యులు ఒకచోట తెలుపు. ఒకచోట నలుపు. ఒకడు పొడుగు. ఒకడు పొట్టి. ఒకడు లావు. ఒకడు సన్నము. ఒకడు ముందర పుట్టిన వాడు. ఒకడు తరువాత పుట్టినవాడు. ఇలాంటి సహజమైన భేదాలు చాలక రాజ్య నిర్మాణ వశమున విద్యాభేద వశమున ఎన్నో రకములు కలిగి ఉండటములో కలిగే భేదాలవల్ల మరి ఇంకెన్నో భేదాలు వచ్చినవి. ఈ భేదాలల్లో సహజమైన వాటిని పురస్కరించుకొనే అహంకారం ప్రవర్తిస్తూ ఉంటుంది. ఇంక సంఘము జాతి జీవితం గడుపుతూ ఉండే మార్గంలో కలిగే భేదాలనుబట్టి రెట్టింపు అహంకారము ప్రవర్తిస్తూ ఉంటుంది. ఈ అహంకారమువల్ల దౌర్జన్యము ప్రబలుతూ ఉంటుంది. ఎప్పుడు దోషాలు పరిహరిద్దామన్నా ప్రయత్నము ఉంటూ ఉంటుంది. ఒక సిద్ధాంతాన్ని ఆశ్రయించే అహంకారం బయలు దేరుతూ ఉంటుంది. ఆ సిద్ధాంతాన్ని వ్యాపింప చేద్దామని ఇంకొక అహంకారము. అందులో దౌర్జన్యము, అందులో క్రూరత్వము. చమత్కారము చూడు—మంచిపని చేద్దామని మొదలుపెడతాడు. అది సాగకపోతే కోపంవస్తుంది. క్రౌర్యము చూపిస్తాడు, ఇలా ఉంటుంది సృష్టి. చివరకేమైనదంటే మానవ సృష్టిలో సహజమైన దోషాలను నివారిద్దామని బయలుదేరట

మల్లా దోషాలని నిర్మూలించటానికి బదులు మరికొన్ని క్రొత్త దోషాలను నిర్మించుకోటం జరుగుతున్నది. రాజ్యాలు చేయటము ఎట్లాంటిదో మతాలు నిర్మించటం అట్లాంటిదిగా తయారయింది. ఈ సృష్టిలో కొన్ని భేదాలు సహజంగా ఉన్నవి. వాటిని అంగీకరించి మూలభూతమైన దోషాలను తొలగించుకోటానికి ప్రయత్నం చేయాలి అనే ఊహతో బయలుదేరితే కొంత సాధుపుగా ఉండే వ్యవహారాన్ని భేదాలు లేకండా చేస్తాను. దోషాలు లేకండా చేస్తాను అని బయలుదేరేటప్పటికి మానవ క్షేమం బదులు మానవ క్షామం ఏర్పడుతున్నది. "స్వయంతీర్ణః పరాంస్తారయతి" అన్నట్లుగా ఎవడు తాను కామ క్రోధాదులను గెలుస్తాడో వాడు ఇతరుల కామ క్రోధాదులు తొలగించేందుకు ప్రయత్నం చెయ్యాలి. అల్లా ఏమీ జరుగ లేదు."

"కనుక సృష్టి ఏ దోషాలతో అయిందో ఆ దోషాలు అల్లాగే ఉన్నయని అర్థమా ?"

"ఆ దోషాలు వందరెట్లు పెరిగినై అని అర్థము."

"అయితే దీనికి నిష్కృతిలేదా ?"

"లేదనే చెప్పవలసి వస్తున్నది. భూగోళము ఉన్నది. భూమిమీద భిన్నస్థలాలు ఉన్నవి. ఆహారంకోసం వ్యవసాయం చేస్తారు. కొండమీద వ్యవసాయం చేస్తారు. రాళ్ళల్లో చేస్తారు.

మిట్టపొలాల్లో చేస్తారు. నీటివాలుగల చోట చేస్తారు. చెరువు కడుపులో చేస్తారు. నదిలో చేస్తారు. ఎక్కడ పండినవి అక్కడ తిని ఉండగల్గుదురా ? అక్కడ దొరికినదానితో కడుపు నిండకపోతే ఇంకొక చోటినించి తెచ్చుకోవాలి. ఆ తెచ్చు కోటం ఒకటి—బతిమాలి తెచ్చుకోవచ్చు. రెండు—నీకు పండి నది వాళ్ళకిచ్చి వాళ్ళకు పండినది తీసికోవచ్చు. మూడవది—దొంగతనంగా తీసుకరావటం. నాలుగవది వాణ్ణి తన్ని లాక్కు రావటం. దొంగతనంగా తీసికోరావటం ఆటవికులు చేస్తారు. పార్వతేయులు చేస్తారు. తన్ని లాక్కురావటం రాజ్యాలు నిర్మించి సేనలను పోగుచేసినవాళ్లు చేస్తారు. ఇలాంటి వ్యవహారాలకు మానవజాతి క్రొత్తపేర్లు పెట్టుకుంది. వాళ్ళు గొప్ప వీరులు. అతడు గొప్ప విజేత. అతడు పరాక్రమవంతుడు—ఇలాంటి పేర్లు. ఇలా సాగుతున్నది ప్రపంచం. ఈ రీతిగా పరులను ఆక్రమించటం ఎదటివాళ్ళ అన్నం బలవంతంగా తాను తీసికోటం అన్నదానికి. వాడు ఇతర రాజ్యాలు గెలిచాడు మహా పరాక్రమవంతుడు అన్నట్లే ఈ జనన మరణములను నిర్మూలిస్తాం అనే సాధుభావాన్ని ఆశ్రయించిన కొందరు రాజ్యాలను గెలవటంలో ఇందాకటి రాజులు ఏ మార్గాలని అవలంబించారో తమ మతమును ప్రచారము చేస్తున్నామన్న సాధువల్లే కనిపించే ఈమార్గంలోకూడా అదే పద్ధతిగా చేస్తారు. ఇలాగా ప్రపంచం కలుషితమై పోయింది. ఒకటి—వ్యక్తిగా

ఊహించటం రెండు—జాతిగా ఊహించటం. వ్యక్తిగా సాధువుగా ఊహిస్తే ఎవరికి నష్టంలేదు. జాతిదృష్టితో ఊహించేటప్పటికి అహంకారము సిద్ధమై కూచుంటుంది. అజ్ఞానం తాండవిస్తుంది. వ్యక్తిగా ఊహించేటప్పుడు అజ్ఞానము అహంకారము సంభవిస్తే అది వాడికే నష్టము. లేకపోతే మరి ఇద్దరు ముగ్గురికి నష్టము. జాతిగా ఊహించేటప్పటికి ఈ అజ్ఞాన అహంకారములు దేశాలకే నష్టం. మానవజాతికి ద్రోహం."

"ఇవ్వాళ వస్తూనే ఈ ఉపన్యాసం చేశారేమిటి ?"

# 4

ఆదివారము వచ్చింది. పిల్లలింకా నిద్ర లేవలేదు. కమల కాఫీ కాచింది. చిదంబరాన్ని కాఫీకి రమ్మంది. అతడదివరకే లేచాడు. ముఖం కడుక్కున్నాడు. నౌకరీకి వెళ్ళవలసిన రోజుల్లో మొగం కడుక్కొనటం స్నానం చేయటం ఒక్కసారే చేస్తాడు. సెలవైతే మొగం కడుక్కొని వచ్చి మంచంమీద పడుకొంటాడు. కొంతసేపటికి కాఫీ తాగుతాడు. మళ్ళీ మంచంమీద పడుకొంటాడు. లేకపోతే ఏదైనా చదువుతూ కూర్చుంటాడు. కమల ఆ రోజున వంటకి ఇంకా జాగుచేస్తుంది. చిదంబరం సరిగ్గా వంటయిన తర్వాత అప్పుడు స్నానంచేసి ఒక అరగంటసేపు పేనుతాడు. సెలవ రోజుల్లో వాళ్ళ ఇంట్లో ఒంటిగంటకి భోజనం అయినా అయినట్లే. సామాన్యంగా అయిదారు పిలుపులయిన తర్వాత కాఫీకి వస్తాడు. ఇవ్వాళ ఎన్ని పిలుపులు పిలిచినా కాఫీకి రాలేదు. కమల ఆ కాఫీ చేత్తో పుచ్చుకొని గదిలోకి వెళ్ళింది. చిదంబరం ఏదో నవ్వుతూ ఉన్నాడు. ఇంతలో పిల్ల లేచింది. కొడుక్కు మేలు కొలుపులు

పాడితేగాని లేవడు. వాళ్లులేస్తే వాళ్ళకి మొఖాలు కడగటాలు నీళ్లు పొయ్యటాలు అన్నం పెట్టటాలు అరగంటో ముప్పావు గంటో పట్టుతుంది. అందుచేత కమల అన్నది గదా "ఏమిటో మీలో మీరు నవ్వుకొంటున్నారు. కాఫీ ఇక్కడ పెట్టాను త్రాగండి. పిల్ల లేచింది. దొరగారిని లేపాలి" అని వెళ్ళి పోయింది.

పిల్లలిద్దరికి సేవచేసి వాళ్ళని ఆడుకోటానికి పంపించి భర్త కాఫీ త్రాగిన గిన్నెలు తీసుకవెళదామని గదిలోకి వచ్చింది. ఆ కాఫీ చల్లారిపోయింది. చిదంబరం త్రాగనేలేదు. అలాగే పడుకొని నవ్వుతున్నాడు. కమల అన్నది ఇది బాగానే ఉన్నది. గంటసేపటిబట్టి నవ్వటమేనా? ఆ నవ్వటం కొంచెం బిగ్గరగా నవ్వితే నాకుగూడ వినిపించేదిగా ! ఎందుకా నవ్వ టం ? సెలవనా ? కాఫీ చల్లారిపోవాలనా."

"కాఫీ చల్లారిపోతే యేం ? నీ నా నడుమ ఉన్న ప్రేమ వెచ్చగా ఉంటే చాలు."

"దాన్నిగురించి అనుమాన మెందుకొచ్చింది."

"దానిని గురించేనా అనుమానం ? ప్రతిదానిని గురించి అనుమానమే. మనము రాత్రిపూట నిద్రపోయి రేపు ప్రొద్దున లేచి ఆ పని చేద్దాం ఈ పని చేద్దాం అనుకొంటాము. మానవులు తమ జీవితంలో ఎన్నో పనులు చేద్దామనుకొంటారు. అందరూ అనుకొంటారు. పరమేశ్వరుని అనుగ్రహంలేని వాళ్ళు చేయ

లేరు ఎందుకంటే అనుకోకండా మృత్యువొస్తుంది. అనుకోకండా వెళదామనుకొన్న చోటికి వెళ్లటానికి వీలులేకుండా ఇంకొక పని తగులుతుంది. మరి ప్రయాణం చేస్తుంటే ఆ బస్సో, ఆ కారో ఆ రైలో పడిపోయి, పోతే ప్రాణం పోవటం లేక పోతే కొన్నిదినాలో కొన్ని నెలలో ఆస్పత్రిలో ఉండటం జరుగుతుంది. వీటి సంఖ్య తక్కువ. అందుచేత మూర్ఖమైన జనం వీటిని పట్టించుకోరు. కాని అలా జరుగుతునే ఉన్నవి గదా ? జరిగినవాళ్లని గురించి వాళ్లకల్లా జరిగిందని అనుకొంటారు. మనకు గూడ జరగవచ్చు అని అనుకోరేం ?"

"అల్లా అనుకుంటూ కూర్చుంటే లోకమెల్లా జరుగుతుంది ?"

"అందుచేత లోకానికి ప్రతివాళ్ళకి తమమీద తమకు కంటె లోకముమీద ఎక్కువ అనురాగమన్నమాట. మనము చస్తే చస్తాము. చావటము ఎప్పుడైనా ఉంది. ఈ నిశ్చయం ప్రతివాళ్లకి అంతరాత్మల్లో ఉంటుంది."

'అంతరాత్మల్లో ఉందంటే ఏమిటి ?'

"మనము మనస్సుతో ఊహిస్తున్నాము అని అనుకొంటున్నాము. మొత్తానికి ఊహాలన్నీ తలలోనుంచి వస్తున్నట్టు మనకు అనుభవంలో ఉన్నవి. ఆ ఊహాలు ఎక్కడనుండి బయలు దేరుతవో ఆ స్థలాన్ని మనస్సు అందాము. అది తలలో ఉంది. నోట్లో లేదు. ముక్కుల్లో లేదు. చెవులలో లేదు. కళ్ళల్లోలేదు.

ఆ వెనక ఎక్కడో తలలో ఉంది. ఇది సర్వజనానుభవైక వేద్యము గదా! ఆ మనస్సుయొక్క స్వరూపము మనకు తెలియదు. శస్త్రములతోకోసి తక్కిన భాగాలన్నీ మినహాయించి ఇది మనస్సు ఉండే స్థానమని వైద్యులు నిర్ణయిస్తున్నారు. ఒప్పుకున్నాము. ఆ మనస్సునకు ఇంత ఊహించే శక్తి ఎక్కడనుంచి వచ్చింది ? ఊహించటమంటే ఏమిటి ?"

"ఊహించటమంటే నాకు తెలియదు గాని ఊహ లేక పోవటమంటే నాకు తెలుసు."

"అదెల్లా ఉంటుంది ?"

"ఆ చల్లారిపోయిన కాఫీ మల్లే ఉంటుంది."

"అంతఃకరణమేమిటి అని నీవడిగితే చెబుతున్నాను తప్ప. ఈ నాకు పట్టిన——"

"అనేసెయ్యండి, ఆ అసభ్యపుమాట కూడా."

"భార్యా భర్తలమధ్య అసభ్యత అని పెట్టుకుంటే సృష్టిసాగదు."

"అందుచేత దానికి వేళలు నియమించారు."

"ఆ వేళలు ఒక్క అసభ్యతకే నిర్ణయించలేదు చాలా వాటికి నిర్ణయించారు. కశ్యప ప్రజాపతికి ఇద్దరు భార్యలు దితి, అదితి. దితి కొడుకులు దైత్యులు, అదితి కొడుకులు ఆదిత్యులు."

"మొదటిభార్య దితి. ఆవిడకానిది అదితి. కనుక దేవతలకంటె రాక్షసులే ముందటివాళ్లు."

"నిస్సందేహముగా ! మొన్న అనుకున్నాము కాదూ ? ఈ సృష్టి దోషములోనుంచి పుట్టిందని. దోషము దీనికి సహజ లక్షణమని. అందుచేత దైత్యులే మొదటివాళ్ళు. మానవు లందరు సహజముగా దైత్య లక్షణములు కలవాళ్ళు. కర్మలు పుణ్యములు. చదువులు సదూహాలు. వేళలను పాలించుటలు న్యాయముగా ప్రవర్తించుటలు ఓర్పు,అహంకారమును పరిత్య జించుటలు. ఎదుటివాళ్లని బాగుచేద్దా మనటంకంటె ముందర మనము బాగుపడాలి అని ప్రయత్నము చేయటము ఇవన్ని చేస్తే ఆదిత్యులవుతారు. సహజముగా అందరము దైత్యులమే. నవ్వుతావెందుకు ? నీ వేమనుకొంటున్నావో నాకు తెలుసు.. నే నిదంతా వ్యాఖ్యానము చేస్తున్నానని నవ్వుతున్నావు. సహజముగా దేవతలు రాక్షసులు వేరే ఉన్నారు. వాళ్ళ గుణాలను తీసికొని నేను మనుష్యుల యందారోపించి వ్యాఖ్యా నము చేస్తున్నాను. తప్పేమీలేదు. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుడు తండ్రి దైత్యభావము పెంపొందించుకొన్నవాడు. కొడుకు దేవతాభావము పెంపొందించుకొన్నవాడు. ఆ కథ అట్లా జరిగినా జరిగినప్పుడు మనము లేము. మనము చూడలేదు. మనకు తెలియదు. ఇప్పుడు రెండురకాల మనుష్యులుంటారు. ఒకళ్ళు తాత్పర్యము గ్రహిస్తూనే ఆకథ అల్లా జరిగిందంటారు. ఇంకొకళ్లు ఆ కథ అట్లా జరగలేదు—ఈ తాత్పర్యాన్ని మన స్సులో పెట్టుకొని ఆ కథ అల్లా కల్పించారంటారు."

"అనగా వీళ్ళు పురాణాలను విశ్వసించరు. వాళ్ళు విశ్వ సిస్తారు. మన కా గోల ఎందుకు ? కాఫీ వెచ్చబెట్టుక రమ్మం టారా ?"

"కాఫీ మళ్ళీ వెచ్చబెట్టకూడదు. మళ్ళీ వెచ్చబెడితే విష మవుతుంది."

"మరి వేరే పాలులేవు. ప్రొద్దున పొరపాటు జరిగింది. కాగిన పాలు వట్టి చేత్తో దింపబోతున్నాను. కొన్ని పాలు క్రింద ఒలికి పోయినవి."

"వట్టిచేత్తో ఎందుకు దింపబోయినావు. బోలెడన్ని చిత్తు కాగితాలు ఉన్నవి. కొంగుతో దింపుకోవచ్చు. అన్నట్టుగా పైటచెఱగు వెనక రైకచివర ఆగుతుందిగా ముందరికిరాదు. వేదాంతాలు చెబుతావు, వాదనలు చేస్తావు. శాస్త్రార్థాలు సాగిస్తావు. అందరికిమల్లేనే లోపల లంగా పైన గూడకట్టు. అయిదుగజాల చీర పైటకొంగు తిరిగి ముందఱకు రాదు."

"మీకే లాభముగా! ఏడు గజాల చీర. ఇరవై అయిదు రూపాయలైతే అయిదుగజాలు పదునెనిమిది రూపాయలే అవుతుంది."

"లాభము గూబలో తీస్తున్నది. లంగాలకు కావట ములా ?"

"లంగాలు మానివెయ్యమంటే మానివేస్తాను."

"అంటే అంగాలు లేకండా తొడలు కనపడే సన్నని ఉల్లిపొరల చీరెలు కట్టుకొని తిరుగుదామనా ! నాకేమీ అభ్యంతరం లేదు."

"ఇప్పు డభ్యంతరము లేదు. కాపురానికి వచ్చిన క్రొత్తలో మీరుపెట్టిన ఒద్దికలు నాకు తెలియవా ? ఇప్పుడంటే మీకేమి మీ పిల్లలు మీకున్నారు. నేను ఏమైపోయినా మీకు పట్టను."

"నేను ప్రజార్థై గృహమేథినాం" జాతిలో వాణ్ణన్న మాట. మరి అంతఃకరణం మాట ఏం చెప్పావు ?

"ఈ కాఫీ మీరు త్రాగరు. మళ్ళీ కాచిపెట్టటానికి పాలులేవు. అందుచేత పెందలాడే వంటచేస్తాను."

"నేను అంతఃకరణని గురించికూడ చెప్పిగాని నిన్ను వదలిపెట్టను."

"అయితే నేను స్నానముచేసి పొయ్యిరాజేసి ఎసరు పెడతాను. మీరు ప్రక్కని చెబుతూ కూర్చోండి."

"నీ కంత ఇష్టం లేకపోతే పో"

"దీనికికూడా కోపమేనా ! అయితే చెప్పండి. అన్నం వండి చారు పెడతాను. ఆవకాయ, చింతకాయ పచ్చడి, గోంగూర పచ్చడి ఉన్నవి. పప్పుకూర చెయ్యటానికి వీలులేదు."

"నాకు అంతఃకరణని గురించి చెప్పటమే ప్రధానము. నాకు చారుకూడ అక్కరలేదు. దాని బదులు చింతకాయ పచ్చడి ఉందిగా ?"

"అది క్రొత్త చింతకాయ పచ్చడి."

"అది పుల్లగా ఉండదా ?"

"మహా బాగా ఉంది. క్రొత్త చింతకాయ పచ్చడి జలుబు చేస్తుంది. అంటే కొంత అజీర్తి చేస్తుంది. చారు శ్లేష్మాన్ని హరిస్తుంది. మేహాన్ని తగ్గిస్తుంది. సుఖ విరేచన కారి."

"నీకు వైద్యంకూడ తెలుసు."

"వైద్యం తెలియనిది సోఫియాకి. మీ మేనమామ కూతురున్నదే ఆవిడికి. మీ రావిణ్ణి చేసికోవలసింది. చాలా బాగుండేది."

"నా కర్మ ఇల్లా ఉంటే అదెందుకు జరుగుతుంది."

"ఔను. మీ కర్మ బాగా ఉంది. అందుచేత బ్రాహ్మణు లలో పుట్టారు. ఆవిడ్ని పెళ్లిచేసికోవలసిన గీతే ఉంటే పంచ ములలోనే పుట్టేవాళ్ళు.

" నోరుముయ్. ఆవిడ పంచముణ్ణి చేసికొంటుందం టావా ?"

"భవిష్యత్కాలము గాదు భూతకాలమే. నేను మొన్న విన్నారా అంటే మీరు చెప్పనివ్వలేదు అది ఇదే."

"అదేమిటి నాకు తెలియకండా నీ కెట్లా తెలిసింది ?"

"అన్నట్లుగా పెళ్ళికి మీకు శుభలేఖ రాలేదు కాబోలు"

"నాకు తెలియకండా నీకెట్లా తెలిసిందని ?"

"అటువంటి గొప్ప వార్త పత్రికల్లో వేస్తారు. వాటిని గురించి గొప్పగా వ్రాస్తారు. ఈ ఆఫీసులలో గుమాస్తాలు ఉంటారే. వాళ్ళకి వాళ్ళ ఆఫీసు కాగితాలు వాళ్ళ జీతాలు వృద్ధికావటం, ఇదే గోలతప్ప లోకంలో ఏం జరుగుతున్నదో వాళ్ళకేమీ పట్టదు."

"ఆ పత్రిక ఉన్నదా ?"

"మనము తెప్పిస్తున్నామా ?"

"ఈ ఖర్చు చాలక నెలకదొక మూడు రూపాయలా?"

"అందుచేత ఆపెళ్లి జరగనట్టే మనమూరుకోటం. అంతఃకరణని గురించి చెప్పండి."

"అంతఃకరణని గురించి కాదు నీ శ్రాద్ధాన్ని గురించి."

"నా శ్రాద్ధానికేం చేస్తే నా మొగుడు చేస్తాడు. లేకపోతే నా కొడుకు చేస్తాడు. సోఫియా శ్రాద్ధంమాట ఏమిటని ?"

"మాలవాళ్లు శ్రాద్ధాలు చేసికొంటారు."

"ఆయన మాలవాడుకూడా కాదు. క్రైస్తవుడు."

ఆ పాటున చిదంబరం లేచి వెళ్ళిపోయినాడు. మూడు రోజుల క్రిందటి పత్రికకోసం వెతికాడు. ఎక్కడా దొరకలేదు. దూరముగా ఎక్కడో పత్రికా పఠన మందిరం ఉంటే అక్కడికి వెళ్లి ఆ గుమాస్తాని బతిమాలి వెనకటి పత్రికలు వెతికించి ఆ పత్రిక తీయించాడు. గంటసేపు కూర్చొని చదివాడు. సోఫియా భర్త లౌకికంగా మంచి దశలో ఉన్నాడు. అతనికి చాలా పెద్ద

జీతము. ఇద్దరి బొమ్మలు ఆ పత్రికలో ఉన్నవి. సోఫియాని తానెప్పుడో చిన్నప్పుడు చూచాడు. అదైనా ఒకసారే చూచాడు. పసిపిల్ల ముఖ లక్షణాలకి యౌవనావిర్భావము జరిగిన తర్వాత ఉండే ఆకార విశేషానికి యెక్కువ సంబంధం ఉండదు. ఈ సోఫియా జుట్టు గిరజాల్లాక త్తిరించుకుంది. అంతా పువ్వులతో నిండియున్నది. పెళ్లికూతురు. ఏమి గుర్తు ? ఆ క్రింద వ్రాసిన చరిత్రలో ఆవిడ ఫలానా ఆయన కూతురు. ఇది అంతర్వర్ణ వివాహము మొదలైనవి వ్రాయబడి ఉండుటచేత తెలిసికోవలసినదే. చిదంబరం ఇలా అనుకున్నాడు. "ఇది వర్ణాంతర వివాహ మెందుకవుతుంది ఇది అంతర్జాతీయ వివాహము. ఇతడు పంచముడైతే వర్ణాంతర వివాహము కావచ్చు. పంచములు కూడ హిందువులు కనక. ఈ క్రైస్తవులది మన జాతికాదు. క్రైస్తవులలో కొందరు మన దేశీయులు కావచ్చును. ముసల్మానులు మనజాతి ఎలా కారో క్రైస్తవులు మనజాతి అలాకారు." చిదంబరం కాగితం అక్కడ వదలిపెట్టి ఇంటికి వచ్చాడు. అప్పటికి పండెండు గంటలైంది. స్నానం చేశాడు. జపం రాత్రికి చేసికొంటాలే అన్నాడు. ఏదో కుంయికుంయిలాడాడు. ఆకలి మండిపోతున్నది. పప్పుకూర కలిపాడు. తిన్నాడు. రెండు కీట్లు పడ్డవి. ప్రాణము తేరుకున్నది. అప్పుడు మొదలుపెట్టాడు ; నీవు చెప్పినది నిజమే. అతడు ఏదో పెద్ద కంపినీకి మేనేజరు. మూడువేలు జీతమట ! ఈవిడికి ఉద్యోగము. అనాథ స్త్రీల శరణాలయాలు అఖిల భారతదేశముమీద

ఉన్నవి. వాటిమీద ఈవిడ తనిఖీదారు. సంవత్సరానికి పదిలక్షలు రాచరికం ఇస్తుంది. దానిని ఈవిడ వినియోగపలు చాలి. ఈవిడకి నెలకి రెండువేల జీతము. మొగుడు మూడువేలు, పెళ్ళాము రెండువేలు. అయిదువేలు నెలకి."

"అంత డబ్బు ఏంచేస్తారో మీకుమేనమామ కూతురేగా నెలకొక వంద రూపాయలు మనకు పంపిస్తుందేమో వ్రాయండి."

"నేను వ్రాస్తే బాగుండదు. నీవు వ్రాస్తే మొగమాట పడుతుంది. మా ఆయన నీ మేనమామ కొడుకు. ఆయన క్రైస్తవుడు కాడు కనుక ఆయన కా ఛాన్సు పోయింది. లేక పోతే నీ సంపాదనమీద ఆయనకూ్కడా అధికారం ఉండేదే గదా అందుచేత నష్టపరిహారంగా నెలకొక వంద పంపించు అని వ్రాయి."

"ఇంతకూ అంతఃకరణమాట ఏమయింది ?"

"చెప్పవలసిన అవసరం పదిరెట్లు పెరిగింది."

# 5

ఆ రాత్రికి చిదంబరం కొంత వాంఛా సహితంగా ప్రవర్తి స్తుంటే కమల అన్నది కదా "వేళలు ఉన్నవి. ఇవ్వాళ ఏకాదశి. ప్రొద్దున రెండు విషయాలు మొదలుపెట్టారు. దితి అదితి చెప్పకండా అంతఃకరణలోనికి మళ్ళించారు. ఆ దితి కథ చెప్పండి."

"నిజమే ! ఈ ఇంగ్లీషు చదువుకుంటే నేనే ఇంత చెడి పోయినానే, ఏకాదశి అనే జ్ఞానంకూడా లేకపోయిందే. ఇక సోఫియా విషయం చెప్పావు."

"మొత్తానికి బాధగానే ఉంది మీకు. మీ నాన్నగారు చిన్నప్పుడే నన్నిచ్చి పెళ్లి చెయ్యకపోతే ఆవిడకోసం యావజ్జీ వితం బ్రహ్మచర్యం చేసేవాళ్ళే."

"దితి సంధ్యా సమయమునందు భర్తయైన కశ్యప ప్రజాపతిని వాంఛించింది. ఇది రాక్షసవేళ కూడదన్నాడు

ఆయన. ఆవిడ బలవంతము చేసింది. అప్పుడు ఆమె కడుపున హిరణ్యాక్షు హిరణ్యకశిపులు పడ్డారు. క్రూరులు అధర్ములు దైవము లేదనేవాళ్లు అకాలమందు స్త్రీ సంగమంచేస్తే పుడతారు.”

“ఇవ్వాళ నేను ఏకాదశి అని చెప్పటం మూలంగా లోకంలో ఒక రాక్షసుడు పుట్టకుండా చేశారన్నమాట.”

“నిజమే. నాకు నిద్ర రావటము లేదు.”

“రేపు ఆఫీసుకి వెళ్ళాలి.”

“అంతఃకరణము బాగుచేసికోకపోతే ఇలాంటివెన్నైనా జరుగుతవి. ఇందాక చెప్పాను కదా. మనస్సనేది ఉన్నదని ఆ మనస్సు ఉన్నదని ఇతర కారణాలచేత మనము ఊహించవలసిందే తప్ప దానిని మనము చూడలేము కదా. ఇతర కారణాలు సంయోగపరచుకొని మనస్సు ఉన్నదని నిశ్చయం చేసికొన్నాము. కనుక ఉన్నవన్నీ మన కళ్లకు కనిపించవు. కారణములచేత వాటి ఉనికిని తెలుసుకోవలె. మనస్సు లేదని ఎవడూ అనడు. ఆ మనస్సు వాడి కళ్ళకి కనిపించటం లేదు. అలా కళ్ళకు కనిపించని అనేక విషయాలు హేతు సామగ్రి ఉండటంవల్ల ఉన్నవని నిర్ణయించుకోటము మానవ లక్షణమున్న మాట. ఈ లక్షణంలో కొంత సామాన్యము, కోపము, దయ ఇలాంటి గుణాలున్నవి. అవి కనపడవు. అవి ప్రదర్శించినవాడి ముఖ లక్షణాలచేత మాటలచేత వాడుచేసే పనులచేత మనము

ఊహిస్తాము. వాడు గొప్పవాడు. కీర్తికలవాడు. ఇలాంటి మాటలు అంతే. కీర్తి కళ్ళకి కనిపిస్తుందా? నలుగురూ చెప్పుకుంటూంటే అది కీర్తి అంటాము. ఆ కీర్తి కనిపించేది కాదు. ఈ బయటి కారణాలచేత ఊహింపబడేది. ఏ మానవుడు మనస్సు, బుద్ధి, కోపము, జాలి, కీర్తి, ఇవి లేవనడు — ఇవి ఉన్నవి అనటానికి మనుష్యుడై పుడితే చాలు. భగవంతుడు ధర్మము జాతి గుణాలు పరలోకాలు పాపపుణ్యాలు పాతివ్రత్యము మొదలైనవి కూడ బయటఉన్న హేతుసామగ్రిని పట్టి వాని ఉనికిని ఊహించి నిశ్చయించుకోవలసినదే. కీర్తి మొదలయినవి లోకంలో నిత్య జీవితంలో బ్రతకటానికి ఉపయోగపడతవి. అందుచేత వాటిని వాడు ఒప్పుకుంటాడు. ఒప్పుకోకపోతే వాడి దైనందిన జీవితం భంగమవుతుంది. ఈ దైవము ధర్మము మొదలైనవి ఉన్నవే వాటిని ఒప్పుకోకపోతే దైనందిన జీవితానికి భంగంలేదు. రాజు వేనిని శిక్షిస్తాడో ఆ దోషాల్ని మానవులు చెయ్యరు. శిక్ష శరీరానికి జరుగుతున్నది. అది నిత్య జీవితానికి భంగకారి అవుతున్నది. అందుచేత రాజు పూర్వము వర్ణాశ్రమ ధర్మాచారాన్ని పాలించేవాడు. అప్పుడేమయ్యేది? దృశ్యమాన మౌతూఉన్న కారణ సామగ్రిచేత నిర్ణయింపబడే సర్వ విషయాలు జనులు అంగీకరించి ఆచరించేవాళ్లు; లేకపోతే రాజు శిక్షిస్తాడు గనక. రాజు కీర్తికోసము ఎదటివాడికి లౌకికముగా అన్యాయము చేయటము దొంగతనము చేయటము ఇతరులను చంపటము. ఇట్లాంటి వాటినే

శిక్షిస్తాడు. అందుచేత జనులు వీటినే నమ్ముతారు. దేనికి శిక్షలు లేవో దాని నెందుకు నమ్మాలి? దీనినే "రాజానుమతో ధర్మః" అన్నది. ఆ ధర్మమునందు రాజునకు ప్రత్యయములేదు. ప్రజలు ఆ ధర్మాన్నీ ఎందుకు పాలిస్తారు."

"ఇప్పటి రాజులు ఆ ధర్మమునందు విశ్వాసములేని వాళ్లు. ప్రజలలో ఇప్పటికి ఆ విశ్వాసము కలవాళ్ళు ఉన్నారు. మీవంటి వాళ్లకు ఆ విశ్వాసం ఉన్నది. మరికొందరు ఆ ధర్మాలన్నీ ఆచరిస్తున్నారు. మరి రాజు పాలించక పోయినా అది పాలింపబడుతూనే ఉన్నది కదా."

"ఒక్క రాజే ఉంటే నీవు చెప్పినది నిజమే. వాళ్లు లేరన్న భగవంతుడుకూడా ఉన్నాడు. రాజు ప్రత్యక్షముగా పాలిస్తాడు భగవంతు డప్రత్యక్షంగా పాలిస్తాడు. పూర్వ యుగాలల్లో మనదేశములో ప్రత్యక్షా ప్రత్యక్షముల రెంటిని రాజు పాలించేవాడు కనుక ఆ రోజుల్లో ప్రత్యక్షాన్ని పాలించే మానవత్వము అప్రత్యక్షాన్ని పాలించే భగవంతుని తనవు రెండూ ఉండేవి. "నా౽విష్ణుః పృథివీ పతిః" అన్నారు. రాజు ఆ విష్ణువు కాడు ఆవిష్ణు శబ్దముమీద నఞ్ ప్రత్యయము ఉన్నది ఇక్కడ ఆ ప్రత్యయాని కర్ధమేమిటంటే విష్ణువు అంశతః ఆ రాజునందు ఉంటాడని అర్థము. రాజు అష్ట దిక్పాలకుల అంశలతో పుడతాడు అని అంటారు, దానిని ఇప్పటివాళ్ళు వెక్కిరిస్తున్నారు దిక్పాలకులంటూ అసలులేరని. దిక్కులు ఉన్నవా?

ఆ లెక్కన దిక్కులూ లేవు. ఇక్కడికి నెల్లూరు దక్షిణము. నెల్లూరికి మదరాసు దక్షిణము. మదరాసుకి మధుర దక్షిణము. ఎక్కడ ఉన్నది ఆ దక్షిణము? అవి దక్షిణమే అంటే మధురకు మదరాసు ఉత్తరము, మదరాసుకి నెల్లూరు ఉత్తరము. కనుక ఒక్కచోటే దక్షిణము ఉత్తరము రెండుఅవుతుందా? అంతేకాదు ఇంకొకడి కదిపడమర, మరొకడికి తూర్పుకనుక ఒక్కటేచోటు నాల్గు దిక్కులు కావచ్చు. రాజు తానెక్కడ పాలిస్తున్నాడో అక్కడ నాల్గుదిక్కులూ ఉన్నవి. మరి వానియందు విష్ణువు అంశాఉన్నది. దిక్పాలకుల అంశా ఉన్నది. అంటే ఈ దిక్కులు విష్ణువు ఒక ధర్మంతో ఒక న్యాయంతో ఒక వైదికమైన చిత్త వృత్తితో చెప్పిన మాటలు, ఆ చిత్తవృత్తితో ధర్మంగా పాలించే రాజునందు విష్ణ్వంశ ఉన్నది. దిక్పాలకుల అంశ ఉన్నది. లేనివాడియందు లేదు రాజు ప్రత్యక్షా ప్రత్యక్షములను పాలించేవాడు కావాలని అర్థము. ప్రధానంగా అప్రత్యక్షాన్నే పాలించేవాడు కావాలి. ఎందుకంటే ఈ మానవలోకంలో కళ్ళతో చూచేది ఒక పాలు. మనస్సుతో చూచేది లక్షపాళ్ళు. చివరికి ఇతడు నా తండ్రి ఈమె నా తల్లి అనుకోటం కూడా మనస్సుచేతనే అనుకోటము. తండ్రి లేదు తల్లి లేదు చెల్లెలు లేదు అని అంటాడనుకో. పాలించేవాడు అననిస్తున్నాడు గనక అంటున్నాడు. ఆ పాలించేవాడికి ఆ దేశము ఆ జాతి ఆ సిద్ధాంతము ఆ విప్లవము ఇవి ఉన్నవి. అవి వీడు కాదనటానికి

విలువేదే అంటే తల ఎగిరిపోయిందన్న మాటే. ఇది ఆధునిక వివేకము."

"ఇంక నిద్రపోండి. అంతఃకరణాన్ని గురించి రేపు చెప్పుదురుగాని."

"రేపు చెప్పటమెందుకు ఇప్పుడే చెబుతాను."

"నాకు నిద్ర వస్తున్నది."

"నిద్ర పోవటానికి వీలులేదు. ఏకాదశి కాదనుకో ! నీకు నాకు ఇప్పుడప్పుడే నిద్రరాదు కదా !"

"ఎవరన్నా వింటే నవ్విపోతారు."

"ఎవరన్నా వింటేనా ? ఇప్పుడా ? పిల్లలు నిద్రపోతు న్నారు. మనమేమి మాట్లాడుకొంటున్నామో వినవలసిన అవ సరం ఇప్పుడెవరికీ లేదు. ఇవ్వాళ ఏకాదశి అని చెప్పే భార్య లేనివాళ్ళే అందరూను. వాళ్లకి డిసెంబరు ఇర్వై తేది అనే తప్ప ఏకాదశులు మొదలైనవేవీ లేవు."

"అందుకనే హిరణ్యాక్ష హిరణ్యకశిపులు పుట్టారు. కానివ్వండి ఆ అంతఃకరణ ఏమిటో చెప్పండి. పడుకొని నిద్ర పోదాము."

"రేపు ఆఫీసుకి వెళ్ళాలి. పెందలాడే నిద్రపోండి అన్నావు. నిద్రపోకపోతే నాకు జబ్బు చేస్తుందని, నాకు జబ్బు చేయటం నీకు ఇష్టంకాదు అని నాకు జబ్బుచేస్తే సంసారం సాగదు అని, ఇదికదా అర్థము. ఇది ఒట్టి లౌకికమైన అర్థము.

ఇప్పుడు నీవు ప్రత్యేకముగా ఊహించలేదు. ఇట్టి ఊహాలన్నీ బ్రతికే మానవులకు సహజమై పోతవి. ప్రస్తుతం నీ మనస్సులో ఉండేది ఒక్కటే నా భర్తకు జబ్బు చేస్తుంది అని. దాని పేరు అంతఃకరణ. దానికి పుట్టిన ఊహాలన్నీ మనస్సు చేస్తుంది. ఈ ఊహాలన్నింటికి మూల భూతమైనది అది. ఆ అంతఃకరణము మానవులలోని మొదటి చైతన్యము. దాని పేరు స్ఫురణ. అది కలుగుతుంది మొదట దాని వలననే లోకంలో ఉండే బహు విషయాలను సమాశ్రయించి ఊహాలు పుడతై. ఆ ఊహాచేసే భాగాన్ని మనస్సు అంటాము. ఊహించి ఒకదానిని నిర్ణయిస్తాము. దానిని బుద్ధి అంటాము వాడు నాకిది చేస్తాడా ! నేను వాణ్ణి ఏం చేస్తానో చూడు. నేనిది చేసి తీరుతాను. ఈ మొదలైనది అహంకారము. ఆ మొదట ఉన్నదే అంతఃకరణ మనే స్ఫురణ. ఇవన్నీ అందులోనుంచి పుట్టినవి. జబ్బుచేస్తుందేమో అన్న ఒకస్ఫురణ నీకు కలిగింది. నేను భర్తను కనక నీవు భార్యవు కనక ఇది ధర్మము కనక ఆ స్ఫురణ పవిత్రమైనది."

"సోఫియా పెళ్ళాము. ఆ జాకాబ్ మొగుడు. అతనిని గురించి ఆవిడ కూడా ఆదుర్దా పడుతుంది. అదీ ధర్మమే కదా."

"కనుక అంతఃకరణలో మొదట స్ఫురణ బయలు దేరుతుంది గనక అన్ని స్ఫురణలు పవిత్రములే కావాలి అని నీ వాదన. అంతేగా ! కాని స్ఫురణ అంటే ఏమిటి ? ఏమీ

లేకండా స్ఫురణ కలుగుతుందా ? స్ఫురణ అనటం తోచే నే ఒకదానిని గురించి కలిగే ఊహ అని అర్థం. అంతఃకరణము అంటే స్ఫురణ కలిగే శక్తి అని అర్థము. శక్తియని కూడ అన టానికి వీలులేదు. అది కలగటానికి వీలైన ఒక పదార్థము. పదార్థమన్న మాట ద్రవ్యమని అనుకోటానికి వీలులేదు. దానిని గురించి ఇంకొక విధంగా చెప్పటానికి వీలులేదు గనక దానిని గూడ పదార్థమనటం. అగ్నివంటిది. ఆ అగ్ని దాని అంతట అది ఉంది. కాని ఒక ఆధారము లేకుండా అది కనిపించదు. ఒక పెట్టెలో ఒక తైలమో ఏదో ఒక ఇంధనమో ఒక తీగరయో ఉండాలి. వాని నాధారము చేసికొని అది మండుతుంది. అడవిలో రెండు కట్టెలు రాచుకుంటే అగ్ని పుడుతుంది. ఆదివరకు ఎక్కడ ఉన్నది ? లేనిది రాలేదు గదా. ఆ రెండు కట్టెలు రాచుకోటమనేది అది కనిపించటానికి హేతువయింది. అలాం టిది ఆ స్ఫురణ శక్తి. అది ఉన్నది. కొన్నింటిని ఆశ్రయించి పుడుతుంది ఇక్కడ పుడుతుంది అన్న మాటకు రెండు కట్టెలు రాచుకుంటే అగ్ని పుట్టింది అన్న వాక్యములో పుట్టింది అన్న మాటకెంత అర్థమో అంతే అర్థం. అదివరకు లేనిది జన్మించినదని అర్థంకాదు. కనిపించనిది కనిపించినది అని అర్థం. కనుక స్ఫురణ శక్తిలో పాపంలేదు పుణ్యంలేదు. దేనిని గురించి ఆ స్ఫురణ తెలుస్తున్నదో ప్రకాశమునకు వస్తున్నదో ఆ ఆశ్రయమైనది పవిత్రమైనదా అపవిత్రమైనదా అన్న ప్రశ్న. మంచిదా చెడ్డదా అన్న ప్రశ్న. స్ఫురణ శక్తిలో పవిత్రత లేదు. అపవిత్రతలేదు. అది ఒక పదార్థము. పెసలు పండినవి.

అసలు పెసలు అనే వస్తువు మంచిదే. పండిన పెసలు మంచివా చెడ్డవా! నేల మంచిదై ఈతిబాధలు లేకండా ఉంటే పండే పెసలు మంచివి. నేల మంచిది కాదు. పురుగు పట్టింది. గింజ తప్పపడి పోయింది. ఆ రీతిగా ఉంటుంది. భార్యా భర్తలే! ఆవిడని గురించి అతనికి అతనిని గురించి ఆవిడకి ఆదుర్దా ఉండటం సహజమే. అక్కడ భార్యా భర్తలు ఎట్లాంటి వాళ్లు. ఒక ధర్మాన్ని పురస్కరించుకొని భార్యా భర్తలయి నారా లౌకికమైన ఒక ప్రయోజనాన్ని ఉద్దేశించి అయినారా? ఇలా ఎందుకు చెయ్యకూడదు. ఇలా ఎందుకు చెయ్యకూడదు అనే ఒక సాంఘికమైన తిరుగుబాటుచేసి భార్యా భర్తలై నారా? ఇట్టి భిన్నత కలిగిన దాంపత్యములన్నీ ఒకటేనా వాటిల్లో భేదాలు ఉంటవా? ఈ సృష్టిలో ఉండే మహా విషయాలన్నీ అంత స్థూలంగా ఉంటవా? ఆవిడ క్రైస్తవుణ్ణి చేసికొంది. అచ్చంగా అతడు క్రైస్తవుడనే చేసికోలేదే? అతడు పెద్ద అధికారి అని సమృద్ధిగా ధనం సంపాదిస్తున్నాడని దానివల్ల తనకేదో లాభం ఉంటుందని చేసికొన్నది. కాదు నేను వట్టి సంఘ సంస్కారంకోసమే చేసికొన్నాను అంటే అప్పుడు మా ఊళ్ళోఉన్న పాలేరు ఉన్నాడు. వాడి పేరు యోహాను. పోయి వాణ్ణి చేసికోక పోయిందా! సంస్కారముతోపాటు ఇవి మాత్రము చూసికోరా? మీరు మాత్రం మీ కులస్త్రీని చేసికొంటూ డబ్బు దసకం మర్యాద మొదలైనవి చూసుకోటములేదా? అనవచ్చును. నిజమే! మేము

మొదట ఆర్షేయము పౌర్షేయము చూసుకొంటున్నాము. తరువాత లౌకికములైన మంచిచెడ్డలు చూచికొంటున్నాము.ఆవిడ మొదట లౌకికమైన మంచిచెడ్డలు చూచింది. వాళ్లిద్దరికి ఏదో కారణంచేత స్నేహము కలిగింది. ఆ స్నేహము సాంఘికములైన పరిస్థితులచేత ఆధునిక నాగరకతలో ఉన్న సామ్యముచేత సంప్రదాయమంటే పెంపొందించుకొన్న ఒక తిరస్కారంచేత ప్రధానంగా కామాంధతచేత ప్రత్యక్షమైనదే ఉన్నది అప్రత్యక్షమైనది లేదు అన్న నిశ్చయంతో కూడిన ఒక తిరస్కారముచేత ఈ పెండ్లి చేసికోటము మూలముగా బంధువులందరికి విరోధినని అవుతున్నాను అనే విషయాన్ని లెక్కపెట్టక అనగా తల్లిదండ్రులు అన్నదమ్ములు అక్కచెల్లెండ్లు ఇతర బంధువులు జన్మచేత వీళ్ళందరితో తనకు ఉన్న సంబంధాలను మించిన లౌకిక వాంఛ ధనవాంఛ కామ వాంఛలచేత ఆ పని చేసిందని అర్థము. తల్లికంటె వేరు దైవమ్ములేదు అంటారు. తండ్రి తల్లికి పది మడుంగు లంటారు ? ఎందుచేత వాళ్ళ ఇద్దరి సంపర్కముచేత ఈ కొడుకో కూతురో జన్మించారు. ఈ శరీరముయొక్క సృష్టికి వాళ్లు హేతువులు వాళ్లు లేకపోతే ఈ శరీరము లేదు. తనకు బుద్ధివచ్చిన తరువాత వాళ్ళను తిరస్కరించటము న్యాయము కాదుకదా ? వాళ్ళని దిగద్రొక్కి నీ కామవాంఛకు ప్రాధాన్యమిస్తావా ఆ కామవాంఛలో యున్న ధర్మం సంశయగ్రస్తమైనదా నిశితముగా విచారిస్తే అది అధమ వాంఛక్రింద తేలుతుందా ? శ్రీరామచంద్రుడు తండ్రిమాట పాలించేందుకు రాజ్యాన్ని పరిత్యజించాడు. అది అనాది ధర్మము అని ఋషులు చెప్పారు. సర్వకాలము అంగీకరించింది. వాళ్ళ కిష్టములేని పెళ్లి పెళ్లా—

## 6

"ఈ ఒక్కమాట విని పో."

"నాకు ఆకలి అవుతూ ఉన్నది. మీరు ఉపన్యాసాలు మొదలు పెట్టారా నేనుండలేను. నిమిషములో వంట చేస్తాము. మీరుకూడ పెందలకడనే స్నానం చెయ్యండి."

"నీవు ఉపన్యాసాలు దంచినప్పుడు నేను విన్నానే నా ఉపన్యాసాలు నీవు వినకూడదా ? నీ ఉపన్యాసాలే నేను వినాలి కాబోలు."

"ఎవరికోసం వింటారు. పెళ్ళిచేసికొన్న తరువాత తప్పుతుందా ?"

"నీవు నన్ను చేసికోలేదా ?"

"మీరు నన్నూ చేసికోలేదు నేను మిమ్మల్నీ చేసికోలేదు. మీ నాన్నగారు మా నాన్నగారు మన ఇద్దర్నీ ఒకరినొకరికి చేశారు."

"ఆ మాట బాగా ఉంది. ఎవళ్ళకి వాళ్ళు చేసికొంటే బాగుంటుందా ? ఇతరులు చేస్తే బాగుంటుంది. అందులో తల్లిదండ్రులు చేస్తే మంచిచెడ్డలు విచారించి చేస్తారు. పిల్లల యోగక్షేమాలు విచారించి చేస్తారు. యోగక్షేమాలన్నమాట చూడావా ! ఐహికాముష్మికముల యందలి రెండు మేళ్లను చెబుతుంది. ఎవళ్ళకి వాళ్లు చేసికొంటే యోగక్షేమాలు విచారించుకోరు. వ్యామోహం పడతారు. మతిభ్రమణం పొందుతారు. వైద్యుడు తనవైద్యం తను చేసికోలేడు. స్నేహితుడైన వైద్యుని పిలిచి చూపించుకొంటాడు."

"అంటే ఈ జన్మ వ్యాధి వంటిదా ?"

"అందుకు సందేహమా ? ముదిరితే రెండూ మృత్యువు నకేకదా దారితీసేది."

"ఇదిగో నన్ను మాటల్లో పెట్టి మళ్ళీ ఉపన్యాసానికి దింపుతున్నారు. నేను పోయి స్నానం చేస్తాను."

"స్నానం చేయకుండా వంట చేయకూడదా ?"

ఆమె మాట్లాడకండా వెళ్ళిపోయింది. వంట అయింది. మొగుడితో పాటే వడ్డించుకొంది. అన్నీ దగ్గిర పెట్టుకుంది. భోంచేస్తున్నారు. అతనన్నాడు గదా "ఇప్పుడు చెప్ప వచ్చునా ?"

భోజనము అయ్యేలోపుగా అయితే చెప్పవచ్చు. మీరే ముంది భోంచేస్తారు లేచి పోతారు. నేను విస్తళ్ళు ఎత్తాలి,

ఇల్లు కడుక్కోవాలి, అన్నీ మూతలు పెట్టుకోవాలి. అప్పుడు కాని నాకు తీరిక కాదు."

"ఒక త్రైని పెళ్ళిచేసికొన్నామనుకో. దానికెంత లోకువై పోతామనుకొంటున్నావు ?"

"లోకమందరూ మగవాడికి ఆడది లోకువైందంటు న్నారు. మీరు దానికి విపరీతంగా చెబుతున్నారు. ఇదంతా ఎందుకు. ఆ చెప్పేదేమిటో చెప్పండి వింటాను."

"భోజనమయ్యేవరకు చెబుతూ ఉంటాను. అప్పుడాగు తాను. నీ పనంతా అయిన తర్వాత మళ్ళీ మొదలు పెడ తాను—"

అంటూంటే ప్రక్కన కంచంలో అన్నము తింటూన్న కొడుకు "నువ్వు చెప్పొద్దు నాన్నా అమ్మ గొప్పేమిటి ? నువ్వెందుకు బతిమాలాలి" అన్నాడు. అన్నం తింటున్న తల్లి దగ్గర పాలు త్రాగటానికి పిల్ల కొట్లాడటం మొదలుపెట్టింది. తల్లి చేరనివ్వలేదు. అది ఏడవటం మొదలు పెట్టింది. కమల "మీ రన్నం తినటము అయిందికదా ! ఈ పిల్లని కొంచెము పట్టు కోండి. నేను తిని వస్తాను."

ఎలాగయితేనేమి, ఆదివారమైనా ఉపన్యాసాలు సాగ లేదు. ఆ రోజున సాయంత్రము అందరు సినీమాకు వెళ్ళారు. వచ్చిన తరువాత అప్పుడు భోంచేసి పడుకునేటప్పటికే పన్నెండు కావచ్చింది. మరునాడు "వంట పెందలాడే కావాలా" అని అడిగింది.

"ఇవాళ సెలవు."

"నిన్న చెప్పలేదేం ?"

"అదికూడ ఒక తప్పేనాయేమిటి"

"అంత నిష్ఠురమెందుకు సెలవేగా. ఆ చెప్పతలచుకొన్న దేదో చెప్పండి. రాత్రి ప్రొద్దుపోయి తిన్నాం కదా. భోజనానికి కాలస్యమైనా ఫరవాలేదు. ఇంతకూ సెలవెందుకు ?

"ఆయన ఎవరో దేశ నాయకుడు. ఆయన చచ్చిపోయిన రోజు."

"అయితే గారెలు వండనా ?"

"బ్రాహ్మణులని పిలుచుక రమ్మంటావా ? ఇలా పూర్వులు ఆధునికులు. ఏదో కొంత ప్రశస్తి సంపాదించిన వాళ్ళ పుట్టుకలకు చావులకు గారెలుచేస్తే మనకొంప ఖళాసా, ఇలా సెలవలిస్తూ ఉంటే రాజ్యాలే ఖళాసా."

"ఆ భయం లేదులెండి. ఆఫీసులకు ఎప్పుడూ సెలవే. గుమాస్తా లెవ్వరు పనులు చెయ్యరుగా అన్ని కాగితాలు అట్టల క్రింద చేలతవి. పై అధికారి అడిగిన కాగితం ఒక్కటే బయటికి వస్తుంది అని మీరే చెప్పారుగా. అక్కడికి వెళ్ళటం పని చేస్తున్నట్లు నటించటం. జీతాలు మాత్రము చాలవు."

"ఔను. అక్కడి పనికి జీతానికి ఏమి సంబంధం? జీతము ఎక్కువ కాకపోతే నీవు గారెలు ఎట్లా చేస్తావు ? గారెలు చేస్తావేమో అని భయంగా ఉంది. నేను చెప్పదలచుకొన్నది

చెబుతాను. ఏమీలేదు నీవు భార్యవు. నేను భర్తను. లోకంలో
అందరూ ఇట్లాగేగా. మా అమ్మ మా నాన్న మీ అమ్మ మీ
నాన్న. పాండవులు వాళ్ళ పెళ్లాలు, రాముడు సీత, దశరథుడు
కౌసల్య. వెనక చూచినా ఇప్పుడు చూచినా భవిష్యత్తును
గురించి ఆలోచించినా ఇదే నాటకమల్లే ఉంది. పెండ్లికాని
మగవాళ్ళు కాని ఆడవాళ్లు కాని నా కక్కరలేదంటే తప్ప
పెళ్ళి కాకండా ఉన్నట్లులేదు. అందరికి పెండ్లిండ్లయినవి. మరీ
పేద పిల్లలకు కావేమో. పేదతనముచేతనే తప్ప స్త్రీ పురుష
దారిద్ర్యంచేత కాదు. ఈ భూమిమీద అనేక దేశాలు ఉన్నవి.
అనేక జాతులు ఉన్నవి. అనేక మతాలు ఉన్నవి. అనేక విభా
గాలు ఉన్నవి. ఎక్కడి కక్కడ పెళ్లిళ్లు జరుగుతున్నవి. అనగా
అన్ని కాలాల్లో అన్ని దేశాలల్లో అన్ని విభాగాలల్లో ఏ కాలాని
కా కాలములో ఏ దేశాని కా దేశములో ఏవిభాగాని కావిభాగ
ములోఎప్పుడు వడితే అప్పుడు పుట్టి పెరిగేస్త్రీపురుషులు ఇంచు
మించుగా చెరి సమానంగా ఉంటున్నారన్నమాట. ఇది ఒక
ఆశ్చర్యము కదా. నేను కూతుర్ని కంటాను, నేను కొడుకుని
కంటాను అని ఎవళ్లు నిశ్చయము చేసికొని కనలేరుకదా ?
ఒకాయనకు ఆరుగురు కొడుకు లుండొచ్చు. ఆడపిల్లలు లేరు.
ఇంకొకాయనకి ఆరుగురు కూతుళ్ళు. మగపిల్లలు లేరు. ఒకాయ
నకు ఇద్దరు కొడుకులు. ముగ్గురు కూతుళ్లు. ఇంకొకాయనకు
ముగ్గురు కొడుకులు, ఇద్దరు కూతుళ్లు. మరొకచోట ఒక్కడే
కొడుకు. ఇంకొకచోట ఒక్కర్తే కూతురు. సరిగ్గా వాళ్ళు

వీ శే చేసికొంటారా ? ఆ నియమము లేదు కాని అందరికి పెండ్లిండ్లవుతవి. అది ఒక విధమైన సర్దుబాటు జరుగుతున్నది. ఈ దేశంలో పండిన పంట ఈ జనానికి చాలటంలేదు. ఇతర దేశాలనుంచి ధాన్యం తెప్పించుకోవాలి. ఈ దేశములో ఈ పదార్థము దొరకదు. ఇతర చోట్లనుంచి తెప్పించుకోవాలి. మనకు ఇక్కడ ఈ వస్తువు ఎక్కువగా దొరుకుతున్నది. అక్కడ లేనిదాన్ని పరదేశాలకు పోయి అమ్ముకొని డబ్బు తెచ్చుకొంటాము. అన్ని దేశాలలోని ఆర్థిక వ్యవస్థ ఇలాంటిదే. ఇట్టి వ్యవస్థ స్త్రీ పురుషుల విషయంలో ఏ దేశంలోను ఏ కాలం లోనూ జరగటంలేదు; ఒకతూరి మసగితే ఒక కలరా పేటు రేగితే స్త్రీ పురుషులు సమానంగానే పోతున్నారు. పురుషుల సంఖ్య తక్కువ అని స్త్రీలను దిగుమతి చేసికోవటంలేదు. ఎక్కువ అని ఎగుమతి చేయటమూ లేదు. ఎక్కడైనా పురుషుడు నలుగురైదుగురు భార్యలను చేసికోటము ఉన్నది. ఒక్క ద్రౌపది విషయములో తీసివేస్తే ఎక్కువమంది భర్తలను చేసికొన్న స్త్రీ లేదు. అట్లాంటి ఆచారము ఎక్కడైనా ఒక చోట ఉంటే అది ఏదో ఒక చిన్న ప్రాంతము. ఆ సూత్రము ప్రపంచానికంతకి పట్టదు. ఏతా వతా నేను చెప్పేదేమిటంటే ఎప్పటి కప్పుడు ఎక్కడి కక్కడ స్త్రీ పురుషుల సంఖ్య ఇంచు మించుగా సమానంగా ఉంటున్నది. ఇది మానవ జీవితంలో ఆశ్చర్యకరమైన విషయము. దీనికి మనుష్యుడు కర్త కాదు. ప్రకృతియొక్క లక్షణమే ఇలా వుంటుంది అనడానికి వీలు లేదు

ప్రకృతిలో కొన్ని నియమాలు ఉన్నా ప్రకృతి గ్రుడ్డిది. స్త్రీ పురుషుల సంయోగము వలన మానవ సృష్టి జరుగుతున్నది అన్నది ప్రకృతి లక్షణమని కొందరు వాదిస్తే వాదించవచ్చు. అనంతకాలంమీద అనంత దేశాలమీద ఈ స్త్రీ పురుష సంఖ్య ఇంచుమించుగా చెరిసగంగా ఉండటం ప్రకృతికంటె అతీత మైనది, ఒక మహా వివేకాన్ని. సృష్టి సాగాలి అని ఎవడో పెట్టుకొన్న ఒక పథకాన్ని సూచిస్తున్నది. వాడు భగవంతు డవటంలో తప్పేమున్నది. ఒక విశిష్టమైన పథకం ఒక ఆలో చనతోకూడిన వ్యవహారం. ఈ రెండు ఉన్నప్పుడు దానికి కర్త ఎవడో ఒకడు ఉండాలి. ఆ కర్త కరచరణాద్యవయవ సహితుడు కాకపోవచ్చు. ఈ పథకమును నడిపే ఒక వివేకముయొక్క సంపుటి నిత్యక్రియా వ్యవసాయి. ఒకడు తన బుద్ధిబలముచేత తన వ్యక్తియొక్క ప్రతిభ చేత ఆజ్ఞాపించకుండా పనులు చేయి స్తాడు. అతని పురుషాకృతి మనకు కనిపిస్తుందే కాని సర్వమును నియోగించే అతని ప్రతిభ మనకు కనిపించదు. అతని ప్రతిభ ఒక ముద్దగా ఉండి ఈ నియుక్త సర్వ కార్య కలాపానికి హేతువౌతుంది. సర్వజగద్రక్షణ శీలమైన సర్వజగన్నియామక మైన అట్టి ప్రతిభా సంపుటి వివేక సంపుటి, పరమ చైతన్య సంపుటి భగవంతుడంటే, ఆ ప్రతిభ నెట్లా చూడలేవో ఈ భగవంతునట్లా చూడలేవు. భగవంతుడు ఈ సృష్టి చేసినప్పుడు ఈ సృష్టి స్త్రీ పుంసయోగముమీద ఆధార పడేటట్లుగా నియమించినపుడు ఈ నియమము ఆయనే చేసి కొన్నాడు. చేస్తున్నాడు చేస్తాడు. తలకుమాసినవాడు తాను

కర్త అనుకోవాలి. తల లేనివాడు దీనికి కర్త లేడనుకోవాలి. ఒక పెద్ద యుద్ధం జరిగింది, నడి వయస్సులో ఉన్నవాళ్ళు చాలామంది చచ్చిపోయినారు. అప్పుడు పురుష దారిద్ర్యం వచ్చింది. యుద్ధభావ దూషిత బుద్ధులైన రాజులు జనసంఖ్య వృద్ధి చేసేందుకు అవివక్షితమైన స్త్రీ పురుష సంయోగానికి అనుజ్ఞ లివ్వచ్చు. వాడికి మళ్ళీ యుద్ధంలో చచ్చేందుకు మనుష్యులు కావాలి. సహజంగానే మళ్ళీ ఇరవై ఏండ్లల్లో పురుష సంఖ్య తగినంత కనిపిస్తుంది. ఇది సృష్టి రహస్యం. ఆ యుద్ధము జరిగే వేళకే యుద్ధానికి వెళ్ళటానికి వీలులేని పది పన్నెండేళ్ళ వయస్సుగల మగపిల్లలే చాలామంది ఉంటారు.

"ఎక్కడి కక్కడికే స్త్రీ పురుష సంఖ్య చేరి సమానంగా ఉంటున్న ఈ దేశాలు ఈ జాతులు ఈ విభాగాలు వేనికది ఉండాలని భగవంతుని సంకల్పమే మో. ఇతర కాలాలలోనుంచి నీవు స్త్రీ పురుషులను తెచ్చుకోలేవు కదా ! నీవు బతికి ఉన్నప్పుడు ఇతర దేశాలల్లోనుంచి ఇతర జాతులలోనుంచి ఇతర విభాగాలలోనుంచి ఎందుకు తేవాలి ? వెనకటికి ఒక రాజుకి ఒకడు జ్యోతిషం చెప్పాడట నిన్ను సంహరించేవాడు పుడతాడు అని. వాణ్ణి ఇప్పుడు చూపించు నేను చంపుతాను అన్నాడట. వాడు పుట్టలేదు. వాడు పుట్టేటప్పటికి వీడు నిర్వీర్యుడవుతాడు. కనుక ఒక దుర్మార్గుడు సృష్టికి వ్యతిరేకంగా నడవటంటే ఎప్పుడు నడుస్తాడు ? వర్తమాన కాలములో తన కందుబాటుగా నున్న వ్యవహారాలల్లో చేస్తాడు దుర్మార్గం. ఈ

అందుకాటు కాలమాన పరిస్థితులమీద ఆధారపడి ఉంటుంది. మా తాతయ్య భార్య అనగా మా అమ్మమ్మనాడు ఆవిడ ఢిల్లీ వెళ్ళలేదు. ఇంగ్లీషు చదవలేదు. మన సంఘ పరిస్థితులు ఇంత మారలేదు. ఆవిడ ఏ పూట కా పూట వడ్లు దంచుకోటము గుడ్డ లుతుక్కోటము పదిమంది బిడ్డలను సర్దుకోటము. మా తాతయ్య కే ఉద్యోగము లేదు. ఆవిడ కెక్కడనుంచి వస్తుంది. ఆవిడ తనపేరు సోఫియా అని మార్చుకోటానికి వీలులేదు. ఆవిడకి జాకాబ్ వంటివాడు కనపడటానికి వీలులేదు, అటు వంటివాడు దగ్గరకువస్తే స్నానంచేసేది. ఆ పరిస్థితులు వేరు. ఈ పరిస్థితులు వేరు. దానికన్న ఇదే మంచిదందామా ? అందాము. అనటానికి ముందు ఆ మంచి ఏమిటో మనము నిరూపించుకోవాలి."

"నేనుకూడ మీ అమ్మమ్మగారి పరిస్థితిలోనే ఉన్నాను. వన్నెందుకు చంపుతారు. నేను పోయి మడికట్టుకోవాలి. మీకు పదిరోజులపాటు సెలవ లెప్పుడైన వస్తవా ?"

"ఎందుకు ?"

"ఢిల్లీపోయి ఆ సోఫియా కిచ్చిరండి ఈ ఉపన్యాసా లన్నీ."

"అక్కరలేదు.ఆవిడ ఉద్యోగం దేశాలు తిరిగే ఉద్యోగం. ఎప్పుడో మన ఊరు వస్తుంది."

"అప్పుడు మీ దగ్గరకు రాదు. మనఇంటి కసలే రాదు."

"నేను మేనత్త కొడుకుని."

"ఇంకానా ?"

"ఇంకానా ఏమిటి ? మా ఇద్దరి శరీరాలు ఉన్నన్నాళ్లు ఆ సంబంధం పోదు ?"

"సోఫియాకి కొడుకు పుడితే అతనికి మీరు పెదతండ్రి అవుతారు నిజమే ఎల్లా తప్పించుకోటం."

"కనుక స్త్రీ పురుషులిద్దరు సంగమించటంతో ఆ సంబంధం అక్కడ ఆగిపోవటం లేదు. బంధువులందరికీ వ్యాపిస్తున్నది. కనుక బంధువు లందరను నిరాదరించి ఇటువంటి వివాహాము చేసికొనుటలో న్యాయము లేదుకదా."

"మీది అజ్ఞానం, వాళ్ళది జ్ఞానం. జ్ఞానులైనవాళ్లు తాము చేసే సత్కార్యాలు అజ్ఞానులతో విచారించి చెయ్యరు. జ్ఞాని అజ్ఞానిని లెక్కచేయడు."

"ఎవడు పడితే వాడు తాను జ్ఞానిననుకోవచ్చు. ప్రమాణం ఉండాలంటావా ?"

"మీకు వేదాలు ప్రమాణం, వాళ్ళకు కాదు."

"వేదాలట్లా ఉంచు. తర్కము ఉన్నదికదా ! ఆలోచన

ఉన్నదీకదా, వాదించవచ్చు కదా ! తనది నిజమైతే నిరూపించుకోవచ్చుగదా."

"ఇవన్నీ పూర్వకాలపు మాటలు."

అప్పుడు పండితులై ధర్మాత్ములైన రాజులుండేవాళ్లు. ఒక వాదన జరుగుతూ ఉంటే పండితులు మధ్యవర్తులుగా ఉండేవాళ్ళు. పూర్వం ఒకప్పుడు బౌద్ధులు గెలిచారు. తరువాత శంకర భగవత్పాదులు వారిని ఓడించారు. మరి ఒకప్పుడు రామానుజయతి కొందరు ద్వైతులమీద గెలిచారు. ఔనో కాదో ! ఒక వ్యవస్థమీద నడిచింది. ఇప్పుడదేమీ లేదు. అందరూ పండితులే, వాదించలేకపోతే వాడు మూర్ఖుడనటం లేచిపోవటం."

"మోటు సామెత ఉందే కాపులు కరణాలు నా ప్రక్కనయితే ఎట్లా కొడతావో కొట్టరా మగడా అందిట."

"అయితే పోయి వంట చేస్తాను."

"కాని వాళ్ళతో కాదు. మనలో మనం విచారించుకోవచ్చు కదా ?"

"మన ఇద్దరిలో ఆ భయములేదు గదా ?"

"అలాకాదు. ఒక పుస్తకం చదువుతాము. అర్థమవుతుంది. అందులో విషయాలు మనకు స్థూలంగా తెలుస్తవి గాని సూక్ష్మంగా తెలియవు. వాటిని మనము ఇతరులకు చెప్ప

వలెనంటే మన మనస్సులో అవి దృఢపడాలి. అంటే ఆ గ్రంథము మరి కొన్నిసార్లు చదవాలి. మనకు బాగా నచ్చిన విషయాలు కంఠతః పట్టాలి. పండితులంటే అట్లాంటివాళ్లే. మనం ఒక మంచిపనే ఆచరిస్తున్నాం. మంచిపని అని అనుకొంటున్నాము. మనపూర్వులు చేశారు గనక, దానియందు విశ్వాసంతో ప్రవర్తిస్తున్నాము. ఆ చేసే పనియందు ఆలోచన చేసి అధికమైన యాథార్థ్యముందని తెలిసికొంటే దాని యందు మనబుద్ధి దృఢంగా ఉంటుంది నిశ్చలంగా ఉంటుంది అందుకని."

# 7

"మీ అన్నయ్య ఉత్తరము వ్రాశాడు."

"ఇంటిదగ్గర అందరూ కులాసాగా ఉన్నారా?"

"ఇంటి దగ్గరనుంచి వ్రాయలేదు. ఢిల్లీనుంచి వ్రాశాడు."

"ఢిల్లీనించా ? ఢిల్లీ ఎందుకు వెళ్లాడు ?"

"ఎందుకు వెళ్ళాడో ఉత్తరం చూడు."

"మీరు చదవలేదా ఉత్తరం ?"

"పది పేజీల ఉత్తరం. అందులో సంగతులన్నీ చెప్పటానికెట్లా వీలు. నీవే చదువు. నీకే తెలుస్తుంది."

"చదువుతాలెండి. మీరు చెప్పండి ఏముందో ?"

"నాకేదో పనుండి వెళుతున్నాను. ఒక గంటలో వస్తాను. ఈ లోపుగా చదువు" అని చిదంబరం ఉత్తరం భార్య చేతికిచ్చి తానుత్తరీయము పైనవేసికొని బయలుదేరి వెళ్లాడు. బల్లమీద ఉత్తరం తీసి కమల తెఱచి చదవటము ప్రారంభించింది.

ప్రియమైన చిదంబరం బావగారికి—నేను ఢిల్లీవచ్చి పదిరోజులయింది. సోఫియా ఇంట్లోనే ఉంటున్నాను. నేను బి. ఏ. పరీక్ష యిచ్చినా నా కెక్కడా ఉద్యోగము దొరకలేదని మీకు తెలుసు. ఇంటిదగ్గర నాన్న అమ్మ కులాసాగానే ఉన్నారు. తమ్ముడు కులాసాగానే ఉన్నాడు. నా చదువుకే మా నాన్నగారు చాలా ఇబ్బంది పడ్డారని మీకు తెలుసు. నేనే కొందరి స్నేహితుల సహాయ్యముతో బి. ఎ. గట్టెక్కించాను. పరీక్ష అయి రెండేళ్ళయినా ఎక్కడా కుదురుకోలేక పోయి నాను. మాకు ఎకరన్నర పొలమున్నది కదా. దానిమీద వచ్చే గింజలు సాలీనా తిండికి చాలవు. మానాయనగారు ఉద్యోగము విరమించారు. ఆ యాభై కూడా రావటములేదు. నేను అప్ర యోజకుడనై ఇంట్లో కూర్చొని తింటూ ఉన్నాను. నేను నిర్వ్యాపారముగా ఉన్నానని మా నాయనగారి సాధింపులు ఎత్తి పొడుపులు చీదరింపులు నాకు దుర్భరమైనవి. నేనేమి చెయ్యాలో నాకు తెలియలేదు. ఎక్కే గడపగా దిగే గడపగా నా కాళ్ళు బలపాలు కట్టినవి. చివరకి కోమటి గుమాస్తాగా నైనా చేద్దామనుకొన్నాను. నా చదువు గోచీకి పెద్ద గావంచాకు చిన్న అయింది. చిన్నచిన్న ఉద్యోగాలకు పోతే అమ్మయ్యో మీరు బి. ఎ. మాకెందుకు అనేవాళ్ళు. ఉపా ధ్యాయ వృత్తికిపోతే మీరు బి. ఇ. డి. పరీక్ష కాలేదనేవాళ్లు. రెండేళ్ళు ఒకచోట ఉపాధ్యాయుడుగా ఉంటేగాని వాళ్ళు బి. ఇ. డి. లో చేర్చుకోరట. బి. ఇ. డి. అయితేగాని వీళ్ళు

ఉద్యోగా లివ్వరు. పిచ్చి కుదిరితేగాని పెళ్ళికాదు. పెళ్ళి అయితే గాని పిచ్చి కుదరదు. నాకింట్లో అన్నము తినటానికి కూడా లజ్జవేసి పోయిందనుకోండి. ఇంక రిక్షా లాగాలి. లేకపోతే కూలి చెయ్యాలి. దానికి బి. ఎ. ప్యాసుకావట మెందుకూ. వాటికి మనము బ్రాహ్మణులము అనే దురభిమానం పట్టుకుంది నిజం చెప్పవద్దూ నాకు ఉద్యోగము రాకపోవటానికి నేను బ్రాహ్మణ్ణి కావటం చాలా హేతువైనట్లు నాకు చాలా నిదర్శనాలు కనుపించినై. పత్రికలు చూడటం, ప్రకటనలకోసము వెదకటము. అర్జీలు పెట్టటము. అదీ టైపు చేయించాలి. యోగ్యతా పత్రములు టైపు చేయించాలి. దానితో పది శ్రాద్ధపు కాగితాలు పంపించాలి. అది రిజిష్టరు చెయ్యాలి. దానికి రెండు రూపాయలు ఖర్చు కావాలి. ఇట్లా ముప్పది నలుబది అర్జీలు పెట్టాను. ఏ స్నేహితుడి దగ్గరో తీసికోటం వాడికి మళ్ళీ యిచ్చేదా చచ్చేదా ? ఇంటి దగ్గరనుంచి లేచి పోదామనిపించింది. ఎక్కడికి పోవాలి? ఏం చెయ్యాలి ? రాచరికంవారు నిరుద్యోగ సమస్యని నిర్మూలిస్తామని అంటున్నారు. కొన్ని ఆఫీసుల్లో ఇదివరకే ఉన్న వాళ్ళ ఉద్యోగాలు తీసివేస్తున్నారు. సరే ఈ ఉద్యోగాలు ఈ త్రిప్పులు ఇది ఒక విష వ్యూహము. తెలియని దెవరికి ?

ఒకరోజున పత్రికచూస్తే సోఫియా అనే బ్రాహ్మణ స్త్రీ ఒక గొప్ప ఉద్యోగస్థుడైన క్రైస్తవుని పెండ్లాడింది అనే వార్త పెద్దఅక్షరాలల్లో ఉంటే ఊరికే చదివాను. ఆ సోఫియా

ఫల్గానా ఆయన కూతురు అని అక్కడ ఉన్నది. ఆ పేరు చదివేటప్పటికి ఇంటిపేరు అది చూస్తే మీ మేనమామగారేమో అనిపించింది. ఇంటికి వెళ్ళి మా అమ్మనడిగితే మీ మేనమామ గారే అని చెప్పింది. ఎందుకూ అని అడిగితే ఎందుకూ లేద న్నాను. ఆయనకు పెద్ద ఉద్యోగమని ఈవిడకి పెద్ద ఉద్యోగ మని ఉన్నది ప్రవాహానపడి పొయ్యేవాడు గడ్డిపరకను గూడ పట్టుకుంటాడు. అది తగిలితే తగులుతుంది. లేకపోతే లేదు. ఒక రాయి విసురుదా మనిపించింది. ఇదివఱకు ప్రయత్నము చేసిన ఉద్యోగాలన్నీ వచ్చినవా ఇది రాకపోతుందా అని ఆ నోటీ యాకు ఒక ఉత్తరము వ్రాశాను. మీ మేనత్తగారి కుమారుడు చిదంబరంగారు నా బావమరిది. ఆయన భార్య కమల నా చెల్లెలు. నేను బి. ఎ. పరీక్ష యిచ్చాను. రెండేండ్లయినది. ఎంత ప్రయత్నము చేసినా ఉద్యోగము కుదరలేదు. మా నాయన గారు ఉద్యోగమునుండి విరమించినారు. నేను నా కుటుంబా నికి బరువుగా ఉన్నాను. మీ భర్త గొప్ప ఉద్యోగస్థుడు కదా. ఆయన చేతిలో చాలా ఉద్యోగాలు ఉంటవి. మీ రిప్పిస్తానంటే వస్తాను. మీ కటువంటి దయ కలిగితే నేను ఢిల్లీ రావలెనని అంటే రైలు చార్జీలుకూడా మీరే పంపించాలి. అక్కడికి వస్తే ఉండేందుకు హోటల్ కర్చు అన్నీ మీరే పెట్టుకోవాలి అని ఉత్తరం వ్రాశాను. ఆవిడదగ్గరనుంచి సమాధానం వచ్చింది — వెంటనే రావలసినది ఉద్యోగము ఉన్నది అని. రైలు చార్జీలు పంపించింది. మా నాన్న ఆ డబ్బు వస్తే ఎక్కడదని కూడ

అడగలేదు, ఆయనకు నామీద అంతకోపంగా ఉంది. మా అమ్మతో చెప్పాను. ఆవిడ మీ మేనమామ కూతురుయొక్క ఔదార్యానికి బంధుప్రీతికి చాలా సంతోషించింది. ఇంత మంచి పిల్ల క్రైస్తవుణ్ణెలా చేసికొందరా అంది. ఇంకా ఏవో ఏవో చెప్పింది. నీవుపోయి చెడిపోకు సుమా అన్నది. ఆ ఎంగిలి మంగలంలో చొరబడకు సుమా అన్నది. నే నావిడ కన్నీ వాగ్దానాలు చేశాను. ఇక్కడికి వచ్చాను. వాళ్ళ ఇంట్లోనే దిగాను. నేను హోటల్లో దిగితే ఎంత ధనాపరి హోటల్లో దిగినా రోజుకి ఆరు రూపాయలు తక్కువయ్యేటట్టు లేదు ప్రతిరోజు ఆవిడ్నే అడగాలి. ఆవిడ రెండు మూడు రోజు లిచ్చింది. ఆవిడ నన్ను తన భర్తకి చూపించింది. అతనికి కళ్లు ఆకాశంలో ఉన్నవి. అతని ముందర నేను ఈగనో దోమనోగా ఉన్నాను. వాళ్ళ ఆఫీసుకి రమ్మన్నాడు. ఆ ఆఫీసునుంచి ఇక్కడకీ రాను పోను బస్సు రూపాయి అవుతున్నది. బస్సు దిగిన తర్వాత రెండుమైళ్లు నడవాలి. ఆయన దర్శనం కావటమే గగనం. ఒక్కొక్కప్పుడు ఆయన ఆఫీసులో ఉండడు. రాత్రి ఎనిమిదింటికో తొమ్మిదింటికో వాళ్ళ బంగళాకి పోతాం. యాదృచ్ఛికంగా ఆవిడ బయటికి వస్తే నేను కనిపిస్తాను. ఆవిడ "మావారు కనిపించారా ఏమన్నారు ?" మొదలైన వడుగు తుంది. నేను నా వృథా ప్రయత్నము చెబుతాను. "నేను మా వారితో చెబుతాను" అంటుంది వెళుతుంది. నా కాకలి మాడిపోతూ ఉంటుంది. అప్పటికే అయిదారు మైళ్లు నడిచి

వచ్చి ఉంటాను. నా దగ్గర డబ్బులేదు. రెండు రూపాయలివ్వమ్మని అడగనా? వద్దా? అన్నము తిన్నావా అని అడగదు. అలాగే డొక్కలో కాళ్లు పెట్టుకొని రెండు మూడు రోజులు పడుకొన్నాను. ఆవిడ అన్నగారు ఏదో ఇంగ్లీషు పెద్ద పత్రికలో సంపాదకుడని విన్నాను. నా కా పత్రిక పేరూ తెలియదు. ఆయన చిరునామా తెలియదు. మీ మేన మామలు ఈ ఊళ్లో ఉన్నారని నాకు తెలుసు. వాళ్ల ఇంటిపేరు ఒక్కటే నాకు తెలుసు. ఇంటిపేరు చెప్పి అడిగితే. ఇక్కడ ఇంటిపేర్లన్నింటినీ ఒక్కొక్క ఇంగ్లీషు అక్షరం పంచు కొన్నది. ఎవరికి తెలుస్తుంది. ఆ సోఫియాని ఒకరోజున అడి గాను. ఆవిడ వినిపించుకోలేదు. నేనేమి చెయ్యాలో నాకు తెలియలేదు. ఒకరోజున ప్రొద్దున వాళ్ల ఇంట్లో నాకు బిస్కట్లు కాఫీ తెచ్చియిచ్చారు. తిననా వద్దా? దానికంటె ముందర ప్రశ్న. చావనా, బతకనా అని ఉన్నది. శరీరమాద్యం ఖలు ధర్మ సాధనం అన్నారు కదా! తినేశాను. కాఫీ తాగాను. అక్కడే కూర్చున్నాను. వాళ్ళ ఇంట్లోనే స్నానం చేశాను. వాళ్లు తిండికి రమ్మన్నారు. చావలేక తిన్నాను. మొదట నాల్గు రోజులు మనస్సులో యమయాతన అనుభవిస్తూ తిన్నాను. ఎల్లాగో అల్లాగా ఉద్యోగం అంటూవస్తే ఒక నెలజీతం వచ్చిన తర్వాత కావలిస్తే ప్రాయశ్చిత్తం చేసికొందామనుకొన్నాను. తరువాత నేను వాళ్ళువండే మాంసాలు పరిహరించటానికి కూడ వీలులేకపోయింది. ఎందులో మాంసముందో ఎందులో లేదో నాకు తెలియదు. నేను అడగటం వాళ్ళకి అవమానంగా

ఉంది. ఒళ్ళు నిండా మునిగినవానికి చలి ఏమిటని ఆయనతో తెగబడి ఉద్యోగ ప్రసంగం చేశాను. తనెప్పుడూ మంచి నిషా మీద ఉంటాడు. అతడు మంచినీళ్లెప్పుడూ తాగడు. మంచినీళ్ల బదులు మద్యమే తాగుతాడు. ఉద్యోగం వచ్చింది. ఇరవై రోజులయింది. ఇప్పుడు నేనాఫీసుకి ఆయన కారులోనే వెళ్తున్నాను. ఇంకొక పది రోజుల్లో నాకు జీతము వస్తుంది. నెలకు రెండువందల యాభై రూపాయలు. ఇప్పుడీ ఇంట్లో నేను సోఫియాకి సయాన తమ్ముడు. జాకబ్‌గారికి బావమరిది. మీ మేనమామల ఇండ్లన్నీ తిరుగవేసి వచ్చాను. చుట్టరికం చెప్పాను. జాకబ్ నన్ను ప్రేమగా చూస్తున్నాడంటే వాళ్ళందరూ గౌరవిస్తున్నారు. మా ఇంటికి ఉత్తరం రాశాను. అందులో ఇవేమీ రాయలేదు. మొదటికంటె ఇప్పుడు సోఫియాగారు నన్ను చాలా బంధువుగా చూస్తున్నది. నెల జీతము రావటముతోటే నేనే వేరే ఉంటాను అన్నాను. సోఫియా ఒక యాభై రూపాయలు నీవు ఉంచుకో! రెండు వందలు ఇంటికి పంపించు. మా ఇంట్లోనే ఉందుగాని. నీకేం ఖర్చవుతుంది? ఆయన కారులోనే వెళ్లుదువుగాని, ఆయన కారులోనే వద్దువుగాని. ఒక్క పడాదిపోతే నీకు నాలుగువందల ఉద్యోగం చేయిస్తానని ఆయన నాతో అన్నారు. నాలుగైదేళ్ళల్లో నీకు వెయ్యి రూపాయలవుతుంది. ఆయనకు నీ వంటే చాలా అభిమానంగా ఉంది అంటున్నది. దీనివెనక ఒక రహస్యమున్నది. జాకాబ్ గారికి పినతల్లి కూతురున్నది. ఆ పిల్ల తల్లిదండ్రులు చిన్నప్పుడే

పోయినారు. ఆమెను జాకాబే పెంచాడు ఆమె చాలా అంద కత్తె అంటే ఆఫ్రికాలో పుట్టవలసిన స్త్రీ. ఆమె బి. ఎ. ప్యాసు ఝుంది. ఆమెను బ్రాహ్మణునికిచ్చి పెండ్లి చేయవలెనని జాకబ్ గారి ఉద్దేశ్యము. నా అదృష్టము వాళ్ళ అదృష్టము బాగా ఉండి నేను కనపడ్డాను. ఈ ఉత్తరం మీ కెందుకు వ్రాస్తున్నా నంటే నా ఈ ఉద్యోగము నిలవాలంటే నేను ఆ మేరిని చేసికో వాలి. నేను దాన్ని ఎప్పుడైనా మేరీ అని పిలిస్తే జాకబ్ గారు తుహారీ అంటాడు. నా ప్రాణంలోపల మొదటి అక్షరం "తు" లోపిస్తుంది. అంటే నా ప్రాణానికది మహామారిగా ఉంది. ఈ సంగతి మీ మేనమామ కుమారులతో చెప్పాను. వాళ్లు "ఆ ఉద్యోగము వదలిపెట్టరా. మే మెక్కడోక్కడ ఇప్పిస్తా" మంటున్నారు. మీ బావమరుదుల్లో ఒకాయన ఎట్లాగూ చెడ్డావు. బంగారమంటి భవిష్యత్తెందుకు పాడుచేసికొంటా వన్నాడు. మీ ఇంకొక బావమరిదన్నాడు గదా. "ఏమి చెడ్డా వోయ్. ఈ ఊళ్లో మన తెలుగు బ్రాహ్మణ యువకులెంత మంది ఉద్యోగాలు చేస్తున్నారు ? పెద్దపెద్ద విందులకు పోతు న్నారా లేదా ? ఏది పడితే అది తింటున్నారా లేదా ? భేద మేమిటంటే వీళ్లప్పుడప్పుడు తింటున్నారు. అతడు పట్టుమని షైలనాళ్ళూ తింటున్నాడు" అని నాకు ఈ ఊళ్లో వేరే ఉద్యో గము సంపాదించాలంటే రెండు మూడు నెలలు పట్టేటట్టుంది. ఆఫీసు పనితో తీరికలేదు. ఆదివారాలుకూడా జాకబ్ ఆఫీసుకు పోతాడు. నన్ను రమ్మంటాడు. నేను వెళ్లితీరాలి. ఆయనతో

ఎప్పుడూ ఉండటం మూలమేమిగా ఆఫీసులో నేనంటే ప్రత్యేకమైన గౌరవము. జాకబ్ తరువాతనే నేను ఇలాంటి ఉంది నా స్థితి. కాని అక్కడికి ఇక్కడికి పీలుచేసికొని వెళ్ళి పరిస్నా ఉద్యోగం చేద్దామన్న ప్రయత్నము చేస్తునే ఉన్నాను. నా మనస్సులో నేనే ఒక ప్రశ్న వేసికొంటున్నాను. ఈ మేరీ అచ్చంగా కోతి గనక నేను తటపటాయిస్తున్నానా? ఆమె అందకత్తె అయితే నేను ఇంత సంశయిస్తానా? వాళ్ళు క్రైస్తవులు మనము బ్రాహ్మణులము అనే భావము ఉన్నది. కాని ఈ వ్యవహారము నా ఉద్యోగముతో ముడిబడి ఉన్నది. నా బ్రతుకుతో. ముడిపడి ఉన్నట్టున్నది. రెండు మూడు రోజులు ఆకలికి నిలవలేక వాళ్లు పెట్టింది తిన్నానుకదా. ఇప్పుడు భవిష్యత్తంతా బాగుచేసికోటానికి నా బ్రతుకు దీనికెందుకు సిద్ధపడదు? ఆమె అందకత్తె కాదు. నేనెంత చెడిపోయినానో అని నేననుకొంటున్నాను. ఇది బాగుపడటమే! బ్రాహ్మణ్యంగా చెడిపోవటమే! నాకెన్ని ఊహాలు వస్తున్నయ్యో చెప్పటానికి వీలులేదు. మతాలల్లో ఏమున్నది? ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క మతము ఉంటుంది. మతాలలో ఏముంది అని ఒక సారి. అందరూ స్త్రీలే. అందాన్ని కొరుక్కుతింటారా? అందము లేకపోతే మనుష్యులు కారా? అందరూ అందకత్తెలే పుడతారా అని ఒకసారి; చెడ్డచేనికి మూడు మంచెలేమిటి, గొంగట్లో తింటూ వెంట్రుకలు లెక్కపెట్టట మెందుకని ఒక సారి; నేనిట్లా అయితే మా అమ్మా నాన్నా ఏమౌతారు

వాళ్ళకి దుఃఖం తెచ్చినవాణ్ణవుతానని ఒకసారి; నా తమ్ముడు ఉన్నాడు. ఇక వాడు పెద్దవాడై వాళ్ల నాయకో వాళి అని ఒకసారి; మరి ఒకసారి ఇంకొక ఊహ వస్తుంది. నేను గొప్ప సంఘ సంస్కర్తనే అవుతాను. వర్ణాంతర వివాహాల అనే మహోద్యమంలో నేను కైలాస శిఖరంవంటి వాణ్ణౌతాను—ఇలా ఉంది కథ. సోఫియా క్రైస్తవ మతము పుచ్చుకో లేదు. అసలు జాకబ్బే ఎంతమటుకు క్రైస్తవుడో తెలియదు. వాళ్ళకి మతము లేదల్లే ఉంది. నేను మేరీని చేసికొంటే నేను క్రైస్తవ మతం పుచ్చుకోఖ్ఖర్లేదు. ఇందులో ఒక లాభముంది, మతము చెడనక్కరలేదు. ఆచారాలు ఇదివరకే చెడ్డవి—నేను మేరీని చేసికోను. ఇతరత్రా నాకు ఉద్యోగం దొరికేవరకు నా స్థితి తప్పదు. నేనీసంగతిని దాస్తే బాగుండేది. నా మనస్సులో నాకే సంశయాలు తెగటంలేదు. మీరు గొప్ప ఊహాశాలి యని నాకు తెలుసు. ఈ స్థితిలో నేనేమి చెయ్యవలయునో మీరే చెప్పవలెను. అందుకని వ్రాస్తున్నాను—ప్రేమతో సోమనాథ శాస్త్రి.

# 8

నాలుగు రోజులు వాళ్ళిద్దరు ఆ ఉత్తరాన్ని గురించి ఏమీ మాట్లాడలేదు సరిగదా ఇతరములైన విషయాలను గురించి కూడా మాట్లాడలేదు. పిల్లలు భోంచెయ్యటం ఆఫీసుకు వెళ్ళటం రావటము, నిద్దర్లు పోవటము ఇంతే అయిపోయింది. ఏదో ఒక శతఘ్నివంటిది గోళాకృతి వాళ్ళ ఇద్దరిమధ్య వచ్చి పడ్డది, అది ఎప్పుడో పేలుతుంది. ఇప్పుడు పేలుతుందని తెలియదు. ముట్టుకుంటే పేల్తుందేమోనని భయం. దానిని గురించి మాట్లాడటానికికూడా భయంగా ఉంది. ఆ స్థితిలో నున్నారు వాళ్లు, కాని ఈ మానవ ప్రకృతి చాలా విలక్షణమైనది. మానవునకు ఎంత భయము ఉంటుందో అంత ధైర్యముంటుంది. వాళ్ళకు తెలియకున్డా వైరాగ్యముంటుంది. ఒక ఆపదో ఒక సుఖమో ఒక దుఃఖమో వాటిదాక ఎందుకు ? అన్నిటికన్న పెద్దది మృత్యువు ఉన్నదికదా. అది అయినా సరే, అవి తటస్థించినపుడు దుఃఖపడతారు కష్టపడతారు అనుభ

విస్తారు. తరువాత పరిసిపోతుంది. తరువాత మళ్లీ బ్రతకటము మొదలు పెడతారు. అది వచ్చినప్పుడు తీవ్రముగా ఆలోచించటము తప్ప తక్కినప్పుడు ఎట్లా సాగితే అట్లే బ్రతుకుతుండటమే జీవయాత్ర అంటారు, చాలా నిజమైనమాట. ఒకదారి ఉన్నది. దారివెంట మనుష్యులు వెళుతూ ఉంటారు. దారిలో ఒక కాలవ ఉంది. వంతెనలేదు. అక్కడ ఆగుతాడు. దిగటానికి ప్రయత్నము చేస్తాడు. అవతలి ఒడ్డుకు చేరుతాడు. మళ్ళీ నడక ప్రారంభిస్తాడు. ఏ అడ్డూలేని దారివెంట నడుస్తూ ఉండటమే. సరిగ్గా అలాగే జీవయాత్ర. ఒక దుఃఖము వచ్చింది. అక్కడ ఆగుతాడు. అది కాల్వవంటిది. అది దాటుతాడు. మళ్ళీ నడక అంది పుచ్చుకోటమే. ఇందులో ఇంకొక విషయమున్నది. మానవుడు దారివెంట వెళుతూ ఉంటాడు. తరించరాని కాల్వ ముందర ఎక్కడో ఉంది. దాన్ని భావిస్తూ ఉంటాడు. నడుస్తూ ఉంటాడు. ఆ కాలువయో ఆ దుఃఖమో వచ్చినప్పుడే దానిని దాటటానికి ప్రయత్నించేది. తక్కినప్పుడు మనస్సులో లీలగా ఆ ఊహ ఉన్నా నడక నడకే — మరిన్నీ ఒక దుఃఖమో ఒక ఆపదో అది ఉన్నంతకాలమే. దానిని గురించి తీవ్రమైన బాధ. అది రాకముందు వస్తుందేమో అన్న కొంచెము భయముతో బ్రతుకుతూంటాడు. అది వచ్చి వెళ్ళిపోయిన తరువాత అయ్యో ఇలా జరిగిందే అన్న కొంచెము దుఃఖముతో మనమేమి చేయగలుగుదుమన్న కొంచెము వైరాగ్యముతో కొన్నాళ్ళు బ్రతుకుతాడు. గడచిపోయి పాతపడ్డ ఆపదను గురించి ఎక్కువ

ఆలోచించడు. ముందరెప్పుడో వస్తుంటున్న ఆపదను గూర్చి కూడ ఎక్కువ ఆలోచించడు. తాత్పర్యం విచారిస్తే మనుష్యుడికి బ్రతకటం ప్రధానము. జన్మ ఎత్తాడు. మృత్యువు ఉన్నది. ఎప్పుడో పోతాడు. ఈ మధ్య కాలములో బ్రతకాలి. ఇది ఒక్కటే ప్రధానమైన విషయముగా కనిపిస్తున్నది. ఒక మానవుని జీవితము ఎలాంటిదో ఒక జాతి జీవితముకూడ అలాంటిదే. ఒక దేశముయొక్క జీవితముకూడ అలాంటిదే. ప్రక్కదేశపు రాజున్నాడు. వాడు చాలా బలవంతుడు, క్రూరుడు. మన దేశముమీద పడి ఊళ్లు తగలపెట్టి మనుష్యులను చంపి దోచుకునేందుకు సిద్ధముగా నున్నాడు. వాడు వస్తాడని మనకు తెలుసు. ఎప్పుడు వస్తాడో తెలియదు. వాడు వచ్చి మనలనందఱను చంపి వేసేటంతమటుకు మనము బ్రతకటము మానివేశామా? వాడు వస్తాడు ప్రతిక్రియ ఏమిటి అని ఆలోచించను కూడ ఆలోచించరు కొందరు. ప్రతివాడు ఆ నిస్సంశయంగా జరిగే పని జరగదని అనుకొంటాడు. ఎవరో వచ్చి అడ్డుపడతారనుకొంటాడు. భగవంతుడు అంత ఘోరకృత్యం జరగనిస్తాడా అనుకొంటాడు. మానవునియొక్క ఊహా పద్ధతియే ఆశ్చర్యము. పౌరుషము దైవము అని రెండు ఉన్నవి. సామాన్యుడైన మానవుడు దైవముమీద ఆధారపడతాడు. ఇది మానవ ప్రకృతి. ఆ దైవము జరిగేదాన్ని ఆపదు. అట్లా జరుగవలసి ఉంటే జరిగి తీరుతుంది. అది ఆ సామాన్య మానవుడికి తెలుసు. తెలిసి ఎందుకు నిష్క్రియత్వాన్ని అవలంబిస్తాడు అంటే ఏమి

చెప్పాలి ? సర్వ మానవులు అనంతకాలమునించి అనంత దేశా ల్లో పుడుతున్నారు చస్తున్నారు. ఒక దేశంలో ఒక కాలంలో పరిస్థితులు శాంతముగా జరుగుతున్నవి. ఆ దేశములోనే నాలెదు తరాల మానవ జీవితం వ్యాధులు వచ్చి అకాల మృత్యువు వచ్చి చనిపోయిన జనమే కాని యుద్ధాలవల్ల ఘోరమైన పరరాజుల దుష్కృత్యాలవల్ల దేశము ఘూర్ణితము కాలేదు. మరి ఇంతలో అన్ని ఆపదలు వచ్చినవి. అన్ని దేశాలలోను ఇట్లాగే జరుగు తున్నది. ఈ మానవ జీవితము ఇంతే అనే మహా యథార్థ్యము కొందరి బుద్ధులకు దృఢపడితే వాడు కొంత నిష్క్రియుడవు తాడు. అందులో కొంత వైరాగ్యము ఉన్నది. ఈ తెలియని వైరాగ్యం, విస్పష్టంగా రూపుకట్టని వైరాగ్యము కొందరు మానవులయందు ఉంటుంది. నాగరకుడై ఆలోచనాశీలుడైన వానియందు ఆలోచనా రూపంగా ఉండి కొంత క్రియా రూపము తాలుస్తుంది. అనాగరకునియందు దానిని గూర్చిన ఆలోచన ఉండదు. వాడి పౌరుష ప్రయత్నము అధికంగా ఉంటుంది కాని సర్వకార్య ఫలమునకు వాడు అధినేత కాడు. వాడుచేసే పనులల్లో వాడికి నైష్ఫల్యము సిద్ధిస్తూనే ఉంటుంది. వాడు దానిని లెక్కచేయడు. కాని తనయొక్క అసామర్థ్యము తన శక్తి కతీతమైనదేదో ఉండటము వానికికూడ అంత రాత్మలో తెలుస్తునే ఉంటుంది. వైరాగ్యము యొక్క పరమ బీజం సూక్ష్మంగా అది ఉండనే ఉంది. హఠాత్తుగా జరిగి ఒక అరిష్టము తత్కాలమందు విస్మయాన్ని దుఃఖాన్ని కలిగిస్తుంది

రోజులు గడచినకొద్దీ ఈ విస్మయ దుఃఖములు తగ్గిపోతూ ఉంటవి. జీవితములో ప్రధానమైనది బ్రతకటం. అందుచేత తగ్గి పోతూ ఉంటవి. ఏది ఎట్లా జరిగినాసరే మనకు చావు రాకండా ఉంటే సరి మనము బ్రతకటమే, బ్రతికినప్పుడు మనము చేసేవని మనము చేస్తూ ఉండటము.

నాలుగు రోజులయిన తరువాత కమల చిదంబరంతో అన్నది "ఆయన వ్రాసిన ఉత్తరానికి ఏమైనా సమాధానం వ్రాశారా ?"

"నీవేమి మాట్లాడలేదు. అందుచేత నేను ఊరుకున్నాను."

"ఆ ఉత్తరంలో నా ప్రసక్తికూడా లేదు. ఏమి చెయ్యమంటారు అని మిమ్మల్నే అడిగాడు."

"దారివెంట వెళుతున్నాము. దారి కంటకాకీర్ణముగా ఉన్నది. నడుమ ఒక నది అడ్డము వచ్చింది. నదిలో దిగితే ఈ ముళ్లులేవు, నదివెంట కొట్టుకపోతే అసలు ముళ్లే తగలవు. నది ఒడ్డున నిల్చొని నీవు నా చెల్లెలి భర్తవు. ఈ నది అందుతుందా అందదా నాకు చెప్పు. దిగమంటావా వద్దంటావా ? నీకీ నది సంగతి తెలుసుకదా. నీ మేనమామకూతు రిదివరకే దిగింది. కనుక నీకు తెలుసునని అడుగుతున్నాను. దిగమంటావా వద్దంటావా అని నన్నడిగితే నేనేమైనా చెప్పగలుగుదునేమో ? ఈ బాట ముండ్లబాటగా ఉంది. అక్కడ ముళ్లులేవు. అల్లా వెళ్ల

అని చెప్పేవాణ్ణేమో ! ఈ నదిలో దిగి కొట్టుకపోవట మెందు కయ్యా పదిమైళ్ళు ఎగువకిపోతే అక్కడ ఆనకట్ట ఉన్నది అని చెప్పేవాణ్ణేమో! నదిలో దిగాడాయె. ఉక్కిరి బిక్కిరౌతున్నా డాయె. నేను వెళ్ళి అతని నివతలకు తీసికొచ్చేందుకు నాకు ఈత చాతకాదాయె. అతడిప్పు డే స్థితిలో నున్నాడంటే ఆయుర్దాయముంటే బ్రతుకుతాడు లేకపోతే కొట్టుకపోతాడు. కొట్టుకపోతూ ఉంటే ఏ పల్లెవాడైనా రక్షిస్తాడేమో తెలి యదు. నాకొకటి జ్ఞాపకం వస్తున్నది; నీవింకా కాపరానికి రాలేదు. నాకు ఉద్యోగమూ రాలేదు. మీ అన్నయ్య ఇప్పు డే స్థితిలో నున్నాడో నేనూ అప్పు డా స్థితిలోనే ఉన్నాను. నా కప్పుడు పద్దెనిమిదేండ్లు ఇంకా మీ అన్నయ్య బి. ఎ. ప్యాసయినాడు. నేను స్కూలుఫైనలే. నాకు ఏదో డబ్బు కావలసి వచ్చింది. పది రూపాయలు కావాలి ఎవరిస్తారు ? అవనిగడ్డలో మా పెదతల్లి కొడుకు ఉద్యోగము చేస్తున్నాడు. అతనిని తత్పూర్వం ఒకటి రెండుసార్లు అడిగితే రెల్లు మూళ్లు ఇచ్చాడు. వాణ్ణడుగుదాం వెళ్ళి అనుకొన్నాను. వెళ్ళాలి అంటే రేపల్లెలో రైలుదిగి కృష్ణదాటి అయిదారు మైళ్ళు నడిచిపోవాలి. రేపల్లెలో ప్రొద్దున్నే బయలుదేరాను. అది వేసవికాలము. కృష్ణ ఆటుమీద ఉన్నది. కృష్ణ దాటాను. మోకాటిలోతు వచ్చింది. అవనిగడ్డ వెళ్లాను. అతనితో చెప్పాను. అతడు పది రూపాయలు ఇచ్చాడు. ఇచ్చాడు గన కనే నాకు ఇంటర్ మీడియట్ అయింది బి. ఎ. అయింది.

యం. ఏ. కూడా అయింది. ఆ పది రూపాయలు కావలసిన ఘట్టం అట్లాంటిది.

మధ్యాహ్నం ఏ నాలిగింటికో బయలుదేరాను. కృష్ణ దగ్గరకు వచ్చేటప్పటికి ఆరున్నర అయింది. ఆ స్థలం నిర్జనంగా ఉంది. నది పోటుమీద ఉన్నది. పోటు తీస్తున్నట్లుగా అనిపించింది. ప్రొద్దున నాకు వచ్చిన మోకాటిలోతు నీళ్లు ఒక యాభై గజాలమేర ఉంటుంది. ఇప్పుడింకొక పాతిక గజాలమేర ఉన్నవి నీళ్లు. నేనేమనుకొన్నానంటే ప్రొద్దున మోకాటిలోతే గదా మహా వస్తే కంఠంలోతు వస్తవి అని అనుకొన్నాను. ఎందుకంటే ఏడున్నరకి అక్కడ రైలు ఉంది. పోయి ఎక్కితే మరునాటి ప్రొద్దుటికి కొంపకు చేరవచ్చుకదా అని గుడ్డలన్నీ ఊడతీసి మూటకట్టి నెత్తిన పెట్టుకొన్నాను. ఒక చిన్న ఉత్తరీయము కట్టుకొని దిగాను. అయిదారు గజాలుకూడా వెళ్ళ లేదు. పుక్కిలింత లవుతున్నది. అడుగువేస్తే చావటమే. ఏదో నాకు కొంచెము ఈతవచ్చు. ఈతకు వెడితే గుడ్డలు కృష్ణార్పణం ! ముందరికి వెళ్ళటం ఎట్లాగులేదు. వెనక్కి తిరిగి రావాలి. కాలుతీస్తే క్రింద ఇసక కొట్టుకపోతున్నది. వల్లమవుతున్నది. వెనక్కి వెనక్కి అడుగులు వేసుక వద్దామా అంటే సాధ్యము కావటము లేదు. ఎల్లాగో ఒక అల్లాగ వెనక్కి తిరగాలి. నాలుగడుగులు వెయ్యాలి ఒడ్డెక్కాలి. అప్పటి నా స్థితి భగవంతుడికి తెలుసు. ఎట్లాగో వెనక్కి తిరగటం జరిగింది. ఒడ్డుకేసి నాలుగడుగులు నెమ్మది నెమ్మదిగా వేశాను. బ్రతికాను.

బ్రతక్కపోతే ఇట్లాంటి మీ అన్నయ్యా నీకు రెండో పెళ్ళిచేసే వాడే. ఆ సంఘ సంస్కర్తలకు ఇంకొక విధవా వివాహాన్ని చేసే పుణ్యం తప్పించావు. ఎందుకు చెప్పావంటే అట్లా నడి ప్రవాహంలో చిక్కుకొన్న వాణ్ణి తప్పించేవాడు భగవంతుడు తప్ప ఇంకొక్కడు లేడు. ఇందాక చెప్పానుకదా. నేను గజ ఈత గాణ్ణి కాను. అంటే నే నతనిని పోషించలేను. నేను పడవల పల్లెవాణ్ణి కాను. అంటే ఉద్యోగా లిప్పించలేనని అర్థము.

"అందుచేత మాట్లాడకండా ఊరుకుంటారా ?"

అతని కక్కడ రెండువందల యాభై రూపాయల జీతం. ముందునాటికి నాల్గువందలు. నాలుగేళ్ళల్లో వెయ్యి. నా జన్మలో కాదు. మేరు పర్వతం ఎత్తుపడితే మన ఇంటిప్రక్క రోడ్లకోసం బ్రద్దలు కొట్టబడే చిన్నగుట్ట "నే నాశ్రయ మిస్తా" నన్నట్లుంది."

"ఆ మేరు పర్వతం దేవతలు నివాసముండే స్థలం. అది భోగభూమి ఆ బంగారాన్ని చూచి సంతోషించాలిసిందే తప్ప రోడ్లు వెయ్యటానికి రాదు. వంతెనలు కట్టటానికి రాదు. మేఘాలను ఆపదు. వాన కురిపించదు. దాని క్రింద పండే పంటలు లేవు. ఈ గుట్ట కొద్దిలో అన్నీ చేస్తుంది."

"ఆ మేరు పర్వతానికి ఈ గుట్టలెక్కా. సైగా ఇక్కడికి వస్తే మందు కూరటం పగిలించుకోవటము."

"ఆ ఉత్తరం చూస్తే ఆ మేరు పర్వతం ఈ చిన్నగుట్టని మార్గ ముపదేశించమని అడుగుతున్నదిగా."

"నేను నా పెళ్లాం బిడ్డల్నే పోషించుకో లేకండా ఉన్నాను. మీ అన్నయ్యను తీసుకవస్తే ఒకవేళ అతనువస్తే అతని తిండికూడ నేను భరించగలనా ? అతని ఉద్యోగ ప్రయత్నాలకు అది వచ్చేవరకు నెలకేపాతికవరకో అవుతవి. అన్నింటి కంటె అత నిక్కడికి రావటానికి నలభైయో యాభైయో పంపించాలి."

"వాళ్ళు ఈ పథకం వేసికొనే అతన్ని పిలిపించారను కొంటా. లేకపోతే రైలుచార్జి పంపించటమేమిటి ? పది పది హేను రోజులు త్రిప్పటమేమిటి ? తిండిలేకండా మాడ్చట మేమిటి ? పైకి ఔదార్యమల్లే కనిపిస్తున్నది. విషమంతా లోపల ఉన్నది. ఈ సంఘ సంస్కారులు ఈ లోకోపకారులు ఈ ఉదారులు వీళ్ళల్లో నూటికి తొంభై తొమ్మండుగురు ఇలాంటివాళ్ళే. తమ మతములోకి మార్చుకునేందుకు తమ సిద్ధాంతాల నాచరింపజేసేందుకు ఈ పేరున చందాలు వసూళ్లు చేసి తమ జీవితాలు సుఖముగా గడుపుకొనేందుకు ఇలాంటి పనులు చేస్తుంటారు. పది యెకరాల ఆశ్రమం. అందులో వీళ్లు చందాలమీద బ్రతకటం. తిండికెప్పుడూ భయములేదు. చివరికి ఆ ఆస్తి అంతా వాళ్ళది. లేదా అది ఒక సంస్థ- అట్లాంటివాళ్లు మరికొందరు తరవాత బ్రతకవచ్చు."

"ఇవ్వాళ మీ అన్నయ్య చిక్కున పడ్డాడు గనక కోపం కొద్దీ మాట్లాడకు. వాళ్ళు అచ్చంగా మంచిపని చెయ్యటం లేదనకు. వాళ్లు అది మంచిపని అనే అనుకొంటున్నారు మన దృష్టితో అది కాకపోవచ్చు. వేదమతము ప్రచారము చేసేందుకు ఆశ్రమం పెట్టాడనుకో. అక్కడా నువ్వుచెప్పే దోషం పడుతుందికదా. మనము వేదమత మొక్కటే నిత్యమైన మతము అంటాము. అది ఒక్కటే యథార్థమైన మతము అంటాము, వాదిస్తాము ఋజువు చేస్తాము. వాళ్ళు వాళ్ళ మతాలనుగురించి అట్లాగే అనుకొంటారు. ఇవన్నీ మానసికములైనవి. ఆలోచనలతో కూడినవి. ఇంత అశాశ్వతమైన మానవ సృష్టి తత్కాలమందు దానికి నిలుకడ ఉన్నది. కనీసం ఎనభై యేళ్ళయినా ప్రతివాడు బ్రతికే ఉంటాడు. ఈ ఎనభై యేళ్లు అన్నోదకాలు ఉండితీరాలి. నా కన్నం లేకపోయినా సరేనేను నా మతం వదలుకోను. నేను చచ్చినాసరే వదలుకోను అనే వాళ్ళు ఉంటారు, ఉన్నారు. తురకలు పూర్వం తమ మతంలో కలవలేదని వేలమందినో లక్షలమందినో మనదేశంలో చంపారు. బ్రతకటంకోసం చాలామంది వాళ్ళల్లో కలిశారు. అట్లాగే గోవా మొదలైనచోట్ల పూర్వము క్రైస్తవమత ప్రచారకులు చేశారు. బాధలు పెట్టారు. హింసించారు. చేతులు పైకి బిగించికట్టి వ్రేలాడతీసి కాళ్లకు రాళ్ళు కట్టారట. కొందరట్లా చావనైనాచచ్చారు కాని మతము మార్చుకొనలేదు. కొందరు బ్రతకటంకోసము ఏదైనా చేస్తారు. కొందరు చెయ్యరు. ఈ

రెండు మతాలు రానప్పుడు ఇట్లా చచ్చిన మనుష్యులు లేరు. మనుష్యులు సహజముగా ఎన్నివిధాల చస్తారో అన్నివిధాలా అప్పుడూ చచ్చారు. మనుష్యులకు న్యాయంగా చద్దామని పిస్తుంది. ఇలాంటివి విపరీతపు చావులు. వరదలువచ్చి ఊళ్ళు మునిగి కొందరు చస్తారు. ఊళ్ళు ముట్టుకొని ఇండ్లు తగలబడి కొందఱు చస్తారు. విమాన మంటుకొని చస్తారు. రైళ్ళుపడి చస్తారు. చిన్నతనంలో చస్తారు. ఇంకొక దేశమువాళ్ళు దాడి చేసి కొందరిని చంపుతారు. తమ మతము పుచ్చుకోలేదని అధి కారంగలవాళ్ళు కొందరిని చంపుతారు. ఇవన్నీ విపరీతపు చావులు. ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క దేశంలో అన్నీ ఉంటవి. ఎవడు చెప్పగలడు. ఒక్కమాట చూడు. భారతదేశం రెండుగా విభక్తమైంది. ఇటు ఇండియా, అటు పాకిస్తాన్. ఆ గాంధార పాంచాల దేశాలలోఉన్న జనం లక్షలు చచ్చారు. ఆ ఎద్దడి దక్షిణాదికి లేదు. దేశం ఒకటే. ఒక ప్రాంతంలో ఉంది. ఒక ప్రాంతములో లేదు. సమాధానము ఏమన్నా ఉందా ? బయట అన్నీ కారణాలే ! అసలు కారణమేమిటి ? అన్నింటికి ఒక్కటే కారణము ! కర్మ—

## 9

ఒకరోజున కమల తండ్రి వచ్చాడు. ఆయన కూతుర్ని చూడ్డా నికి రావటము ఎప్పుడూ జరగదు. ఇదివఱకు జరుగలేదు. కమల కాపురానికి వచ్చిన ఆరేళ్ళల్లో ఆమె పుట్టింటికి వెళ్ళింది రెండుసార్లు. ఆ రెండుసార్లు సోమనాదిశాస్త్రియే వచ్చాడు. చెల్లెల్ని తీసికెళ్ళాడు. తండ్రి వచ్చాడంటే కమల బ్రహ్మా నందము పొందింది. కాని వెంటనే స్ఫురించింది. అన్నగారి విషయము ఆయనకు కూడ తెలిసిందేమో. అల్లుడితో మాట్లాడ టానికి వచ్చి ఉంటాడు అని కాళ్లు కడుక్కునేందుకు నీళ్ళి చ్చింది. తల్లియొక్క తమ్ముడియొక్క క్షేమ మడిగింది. అన్న గారి విషయము అడగలేదు. అన్నయ్య విషయము అడగవేమని ఆయన అనలేదు. ఆ అడక్కపోవటములోనే అతని సంగతి ఇద్దరికి తెలిసింది అనే విషయము ఇద్దరికి అర్థమైంది. చిదంబరం రాత్రి ఎనిమిది గంటలకు వచ్చాడు. కమల పిల్లలిద్దరూ కూడ తాతగారి దగ్గరకు వెళ్లలేదు. కొడుకు తాతగారిని రెండేళ్ళ

క్రింద చూచినా తాత తాతా అని ఇంట్లో అనుకోటమే తప్ప వాడికి గుర్తులేదు. తల్లి చంక కెత్తుకొని తాతయ్యా ఏడిరా నాన్నా అంటే ఆయన్ని చూపిస్తాడు కాని ఆయన దగ్గరకు వెళ్ళమంటే వెళ్ళడు. అసలాయన కే పిల్లలను దగ్గరకు తీసే అలవాటు లేదు.

రాత్రి భోజనాలయినవి. పిల్లలు నిద్రపోతున్నారు. ఇంట్లో పని చేసికొని కమల వచ్చింది. చిదంబరానికి తన కొడుకు సంగతి తన మామగారికి తెలియదని ఏదో పనిమీద వచ్చాడని. అతనే తాను స్వయంగా ఉత్తరం వ్రాశాడు గనక తనకు తెలుసుగాని లేకపోతే తనకుమాత్ర మెట్లా తెలుస్తుంది. మామగారెందుకు వచ్చినట్లు? ఆయన దావాకోరు కాడు. ఆయన కేమి పనిలేదు. కూతుర్ని చూద్దామని వచ్చేటంత అప్యాయత కలవాడు కాదు. అందుచేత చిదంబరం యోగక్షేమా లడగటం పిచ్చాపాటి మాట్లాడటం అయిన తరువాత అడగటం అవసరం యేమీలేని ప్రశ్న ప్రశ్నకానట్టు అన్నాడు "అత్త గారు మీ అమ్మాయిని చూచి రమ్మని పంపించారా?" అని అందులో అన్ని అర్థాలు ఉన్నవి. మీ అంతట మీరు రారని ఉన్నది. ఇంకేమైనా పని ఉండి వచ్చారా అని అడగటం ఉన్నది. సోమనాథశాస్త్రి విషయం మామగారికి తెలిస్తే ఆయ నంతట ఆయనే చెప్పవలె అన్నదికూడ ఉన్నది. తాను మాత్రము చెప్పడు. తనభార్య చెప్పకండా కట్టుదిట్టంచేశాడు. ఆవిడ చెప్పేదైతే భర్త రాకముందే తండ్రితో ఆ విషయం

ప్రస్తావన చెయ్యాలె. కమల ఆ తండ్రికి కూతురే. తండ్రికి ఎంత గుంఫనో కూతురి కంత గుంఫన. సోమనాథశాస్త్రి తల్లిని బోలి పుట్టాడు. తండ్రినిపోలి పుట్టిన కూతురు, తల్లిని బోలి పుట్టిన కొడుకు అదృష్టవంతులంటారు. కమల అదృష్టవంతు రాలనే అనుకొంటారు ముత్యాలవంటి పిల్లలు. ఆవిడ కాపరా నికి వచ్చినప్పటినించి మొగుడు పెద్ద పరీక్షలు ప్యాసయి చేతికి నోటికి ఎడములేకండా సంపాదిస్తూనే ఉన్నాడు. ఆమెను భర్త చాలా ప్రేమిస్తాడు. ఇద్దరు వివేకవంతులు. అదృష్టము కాక యేమి? ఇంక తల్లి పోలిపుట్టిన సోమనాథశాస్త్రి అదృష్టం విచారించాలె. ఆ అదృష్టం మొదలు పెట్టినదల్లే ఉంది.

అల్లుడిట్లా అడగటంతోటే మామగారేమి మాట్లాడ కండా ఒక ఉత్తరంతీసి అల్లుడి చేతికిచ్చాడు. అల్లుడు ఏమిటి అని అడిగితే 'నువ్వే చూడమ'న్నాడు. ఆ ఉత్తరంలో రెండు మాటలు. "సీతారామశాస్త్రిగారికి గంగాధరం వ్రాయునది. నేనెవరో మీకు తెలియదేమో. మీ అల్లుడు చిదంబరం నాకు మేనల్లుడు. మీ అబ్బాయి సోమనాథశాస్త్రి ఈ ఊరు వచ్చాడు. ఒక క్రైస్తవులపిల్లని పెండ్లి చేసికొనే స్థితిలో ఉన్నాడు. అత నికి వాళ్ళేదో ఉద్యోగము ఇప్పించారు. ఈ ఉత్తరం మీకు వ్రాసే అధికారము నాకులేదు. నా ఒకకూతురు నా కా అధికారము లేకుండా చేసింది. నేను నా దుఃఖాన్ని పట్టుకో లేక వ్రాస్తున్నాను. ఇంకా పెళ్ళికాలేదు. నా సంగతి మా మేనల్లుణ్ణి కనుక్కుంటే తెలుస్తుంది. ఈ ఆపద మీరు తొలగించు

ోటానికి ప్రయత్నిస్తే ఎంత వ్యయమైనా సరే నేను భరిస్తాను".
ఇదీ ఉత్తరం :—

చిదంబరం చదివాడు. తన మేనమామ ఎంత దుఃఖపడుతున్నాడో తెలిసింది. ఒక విధమైన నిస్సహాయ స్థితిలోనున్నాడని గ్రహించాడు. ఆయన ఈ ఉత్తరం వ్రాయటమే ఆశ్చర్యం వేసింది. ఆయన జీవితంలో నలభై యేండ్లయినా వెయ్యి మొదలు మూడు వేలవరకు జీతము సంపాదించినవాడు. సంసారాన్నంతా బాగుచేసినవాడు. అందరికి చదువులు చెప్పించాడు. పెండ్లిండ్లు చేశాడు. ఎంత చేడ్డా ఆయనదగ్గర మూడు నాలుగు లక్షలయినా ఉంటవి. వాళ్ళకి ఢిల్లీలోనే ఒక ఇల్లుంది. వాళ్ళ ఊళ్ళో ఒక పెద్దమేడ వేశాడు. అంతా స్వార్జితము; కాని ఇంతమట్టుకు నలుగు రన్నదమ్ములు పంచుకోలేదు. తక్కిన ముగ్గురన్నదమ్ములు కూడా బాగానే సంపాదిస్తున్నారు. వేయికి తక్కువ జీతంవాళ్ళు ఆ నలుగురన్నదమ్ముల్లో ఎవ్వరూ లేరు ముగ్గురన్నదమ్ములు అన్నగారు గీసిన గీతకు దాటరు. అందరికి పిల్లలున్నా అందరి పిల్లలు సంపాదన చేస్తున్నా ఒక సమిష్టి కుటుంబముగానే ఉంటారు. పెదతండ్రి మాట[illegible]దనే పిల్లలు ఆ కుటుంబములో ఇద్దరే. తన మూడవ మేనమామ బిడ్డలు. ఆయన పెద్దకొడుకు ఇంగ్లీషు పత్రికాధిపతి. పెద్దకూతురు సోఫియా. పెద్ద మేనమామ గంగాధరం.తమ్ముడి కూతురు ఇలాచేస్తే ఆయనకి తన కూతురే చేసినట్లున్నది. ఆ సోఫియా తన పెదతండ్రినే లెక్కపెట్టదు. తనతండ్రిని లెక్క

పెడుతుందా? చిదంబరానికి వాళ్ళ సంసారముతో రాకపోకలు లేవు.ఎప్పుడో చిన్నప్పుడొకసారి వాళ్ళందరిని వాళ్ల పల్లెటూళ్లో చూశాడు. అప్పటికి సోఫియాకూడా చిన్నదే. ఆ గంగాధరం గారు ఎంత ఉదారుడు ? తన బావమరిదిని ఈ వ్యూహం లోంచి తప్పించేందుకు ఎంతపడితే అంత ఖర్చు పెడతానంటు న్నాడు. కొంతసేపు ఆలోచించి చిదంబరం తన మామగారితో ఇలా అన్నాడు. "సోమనాథం నాకు ఉత్తరం వ్రాశాడు. ఇందులో భయపడవలసినదేమీ లేదు. అత నా పిల్లనేమీ ప్రేమిం చటములేదు. అతనికి సంఘసంస్కార బుద్ధిలేదు. వాళ్ళు అతన్ని ఇరకటంలో పెట్టారు. అతనికి ఈ గంగాధరంగారు మంచి ఉద్యోగము ఇప్పిస్తే అత నివతలికి వచ్చేస్తాడు. మీరాయ నకి ఈ సంగతి వ్రాయండి" అన్నాడు. అంటే మామగారు "ఆయన మీకు గదా ఉత్తరం రాసింది. మీరు వ్రాస్తేనే బాగుంటుంది. వాళ్లు నాకు మేనమామలే కాని నాకు వాళ్లకి అంత సయోధ్య లేదు. వాళ్లింకొక మతం పుచ్చుకోలేదు తప్ప వాళ్ళేం తక్కువవాళ్లు కారు. తింటారు తాగుతారు. ఇక ఏమిటయ్యా అంటే తద్దినాలు పెడతారు. పెళ్లి రేపయితే ఇవ్వాళ ఉపనయనాలు చేస్తారు. వాళ్ళఇంట్లో విభూతిగడ్డ ఉండదు. తిరుపతి వెంకటేశ్వరుని పటాలు ఉంటవి. ఆడవాళ్లు పూజలు చేస్తుంటారు. నేను చూడలేదు సుమండి ఊహించి చెబుతున్నా. సోమనాథము ఏమీ చెడిపోలేదు. ఈ కాలాన్ని పట్టి చెడిపోయినాడని అనుకోటానికి వీలులేదు. చిన్న చిన్న

పట్టణాల్లో ఉండే మనకు వాళ్ళసంగతి సరిగ్గా తెలియదు. వాళ్ళు బ్రాహ్మణులు కాదు. హిందువులు మాత్రమే. హిందువులైనా ఎటువంటి హిందువులు ? ఇతర మతము పుచ్చుకో లేదు గనక హిందువులు. మీరు వెళితే వాళ్ళఇంట్లో మంచినీళ్లు కూడ త్రాగలేరు. వాళ్ళఇళ్ళల్లో వంటలు చేసేవాళ్ళు బ్రాహ్మణులుకారు. వాళ్ళు యథేచ్ఛంగా పడమటిళ్ళల్లో తిరుగుతారు కనుక మీరు ఉత్తరము వ్రాయండి. ఏమని అంటే "మావాడు ఆ పిల్లను ప్రేమించటములేదు. జాత్యంతర వివాహాలు వర్ణాంతర వివాహాలు జరిగితేనే ఈ జాతికి ముక్తి అనే సిద్ధాంతము మావాడికి లేదు. వాడు రెండేళ్ళు ఉద్యోగము కొఱకు తిరిగాడు. దొరకలేదు. ఉద్యోగము లేకపోయినా ఫరవాలేదు అనే తాహత్తు మాకులేదు. మీరు పెద్ద ఉద్యోగము చేసి విరమించినవారు. మీ తమ్ములు పెద్దపెద్ద ఉద్యోగాలలో ఉన్నారు. నెలకే మూడువందలో వచ్చే ఉద్యోగము కొంచెము శాశ్వతమయింది. మీరు వాడికిప్పిస్తె వాడా వ్యూహంలోంచి బయటికి వస్తాడు. నాకీ సహాయం చేసిపెట్టండి" అని వ్రాయండి. అంటే మామగారన్నాడు "ఈ సంగతి ఆయన గ్రహించలేడంటావా ?"

చిదం : గ్రహించే ఉంటాడు. కాని ఈ లోకం చమత్కారమైంది. మతాలు సిద్ధాంతాలు వాటియందభిమానాలు. వ్యక్తులయందు జాలిలేదు. 'నేను పేదవాణ్ణి. ఇవ్వాళ నా ఇంట్లో బియ్యముకూడ లేవు. ఒక రూపాయి ఇప్పించండి'

అని ఒక ధనవంతుణ్ణి ఒక పేదవాడు అడిగితే ఆయన ఇవ్వడు 'లేదు పొమ్మంటాడు.' ఇంతలో ఎవడో ఒక పెద్ద ఉద్యమమని వస్తాడు. ఒక పెద్ద సభ చేస్తున్నామని వస్తాడు ఎవరికో షష్టి పూర్తి చేస్తున్నామని వస్తాడు. ఆ ధనవంతుడే పదిరూపాయలు ఇరవై రూపాయలు చందావేసి ఇస్తాడు. ఈ కాలంలో వ్యక్తి గత జీవితానికి ప్రాధాన్యం పోయింది. సంఘగత జీవితానికి ప్రాధాన్యం వచ్చింది. వ్యక్తుల సముదాయము సంఘమన్న జ్ఞానము పోయింది. ఆలోచన లేదు. ఎవడు చచ్చినా సరే మిగిలినవాళ్ళు సంఘం. ఆ సంఘానికి చేస్తాడు. మీవాడు వ్యక్తి. ఏదో ఆకాశి పోకాశి చుట్టరికం అతనంటే లెక్కలేదు. అతని కుద్యోగం ఇప్పించాలన్న శ్రద్ధలేదు. అందరికీ ఎక్కడిప్పిస్తాం అన్న పట్టించుకోనితనం. వాళ్ళందరూ లక్షాధికార్లు. సోమనాథానికి అన్నము పెట్టినా అయిదారునెలలు పెట్టవచ్చు. వాళ్ళ ఇంటికి వెళ్లితే మాట్లాడుతారా గౌరవిస్తారా? సాక్షాత్తు మేనల్లుణ్ణి నేను వెళితే దిక్కులేదు. వాళ్ల కూతుళ్ళల్లో ఒక కూతురికి నేను మొగుణ్ణి కావటానికే పనికిరాను. ఇంక బావ మరిది విషయమా? తన తమ్ముడి కూతురు అట్లా చేసింది. ఆయనకు ఆవెట్ట ఎక్కింది. ఎవడో ఈ పనిచేస్తే పట్టించుకొనేవాడో కాడో? సోమనాథశాస్త్రితో ఏదో చుట్టరికం ఉన్నది. ఆ పెండ్లి మానిపించటానికి డబ్బిస్తాడు. ఒక గొప్ప లక్ష్యం కోసం ఆ డబ్బు వ్యయపెట్టినట్లర్థం. వేద మతాభిమాని ఉపనిషన్మతాభిమాని అనిపించుకోవాలని. మీవాడి ఉద్యోగమిప్పిం

చటం నేసే విషయం కాదా ? ఇక్కడ ఉన్నది రహస్యం. నే నింకొకటి చెబుతున్నాను. మీరు పెద్దలు. మీకు తెలియని విషయము లేదు. మనమందరము బ్రతుకుతున్నాము. ఎవడి కర్మ వాడిది. కొంత సామూహిక కర్మ ఉంటుంది. కొంత వైయక్తిక కర్మ ఉంటుంది. అంత హిందూ మతాభిమాని తమ్ముడి కూతుర్ని రక్షించుకోలేక పోయినాడేమి? తమ్ముడి కొడుకు మన సంప్రదాయాలని యథేచ్ఛంగా విమర్శిస్తూ ఉంటే కాదని చెప్పలేక పోయినాడేమి ? కాదు అంత మన మతాన్ని ఆచారాలని విమర్శించే ఆ తమ్ముని కొడుకు తానొక హరిజన బాలిక నెందుకు పెళ్లి చేసికొనలేదు ? ఆ సంపాదకుడికి పెళ్లి జరిగింది. పెండ్లికూతురు బ్రాహ్మణ బాలికే. ఏ ఆచారా లని విమర్శిస్తూన్నాడో ఆ ఆచారాల ప్రకారమే పెళ్లి చేసి కొన్నాడట. నాకు శుభలేఖ వచ్చింది. నే నా పెళ్ళికే వెళ్ళితే ప్లేన్ మీద వెళ్ళాలి. నాకు రైలుమీదనే మూడవ తరగతికి డబ్బు లేదు. ఒక వేళ వెళితే ఆ వేల జీతగాండ్ల మధ్య నే నెవరను? ఆ సోఫియా నన్ను 'బావా' అంటుందా ? అంటే దాని కెంత గౌరవనష్టం. ఆ పెళ్లికొడుకు 'ఏరా చిదంబరం' అని నన్ను పలకరిస్తాడా ? నేను చెప్పిన ఉత్తరం రాయండి. సమాధానం ఏమి వస్తుందో చూద్దాము. కాదు సోమనాథము ఆ క్రైస్తవు రాలినే పెండ్లి చేసికొంటాడు. అతని కర్మ అలా వ్రాసి ఉన్న దేమో ! మీ కడుపున పుట్టాడు. అతని బ్రాహ్మణ్యా మంత మట్టుకేనేమో. మన చిన్న పరిధిని దాటి అనంత పరిధిలోకి

వెళ్లి బ్రహ్మ పదార్థంతో సమైక్యం పొందుతాడేమో. అతనికి మీ రన్నం పెట్టలేరు, నేను పెట్టలేను. నేను ఉద్యోగం కూడా ఇప్పించలేను. బ్రతకాలి అంటే అన్నము తినాలి. అన్నం తినాలి అంటే డబ్బు కావాలి. డబ్బు కావాలి అంటే కొందరు ఉద్యోగమే చెయ్యాలి. ఆ ఉద్యోగము ఒక్కొక్కప్పుడు కొన్ని క్లిష్ట పరిస్థితులతో సహా వస్తుంది. చావు బ్రతుకుల మధ్య ఉన్నది ఉద్యోగము. మీ అమ్మాయిని నేను పెళ్లి చేసికొన్నాను. మా నాన్నగారు చేశారు. నా పెళ్ళి కాలేదను కోండి. నన్నెవ్వడో ఇంగ్లండో అమెరికో తీసికెళ్లాడనుకోండి. అక్కడ నే నెవ్వతెనో కట్టుకొన్నాననుకోండి. సదా కోటి జంగాలల్లో నా బోడిజంగాన్ని చూచావా అని. ఇతను మీకు కొడుకు నాకు బావమరిది అగుట తప్ప లేకపోతే మన కేం పట్టింది. పోతే పోతాడు. వాడి మనస్సు చెడిపోయి మారటం లేదుగదా! పరిస్థితులయొక్క వత్తిడిచేత మారుతాడేమో గ్రుడ్డిలో మెల్లగదా. కాదు మనస్సు మారే అవుతున్నాడు. మనమేమి చేయగలము? వాడి జాతక మలాఉన్నది. అతను పూర్వ జన్మలలో చేసికొన్న కర్మ అలాంటిది. ఒక పుణ్యకర్మ చేసికొన్నాడు. బ్రాహ్మణులలో జన్మించాడు. ఇంక ఏదో పెద్ద పాపపుకర్మ చేసికొంటాడు. క్రైస్తవిని పెండ్లాడుతాడు. దీనంతకీ ఒక్క కర్మతప్ప నాకేమీ కనపడటంలేదు. ఒక వ్యక్తి ఏమిటి, ఒక మతమేమిటి, ఒక జాతి ఏమిటి, ఒక దేశమేమిటి? పరమేశ్వరుడు నిర్మించిన ఒక మహాకర్మ వ్యూహములో అనేక

గోళములున్నవి. ఈ భూగోళము అందులో ఒకటి. తాను తన కుటుంబము, తన సంఘము, తనదేశము, తన మతము, తన ఇష్టము — ఎక్కడికక్కడికి స్వార్థము పెంచుకొని ఈ మహా కర్మ పరిణామాన్ని చూడరు గనక ఇలా ఉంది. వర్ణాంతర వివాహాలు దేశాన్ని బాగుచేస్తవి అనుకొనేవాళ్ళు కత్తులతో నరికి తమ మతాల్లోకి ఇతర మతాలవాళ్ళని చేర్చుకొనేవాళ్ళ కన్న ఏమి మహాకార్యము చేస్తున్నారు ? వాళ్ళది క్రూరత్వం వీళ్ళది మోసం. వాళ్ళది దౌర్జన్యం వీళ్ళది అహంకారం. పోనివ్వండి. మీరు ఆ గంగాధరంగారికి ఈ ఉత్తరం వ్రాయండి. నేను వ్రాస్తాను. మీరు దస్కతు చేయండి. వెంటనే సమాధానం వ్రాయవలసినది అని వ్రాద్దాము. చూద్దాము"—

# 10

ఆయూరు చిన్నబస్తి. ఒక ఉన్నత పాఠశాల యున్నది. రక్షకభట స్థానమున్నది. తాలూకా ఊరుకాదు కాని ఆ యూరిలో ధనవంతులైన వర్తకులున్నారు. వాళ్లు పెద్ద వర్తకులు. ఇతర దేశాలకు ఎగుమతిచేసే వర్తకం. పట్టుబట్టలు నేసే వాళ్ళున్నారు. ఆ పట్టుబట్టలు ఆసేతుశీతాచలం ప్రసిద్ధమైనవి. ఒక్క చీరే సుమారు మూడువందల రూపాయలుంటుంది. ధోవతి ఉత్తరీయము రెండువందలపైన ఉంటుంది. ఈ మగ్గాలు ఆరో ఏడో ఉన్నవి. వేరుశనగ, కందులు పెసలు కొందరు పెద్ద వర్తకులు ఎగుమతి చేస్తారు. అందరు లక్షాధికారులు. కాని కాలము ననుసరించి వారివారి వర్ణములలో పుట్టిన పండితులకే ధనమిస్తూ ఉంటారు. పదిహేనుమంది వర్తకులుంటే అందరూ కలిసి మూడు వర్ణాలల్లో ఉన్నారు. అందుచేత తమ వర్ణాల వాళ్లనే ఆదరించుకోటము అంత సాధ్యము కావటములేదు. ఎవరికైనా ఎక్కువ ముట్టచెప్పాలంటే ఇతర ధనవంతుల

సాహాయ్యము కూడ తీసికోవలసివస్తుంది. మరి ఏమౌతున్న దంటే వాళ్ళ వర్ణాలలోని పండితులేకాక ఇతర వర్ణాలలోని పండితులు కూడ రావటం సంపాదించుక పోవటం జరుగు తున్నది అసలు ఒక వర్ణమువారు ఒక ఊళ్ళోనో ఒక భూభా గములోనో ఎక్కువమంది ఉండి వాళ్లల్లో ధనవంతు లెక్కువ మంది ఉంటే అప్పుడు పుడతవి దుర్బుద్ధులు. ఒక కులమువాళ్లు ధనవంతు లిద్దరు ముగ్గురు మాత్రమే ఉండి తక్కినవాళ్ళు ఇతర కులాలవాళ్ళయితే వట్టి ధనపూర్వకమైన దురహంకారమే ఉంటుంది కాని కులమునకు సంబంధించిన దురహంకారము దౌర్జన్యము ఉండవు మాది హిందూమతము. మా మతమంతా వేదశాస్త్ర పురాణాలల్లో ఉంది అనే ప్రధానాంశానికి భంగము లేదు. ఒకటే వర్ణమువాళ్ళు ధనవంతులై ఒక్కచోటే పోగుపడి ఉంటే సంప్రదాయంగా ఎక్కువ వాళ్లుగా పరిగణింపబడుతూ ఉన్న వర్ణం వాళ్ళమీద కోపాలు సాధించటాలు వాళ్ళని బాధించటాలు, జరుగుతవి కాని తాము హిందువులము కాదను కోటము జరగదు. అసలు మతాన్నే కాదనటానికి అల్లా ఒక చోట ప్రోవుపడ్డ అందరూ ధనవంతులైన ఒకకులము మిక్కిలి ముదరాలి. ఆ ముదరటానికి ఆ కులములోనే కొందరు పండి తులైన వ్యక్తులు దుష్ట సిద్ధాంతాలను వ్యాపింపచెయ్యాలి. అందరు వ్యక్తులు ఒకటే మోస్తరుగా పుడతారా — కొందరు అంతర్ద్వేష కటాహములై ఉంటారు. ఎప్పుడూ ఒక దేశములో ఉన్న మతానికి ఆ దేశములోనే విరోధులు ఉంటూ ఉంటారు.

బౌద్ధమతము ఉన్నది. ఆ బౌద్ధమతము చచ్చు మతమని పుస్త
కాలు వ్రాసి ప్రచారముచేసి ఆ మతానికి ద్రోహము చెయ్య
టానికి బౌద్ధులలోనే పలుమంది ఉద్భవించారు. పాశ్చాత్య
దేశాల్లో రోమన్ క్యాథలిసిజమ్ అనే మతము ఉండేది.
దానికి వ్యతిరేకులు బయలుదేరారు. దాన్ని చంపారు. ప్రొటె
స్టెంటిజమ్ అని బయలుదేరింది. అది కాదని పుస్తకాలు వ్రాసిన
వాళ్ళున్నారు. ముసల్మాను మతములోనే భేదాలున్నవి. ఒక
రంటే ఒకరికి పడదు. క్రైస్తవ మతములో కొన్నివందల
భేదాలున్నవి. వాళ్ళల్లో ఒకళ్ళంటే ఒకళ్లకి పడదు. ఒకళ్లతో
ఒకళ్లు సంబంధ బాంధవ్యాలు చేసికోరు. ఇక్కడ హిందువు
లలోకూడా అంతే.ఇక్కడ వర్ణభేదాలు ఉన్నవి అంతే. హిందూ
మతము మతముకాదని చెప్పే హిందువులే ఉన్నారు. హిందూ
మత సిద్ధాంతాలను తెకనాడిపోసే జనం ఉన్నారు. ఎవరో
మరీ విపరీతబుద్ధులు కొంతమంది ఉంటారు. చిన్నచిన్న భేదా
లెట్లా ఉన్నా సామాన్య సూత్రాలకు వ్యతిరేకించరు. ఒక
వర్ణం వాడిమీద కోపము ఉండి తిరుపతి వెంకటేశ్వరస్వామి
దర్శనము చెయ్యటము మానివెయ్యరు. భద్రాద్రి రాముల
వారి ఆలయము గర్భగుడిని మార్చారు, సంప్రదాయాన్నే
పాటిస్తారు.

అల్లాగా ఆ ఊళ్ళో ఉన్న మూడు వర్ణాలవారు సమర్థు
డైన ఒక బ్రాహ్మణ పండితుడు వస్తే ఆయన్ని పాటిస్తారు.
ఒకాయన వచ్చాడు. ఆయన ఇంగ్లీషులో ఎం. ఎ. ప్యాసయి

నాడు. వేదశాస్త్ర పురాణములయందు ఘటికుడు, గొప్ప వాఙ్మి. మధురమైన కంఠము కలవాడు. పద్యాలు కాని శ్లోకాలు కాని గొంతెత్తి చదువుతూ ఉంటే చాలా శ్రావ్యముగా ఉంటుంది. మంచి సంగీతజ్ఞానము కూడా కలవాడు. స్ఫురద్రూపి, అమిత వాదనశీలి. ఆయన వేదమతము ప్రచారము చేయటానికి బయలుదేరాడు, ఆయన తన ఉపన్యాసములలో నడుమ నడుమ చెపుతూ ఉంటాడు "మన మతము వంటి మతము ఇంకొకటి లేదు. ఉండటానికి వీలులేదు. శాస్త్రార్థం చేస్తే ఇతర మతాలు నిలవవు. ఈ సృష్టిలో భేదము ఎప్పుడూ ఉంటుంది. నల్గురన్నదమ్ములలోనే భేదము ఉంటుంది పెద్దవాడు తమ్ములమీద అధికారము చేస్తాడు. నాకన్న కొంచెము ముందు పుట్టాడు. వాడికి నామీద అధికారము చేసే హక్కేమున్నదని తమ్ములెదురు తిరిగితే సమష్టి కుటుంబము విచ్ఛిన్న మవుతుంది. ఒకాయన దగ్గర లక్ష ఉంటే నలుగురు కొడుకులు పంచుకుంటే నాలుగు పాతికవేలు. "ఆ నాడు అగ్రహారము। ఏనాడో ఖండ్రికాయె యేమని చెబుదున్। ఈనాడీనామాయెను। నానాటికి తీసికట్టు నాగంభొట్లూ." అగ్రహారమంటే అసలు శిస్తే ఉండదు. సగము శిస్తు ఉండేది ఖండ్రిక. ఈనామునకు శిస్తు కొంచెము తక్కువ ఉంటుంది. అంతే భేదము. కనుక సమష్టిగా ఉండాలి. భేదాలు ఎప్పుడూ ఉంటవి. రాముణ్ణి లక్ష్మణుడు, భరతుడు అనుసరించారు. లేకపోతే ఏమయ్యేది? ధర్మరాజును నలుగురు తమ్ములు అనుస

రించారు. భీముడు, అర్జునుడు మేము పరాక్రమవంతులము శత్రువులను సంహరింపగలవాళ్ళము మేము మా ధర్మరాజు పట్టి దద్దమ్మ. అతన్ని కూర్చోపెట్టి మేపవలసిన అవసరము మాకేమున్నది అని ఎదురుతిరిగితే ఏమికావాలి ? అప్పుడు భీమార్జునులలో ఎవరు గాండీవముతో అర్జునుడు భీముని చంపు తాడో, గదతో భీముడు అర్జునుని బుఱ్ఱ పగలకొడతాడా ? ఇంకా రాముడి కథ నయము. తమ్ముళ్ళెదురు తిరిగితే వాళ్ళను శిక్షించగలశక్తి రామున కున్నది. ఆ రాముడు నాకు రాజ్య మక్కఱలేదని వెళ్ళిపోయినాడు. ఈ ధర్మరాజు అల్లాకాదే నెత్తిన గుడ్డ వేసికొని వెళ్ళాలి. అసలు భారతములో ఉన్న అందము చూడండి. ఈ పాండవులకు భగవంతుడు జావమఱది. వాళ్ళ పరాక్రమాలు ఆయనచేత పాలింపబడుతున్నవి. కృష్ణుడు చనిపోయిన తరవాత అర్జునుడు కిరాతుల గుంపును గెలవలేక పోయినాడు. పరమార్థమేమిటంటే మనశక్తులు మన తెలివి తేటలు అన్నింటిని పాలించేవాడు భగవంతుడని అర్థము. అలా భగవంతుడు పాలిస్తే భీమార్జునులు గెలిచారు. మరొక్క కథా రూపంగా అవన్నీ ధర్మాలు. రాముడు పితృవాక్యము ననుస రించి అడవికి పోవటము, ఆయన తమ్ములు ఆయన్ని అనుస రించటం, భీమార్జున నకుల సహదేవులు అన్నగారు ఎంత చెబితే అంత చెయ్యటం, ఇది సనాతన ధర్మము. తండ్రి దైవము. అన్నగారు గురువు.

మన దేశములో తండ్రి, పిల్లనిచ్చినవాడు అన్నగారు, చదువు చెప్పినవాడు. ఆపదనుండి రక్షించినవాడు, వీళ్ళయిదు గురు గురువులు. వాళ్ళని ఎదిరించకూడదు. వాళ్ళయందు వినయ మవలంబించవలె. ఇది నిత్యమైన ధర్మము. నిత్యమైన ధర్మమంటే ఏది ఆచరిస్తే లోకానికి క్షేమమో సర్వజనులు సుఖముగా బ్రతుకుతారో కల్లోలాలు విప్లవాలు లేకండా జనము సుఖపడతారో అది నిత్యమైన ధర్మము పితృవాక్య పరిపాలనము, అన్నగారి మాట వినటము, అన్నగారికి ద్రోహము చేయకుండా ఉండటము, ఇవి సనాతన ధర్మములని రామాయణ మహాభారతములు చెబుతున్నవి. అవి ఎంతటి ధర్మములంటే రామాయణ మహాభారతములు చావులేకండా ఉన్నవి. చావు లేకండా ఉన్నవంటే జనము ఆ భావములయందు బద్ధాదరులై ఆ గ్రంథాలను చావనివ్వటలేదన్నమాట. ఎందుకు బద్ధాదరులైనారు ? ఆ ధర్మాలు సర్వజనులకు ఇష్టమైనవి గనుక. ఎందుకిష్టమైనవి ? లోపలఉన్న ఆత్మ ఇవి మహాధర్మములు ఇవి యథార్థములు అని వాళ్లకి తెలియకుండా భగవత్ప్రేరితములై బోధచేస్తున్న వన్నమాట. ఒక గ్రంథము చావలేదంటే ఇది అర్థము. అయితే ఇక్కడ ఒక సందేహము ఉన్నది. సరేనయ్యా ఈ దేశములో ఇవి ధర్మాలే. పరదేశాల్లో ఇంతకంటే భిన్నముగా చెప్పే గ్రంథాలు ఉన్నవి. వాటిని వాళ్ళు చావనివ్వటములేదు. అవీ ధర్మాలేనని వాళ్ళకి భగవంతుడు చెబుతున్నాడు గదా ? నిజమే చెబుతున్నాడు. కాని ఆ దేశాలు

వేరు, మన దేశము వేరు. ఆ భగవంతుడైనా నీవు చదివిన ధర్మము ధర్మమేనని చెబుతున్నాడు తప్ప ధర్మము ఇలా ఉండాలని చెప్పలేదు కదా ? ఈ ధర్మాలన్నీ చెప్పింది మహా ర్షులు. మహర్షులంటే ఆ యా దేశాలలో పుట్టిన మహా మేధావు లైన తపస్వులు. వాళ్లు రెండురకాలు. ఒకళ్లు తపస్వులు, రెండవవాళ్లు భక్తులు. ఇద్దరకు భేదమున్నది. తపస్వి అనగా ఇంద్రియ విషయములను నియమించి తనలో తాను చూచి కొని తనయందు తాను రమించుచు మహా విషయ ములను లోనుండి బయటికి త్రవ్వితెచ్చెడివాడు. అనగా ఈ ప్రపంచక మంతయు ఈ ధర్మములన్నియు వేదములన్నియు ప్రతివాని హృదయములో నున్నవని అర్థము. లోపల అంతఃకరణమని ఉన్నది. అదే చైతన్యము. చైతన్య మక్కడనుండే పుడుతున్నది. ఆ చైతన్యము ఆ వివేకము ఆ జ్ఞానము ఆ స్ఫురణ సర్వజనులు బయటి కింద్రియములద్వారా ప్రసరింపజేసి లోకాన్ని చూస్తు న్నారు. లోకపు దృష్టితో లోకాన్ని పరిశీలిస్తున్నారు. ఈ ప్రపంచకమంతా అనగా దీనిని గురించిన తెలివి అంతా ఆ లోపల లేకపోతే బయటికి రానుగదా ! అంటే ఆ లోపల ఉన్నదని అర్థము. మహర్షులు ఇంద్రియాలను నియమించి ఇంద్రియాలద్వారా ప్రవహించే తెలివియొక్క మూలరూపం బును అంతరాత్మలోనే చూస్తారు. అక్కడ చూచింది మిక్కిలి యథార్థమవుతుంది. ఇంద్రియముల ద్వారా చూడబడేది ఈ లోకజ్ఞానముచేత కలుషిత మవుతుంది. భక్తులు వేరు. వాళ్ళు

భగవంతుణ్ణి ధ్యానిస్తారు. ఆ భగవంతుడు వేరు. ఈ అంతఃకర ణాలో ఉన్న ఆత్మ పదార్థము వేరు. భక్తులు భగవంతుణ్ణి ధ్యానము చేసేటప్పుడు సంకీర్తనము చేసేటప్పుడు ఒక తన్మ యత్వమును పొందుతారు. తన్మయత్వమన్న మాటలో "తత్" అనే శబ్దము "మయట్" అనే ప్రత్యయము ఉన్నవి. తత్ అంటే వాడు ఏ భగవంతుణ్ణి ధ్యానము చేస్తున్నాడో వాడు. తన్మయత్వమంటే వాడితో కలసి పోవటము. కాని వాడి లక్ష ణము తాను ఎక్కువగా పొందించుకోటము అనిగాని అర్థము. అదేమిటి, ఇంతమంది భగవంతుళ్లు ఉంటారా అంటే ఉంటారు. ఎందుచేతనంటే యాదృశీ భావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ" అని భగవద్గీతలలో భగవంతుడు చెప్పాడుకదా ! ఆ భక్తుడు ఎటువంటి భగవంతుని ధ్యానముచేస్తే అటువంటి భగవంతుడు వాడికి సాక్షాత్కరిస్తాడు. పాశ్చాత్యుల భగవంతుడు సృష్టి చేశాడు. మన భగవంతుడు సృష్టి చేయలేదు. త్రిమూర్తులలో ఒకడైన బ్రహ్మదేవుడు చేస్తున్నాడు. కనుక మన సృష్టికర్త భగవంతులలో ఒకడు తప్ప ఆయనే భగవంతుడుకాడు. మనకు మోక్షమిస్తే విష్ణుమూర్తి ఇవ్వాలి, శివుడు ఇవ్వాలి, తప్ప బ్రహ్మ ఇవ్వలేడు. ఆయన రాక్షసులకు వరాలిస్తే ఇస్తాడు— దానిచేత చావులేకండా దీనిచేత చావులేకండా. అసలు చావు లేకండా ఇవ్వలేడే. అది ఇవ్వాలంటే శివుడివ్వాలె, విష్ణు వివ్వాలె. ఆయన మార్కండేయుని కిచ్చాడు. ఈయన ప్రహ్లాదుని కిచ్చాడు. ఇంతకూ చెప్పవచ్చిన దేమిటంటే ఈ

భక్తులు తాము ధ్యానించే దేవుడితో కలసిపోతారు. అనగా వాళ్లు ఎలాంటి దేవుడు కావాలనుకొంటారో అలాంటి దేవుడితో తన్మయత్వము పొంది ఆ సమయములో వాళ్ళకేవో కనిపిస్తే లేదా స్ఫురిస్తే అవి భగవంతుడి ఆదేశాలు అని చెబుతారు. వీళ్ళిద్దరూ కాక ప్రవక్తలని ఒక జాతి ఉన్నారు. భక్తులలో భగవంతుని గురించిన భావన అధికము. లోకాన్ని గురించిన భావన తక్కువ. ప్రవక్తలలో అది తక్కువ ఇది ఎక్కువ. మన మహర్షులు కొన్ని ధర్మాలు చెప్పారు. తరువాత భగవంతు డవతరించి వానినే చెప్పాడు. మనమతము భగవన్నిర్మితము. వాళ్ళ మతాలు ప్రవక్తలచేత నిర్మింపబడ్డ మతాలు, మనము భగవంతుణ్ణి నమ్ముతాము. మన భక్తులని మన ప్రవక్తలని నమ్మము. మనకు శంకరాచార్యుల వారు దేవుడు కాడు. దేవుడు శివుడో కేశవుడో లేకపోతే ఇద్దరూ కలిసియో, ఇది ఏమిటి? అంటే వీళ్ళిద్దరూ ఆ బ్రహ్మదేవుడూ కలిసి ఒక మహాతత్వముయొక్క మూడు రూపాలు అన్నమాట. ఆ తత్వమేమిటి ? మనకు భగవంతుడు ఆ తత్వము. శివుడు శివుడుగా ఉండి ఆ తత్వమవుతాడు. విష్ణువు విష్ణువుగా నుండి ఆ తత్వమవుతాడు బ్రహ్మమాత్రము కాడు. ఎందుచేత కాడు ? బ్రహ్మ అయిన తత్వానికి లోకాన్ని సృష్టించటమే చేతనౌను తప్ప పాలించటం నశింపచేయటము చేతకాదు. అందుకనే కదా మనము మనకు డబ్బిచ్చి పోషించినవాణ్ణి అనగా పై అధికారిని మన్ని శిక్షించేవాణ్ణి అనగా రాజును ఆరాధిస్తాము. మనకు

శరీరమిచ్చిన దాత అయిన తండ్రిని గౌరవిస్తాము. మానవుడు తన లక్షణాలనే భగవంతునియం దారోపిస్తాడు. యూదుల దేవుడు వాళ్ళ శత్రువులను సంహారింప చేస్తాడు. వాళ్ళదేవుడు చాలా క్రూరుడనిపిస్తాడు. వాళ్ళ దేవుడి పేరు జవాహ్. లేక పోతే జెహోవా. ఇది క్లుప్తంలో మానవ చరిత్రయొక్క స్వరూపము మనకు తెలిసినంతమట్టుకు మనకు అంటే ఇంగ్లీషువాడు చెప్పిన చదువువలన కలిగిన వ్యామోహములో పడివున్న మనకు, భిన్నదేశాలు భిన్నజాతులు భిన్న దైవములు ఎలా ఏర్పడ్డారో వాళ్ళవాళ్ళ కర్మలచేత ఎట్లా పాలింపబడ్డారో చెప్పాలి. అంటే నాకు రెండు నెలలైనా పడుతుంది—(ఉండి చెప్పండి ఉండి చెప్పండి అని సభలో పెద్దకేకలు) "చెబుతాను చెబుతాను. వినేవాళ్ళు దొరకాలిగాని చెప్పేవాళ్ళు చాలా మంది ఉన్నారు. నాకు ఇతరులకు భేదమేమిటంటే మన ధర్మము నేను చెబుతాను. ఇతరులు పరధర్మము చెబుతారు. ఇందాక ఒక ప్రశ్న వదలిపెట్టాము. మన ఋషులయొక్క అంతఃకరణ మన అంతఃకరణ అది ధర్మమని చెబుతూ ఉంటే ఇతర దేశాలలో ఉండేవాళ్ళ అంతఃకరణలు అవి ధర్మమని చెబుతున్నవి కదా అని. నిజమే దానికి చాలా కారణాలున్నవి. అవన్నీ చెబుదామనే రెండు నెలలన్నది."

చిదంబరం ఆ పతంజలిశాస్త్రిగారిని తన ఇంటికి తీసి కెళ్ళాడు. రెండునెలలు తన ఇంట్లోనే ఉండాలన్నాడు. చిదంబరానికి అత ననుకోని లాభము ఒకటి కలిగింది. ఆ రెండు

నెలలు అతని ఇంట్లో ధాన్యలక్ష్మి తాండవించింది. కూరలు బియ్యము పెరుగులు పాలు వంటచెఱకు నెయ్యి వచ్చి ఇంట్లో తెగ పడుతున్నవి. ఉపన్యాసాలు వినేందుకు ఇతర ఊళ్లనించి వస్తున్నారు. వాళ్లకువేరే విడుదులు. ప్రక్క భాగము వాళ్ళు ఎందుకో కాళీచేసి వెళ్లారు. అది వాడుకుంటున్నారు. ఊళ్ళో ఉన్న బ్రాహ్మణ విధవరాండ్రు అందరూ వచ్చి ఇక్కడే మకాము వేశారు. ఇంక ఆ ఇల్లు ఒక సత్రమువలె ఉండి పోయింది. మరునాడే ఆ ఊరిలో ఉన్న అనాధ స్త్రీ శరణాలయం చూసేందుకు సోఫియా వచ్చింది.

# ద్వితీయ భాగము

# నీలానది

## 1

మొదటిరోజున పతంజలిశాస్త్రి ఉపన్యాసము ప్రారంభించాడు.

అతడు కడచిన అయిదువేల సంవత్సరాలలో ప్రపంచము యొక్క నాగరికతను గూర్చి ఆరవై రోజులు ఉపన్యాసము చేస్తానని సర్వ నాగరికతా మనదేశంనించే వెళ్ళిందని చెప్పటంతోటే ఏమైనాసరే చెప్పండి అని కేకలువేసిన వాళ్ళతోపాటు మఱి కొందఱు దానికి వ్యతిరేకులు కూడ ఉన్నారు. ఆ ఊళ్లో పదిహేనుమందైనా లక్షాధికారులున్నారు. వాళ్ళ కొడుకులు చాలామంది పట్టణాలకు పోయి ఇంగ్లీషులో పెద్ద చదువులు చదువుతున్నవాళ్ళు ఉన్నారు. వాళ్ళల్లో అయిదారుగురు ఇంటర్మీడియట్ చదువుతూ మానేసినవాళ్లు, బి. ఏ. చదువుతూ మానేసినవాళ్ళు ఉన్నారు. వాళ్లు అటు చదువుకి కాకండా

ఇటు వర్తకానికి కాకండా ఉంటారు. ధనవంతులవటము మూలంగా వాళ్ళకు సాగుతునే ఉంటుంది. అందరూ వేషాల చేత ఆధునికులు. ధనవంతుల బిడ్డలవటంచేత ఏదో ఒకరకపు ఇంగ్లీషు వాసన ఉండటంచేత చదువుకొన్న వాళ్ళక్రింద లెక్క. వాళ్లు మాత్రమే కాదు. వాళ్ళ నాశ్రయించుకొని యున్న ఇంకా సుమారు ఇరవైమంది ఆ ఊళ్లోని యువకులు సామాన్య సంసారుల బిడ్డలు స్కూలుఫైనలు తప్పినవాళ్ళు. ఆ ప్రాంతాల చదివినవాళ్లు ఉన్నారు. ఈ ఇరవైమంది ఆ ఆరుగురికి అనుయాయులు. వీళ్ళకి వాళ్ళు మహా పండితులు. ఆచార్య స్థానమందున్న వాళ్లు వీళ్ళందరూ ఒకటికాదు. ఇందులో నాలుగైదు పక్షాలు ఉన్నవి. ఇద్దరు కమ్యూనిస్టు సిద్ధాంతంవాళ్ళు. ఇద్దరు సోషలిస్టులు. ఒకడు కాంగ్రెసు. ఒకడు స్వతంత్రపక్షము. ఈ ఇరవైమంది అనుయాయులు కొందఱు కొందఱుగా ఆరుగురివెంట తిరుగుతూంటారు. వాగ్వాదన వస్తే కాంగ్రెసు స్వతంత్రపక్షాల వారిద్దరూ ఒకటి. సోషలిజంవారు ఒకప్పుడు కమ్యూనిజం వైపు మొగ్గుతారు. ఒకప్పుడు వీళ్ళిద్దరివైపు మొగ్గుతారు. ఆ ఊళ్ళో క్లబ్బుఉన్నది. అన్ని పత్రికలు వస్తవి. వాళ్ళందరూ చదువుతారు. నేటి ప్రపంచము లోకములోని వార్తలు. నేటి సిద్ధాంతాలు వాళ్ళకి సుపరిచితములు. వట్టి పరిచితియే కాదు. దానియందు వాళ్ళు చాలా తీవ్రవాదులు. ధనవంతులమన్న అహంకారముచేత ఆ ఆరుగురు వాళ్ల అండ ఉన్నదన్న ధైర్యముచేత ఈ ఇరవై

మంది ఊళ్లో పండితులవలె ఆధునిక సిద్ధాంతములకు మూల స్తంభములవలె మాట్లాడుతూ ఉంటారు, తిరుగుతూ ఉంటారు. ఈ ఇరవై మందిలో ఎక్కువమంది వాదనలలోననే తీవ్ర ప్రకృతికలవారు కాని సంసారాలు పేదవి కావటము మూలముగా తల్లిదండ్రుల అదుపును మీరినవాళ్ళు కారు. ఇండ్ల దగ్గర ఆ పనులు ఈ పనులు చేయక తప్పదు, ఆ ఆరుగురు ఆ ఊరికి మహర్షులు. స్వయం నిర్మిత నియంతలు. కాని ఎవడికి వాడు ఇంటిదగ్గర తండ్రిని కాదనలేడు. ఆ తండ్రులకు సహజముగా వీళ్ళమీద మమకారము. వీడు మరీ నెత్తికెక్కితే తప్ప అంతవఱకు ఆ తండ్రులు వీళ్ళు దుబారాగా ఖర్చుపెడితే తప్ప వాళ్ళు వేసే వేషాలకు అడ్డుతగలరు.

ఇంక నీ పాతికమంది పండితులు కథా ? వాళ్లు తెలుగు పుస్తకము ఒక్కటికూడా యెరుగరు. కాని ఆధునికాంధ్ర కవులలో ప్రతివానికి ఒక ప్రత్యేకాభిమానితుండు ఉన్నాడు. వానిమీద ఈగ వాలనివ్వరు. కొద్దిలో సులభముగా చెప్పాలి అంటే వారు ఆధునిక సాంఘిక సారస్వతిక రాజకీయ మత విషయములయందు కొన్ని నిశ్చయాభిప్రాయములు కలవాళ్లు. ధన బలముచేత అంగబలముచేత తండ్రుల అదుపు వచ్చేవఱకు అప్రతిహతరథులు. మొత్తముమీద వాళ్ళందరు భారతదేశము పట్టి చవటదేశమని అనాగరకదేశమని వేదశాస్త్ర పురాణేతిహాసములయందలి నమ్మకములచేత కలుషితమై పోయినదని అనాగరకమైన దేశమని పాశ్చాత్య దేశములయందలి నాగరి

కత అవలంబించితే తప్ప ముక్తిలేదని గాఢముగా విశ్వసిస్తూ ఉన్న వాళ్ళు, ఇక్కడి వర్ణభేదాలు సాంఘికాచారాలు దేవాలయాలు మూఢ విశ్వాసాలు అన్నీకూడా దేశముయొక్క పతనానికే హేతువులని దృఢంగా నమ్మినవాళ్ళు. పాశ్చాత్యుల మహా పరిశోధనలను గురించిన ఉత్తమ గ్రంథములు వాళ్లు చదివినవాళ్ళు కారు. చదివితే వాళ్ళ కర్థమయ్యేవీ కావు. పాశ్చాత్య చరిత్రకారులు శాస్త్రజ్ఞులు క్రమక్రమ వృద్ధి వికాసములను పొందినవారు వారిలో పూర్వ పూర్వులకంటె ఉత్తరోత్తరులు అధికాధికములైన మహా విషయాలను కనుక్కొని వ్రాశారు. పాశ్చాత్యుల పరిశోధనలు కడచిన వంద యేండ్లలో తారాపథాన్ని అంటుకొన్నవి. అనేకములైన విజ్ఞాన శాఖలలో వాళ్ళ పరిశోధన ప్రారంభ దశలో ఉన్నదని చెప్పవలె ఆంగ్లేయుడు మనలను పాలించినప్పుడు ఆనాడు అర్థజీర్ణ పరిశోధనలు ప్రమాణాలుగా ఈ దేశములలో పాఠశాలల్లో కళాశాలల్లో చదివించాడు. ఇప్పటికి అవే పాఠ్య గ్రంథాలు. అసలు దేశములో రెండువందల యేండ్లుగా ఆ పాశ్చాత్యుల అపరిణత సిద్ధాంతాల యందలి విశ్వాసము ఒక పరంపరగా వస్తూ ఉన్నది.

వీళ్ళు ప్రపంచక నాగరికతంతా హిందూ దేశమునించే వెళ్ళిందంటే ససేమిరా ఒప్పుకోరు. ప్రపంచ చరిత్ర అన్న పేరుతో పాశ్చాత్యులు బహు గ్రంథములు వ్రాశారు. ఆ గ్రంథాల్లో హిందూదేశపు ప్రసక్తియే ఉండదు. పూర్వ

నాగరకతలలో హైందవ నాగరకతకు స్థానములేదు. వాటిల్లో సింధునదీ నాగరకత అన్నమాట మాత్రము ఉంటుంది తప్ప ఇంకేమీ ఉండదు. అన్నికూడ అస్పష్టంగానే ఉంటవి. భారత దేశానికి సంబంధించినంతమట్టుకు, భారతదేశ నాగరకతను గురించి ఇది సర్వోత్కృష్ట మైనదని ఇక్కడి మత సాంఘిక రాజకీయాది విషయములు పరమోత్తమమని మానవుడు సింధు నదీ ప్రాంతమునందే తొలుత నివసించినాడని ఇక్కడనించియే ఇతర భూభాగాలకు మానవుడు వలస పోయినాడని సిద్ధాంతీ కరించిన పాశ్చాత్య పండితులున్నారు. వాళ్ళకు పలుకుబడి లేదు. వాళ్ళ పుస్తకాల నణగతొక్కి యాంగ్లేయాధికారులు తదను యాయులు బ్రహ్మాండమైన ప్రచారముచేసి దేశములోని సర్వయువకుల మనస్సులను మార్చి వాళ్ళ విశ్వాసాలను మరల్చారు. 'కలౌ సంఘే శక్తిః' అన్నారుగదా. అనగా మంది బలము కావాలన్న మాట. ఈ పాతికమంది పతంజలి ఫలానా విషయాన్ని పురస్కరించుకొని యుపన్యసిస్తానని చెప్పటం తోటే సమాజముగా వ్యతిరేకులై కూర్చున్నారు. అనగా ఆయన ఉపన్యాసాలు సాగనివ్వరన్న మాట. ఈ సంగతి ఎవరో పతంజలితో చెప్పారు అతడు మిక్కిలి గడుసు పిండము. ఇలాంటి తాకిడీలు పూర్వమే చాలా తిన్నవాడు. "కాదు శాస్త్రుర్లుగారూ ఈ ఊరు వాళ్లు పలుతున్నారు. ఇవ్వాళ్టి సభే రసాభాసు చేస్తారు. మీకు తృణమో పణమో నిన్ననే ముట్టింది కదా. ఈ కొడుకు లివ్వద్దంటే ఆ తండ్రులివ్వరు. మీరు రెండు

నెలలు కష్టపడి చెప్పినా మీ కెక్కువ ఫాయిదా ఉండదు. నేను ఉద్యోగముచేసే ఆఫీసు కొంత గవర్నమెంటుది. కొంత వీళ్ళది. అది ఒక కళాశాల కాదు. ఒక కచేరి కాదు. నాది చిత్రమైన ఉద్యోగము. నేను మీవైపు మాట్లాడటానికి కూడా వీలుండదు అని చిదంబరము బ్రతిమాలి చెప్పాడు. ఎంత చెప్పినా పతంజలి నవ్వుతాడు.

సోఫియా ఆ వూరువచ్చి రెండు మూడు నాళ్ళయింది. ఈ క్రొత్త పాతికమంది యువకులకు ఆవిడ "ఆదర్శ గృహిణి" అయింది. ఈ ఆదర్శశబ్దము ఈ అర్థములో తప్పు. ఆదర్శ మనగా సంస్కృతములో అద్దము అని అర్థము. ఐడియల్ అన్న ఇంగ్లీషు మాటకు ఇది తర్జుమాగా మన దేశములో పత్రికల వాళ్ళు వాడుతూ వచ్చారు. అది అలవాటై పోయింది. ఈ యువకులందరు సోఫియా దగ్గరకు వెళ్లారు. ఆవిడ్ని ప్రశం శించారు. ఆదర్శప్రాయమైన వివాహము చేసికొన్నందుకు ఆవిడకి అభినందన సభ పెడతామన్నారు, ఆవిడ ఆ ఊళ్ళో రెండు నెల లుంటానని తొందరలేదు. ఎప్పుడో ఒకప్పుడు చేయ వచ్చునని అన్నది. పతంజలిశాస్త్రి యొక్క ప్రతి ఉపన్యాసానికి ఆవిడ తప్పకుండా హాజరయ్యేటట్టు వాళ్లావిడదగ్గర వాగ్దానం తీసికొన్నారు. ఆవిడ చిదంబరానికి మేనమామ కూతురని అందరికీ తెలిసింది. చిదంబరం పూర్వాచార పరాయణుడని అందరికీ తెలుసు. ఆవిడ వాళ్ళింటికి వెళుతుందా? వెళ్ళదా? అన్నది ప్రశ్న. చిదంబరం పిలిస్తే వెళ్తుంది. అతడు పిలవడు.

వాళ్ళకీ వీళ్ళకీ చుట్టరికము దగ్గరైనా పరిచయము తక్కువ. ఆవిడ ఇతన్ని ఎప్పుడో చిన్నప్పు డొకసారి చూచిందట. పైగా ఆమె భర్తకు మూడువేల రూపాయలు జీతము. ఆవిడకు రెండు వేలు. ఈ చిదంబరానికి అన్నీ పోగుచేస్తే రెండువందలు వస్తవో రావు—ఇతని ఇంటికి రావలసిన అవసరము ఆవిడకి లేదు. ఆవిడ అంతర్జాతీయమైన దృష్టి కలది. ఇతడు కూపస్థ మండూకము. నక్కా దేవలోకమున్నూ.

ఇది ఇట్లా ఉండగా చిదంబర మింట్లో ఒక కొత్త తగాదా పుట్టింది. కమల తన అన్నగారి పరివర్తనకి సోఫియా కారణమని సోఫియామీద కారాలు మిరియాలు నూరుతుంది. వెళ్ళి సోఫియాని తిట్టి వస్తానంటుంది.

దానివల్ల ప్రయోజన మేమిటంటాడు చిదంబరం. "ఆమె తనకు మనకూ ఏదో దూరపు చుట్టరికమున్నదనే కదా. నీ వీ సాహసము చేస్తానంటున్నావు. ఆవిడకి ఈ చుట్టరికపు మొహమాట ముండదు. గుడిమిర్రింగే వాళ్లకి గుడి తలుపు లప్పడాలని ఆవిడ తల్లిని తండ్రినీ లెక్కచేయలేదు. ఇంక నా చుట్టరికము లెక్కా ? అందులో నీవు ఆమె మేనత్త కొడుక్కి పెండ్లానివా, ఆవిడ పెద్ద జీతకత్తె, పలుకుబడి కలది. ఈ ఊళ్లో ఉన్న పాతికమంది కిరీటములేని రాజులు. ఆవిడకి అభినందన సభ చేద్దామనుకొంటున్నారు. నీవువెళ్లి ఆవిడ్ని నానామాటలు అని వచ్చావా ఒకటి ఆవిడ మనమీద అభియోగం తీసికోస్తే

మనము తినే నాలుగు మెతుకులు కూడా తినలేము. రెండు—ఈ అకిరీటులైన మహారాజుల మూలంగా నేను రేపటినించి వీధివెంట వెళ్ళటానికి కూడ వీలుండదు" అంటే కమల ఇలా అన్నది; "నేను వెళ్ళి ఆవిడను తిట్టను. ఆవిడ చేసినపని తప్పు అని ఆవిడికి నిరూపించి వస్తాను. మాఅన్నగారిని ఈ చిక్కులో పెట్టడం ఆవిడ నీచత్వము అని ఋజువు చేస్తాను."

"ఆవిడ నీతో మాట్లాడదు. నీ వాగుడు నీవే వాగికొని నీదారిని నీవే పోతావని ఊరుకొంటుంది."

"అంత వివేక హీనురాలైతే అంత చీమూ నెత్తురూ లేనిదైతే నేనేమి చేస్తాను."

"అటువంటివాళ్ళు చీము నెత్తురు చంపుకొంటారు. వాళ్ళు వాదనకు నిలువరు. మనకు సమాధానము చెప్పలేరు సరికదా, నవ్వుతూ కూర్చుంటారు. మనమే అవివేకులం—వాళ్ళే వివేకులుగా అభినయిస్తారు. చుట్టుపట్ల వాళ్ళున్నారే వీళ్ళందరు ఒక విచిత్రమైన జాతి. వాళ్ళెవళ్లూ అలాంటి పెళ్లిళ్లు చేసికోరు. చేసికొన్న వాళ్ళంటే పడిచస్తారు. వాళ్ళందరూ వాళ్ళ పక్షము. వాళ్ళు కామక్రోధాలని జయించిన వాళ్లు మనము ఆవేశముగా మాట్లాడుతాము. గనుక 'మీకంత కోపమెందుకండీ' అంటారు. వాళ్ళల్లో ప్రతి ఒక్కళ్ళకీ ఉండే కోపము చెప్పటానికి వీల్లేదు. తమకు తగలనంతసేపు ప్రతివాళ్లూ మహాయోగులు ధర్మాత్ములు—ఇలా ఉంటుంది లోకం."

"అయితే నన్ను వెళ్ళవద్దంటూరా? పతంజలిగారు మన ఇంట్లో ఉన్నారు. ఈ రెండు నెలలు వారి ఉపన్యాసాలకైనా నేను వెళ్ళవచ్చునా ?"

"అసలా ఉపన్యాసాలు రెండు నెలలు సాగుతవా ? అని. సాగితే వెళ్లు నా కభ్యంతరము లేదు."

"ఏమి సాగవని కూడా అనుమానము ఉన్నదా ?"

"అదంతా పతంజలిగారి నేర్పుమీద ఆధారపడి ఉన్నది."

ఆ రోజున సాయంత్రము ఉపన్యాసము ఇంక మొదలు పెడతారనగా ఆ ఇరవైమంది యువకులలో ఇద్దరు గండా గొండివాళ్లు ఉన్నారు. (ఏ అదుపూ లేనివాళ్లు) వాళ్ళలో ఒకడులేచి ఇలా అన్నాడు. "ఉపన్యాసము ఆరంభించక ముందు సోఫియాగారి అభినందనసభ జరిపి తరువాత ఈ సభ ప్రారంభించాలని నా ఉద్దేశ్యము. సోఫియాగారు ఉన్నత విద్య నభ్యసించినవారు గొప్ప అధికారము కలవారు. మనదేశానికి మోక్షము రావాలంటే ఈ వర్ణభేదాలు పోవాలి ఆమె వర్ణాంతర వివాహము చేసికొని మనకు మార్గదర్శకురాలైనది. మనము ప్రపంచ చరిత్ర వినక ముందు ప్రపంచకానికి కింత మార్గదర్శకురాలైన ఆమెకు సన్మానము చేయటము చాలా ఉచితము. పతంజలిగారు కూడ అంగీకరిస్తారు"

సభలో పెద్దఅల్లరి బయలుదేరింది. కొందఱు చేయ కూడదు చేయకూడదు అని పెద్దకేకలు వేశారు. అంతా అల్ల

రిగా ఉంది. అప్పుడు పతంజలి లేచి తన మధురమైన శ్రావ్య
మైన కంఠముతో రెండు పద్యాలు, రెండు శ్లోకాలు చది
వారు. సభ అంతా సద్దుమణిగింది. పతంజలి ఇట్లా అన్నాడు ;
"ఇంత అల్లరి అణగిపోయిందేమి ? నేను సంగీతముతో
పద్యాలు చదివితే అందరికీ వినవలెననే అభిలాష అనగా
సోఫియాగారి అభినందనకంటే సంగీతము వినటము మీ అంద
రికి ఎక్కువ ఇష్టమని అర్థము కదా ? దానికన్న దీని గొప్ప
యేమి ? సంగీతము విన్నప్పుడు మీరు సుఖపడుతున్నారు.
వర్ణభేదాలు పోవటము ప్రపంచానికి శ్రేయస్సే అని అందాము.
దానికంటే ఏ కొంచెమో సుఖము పొందటము ప్రతివాడికి
ఎక్కువ అభిమతం అన్నమాట. నేను పెద్ద గాయకుణ్ణి కాను.
ఏదో పద్యాలు మధురంగా చదువుతాను. ప్రపంచక శ్రేయస్సు
కంటె నా సామాన్యపు సంగీతమువల్ల పొందే సుఖమే ఎక్కు
వన్నమాట. రండీ సోఫియా గారూ ! నా ఉపన్యాసము శేషం
మొదలు పెడతాను. మీ కల్యాణము జగత్కల్యాణము వంటిది.
వచ్చి అభినందింపించుకోండి" సభలో కలవరము పుట్టింది. ఆవిడ
రానన్నది. ఆ ఇరవై మంది బతిమాలారు. ఆవిడ రానంటే
రానన్నది. అప్పుడు పతంజలిశాస్త్రి మళ్ళీ ఇలా అన్నాడు
"నాదేమీ తప్పులేదు. ఆమెగారు రానంటున్నది. ఈ అభినందన
సభ చేద్దామన్నవాళ్ళు ఆమెను ఇరుకులో పెట్టారు. అంత
విద్యావతి, అంత వివేకిని ఏదో సభ జరుగుతుంటే తన అభినంద
నానికి సిద్ధమవుతుందా ? ఇప్పుడందరు వర్ణభేదాలు పోవా

లంటున్నారు. ఈ ఊళ్ళో ఇరవై వేలమంది ఉన్నారు. వర్ణ భేదము ఉండకూడదనేవాళ్ళు ఇరవైమందికంటె ఎక్కువ లేనట్లున్నారు. శ్రీ సోఫియాగారు చేసిన పని చాలా ప్రశం సింపతగిన పని, ఆమె హరిజనుణ్ణి వివాహమాడింది. ఆయనకు మూడువేల జీతమట. ఆరోగ్యవంతుడు, సామాన్య సౌంద ర్యము కలవాడు అయివుంటాడు. సోఫియాగారిని ప్రశంసింప తగినదే. ఆమెలో సంఘ సంస్కారమెంత ఉన్నదో స్వార్థమూ అంత ఉన్నది. ఒక గుడ్డివాడు, ఒక వ్యాధిగ్రస్తుడు. ఒక తిన టానికి తిండిలేనివాడు అటువంటి హరిజనుణ్ణి ఇటువంటి విద్యావతి ధనవతి చేసికొంటే ఇంకా ప్రశంసింప తగినదిగదా ? అయినా ఈమెగారు చేసిన పనినికూడ మనము మెచ్చుకోక తప్పదు."

## 2

ఆ రోజున సాయంత్రము పతంజలి అల్లా మాట్లాడి తన ఉపన్యాసాలు మరునాడు మొదలు పెడతానని ఇంటికి వెళ్ళి పోయినాడు. ఇంక ఊరు ఏమైందో చెప్పటానికి వీల్లేదు. సోఫియా మొగాన కత్తివేస్తే నెత్తురు చుక్క లేదు. ఆ ఇరవై మంది యువకుల కిరీటాలు క్రిందపడిపోయినవి. వాళ్ళు పతంజలిని తిట్టిన తిట్టు తిట్టకండా తిడుతున్నారు. "శాస్త్రిగారు వాళ్ళకి భలే పరాభవం చేశా"డని జనం విరగబడి చెప్పుకొంటున్నారు. ఆ యువకులు ఇరవై మంది ఇంచుమించుగా నిస్సహాయులై పోయినారు, కాని వాళ్ళకోపాలు తగ్గలేదు. ఇందులో నాయకులు లా ఆరుగురు ఇళ్లకు వెళితే తండ్రులు మొగాలు వాచేటట్లు చీవాట్లు పెట్టారు "ఏం ఏం? నోరెత్తలేక పోయినారేం? ఆయన మీ అందరకు పరాభవము చేశాడుకదా! ఇంక మీరు న్యాయముగా ప్రవర్తించండి. తెలిసి తక్కువగా

ప్రివర్తించారా ఆయన మీకు పాలరాళ్ళతో గోరీలు కడతాడు. ఊరుకుంటే తెలివి "

ఆ రాత్రి పతంజలి సోఫియాని చూడటానికి వెళ్ళాడు. ఆమె అంగీకరించదనుకొన్నాడు. ఆమె స్వాగతము చెప్పింది. మర్యాద చేసింది "శాస్త్రిగారూ మీరు పద్యము చదువుతూ ఉంటే ఎంత బాగా ఉందండి ? నాకు అభినందన మెందుకు ? ప్రతి ఊళ్లోను ఇలాంటివాళ్ళు కొందరుచేరి సంఘములో అశాంతి కల్పిస్తున్నారు. వీళ్ళల్లో ఒక్కడు వెళ్లి ఒక హరిజన బాలికను పెళ్లిచేసికొనేవాడు లేడు. తమకులము పిల్లే కావాలి. అది రంభ కావాలి. సంగీతము పాడాలి. కట్నము తేవాలి. ఇది ఇలాంటి సజ్జు. మీరన్నమాటకి నాకేమి కోపములేదు. మీరు చెప్పింది నిజమే ! నేను అతను తరుచుగా కలిసికొంటూ వచ్చాము. అతడు ప్రేమించాడు, నేను ప్రేమించాను. ఆ ప్రేమ అంటే ఎమిటోకూడ నా కర్థము కావటములేదు, నాకు వర్ణభేదాలు లేవు. కాని స్వార్థం లేదా ? సుఖ వాంఛలేదా ? మీరు చెప్పినదే నిజము" అని మాట్లాడి తాను రెండునెలలు ఆ ఊళ్లోనే ఉంటానన్నది. ఆయన ఉపన్యాసాలకు వస్తానన్నది. ఆయన దగ్గర నేర్చుకోవలసినది చాలా ఉందని, మన సంఘ మంతా చెడిపోతున్నదని. ప్రపంచకము మారిపోతువ్నదని, మనము కూడా మారకపోతే పాడైపోతామని ఏవో ఏవో అన్నది.

పతంజలి చిదంబరం యింటికి వచ్చాడు. ఆయన నాలు గైదు దినాలనుండి చిదంబరం ఇంట్లోనే ఉంటున్నాడు. భార్యా భర్తలిద్దరు చాలా గౌరవం చేస్తున్నారు. పతంజలి రాకటము తోటే స్నానముచేసి జపము చేసికొన్నాడు. రోజూ రాత్రిళ్లు స్నానము చేయటములేదు. "ఏమి బాబుగారూ ఇవ్వాళ స్నానము చేశారు ?" అన్నది కమల. ఆయన సమాధానము చెప్పలేదు. సభలో ఆయన చేసిన మహా చమత్కారానికి భార్యా భర్తలిద్దరు బ్రహ్మానందభరితులైనారు. వాళ్ళ కతని యందు ఉన్న గౌరవము ఇబ్బడి ముబ్బడి అయింది. చిదంబరం అన్నాడు కదా "అయ్యా మీరు దిగ్విజయము చేసినట్లే ఆ పరి స్థితిని అంత గడుసుగా సమర్థించుకోటము ప్రతిభావంతుడు చెయ్యాలిగాని సామాన్యులు చెయ్యలేరు." కమల అందిగదా దానికి బలే మాత్ర వేశారు. గడ్డి తింటే గొప్ప ఏమిటి ? ఇంకా ఎక్కువ తినాలి. ఇంకా ఎక్కువ వాగ్గాతార"ని చెప్పారు.

ఆ రాత్రి పతంజలికోసము నాలిగిళ్ళనుంచి పెరుగులు వచ్చినవి రాత్రి రెండు జాము లయ్యేవఱకు జనమువచ్చి పోతూనే యున్నారు.

మరునాడు సాయంత్రము జనము కిక్కిరిసి పోయి నారు. సభలో సోఫియా అందరికన్న ముందర వచ్చింది. ఆవిడ

వెళ్లుతూ ఉంటే మనకేమని తదభినందన చింతనులు కూడా వెళ్లారు. పతంజలి ఆరంభించాడు :

"ఆర్యులారా నేడు మీరందరు సభకు వస్తారో రారో అనుకొన్నాను. నాయందు ప్రేమ ఉంచి వచ్చారు. నేను నిన్న సోఫియాగారిని అగౌరవ పఱచానని కొందరనుకొంటున్నారు. నేనాపని చేయలేదు. పైగా రాత్రి నేను వారి దర్శనానికి వెళ్ళాను. ఆమె నన్ను చాలా దయగా చూచింది. ఆదరంగా మాట్లాడింది. 'ఈ రెండునెలలు ఇక్కడే ఉంటాను. మీ ప్రతి ఉపన్యాసము వింటాను' అని చెప్పింది. లోకములో ధర్మము వేరు నీతి వేరు. నీతి అంటే మానవుని ప్రవర్తన. ధర్మము అంటే పరమేశ్వరునిచేత నిర్మితమైన శాస్త్రోక్తమైన విషయములు ఆచరించటము. అబద్ధము మాట్లాడడు. ఎంత చెపితే అంత చేస్తాడు. పరోపకార బుద్ధితో ప్రవర్తిస్తాడు. ఎవళ్లాస్తీ తాను వేసికోవటానికి ప్రయత్నించడు. దీనిపేరు నీతి. ధర్మమింకొక విధముగా ఉంటుంది. తల్లిదండ్రులను దైవమువలె చూస్తాడు. దైవమున్నాడని విశ్వసిస్తాడు. ఆ దైవాన్ని ఆరాధిస్తాడు. పెద్దలను గౌరవిస్తాడు. తన వంశ మర్యాద నిలబెడతాడు. తమ కులముయొక్క ఆచారాలను ఆచరిస్తాడు. ఇలాంటివి చేయటము ధర్మము. ఈ ధర్మము పరమేశ్వరుడు నిర్మించాడు. పరమేశ్వరుడే లేడనేవాళ్ళు పరమేశ్వరుడు నిర్మించాడంటే ఒప్పుకోరు. భగవంతుడుంటే చూపించమంటారు. ఇంతకంటె తెలివి తక్కువమాట ఉండదు. నేను ఫలానా ఆయన

మనమణ్ణి అంటాడు ఆయన చచ్చిపోయినాడు. ఆయన మను మడవైతే ఆయన్ని చూపించు అంటే ఎరా ? ఆయన చచ్చి పోయినాడాయెను. ఈయన న్యూయార్కు వెళ్లాడు. లండన్ వెళ్ళాడు టోకియో వెళ్లాడు అని ఒకర్ని గురించి చెబితే, వెళ్ళలేదు అంటే ఏమి చేస్తావు ? అలాంటి ఊళ్లేలేవు అంటే ఏమి చేస్తావు ? నాకు చూపించమంటే ఏమి చేస్తావు ? డబ్బు పెట్టి వెళ్ళితే ఆ ఊళ్లు కనిపిస్తవి. ఆ ఊళ్లు లేవన్న ప్రతివాణ్ణి డబ్బుపెట్టి వెళ్ళి చూపిస్తూ ఉంటావా? ఇలా అన్ని కనిపించవు అలాంటివాడు భగవంతుడు. డబ్బు పెడితే న్యూయార్కు కని పిస్తుంది. చచ్చిపోయిన తాతయ్య ఎలా కనిపిస్తాడు. తాత య్యకు నాన్నకు మనుమడికి భేదముంది. తాతయ్య పూర్వము నీకు మల్లేనే ఉన్నాడు. నాన్న ఇప్పుడున్నాడు. మనుమడు ఇక ముందర ఉంటాడు. ఈ ముగ్గుర్ని నమ్ముతారు. తాత య్యకు నీ ఆకారమువంటి ఆకారము పూర్వము ఉన్నది. అది పోయింది. మళ్ళీ రాలేదు. నీకు మీ నాన్నకి పూర్వము లేదు. ఇప్పుడున్నది. రేపు లేదు. మనవడికి మొన్న లేదు. ఇవ్వాళా లేదు. రేపు ఉంటుంది మీ తాతయ్యను నీ వెరుగుదువు. తలచు కొంటే ఆయన మూర్తి కనుపించి నట్లుంటుంది. మీ తాతయ్య ఉన్నాడా ? ఉండేవాడు. ఇప్పుడు లేడుగా తాతయ్య అంటా వెందుకు ? ఆయన్ని గురించిన భావాన్ని తాతయ్య అంటు న్నావు అల్లాగే భగవంతుడున్నూ. ఆయన చాలా కీర్తి మంతుడు. కీర్తి కనిపించదు. బుద్ధిమంతుడు బుద్ధి కనిపించదు.

గొప్ప ప్రతిభావంతుడు పరాక్రమవంతుడు. ఆ ప్రతిభా పరాక్రమములు కనిపించవు. అవి ఉన్నవా? నీవు ఒప్పుకొంటావు కదా! ఎలా ఒప్పుకొంటున్నావు? ఫలానా కార్యము వాడు చేశాడు. అందుచేత ప్రతిభ కలవాడు. కనుక కీర్తి బుద్ధి పరాక్రమ ప్రతిభలు వాళ్లు వాళ్లు చేసిన పనులనుబట్టి ఊహింపబడుచున్నవి. అంతే తప్ప వాటికి ముక్కు మొహము కాళ్ళు చెవులు లేవు. మనుష్యునకు ఊహ ఉన్నది. తెలివి ఉన్నది. వాడు విషయాలను చూచి కొన్నింటిని గ్రహిస్తాడు. ఈ సృష్టిలో మానవునకు అతీతమైనవి చాలా ఉన్నవి. తుఫాను, భూకంపము. ఇలాంటి వానికి మనము కారణము చెప్పలేము. మనుష్యుని ఊహకు ప్రధానమైనది కార్య కారణ భావము. ఒక కార్యమును చూచి కారణాన్ని ఊహించటము. అందులో ఒక సామంజస్యము ఉండటము. నీ తండ్రి పట్టణం వెళ్ళాడు. నిన్న వస్తానన్నాడు, రాలేదు. ఏమి ఊహిస్తావు? ఇంక ఏదైనా పని తగిలిందేమో! నీ చెల్లాయిని చూచి వద్దామనుకొంటున్నాడు. ఆ ఊరు వెళ్ళాడేమో? ఇల్లా ఊహిస్తావు కాని ఆకాశంలోనికి ఎగిరిపోయినాడేమో అనుకోవు గదా! దీనిపేరే సామంజస్యము. దీనిపేరే ఔచిత్యము. ఒక జరిగిన పని ఆలా జరగటానికి మనము ఒక కారణాన్ని కల్పిస్తే ఆ కారణము మనకు తెలిసినది సామంజస్యము కలిగిన దానిమీద ఆధారపడి ఉంటుంది. ఆధారపడి ఉండాలి. అలా ఈ లోకములో దీనికి కర్త మానవుడు అని చెప్పటానికి వీలులేని

అనంతములైన విషయాలున్నవి. వాటి కర్త భగవంతుడు అని అంటున్నాము. ఆ భగవంతుడు కీర్తివలె ప్రతిభవలె కార్యము చేత కారణముగా ఊహింపబడవలె తప్ప కనపడడు. కనపడక పోయినా తాతయ్య ఇలా ఉంటాడు అనే ముద్ర ఉందిగదా నీ మనస్సులో. అలాగే భగవంతుణ్ణి గురించికూడా ఒక ఆకార విశేషము ఉంటుంది. ఒక కవి ఒక పండితుడు ఒక రాజ కీయవేత్త ఉంటారు. వాళ్ళంటే మన కభిమానము. వాళ్ళని మనము చూడలేదు. కాని ఇట్లా ఉంటారు అని అనుకొంటాము ఎలా అనుకొంటాము. అది అలా ఉంచి వాళ్ళు కనపడతారు. ఒక్కొక్కప్పుడు మనము అనుకొన్నట్లే ఉంటారు. ఒక్కొక్క ప్పుడింకో మోస్తరుగా ఉంటారు. మీరిట్లా ఉంటారనుకో లేదండి. పొడుగ్గా ఎఱ్ఱగా బలిష్ఠంగా ఉంటారనుకొన్నాను అంటాం. ఒక కవి వీరరసాన్ని గురించి ప్రచండముగా రాస్తాడు. తీరా వాణ్ణిచూస్తే ఉఫ్ అంటే గాలికి ఎగిరిపోతాడు. ఇంకొక కవి మధురమైన శృంగారము రాస్తాడు. తీరా వాణ్ణి చూస్తే కోతి వాడున్నూ పినతల్లి పెదతల్లి బిడ్డలు. ఎందుకు చెబుతున్నానంటే భగవంతుణ్ణి చూడకపోయినా వాడి ఆకా రాన్ని మనము భావిస్తాము అని అనటంకోసం చెబుతున్నాను. అందుకని అనేకమంది భగవంతులున్నారు. కృష్ణుడి ఆకారము వేరు. రాముడి ఆకారము వేరు. శివుడి ఆకారము వేరు. ఇంక ఇతర మతస్థుల దేవుళ్ళ ఆకారాలు వేరు. వాళ్ళు వాళ్లు అను కునేటట్లు ఉంటారు. లేకపోతే వాళ్ళు అనుకొన్నట్లుండరు.

ఒక ఆకారాన్ని ఎందుకు భావిస్తున్నాము ? ఆ శృంగార రసము రాసిన కవి అందగాడై ఉంటాడని ఎందుకనుకొంటు న్నాము ? శృంగార రసము సర్వజంతు సామాన్యము. కాని మనయందు సౌందర్యవంతులు అయిన వాళ్లయొందలి శృంగా రమేనిజమైనశృంగారము, శృంగారము అంటే అట్లాగే ఉండాలి అది మనకు తెలియని ఒక కోరిక మనలో ఉంది. అందుకనేగా తాను అందకత్తెనే పెళ్ళి చేసికొందామనుకొంటాడు. అది అట్లాగే అనుకొంటుంది. అందుచేత మనము భగవంతుణ్ణి గురించి చేసికొనే కల్పనకూడా మన వాంఛలనుబట్టి ఉంటుంది ఆకారము లోకాన్నిబట్టి ఉంటుంది. ఆయన శక్తులు మన అవ సరాన్ని బట్టి నిర్మించుకొంటాము. అయితే ఏమవుతున్నది ? ఆ భగవంతుడు మనము కల్పించుకొన్నవాడే తప్ప యథార్థ ముగా లేడనిపిస్తున్నది అలా కాదు. ఆ శృంగార రసము వ్రాసిన కవి మనము అనుకొన్నట్లు లేడుగాని అసలు ఉన్నా డుగా. ఒక్కొకప్పుడు వాడు మనము అనుకొన్నట్లు కూడా ఉండవచ్చుగా ! పైగా మ్వము ఊరికే కల్పించలేముగా ! అందుచేత ఇందాకటి కారణాలచేత కనిపించడు భగవంతుడు. ఈ కారణాలచేత ఉన్నాడు భగవంతుడు వాడి రూపము నీవు కల్పించినది. మరి వాడేమిటి ? మానవ బుద్ధి కతీతమైన ఒక శక్తి. ఒక మహత్తు. ఒక ప్రతిభ, ఒక మహానీతి. ఇది ఇట్లా ఉంచి మీకొక సంగతి చెబుతాను. మనుష్యుడు చేయలేడు. మనుష్యున కా శక్తిలేదు. అనే విషయాలు చాలా ఉన్నవి

కదా ! చాలా విషయాలు మనుష్యుడు చేస్తున్నాడు అనటా-
నికి వీలున్నది కదా! స్త్రీ పురుషులున్నారు. వర్ణ భేదాలు
మానవుడు చేశాడు అందాము. మరి ఈ దేశములో వాళ్ళు
చేశారు అందాము. తక్కిన దేశాలలో లేదు గనక ఒప్పు-
కొందాము. అందుచేత కులభేదము లేకండా వర్ణభేదము
లేకండా జాతిభేదము లేకండా స్త్రీ పురుషులైనంత మాత్రము
చేత పెండ్లిచేసికోవచ్చు. సరేకాని వర్ణభేదాలతో పెండ్లిండ్లు
చేసికోరాదు అని మనపూర్వులు నిర్ణయించటము న్యాయమో
అన్యాయమో అట్లా ఉంచి అసలీ సృష్టిలో స్త్రీ పురుషులసలి
ఎందుకుండాలి ? పెండ్లి అని ఎందుకు చేసికోవాలి ? పెండ్లి
కూడ చేసికోకూడదనేవాళ్ళు ఉన్నారు కాని స్త్రీ పురుష భేదం
ఉండకూడదు అనేవాళ్ళు లేరు. అంటే సాగదు. ఆ స్త్రీలు
పురుషులు ఎప్పుడూ ఇంచుమించుగా చెరిసగంగా పుడుతూనే
ఉన్నారు. అల్లా పుట్టిస్తున్నాడు భగవంతుడు. కొంతమందిని
స్త్రీలనుగా పుట్టిస్తున్నాడు. కొంతమందిని పురుషులుగా పుట్టిస్తు
న్నాడు. అలా పుడుతున్నారు. అక్కడ కర్త ఎవడు లేడు
అందామా ? అంత న్యాయంగా ఉండదు. అనంత కాలములో
అనంత దేశాల్లో ఇంచుమించుగా మళ్లీ సృష్టికి సరిపోయేటట్లు
స్త్రీ పురుషుల సంఖ్యా సమానముగా ఉండేటట్లు ఉండటము
చూస్తే దీనివెనుక ఏదో ఒక పథకం ఒక మహా వివేకము ఒక
సృష్టిని సాధించే విధానము ఉందనక తప్పదు. గుడ్డి ఎద్దు చేలో
పడ్డట్టు కాదుకదా? ఈ స్త్రీ పురుష సృష్టి అంత నియతముగా

ఉంది. ఇది ఇల్లా జరగటానికి హేతువు భగవంతుడు. ఒప్పుకోక తప్పదు. ఆలోచన ఊహాభావన అన్నవి కార్యకారణ భావాన్ని ఆశ్రయించి జరుగుతున్నవి గదా ? ఈ ఆలోచన చేయగల వాడు బుద్ధిమంతుడని అంటున్నాము కదా ! ఇక్కడ కార్య కారణ భావముచేత ఒక భగవంతు డుండితీరవలె అని ఆలో చనచేత నిర్ధారణ చేయబడుతూ ఉంటే అలా చేయటం బుద్ధి మంతుడి లక్షణమైతే నేనొప్పుకొననే వాడేమౌతాడు ?

మరి ఈ రీతిగా స్త్రీ పురుషుల ను సృష్టించిన భగవంతుడు వాళ్ళవల్ల సంతానము కలుగవలెనని ఇది అవిచ్ఛిన్నముగా సాగాలని ఎందుకు సంకల్పించాడు ? పెండ్లి చేసికోవాలని అల్లాగే చేసికోవాలని అత డనుకొన్నాడా ? అనుకొనే ఉంటాడు. ఎందుకంటే మన అబ్బాయికి మనము వెయ్యి రూపాయ లిచ్చాము. వాడా వెయ్యి రూపాయలు ఫలానా రీతిగా ఖర్చుపెట్టాలి అని అనుకొంటాము. వాడితో చెబుతాము. ఇది ధర్మము. తండ్రి ఉద్దేశ్య ప్రకారము నేనిట్లా చెయ్యావలె అని ఒక కొడు కనుకొంటాడు, వాడు ఉత్తముడు. వాడే శ్రీరామచంద్రుడు. దీనిపేరే ధర్మము. మహర్షులు దీన్ని ఊహించి చెప్పారు. శ్రీరామచంద్రుడు దశరథ మహారాజు యొక్క ఉద్దేశ్యాన్ని భావించినట్లు. ఇందాక చెప్పాను. ఆ భగవంతునికి మనము రూపకల్పన చేశాము. ఆయన ఉన్నాడు. ఉన్నాడన్నది మానవశక్తి కతీతములైన విషయములచేత ఋజువవుతున్నది. ఈ సృష్టి అంతా ఒక పథకంమీద సాగు

తున్నది అన్న విషయముచేత అతని వివేకము అనంతమని తెలుస్తున్నది. ఆ భగవంతుణ్ణి ఒక పుంలింగ శబ్దంతో చెబు తున్నాము మనము లోకమునందు సర్వ కార్యములు పురు షుడు చేస్తున్నాడు గనక మనబుద్ధికి ఈ అభ్యాస ఉన్నదిగనక మనము ఆ శక్తిని భగవంతుడు అంటున్నాము ఇది వట్టి వ్యవహారము. ఈ సృష్టి ఇలా జరుగుతూ ఉన్నదానికి కర్త యైన ఆ భగవంతుడు ఈ సృష్టి ఎల్లా నడవాలో ఊహించియే ఉంటాడు కదా! ఆ ఊహాలను మహర్షులు క్రోడీకరించి దానిని ధర్మమన్నారు. ఆ ధర్మముయొక్క స్వరూప మేమిటి? ఆ ధర్మ మాచరించినందువలన అధిక ప్రయోజనం ఉన్నదా లేదా? ఉంటే అది ధర్మము. అసలీ సృష్టి స్త్రీ సంగమము వలన ఎందుకు జరగాలి? ఇంతకంటె ఆశ్చర్యకరమైన విష యము లేదే? దానిని గురించి భావించరేమి? ఇది భగవం తుడి స్వరూపములా ఉందే! ఇది ఆశ్చర్యము! మహా పవిత్ర మైనది! తల్లిదండుల సంయోగము కొడుక్కి మహా పవిత్ర మైనది గదా! వారి దాంపత్యము వీడికి పూజింప తగినది గౌరవింపతగినది. తన తన భార్యల సంయోగము తన కొడు కులకంతే కదా! ఇందులో ఉన్న పవిత్రత్వ మెట్లాంటిది? దానిని ఎట్లా పాలించాలి? మొదలైనవి మహా విషయాలు. దీనికి ప్రమాణము సంఘ సంస్కార బుద్ధి అంటారా?

# 3

ఆ మరునాడు పతంజలి ఇలా మొదలుపెట్టాడు "అయ్యా నా ఉపన్యాసాలు ఇలా విషయ విమర్శన పరంగా ఉంటవి. ఏదో భక్తిగా అందరిచేత రామ భజన చేయించి రమారమణ గోవిందో హరి అని మీచేత రామభజన చేయించే హరే రామ హరే కృష్ణ రామ రామ హరే హరే అంటూ ఎప్పుడూ అనిపించి ఇవాళ రామ కల్యాణమని మీ అందరి దగ్గర కానుకలు తీసికొని తెలియనివాళ్లని మోసగించి వాళ్లదగ్గర డబ్బు తీసికోటము నా కిష్టములేదు. రామ భజనచేస్తే ఫలితము లేదా అంటే ఉన్నది. ఫలానా ఊరికి వెళ్ళాలని వెళితే దారి తెలిసి ఉంటే లేకపోతే తెలిసికొని వెళితే ఆ ఊరు వెళతాము. తెలియకండా వెళుతూ ఉంటే ఆ ఊరెట్లా వెళతాము? ఆ ఊరుపేరు జపిస్తూ వెళితే ఆ ఊరు వెళతామా? అందుచేత జ్ఞానములేని భక్తి ఆ ఊరు తీసికెళ్ళదు. ఏదో ఊరు తీసికెళుతుంది. తప్పదు. అక్కడ ఎవడో ఒకడన్నము పెట్టకపోతాడా?

అందుచేత జౌగాములు విమర్శించుకొని ఏపనైనా చెయ్యాలి. రెండురోడ్లు కలిసినవట. ఆ ఊరు వెళ్ళటానికి కుడివేపుగా పోవాలా? ఎడమవేపుగా పోవాలా? అని అడిగితే కుడో ఎడమో నాకు తెలియదు. ఈ వేపుగా పోవాలి అని చెప్పాడట. ఇది రష్యాలో కథ. గోగాల్ అని ఒక రష్యాదేశపు నవలా రచయిత ఉన్నాడు. ఆయన చచ్చిపోయిన ఆత్మలు అని ఒక పుస్తకం రాశాడు. అందులో ఉన్నది ఇది. అలాగా కుడి ఎడమ అని తెలియకండా కూడా అటు వెళితే ఆ ఊరు వస్తుందిగా! అలాగే భక్తికూడా భగవంతుని దగ్గరకు చేర్చవచ్చు. కాని కుడి ఎడమలు తెలిసికొంటే వాడువచ్చి చూపించనక్కరలేదు. మనమే వెళ్ళవచ్చు. కనుక విషయము విచారించి సృష్టి అంటే ఏమిటి? భగవంతుడంటే ఏమిటి? పుట్టినవాడు చచ్చేవరకు ఎల్లాగో ఒక అల్లాగ బ్రతకటమే ప్రయోజనమా? డబ్బు సంపాదించటము. రాజ్యాలను సంపాదించటము, శత్రువులని చంపటము. మన సిద్ధాంతమే గొప్పదని ధూర్తంగా ప్రవర్తించటము, అధికారాన్ని దుర్వినియోగము చెయ్యటము, మనకు బలమున్నది కదా యని మన్ని ఎదిరించిన వాళ్ళని హతమార్చటం. ఇంతాచేసి చావటము. ఇదే ప్రయోజనమా? అని విచారించుకోవాలి. ఇదే ప్రయోజనమైతే ఇక్కడిదాన్ని మనము సమృద్ధిగా ఆలోచిస్తూనే ఉన్నాము. మనకోసమే కాకండా మనకుమల్లే పుట్టేవాళ్ళకి కూడా ఉపయోగంగా ఉండేటట్టు చాలాపనులు చేస్తున్నాము. అల్లా చేసినవాళ్ళే

మహానుభావులని శిలా విగ్రహాలు వేస్తున్నాము.' ఛాయాపటా లని పూజిస్తున్నాము. అలాంటివాడు ఒకడు చచ్చాడు. ఇంటింటా వాడి బొమ్మలు ఊరూరా వాడి శిలా విగ్రహాలు. వాణ్ణిగురించి పుట్టినరోజు చచ్చినరోజు పండగలు. వాడు చేసిన దేమిటయ్యా అంటే మనకు కొన్ని కాలువలు త్రవ్వించాడను కొందాము. అవి ముందు వచ్చేవాళ్ళకి కూడ ఉపయోగిస్తవి. మనము చిరకాలము బ్రతకముకదా ? మన కా భవిష్యత్తుమీద ఎంత ప్రేమ ?

సృష్టి జరిగింది. సృష్ట్యాదినుండి స్త్రీ పురుషు లున్నారు. ఇది ఎప్పుడు జరిగింది అన్న ప్రశ్న ఉన్నది. ఎవడు చెప్పినా తన ఊహ. ఊహ అనడంతోనే కొన్ని ఆధారాలు చేసికొని అది కలుగుతుందని చెప్పానుకదా ? మనము చూచే అన్నింటికి మొదలు నడుమ చివర అనేవి ఉంటున్నవి. పుడుతున్నాడు, బ్రతుకుతున్నాడు, చస్తున్నాడు. ఇలా కాకండా మనము ఊహించలేము అట్లాగే ఈ ప్రపంచకానికి కూడా ఈ మానవ సృష్టికికూడా ఆది మధ్యాంతాలు ఉండితీరాలని మనఉద్దేశ్యము. ఈ సృష్టిలో అదొక చమత్కార మున్నది. దేనికైనా సరే ఇది ఇలా జరిగి ఉండాలి అని కారణాలకోసం వెదుకు. ఆ కార ణాలు కనిపిస్తవి. ఈ సృష్టిలో ఆ జబ్బు ఉన్నది. ఈ మానవ సృష్టి పదివేల యేండ్లక్రింద జరిగి ఉండాలి. దానికి హేతువులు కనిపిస్తవి. ఇది ఎప్పుడూ ఉండి ఉండాలి. దానికీ హేతువులు కనిపిస్తవి. ఈ లోకంయొక్క స్వరూపమది. ఎవడో మనకు

అపకారము చెయ్యాలని అనుకుంటున్నాడు. దానికి కారణాలు సమృద్ధిగా కనిపిస్తవి. వాడు మనకు విరోధి కాడు మనమంటే ఇష్టం కలవాడేను. దీనికి కారణాలు కనిపిస్తవి. కనుక ఈ మానవ సృష్టి ఇన్నేండ్లక్రింద జరిగింది అని నీవు హేతువులు చూపించటానికి బయలుదేరితే హేతువులన్నీ చక్కగా కనిపిస్తవి. నిజమే ననిపిస్తవి. సగం చెప్పే నేర్పులో ఉంటుంది. దీనికంటే ముందు మరొక విషయము చెప్పాలి. దానికి మానవుని మనస్సుయొక్క స్వరూపము ఎట్లాంటిదో మనము తెలిసికొంటే ఈ చదువులు ఈ జ్ఞానాలు ఈ విశ్వాసాలు వాటి స్వరూపం తెలుస్తుంది. అయిస్‌లాండ్ ఉందిగదా, ఉత్తర ధ్రువం దగ్గర ఉంది. అది అంతా మంచు, రీండీర్ అనే ఒక లేడి ఉంటుందక్కడ, తినేది దాని మాంసము, గుడ్డలు కట్టుకొన్నా ఇళ్లుగా కట్టుకొన్నా దాని చర్మమే అక్కడివాళ్ళకాధారము. ఈ తెల్లవాళ్లు పోయి ఆ దేశాన్నికూడ ఆక్రమించారు. పాపము ఆ తెల్లజాతికి రెండే లక్షణాలు. ఒకటి— తమ క్రైస్తవ మతము వ్యాపింప చేయటము, రెండవది — అక్కడ తాము సైనిక స్థావరాలు కట్టడము. ఏదో సంపాదిద్దామని. వెనకటి యుద్ధములో ఆ దేశము వాణ్ణొకణ్ణి న్యూయార్కు తీసికెళ్లారు. అక్కడ దెబ్బయి ఎనభై అంతస్థుల మేడ లుంటవిగా. అవి చూచాడు. మళ్ళీ వెళ్ళి ఐస్‌ల్యాండులో అక్కడ ఇంతంతెత్తు మేడలున్నయంటే వాళ్ళు వీణ్ణి పిచ్చివాడి క్రింద లెక్కకట్టి ఏడిపించటం మొదలు పెట్టారు. ఇది ఎందుకు

చెప్పాలంటే మానవుడు తా నెరిగియున్న దానినే విశ్వసిస్తాడు. అదే ప్రమాణమంటాడు. తన వాదనఅంతా తాను ఎరిగియున్న దానినే ప్రమాణముగా తీసికొని వాదన చేస్తాడు. మానవ మనస్సునకున్న ఈ లక్షణాన్ని వదలిపెడితే మనకు ఏమీతేలదు. ఈ విషయము మీరు మఱచిపోకూడదు.

ఇప్పుడు మనము ప్రతిదానికి మొదలు చివర ఉన్నదని కదా అనుకొంటున్నాము. అయితే భగవంతునికి కూడ మొదలు చివరా ఉండవలె. ఉంటే వారు భగవంతుడు కాడు. అందుచేత మొదలు చివరాలేని ఒకడు కనిపించాడు. అలాగే మానవ సృష్టికికూడా మొదలు లేదేమో. మన శాస్త్రాలల్లో అక్కడక్కడ వ్రాస్తూ ఉంటారు సంసారస్య అనాదిత్వాత్ అని. అనగా ఈ సంసారమునకు మొదలు లేదని. చూడండి స్త్రీ పురుషులున్నారు. భగవంతుడు మొదట ఒక ఆడదాన్ని ఒక మగవాణ్ణి సృష్టించాడట తరువాత మీరు కంటుండండిరా అన్నాడట. ఆ మొదట తన పేగులోనుంచి గారడీవలె సృష్టించాడు గదా. తానే ఎప్పుడూ అలా చేస్తూఉంటే సరిపొయ్యేదిగా ! మన కీపని పెట్టటమెందుకు ? ఈ పెండ్లిండ్లెందుకు ? ఈ సంసారాలు చెయ్యటమెందుకు ? వాడే ఆడవాళ్ళందర్ని సృష్టించవచ్చు. మొగవాళ్ళని సృష్టించవచ్చు. అసలు సృష్టించట మెందుకంట ? అందులో వీళ్ళ ఇద్దర్ని సృష్టించటమెందుకంట ? అందర్ని మగవాళ్ళని సృష్టించకూడదూ ? అందర్ని ఆడవాళ్ళని సృష్టించకూడదూ ? దీని అర్థమేమీ లేదు. మాన

వులు మూఢంగా నమ్ముతున్నారు గనక గానీ లేకపోతే ఎప్పుడో ఒకప్పుడు భగవంతుడు స్త్రీ పురుషుల్ని సృష్టిచేశాడు అనే దానిలో అర్థంలేదు. ఓ భగవంతుడా! ఒకప్పుడు నీ వట్లా చేశావు గనక మాకీ బాధ యెందుకు? ఎప్పుడూ అల్లాగే చేస్తూఉండు. అని మనము అంటే ఆ భగవంతుడు నోరెత్త టానికి వీలులేదు.

ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే మానవ సృష్టి అనాది. ఈ స్త్రీ పురుషు లెప్పుడూ ఇలాగే ఉన్నారు. ప్రతి దానికి మొదలు ఉంటుందనే మన తెలివికి అది అందటము లేదు. భగవంతునికి మొదలు లేదు అని నమ్మగలుగుదుము. కాని మానవ సృష్టికూడ అల్లాంటిదే అని నమ్మలేకండా ఉన్నాము.

ఇప్పుడు అనాదినుంచీ మానవుడు ఉన్నాడు కదా ఎక్కడ ఉన్నాడు? అన్ని దేశాలలోను ఉన్నాడా? అని ప్రశ్నవస్తే అనాదినుండి ఒక్క హిందూదేశములోనే ఉన్నాడు అనే సమాధానము. ఇక్కడనే ఉన్నాడు. పెరుగుతున్నాడు. తరుగుతున్నాడు. ఇక్కడనుంచి ఇతర దేశాలకు వెళ్ళాడు. అక్కడా పెరిగాడు. ఎక్కడ అన్నము దొరికితే అక్కడ నివ సించాడు. వాడికి వంటి గోశము ఉంటుంది. గాలి కావాలి. అది ఎక్కడపడితే అక్కడే ఉంది. నీళ్ళు కావాలి. అందుచేత నదులున్నచోట ఇల్లు కట్టుకొని పెరిగాడు. తిండి కావాలి

పండించు కొన్నాడు. ఇలాంటి చిన్న విషయాలన్నీ తీసికొని వాటిమీద సిద్ధాంతాలు పెంచి పుస్తకాలు వ్రాయటము పాశ్చాత్యులుచేసే మహాకార్యాలలో ఒకటి. మనము ఇక్కడున్నాము. ఎక్కడికో వెళ్ళాలి. ఆ వెళ్ళటం ఎట్లా అన్న విచారణ వాళ్ళ కక్కఱలేదు. ఎక్కడినించి వచ్చామన్న విచారణ ఎక్కువ. ఈ రెండు విచారణలున్నవి. రెంటిని గూర్చి అధ్యాత్మికంగా ఆలోచించవచ్చు అది మన పూర్వఋషులు చేశారు. పాశ్చాత్యులు దీనిని ఆది భౌతికంగా చేస్తున్నారు. ఈ రెండింటిలో ఏది మంచిదో మీరే ఆలోచించుకోండి.

అనాదినుంచి మానవుడు భారత దేశములోనే ఉన్నాడు అని మీరన్నారు గదా? దానికి ప్రమాణమేమిటి? అంటే మన పురాణాలు, మన శ్రుతి స్మృతులు. మేము నమ్మము అంటే మీరు ఏది నమ్మకపోతే నా కభ్యంతరము లేదు గాని పాశ్చాత్యులు వ్రాసింది నమ్ముతాము మీరు వ్రాసింది నమ్మమంటే "బాబూ ఇది న్యాయమా?" అంటాను. కొందరిట్లా అంటారనే భగవంతుడు "స్వధర్మే నిధనం శ్రేయః పర ధర్మో భయావహః" అన్నాడు. మనది మనము నమ్మటము మంచిది. దీనిని గురించి తర్వాత చెబుతాను. పాశ్చాత్యులు మనకు చరిత్ర లేదంటారు. చరిత్ర అంటే వాళ్ళ హిస్టరి. లేకపోతే వాళ్ళు మన చరిత్ర ఎట్లా వ్రాశారు? దేని నాధారముచేసి వ్రాశారు? ఇప్పుడొక్క విషయము చెబుతా వినండి. పూర్వములో దేవతలు వచ్చి మనుష్యులతో మాట్లాడేవాళ్లు అని

మన పురాణాలవల్ల తెలుస్తున్నది. అలౌకిక శక్తులు ఉండేవి. తపస్సుచేత చాలామంది వాటిని సాధించేవాళ్లు. ఈమాటలన్నీ ఆధునికుడు విశ్వసించడు. ఇప్పుడు చంద్రమండలము దగ్గరికి కుజమండలము దగ్గరికి మనము "స్పుత్నిక్"లను పంపిస్తున్నాము. ఈ "స్పుత్నిక్" చివరఉన్న బ్యాటరీలను వదలిపెట్టి ఆ చిన్న చందమామ భూమిచుట్టు ప్రయాణము చేస్తుంది. ఇది మన ప్రకృతి శాస్త్రజ్ఞులు చేశామంటున్నారు. పత్రికల్లో వ్రాస్తున్నారు. మనము విశ్వసిస్తున్నాము. ఆ "స్పుత్నిక్" ఎట్లా ఉంటుందో దాని బొమ్మలు చూడటమేతప్ప దాని స్వరూపము మనకు తెలియదు. మనము నమ్ముతున్నాము. ఇలాంటి విషయము భవిష్యత్తులో మానవుడు చేస్తాడు అని ఆ పూర్వకాలములో తపస్సుచేసిన వాళ్ళతో చెబితే వాళ్ళు నమ్మేవాళ్ళేనా? అంతదాకా ఎందుకు. వంద ఏళ్ళక్రిందటే నమ్మేవాళ్లు కారు. ఈ నమ్మట మన్నది ఎంత చమత్కార విషయమో చూడండి! ఏది ఎందుకు నమ్ముతున్నామో మనకే తెలియదు. ఆనమ్మే తరహాకూడా తెలియదు. కళ్ళతో చూడని "స్పుత్నిక్"ను నమ్ముతున్నాము. భూగోళ పటములో ఉత్తర ధ్రువము ఉన్నదని చూపించాడు. దాన్ని నమ్ముతున్నాము. సూర్యుడికి మనకు ఇంత దూరమున్నదని చెబుతున్నాడు. దాన్ని నమ్ముతున్నాము. భూమికి ఆకర్షణశక్తి ఉన్నది అన్నాడు. దాన్ని నమ్ముతున్నాము. పూర్వము తపస్సుచేసి మహర్షులు మహా విషయాలు కనిపెట్టారు దీనిని మనము

నమ్మటంలేదు. ఆధునిక ప్రకృతి శాస్త్రము లెక్కలమీద పదార్థములయొక్క జ్ఞానముమీద తేజస్సు అగ్ని మొదలైన వాటి శక్తులమీద వేగముమీద ఆధారపడి ఉంది. ఆ తపస్సు ఆత్మశక్తిమీద ఆధారపడి ఉంది. కన్నులు మూసికొని ఇంద్రియముల నుపసంహరించి మనస్సుని బయటకు ప్రసరింపనీయకుండలోపలనే ప్రసరింపచేస్తే మహా విషయములు తెలుస్తవిఅనే దానిని మనము నమ్మటములేదు. మనకు అదీ తెలియదు ఇదీ తెలియదు. దానిని చూడలేదు దీనిని చూడలేదు. దానినెందుకు నమ్మమో దీని నెందుకు నమ్ముతామో తెలియదు. ఈ నమ్మటానికి నమ్మకపోవటానికి యెవనికి వాడు వాడి వంటి వాడు కావటం కారణం. వాడివంటి వాడు అంటే అర్థము చాలా ఉన్నది. వాడు పుట్టినదేశము, ఆ ప్రాంతము. అక్కడి జనము, వాళ్ల విశ్వాసాలు, వాడు తినే తిండి, వాడు పీల్చేగాలి, వాడు త్రాగే నీళ్లు. వాడు చదివిన చదువు, వాడు పొందిన పెంపకము, ఇవన్నీ బహిఃకారణాలు. ఇన్ని కారణాలు కలిగిన జన్మయెత్తిన వాడి తల్లిదండ్రుల రక్త శుక్లములు కూడా కారణము. అది ప్రధాన కారణము. విశ్వాసము అక్కడనుండి పుట్టుచున్నది. అందరి విశ్వాసము ఒక్కటికాదు. అందరి వివేకము ఒక్కటి కాదు. అయితే భూమికి ఆకర్షణశక్తి ఉన్నదని ఒక్కడే ఎందుకు తెలిసికొన్నాడు ? వార్తలు గాలిలో పంపించవచ్చునని ఒకడికే ఎందుకు తెలిసింది ? హోమర్ ఒక్కడే ఎందుకు పుట్టాడు ? షేక్స్పియరో కాళి

దానో ఒక్కడొక్కడే ఎందుకైనాడు? ఒకడు మహావీరుడేమి? ఒకడు మహా గాయకుడేమి ? ఒకడు మహాకవిరేమి ? అందరి తెలుపులు అందరి ప్రతిభలు ఒకటే మోస్తరుగా ఉండాలి. కోట్ల కొలది సామాన్యులు పుడుతూ ఉంటే అధికారులు కూడా వందల కొలది అయినా పుట్టటములేదు. వివేకము ఒక్కటికాదు నమ్మకము దానిమీన ఆధారపడి ఉంటుంది. వీటన్నింటికి ఇందాక చెప్పిన కారణాలే కాక కాలముకూడ ఒక కారణము."

ఆ రోజున పతంజలి ఇంటికి వచ్చాడు చిదంబరం అన్నాడు గదా "మీరు చెప్పింది ఎవ్వరికి తెలియలేదు" అని.

పతంజలి : అందరికి తెలుస్తుందని నేననుకోలేను.

చిదం . మరెందుకు చెప్పారు ?

పతం : మరి వాళ్లెందుకు విన్నారు ?

చిదం ; తెలియకండానే విన్నారు.

పతం : తెలియకండా వింటారా ? కొందరు తెలిసి వింటారు, కొందరికి తెలియక పోయినా తెలిసినట్లు ఉంటుంది.

చిదం : మీ మూర్తి విశేషము మీ కంఠధ్వనిలోని గాంభీర్యము మీరు చెప్పేతరహా వాళ్లకి తెలియకపోయినా అక్కడ కూర్చోపెట్టింది.

పతం : రహస్య మక్కడే ఉంది.

"నిన్న మీకు నమ్మకమంటే ఎట్లా ఉంటుందో ఎందు కేర్పడుతుందో దానిమీద ఆధారపడి ఉండటానికెట్లా వీలు లేదో చెప్పాను. మనము ఒక విషయాన్ని తర్కిస్తాము, మన తర్కము కూడ ఇలాగే మన విశ్వాసాలమీద ఆధారపడి ఉంటుంది. మన తర్కము మార్గము వేరు. ఇంకొకడి తర్క మార్గము వేరు. తాత్కాలికముగా ఒప్పుకున్న తరువాత దానిని అనుసరించడు కనుకనే స్వధర్మము మంచిది. ఈ స్వధర్మము ఒకటి—తన దేశము రెండు—తన సంప్రదాయము మూడు—తన దేశములోని విశ్వాసాలు నాలుగు — తన కుటుంబము అయిదు—తన ఇల్లు ఆరు — తాను. "స్వ" అంటే ఇది. అందుకనే భగవంతుడు స్వధర్మమునందు నిధనము శ్రేయము అన్నది. ఏదో ఒక దారిని పోతున్నది. అది మన పూర్వులు నడచిన దారి. అది మంచిదన్నాడు భగవంతుడు. మనకు భూతకాలాన్ని గురించి తెలియదు. ఏదో వాళ్లు వీళ్లు వ్రాసింది నిజమనుకుంటాము. భవిష్యత్తునుగూర్చి కూడ తెలియదు. ఇట్లా జరుగుతుంది—ఇట్లా జరుగుతుంది అని ఎవళ్ళో చెప్పిందే. అదీ ఊహాయే. అంతా ఇలా వట్టి ఊహామీద ఆధార పడియుండగా ఇతరుల ఊహాలను మనము ఆదరించటము దేనికి ? మనవాళ్ళ ఊహాలు మనకు ఎందుకు పనికిరావు ? మరిన్ని ఇందులో ఒకటి ఉన్నది. కొందఱు ఎందుకు ఎదురు తిరుగుతారు ? ఆ ఎదురుతిరగటంలో వాళ్ళ యెక్కువ తెలివి

కలవాళ్లా ? వాళ్ళ విశ్వాసాలు మారేందుకు వాళ్ళ నెత్తు రులో క్రొత్తపాళ్ళు ఏమైనా కలిసినవా ? అసలు తల్లిదండ్రులు బిడ్డలు ఉన్నారు బిడ్డలు తల్లిదండ్రుల మాటలు వింటారు. కొంద రెదురు తిరుగుతారు. కొంద రెదురుతిరిగినా మళ్ళీ అంకెకు వస్తారు. మరికొందరు ఇల్లు వదలిపెట్టి లేచిపోతారు. ఇంత భేదము ఎందుకుంటుంది ? దీనికి కారణ మెవరు చెప్ప లేకండా ఉన్నారు. ఏవో సూక్ష్మమైన కారణాలు ఉంటవి. మానవుడు ఆలోచనావంతుడు. ఆలోచన లేనివాడు అనాగర కుడు. మోటువాడు. వాడు పశు సమానుడు. సంఘానికి విద్రోహకరంగా ఆలోచించేవాడు క్రూరుడు. తల్లిదండ్రుల నెదిరించేవాడు దుష్టుడు. తానే తెలివి కలవాడనుకొనేవాడు అహంకారి. ఈ గుణాలన్నీ నిష్కారణముగా కొందరి కొందరి యందు కనిపిస్తున్నవి, అది అంతే. ఇది ప్రకృతి అనటము, ఆలోచన లేకపోవటము. భగవంతుడిల్లా చేశాడు పోవటము. ఆ భగవంతుణ్ణి ఒక గ్రుడ్డివాణ్ణి చేయటము. పిల్లికి చెలగాటము ఎలుకకు ప్రాణ సంకటము అంటారే అట్లాంటిది. ఆ భగవంతు నికి క్రీడయా ? బాధ అనుభవించేది మనమా ? ఈ ప్రపంచక మంతా భగవంతుని లీల అంటే ఈ దోషము ఉన్నది. దయా మయుడు అని మనముచెప్పుకో తగిన దేవుణ్ణి క్రూరుణ్ణి చేయ టమవుతుంది, అందుచేత మనమేదైనా ఒక సిద్ధాంతాన్ని చెబుతూ ఉంటే మనతెలివికి తగినంతగా దానియందు దోషాలు లేకండా చూచుకోవాలి. ఇదంతా భగవంతుని నెత్తిన రుద్దకూ డదు. మరి ఏం చెయ్యాలి ? ఒక తండ్రి కడుపున ఇద్దరు కొడు

కులు పుట్టారు. ఇద్దరూ ఒక తల్లిదండ్రుల కడుపుననే పుట్టారు. ఆ ఇద్దరన్నదమ్ముల మధ్య కొన్ని తల్లిదండ్రుల గుణాలు ఉన్నవి. కొన్ని భేదించినవి. వాళ్ళ పెంపకము, వాళ్ల తిండి, వాళ్ల చదువు అంతా ఒకటే! ఈ భేదము ఎందుకు వచ్చిందంటే వాడికేదో ప్రత్యేకత ఉన్నది అని అర్థము. వాడి జీవులలో ఒక భేదము ఉన్నదని అర్థము, ఆ భేదము ఒక్క కారణముచేతనే సమర్థింపబడాలి. వాడికి పూర్వ జన్మలు ఉన్నవి. అక్కడనుంచి కొంత తెచ్చుకొన్నాడు. ఈ తల్లిదండ్రుల దగ్గర నుండి కొంత అప్పు పుచ్చుకొన్నాడు. అందరు జీవులు ఇలాగే అవుతున్నారనుకోవాలె. వాడు పుట్టాడు. వాడి ఆకారము వేరు. వాడి కంఠస్వరము వేరు. పెరిగాడు. వాడి లక్షణాలు వేరు చాలాభాగము అందరి లక్షణాలతో కలిసిఉన్నా ఏదో ఒక భేదము కనిపిస్తున్నది. ఇది వాడి వ్యక్తిత్వము అనగా జీవు లందరు ప్రతివాడు ఒక వ్యక్తిత్వము కలవాడు. దీనికి కారణము వాడు అనేక పూర్వజన్మలు ఎత్తాడు ఇంకా ఎత్తుతాడు. ఇప్పుడు ఇలా ఉన్నాడు. ఇంత చైతన్యము ఒక ప్రత్యేక ఆకారము ఇన్ని గుణాలు కలిగిన ఒక మానవుడు హఠాత్తుగా పుట్టాడంటే మనము నమ్మటానికి వీలులేకండా ఉన్నది కనుక కర్మ సిద్ధాంతము ఒప్పుకోవాలి. దీనిని గురించి చెప్పినా ఎంతో ఎంతో లోతుకుపోయి సూక్ష్మ సూక్ష్మంగా చెప్పాలి. చాలామంది మనస్సులు ఈ సూక్ష్మ పరిశీలనకు తాళుకోలేవు. వాళ్లు నిరాకరిస్తారు. దానికి చదువుకోవాలె. వ్యాయామము

చేసినకొద్దీ శరీరానికి బలము వచ్చినట్లు చదివి ఆలోచించిన కొద్దీ మనస్సునకు బలము వస్తుంది. బలము ఉన్న కొద్దీ ఎక్కువ పనులు చేయటానికి సామర్థ్యము వస్తుంది. చదవాలి ఆలోచన కల గాలి. ఏమి చదవాలి ? మన చదువు ఉన్నది. ఇతరుల చదువులు ఉన్నవి. చదువులంటే పూర్వుల ఆలోచనలు. వాళ్ళ పూర్వులు వేరు. మన పూర్వులు వేరు. శరీర వ్యాయామము ఉన్నది. దండెములు బస్కీలు చేస్తే ఆ బలము నిలుస్తున్నది. డంబుల్సు [?]ెపిజియమ్ మొదలైనవి అభ్యాసముచేస్తే ఆ బలము నిలవటములేదు. యోగాభ్యాసము ఆసనాలు వేస్తే ఆరోగ్యము ఉంటుంది. దీర్ఘాయుర్దాయము కలుగుతుంది. ధాతువులు బాగుపడుతున్నవి. ఒక్కొక్క వ్యాయామమునందు ఒక్కొక్క అధిక విషయము కనిపిస్తున్నది. అన్నీ భిన్నభిన్నములుగా ఉన్నవి. చదువులుకూడ అట్లాగే. ఒక్కొక్క చదువు ఒక్కొక్క ఆలోచనను తీస్తున్నది. ఒక్కొక్క విశ్వాసాన్ని కలిగిస్తున్నది. ఇందులో ఇదే నిజము అని చెప్పటానికి వీలున్నట్టు కనిపించటము లేదు. ఇది ఇట్లా ఉండగా మనము ఒక చోట పుట్టాము. అక్కడే ఎందుకు పుట్టాలి? అనేకమంది జీవులు పుడుతున్నారు. ఆ పుట్టినచోట వాడెన్నుకున్నాడా ఊరికే పుడుతున్నాడా ? పూర్వ జన్మలలో కర్మ ఉన్నదంటే ఆ కర్మ ప్రకారమే పుడుతున్నాడనాలి. గుడ్డివాడి చేతిరాయి తగిలితే తగులుతుంది. లేకపోతే లేదు అన్నట్టుగా ఈ సృష్టిలో మానవులు జన్మిస్తున్నారు అంటే ఇంతకంటె నిష్ప్రయోజనమైన

వ్యవహారముండదు. దాని అంతట అది నిష్ప్రయోజనమైతే మనము చేసేది లేదుకాని ఏదైనా నిష్ప్రయోజనముగా ఉండటము మనము వాంఛించము. ఇవాళ నేనిక్కడ ఉపన్యాసము చేస్తున్నాను. మీరందరూ వచ్చారు. నిష్ప్రయోజనముగా వచ్చారా ? కొందరు తెలిసికొందామని వచ్చారు. మంచి మాటలు వింటే పుణ్యమని కొందరు వచ్చారు, కొందరు ఏమి చెబుతాడో విందామని వచ్చారు. అంటే అర్థమేమిటి? అతడు చెప్పేమాటలు మన ఊహాలకి సరిపోతాయా లేదా ? అతడు విశేషము చెబితే నేర్చుకొందాము. అతడు చెప్పే మాటలు మనకు వ్యతిరేకముగా ఉంటే అతడి మాటలు మనకు నమ్మకము కలిగించకపోతే మన విశ్వాసాలే అధికమైనవి అని దృఢపఱచుకొందాము. ఇలాంటివి ఏవో ఏవో ప్రయోజనాలు ఉంటవి. "ప్రయోజన మనుద్దిశ్యనమందో౽పి ప్రవర్తతే." ప్రయోజనము లేకండా బుద్ధి హీనుడుగూడా ప్రవర్తించడు. కనుక ప్రయోజనము లేకండా ఈ సృష్టి సాగుతున్నది అని మనము ఒప్పుకోము. ఆ ప్రయోజనమేమిటి అన్నది అట్లా ఉంచండి. కనుక మనము ఇప్పుడు రెంటిని నిర్ణయించాము. ఒకటి—మానవుడు హఠాత్తుగా పుట్టటము లేదు. హఠాత్తుగా ఏదీ పుట్టదు. అకస్మాత్తుగా పుట్టదు. పుట్టేందుకు హేతువులు ఉంటవి. నిష్ప్రయోజనముగా బ్రతకటము లేదు.

మరింకొక మహా విషయ మేమిటంటే—ఈ కాలాన్ని మనము కొలవలేము. తత్పూర్వము మానవుడు లేడు అని

మనము చెప్పలేము ఇన్ని ఏండ్లక్రిందనే మానవసృష్టి జరిగింది అని చెప్పేది నమ్మదగిన మాటకాదు. పాశ్చాత్యులు చేసిన సిద్ధాంతాలు వాండ్ల శాస్త్రకారులు చేసిన పరిశోధనలవలననే నిర్మూలింప బడుతున్నవి. క్రీస్తుపూర్వము నాల్గువేల యేండ్ల క్రింద ప్రథమ మానవుడు జన్మించాడు అన్న బైబిలు సిద్ధాంతము చాలా విషయములచేత నిరాకరింపబడుతున్నది. ఉత్తర దక్షిణ అమెరికాల మధ్య మెక్సికో అన్న సన్నని భూభాగము ఉన్నది. అక్కడ త్రవ్వకాలు పెడితే ఒక నాగరకతా చిహ్నాలు కనుపించినవి. అది క్రీస్తు పూర్వము పదివేల క్రిందటిది అని వాళ్లే చెప్పారు. మనదేశములో మొహంజో—దారప్ప అన్న ప్రదేశాలలో త్రవ్వకాలు పెట్టారు. అక్కడ బ్రహ్మాండమైన నాగరకత కనిపించింది. అది పదివేల ఏండ్లక్రిందటిదే అన్నారు. అంత నాగరకత పదివేల యేండ్లక్రింద ఉంటే మానవుడు నాగరకత పొందేందుకు వాళ్ళ లెక్క ప్రకారమే ఇంకా పదివేల యేండ్ల క్రింద ఉండి ఉండాలి. బైబిలు సిద్ధాంతమేమైంది? ఈ పరిశోధనలు మొదలు పెట్టిన వారందరు పాశ్చాత్యులు. వారు క్రైస్తవులు. వాళ్ళ మత గ్రంథములో ఉన్న విషయము వాళ్ళు చేసిన పరిశోధనలవలనే పరాస్తమైనది. అయినా వాళ్లు వాళ్ళ మత విశ్వాసాలను వదలిపెట్టలేదు. జీవలక్షణము వేరు. జ్ఞానము వేరు. తెలివితేటలు వేరు విశ్వాసము వేరు. ఆలోచన వేరు బ్రతుకు వేరు. నేను కమ్యూనిస్టు నంటాడు. శివరాత్రికి ఉపవాస ముంటాడు. దేవుడు లేడని బాహాటముగా చెబుతాడు.

ఇంటిదగ్గర రహస్యముగా పని ప్రారంభించినా విఘ్నేశ్వర పూజ చేస్తాడు. జ్యోతిషము నమ్మకూడ దంటాడు. కొడుకు చావుబతుకులమీద ఉంటె ఆ కొడుకు చక్రము పుచ్చుకొని జ్యోతిష్కుల చుట్టూ తిరుగుతాడు. ఈ మానవుల యొక్క లక్షణాలను గురించి ఎవడు చెప్పగలడు? ప్రధానము గా మానవుడు దేనికోసము బ్రతుకుతున్నాడు? ఒకటి తాను సుఖముగా బ్రతకాలి. ఆనోర్నద కాలకి లోపము ఉండకూడదు. తరువాత ఎక్కువ భోగా లనుభవించేందుకు డబ్బు కావాలి. అప్పుడు అందరూ తనమాట వినాలి. తన కధికారము కావాలి. తాను ఎంత అంటే అంత కావాలి. అక్కడనుంచి ఒక పెద్ద రోగము పుడుతుంది. ఈ లోకాన్ని తన ఇష్టము వచ్చినట్లు మార్చాలి. ఎందుకు మార్చాలి? తానొక్కడే తెలిసిన వాడు లోకము చెడిపోతున్నది దీన్ని బాగుచెయ్యాలి అని తనకేమి పట్టింది? తానేమి భగవంతుడా? తాను సృష్టికర్తా? తనకు పరమలక్ష్యము జగత్తున కుపకారము చేయటమేనా? ఇవన్నీ కలిపి చిన్న చిన్న భావాలుగా ఒక ముద్దగా అందరిలోను ఉంటవని అర్థము. అది జీవుడి లక్షణము. తన చేతిలో సైన్యాలుండి తనదగ్గర మారణాయుధాలు ఉంటే కొంతజనాన్ని నాశనము చేసైనాసరే తన సిద్ధాంతాలు ఆచరణలో పెట్టాలి. దేనికి? భవిష్యత్ప్రజలు తాను చంపగా మిగిలినవాళ్లు తన సిద్ధాంతము ప్రకారము నడిచేందుకు. నడిస్తే ఏమవుతుంది? ఏమవుతుంది? ఏమీ కాదు. కొందఱు నాగరకముగా సుఖముగా బ్రతుకుతారు

అని వాడనుకొంటాడేమో మనకు తెలియదు. లేకపోతే నేనింత చేశానని వాడికొక తృప్తియేమో. మనము మానవుల చరిత్ర చదివితే ఇలా చేసినవాళ్ళు చాలామంది ఉన్నారు. వాళ్లు చేసింది వాళ్ళతోనే పోయింది. వాడి తల తన్నినవాడు ఇంకోడు వస్తున్నాడు. మానవులకు ఈ మహా విశాలమైన దృష్టి లేదు. దీనివల్ల రెండు విషయాలు తేలుతున్నవి. ఒకటి—వాడు తానే భగవంతు డనుకొంటాడు. రెండవది — ఎవడు ఎంతచేసినా అది అస్థిరము అని తెలిసికోలేనివాడు కనుక వీడు జ్ఞానాజ్ఞాన సమ్మేళనము, అహంకారపు పోగు, అజ్ఞానానికి మూలకందము.

ఇది ఇట్లా ఉండగా ఒక ఇలాంటి శక్తిమంతుడైన పురుషుడు తాత్కాలికముగా ఒక దేశములోను నాలుగు దేశాల లోను కలిపి జయించి తన అధికారాన్ని చలామణీ చేస్తుంటే గ్రహాలకి ఉపగ్రహాలు ఉన్నట్టు వాడే పరమేశ్వరుడు వాడే సృష్టికర్త వాడే లయకారకుడు అనుకొనే అభిప్రాయమతులు కోటానుకోట్లు ఉంటారు. వాళ్ళ మూలముగానే వాడి ఆటలు సాగుతవి.

అసలు చెప్పబోయే కథవేరే. ఇంతవరకు నేను చెప్పినవన్ని ఒక విధముగా మూలసూత్రాలు. మానవుల విశ్వాసాలు, వాళ్ళ అజ్ఞాన లక్షణము, వాళ్ళ దురహంకారము, వాళ్ళ ఆలోచనలయొక్క నియమితత్వము, వీళ్ళల్లో ఎవడో ఒకడు

పుట్టి నాలుగుపళ్లు (నదులు) ఒకటిచేసే శక్తితో పుట్టటము, జీవులు హఠాత్తుగా పుట్టరు. వెనక ఏవో ఏవో సంస్కారాలు ఉంటవి. అదే మూలసిద్ధాంతాలు తెలియకపోతే మానవచరిత్ర అర్థముకాదు. ఈ మానవసృష్టి నిత్యమని తెలియకపోతే వెట్టి సిద్ధాంతాలు బయలు దేరుతవని కాల మనంతమని, తెలియక పోతే ఏర్పఱచే సిద్ధాంతాలు తప్పుత్రోవను పోతవి. మనకు తెలిసిన విషయాలమీద మాత్రమే ఒక సిద్ధాంతాన్ని నిర్మిస్తే అది నేతిబీరకాయ అవుతుంది. ఇట్లా ఉండికూడ జనము ఉన్నారుకదూ వాళ్ళనేకరకాలుగా ఉంటారు కదూ వాళ్ళ తెలివితేటలు ఒకపైసా దగ్గరనుండి రూపాయవరకు ఉంటవి కదూ. ఎక్కడి కక్కడికి ప్రతి సిద్ధాంతాన్ని అనుసరించే వా రుంటారు. వీళ్లందరు అల్పజీవులు. సిద్ధాంతాలను అనుసరించ టములో అదృష్టము కొద్ది ఒక్కొక్క సిద్ధాంతాన్ని ఎక్కువ మంది అనుసరిస్తారు. కొన్ని సిద్ధాంతాలను తక్కువమంది అనుసరిస్తారు. కొన్ని సిద్ధాంతాలు పదేళ్ళు ఉండి చస్తవి కొన్ని వెయ్యేళ్ళుంటవి. కొన్ని పదివేల యేండ్లు ఉంటవి. కొన్ని ఒక ప్రాంతములోనే ఉంటవి. కొన్ని పదిప్రాంతాలు ఆక్రమిస్తవి. కొందరు తమ సిద్ధాంతాలను వ్యాపింప చేయటమే పనిపెట్టు కొంటారు. బౌద్ధమత మలాచేసింది. రెండు మూడు వేల ఏండ్లు ప్రకాశించింది. తరువాత దాని దారిని అది వెళ్ళింది. ముసల్మాను మతము కూడ ఆ ప్రయత్నము చేసింది. అదీ కొన్నిచోట్ల స్థిరపడి ఊరుకొంది. క్రైస్తవ మతము మరీ

నాలుగువందల యేండ్లబట్టి ప్రపంచకమంతా తానే అవుదా మనుకొంటున్నది. ఏమౌతుందో తెలియదు. వీటన్నింటిని మించి కమ్యూనిజము వచ్చింది. పైన చెప్పిన అన్ని సిద్ధాంతాలను తుడిచి పెడుతుంది. అదికూడ సర్వ ప్రపంచకాన్ని ఆవరిద్దామనుకొంటున్నది ఏమవుతుందో తెలియదు. ఎవడో ఒక చక్రవర్తి పుడతాడు. ఒక నియంత పుడతాడు. వాడు వాడి అనుయాయులు ఈ ప్రపంచకములో కొంత మేరయో అంత మేరయో తమ సిద్ధాంతాలను ఆచరింపచేస్తారు. అంగీకరించని వాళ్ళకి రెండే మార్గాలు ఒకటి—చావటము రెండవది—ఆనోన్దకాలు లేకండా చేయబడటము. ఇది—మానవచరిత్ర యొక్క సారాంశము. ఇది మానవుని అహంకార కథ. ఇది మానవసృష్టి యొక్క అశాశ్వతత్వ లక్షణము.

నేను చెప్పినదంతా మానవుడు. వాడి లౌకికమైన బ్రతుకు ఆ బ్రతుకు బాటలు, అచటి లక్షణాలు, వీటిని గురించే చెప్పాను. ఇదికాక ఇంకొకటి ఉన్నది. మానవుడు అనటము తోచే చైతన్యము. ఆలోచన ఉన్నది వాటిని లోకయాత్ర కోసము వినియోగించటము నేను చెప్పిన పూర్వకథ అసలు చైతన్యమేమిటి? దానిని గురించి ఆలోచనచెయ్యటము అంతర కథ. పూర్వ విషయమంతా బాహిరమైన కథ. బాహిరమైన కథ యొక్క అశాశ్వతత్వము అహంకారతత్వము క్రూరత్వము దౌర్జన్యము తెలుస్తూనే ఉన్నది గదా. ఈ అంతరమైన కథ ఇవేమి లేనిది. ఆ విద్య అంతా ఉపనిషత్తులలో ఉన్నది. శాస్త్రములు పురాణములు దానికి దోహదము చేస్తవి. ఈ అంతర

మైన తత్వములో ఏ లేశాన్నో పట్టుకొని మతాలు పుట్టినవి. మానవులయొక్క విశ్వాసాలు భిన్నభిన్నంగా ఉంటవి. చిత్ర చిత్రముగా ఉంటవి. అందుచేత ఆ మతాలు ప్రబలుతూ ఉంటవి. మతాలు రాజ్యనిర్మాణానికి కారణాలుగా కల్పించుకుంటాడు. క్రైస్తవులు ఆఫ్రికాలోని వాళ్ళని అమెరికాలోని ఆదిమ వాసులను అందరిని క్రైస్తవులను చేశారు. వాళ్ళని దగ్గరకు రానీయరు. వాళ్ళని నానా బాధలు పెడతారు. వాళ్ళ మతము సర్వ సమానత్వాన్ని బోధిస్తూంది. సమానత్వము లేదే ! మా ఊళ్ళో నల్ల క్రైస్తవులు పాశ్చాత్య క్రైస్తవులు ఉన్నారు. నల్ల దేవాలయం వేరే ఏర్పడ్డది. సమానత్వము జీలకఱ్ఱలోని కఱ్ఱవంటిది.

# 5

అక్కడ సోమనాథశాస్త్రికి ఉద్యోగము పోయింది. అతనికి మొదటి నెలజీతము రావటముతోటే జాకబ్‌తో నేను హోటల్‌లో భోంచేస్తానని అన్నాడు. జాకబ్ ఒప్పుకోలేదు. "నీ విక్కడే భోంచెయ్యి. నీ కా నష్టమెందుకు ? ఆ డబ్బు ఇంటికి పంపించుకో" అన్నాడు. చెడ్డచేనికి మూడు మంచెలేమిటని అతడక్కడే భోంచేస్తూవుండి నెమ్మదిగా నేర్పుగా ఒడ్డుకుంటే బాగుండేది. ఏమన్నాడంటే "ఈ డబ్బు మావాళ్ళు ముట్టుకోరు. నే నిదివరకే కులము చెడిపోయినానని అనుకుంటారు. పైగా నే నీ వూరు ఉద్యోగానికి వచ్చానుగాని మతము చెడటానికి రాలేదు. ఇది కులము చెడటముకూడా కాదు. మీరు హరిజనులైనా కారు. వాళ్లు హిందువులే. మేము హిందువులమే. నా వర్ణము చెడేదే తప్ప నా మతం చెడేది కాదు. ఇప్పుడు నా మతమే చెడేటట్లుంది. నేను హిందువును. మీరు క్రైస్తవులు. మీ దేవుడు వేరు. మా దేవుడు వేరు" అన్నాడు. అంటే జాకబ్

"భగవంతుడు ఎక్కడా ఒకటే. మీరందరు మూర్ఖులు. మీకు వర్ణభేదాలు మతభేదాలు ఉన్నవి. ఇందుకనే మీ మతము నాశనమై పోతున్నది" అన్నాడు. అప్పటికైనా సోమనాథశాస్త్రి ఊరుకోలేదు. బ్రతకనేర్చినవాళ్ళు ఊరుకొంటారు. ఆవేశపరులు ఊరుకోలేరు. చిన్నప్పటినుంచి పెద్దపెద్ద పట్టణాలలోనో లక్నోలోనో అలహాబాదులోనో ఢిల్లీలోనో చదివిన వాడైతే సోమనాథశాస్త్రి కూడ "నిజమే మా మతం వట్టి చవటమతం" అనేవాడే. అంటే జాకబ్ సంతోషించేవాడే. అతని ఉద్యోగము పొయ్యేది కాదు. ఇక నన్నాడుగదా "భేదాలు ఎక్కడా ఉన్నవి. హరిజనులలో కూడ మాలలు మాదిగలు ఉన్నారు. వాళ్ళంటే వీళ్ళకి వీళ్లంటే వాళ్ళకి పడదు. ఇంకా మా బ్రాహ్మణులలో నియ్యోగులకి వైదికులకి మధ్య నున్న వైషమ్యమే చాలా బాగుంటుందని చెప్పాలి. హరిజన వాటికలలో మాలలు మాదిగలు ఒకళ్ళు వాడే బావి ఇంకొకరు వాడరు. వాళ్ళు హిందువులే గనక మీ నిందను మా మతం మీదనించి నేను తొలగించుకొనలేదు. ఈ భేదము చాలామట్టుకు తినే ఆహార పదార్థాలని బట్టికూడ వచ్చిందేమోనని నా అనుమానం. బ్రాహ్మణులు మాంసము తినరు. కోడిగ్రుడ్లు తినరు. బ్రాహ్మణేతరులు వాటిని తింటారు. మరీ మాదిగలు గొడ్డు మాంసము కూడ తింటారు. స్థూలముగా చూస్తే ఈ భేదము ఉన్నదని పిస్తుంది. మీ క్రైస్తవులు పదిబడితే అది తింటారు. మీ క్రైస్తవులలో వందభేదాలు ఉన్నవి. ఒకళ్ళకి ఒకళ్ళకి పడదు, మా

మతములో తప్పులు మీరు చూపిస్తారు మేము ఊరుకొంటాము.
మాలో కొందరు నిజమే మాలో ఆ తప్పులు ఉన్నవని ఒప్పు
కొంటారు. ఇతర మతాలవాళ్లు ఒప్పుకోరు సరిగదా పోట్లాడ
తారు. విరోధాలు పెట్టుకుంటారు. అపకారాలు చేస్తారు.
ఇది మా మతాలకి ఇతర మతాలకి భేదము. మా మతము
లోనే బ్రాహ్మణులున్నారు. ఇతర కులాల వాళ్ళున్నారు.
ఏ కులము వాణ్ణనా పేచీయే. ఒక బ్రాహ్మణులనంటేనే
ఏ పేచీ లేదు. ఒక కులాన్ని అంటే వాళ్ళు దుకాణాలని
మూసివేస్తారు. ఇంకొకళ్ళనంటే కత్తి పుచ్చుక పైకి వస్తారు.
మరి ఒకళ్ళనంటే పని చేయటము మానివేస్తారు. ఒక్క
బ్రాహ్మణులని ఏ భయము లేకండా పడిబడితే అది అనవచ్చు.
అన్ని మతాలల్లోను జవసత్వాలు ఉడిగిపోయిన మతము
హిందూమతమయితే హిందూమతములో ఉన్న అన్నివర్ణాల
లోని జవసత్వాలు ఉడిగిపోయిన వర్ణము బ్రాహ్మణ వర్ణము."

ఇంకేముంది మరునాడతని ఉద్యోగము పోయింది. అది
పైవేటు కంపెని, సర్వాధికారాలు జాకబ్వి. సోమనాథ
శాస్త్రి దగ్గర కొంతడబ్బు ఉన్నది. రెండో నెలలో ఇతడు
కొన్నాళ్ళు పనిచేశాడు. ఆ డబ్బు లెక్కచూచి జాకబ్ కిచ్చే
శాడు. సోమనాథము సోఫియా పెదతండ్రి దగ్గరకు వెళ్ళాడు.
ఇతడు ఉద్యోగము మానివేశాడని తెలియటముతోటే ఇతడు
క్రైస్తవులలో కలవడు అనే ధైర్యము అతడికి వచ్చింది.
చూస్తాను చూస్తాను అంటాడు తప్ప చేస్తాను చేస్తాను అని

గూడా అనడు. సోమనాథము వాళ్ళయింట్లో నాలుగైదు రోజులు భోంచేశాడు. పూర్వము జాకబ్ వాకిట్లోపడుకొన్నట్లే వీళ్ళ వాకిట్లో గూడ చివరకు రెండురోజులు పడుకొన్నాడు. ఉద్యోగము కుదరకపోతే ఇంటికి తిరిగి వెళ్ళేందుకు రైలుచార్జి అట్టిపెట్టుకున్నాడు. కాని అందులో కొంత బొక్కపడినది. సోఫియా పెదతండ్రి నడిగితే ఇస్తాడా? కొంపలోనించి వీడు వదలిపోతేనైనా చాలు అని ఇస్తాడేమో అని అడిగాడు. ఆయన కొడుకు నడగమన్నాడు. ఆ కొడుకు "వీడు ఇంత నీచుడేమిరా డబ్బడుగుతాడు" అన్న మొగం పెట్టాడు. ఆ మొహములో వాని నిరాదరణ సోమనాథాన్ని దాటి అతని చెల్లెలినిగూడ అతిక్రమించి చిదంబరం దాకా కూడ వెళ్ళింది. సోమనాథం ఇలా కాదని తనదగ్గర ఉన్న డబ్బుతో టిక్కెట్టు ఎంతదూరము కొనవచ్చునో అంతదూరము కొన్నాడు. రైలులో పడ్డాడు. టిక్కెట్టు తీసికెళ్ళినంత దూరము వెళ్లాడు. అక్కడనుండి తమ స్టేషన్‌దాక నక్కినక్కి ప్రయాణము చేశాడు. రైలుదిగి ప్రయాణీకులందరు వెళ్ళిపొయ్యేవరకు ప్లాట్‌ఫారంమీద తక్కుతూ తారుతూ ఉండి టిక్కెట్టడిగేవాడు లేడు అన్నప్పుడు వెళ్ళిపోయినాడు. ఇంటికి వెళ్ళాడు. ఇతని దురదృష్టం కొద్ది తండ్రి వాకిట్లో ఉన్నాడు. నానాతిట్లు తిట్టి ఇంట్లోనించి వెళ్ళగొట్టాడు. నీవు కులము చెడ్డావు. మతము చెడ్డావు అని రానీయలేదు. భార్య అడ్డమువస్తే ఆవిడ్ని బాదాడు. అప్పటికి సోమనాథము రెండు మూడురోజులు

ఇంటిచుట్టూ దొంగగా తిరిగాడు. చివరకి ఏకాడికి వచ్చిందంటే తల్లి ఇతనిని ఇంట్లోకి తీసికొంటే తండ్రి వెళ్ళిపొయ్యేటట్లు న్నాడు. బాధ్యత సోమనాథముమీద పడేటట్లున్నది. తన పొట్టనే తాను పోషించుకోలేడే తల్లిని తమ్ముణ్ణి ఎక్కడ పోషి స్తాడు. ఇంక మిలిగింది చెల్లెలు కమల ఉంది, బాపనురిది చిదంబరం ఉన్నాడు. వాళ్ల ఇంటికి వెళ్ళవచ్చునేమో అన్న ఆశ మిగిలింది. అక్కడికి వెళ్లాడు. సోఫియా ఆ ఊళ్ళో ఉందని తెలిసింది. ముందర ఆవిడ దగ్గరికి వెళ్ళాడు. మూడు రోజులబట్టి సరిగ్గా అన్నములేదు, భోజనము వేళదాకా ఉంటే ఆవిడ తను తినే నాలుగు మెతుకులు ఇతనికి కూడ పెట్టక పోతుందా. ఒకపూట కడుపునిండా తింటే తరువాత రెండు మూడు పూటలు కడుపు మాడ్చుకున్నా ఫరవాలేదు. ఆవిడ దగ్గరకు వెళ్లాడు. ఆవిడ తన భర్తయొక్క యోగక్షేమా లడిగింది. మేరీ విషయ మడిగింది. ఉద్యోగము వదలిపెట్టి వచ్చావేమన్నది ? భోజనమైన తరువాత సావకాశముగా చెబుతానన్నాడు. ఆవిడ ఇద్దరికి అన్నము తెప్పించింది. సుష్టు కృత్తుగా తిన్నాడు. తరువాత నెమ్మదిగా బుట్టలోంచి పామును తీశాడు. కథంతా వెళ్ళగ్రక్కాడు. ఆవిడ నిర్ఘాంతపోయింది. ఇంక మూడుపూటల వరకు ఫర్వాలేదు గదా అని అను కొన్నాడు. అనుకొని విడివడ్డాడు. ఇలా అన్నాడు. "ఇది నీవు నీ మొగుడితో షరీకై చేసిన అన్యాయము. నాకు రైలుఛార్జి పంపించావు. వస్తే నా మొహము చూచావు కాదు. నే నుభ

యత్రా చెడ్డాను. నా తండ్రి నన్ను ఇంట్లోనించి వెళ్ళగొట్టాడు. నీ మొగుడితో చెప్పాను. నేను కులము చెడ్డా మతము చెడను. మా దేవుడికన్న మీ దేవుడేమీ గొప్పవాడు కాడు. దేవుడంతా ఒకటి అయితే భేదము ఎక్కడుందో నాకు తెలియదు. ఏసు క్రీస్తు చెప్పింది రైటున్నూ శంకరరామానుజులు చెప్పినది తప్పు అనే అంతటి తెలివితేటలు నాకులేవు. మాలో భేదాలున్నయంటావా మీలో ఇంతకంటే భేదాలున్నవి అని చాలా చాలా చెప్పాను. అదంతా ఎందుకు ? నీవు నన్ను పాడుచేశావు. నేను మీ మేరీని పెళ్ళిచేసుకోను. వ్రతం చెడ్డా ఫలముదక్కాలి. ఆ కోతి నాకెందుకు. నీవు నాకేదన్నా ఉద్యోగము కుదిర్చి పెట్టు. కుదిర్చి పెట్టకపోతే నీవు నరకలోకాలకి పోతావు. నేను నీ వాకిట్లో సత్యాగ్రహము చేస్తాను. నాకన్నము ఎవడూ పెట్టడు. నే నెట్లాగూ ఉపవాసాలు చెయ్యాలిసిందే. ఆ తప్పని సరి ఉపవాసాలను నీ వాకిట్లో సత్యాగ్రహం క్రింద మారుస్తాను" అంటే ఆవిడ నవ్వింది. ఆవిడకి కోపం వచ్చింది, విసుగుకొన్నది, పశ్చాత్తాప పడ్డది. తన్ను తా నసహ్యించుకొన్నది. మొగుడు చెప్పినట్లు చేసినందుకు లజ్జించింది. ఉద్యోగముకాడికి వచ్చేటప్పటికి చూద్దామంది. అంటే సోమనాథానికి ఒళ్లు మండిపోయింది. అన్నాడుగదా చూద్దామంటము పనికిరాదు, అది మీ వంశములో ఉన్నమాటల్లే ఉంది. నీ పెద్దతండ్రి గూడ ఇట్లాగే అన్నాడు. చివరకు నేను రైలులో టిక్కెట్టులేకుండా దొంగతనంగా కొంతదూరము రావాలసి వచ్చింది. తప్పకండా

నేను ఇప్పిస్తాను అని అంటేగాని వీలులేదని పట్టుపట్టాడు. ఆవిడని ఇంక ఏపని చేసికోనివ్వడు. ఎవరితోను మాట్లాడ నివ్వడు. తిడితే లెక్కచేయడు. ఆవిడదేం పెద్ద గవర్నమెంటు ఉద్యోగము కాదు. బంట్రోతులని పిలిపించి వెళ్ళగొట్టటానికి కూడ ఆవిడకి శక్తిలేదు. చివరకు ఇప్పిస్తానని ఒప్పుకొంది. అప్పటికి పతంజలి మీటింగునకు వెళ్లే వేళైంది. మీటింగుకు వెళదాం రమ్మంది.

"ఏమి మీటింగు"

"నీ కిష్టమైన మీటింగు"

"నా కక్కడ ఉద్యోగము కుదురుతుందా"

"ఏమో నీ అదృష్టము"

"ఇంక నా అదృష్టముగాదు నీ అదృష్టమే"

"సరే ఈ ఊళ్లో నీ చెల్లెలు, ఆవిడ భర్త ఉన్నారు. వాళ్ళ ఇంటికి వెళ్ళావా"

"నా చెల్లెలి మొగుడేమీ తక్కువవాడు కాడు. మా నాన్నంతవాడు. నీ దగ్గర భోజనం నిశ్చయమని తెలిసి. సంశ యముగా ఉన్నచోటి కెందుకు వెడతాను? అదట్లా ఉంచి నీవు నీ మేనత్తకొడుకింటి కెడతావా ?"

"సరేకాని ఢిల్లీలో నీవు నాతో ఎప్పుడూ ఇంత ధూర్తంగా మాట్లాడలేదు"

"ధైర్యే సాహసే లక్ష్మిః" అన్నారు.

"అక్కడ నన్ను గౌరవించేవాడివి. ఇక్కడ నన్ను నువ్వు అని మొదలెట్టావు"

"మనము చుట్టాలము. నాకు ఇరవై ఒక్క ఏడు. నీకు ఇరవై యేండ్లు. నేను కనుక్కున్నాను. నేను నిన్ను నువ్వు అనాలి లేకపోతే నీకు ఆయుక్షీణము"

"నాకు రెండువేల రూపాయల జీతము. నీవు నా అంత చదువుకోలేదు"

"నీకు నాకు ఒక్కటే అక్షరం భేదము. పైగా అది ఒకటే అక్షరం. ఆ అక్షరం మన ఇద్దర్నీ డీడీ కొడుతున్నది. నీవు ఎం. ఏ. ప్యాసయ్యావు. నేను బి. ఏ. ప్యాసయ్యాను. ఆ అక్షరము కూడావస్తే నీవు మేడ్. నేను బేడ్. నీవు ఎవణ్ణో క్రైస్తవుణ్ణి పెళ్ళి చేసుకోటము మేడ్. నేను ఉద్యోగము కోసము మీ ఇంట్లోతిని చెడిపోవటము బేడ్"

"నేను నీకు ఉద్యోగము కుదర్చను నీ దారిన నీవు పో"

"నాకు దారి ఉంటేగా పొయ్యేందుకు"

"అయితే మీటింగుకు పోదాముర"

"అక్కడికి దారి ఉందిగా"

"మనకు దారితో ప్రసక్తిలేదు. కారుందిగా"

"నేను ఆరునెల్లు కారు నడపటం నేర్చుకొంటాను. నాకు నెలకు యాభయి రూపాయల ఉద్యోగమియ్యి.తరువాత

ఈ డ్రైవరును తీసెయ్యి నన్నుంచుకో. ఈ డ్రైవరుకు జీత మెంత ?"

"నెలకు ఎనభయి"

"అమ్మయ్యో కొందరు ఎం. ఏ. ప్యాసయిన వాళ్ళకు కూడ ఇంత జీతములేదే"

నీవు తరవాత పెండ్లిచేసికొంటే ఈ జీతము చాలదు"

"నేను మేరీని ప్రేమించాను. ఆవిడ్ని పెండ్లిచేసుకో టము కుదురలేదు. అందుచేత యావజ్జీవము బ్రహ్మచారిగా ఉంటాను"

"నీవు ఆ అమ్మాయిని ప్రేమించలేదు"

"తప్పు తప్పు నేను అందరు మానవులని ప్రేమిస్తు న్నాను. ఆ అమ్మాయి కోతి. పెళ్ళి చేసుకోమంటే చేసికోను. ప్రేమించటానికేం మనం కుక్కల్ని ప్రేమిస్తున్నాము. ఆవుల్ని ప్రేమిస్తున్నాము. మనము పొయిలో పెట్టే కట్టెల్ని ప్రేమి స్తాము. ఆ కట్టెల్ని యెవరైనా ఎత్తుకపోతుంటే ఊరుకొం టామా ? అవి నా కట్టెలు. ఇలా మనము ప్రేమించని దేముంది? మనది అయితే సరి మనము ప్రేమిస్తాము"

"మేరీ నీది కాలేదుగా"

"ఎందుకు కాలేదు నేనూ మనిషినే, ఆవిడా మనిషే. ఆవిడ్ని ఒక కుక్క కఱవ వచ్చింది. నేను కుక్కను కొడతానా? ఆవిడ్ని కొడతానా ? ఆవిడ నాకుమల్లే మనిషి. కుక్క ఇంకో

జాతిది. కనుక నేను మనుష్యుడను. ఆవిడకూడ మనుష్యి. అంతవరకు ఆవిడనాది, నా అని అక్కడ ఉన్నది. ఈ నా అనే భావాన్ని నేను ప్రేమిస్తున్నాను. ఆ కుక్క నా పెంపుడు కుక్కనుకో. అప్పుడు కుక్కను కొట్టను, కుక్కను అదలిస్తాను. ఆవిడతో క్షమించండి అంటాను. ఎందుచేత? నా అనే లక్షణం కుక్కను నేను పెంచటం మూలముగా ఆవిడయందుకంటె కుక్కయం దధికమయింది. నేను మేరీని ప్రేమిస్తున్నాను. ఆవిడకి రేపు జబ్బు చేసిందని వింటాననుకో. అయ్యో పాపము అనను. అంతదాకా ఎందుకు? నీవు ఉద్యోగము ఇప్పిస్తా నన్నావుగనక సరిపోయింది. లేకపోతే నేను తిండిలేక చచ్చి పొయ్యేవాణ్ణి. నేను చచ్చిపోయినానంటే ఆ మేరీ మాత్రము అయ్యో పాపము అనుకోదూ? మేరీ దాకా ఎందుకు? నా ఉద్యోగము తీసివేసిన నీ భర్త జాకబ్బే అనుకొంటాడు"

"ఆయ ననుకోడు"

"అల్లాగా, అయితే ఆయన వాలి, నీవు తారవున్నూ"

"మనిద్దరికి వరసగాదు"

"ఇంకా పాతవాసన పోలేదు మతము వర్ణము లేవు. వాని వరుసలు ఉన్నవి. ఎందుచేతనబ్బా. నాకు తెలిసింది. నీవు ఇంగువ కట్టినగుడ్డవు. ఇది సనాతన ధర్మము. దానిని ప్రశ్నించ కూడదు"

"బాగా నే ఉందికాని పతంజలి శాస్త్రిగారను గొప్ప పండితుడు. ఆయన ఉపన్యాసాలు చెబుతున్నాడు విందాము పద"

"అదిసరే కాని నన్ను పులిమిపుచ్చి ఇక్కడ ఉన్న న్నాళ్లు నా కన్నముపెట్టి ఢిల్లీకిరా అక్కడ ఉద్యోగము ఇప్పిస్తా నంటావేమో. నేను చచ్చినా ఆ ఊరురాను. ఆ జాకబ్ గారిని ఎదురుపడి గట్టిగా మందలించాలని ఉందిగాని పాప మా మేరీని మళ్ళీ నేను చూడలేను. అది అందవికారి. మ్లేచ్ఛస్త్రీ. కాని ఆవిడలోను జీవుడు ఉన్నాడు. ఆమె అమాయకురాలు. నేను నిజంగా భర్తననుకొంది"

"అంత దయకలవాడవు ఎందుకు పెళ్ళిచేసికోరాదు"

"దయవేరు. ధర్మము వేరు. పురుగులుపడి కుక్క ప్రాణాంతావస్థలో ఉన్నది. దయపడతాము. జాలిపడతాము. దాన్ని కౌగలించుకొని దానిపుండ్లు కడగము. అది పశువుల ఆస్పత్రిలో చేసేపని అంత అమాయకమైన పిల్లను అన్యాయము చేసింది వాళ్ళన్నయ్య. నేను కాకపోతే ఇంకొకడు చేసికొంటాడు. వాడు బ్రాహ్మణుడు కావచ్చు. అందరూ నావంటి వాళ్ళే ఉంటారని నమ్మకమేమిటి. మనుష్యుల కర్మనుబట్టి వాళ్ళకి జరుగుతూ ఉంటే మూర్ఖులు సంఘసంస్కారమను కొంటారు. సంస్కారం వాళ్ళ మనస్సుల్లో ఉన్న దుష్ట సంస్కారం.

# 6

ఉపన్యాసానికి సోమనాథశాస్త్రి సోఫియా కలిసివెళ్ళారు. ఈవిడతోపాటు అతడు కారు దిగాడు. అందరు ఇతనిని కూడ ఎవరో గొప్పవాడనుకొన్నారు. అందులో సోమనాథ శాస్త్రి నల్లనివాడు. మూడు నాలుగు దినములనుండి భోజనమూ లేదు. గడ్డమూ చేసికోలేదు. మనిషికి కొంచెము పెదవులు లావు. కళ్ళల్లో ఎఱ్ఱనిజీఱ. అతడెవరో సోఫియాకు మగనివైపు చుట్టమనుకొన్నారు. వచ్చాడు. సోఫియా ప్రక్కన కుర్చీలో కూర్చున్నాడు. ఇద్దరూ కూర్చోటములోను ఒకరంటే ఒకరికి బెరుకుగా లేదు, జనానికి అందుచేత అతడామెకు బాగా దగ్గరివాడు అనిపించింది. ఆ మాత్రం ఊహకి జనం ఎంత గౌరవం చూపిస్తారో లేకపోతే ఊహిస్తారో అంత ఊహిస్తున్నారు. సభ మొత్తముమీద సోమనాథశాస్త్రి నెరిగినవారు ఇద్దరే. మగవాళ్ళల్లో చిదంబరం. ఆడవాళ్ళల్లో కమల "ఇతడు మన ఇంటికి రాకండా సోఫియా దగ్గరకు వెళ్లాడేమి? ఆ

కై 9 స్తవురాలిని పెళ్ళిచేసి కొన్నాడా? సోఫియా పెదతండ్రి ఇతనికి వేరే ఉద్యోగము ఇప్పించలేదా? తొలుతగా ఉద్యోగము వదలిపెట్టి ఎందుకు వచ్చాడు? మన ఇంటికిప స్తే మనస్సు రానీయ మనుకొన్నాడా? సోఫియాతో ఇతనికి బాగా చనవు ఉన్నదే ఎందుకు ఉండదు? ఆడబిడ్డ మగడుగదా? మన సంసారాల్లో అయితే పురుషులు స్త్రీలు కొంచెపు దూరపు సంబంధమైతే ఎడమెడముగా ఉంటారు. వాళ్ళ సంఘములో లేదు. బాగా రాసుకొనే తిరుగుతారు. కరచాలనాలు చేస్తారు. శరీరము తగిలితే మన సంఘములో తప్పు. పరస్త్రీ శరీరము తగిలితే ఒళ్లు పులకరిస్తుంది. ఎరుగని పురుషుడు మనలని తాకితే ఒళ్లు గలపరిస్తుంది. యాదృచ్ఛికంగా తాకవచ్చు పరిహరించరానప్పుడు తాకటం తప్పదు. బుద్ధి పూర్వకముగా ఎవ్వరు తాకరు. వర్ణభేదమువల్ల స్పృశించటము తప్పని పెద్దనింద చేస్తున్నారు. కాని ప్రజాస్వామికమే కదా వెళ్ళి ఒకమంత్రిని సామాన్యుడు బుజముమీద చెయ్యివేస్తే వాడూరుకొంటాడా? అధికారితో చనవుగా మాట్లాడటానికి వీలుందా? అస్పృశ్యత అనేది వర్ణ భేదాలను బట్టి ఉండకూడదు కాబోలు. డబ్బు కలవాళ్ళు డబ్బు లేనివాళ్ళు అధికారము లేనివాళ్లు అధికారము ఉన్న వాళ్ళు వాళ్ళ మధ్య ఉండవచ్చు. ఉండవచ్చు కాదు ఉంది. దానిని గురించి ఎవ్వడు అనుకోడు ఊహించడు. దున్నపోతు ఈనిందిరా అంటే దూడను కట్టివెయ్యి అనేజాతి"

ఇంతలో విఠలరావు వచ్చాడు. విఠలరావు రంగన్న షావుకారు కొడుకు. సావుకారంటే వైశ్యులు కాదు. వాడు అగ్నికుల క్షత్రియుడు. ఈ ఊళ్ళో వర్తకము మొదలు పెట్టి నాలుగైదు లక్షలు సంపాదించినవాడు. ఈ విఠల్ రావు ఆ ఊళ్లోఉన్న ఇరవైమంది విప్లవకారులకు తలకట్టు. అతడొక అగ్నిపర్వతము. ఆలావా బయలుదేరితే బ్రాహ్మణమతం పొడ ఎక్కడ ఉంటే అక్కడ తగలబెడుతుంది. అతడు తన స్నేహితులతో మాట్లాడేటప్పుడు పూర్వాచార పరాయణు లందరిని బేయొనెట్ (బేయోనెట్ అనగా తుపాకి చివర గ్రుచ్చే కత్తి) చెయ్యాలి అంటాడు. అంటే కత్తులతో పొడిపించి చంపాలి అని అర్థము. వాళ్ళింతవరకు ముగ్గు రన్నదమ్ములు. ముగ్గురికి మూడు రెండు లక్షలు వస్తవి. ఇంతలో ఇంకొక తమ్ముడు పుట్టాడు. తనవంతు లక్షన్నరే అయిపోయింది. ఇద్దరు చెల్లెడ్రు న్నారు. వాళ్ళ పెండ్లిండ్లకు తండ్రి లక్ష ఖర్చు పెట్టేట్టున్నది. ఆ ఆస్తి తండ్రి స్వార్జితము. తానేమి చేయగలడు? ఇంకా తమ్ముళ్ళు పుట్టరనే నమ్మకము లేదు. ఈ విఠల్ రావు నిర్వ్యాపారి. అమెరికా పోదామనుకొన్నాడు తండ్రి డబ్బివ్వనన్నాడు ఉన్న వ్యాపారము చూసికొంటే చాలన్నాడు. అప్పుడప్పుడు తండ్రి నెదిరిస్తాడు. తండ్రికి చాలా కోపమువస్తే నీకు దమ్మిడీ ఇవ్వను సున్నా చుడతానంటాడు. ఈ విఠల్ రావుకి ఇద్దరు మగపిల్లలు. విఠల్ రావు తల్లి చనిపోయింది. రంగన్న షావుకారు రెండో పెళ్ళి చేసికొన్నాడు. ఆ సవతి తల్లికి విఠల్ రావుకి

మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గు మంటున్నది. ఆవిడ తక్కిన సవతి బిడ్డల నందరిని ప్రేమగా చూస్తుంది. ఈ విఠల్ రావు లక్ష్మీశాలామె కేమీ బాగుండదు. ఆవిడ శుక్రవారపు పూజలు చేస్తుంది. శనివారాలు రాత్రిళ్లు భోంచెయ్యదు. శనివారము శుక్రవారము ఏకాదశి ఇలాంటి పుణ్యదినాలల్లో ఇంట్లోకి మాంసముగాని కోడి గ్రుడ్లుగాని రావటానికి వీలులేదు. కోడిగ్రుడ్ల అట్టు మాంసపు కూర లేకపోతే విఠల్ రావుకి ముద్ద లేవదు. ఇతర రోజుల్లో దొంగతనంగా వాటిని తెచ్చి భార్యచేత వండింపించుకొంటాడు. సవతి తల్లి వెయ్యి కళ్ళతో చూస్తుంది. అది పెద్ద రభస. ఇద్దరూ తిట్టు కొంటారు. ఒకసారి ఇతడు సవతి తల్లిని కొట్టబోయినాడు. రంగన్నా షావుకారు కొడుకు నింట్లోనించి వెళ్ళిపొమ్మన్నాడు. ఒక నెలనాళ్ళు తండ్రి కొడుకు లిద్దరూ మాటాడలేదు. రంగన్న షావుకారు అదివరకే విల్లు వ్రాశాడు. అందులో పెద్దకొడుకైన విఠల్ రావుకి లక్ష రూపాయలు వ్రాశాడు. ఈ దెబ్బలాటతో రంగన్న షావుకారు ఆ విల్లును చింపివేశాడు. వీడిచేత చిప్పకట్ట పట్టిస్తానన్నాడు. సవతి తల్లికి అసలు తల్లికి భేదమేమిటి, సవతి తల్లిదాకా ఎందుకు. తండ్రి కొక స్త్రీతో సంబంధమున్నది. ధర్మమంటే తెలిసిన కొడుకైతే ఆ స్త్రీనికూడా తల్లివలె చూడాలి. తండ్రి తనకు తండ్రి కావటము ప్రధానము కాని అతని కామ ప్రవృత్తితో తనకేమి సంబంధము? లోకములో అనంత కోటి జీవులుంటారు. ఎవరి కామ ప్రవృత్తి వారిది. కొడుకు ఉన్నాడు. వాడు కామము

లేని వాడా? వాడి కామప్రవృత్తిని తండ్రి విచారించి హద్దు లలో పెట్టేందుకు తండ్రి కధికారమున్నది. తండ్రి కామాన్ని గురించి విచారించ తగినవాడు ఆ తండ్రియొక్క తండ్రి. నీవు కాదు. సవతి తల్లిని తల్లివలె చూడవలసినదే. ఇది ధర్మము దశరథ మహారాజునకు మూడువందల మంది భార్యలట. శ్రీరామచంద్రుడందరిని తల్లులవలెనే చూచేవాడట. అంత దాకా ఎందుకు? కైక తనకంత అపకారము చేస్తే నోరెత్తి మాటాడలేదు, ఈ ధర్మాన్ని రాముడు పాలించాడు. ఇది ధర్మమని రాముడు శాసించాడు. ఈ దేశాన్ని శ్రీరామ చంద్రుడు పాలిస్తున్నాడు" ఈ రీతిగా రంగన్న షావుకారు ఉపన్యసించాడు. రంగన్న షావుకారు పండితులకు ధారాళ ముగా ఇస్తాడు. పండితులవల్ల ఎన్నో విషయాలు విన్నాడు. ఆయనముందు సామాన్య పండితుడు నిలువలేడు. ఆయన ఏమీ చదువుకోలేదు. రంగన్న అని దస్కతు పెడతాడు. ఆ మూడ క్షరాలు అక్షరాలల్లే ఉండవు. ఆయన ఎంతంత లెక్కయినా నోటితో చేస్తాడు. ఆరునెల్లక్రింద పది ఊళ్ళకు సరుకులు పంపిస్తే ఏ సరుకు ఎంత తూకమున్నదో ఇప్పుడు గూడ చెబుతాడు. గొప్ప ధర్మాత్ముడు. ఊళ్లో అందరు అందుకనే అంత ఐశ్వర్యము కలిగిందంటారు. చివరకు వాళ్లు వీళ్లు చెబితే విఠల్ రావు తండ్రి దగ్గరకు పోయి పడ్డాడు. అంతా పరిసిపోయింది. మళ్ళీ తండ్రీ కొడుకు లొకమైనారు. కాని రంగన్న షావుకారు విఠల్ రావుని వేరే పెట్టాడు ఊళ్ళో ఏ సభయినా ఏ పుణ్యకార్య

మయినా పెత్తనదారు రంగన్న షావుకారు. ఎవరికైనా ఉప కారము చెయ్యటము విషయములో తండ్రి విఠల్ రావు చెబితే నిస్సందేహంగా చేస్తాడు కొడుకుని సన్మార్గానికి త్రిప్పటానికి ఇది మార్గమనుకొంటాడో యేమో. అక్కడఉన్న నాలుగైదు రోజులలో సోఫియాకు ఈ వాకబంతా తెలిసింది. ఆ రంగన్న షావుకారెట్లాంటివాడంటే సభలోకి వస్తే సోఫియావంక కూడ చూడడు. ఎవరో అన్నారు ఆవిడతో మీరు మాట్లాడరు. ఆవిడవంక కూడ చూడరేమి" అని. రంగన్న షావుకారు ఆ పాపం మనకెందుకూ" అన్నాడట.

సోఫియా విఠల్ రావుని గౌరవించి తన ఎడమప్రక్క కూర్చోబెట్టుకొంది. ఇంతలో పతంజలిశాస్త్రి తన ఉపన్యాసము ప్రారంభించాడు.

"నేను ఈ మూణ్ణాళ్ళబట్టి చెప్పిన విషయాలు జ్ఞాపక ముంచుకోవాలి. నాకు డబ్బు సంపాదించటము అప్రధానము. కూడు గుడ్డలకు లోపంలేకండా ఉంటే చాలు. మీరందరు ఆలోచనాపరులు కావటము నాకు ప్రధానము. పాశ్చాత్యులకు పూర్వము మనదేశమంటే తెలియదు. ఇండియా అని ఉన్నది. అక్కడ వీధుల్లోకూడా బంగారము ఉంటుంది అని విన్నారే తప్ప ఇండియా ఎక్కడ ఉందోకూడ వాళ్ళకి తెలియదు. కాని ఈ మాటలెట్లా విన్నారో ? అప్పుడు రేడియో లేదు. మాటలు గాలిలో తిరుగవు. ఎలా విన్నారంటే కొన్ని లక్షల

ష్యేండ్లుగా మనదేశపు వర్తకులు భూగోళంలో ఎక్కడెక్కడ రాజ్యాలు ఉన్నాయనరే పోయి రత్నాలు, వజ్రాలు, పునుగు జవ్వాజి కస్తూరి సన్నని బట్టలు నెమలి ఈకలు వాళ్లకమ్ముతూ వర్తకం చేస్తూ ఉండేవాళ్ళు. మన పండితులు వెళ్లి వాళ్ళకి బహు విషయాలు చెబుతూ ఉండేవాళ్ళు. అట్లా వాళ్ల దేశాలల్లో నాగరకత వ్యాపించింది. దేవుడు తత్వశాస్త్రము క్షేత్ర గణితము ఖగోళ పరిజ్ఞానము మొదలైనవన్నీ ఆదేశాల కిక్కడ నుండి వెళ్లినవే, ఒంటెలమీద గుఱ్ఱాలమీద ఈ వర్తకులు వెళ్లేవాళ్లు. పాతిక ముప్ఫైయేళ్ళకు వచ్చేవాళ్ళు. భారవి కథ వినలేదా ? భారవి మహాకవి దరిద్రుడు. భార్య నగలు కావాలన్నది. తన వ్రాసిన కిరాతార్జునీయ మహా కావ్యములోని ఒక శ్లోకాన్ని ఆకుమీద వ్రాసి ఒక షావుకారివద్ద దానిని కుదువబెట్టాడు "సహసావిదధీ తనక్రియా అవివేకం పరమా పదాం పదాం" తొందరగా ఏ పనీ చేయకూడదు. ఔగాములు విచారించక పోవటం ఆపదలకు మూలము. ఈ పద్యాన్ని ఆ సావుకారు తాకట్టు పెట్టుకొని వంద దీనారాలిచ్చాడు. ఆకాగితము చూరులో దోపాడు. అప్పటి కతనికి ఏడాది కొడుకు. వర్తకానికి వెళ్లాడు. ఈ పరదేశాలన్నీ తిరిగాడు. రోమ్, గ్రీస్. ఫ్రాన్సు అన్ని చోట్ల తిరిగాడు. పద్దెనిమిదేళ్ళకు తిరిగి వచ్చాడు. అప్పటికి కొడుక్కి ఇరవై యేళ్ళు వచ్చినవి. ఆ వర్తకుడు తిరిగి ఇంటికి వచ్చినవేళ అర్ధరాత్రి. వేసవి కాలము గాలికి అరుగుమీద తల్లీ కొడుకు ఒక మంచముమీదనే పడుకొని ఉన్నారు. అతడు తన

భార్య శీలాన్ని సంశయించాడు. ఇద్దరిని నరుకుదామను కొన్నాడు. కత్తి ఎత్తాడు ఆ కత్తి చూరులో శ్లోకము ఉన్న చోట తగిలి ఆ ఆకు క్రిందపడ్డది. ఆకేమిటా అని తీసి తాను చెకుముకి రాతితో నిప్పుచేసి అక్కడ దీపపుబుడ్డిని వెలిగించి చదివాడు. ఏ పనీ తొందరపడి చేయకూడదు. ఆలోచించకండా చేయటము ఆపదలకు హేతువు. ఆ వర్తకుడాలోచించాడు. ఈ ప్రక్కన పండుకొన్న పురుషుడెవ్వడో తెలిసికోకుండా భార్యను సంహరింపరాదు. ఇంతలో కొడుకులేచి తల్లిని లేపి "అమ్మా అమ్మా నాకు నాన్న వచ్చినట్టు కలవచ్చిందే" అన్నాడు. అది వేరే విషయము. ఇక్కడ ప్రధానమేమిటంటే మనదేశపు వర్తకులు ఒంటెలమీద గుఱ్ఱాలమీద బండ్లమీద పోయి ఆ దేశాలతో అనాదినుండి వర్తకము చేసేవాళ్లు. ఆ దేశాలవాళ్ళు అనాగరకులు. జవ్వాజి కస్తూరి పునుగు మొదలగు సుగంధ ద్రవ్యము లెరుగరు. సన్నని వస్త్రము లెరుగరు. నవరత్నము లెరుగరు. విద్య లెరుగరు. ఈ నాగరకత అంతా మన వర్తకులద్వారా మన పండితులద్వారా ఆ దేశాలకు వెళ్లింది. అక్కడి జనులు మూర్ఖులు. హిందూదేశము ధనవంతమనియే వారికి తెలుసును. వర్తకులు రత్నాలు తీసికొని వెళుతున్నారు కదా. గోల్కొండ రత్నాలని వాళ్ళకి ప్రసిద్ధి. ఇలా ఉండగా ఫ్రాన్సు, పోర్చుగల్, హాలెండ్, ఇంగ్లండ్ దేశాలు సముద్రతీర దేశాలు. వాళ్ళ దేశాలు చిన్నవి. తిండి చాలదు. జనము పెరిగిపోతున్నారు. జర్మని ఇటలి ఈ దేశాల

మీదికి వెళ్లటానికి అక్కడా రాజ్యాలు ఉన్నవి గనక సాధ్యాలు కాలేదు. వాళ్ళు వీళ్ళంతటి వాళ్ళే. వీళ్ళందరు సముద్రపు దొంగలు. సముద్రపు దొంగతనమనేది వాళ్ళ చరిత్రలో ప్రసిద్ధమైన విషయము. నేలమీదనుంచి మన దేశానికి రాలేరు గనక సముద్రాలమీదనుంచి వచ్చారు. ఇక్కడికి రాకముందు వాళ్లకొక పెద్దవ్యాధి పట్టుకుంది. నాగరకత అంటే వాళ్ళదేనని వాళ్ళ మత గ్రంథమైన బైబిలు ఆసియాలో కొసనపుట్టింది.

అది యూరపులో పుట్టలేదు. మతాలన్నీ ఆసియాలోనే పుట్టినవి, భారత దేశమునుండి ఇక్కడ మన మతాని కెదురు తిరిగినవాళ్లు శపింప బడ్డవాళ్ళు వెళ్లగొట్ట బడ్డవాళ్ళు పోయి ఇతర దేశాలల్లో స్థావరా లేర్పరచుకొని కొన్నాళ్ళదవి బ్రతుకు బ్రతికి క్రమక్రమంగా పుంజుకొని రాజ్యాలు నిర్మించి కొని జాతులుగా ఏర్పడ్డవాళ్లు. యథార్థం ఇదైతే మరింకో రీతిగా సాగింది. దైవదుర్విపాకమువలన కలి విజృంభించటము వలన మనదేశానికి వాళ్ళు ప్రభువులైనారు. వాళ్ళు ఎరగనంత నాగరకత ఇక్కడ ఉన్నది. ఇక్కడికి వచ్చినవాళ్ళల్లో మొదటివాళ్ళు అక్కడనుంచి వెళ్ళగొట్ట బడ్డవాళ్ళు. కట్టుపొగరుబోతులు దుర్మార్గులు దుర్జనులు కిరాతులు. ఇది సాధువైన దేశము. దొంగలువచ్చి అమ్మా నా కన్నములేదు అంటే ఈ దేశములో అన్నము పెడతారు. బయట చలివేస్తున్నది. మీ సావిట్లో ద్వారబంధము దగ్గర పడుకొంటానంటే పడుకో నాయనా అంటారు. వీళ్ళందరూ నిద్రపోతూ ఉండగా ఆ

దొంగ అర్ధరాత్రివేళ తలుపుతీసి ఇతర దొంగలిని లోపలికి పిలిచి ఇల్లు దోస్తాడు. మన ఆతిధ్యము మన ఔదార్యము మనకొంప తీసింది. ఇలా ఆ ఓడదొంగలు ఆ క్రూరులు ఇక్కడ ఆస్తులు సంపాదిస్తే గిడ్డంగులు కడితే వెనక ఆ డచ్చి రాజు ఆ పోర్చు గల్ రాజు ఆ ఇంగ్లండు రాజు వీళ్ళకి మద్దతు. ఈ రాజ్యమంతా చివరకు వాళ్లు తమ పరాక్రమముచేత గెల్చుకొన్నట్లు తమ కైవసము చేసికొన్నారు. ఇక్కడ భారతదేశీయులు బ్రహ్మాండ మైన నాగరకులు. ఇక్కడ సర్వవిద్యలు ఉన్నవి. అసలు నాగర కతకు ప్రధానమైన లక్షణాలేమిటంటే—ఆతిధ్యము ఔదా ర్యము, శాంతము, అసత్యమాడకండా ఉండటము, పరద్రవ్యము మన కక్కరలేదనుకోటము. ఈ లక్షణాలన్నీ భారతదేశములో సమృద్ధిగా నున్నవని వాళ్ళే రాశారు. దొంగ దోపిడి గాండ్ల కివెందుకు ? వాళ్లకి కావలసింది దోచుకుతినటం తాము గొప్ప వాళ్ళ మనుకోటము. అక్కడనించి మన మహాగ్రంథాలు వీలై నంత మట్టుకు తగలబెట్టారు మన వేదశాస్త్ర పురాణాలలో నున్న ధర్మాలన్నీ కావన్నారు. ప్రధానంగా వేదములు వ్రాసిన ఋషులు సింధునది దగ్గర పుట్టలేదు. మధ్య ఆసియాలోనే ఉత్తర ధ్రువం దగ్గరనో పుట్టారన్నారు. మానవులలో ఏ దేశ ములోనైనా బాగా చదువుకొని పండితులైన వాళ్ళసంఖ్య కొద్ది అటూ ఇటు కాని వాళ్ళు మరికొంతమంది ఉంటారు. ప్రధానమైన జనసంఖ్య వృత్తులు చేసికొంటూ సామాన్యముగా జీవయాత్ర చేసికొంటూ ఉంటారు, అందరూ రాజులు కాలేరు.

అందరూ మంత్రులు కాలేరు. అందరూ పెద్దపెద్ద ఉద్యోగాలు చేయలేరు. అందరూ సేనాపతులు కాలేరు.అందరూ పండితులు కాలేరు. కనుక జనము ఎక్కువభాగం అపండితులై ఉంటారు. ఈ సామాన్యజనాన్ని అధికారులు పరిపాలిస్తూ ఉంటారు. ఆ ఇంగ్లీషువాడి తెలివి ఏమిటంటే చదువు కొనేవాళ్లందరికి తన చదువు చెప్పాడు. వాళ్ళందరిని అధికారులను చేశాడు. తన సిద్ధాంతాలు నేర్పాడు. వంద ఏండ్లల్లో దేశమంతా మారిపోయింది. ఆర్యు లీ దేశమువాళ్లు కారని ఎక్కడనించో వచ్చారని చిన్నపిల్లల పుస్తకాలలో వ్రాయటం దగ్గరనించి నూరిపోశాడు. ఈ పని ఎందుకు చేశాడంటే ఆ మొదటి ఆర్యులే ఈ దేశమువాళ్లు కారు, ఎప్పుడూ ఈ దేశము గతి ఇంతే. ఎవళ్ళో రావటం ఆక్రమించుకోవటము, అనినేర్పాడు ఎందుకు? తానువచ్చి ఆక్రమించుకోటంలో తప్పేమీ లేదనటానికి తెలిసిందా—

# 7

తమదగ్గర వాడుకొనేందు కేమీలేదని సోమనాథశాస్త్రి సోఫియాదగ్గిర పది రూపాయలు తీసికొన్నాడు. ఆ పూట సోఫియా ఇద్దరికి అన్నము తెప్పించింది. సోమనాథశాస్త్రి రాలేను ఆ అన్నము టిఫిన్‌లు కడిగేదాని కిచ్చేసింది. సోమనాథము పూటకూళ్ల బసలో భోంచేశాడు. అతనికి చెల్లెలింటికి వెళ్ళాలా అక్కరలేదా అన్నప్రశ్న పుట్టింది. ఇక్కడ సోఫియా లేకపోతే వెళ్ళేవాడేమో. సోఫియా ఆదరించకపోతే వెళ్లేవాడేను! వెళ్ళితే ఏమయ్యేది? వాళ్ళన్నము పెట్టేవాళ్ళేనా! తండ్రికిమల్లే వెళ్లగొట్టేవాళ్లా! నిన్న సాయంత్రము వాళ్లిద్దరు తన్ను చూచారు. తన చెల్లెలుకూడ వచ్చి తనతో మాట్లాడ లేదు. కులానికింత ప్రాధాన్యమెందుకు? అందరు మనుష్యులు ఒకటేకదా? ఎక్కడ ఒకటి? తన్ను చూచి చాలామంది తాను క్రైస్తవుడనుకొన్నారు. జాకబ్‌కి చుట్టమనుకొన్నారు. ఒకళ్ళిద్దరు జాకబ్‌గారు మీకేమౌతారండి అనికూడ అడిగారు?

తనమొహం చూస్తే బ్రాహ్మణ ముఖంమల్లే ఉండదా ? ఉండదని పూర్వము చాలామంది అనటము తనకు తెలుసు. బ్రాహ్మణ ముఖమని అబ్రాహ్మణ ముఖమని హరిజన ముఖమని ఉంటుందా ? ముసల్మాను ముఖమని చీనావాడి ముఖమని జపానువాడి ముఖమని ఇంగ్లీషువాడి ముఖమని ఉంటున్నది కదా ! అల్లాగే వర్ణాలనుబట్టి ముఖాలల్లోకూడ భేదాలు ఉంటున్నవి, సామాన్యంగా మొహంచూస్తే వర్ణము తెలుస్తుంది. నూటికి యాభై మంది ముఖాలు తెలుస్తవి. పూర్వకాలములో నూటికి నూరు ముఖాలు తెలిసేవేమో తలకట్టు, బొట్టు లేక పోవటము, గడ్డాలు తీసుకోవటము చొక్కాలు ఉత్తరీయాలు ఒకలే కావటము. ఇప్పుడాభేదము అంతగా పట్టివ్వకపోయినా చాలామందిని చూస్తే వాళ్ళకులము తెలుస్తునే ఉంటుంది. ఎందుకు తెలుస్తుంది అన్న ప్రశ్న పోనియి. నేను బ్రాహ్మణ కులంలో పుట్టాను నన్ను బ్రాహ్మణుడని ఎందుకనుకోరు ? నన్ను జాకబ్‌కి చుట్టాన్ననుకొన్నారు. దానికి కారణాలు రెండు. ఒకటి నా మొహము ఇట్లా ఉండటము. రెండు సోఫియాతో కలిసి ఉండటము. అదంతా ఎందుకు ! నన్ను కమల గూడ పలకరించలేదేమి? నేను వెళ్ళి చెల్లెలిని పలకరించలేదేమి? నేను మేరీని పెళ్లిచేసికొన్నాననుకొన్నారా? మా బావమరిదికి ఉత్తరం రాశాగదా నేనీ సంధిలో పడ్డాను. నీవు పరిష్కారము చేసిపెటాలి అని. అతడు సమాధానము వ్రాయలేదే. ఢిల్లీలో ఈ పట్టింపులు లేవే. చిన్న చిన్న ఊళ్లల్లో ఈ పట్టింపులెందుకు ?

వీళ్ళు అజ్ఞానులా వాళ్లు అజ్ఞానులా ? విన్న ఉపన్యాసము చెప్పినాయన చాలా గడుసువాడు. అభియోగమంతా ఇంగ్లీషు వాళ్ళకి వ్యతిరేకంగా నిరూపించారు. ఇదంతా చెప్పే నేర్పులో ఉందా ? ఆయన చెప్పినట్లుగా దేశము మారిపోతే ఆ ఇంగ్లీషువాడు చేసిన నేర్పులో ఎందుకులేదు ? కమల ఇంటికి వెళదామా వద్దా ? ప్రతిరోజు వాళ్ళు ఉపన్యాసానికి వస్తూనే ఉన్నారు. ఇవ్వాళ మళ్ళీ ఉపన్యాసము దగ్గర కలుసుకొని మాట్లాడి మా ఇంటికి రమ్మంటే వెళదాము. విఠల్ రావుతో మాట్లాడటము పడనేలేదు. సోఫియా మాట్లాడాలి కాని నేను మాట్లాడితే ఎక్కువ లాభము ఉండదు" అనుకొంటూ సోను నాథము సోఫియా దగ్గరకు వెళ్ళాడు. సోఫియా ఏదో మొగము బిగించుక కూర్చున్నది. తాను పదిరూపాయలు ఇవ్వటంతోటే ఇతను తోక ఝాడించాడని కోపము వచ్చిందో ఏమో ? తానే వెళ్ళి సోఫియా దగ్గర కూర్చుని "ఏమండీ కోపం వచ్చిందా" అన్నాడు. సోఫియా మాట్లాడకుండా ఒక ఉత్తరము తీసి అతని చేతికిచ్చింది. ఉత్తరం ఢిల్లీనుంచి జాకబ్ దగ్గర నించి వచ్చింది. "మీ భార్యాభర్తల నడిమి ఉత్తరం నేను చూడటమెందుకు" అన్నాడు. ఆమె "అందులో నీ విషయం ఉన్నది చదువుకో" అన్నది. ఇతనన్నాడు కదా "నడుమ నడుమ మీ ప్రేమకలాప ముంటుందేమో నాకెందుకు" అన్నాడు ఉన్నా ఫరవాలేదు చదవమన్నదామె. ఉత్తరం ఇంగ్లీషులో ఉంది. దాని తెనుగుసేత ఇది "నా ప్రియమైన

సోఫియా! నీవు రెండునెల్లు అక్కడే ఉంటానని వ్రాశావు. నీ ఉద్యోగ లక్షణాన్నిబట్టి నీవు రెండు నెలలొకచోట ఉండ నక్కరలేదు. ఎందుకుంటావో తెలియదు. నేను నీ మనస్సును బాగా కష్టపెట్టాను. నాకోసము నీవు కోడిమాంసము, మేక మాంసము మొదలైనవి తిన్నావు. పందిమాంసము, గొడ్డు మాంసము తినటము నీ కిష్టములేదు. అదివట్టి పట్టింపు. లోకంలో అనేకులు తింటారు. నాతో పోట్లాడావు. పాతివ్రత్యమంటే భర్త ఏది చెయ్యమంటే అది చెయ్యాలి. మన ఇద్దరి మధ్యా పాతివ్రత్యమేమిటి? పాతివ్రత్య మన్నమాట భారతీయ ధర్మములోని మాట. మన ఇద్దరిమధ్య ఉన్నది స్నేహము. కలిసి ప్రవర్తించటము మాత్రమే మనము. మగడు పెండ్లాము మనకు మనము అన్యంగా ప్రవర్తించకుండా ఉండటము మాత్రమే ఇక్కడి ధర్మము అని నన్ను ఎదిరించావు. నాకు కోపము వచ్చింది. నీవు వెళ్ళిపోయినావు. నేను తరువాత ఆలోచించుకొన్నాను. భార్య అయినంత మాత్రమున బల వంతము చేయుట ఎందుకు? ఈ భార్య అన్నమాట వాడటా నికే నీవు ఒప్పుకోవు. ఇంగ్లీషుమాటే వ్రాయమంటావు.నిజమే, నేను నిన్ను భరించేది లేదు. నీవు నాచేత భరింపబడేదీ లేదు. అయినా ఈ దేశములో పూర్వము భార్యలకు ఎంత అసక్తి ఉన్నా భార్య అనేవాళ్ళు ఇప్పుడూ అంటున్నారు. నీవు అబల అన్న శబ్దానికి కంటగించుకొంటావు. భార్య అన్న శబ్దానికి కంటగించుకొంటావు. అబల అని అన్నందుకు పూర్వులమీద

పూర్వ గ్రంథాలమీద కోపము. భార్య అన్నందుకు నామీద కోపము. నన్ను క్షమించు. వెంటనేరా. నీ ఇష్టము వచ్చినట్లు ఉండు. అంతకన్న ముఖ్యముగా వ్రాయవలసియున్నది ఒక టున్నది. మేరీ స్థితి ఏమీ బాగాలేదు. అది అన్నం తినటం లేదు. ఎవ్వరితో మాట్లాడదు. అసలే తక్కువ మాటకారి. ఇప్పుడు ఆ కొంచెముకూడ లేదు. సాయంత్రముపూట సన్నగా జ్వరము కాస్తున్నది, డాక్టరుకి చూపించాను. రాజయక్ష్మ వ్యాధియేమో అన్నారు. బలవర్ధకమైన ఔషధాలు క్రోడిగుడ్లు సేవించ మన్నారు. ఆమె మందు పుచ్చుకోవటమే లేదు. నాకేమీ తోచ టములేదు. ఆమె పదమూడేండ్లు వచ్చేవరకు మా పల్లెటూళ్లో పెరిగిన పిల్ల. మా తల్లిదండ్రులు చనిపోవటముతోనే నేనామె నిచ్చటికి తీసుకొని వచ్చాను. ఆమెవన్నీ పల్లెటూరి ఊహాలు, పల్లెటూరి ఆచారాలు. పల్లెటూరి విశ్వాసాలు. అవి అట్లా ఉంచి ఆమెను గురించి నాకొక రహస్యము తెలిసింది. వ్రాయాలో వ్రాయకూడదో తెలియటము లేదు. సోమనాథశాస్త్రి ఉద్యో గము నేను తీసివేశానని ఆమెకు చాలా కోపముగా ఉంది. ఆమెకు జబ్బు అందుకు వచ్చినట్లుగా ఉంది. మళ్లీ అతనికి ఉద్యోగము ఇస్తే తప్ప ఈమె ఆరోగ్యవంతురాలయ్యేటట్లు లేదు. మొన్న అతడు పనికిరాడని తీసివేయించి మళ్ళీ ఇవ్వాళ సమర్థుడు ఉద్యోగమివ్వండి అంటే మా కంపెనీ అధికారులేమంటారో తెలియదు. కంపెనీలో ఉద్యోగాలన్నీ నేను క్రైస్తవులకే ఇవ్వటం మూలంగా వాళ్ళకి నామీద కోపంగానే ఉంది.

ఆ పదిమందిలో ఇద్దరు బ్రాహ్మణులున్నారు. నేనీ బ్రాహ్మణున కుద్యోగమిస్తే వారు సంతోషించారు. నేనతన్ని తీసివేశాను. తరువాత వాళ్ళతో చెప్పాను. వాళ్ళిద్దరూ కొంచెము సూటీ పోటీగానే మాట్లాడారు. ఇప్పుడు మళ్లీ చేర్చుకోమంటే నా పరువు పోతుంది. అయినా మా మేరీకోసము అతనికి ఉద్యోగము ఇస్తాను. అతని ఇష్టము వచ్చినట్లు ఉండవచ్చు. అతను ఆ ప్రాంతాలవాడే కదా! ఎక్కడ ఉన్నాడో కనుక్కొని కబురంపి ఈ సంగతి చెప్పు. అతను రావటానికి మళ్ళీ డబ్బు పంపిస్తాను—ప్రేమతో జాకబ్.

సోమనాథశాస్త్రి ఉత్తరం చదివాడు. ఉత్తరం మడిచి మళ్ళీ సోఫియా చేతికిచ్చాడు. ఆ సంగతి ఇద్దరూ మాటాడలేదు. ఉపన్యాసానికి వెళ్లారు. ఆ రోజున పతంజలిశాస్త్రి ఇలా ఉపన్యసించాడు. "భారత దేశాన్నించే మానవులందరూ ఇతర దేశాలకు వెళ్ళారు. మానవు డొకవేళ సృష్టింపబడితే వాడు భారతదేశంలోనే సృష్టింప బడ్డాడు. మానవుడు సృజింపబడేందుకు శీతోష్ణముల యొక్క సమానమైన స్థితి ఆర్యావర్తములోనే ఉన్నది అని కొందరు పాశ్చాత్య మానవ చరిత్రకారులు కూడా వ్రాశారు. మానవుడు క్రమక్రమంగా చేపలోంచి మొసలి, మొసలిలోంచి ఇంకో మృగము అందులోంచి గుర్రము తరువాత తరువాత కోతి తరువాత మానవుడు అయినాడన్న సిద్ధాంతము పశువులలోంచి పైకివచ్చిన వాళ్ళు చెప్పవలసిన మాట. మహా ప్రళయం వచ్చి సర్వజీవరాసులు అంతరించి జల

ప్రళయమైపోయిన తర్వాత ఆ మహాసముద్రము మీద భగవంతుడు వటపత్రశాయియై ఉండగా మార్కండేయ మహర్షి అక్కడకు వెళ్ళాడు. అనగా అప్పుడు గూడ మహర్షులున్నారని అర్థము. ఈ మొదటి సృష్టి మహర్షుల వలన అప్సర స్త్రీల వలన జరుగుతుంది. అచ్చంగా అందరూ ఎప్పుడు చచ్చిపోరు. మనమిది నమ్మము. ఇందాకటి కోతిలోంచి మానవుడు పుట్టాడన్నది నమ్ముతాము. నిత్యమైన చైతన్యం ఉంది. అది అవధిలేని వివేకముయొక్క ఆస్థానభూమి. వాన నీళ్ళు పరమ స్వచ్ఛములు. కొండలమీద కురిసి ఒండు అవుతవి. నేలమీద ప్రవహిస్తూ కళ్మలాన్ని గ్రహిస్తవి. ఒకచోట నిలవవుండి పాచిపడతవి. పరమ చైతన్యము వాన నీళ్లవంటిది. జనులయందు ప్రతిబింబించినది కొలది కలుషితము కావటము మొదలుపెట్టింది. మనధర్మము భగవంతుడు స్థాపించింది. ప్రవక్తలు చేసిందికాదు, ప్రవక్తలు తరువాత తరువాత పుట్టినవాళ్ళు. అందరూ భగవంతుని ప్రవక్తలైతే అందరూ తలా ఒక రీతిగా ఎందుకు చెప్పారు ? వేదము లెప్పుడు పుట్టినవో ఎవ్వరికీ తెలియదు. అహంకారులు, అజ్ఞానులు ఫలానా అప్పుడు పుట్టినవని వీళ్ళ ఇష్టము వచ్చిన కాలాన్ని నిర్ణయించినంత మాత్రంచేత వాళ్ళకంటె మూర్ఖులు నమ్మాలితప్ప ఎవరు నమ్ముతారు ? పూర్వపు సృష్టి ఎప్పుడు జరిగిందో ఎల్లా జరిగిందో ఎవ్వరికి తెలియదు. అన్నీ ఊహాలే. కొన్ని పుస్తకాల్లో వ్రాసి యున్నవి. ఆ వ్రాసిన వాని ప్రకారము ఊహించటము ఆ వెనుకటి అనంత

మైన భూతకాలాన్ని గురించి కోట్ల సంవత్సరాలనుంచి ఇలా ఉన్నదని వ్రాసింది మనవాళ్ళు. వేలెడు తన మనస్సున కందని వాడు దాన్ని కాదంటే వాని మనస్సు వేలెడంత అని అర్థము. మనవాళ్లు ఈ సృష్టిని గురించి చెప్పారు. అది పెద్ద లెఖ్క: కొన్నికోట్ల సంవత్సరాలు ఇట్లానే సాగుతుంది. ఎన్నాళ్లు ఇల్లా సాగుతుందో అన్నాళ్ళు జల ప్రళయముంటుంది. మళ్ళీ మాన వుడు బ్రతకటము మొదలుపెడతాడు. ఇప్పుడు సృష్టి మొదలు పెట్టి నూట తొంభయి అయిదు కోట్ల సంవత్సరాలకు పైన పడ్డది. వాళ్ళ భూగర్భ శాస్త్రవేత్తలు అదే చెబుతున్నారు. వాళ్ళకీ మనకీ భేదమేమిటంటే ఈ నూట తొంబై అయిదు కోట్ల సంవత్సరాలబట్టి ధాత్రిమీద మానవుడు లేడని, ఏ పదివేల యేండ్ల క్రిందో మానవోత్పత్తి జరిగిందని ఆ మానవుడు మొదట ఒక పశువువంటి వాడని క్రమక్రమంగా నాగరకుడై నాగరకత పెరిగిపెరిగి యాటంబాంబు కనిపెట్టాడని సృష్టినే వదలి పెట్టాడని. ఇదిట నాగరకతకు ప్రమాణము. నాగరకత అంటే ఏమిటో నిన్న చెప్పాను. ఆతిథ్యము ఔదార్యము దాక్షిణ్యము ధర్మము సత్యము అహింస శాంతి దాంతి. మన వాళ్ళుకూడ ఇదంతా మరచిపోయి పరమ నాగరకత అంటే యాటంబాంబు అనుకొంటున్నారు. ఇంకా చాలా అనుకొంటు న్నారు. వాళ్లనుకొనే నాగరికత ఎలా వచ్చిందో క్రమంగా చెబుతాగదా !

ఒక్క భార్యా భర్తలుంటే వాళ్లకు పదిమంది సంతానము ఉంటారు. కలౌషష్ఠిః అని ఇప్పుడరవైయేళ్ళు పూర్ణాయుర్దాయము. కొన్ని వందల యేండ్లక్రింద మనదేశంలో ఆ పాశ్చాత్య చీనా మొదలైన దేశాలలోని ప్రయాణీకులు వచ్చి వ్రాసినదాని ప్రకారమే నూట ఇరవై యేళ్లు బ్రతికేవాళ్ళు. ధర్మరాజు నూట ఇరవైయేండ్లు బ్రతికాడు. ఆయన ఇప్పటికి సుమారు ఐదువేల వంద యేండ్ల క్రిందటివాడు. రాముడు కొన్నికోట్ల సంవత్సరముల క్రిందటివాడు. ఆయన పదివేల సంవత్సరాలు రాజ్యము చేశాడు. దశరథ మహారాజు అరువది వేల యేండ్లు రాజ్యపరిపాలన చేశాడు. మనము నమ్ముముగా ? నమ్మకపోతే మునిగిపోయింది ! రెండు తలలతోడి శిశువుపుడితే టిక్కెట్లుకొని చూడటానికి వెళ్ళే జనానికి పదితలలు ఉన్న రావణాసురుడు ఉన్నాడంటే నమ్మకముంటుందా ? మన నమ్మకాల స్వరూపము చెప్పాను కదా ? హరిశ్చంద్రుడెప్పటి వాడో తెలియదు. అరు మన్వంతరాలు సప్తద్వీపములు పాలించాడట. సప్తద్వీపాలు అంటే ఏమిటి ? జంబు. కుశ, శాల్మలి, ప్లక్ష. క్రౌంచ, శాక, పుష్కరా. ఈ మాట లెప్పటినించో ఉన్నవి. ఈ ద్వీపములు రెండు రకాలుగా ఉన్నవని చెప్పబడు చున్నవి. ఉత్తరధ్రువం దగ్గర కొంతనేల. భూమిచుట్టూ కొంత సముద్రము మళ్ళీ భూమి. చుట్టుకొంతనేల. మళ్ళీ సముద్రము ఇలా ఉత్తరధ్రువం దగ్గరనుంచి దక్షిణ ధ్రువందాకా సప్త ద్వీపాలు ఉండేవని ఒక సిద్ధాంతము. ఆధునిక సిద్ధాంతము

ఇప్పుడున్న భూఖండాలని ఆ సప్త ద్వీపాలుగా విభజించటం. ఆసియా జంబూ ద్వీపము. ఏషియా మైనర్ అరేబియా మొద లైన దిప్లక్ష ద్వీపము యూరపు కుశద్వీపము ఆఫ్రికా శాల్మలి ద్వీపము. ఉత్తర అమెరికా క్రౌంచ ద్వీపము. దక్షిణ అమెరికా శాకద్వీపము. ఆస్ట్రేలియా పుష్కరద్వీపము, ఈ మాటతోం భై అయిదుకోట్ల సంవత్సరాలల్లో ఏ భూభాగము సముద్రంలో మునిగిపోయిందో ఏ క్రొత్త భూభాగం సముద్రంలోనించి బయటికి వచ్చిందో ఎవ్వరికి తెలియదు. వట్టి ఊహాలు అంచ నాలు. ఒక్కటి మాత్రము తెలుసు. నాలుగైదువేల యేండ్ల క్రింద ఆ ఇతర ద్వీపాలల్లో మనుష్యులు లేరు. ఉంటే వాళ్ళు చెప్పిన అడవి మనుష్యులు. వాళ్లెందుకున్నారు అట్లా. ఎక్కడి వాళ్ళు.

# 8

సోఫియా సోమనాథశాస్త్రి యొక్క ఉద్యోగానికి విరల్ రావుతో మాట్లాడుతానన్నది. ఆమె ప్రతిరోజు విరల్ రావుని ఉపన్యాసాలలో కలుసుకొంటునే ఉన్నది. ప్రతిరోజు ఆవిడ మాట్లాడుతుందని సోమనాథం అనుకొంటాడు. ఆవిడ మాట్లాడదు. ఇతడు మాట్లాడవేమని అడగడు. ఆవిడ ఏమను కొంటున్నదో ఇతనికి తెలుసు. ఇతడు యేమనుకొంటున్నాడో ఆవిడికి తెలుసు. ఆ సంగతి ముందర ఎవరు మాట్లాడాలా అన్నది ప్రశ్న. మానవ ప్రకృతిలో ఇది ఒక సూక్ష్మమైన అహంకారము. దానివల్ల ఎక్కువనష్టము లేనివాళ్లు మనకేం పట్టింది కదల్చవలసింది వాడు అనుకొంటారు. వీళ్లకేమినష్టము. అదిసరే అది ఎవరిపనో వాడుకూడ ఈ బెట్టుపోతాడు. ఇలాంటి సూక్ష్మ సూక్ష్మములైన అహంకారపు ముడులచేత కొందరు బాగా నష్టపడతారు. వాళ్లకి నష్టపడ్డా ఇష్టమే. అది అహంకారముయొక్క ప్రధాన స్వరూపము. వాడూ మనుష్యుడే

నేనూ మనుష్యుడనే. వాడికి కామక్రోధాలు ఉన్నవి. నాకు కామక్రోధాలు ఉన్నవి. చీము నెత్తురు వాడికున్నట్లే నాకు ఉన్నది. వాడిగొప్ప ఏముంది ? ఈ దృష్టితో అందరు మనుష్యులు సమానులే. ఇది శరీర నిర్మాణమునందలి సర్వసమానమైన లక్షణము. దీనినిపట్టి లోకమంటే తెలియని వాళ్లు అందరు సమానమనుకొంటారు. ఈ లెక్కను పశువులు మనుష్యులు కూడ సమానమే. వాటికి కామక్రోధాలు ఉన్నవి. వాటి శరీరాలల్లో కూడ నెత్తురు ప్రవహిస్తుంది. ఇంక భేదమేమిటంటే వాటికి నాలుగుకాళ్లు ఉన్నవి. నీకు రెండు కాళ్ళు రెండు చేతులు ఉన్నవి—అవి మాటాడలేవు. అయితే అవన్నీ సమానమేనా ? సింహము కుక్క సమానము కాదు. పెద్దపులి లేడి సమానము కాదు. పెద్దపులి లేడిని సునాయాసంగా చంపుతుంది. లేడి దీనిని చంపలేదు. అది పచ్చిక తిని సెలయేటి నీళ్ళు త్రాగి బ్రతుకుతుంది. పెద్దపులితో లేడి మనమిద్దరము సమానమేనంటే దానిమీదపడి కరిచితింటుంది. పెద్దపులి ముసలిదై తాను పూర్వానికి మల్లే వేటాడలేక లేడి తనదగ్గరకు వస్తే చంపటము తేలిక గనుక దాన్ని మోసగించేందుకు "ఓసి లేడీ మనమిద్దరము సమానమే. నీకూ నాల్గు కాళ్లు ఉన్నవి. నాకు నాల్గు కాళ్లు ఉన్నవి, నీ చర్మము చాలా మెత్తనైనది. నా చర్మము చాలా మెత్తనైనది. స్నేహముగా ఉందాము. ఇట్లావచ్చి మాట్లాడిపో" అని అంటే తెలివికల లేడైతే "ఓ అయ్యా పులీ ! ఈ మాటలకేమిలే. నీకు పెద్దపెద్ద కోరలు

ఉన్నవి. నీవు నా పైకిదూకి మెడకొరికి చంపగలవు. సమాన ముగాఉన్న లక్షణాలను చూపించి నా ప్రాణముతీసే లక్షణాలను దాచి ఎందుకు మోసగిస్తావు" అని దానిదారిని అది పోతుంది. తెలివి తక్కువలేళ్లు అంత పెద్దపులివచ్చి మనము సమానమనుకొంటున్నది, ఇంకేమి కావాలి అనుకొంటవి. మానవులలో కూడ ఇంతే. కొందరు రాజ్యాలు చేసేవాళ్లు మంత్రులయ్యేందుకు పార్టీలు కట్టేందుకు పక్షాలు లేవతీసేందుకు కులాభిమానాలు వృద్ధిపఱచి స్వలాభము పొందేందుకు అందరూ సమానమని చెబుతూ ఉంటారు. తెలివి తక్కువ లేళ్ళవంటి వాళ్లు నమ్ముతూ ఉంటారు. ఈ సంగతి వాడెవడో నీతిచంద్రిక అని వ్రాశాడు. ఈ మానవులు చేసే దుర్మార్గమంతా జంతువులమీద పెట్టి వ్రాశాడు. జంతువులలో నాలుగు కాళ్లు సమానము. ఆహారము అన్నింటికి కావాలి. ఆడ మగ భేదము వాటిల్లోను ఉంది. ఇటువంటి సమాన ధర్మాలు మనుష్యులలోను ఉన్నవి. అందుచేత అందరూ సమానమౌతారా? ఆ పెద్దపులి ఈ లేళ్ళను చంపి తింటుంది. అట్లాగే మనుషుల్లో అవతల వాళ్ళని చంపి తినేవాళ్ళుంటారు. శివంగి కొర్నాసిగండు దొంగతనంగా ఊళ్ళోకి రాత్రిపూట చొరబడి కుక్కల్ని ఎత్తుక పోయి మెడకొరికి చంపి నెత్తురుపీల్చి వెళ్ళిపోతుంది. కుక్క నోట్లోనుంచి సుంతధ్వని గూడా రాదు. అలాంటివాళ్లు మనుష్యులలో కూడ ఉంటారు. ఒకొక్కవ్యక్తి స్వభావము ఒకొక్కరీతిగా ఉంటుంది. ఒకొక్క ఊరి స్వభావము విలక్షణ

ణముగా ఉంటుంది. ఆ ఊళ్లోఉన్న ఎక్కువమంది మనుష్యుల
స్వభావంలో సాదృశ్యం ఉంటుంది. అందుకనే ఆ ఊరు మంచిది
అని, ఆ ఊళ్లో బిచ్చము పుట్టదని అంటూ వుంటారు. అనగా
కొన్ని లక్షణాలు కలిగిన జనము ఒకచోట పోగుపడతారని
అర్థము "ఓహో తెలుగువాడవా ? మీ తెలుగువాళ్ళందరూ
ఇంతే" అంటాడు తెలుగువాడు కానివాడు. అనగా తెలుగు
భాష మాట్లాడే వాళ్ళలో కొన్ని సామాన్య లక్షణాలు ఏర్పడి
ఉన్నవన్నమాట. అలాగే ప్రతి దేశములో ఉన్నవాళ్ళకు
ప్రత్యేక ప్రత్యేక లక్షణాలున్నవన్నది ప్రసిద్ధమైన విషయమే
కనుక వ్యక్తులమధ్య వ్యక్తులమధ్య భేదము ఉన్నది. ఊళ్ళమధ్య
భేదము ఉన్నది. భిన్న భాషలు మాట్లాడే వాళ్ళమధ్య భేదము
ఉన్నది. భిన్నజాతుల మధ్య భేదాలున్నవి. అట్లాగే భిన్న
వర్ణాలనడుమ భేదాలున్నవి. ఈ అనంతకోట్ల మానవజాతిలో
యెక్కడి కక్కడికి భేదాలు ఉంటూ ఉంటే అందరూ సమాను
లనటంలో అర్థమేమిటి? అందరూ సుఖముగా ఉండాలి. అంద
రికి కూడు గుడ్డలు ఉండాలి. ఒకళ్ళను ఒకళ్ళు హింసించ
కూడదు, మొదలైన సామాన్య ధర్మాలు మానవ విశేష
ధర్మాలు పురస్కరించుకొని అనేమాట ఇది. దానిని వదలిపెట్టి
ఎక్కడ భేదాలు విస్పష్టముగా కనిపిస్తున్నవో వాటిని కప్పి
పుచ్చి అందరు సమాన మనటము ఆ ముసలి పెద్దపులి లక్ష
ణము. ఈ భేదాలు ఎక్కడనుంచి వచ్చినవి, అందరిలోను నిండి
ఉన్న చైతన్యంలో ఈ భేదాలు లేవు. అందరికి ఉన్నకామము

ఒక్కటే కాని ఆ కామము ప్రకటింపబడే లక్షణములో చాలా భేదము ఉంటుంది. ఈ భేదము అనేక విషయాలమీద ఆధార పడి ఉంటుంది. మంచుచేత కప్పబడి యెప్పుడు చల్లగా ఉండే దేశాల్లో స్పర్శ సుఖము తక్కువ. స్త్రీ పురుషుల శరీరాలు ఒకళ్ళవి ఒకళ్ళకి తగిలితే వాళ్ళకి పులకరింపు అంత తొందరగా కలగదు. ఉష్ణ దేశాల్లో స్పర్శ సూక్ష్మంగా తీవ్రంగా ఉంటుంది. అందుకనే మన కావ్యాలల్లో శృంగారరసం చెప్పటంలో స్పర్శకు కూడా ప్రాధాన్యము ఉన్నది. తినే ఆహారాన్నిబట్టి కూడ గుణాలు భేదిస్తవి. పశువులను మాంసాహారము కోసము నలికి తోలు ఒలిచి మాంసము తీస్తూ వుంటారు. అది ఎప్పుడూ చూసేవారికి అలవాటై పోతుంది. ఒక జంతువును చంపట మంటే వాడికి లెక్కఉండదు. అది చూడటం ఎరగనివాడికి ఒళ్లు గగుర్పొడుస్తుంది భయము వేస్తుంది. కొందరు ఏడుస్తారు. కొందరు మూర్ఛపోతారు. కనుక అలవాట్లమీద కొన్ని గుణాలు ఏర్పడుతవి. శీతోష్ణపరిస్థితి,అలవాట్లు, తినే ఆహారము, వినేమాటలు, ఒకచోటి ఆచారాలు, మాట్లాడే భాష, ఇలాంటి ఎన్నో కారణాలచేత స్వభావాలు మారుతూ ఉంటవి. ఒక స్వభావము ఒక ఆహారము ఒక ఆధారము ఒక లక్షణము అల వాటైన ఒక తల్లిదండ్రుల కడుపున పుడితే వాడి నెత్తురులో ఆ లక్షణాలు ఉంటవి. మన పూర్వులమాట అట్లాఉంచి నేటికి ప్రమాణమనుకొంటున్న పాశ్చాత్యులలోనే జనటిక్స్ అనే శాస్త్రమున్నది. పురుషుని రేతో బిందువులను తీసి సూక్ష్మదర్శి

నిలో వాటిని పరీక్షిస్తే అందులోఉన్న ప్రాణలక్షణాలలో బహు భేదములు కనిపించినవి. ఇద్దరు పురుషుల రేతో బిందువులను సంయోజనము చేస్తే విపరీత లక్షణా లుదయించినవి. కొన్నాళ్ల క్రింద మదరాసులో పాశ్చాత్యులైన కొందరు గొప్ప జనిటిక్స శాస్త్ర ఆచార్యులు వచ్చి ఈ ప్రదర్శనము చేశారు. ఒకానొక విశిష్టమైన లక్షణాలు కలిగిన రేతో బిందువులకు అన్యలక్షణ సమన్వితములైన రేతో బిందువులకు సంయోగము కూడదు. ఆ రీతిగా జన్మించిన మానవులలో విపరీత గుణాలు పుడతవి. జంతు ప్రదర్శనశాలలో ఆడ పెద్దపులికి మగసింహానికి సంయోగము కలిగించి పాశ్చాత్య దేశాలలో ప్రయోగములు చేశారు. ఒక జంతువు పుట్టింది. సింహ శార్దూలాల గుణములు దాని యందు కలిసి ఉండాలని వీరి ఊహ. అది పుట్టింది. కాని బ్రతక లేక చచ్చింది. అది వేరేజాతి. ఇది వేరేజాతి ఇలా కాకుండా లేళ్ళల్లోనే అయిదారు జాతులు ఉంటవి. వాటిల్లో పరస్పర సంయోగము కలిగితే పుట్టింది బ్రతకవచ్చు. ఉభయజాతి లక్షణాలు కలిసి ఉండవచ్చు. ఒకజాతి స్త్రీకి మరొకజాతి పురుషునికి, ఒక వర్ణపుస్త్రీకి మరొక వర్ణపు పురుషునికి కలిగిన సంతాన మేమవుతున్నది ? మిశ్రలక్షణ సమన్వితమవుతున్నది. ఉభయ వృత్తులకు కాకపోతున్నాడు వాడు. కాకుండా విప్లవకారి అవుతున్నాడు. స్థితికి భంగము కలిగిస్తున్నాడు. తల్లిదండ్రుల కెదురు తిరుగుతున్నాడు. జాతి సంప్రదాయములను నాశనము చేయటానికి ప్రయత్నిస్తున్నాడు. ఇటువంటి విపరీత లక్షణాలు

కలవాళ్ళు పుడితే జగత్ క్షేమానికి భంగమని పూర్వులు వర్ణాంతర మతాంతర జాత్యంతర వివాహాలు కూడదన్నారు. లోకంలో కనిపించే పదార్థాలలో సంయోగము చేయరాని పదార్థాలు కనిపిస్తున్నవి కదా. పంచదార ఉప్పు రెండు కలిపి తింటే "ఇస్నోఫీల్" పుడుతుంది. రక్తము చెడుతుంది. దగ్గు వస్తుంది. తీపి వస్తువు కారపు వస్తువు కలవు. ప్రసిద్ధములైన ఔషధాలు అనుపాన భేదముతో భిన్నగుణాలు కలిగి స్తవి. భిన్న వ్యాధులమీద పనిచేస్తవి. శుద్ధిచేస్తే ప్రాణముతీసే రస గంధకాలు ప్రాణాన్ని నిలబెడతవి. ఈ పదార్థ జగత్తు ఈ ద్రవ్యజగత్తు వాటినిబట్టి అయినా ఈ వర్ణాంతరాది వివాహాలు కూడవని మనము తెలిసికోవచ్చు. వాటికీ మనకీ భేదం ఉన్నది. సంబంధము లేదు అంటారేమో ! భేదములేదు. సంబంధము ఉన్నది. మానవుడు సేవించే ఔషధాలన్నీ లోకములో ద్రవ్యములు, ఓషధులు లోహములు మొదలైన వానినుండి తీసినవే. జీలకర్ర రసము పుచ్చుకొంటే పైత్యము తగ్గినదంటే నీ శరీరములో జీలకర్ర యొక్క గుణముకూడ ఉన్నదని అర్థము. అందుకనియే మానవశరీరము పాంచభౌతిక మన్నారు. సర్వ సృష్టియు పాంచభౌతికము. పాంచభౌతికము కాని దేదీ లేదు. ప్రతి సృష్టి ప్రతిజీవి ప్రతిశరీరము జంతువైతేనేమి పృక్షమైతేనేమి మానవుడైతేనేమి వాటి వాటి ప్రత్యేకపు పాళ్ళతో నిర్మింపబడినవే. అడవి జంతువులకు కడుపులో నొప్పివస్తే పోయి ఒక మూలికను తింటవి. నొప్పి తగ్గుతుంది. ఆ జ్ఞానము

వాటికీ ఉన్నది. కనుక మన శరీర నిర్మాణానికి లోకమునందలి ఓషధీవృక్ష లోహాదులకు నిత్య సంబంధము ఉన్నది. భూమిలో పండే గోధుమలు వరి ఓషధులు అవి నీ శరీరాన్ని పోషిస్తు న్నవి. అనగా అవి నీలో ఉన్నవని అర్థము. వాటికి నీ శరీరానికి భేదములేదని అర్థము. విషమంటే ఏమిటి? నీ శరీరములో ఉండే ద్రవ్యమునకు భిన్నమైన ద్రవ్యమని అర్థము. అది ప్రాణాన్ని నశింపజేస్తుంది. కొన్ని విషాలు ప్రాణాన్ని వెంటనే తీస్తవి. కొన్ని కాలాంతరమున తీస్తవి. కొన్ని వ్యాధులను కల్పిస్తవి. భిన్నగుణ సహిత రేతో నిక్షేపము జరిగినచో ఇందాక చెప్పిన సింహశార్దూల సంయోగమువలె పుట్టిన బిడ్డ బ్రతుకదు. మరి యొకచోట కొన్నాళ్ళు బ్రతికి చస్తుంది. మరియొకచోట వాడు వ్యాధిగ్రస్తుడు కావచ్చు. దుర్గుణుడు దుష్టుడు కావచ్చు. అనిష్ట గుణ ప్రాప్తి కలుగవచ్చు. వ్యతిరేక లక్షణములు కలిగిన పదా ర్థము సేవిస్తే శరీరానికి ఎట్లా అరిష్టము కలుగుతుందో ఇటు వంటి సంతతి కలుగుటచేత సంఘానికి జాతికి వర్ణానికి దేశానికి అరిష్ట హేతువులైన వాళ్ళు పుడతారు. కాని కామము చాలా చెడ్డది. అజ్ఞానమంతకంటె చెడ్డది. అజ్ఞానమంటె ఈ పరిజ్ఞానము లేకపోవటము. వీటికంటె మోహమనేది ఇంకొకటి ఉన్నది. అది ఉన్న పరిజ్ఞానాన్ని లేకుండా చేస్తుంది."

సోమనాథశాస్త్రి ఒకానొక జన్మ సంస్కారముచేత ఇలా ఊహించుకొంటూ సోఫియా దగ్గరకు వెళ్ళి అహంకా రాన్ని చంపుకొని "ఏమమ్మా ఇవ్వాళనైనా విఠల్‌రావుతో

మాట్లాడుతావా" అన్నాడు. ఆమె మాట్లాడలేదు. ఆ సాయం
త్రము ఉపన్యాసానికి వెళ్లారు. ఉపన్యాసము ఇది "లోకంలో
జీవు లనేకవిధాలుగా పుడతారు. వాళ్ల గుణాలు అనేక విధా
లుగా ఉంటవి. ఉండటాని కనేక కారణాలుంటవి. మనముండే
దేశము త్రాగేనీరు పీల్చేగాలి తినే అన్నము పాలించే రాజు
యొక్క ప్రాబల్యము వీటి అన్నింటి సమాహార భూతమైన
తల్లిదండ్రుల రక్తనిష్ఠ గుణాలు ఇవన్నీ మనకు శరీరాన్ని ఇస్తు
న్నవి. ఊహలను కల్పిస్తున్నవి. ఒకడికి క్రొత్తఊహ వచ్చేటప్ప
టికి వాడి నెత్తురు మారుతున్నది. వాడి కొడుక్కి అది సంక్ర
మిస్తున్నది. ఈ ఊహలు చమత్కారాలు. వానినిబట్టి మాటలు.
వానినిపట్టి చేతలు. ఆ చేతలనుపట్టి ఊహలు. అప్పయ్య దీక్షి
తులువారని మహాపండితులు, ఆయన శ్రీ శంకరాచార్యు
లంతటివారు, మహాతపస్వి మహాపండితుడు. వాక్సిద్ధికలవాడు.
ఆయనమధ్య ఇంకొక పండితునిమధ్య విద్యాస్పర్థ ఉన్నదట.
ఆ పండితుడు దీక్షితులవారు వ్రాసిన ఒక శాస్త్రగ్రంథములో
ఒకచోట ఒక దోషమునెన్ని శిష్యుడిచేత కబురు పెట్టాడు. ఆ
శిష్యుడు తన గురువుపేరు చెప్పలేదు. దీక్షితులవారు ఆ దోషో
క్తులను విని ఈ దోషము చెప్పినవాడు చాకలివానికాలె
మన్నాడు అన్నాడట. శిష్యుడుపోయి గురువుతో చెప్పాడు,
ఆ గురువునకు దీక్షితులవారితో పాండిత్యమునందు స్పర్థకాని
దీక్షితులవారు మహాతపస్వి యని వాక్శుద్ధి కలవారని నమ్మ
కము. ఆయన తల్లి అప్పటికింకా బ్రతికేయుంది. తల్లి దగ్గరకు

పోయి "అమ్మా ! నిన్ను శంకించటానికి వీలులేదు. కొడుకు నైన నాకా అధికారము లేదు, నీ వెట్టిదానివైనా నా తల్లివే. ఈ శరీరమును నీవు నాకిచ్చావు. అప్పయ్య దీక్షితులు ఆయన నోటివెంట అబద్ధమురాదు" అంటే తల్లి అన్నదట "నాయనా నేనే పాపము ఎరుగను. నీవు నీ తండ్రికి పుట్టిన బిడ్డవేకాని నేనానాడు బయటిఉండి స్నానముచేసి వెంటనే వాకిటిలోనున్న మీ నాయనగారిని చూడవలెనని వస్తూఉండగా తెల్లనిబట్ట కట్టు కొని చంగులుతేలిన ఉత్తరీయము తలపాగ పెట్టుకొని చాకలి వాడు గడపముందు నిలుచుండి నాకు తొలుత కనిపించినాడు. ఇంతే నే నెరుగుదును అన్నదట, చూడండి. జీవలక్షణము ఎంత విచిత్రముగా భేదిస్తుందో, ఆ పండితుడి తల్లి ఎంతో యోగ్యు రాలు. ఆ వేళయందు పడిన దృష్టిపాతము ఎంతపని చేసిందో ! ఆ సమయములో ఆవిడకు తెలియకుండా జీవునిలోఉన్న ఒక కోర్కెను వానిరూపము స్పృశించిందన్నమాట. పాతివ్రత్య మంటె ఎటువంటిదో చూడండి. జీవుల లక్షణాలు ఎట్లా భేది స్తవో చూడండి. పాండిత్యము ఆలోచన వాదనాశక్తి మొద లైనవే భేదించి పోతున్నవి. ఇంక తక్కిన గుణాలమాట చెప్ప వలెనా ? యుగ యుగాలుగా భారత దేశమునుండి మానవులు ఇతర ద్వీపాలకువెళ్ళి అక్కడ నివాసము నేర్పరచుకొంటూనే యున్నారు, నశించిపోతూనే ఉన్నారు. ఈ ఆసియాఖండము జంబూద్వీపము. మనది భరత ఖండము. టిబెట్టు చీనాలు మేరు పర్వత మనేవాళ్ళు. అందుకని దానిని సుమేరు దేశమనేవాళ్లు

అక్కడ నివసించే వాళ్ళకి సుమేరియనులను పేరు వచ్చినది. మొదట మనదేశమునించి వెళ్ళినవాళ్ళు, అక్కడ యజ్ఞాలు కూడ చేసేవాళ్లు. యజ్ఞములయందు పాతే స్తంభానికి యూప మని పేరు. వాళ్ళు దానికి యూపరతీశ నది అని పేరు పెట్టు కొన్నారు. దానినిప్పుడు యూఫ్రటీస్ అంటున్నారు. మన దేశాన్నుంచి మానవ ప్రవాహం ఒకటి ఇల్లా వెళ్ళింది. రెండవది సముద్రము మీదనుంచి శాల్మలీ ద్వీపం వెళ్ళింది అంటే ఆఫ్రికా.

# 9

"నిజం పడితే ముందర యూపరతీశనది చుట్టుపట్లఉన్న రాజ్యాలను గురించి చెప్పాలి ఇంకా పడమరకి పోతే త్రిగిరీశనది ఉన్నది. దానినే నేడు టైగ్రిస్ అంటున్నారు. ఇది అంతా సుమేరుదేశము. కాని పాశ్చాత్యుల లెక్కల ప్రకారము ఇక్కడి నాగరికతకంటె శాల్మలీ ద్వీపములోనున్న ఈశపీఠము అనగా నేటి ఈజిప్టునందలి నాగరికత పురాతనము. పాశ్చాత్యులు భూమిని త్రవ్వి పూడిఉన్న మేడలు ఇండ్లు పనిముట్లు వానిని బయటకుతీసి ఇన్నివేల సంవత్సరాలైతే భూమిమీద మంటిపొర ఇంత పెరుగుతుందని లెక్కలుకట్టి ఆ ప్రకారముగా ఆయా దేశములందలి ఆయా జాతులయొక్క పురాతనత్వాన్ని నిర్ణయించుకొన్నారు. అది ఒక లెక్క. ఈశపీఠము అనగా ఈజిప్టు నేడు ఆఫ్రికా అనబడే శాల్మలీ ద్వీపంలో ఉన్నది. ఆ దేశంలో ఈశాన్య దిశయందున్నది. అచట నీలానది ప్రవహిస్తున్నది. భారత దేశీయులు అక్కడికి ఎన్నికోట్ల సంవత్సరాలకింద వెళ్లారో

తెలియదు. చెప్పానుకదా హరిశ్చంద్రుడు సప్తద్వీపమైన వసుంధరను కొన్ని మన్వంతరాలు పాలించాడని. సప్తద్వీప ములయందు మానవులు అనాదిగా నివసిస్తూనే యున్నారు. కోట్ల సంవత్సరాలమీద లక్షల సంవత్సరాలమీద ఏ దేశం సము ద్రముపొంగి మునిగిపోతుందో ఏ భూభాగము మళ్ళీ పైకి వస్తుందో ఏ దేశము నిర్జనమై పోతుందో ఎక్కడి జనులు మహా పాపము చేయుటము మూలంగా సర్వనాశనమై పోతారో ఎక్కడివాళ్ళు ఆటవికులుగా మారిపోతారో ఏమీ తెలియదు. ఇప్పుడు ప్రపంచకములో ఒక సిద్ధాంతము బయలుదేరింది. దేవుడులేడని పూర్వ పరజన్మలులేవని అనేమతాలు ఉండనే ఉన్నవి. వీళ్ళకి వృత్తులున్నవి. మారణాయుధాలు సమృద్ధిగా ఉన్నవి. యుద్ధ నావలున్నవి. విమానాలున్నవి. వీళ్ళ నాగరి కతంతా వీటిమీద ఆధారపడి ఉన్నది. లేకపోతే వీళ్ళు ఆట వికులే. ధర్మము దయ సత్యము అహింస శాస్త్రములు పాండి త్యము వివాహములయందు నిలయము వావి వరుసలు యథార్థ నాగరికతా లక్షణము లేమిలేని వట్టి యనాగరకులు కదా వీరు. సింహాలకు పెద్దపులులకు తోడేళ్ళకు నెలుగుబంట్లకు నీ మారణా యుధములున్నచో నవి ఎట్లుండునో వీరు నట్లే యుందురు. ఈ ఈశపీఠ దేశమునందు ఈ నీలానది ప్రవహిస్తున్నది. అక్కడ వలసపోయిన భారతీయులు నివాస మేర్పరచుకొన్నారు. పాశ్చాత్యులు ఫలానా అప్పుడు వాళ్ళ వాళ్ళ నాగరకత అల్లా అల్లా వృద్ధయిందని ఊహాగానాలు చేస్తూ ఉంటారు. పరమోత్త

మమైన నాగరకత అనంతకోటి సంవత్సరాల క్రింద వృద్ధి పొందిన భారతదేశమునుండి వాళ్ళు వెళ్ళారు. ఈ విశ్వాసాలతో వెళ్ళారు. అక్కడ క్రమక్రమంగా కొన్ని కొన్ని మరిచి పోతూ వచ్చారు. వాళ్ళ ఊహాలు వెఱ్ఱితలలు వేస్తూ వచ్చినవి. ఇక్కడి విద్యలన్నీ మరచిపోయినారు. శిల్పము వాస్తు ఖగోళ పరిజ్ఞానము మొదలైనవన్నీ ఉన్నవని తెలుసును. కాని ఇచ్చట నించి లేచిపోయిన వాళ్ళందరు సామాన్యులు కాని మహా పండితులు ధనవంతులు ఎందుకు వెళతారు ? మూడు నాలుగు వందల ఏండ్లక్రింద యూరపునుంచిపోయి యమెరికా ఆస్ట్రేలియాలు ఆక్రమించటానికి వెళ్ళింది ఎవరు? ఆ దేశాలలో అప్పుడున్న నాశిరకం వెళ్లారు. అట్లాగే భారతదేశమునుండి భూమి మీదనున్న ఇతర ఖండాలకు పోయిన వాళ్ళందరు ఇక్కడ తిండి సాగనివాళ్ళు ఇక్కడ దేవతల కెదురు తిరిగినవాళ్ళు వేదధర్మ నిందకులు. ఇక్కడ శపించబడ్డవాళ్లు, అజామీళుడు క్రూరాత్ముడు. వాడిసంతతి ఇతర దేశాలకు వెళ్ళారు. మీడ్సుమీడులు అని పేరు. వసిష్ఠునిమీదికి విశ్వామిత్రుడు సైన్యముతో వెళ్లాడు. వసిష్ఠుని గోవు శక, యవన, పారశీక బర్బరులను సృష్టించినది. వాళ్ళందరు ఇతర ఖండాలకు పోయినారు. యయాతి మహారాజు తనకు యౌవనాన్ని ఇవ్వని తన కొడుకులను వేద బాహిరులనుగా శపించాడు. ఇట్లా యుగయుగాలల్లో శపించబడ్డ రాజకుమారులు తిండి సాగని జనము వేదధర్మ విరోధులు పరదేశాలకుపోయి ఇతర ఖండాలల్లో నివాసము లేర్పఱచు

కొన్నారు. కొన్ని లక్షల సంవత్సరాలైనా వాళ్ళ భాషలు మన భాషతోడి సంబంధాన్ని ఋజువు చేస్తుంటవి. వాళ్ళ ఆచారాలు మన ఆచారాలను స్ఫురింపచేస్తూ ఉంటవి. వాళ్ళ మతాలు మన మతములో ఉన్న రహస్యాలను ధ్వనిస్తూ ఉంటవి. ఇంతే కాకుండా నేను పూర్వము చెప్పినట్లు మనదేశమునుండి వర్తకులు పండితులు ఎప్పుడూ ఆ ఖండాలకు వెళుతూనే ఉన్నారు వస్తూనే ఉన్నారు. వాళ్ళు నేర్చుకుంటూనే ఉన్నారు.

ఈ విషయాన్నట్లా ఉంచి పాశ్చాత్యులు నిర్మించిన యనాది నాగరకతా సిద్ధాంతాలనే యవలంబిద్దాము. వాళ్ళం దరూ భారతదేశముతో సంబంధము లేకంతా అక్కడక్కడే పుట్టి ఎప్పుడు పుట్టారో ? చెప్పాను కదా వాళ్ళ ఈ లెక్క బైబులు లెక్కను దాటిపోయిందని—ఆ పాశ్చాత్యులకు ఒక వెట్టి ఉన్నది. మానవుని నాగరికత చరిత్ర చెప్పటంతో భూమి ఎవ్వాళ్ళనించి ఉన్నదో అన్న లెక్క కట్టడంతో కొన్ని కొన్ని యుగాలుగా విభజించారు. మానవుడు బట్ట కట్టుకోటం ఎరగని యుగం; వేటాడి బ్రతికేయుగము, మంటియుగము, కంచు యుగము, ఇనపయుగము, వాళ్ళ ఇష్టము వచ్చిన యుగము. ఏదో త్రవ్వటము ఏదో కనిపించటము దానికి కాలనిర్ణయము చెయ్యటము. అప్పటి మనుష్యుల తెలివి ఇంతే ననటము. లక్ష లాది సంవత్సరముల మీద ఎన్ని నశించిపోయి ఉండవచ్చు ? కనపడ్డ వానిమీద సిద్ధాంతములను నిర్మించటమేమిటి ? తప్పి

తారు. బయటకు తీసినారు. మెచ్చుకోతగిన పనే! వాళ్ళు చాలా శ్రమపడతారు. వారిలో కొందరు జీవితమంతా దానికోసమే వ్యయపెడతారు. తమకున్న ఆస్తులన్నీ దానికొరకే వ్యయము చేస్తారు, వాళ్ళ ఈ నిష్ఠ మిక్కిలి ప్రశంసార్హమైనదే! కాని వాళ్ళ తప్పేమున్నది? వాళ్ళు వట్టి ప్రత్యక్ష ప్రమాణవాదుల్లు వట్టి అధోగతికిపోయి క్రమక్రమంగా మళ్ళీ నాగరకులైన వాళ్ళు. వాళ్ళు సరియైన నాగరకత పొందకుండా భగవంతుడు వాళ్ళకి కొన్ని అడ్డంకులు తెచ్చాడు. ఒకటి—పాలస్తీనాలో దొరికిన హీబ్రూభాషలో వ్రాయబడిన బైబులన్న గ్రంథము. రెండవది—మూడు నాలుగు వందల యేండ్లనుండి ఆధునిక యుద్ధములయందు వాళ్ళకు భగవంతుడిచ్చిన నేర్పు, ఆధునిక మారణాయుధాలను నిర్మించుటలో వానిని వృద్ధిపరచుటలో. భగవంతుడు వాళ్ళ బుద్ధిని ప్రసరింపచేశాడు దానితో వారి కహంకారము పెరిగింది. మానవ నాగరికత అంటే ఇప్పటి క్రైస్తవ నాగరికత అనే వాళ్ళ అర్థము. యూరపులో అమెరికాలో ఉన్న నాగరికత అని మాత్రమే వాళ్ళ అర్థము. ఈ ఈజిప్టు భూమి నాగరికత వాళ్ల లెక్క ప్రకారమే మూడు నాలుగువేల యేండ్లున్నది. యూఫ్రటీసునది త్రిగిరీశనదుల నడిమి నాగరకత కూడ రెండువేల యేండ్ల క్రింద కొన్ని వేల యేండ్లున్నది. వాళ్లకు గురుపీఠమైన గ్రీకు నాగరికత కూడా కొన్ని వందల యేండ్లున్నది నశించింది. వీళ్ల నాగరికత ఎన్నాళ్లుంటుందో తెలియదు. దాని కుబ్బు మొదలుపెట్టి నాలుగైదు

వందల యేండ్లయింది. పైగా పరమేశ్వరుడు ఇలాంటి వాటిని అవి నాశనమయ్యేందుకు బీజాలను వాటిలోనే ఉత్పత్తి చేస్తాడు. మానవ చరిత్ర వృద్ధిపొందుతూ ఉంటుంది. మార్క్స్ సహజము. పరిణామము దాని సహజ స్వరూపము. అనే సిద్ధాంతాన్ని మార్క్స్ నిర్వచించాడు. అది క్రమక్రమంగా వృద్ధి పొందుతుంది. కడచిన ఈ నాలుగైదువందల యేండ్లుగా వృద్ధి పొందుతూవున్న వాండ్ల ఈ నాగరికతకు అది తోక చుక్క.

మనకు ప్రస్తుతాంశమది కాదు, వాళ్లు మహాపరిశోధనలు చేశారు నిజమే. ఈజిప్టులో త్రవ్వారు. జంబూ ద్వీపమంతా త్రవ్వారు. క్రౌంచ ద్వీపమంతా త్రవ్వారు. ఒప్పుకొన్నాము. వాళ్ళు భారతదేశము ఎప్పుడు త్రవ్వారు? ఎక్కడ త్రవ్వారు? వాళ్లపరిణామ సిద్ధాంతానికి దొరికిన మహాజంతువులతొడ ఎముకలు మెడ ఎముకలు పాడుపడిపోయి మళ్ళీ ఒకవేయి ఏండ్ల క్రింద జననివాస యోగ్యమైన ఆ దేశాలల్లో త్రవ్వారు కాని భారతదేశంలో త్రవ్వలేదే? లక్షల కోట్ల సంవత్సరాలనుండి వేద ధర్మము ఇక్కడ ఉన్నది. పరమ నాగరకత ఇక్కడ ఉన్నది. మనుష్యుడు జీవించి ఉండని కాలమంటూ ఇక్కడ లేదు. ఈ దేశము వాళ్ళకి తెలియదు. అందుచేత వాళ్ల త్రవ్వకాలు వాళ్లు చేసికొన్నారు.

ఇప్పుడు ఈశపిర దేశాన్ని గురించి వాళ్లు చేసిన పరిశో ధనలయొక్క సారాంశము వాళ్లు చేసిన వ్యాఖ్యానాలు చెబు తాను. అన్ని వ్యాఖ్యానాలు ఇందాక నేను చెప్పినవాళ్ళ వివేకాన్నిపట్టి వాళ్ళ విశ్వాసాన్నిపట్టి ఉంటవి. నా సూచనలు మార్గదర్శకంగా ఉంటవి. తొలుత ఈజిప్టులో కాని ఇతర దేశా లలోగాని ఉండే మతాలని గురించి ఆ పూర్వప్రజలు పలుమంది దేవతలను విశ్వసిస్తారు అని వ్రాస్తారు, ఇది వాళ్ళ అనాగరి కతకు మొదటిగుర్తు. మన భారతీయులము కూడా అలాంటి వాళ్ళమే. అందుచేత అనాగరకులమే. ఈ విషయము తరు వాత చెబుతాను వాళ్ళల్లో కూడ కొందరు బుద్ధిమంతు లుంటారు. ప్రొఫెసర్ ఫ్రాంక్ ఫోర్టు అనే ఆయన ఆ అనాది వాసుల మత విశ్వాసాలను గురించి ఇలా వ్రాశాడు "అనాది మానవుని ఊహా వైఖరి ఒక్కటే. వారు ప్రపంచకాన్ని తమలో నుండి చూస్తారు. అనగా ప్రకృతిలోని విషయాలు తానెటు వంటివాడో అటువంటివే అని చెబుతాడనే అర్థంకాదు, ప్రాణ రహితమైన ప్రపంచకము వాడికి తెలియదు. సర్వము ప్రాణము చేత నిండిఉన్నదనే వాడి ఉద్దేశ్యము అనగా వాళ్ళు వృక్షము లను శిలలను జంతువులను మనుష్యుల లక్షణములు కలవాటినిగా చిత్రించరు, ఎవళ్ల ఆత్మలోపోయి వాటినావేశించినవి అనరు. ఈనాడు కావ్యములందట్టిది ఉన్నది, ఈ అనాది మానవులకు సృష్టి అంతా జీవరహితమైనది కాదు, జీవభరితమైనది. మను ష్యుడో జంతువో ఓషధీలతయో సర్వమును ప్రాణభరితము.

ప్రతిదానికి వ్యక్తిత్వము ఉన్నది. ఉరుమువందొక శక్తియున్నది. హఠాత్తుగా జల్లుపడితే అదియొక జీవవిలాసము. ఒక రాయి తన కాలికి తగిలి తాను క్రిందపడితే అది జగత్తునందు నిండియున్న ఒక ప్రాణముయొక్క చేష్ట. ఇదివర కడివి నడుమ కొన్ని చెట్లు కొట్టివేశారు. అక్కడ తెఱపి కలిగింది. ఆ తెఱపి ఒక విలక్షణమైన శక్తి కలది. తన ప్రాణమువంటి ప్రాణము తనవంటి ఇంకొక ప్రాణి కనిపించకుండా సర్వత్ర అభిప్రాయమై ఉన్నదని వాని విశ్వాసము." ఇది అతను వ్రాసింది. ఇది పాశ్చాత్యుల కర్ధముకాదు. వాళ్లకి జంతువులల్లో వృక్షాలల్లో జీవుళ్లు వేరు. మృగాలని చంపుక తినటమే ప్రధానమైన ఆహారముగా కలవాళ్ళకి వాటిల్లో జీవుడున్నాడంటే సాగదు. ఒక జాతియొక్క మనుగడలోని పద్ధతులను బట్టి విశ్వాసాలు ఏర్పడుతవి. పిపీలికాది బ్రహ్మ పర్యంతము జీవుడభివ్యాప్తమై ఉన్నాడని మన పూర్వఋషులు తెలిసికొన్నారు. మహాకవి కాళిదాసు వ్రాసిన శాకుంతలములో అక్కడఉన్న పూలతీవ శకుంతలకు చెల్లెలు. తాను అత్తవారింటికి వెళుతూ "ఓయమ్మా అటవీ దేవతా! నాకు సెలవిమ్మ"ని అడిగితే కోకిల కూసింది. అది అనుమతిగా ఆమె స్వీకరించింది. చల్లని గాలివీస్తే నన్నయ్యగారిలో శుభశకునము. ఆ పని అవుతుందని అర్థము. పరమేశ్వర స్వరూపము బ్రహ్మ పదార్థంగా ఉంటుంది. దాని స్వభావము చైతన్యము. ఆ చైతన్యము పంచభూతముల నిండా నిండి ఉంటుంది. ఇది భారతదేశముయొక్క మతములోని పరమా

ర్థము. ఈ పరమార్థాన్ని ఇచటనుండి వెళ్ళిపోయిన నీలానదీ తీరవాసులుగాని యూఫరటీశనదీ [టి]గిరీశనదీ తీరవాసులుగాని గ్రహించలేరు. హిబ్రూలు మరిచిపోయినారు. వాల్గానది ప్రవహించు రష్యా దేశవాసులు మరచిపోయినారు. గ్రీసు దేశీయులు మరచిపోలేదు. క్రీటు ద్వీపవాసులు మరచిపోలేదు. ఇలాంటి విశ్వాసము కలిగిన ఆ అనాది తత్తద్దేశవాసులు ఈ పాశ్చాత్యులకు అనాగరకులు. వాళ్ళని గురించి ఏమి చెప్పాలి? అనంత కాల స్వరూపుడైన పరమేశ్వరుడు చెప్పాలి. పూర్వము చెప్పాను కదా? ఆ పాశ్చాత్యులు ఒక మానవజాతి అని ఒక దేశాన్ని ఒక సంస్థను ఒక విషయాన్ని తీసికొని దాని మొదలు ఇట్లా ఉంటుందని క్రమక్రమంగా పెరిగిందని వృద్ధి పొందిందని ఒక పరిణామాన్ని నిరూపిస్తూ గ్రంథాలు వ్రాస్తారు. అదంతా వాళ్ళ చదువు. వాళ్ల విజ్ఞానము. వాళ్ళ పరిశోధన. అల్లా ప్రపంచకములో ఉన్న ప్రజలందరను మాగుద్దామని వాళ్ళ నిత్య ప్రయత్నము. ఒక ఊరినించి రెండు కుటుంబాలు లేచిపోయి దూరంగాఉన్న పొలాలల్లో ఇళ్ళు కట్టుకొంటారు. మొదట వాళ్ళు అన్నీ ఎక్కడనించో తెచ్చుకోవాలి. వాళ్లుంటున్నారు కదా అని ఇంకా పదిళ్ళు బయలుదేరుతవి. క్రమక్రమంగా అన్నీ సమకూడుతవి. అక్కడ ఒకడు వాళ్ళకు కావలసిన వస్తువుల దుకాణము పెడతాడు. ఒక వడ్రింగి వస్తాడు. బట్టలు నేసేవాళ్లు వస్తారు. అది పెరిగిన కొద్ది అందరు పెరుగుతారు. ఇది సహజమైన లక్షణము. దీనిని మొదట వాళ్లు

అనాగరకులు క్రమంగా ఇవి నేర్చుకున్నారు. అవి నేర్చు కున్నారు అని ఒక పెద్ద పరిణామవాదము లేవతీయటము పాశ్చాత్యుల యొక్క విచిత్ర మేధా విలసనము అజ్ఞమైన బుద్ధులను మోసగించటము. ఈ మాట చూడండి. ఇంతకు ముందు చెప్పిన మూడు నదీతీరాలల్లో మానవులెందుకు నివా సము చేశారంటే అక్కడ చంపుకుతినేందుకు పశులు మృగాలు ఉన్నవట. వాళ్ళమీదికి ఇతరులువచ్చి దాడి చేయకండా ఎడా రులు ఉన్నవట. నిర్మేఘమైన ఆకాశమున్నదట. కాలమును కొలిచేందుకు నిర్మలాకాశంలో నక్షత్రాలు కనిపిస్తవట. ఆనేల సారవంత మవటం మూలంగా పంటలు పండించేందుకు యంత్ర ములు కనిపెట్టటానికి వీలుందట. దానిమూలంగా నాగరకత వృద్ధి పొందుతుందట. ఈ వాక్యాలు ఒక పాశ్చాత్య గ్రంథకర్త లోంచి తీసి చెప్పాను. ఈ మాటలలో వాళ్ళ అవివేకమంతా ఉన్నది. అవివేకమంటే తిట్టడం కాదు.ఆలోచన లేకపోవడము. ఈ వాక్యాలని మనము పరామర్శిద్దాము. మొదటి వాక్యము- చంపుకు తినేందుకు మృగాలు పశులు ఉన్నవి. ఫలవృక్షాలు ఉండవా ? దుంపలు ఉండవా ? మన పూర్వ ఋషులు అవి తిని బ్రతికేవాళ్లట గదా ! దృష్టిభేదం చూడండి. రెండవ వాక్యము—చుట్టూ ఉన్న ఎడారుల మూలంగా ఎవళ్ళూ వాళ్లమీదికి దండెత్తిరారట, అంటే అప్పటికే అనేక స్థలాలల్లో మానవులు ఉన్నారన్నమాట, వాళ్లు వస్తారని భయమన్న మాట. వీళ్ళు ప్రథమ మానవులెట్లా అయినారు ? ఒక చోటికి

వెళ్ళటం అక్కడి వాళ్ళని చంపటం వాళ్ళది అపహరించటం. మానవుడి సహజ లక్షణంగా ఈ పాశ్చాత్యులు భావించారన్న మాట, ఇక్కడ బోలెడంత నేలఉంది. ఊరికే ఉంది. వచ్చి పండించుకోవచ్చు. ఎవరు వద్దన్నారు ? ఎందుకు పోట్లాడాలి ? జనం తెగ పెరిగిపోయిన తర్వాత రాజ్యాలు సృష్టించుకొన్న తర్వాత ఈ దురూహాలు పుట్టవచ్చు. ప్రథమ మానవుడు అమాయకుడు. వాడు స్నేహముతో నిండి ఉంటాడు. వాళ్ల ప్రథమ మానవుడు జంతువు. వాడొక పులి. వాడొక తోడేలు. వాడొక సింహము అని వీళ్ల ఉద్దేశ్యము. ఆ మృగాలు కూడ గుంపులు గుంపులుగానే ఉంటవి. అక్కడా లేళ్ళు తిరుగుతూనే ఉంటవి. దాని కాకలైనప్పుడు ఒక లేడిని చంపుతుంది. అంతే. ఇంక మూడవ విషయము—నిర్మలాకాశ మవటం మూలంగా నక్షత్రములను చూడవచ్చునట; కాలాన్ని కొలువవచ్చునట; నక్షత్రాలను బట్టి కాలాన్ని కొలవటము ఒక శాస్త్రము. మేధావంతులు చేసేపని. అనాగరకులు పశుతుల్యులు చేయలేరు. ఇంక నాల్గవది చూడుడు— పొలాలను దున్నేందుకు యంత్రాలను కనిపెట్ట వచ్చునట దానివలన నాగరకత వృద్ధి అవుతుందట—అంటే పాశ్చాత్యుల ప్రకారము యంత్రాలు వృద్ధి అయితేనే నాగరకత. యంత్రములు లేనిది నాగరకత కాదు. మనమేమో శాంతి దాంతి సత్యము క్షమ అహింస ఔదార్యము దాక్షిణ్యము తపస్సు యోగము తృప్తి మొదలైనవి నాగరకత అనుకొంటుంటే వాళ్ళ దృష్టి అట్లా ఉన్నది. ఎద్దు కఱ్ఱతో పొడిస్తేగాని నడవదు. గనక కఱ్ఱ చివర సన్నమేకు వేయుట నాగరకతాభివృద్ధి—

# 10

ఈశ, ఈశపీర చరిత్రను గురించిగాని దానిని గురించి పాశ్చా
త్త్యులు వ్రాసిన పరిశోధనలను గురించిగాని చెప్పాలంటే
చాలా పడుతుంది. దానిమీద పెద్దపెద్ద గ్రంథాలే ఉన్నవి.
వాళ్ల పరిశోధనని నేను కాదనటము లేదు. వాళ్ళెంతో పరి
శోధన చేశారు. వాళ్ళు మహానుభావులని చెప్పానుకదా !
వాళ్ళయందు నేను దోషము చూపిస్తున్నానంటే ఆ దోష మిది.
మన భారతీయ నాగరికత మొగము తెలియకుండ, స్వరూపము
తెలియకుండ అక్కడి త్రవ్వకాలవల్ల కనిపించిన వాటిని వాళ్ళ
కనుకూలంగా వ్యాఖ్యానము చేసికొన్నారన్నది. అక్కడినాగరి
కత లెంతపురాతనములో మన భారతీయ నాగరకతకూడ అనగా
ఆర్యావర్తములోని నాగరకత—దీనిని వారు సింధునదీతీర
నాగరకత అంటారు—ఇదికూడ అంత పురాతనమేనని చెబు
తారు. వాళ్ళ పురాతనత్వము క్రీస్తుపూర్వము అయిదువేల
యేండ్లు మహా అయితే ఆరువేలయేండ్లు. మన నాగరకత

యొక్క స్వరూపము వాళ్లకి తెలియదు. మనదేశానికి వచ్చే వరకు వాళ్ళు ఎరగరు. యూరపులోని నాగరకతకు పునాదులు గ్రీకు సామ్రాజ్యము, రోము సామ్రాజ్యము. చివరి రోజుల్లో రోము సామ్రాజ్యానికి ఈజిప్తు రాజ్యానికి మహారాణి అయిన క్లియోపాత్రాకి సంబంధముండేది. ఆ ఈజిప్తులో పెద్ద గోళాకారముగా నిర్మించిన డిబ్బలు ఉన్నవి. వాటిని పిరమిడ్లు అంటారు. అవి ఏమిటో మొదట తెలియ లేదు. తరువాత పరిశోధనచేస్తే ఈజిప్త రాజ్యము యొక్క పూర్వరాజుల సమాధులుగా తెలిసినవి. ఈ మార్గంగా వాళ్ళకి ఈజిప్టుయొక్క నాగరకత తెలియటానికి వాళ్ళకి మార్గ మేర్ప డ్డది. వాళ్ల యూరపునకు దగ్గరగా ఉన్న మధ్యధరా సముద్రము నంటుకొని ఈజిప్టుయొక్క ఉత్తర సముద్ర తీరమున్నది. ఇంక రెండవది వాళ్ల నాగరకత గ్రీసుదేశముయొక్క సాహిత్యము మొదలైన విషయాలు పునాదిగా కలవి. మరిన్ని వాళ్ళ యేసుక్రీస్తు పాలస్తినాలో పుట్టాడు. అందుచేత ఆసియా యొక్క పడమటి భాగమంతా కూడా వాళ్ళు పరిశోధన చెయ్యటానికి వీలైంది. అంతేతప్ప వాళ్ళు భారతదేశము ఎక్కడ ఉందో ఎరుగరు. చివరికి ఆఫ్రికా చుట్టూతిరిగి, ఓడల మీద వచ్చారు. అమెరికావలె ఆఫ్రికావలె ఆస్ట్రేలియావలె ఇక్కడకూడ ఆటవికులు ఉంటారని ఆక్రమించుకోవచ్చుని అను కొన్నారు. అప్పటి కిక్కడ పెద్దపెద్ద రాజ్యాలున్నవి. వాళ్ళ ఆటలు సాగలేదు. అందుచేత కృత్రిమ మార్గాల నవలంబించారు. మన నాగరకత తెలిసిన తరువాత వాళ్ళు త్రవ్వకాలు త్రవ్వితే

వాళ్ళకి తెలిసేవి. ఇదంతా భారతీయ నాగరకత. వేలయేండ్ల మీద మారిపోయింది. ఆ ఈజిప్టులో ఒక దేవుని పేరు హోరస్ వాడి శిరస్సు గరుత్మంతుడి శిరస్సు. సంస్కృతములో శబ్దాల, చివర విసర్గ ఉంటుంది. ఆ విసర్గ సకారమౌతుంది. అది హరి శబ్దము. విష్ణువు గరుడ వాహనుడు. గరుడధ్వజుడు. ఆ దూర దేశాలుపోయి యెన్నో మార్పులు పొందిన తర్వాత ఇలా అయినవి శబ్దాలు, ఈ ఈజిప్టునేలిన రాజులు ఇరవై వంశాల రాజులేలినారని వాళ్ళే వ్రాశారు. ప్రథమ వంశాలనాటికీ అనగా ఎనిమిదివేలయేండ్ల క్రిందనే వాళ్ళకి అక్షరములు ఉన్న వని వ్రాత ఉన్నదని వాళ్ళే వ్రాశారు. ఆనాటికే పడమటి ఏషియాతో అనగా ప్లక్ష ద్వీపవాసులతో వాళ్ళకి సంబంధము ఉన్నదని వ్రాశారు. ఎందుకు ఉండదు? అందరు ఇక్కడనుంచి వెళ్ళినవాళ్ళే వేల సంవత్సరాలు ఇరుగు పొరుగులందు ఉంటే మధ్య సముద్రము అడ్డము వస్తుందా! నడుమ హిమాలయ పర్వతాలు ఉన్నా మనకు చైనా వాళ్ళకి సంబంధాలు అనాదిగా లేవా? ఉత్తర కురుభూములంటే టిబెట్టు చీనాలని మన వాళ్ళు కొందరంటారు. మనవాళ్ళు నాలుగువేల యేళ్ళ క్రిందటినుంచి చీనా టిబెట్టులతో రాకపోకలు చేస్తూనే యున్నారు. మనదేశములో పుట్టిన బౌద్ధమతాన్ని ఇక్కడ బౌద్ధులు వెళ్ళి అక్కడ ప్రచారముచేసి చీనా టిబెట్టు జపాను దేశాలంతా బౌద్ధదేశాలుగా మార్చివేశారు. ఈ సమాధులు కట్టడం ఈజిప్టు మొదటి వంశపు రాజు దగ్గరనించి ఉన్నదని

పరిశోధకులు తీర్మానించారు. ఆ రాజు పేరు జెట్. ఇది శ్రేష్ఠ శబ్దముయొక్క వికృతి. ఇందులో ఒక చమత్కారముంది. ఈ ఈశపీఠ దేశములో ఇటుకల ఇండ్లు ఉండేవి అని కనుక్కు-న్నారు, అటువంటి ఇండ్లే సుమేరుదేశములో ఉన్నవి. ఆ ఇండ్ల నిర్మాణము పెద్ద అంతఃపురాలల్లే ఉంటుంది. బాబిలోనియాలో కూడా ఇలాంటి ఇండ్లే ఉండేవి. ఇవన్నీ భారత దేశములోనించి వెళ్ళినవే. ఈ ప్రతీదీ ఒక విడ్డూరమల్లే వ్రాస్తారు. ఈ పాశ్చాత్య పరిశోధకులు. మనుష్యులు సర్వకాలములయందు సర్వదేశముల యందు చచ్చిపోతారు. చచ్చిపోయిన వాళ్ళను గురించి వాళ్ల బంధువులు ఏడుస్తారు. వాళ్లు ధనవంతులైతే చచ్చిన తర్వాత కర్మలు ఆడంబరంగా చేస్తారు. చచ్చిన వాళ్ళని మనదేశంలో తగలబెడతారు. కొందరు పాతిపెడతారు. వాటిమీద కొందరు గోరీలు కడతారు. క్రైస్తవులు చచ్చినవారిని పెట్టెలలో పెట్టి పూడ్చిపెట్టి ఎప్పుడో యేసుక్రీస్తు వాళ్ళని సమాధులలోనుంచి లేవదీస్తాడని విశ్వసిస్తారు. ఈ ఈశపీఠ దేశరాజులు ఈ పెద్దపెద్ద గోరీలు కట్టించుకొని శరీరాలు ఎప్పటికి కుళ్ళిపోకండా నశించి పోకండా ఏవో ఔషధాలతోనింపి గుడ్డబొమ్మలవలె శాశ్వతముగా ఉండిపోయ్యేటట్లు చేసికొనేవాండ్లు. ఆ రాజు లందరు శాశ్వతమని వాళ్ళ ఉద్దేశ్యము కాబోలు. వాళ్ళకు చావులేదని వాళ్ల ఉద్దేశ్యము కాబోలు. ఫ్రెంచిదేశపు రాజులు అందరు రాజులకు మల్లెనే దురహంకారులు. వాళ్ళ తండ్రులు తాతలు చనిపోయినారని వాళ్లదగ్గర అనరాదట. ఆ ఫ్రెంచి రాజుల

ఆస్థానాలలో అది ఒక విశ్వాసము, ఆచారము, అలాంటి ఒక విశ్వాసము ఈ ఈశపీఠ రాజులకు ఉండేది. నీలానది పెద్ద బ్రహ్మాండమైన నది. ఆ నది పొడుగునా ప్రజలు ఉండేవాళ్లు. ఉత్తరాన ఒక రాజ్యము దక్షిణాన ఒక రాజ్యము. ఈ రెండు రాజ్యాలు కలిసి చివరకు ఒక రాజుక్రిందకు వచ్చినవి. రెండు రాజ్యాలయొక్క చిహ్నాలు ఆ రాజుయొక్క కిరీటములో ఉండేవి. ఆ చుట్టుపట్ల సూడాన్, నూబియా, మొదలైన దేశాలు ఉన్నవి, సూడాన్ అనగా సుదాన శబ్దభవము. నూబియా నవ్యశబ్ద భవము. ఒక ప్రాంతము పేరు అశ్వాన్. అశ్వనీ నక్షత్రము, అశ్వని దేవతలు. ఇక్కడ ఒక సందేహము. ఇట్లాగైతే లోకములో అన్ని భాషలలో ఉండే అన్నిశబ్దాలు ఏదో విధముగా ముడిబెట్టొచ్చు అంటారేమో మీరు. ఇది నేను క్రొత్తగా చేయటము లేదు. ఆ పాశ్చాత్య దేశములయందలి శబ్ద శాస్త్రవేత్తలు (ఈ శాస్త్రాన్ని వాళ్లు ఫైలాలజీ అంటారు) ఇలా ధ్వని సామ్యంగా శబ్దాలనుతీసే కొన్ని ఆర్య భాషలని నిర్ణయించారు. సంస్కృతము, పర్షియన్ భాష, గ్రీక్ భాష, రోమన్ భాష ఈ నాలుగు భాషలు ఒక భాషా కుటుంబానికి చేరినవని వీటికి తల్లిభాష ఇంకొకటి ఉండాలని ఆ భాష ఇప్పుడంతరించిందని వాళ్ళ సిద్ధాంతము. సంస్కృత భాషయే తల్లి భాష అని ఒప్పుకోటానికి వాళ్ల ప్రాణాలొప్పుకో లేదు— ఎందు కొప్పు కో లే దు ? అది ఒక మానవాహంకారము. సంస్కృత భాష భారతీయులది. వాళ్ళను మనము గెలిచి

వాళ్లని పాలిస్తున్నాము. వాళ్ల భాష వాళ్ళ నాగరకత ప్రపం చానికి మాతృపీఠాలు అంటే వాళ్ల మర్యాద అంతా పోతుంది. అందుచేత సర్వసృష్టికి సర్వ నాగరకత గ్రీసు దేశాన్నుండి వచ్చిందని. నాగరకత గ్రీసు దేశాన్నుండే హిందూ దేశానికి వెళ్ళింది, ఆర్యులు సుమేరుభూమిమీద పుట్టారని, ఇలా కల్పించి వ్రాసికొన్నారు. ఆ చదువు మనకు చెప్పారు. వాళ్ళు చెప్పిన చదువులో పండితులైన వాళ్లకి పెద్ద పెద్ద ఉద్యోగాలిచ్చారు. మన పండితులని అణగద్రొక్కారు. మన రహస్యాలన్ని మన పండితుల దగ్గర నేర్చుకొన్నారు, వాటిని వాళ్ళ యిష్టంవచ్చి నట్లు వ్యాఖ్యానము చేశారు. ఇంక ఎన్నెన్నో చేశారు. వాళ్లు చేసిన దంతా ద్రోహమని వాళ్లల్లోనే కొందరు పెద్దమను ష్యులు వ్రాశారు. వాటినిగూడ బయటకు రానీయలేదు. పాఠ్య గ్రంథాలల్లో అవి లేకండా చేశారు.

ఆ ఈజిపీఠ దేశములో పంచాంగము ఉండేది. రోమ్‌లో చక్రవర్తియైన జ్యూలియస్ సీజరు అనేవాడు ఈజిప్టులోనించి ఆ పంచాంగాన్ని రోమ్ సామ్రాజ్యములోనికి ప్రవేశపెట్టాడు. ఈ జ్యూలియస్ సీజర్‌కు ఈజిపీఠ రాణియైన క్లియోపాత్రకి సంబంధము ఉండేది. పడమటి దేశాలలో ఇవ్వాళటికి కూడ అమలులోఉన్న పంచాంగాలు—అవి పంచాంగాలు కావు. పంచాంగమంటే (తిథి వార నక్షత్ర యోగకరణము లైదు ఉంటాయి) ఇవి కేలెండరులు అనగా తారీఖులు వారాలు ఉంటవి. ఇవి రోమునుండి యూరపంతా వ్యాపించినవి. అమెరి

కాకు వెళ్ళినవి. ఆ ఈశపీఠ దేశమువాళ్ళు ఇక్కడినించి వెళ్ళిన వాళ్లు. ఇవన్నీ వాళ్లకి తెలుసు. వాళ్లు వాడుకున్నారు. నక్షత్ర యోగ కరణాలు వదలిపెట్టారు. కర్మ భ్రష్టులైన వాళ్ళకు ఆ నక్షత్ర యోగ కరణాలెందుకు ? ఈ పాశ్చాత్య పరిశోధకు లకు ఈ నెలలు వారాలు తారీఖులు ఇవన్నీ ఈజిప్టువాళ్ళు కనిపెట్టారు అని అభిప్రాయము. వాళ్ళని గురించి మనము జాలిపడాలి అంతే. కర్మ భ్రష్టులంటే ఏమిటంటే భారత దేశ ములో బ్రాహ్మణులు కర్మలు చేస్తారు. కర్మ చేయటమంటే గ్రహాలను అనుకూలపరచుకోటము. యజ్ఞములు చేసినా వ్రత ములు చేసినా నోములు పట్టినా ఉపవాసాలున్నా పూజలు చేసినా తిథి మంచిది కావాలి, నక్షత్రము మంచిది కావాలి. యోగ కరణాలు అనుకూలించాలి. మనము వివాహాలు చేసి కొంటే మూఢములలో చేసికోము. భార్యాభర్తల నక్షత్రాలు సరిపోవాలి. ఒక్కొక్కప్పుడు వివాహ లగ్నాలు ఉంటవి. ఒక్కొక్కప్పుడు ఉండవు. గృహ ప్రవేశాలకు ఉపనయనాలకు గృహ నిర్మాణాలకు పిల్ల నత్తవారింటికి పంపించేందుకు ఒక కార్యము ఆరంభించేందుకు అన్నింటికి మనకు మంచివేళ కావాలి. ఈ మంచివేళ అంటే ఏమిటి ? గ్రహముల అను కూల్యము. మంచి నక్షత్రము కావటము, నక్షత్రాలు సరిపో వాలి. కొన్ని నక్షత్రాలు క్రూర నక్షత్రాలు. కొన్ని సాధు వులు జ్యేష్ఠ నక్షత్రమున్నది. ఆకాశము నందున్న గోళాల్లో అంతకంటె పెద్ద గోళములేదని ఆధునిక పాశ్చాత్య ఖగోళ

ద్రష్టలు చెబుతున్నారు. దానికి మనవాళ్ళు జ్యేష్ఠా నక్షత్రమని పేరు పెట్టారు. ఆ గోళము అంత పెద్దదని తెలియకుండానే జ్యేష్ఠ అని పేరుపెట్టారా ? కృత్తికా నక్షత్రమున్నది. అతి మహాగ్ని గోళము. మహాగ్ని ఏమి చేస్తుంది? అన్నింటిని తగుల బెడుతుంది. ఆ నక్షత్రముయొక్క ఆకారము కత్తెరవలె ఉంటుంది. ఎన్నికోట్ల సంవత్సరాల క్రిందో మన పూర్వులు మన మహర్షులు ఆ నక్షత్రములు వాటి స్వరూపములు వాటి ఉదయాస్తమయములు మానవ జీవితముమీద వాని ప్రభావ ములు తెలిసికొని వాటి ప్రకారము కర్మలు చేశారు. ఈ మహా విజ్ఞానము మనమట, అ గ్రీకువాళ్ల దగ్గరనుంచి నేర్చుకొన్నా మట ; యెవరి దగ్గరనుంచి ? గ్రీకుల దగ్గరనుంచి ! వాళ్ళ విజ్ఞానం ఎక్కడనుంచి వచ్చింది ? క్రీత (క్రీట్) ద్వీపమునుంచి వచ్చింది. ! వాళ్ల కెక్కడనుంచి వచ్చింది ? ఈజిప్టునుంచి వచ్చింది ! ఆ ఈశపీఠ దేశమువాళ్ళు కర్మ భ్రష్టులు. అందుచేత వాళ్ల క్యాలండర్లలో నెలలు వారాలు తేదీలేతప్ప ఋతువులు నక్షత్రాలు శుక్ల కృష్ణపక్షాలు ఏమీలేవు. అవన్నీ తెలియని వాళ్లకి ఆకాశము నందలి మహాగ్రహ సంచారములు వాటి స్వరూపాలు, వాటి ఫలితాలు, ఏమి తెలుస్తవి ? అలా భ్రష్టమై పోయిన ఈశపీఠదేశ వాస నాగరకత పాశ్చాత్యులకొక గొప్ప వింతగా ఉన్నది. దిక్కులేని వాళ్ళకే వాళ్ళ క్యాలెండరు దిక్కైంది. నిన్న చెప్పాను. భారతీయులు అహిగణ స్థానము (నేడు ఆఫ్‌గన్‌స్థానమంటున్నారు. ఇది పూర్వము గాంధార

దేశము) నుండి యూపరతీశనదీ త్రిగరీశ నదులు ప్రవహించు సుమేరు దేశమువరకు పోయి అక్కడనుంచి ఇంకా పడమటికి శాలిమార్గాన పోయినారు. రెండవది సముద్రమార్గాన ఈ శాల్మలీ ద్వీపానికి వెళ్లారు. శాల్మలీ ద్వీపమంటే ఆఫ్రికా అని చెప్పాను కదా. స్వదేశాన్ని వదలిపెట్టి పరదేశానికి వలస పొయ్యే వాళ్ళెట్లాంటివాళ్ళో చెప్పాను కదా! ఇక్కడ ఇముడలేనివాళ్ళు. ఈ ఈశపీఠ దేశములోని వాళ్ళకి దేవుడు "రాయి". ఇది రవి శబ్ద భవము. వాళ్లు సూర్యోపాసకులై యుండవలె. సూర్యుడే పరమేశ్వరుడు. సూర్యునికంటె ఇతర దేవుడు లేడు అనేవాళ్ళు. అప్పుడెప్పుడో వీళ్ళని మనవాళ్ళు తరిమేసుంటారు. ఒక మహానది ఉన్నది. కొండలమీద వాన కురుస్తుంది. అది ప్రవహిస్తూ ఉంటుంది. నది నదిగా ఉంటుంది. మళ్లీ నిండుతూ వుంటుంది. వానలు కురిసిన నీళ్లు ఇంకోవేపుకు పోతే పూర్వపు నీళ్లు ఒక చెరువౌతవి. ఒక మడుగవుతవి. పెద్ద తటాకము కావచ్చు. అక్కడా వానలు కురుస్తవి గనుక కొంత ఎండుతూ ఉంటుంది. ఇట్లా భారతదేశమునుండి వెళ్ళిపోయిన వాళ్లు మన విద్యావాసనలతో మన సంస్కారాలతో మన విశ్వాసాలతో వెళ్లి కొందరి శాల్మలీ ద్వీపంలో కొందరు సుమేరు దేశాలల్లో కొందరు ప్లక్ష ద్వీపాలల్లో కొందరు కుశద్వీపంలో అనగా రష్యా మొదలైన దేశాలల్లో ఉండి భారత దేశముయొక్క జ్ఞానప్రవాహము అయిపోయి అక్కడ చెరువులై, నాచుపట్టిన త్తగుల్లలు మొదలు పెట్టి కళ్మలమైపోతూ ఉండగా మన వర్తకులు పండితులు

అప్పుడప్పు డక్కడకు పోతూ ఉంటే మళ్ళీ వాన కురిసినట్లయి మళ్ళీ కొంత తేరుకొని, వాన కురవనిచోటి నీళ్లు ఘోరమైన దుర్వాప నాభూయిష్టమైనట్లు ధర్మములు చెడి జ్ఞానము నశించి చివరకు బట్టలు కట్టుకోటం కూడ మానివేసి అవివక్షితమైన సంపర్కము చేసికొంటూ ఉంటే వాళ్లని చూచి వాళ్ల బొమికలను గుర్తుపట్టి వాళ్లు ప్రథమ మానవులని అజ్ఞానములోనించి జ్ఞానం అనాగరకతలోనించి నా గ ర క త ఉత్పన్నమైనదని పాశ్చాత్యు లూహించారు. వాళ్లంతకన్న ఏమూహించగలరు? మనదే మహా నాగరకత, మన మతమే మహా మతము అనే దురహంకారము కలవాళ్ళు ఇంకో విధంగా ఊహించగలరా ? జ్ఞాన సముపార్జన చేసేవాడు వినయవంతుడు కావాలె. నారదుడు వచ్చి సంగీతము పాడితే ఆయన నారదుడని తెలియక శ్రీ త్యాగరాజస్వామి ఎందరో మహానుభావులని కీర్తన పాడారు. ఇతరుల గుణము గ్రహించేవాళ్ల లక్షణమిట్లుంటుంది. లేకపోతే వీడు మనకంటె ఎక్కువ పాటకాడు వీడి డొక్క చీల్చుద్దామనిపిస్తుంది. పూర్వ క్రైస్తవమత ప్రచారకులు మహా గ్రంథాలను తగులబెట్టించింది ఇటువంటి బుద్ధి లక్షణంచేతనే. ఇప్పటికైనా తమదే మతం తమదే నాగరకత అందరూ దీన్నే స్వీకరించాలి. అది ఏమి మనస్సో తెలియదు. అది ఏమి మనోలక్షణమో తెలియదు, కాదయ్యా అందరూ వాళ్ల మతం పుచ్చుకొన్నారు ఏమి లాభం ? అమెరికాలోను ఆఫ్రికాలోను నల్లవాళ్లందరూ క్రైస్తవులే. ఏమి లాభం ?

# 11

అగ్ని పర్వతము ఉండి ఉండి ఎప్పుడో ఠపీలుమని పగులుతుంది. మధ్యమధ్య బుస్సు బుస్సు మంటున్నా ఎప్పుడూ పగలదు. ఎప్పుడు పగులుతుందో తెలియదు. పతంజలి శాస్త్రి నీలానది నాగరకత సందర్భమైన ఉపన్యాసాలు ఇస్తున్నాడు. ఇదివరకు కొంత మాట్లాడి ఇలా అన్నాడు. "నేను నీలానది యూఫ్రటీశనది త్రిగిరీశనది నడుమ సముద్రము తరువాత వాల్గానది అని అయిదు భాగాలుచేసి అన్నింటిని గురించి ఒక్కొక్క దానిని గురించి పదిరోజులు పదిరోజులు మాట్లాడదామను కొన్నాను. కాని విచారిస్తే నీలానదిని గురించి మాట్లాడే టప్పుడే ప్రధాన విషయము బాహుళ్యంగా చెప్పివేస్తే తక్కిన విషయాలు తదనుబంధిగా చెప్పవచ్చు ననిపించింది. అందుచేత నీలానదిని నేను వదలిపెట్టకముందు మరికొన్నాళ్లు పడుతుంది. మరిన్ని గంగానదిని గురించి నేనేమి చెప్పలేదనుకొంటారు మీరు. గంగానది పరమ పవిత్రమైనది. సర్వధర్మాలకు ఆ స్థాన

భూమి. నామమాత్రానికి ఇతర నదులను గూర్చి చెప్పుతున్నట్లు ఉంటుందిగాని యథార్థముగా ఏది చెబుతున్నా గంగానదిని చెపుతున్నట్లే అర్థము. ధర్మమెల్లా భ్రంశమైందో చెబుతూఉంటే అసలు ధర్మస్వరూపము తెలుస్తూనే ఉంటుందిగదా. కొందరికి తెలియనిమాట నిజమే. పూర్వము విశ్వాసాలను గురించి చెప్పానుకదా. అందరి విశ్వాసాలు ఒకటే మోస్తరుగా ఉండవని. ఒక విషయము అర్థము చేసికోటములో కూడ మానవుల తెలివితేటలు అలాగే ఉంటవి. మన మొకొకప్పుడు చమత్కారంగా మాట్లాడినా ఆతలివాడు పూర్వము పశుజన్మలెత్తి ఎత్తి మనుష్యజన్మ ఎత్తటానికి ఇదే మొదటిసారి అయినవాడు. వాడికి హాస్యరసము తెలియదు, చమత్కారము తెలియదు. అపామాషిగా మాట్లాడుకోటము అంటే యేమిటో తెలియదు. నేను పూర్వము ఒకప్పుడు ఒక క్రైస్తవ కళాశాలలో ఉపాధ్యాయుడుగా ఉన్నాను. నాకు మనమతమంటే అభిమానమెక్కువని వాళ్ళు నన్నాఉద్యోగములోంచి తొలగించారు. నేను కొన్నాళ్లు ఊరికెనే ఉన్నాను. ఆ విడిగా ఉన్నరోజుల్లో ఆ కళాశాలలోని ఒక క్రైస్తవ ఉపన్యాసకుడు నాకెక్కడో కనపడి ఏదో పరామర్శచేస్తూ ఇప్పుడేమీ జాబ్ లేదా అండీ అని అడిగాడు. నేను "జాబ్ లేదు ఎజికీలు లేదు" అన్నాను. అతనికి కోపం వచ్చింది. నా కాశ్చర్యం వేసింది. ఎందుకంటే బైబులు రెండు భాగాలు. మొదటి భాగము పేరు ప్రాతనిబంధన. రెండవ భాగము పేరు క్రొత్తనిబంధన. టెస్టమెంట్ అన్న

మాటకు వాళ్ళు నిబంధన అని తెలుగుచేశారు. ప్రాతనిబంధన అనేక గ్రంథాల సంపుటి. అనేకమంది ప్రవక్తలున్నారు. వాళ్లు వాళ్లు వ్రాసిన గ్రంథాలవి కలిసి బైబులు గ్రంథమైంది. జాబ్ అనేవాడు ఒక ప్రవక్త. ఎజికీలు అనేవాడు ఇంకొక ప్రవక్త. ఆ బైబిలులో జాబ్ ప్రవక్త వ్రాసిన గ్రంథం వెంటనే ఎజికీలు ప్రవక్త వ్రాసిన గ్రంథం ఉంటుంది. దాని తరువాత ఇది ఉన్నది. జాబ్ పుస్తకము ఎజికీలు పుస్తకము అని. ఇంకా కొంచెము దర్జాగా చెప్పవలెనంటే జాబ్ గ్రంథము ఎజికీలు గ్రంథము అనవలె. పుస్తకము గ్రంథము రెండు సంస్కృత శబ్దాలే అయినా పుస్తకమన్నమాట బాగా వాడుకలోకివచ్చి తెలుగు శబ్దమేమో అని పొరపాటు పడటానికి వీలైనంత వాడుకలోకివచ్చి జాబ్ పుస్తకమంటే అమర్యాదా చేసినట్లు జాబ్ గ్రంథమంటే మర్యాదా చేసినట్లు అనిపిస్తుంది. మానవుని మనోలక్షణ మిట్లాంటిది. క్రొత్త ఒకవింత ప్రాత ఒకరోత "పృథివి నధిపులు నూతన ప్రియులుగారె" అన్నాడు పోతన్న గారు, అధిపులు అంటే రాజులు రాజులవంటివాళ్లు అంటె దర్జాలు పెరిగినవాళ్లు అని అర్థము. అందుచేత ఇప్పుడు మన దేశములో అన్ని కులాలకి ఏవో తెలుగుపేర్లు ఉన్నవి. వాటిని మానేసి సంస్కృతపు పేర్లు పెట్టుకుంటున్నారు. కంసాలి, వడ్రంగి, అన్నమాటలు తప్పు, విశ్వబ్రాహ్మణు లన్నమాట గొప్ప. మంగలులు అన్న శబ్దము తప్పు నాయీబ్రాహ్మణులు అన్నమాట గొప్ప. ఈ ఊళ్లో రంగన్న షావుకారుగారు

గొప్ప ధనవంతుడు. వాళ్లు పల్లెకారీలు. ఆయన సత్పురుషుడు, మన సంప్రదాయమునందలి మానము కలవాడు, దయాదాక్షిణ్యాము మొదలైన సద్భావములు కలవాడు, పల్లెకారీలన్న మాట తప్పయింది. అగ్నికుల క్షత్రియు లన్నమాట గొప్పయింది. ఈ మాట అహంకారములేని ఆ సత్పురుషునియందు అహంకారాన్ని ఆపాదిస్తున్నది తప్ప ఆయనయొక్క సత్య, దయా శాంతి క్షమౌదార్యాది గుణములకు ద్రోహదం చేయటములేదే ! మాలమాదిగ శబ్దములలోనున్న దోష మేమి హరిజన శబ్దములలోనున్న ఆధిక్యమేమి ? వాళ్లు హరిజనులేమి హరిజనులెందుకు కారు ? హరియంటే విష్ణుమూర్తి హరుడంటే శివుడు, మాల మాదిగలలో శైవులున్నారు, వైష్ణవులున్నారు, స్మార్తులున్నారు. వాళ్ళల్లో పెద్ద పండితులున్నారు. మనదేశములో క్రైస్తవ మిషనరీలను పట్టిలు కొట్టించిన మాల దాసరులున్నారు. చిత్తుచేసిన మాల జంగాలు ఉన్నారు. వాళ్లూ మనకుమల్లేనే, ఇంగ్లీషు చదువుకొని చాలావరకు భ్రష్టులైన వాళ్ళల్లోనే హిందూమతము వదిలిపెట్టని వాళ్ళు పద్దానికిపైన ఉన్నారు. మనమతంలో ఉన్న రహస్యము అనుభూతి ఆత్మజ్ఞానము. వేదాంత రహస్యాలు తెలియని ఏ కులమువాళ్లయినా ఇతర కులాల్లోకి పోతారు. పరమేశ్వరుడు సర్వాంతర్యామి. నీలో ఉన్నాడు నాలో ఉన్నాడు, పశువుల యందున్నాడు. వృక్షములయందున్నాడు. ఈ మహా రహస్యము మనమతంలో ఉన్న మహారహస్యము. ఇతర మతాలకి ఈ పునాదిలేదు. ఈ

పునాది తెలిసినవాడు ఇంకోమతాన్ని ఎందుకు పుచ్చుకొం టాడు ? "మందార మకరంద మాధుర్యమునదేలు మధుపంబు వోవునే మదనములకు" ఇది రహస్యము, అసలు చెప్పవచ్చిం దేమిటంటే ఆయన ఏమండీ ఇప్పుడు జాబ్ లేదా అంటే జాబూ లేదు ఇజికీలు లేదని నేనన్నాను. ఈ మాటలో అతని నవమాన పరచటం ఏమీలేదు. బైబులును వెక్కిరించటము అంతకంటె లేదు, పైగా క్రైస్తవుడను. కాని నేను బైబులు చదివినట్లు తెలుస్తున్నది. అది అతనికి ఇష్టమైన విషయము కావాలి. అత నికి కోపము వచ్చిందంటే ఏ కావ్యానికి ఎంత అర్థముందో తెలియదని అర్థము. ఇలాంటివాళ్లు ప్రతి దేశములోను నూటికి యాభయిమంది ఉంటారు. వాళ్ళకి మనము చెప్పుపులు చెప్పేది. వాళ్ళని ఇతర మతస్థులు తమ మతాలలోకి చేర్చుకునేది. ఇంకా తెలివికలవాళ్ళుంటారు. పాపమాయనెవరో ఒక నవల వ్రాశా డట. అందులో పాత్రలు ఇద్దరు ముగ్గురు నియోగులు, ఇద్దరు ముగ్గురు వైదికులు. వాళ్లువాళ్లు స్నేహములో వాళ్ళ శాఖలను గురించి కూడ ఎత్తిపొడుపు మాటలు మాట్లాడుకొంటూ ఉంటారు. అందుచేత వాళ్ళకి శాఖాద్వేషము లేదు. ఒకరినొకరు ఇంచుమించుగా ప్రాణపదంగా ప్రేమించుకుంటారు. అరె, భార్యాభర్తలలోనే పెళ్ళాన్ని మీవాళ్ళిట్టాంటి వాళ్ళని మొగుడంటాడు. మీ వంశము సంగతి నాకు చెప్పవచ్చారా అని పెళ్లాం అంటుంది. ఇది ద్వేషమైతే సంసారాలు సాగినట్లే,

ఈ సంగతి కూడా తెలియకుండా లోకానుభవాన్ని సమన్వయము చేసికోలేనివాళ్ళు గ్రంథాలు చదవటమెందుకు ? వాళ్ల శ్రాద్ధానికా నా శ్రాద్ధానికా ? మరింకొక మోస్తరు బుద్ధిమంతులుంటారు. మనది వైదికమతము. మనము ఇతర మతాలని విమర్శిస్తాము. ఇప్పుడు ఈ దేశములో ఇది చాలాతప్పు. క్రైస్తవులు ముసల్మానులు కొన్నివందల యేండ్లుగా మన మతాన్ని తిట్టటానికి మనమతానికి చేసే ద్రోహానికి అవధిలేదు గదా ! వాళ్ళని మనమేమైనా అంటే తప్పట. ఇది మతాల విషయము. ఇంక వర్ణాల విషయము చూడండి. బ్రాహ్మణులని ఇతర వర్ణాలవాళ్లు ఏమన్నా తప్పులేదు. బ్రాహ్మణులు వర్ణాల వాళ్ళని ఏమీ అనకూడదు. బ్రాహ్మణుడు ఏమైనా అంటే అది వర్ణద్వేషము. ఇతర వర్ణాలవాళ్లు బ్రాహ్మణులని ఏమన్నా సరే అది దేవతారాధన రాజారాధన. ఇది కొంతమట్టుకు నిజమేమో ! ఎందుచేతనంటే బ్రాహ్మణులు కానివాండ్లు బ్రాహ్మణులను నిందిస్తే అవాంఛనీయమైన వర్ణభేదాన్ని నిర్మూలించేందుకు అంటున్నారు. బ్రాహ్మణుడంటే నాశనము కావలసిన వర్ణభేదాన్ని నిలబెట్టేందు కంటున్నాడు. క్రైస్తవ మతము ముసల్మాను మతము ఇప్పుడున్నవి. అయిపోయిన బౌద్ధమతాన్ని జైనమతాన్ని గూడ ఏమీ అనగూడదట. ఇతర మతాలు మన్ని నిందించటానికి మనము ఇతర మతాలని విమర్శించటానికి భేదముంది; వాళ్ళు మనలని తిడతారు, చంపు

తారు. బలవంతంగా వాళ్ళ మతాలలోనికి మారుస్తారు. క్రైస్త వులు కాని ముసల్మానులుగాని వాళ్ళమతంలోనికిహిందువులను మార్చేందుకు చేసిన ఘోరాలు చరిత్ర ప్రసిద్ధములు. మనము వాళ్ళని విమర్శించటమంటే వాళ్ళ సిద్ధాంతాలల్లోఉన్న అనౌ చిత్యము చూపిస్తాము. ఇది భేదము మనలో కొందరికి వాళ్ళు చంపుతూఉంటే తెగతిట్టుతూ ఉంటే చమ్మగా వుంటుంది.మనది వివేకుల మతము. ఆలోచనతో కూడిన మతము. ఇంతే భేదము.

ఆ అగ్ని పర్వతము పగలటము పతంజలి శాస్త్రిగారి ఈ ఉపన్యాసమైన రాత్రిపూట. సామాన్యముగా దొంగలు రాత్రిళ్లు వస్తారు. దొంగ అంటే ఆపదయొక్క మారురూపము. అందుచేత ఆపదలు రాత్రిళ్ళే వస్తవి. ఒక భూకంపమో సము ద్రము పొంగటమో అగ్నిపర్వతము పగలటమో యాటం బాంబు వదలటమో రాత్రిళ్లే జరుగుతవి. ఎందుకంటే అసలెవెం దుకు జరుగుతవి ? ఎంతమందిని వీలైతే అంతమందిని చంప టానికే కదా? రాత్రిపూటవస్తే అందరు నిద్రపోతూ వుంటారు. పారిపోవటానికి కూడ వీలులేకుండా ఉంటుంది. పడవటానికి గూడ వీలులేకుండా ఉంటుంది. అందుచేత అగ్నిపర్వతాలు రాత్రిళ్లే పగలాలి కాని దొంగలు వచ్చినప్పుడు ఇంట్లో మేలు కోటం జరగవచ్చు అలా అన్నింటికి అపవాదలున్నవి. ఈ అగ్నిపర్వతము కూడ అలాంటిదే. ఇది ఎవరిని ప్రస్తుతము చంప

టానికి రాలేదు. ఉపన్యాసము వినివచ్చిన తర్వాత సోమనాథ
శాస్త్రి రోజూ ఊరుకుంటున్నాడుగా. ఇవ్వాళకూడా ఊరుకో
వచ్చు—ఊరుకోక అన్నాడుగదా "ఇవ్వాళటి ఉపన్యాసము
ఏమీ బాగాలేదు. ఈ పూర్వాచార పరాయణులందరూ ఇంతే.
వాళ్లేమి మాట్లాడుతున్నారో వాళ్లకే తెలియదు. ఆయన
స్ఫురద్రూపి. పద్యాలు కమ్మగా చదువుతాడు. జనంలో ఎక్కు-
వమంది మూఢులాయె ఎవడు చెప్పినాసరే చెప్పేవాడి
గొంతుక ఖంగున మ్రోగుతూఉంటే వాడు కొంచెము ఒడ్డు
పొడుగు ఉంటేవాడు మాట్లాడుతుంటే మీదపడి కరుస్తాడేమో
అన్నట్లుగా ఉంటే వింటూనే ఉంటారు. వాడు గొప్ప వక్త
అంటారు. ఇప్పుడీ ఊరునుంచి అయిదారువేలు వేసుక వెళతా
డనుకొంటాను." ఈ మాటలు వినేటప్పటికి సోఫియా మనసులో
పది విషయాలు గిఱ్ఱున తిరిగినవి. ఇతడు పూర్వాచార పరా
యణుడుకాడు. మేరీ అందకత్తె కాదు. కనక నిరాకరించాడు
కాని అందకత్తె అయితే పెండ్లి చేసికొనేవాడే. ఇతని ఈ బుద్ధి
తెలిసే తండ్రి ఇంటికి రానీయలేదు. ఈ సంగతి ఇతని చెల్లెలు
బావమరిదికి కూడ తెలుసు. అందుకనే ఇతను వాళ్ల ఇంటికి
వెళ్లలేదు. నన్ను పట్టుకొనే వ్రేలాడుతున్నాడు. నేను విఠల్
రావుతో మాట్లాడలేదు. ఎందుకు మాట్లాడటములేదో ఇతనికి
తెలుసు. కదిలిస్తే ఏమౌతుందో అని ఊరుకొన్నాడు. ఇతనిది
వాదనాపటువైన బుద్ధి. వాదిస్తే అంతా సంప్రదాయాల కక్షి
ముఖంగా వాదిస్తాడు. ఒకడి మనో నైశిత్య లక్షణం వేరు.

పాడి హృదయము వేరు. ఇతడు క్రమంగా జాకబ్ చెల్లెలిని పెళ్ళిచేసికోటానికి మార్గాలు సరిచేస్తే చేసికొంటాడు. నేనీ సహాయము చేస్తే జాకాబ్ సంతోషిస్తాడు. జాకబ్ రాసిన ఉత్తరంలోని సంగతులు నిజమో అబద్ధమో తెలియదు. ఆవిడకు అన్నగారంటే చాలా భయము. ఇతనికి ఉద్యోగము తీసివేశాడని జ్వరము వచ్చేటంత గుండెలోతు ఆ పిల్లకు ఉందని నేనను కోను. ఇతన్ని అక్కడికి రప్పించేందుకు నేను డబ్బు పంపించినట్లుగా జాకబ్ పంపించాడు. చేప వలలోనించి తప్పిపోయిందే అని మళ్ళీ గాలం వేశాడు. ఇతనికి కోపము తెప్పించాలి, రగడలోకి దింపాలి. ఇతని ఖర్చు నాకెక్కువయింది. ఈ దిక్కుమాలిన లోకం ఆడకుక్క మగపిల్లి కలిసి వీధివెంట వెళుతూ ఉంటే వాళ్ళ ఇద్దరికి సంబంధము ఉందనుకుంటుంది. ప్రపంచకమంతా లింగబుద్ధి. అసలు ప్రపంచకమంతా శైవమతము. ఆ కృష్ణుడు ఉన్నాడే యశోదమ్మ కొడుకు వాడు మాయని కమ్మించాడు. వాళ్ళ పసుక్రీస్తు వీళ్ళ అమ్మ మొగుడు. వీళ్ళ కొడుకు వాడు "ఆత్మా వై పుత్ర నామాసి" కాదూ. నన్ను జాకాబ్ మోసంచేసి పెళ్ళిచేసికొన్నాడు. నేను వీణ్ణి మోసం చేసి మేరీకి పెళ్ళిచేస్తాను" అనుకొని సోఫియా ఇలా అంది "పతంజలి శాస్త్రిగారు పెద్ద పండితుడు. ఉదారుడు. మొదటి రోజున నా కభినందన సభ జరిగితేగాని తా నుపన్యాసాలు ప్రారంభింప నన్నాడు, ఇవ్వాళ ఆయన చెప్పినదంతా చాలా

బాగుంది. ఇప్పుడు లోకం ఎలా ఉందో దాన్ని యథాతథంగా చూపించాడు."

"ఆయన క్రైస్తవమతాన్ని నిందించాడు నీకు బాగానే ఉందా ?"

"ఆయన ఏమీ నిందించలేదు. ఇతర మతాలు హిందూ మతాన్ని ఎలా నిందిస్తున్నవో చెప్పాడు. అందులో తప్పే ముంది ?"

"నీవు క్రైస్తవురాలవు. నీకు బాగా ఉంటే నాకేమి ?"

"నేను క్రైస్తవురాలనని ఎవరు చెప్పారు ? నేను క్రైస్తవురాలను కాను. నేను క్రైస్తవుణ్ణి పెళ్ళి చేసికొన్నాను. అతనైనా ఇప్పుడు క్రైస్తవుడు కాడు. నాకు ఏ మతం లేదు. అతనికీ ఏ మతమూలేదు. మేమిద్దరమూ విగతమతులము."

"విమతులు అనొచ్చు. అంటె విరోధులు అనికూడ అర్థ మొస్తుంది, ఇంకో అర్థముకూడ వస్తుంది. బుద్ధిలేనివాళ్ళు అని కూడ అర్థము వస్తుంది."

"నీవు నన్నంటే ఊరుకొంటాను. నా భర్తనంటే ఊరు కోను."

"మళ్ళీ భర్త! మళ్లీ భర్త ఏమిటి ? మొన్నటి ఉత్త రము నేను చదివాగా ! రేపు మీ పతంజలిశాస్త్రి నడగాలి;

నీవూ జాకబు భార్యాభర్తలో కాదో ! ఆడవాళ్ళని అబలలు అనవచ్చునో అనకూడదో ?"

"ఆయన ఉపన్యాసాలు బాగుండలేదుగా. ఆయన చెబితే నీకు సమాధానమా ?"

"అదంతా నాకెందుకు విఠల్‌రావుతో రేపు మాట్లాడి తీరాలి. ఎన్నాళ్ళు నీమీదపడి తినను ?"

"ఆ మాత్రం జ్ఞానమున్నది కదా ?"

ఆ మాటలతో సోమనాథశాస్త్రి ఒళ్లు మండిపోయింది. తన కుద్యోగంలేదని తనకు తిండిలేదని, ఆవిడ దయతో ప్రస్తుతం సుఖంగా సాగుతున్నదని మఱచిపోయినాడు. మఱచి పోవటానికి కారణం ఆవిడ యిచ్చిన చనవు. వెనక ఉన్న బంధుత్వము. ఆవిడని ఏమాట బడితే ఆమాట అననివ్వటం. అన్నాడు గదా "నీవు కులభ్రష్టురాలవు దొంగవు. నన్ను మోసంచేసి ఆ ఊరు పిలిపించావు. నీమూలంగా నేనా ఊళ్ళో ఉపవాసాలు చేశాను. నాకు వచ్చిన అనర్థానికంతా నువ్వేమూలం" అని. ఇట్లా పెరిగి పెరిగి చివరికొక ముండతిట్టు తిట్టాడు. ఆమె త్రాచువలె లేచింది "నీవు నీచుడవు. పల్లెటూరివాడవు, అనాగరకుడవు, బుద్ధిలేనివాడవు. నేను మతభ్రష్టురాలిని కావచ్చు. నీవు మతిభ్రష్టుడవు. నీవు బి. ఎ. ప్యాసయినా ఒకటే. కుక్క బి. ఎ. ప్యాసయినా ఒకటే. నా గదిలోనించి వెళ్ళిపో" అని ఆవిడ

లేచేటప్పటికి అతనేదో సమాధానము చెప్పబోయినాడు. ఆవిడ "నోరెత్తటానికి వీలులేదు. నోర్మూయ్. ముందర నా ఇంట్లోనించి కదులు. లేకపోతే బంట్రోతుని పిలిపించి నెట్టి స్తాను బయటికి" అన్నది.

ఆ పాటున సోమనాథశాస్త్రికి కళ్ళవెంట నీళ్లు గిఱ్ఱున తిరిగినవి. వెక్కి వెక్కి ఏడవటము మొదలుపెట్టాడు. సోఫియా బాగా ఏడవనిచ్చింది. చివరకు నవ్వి మొహం కడుక్కురా అన్నం తిందా"మంది—

# 12

పతంజలిశాస్త్రి మళ్ళీ ఇలా ఆరంభించాడు. "ఈ పాశ్చాత్యులు చేసిన పరిశోధనలు చాలా చమత్కారంగా ఉంటవి. పూర్వం పలుదేశాలల్లో ఎల్లా జరిగిందని అప్పటి ప్రజలెట్లా ఉన్నారని కనుక్కుందామన్న వాళ్ళ ఆశకు అవధిలేదు. ఇంత పరిశోధనాచేస్తే వాళ్ళదృష్టి ఎంతసేపటికి ఎలా ఉంటుందంటే ఆ పూర్వులందరు అనాగరకులు. క్రమక్రమంగా మానవజాతి వృద్ధిపొందుతూ వస్తున్నది. ఈ నాటికి మహోన్నత దశ పొందింది. ఈ దృష్టితోనే పరిశోధనలు చేస్తారు. ఈ మధ్య సుధాంశుకుమార్ రే అన్నాయన, ఢిల్లీలోచేతిపనుల ప్రదర్శనా భవనంలో ఒక ఉద్యోగి, ఆయన వంగ దేశీయుడు. ఆయన ఒక చిన్నగ్రంథం వ్రాశాడు.దాని తాత్పర్యమేమిటంటే ఆ ఈజిప్టు దేశపురాజులు వచ్చి ఈ వంగదేశాన్ని పూర్వం ఆక్రమించారని ఈ వంగదేశము వాళ్ళ వశమైందని అక్కడి ఈశపీర దేశపు పరిస్థితులకు ప్రతిగా వంగదేశం ఉన్నదట. అదట్లాఉంచి నేను

పూర్వము మీతో చెప్పాను. హిందూభారత దేశాన్నుంచి ప్రజలు వెళ్ళి సముద్రమార్గంగా శాల్మలీ ద్వీపంలోఉన్న ఈ ఈశపీఠ ఖండాన్ని ఆక్రమించి ఉంటారని. ఇతర దేశాలని ఆక్రమిద్దామని వెళ్ళేవాళ్ళ విషయము సరే. ఈ ఈజిప్టువాళ్ళు వచ్చి హిందూదేశాన్ని ఆక్రమిద్దామని వస్తే సముద్రము మీది నుంచే రావాలిగదా! వాళ్ళు భారత దేశానికి వచ్చిగుజరాత్ వదలిపెట్టి మహారాష్ట్రాన్ని వదలిపెట్టి కన్యాకుమారి ద్రావిడ దేశము ఆంధ్రదేశము ఓఢ్రదేశము అన్నీ వదలిపెట్టి పోయి వంగదేశాన్ని ఆక్రమించారు ? ఆనాడు వాళ్ళకి అంత సమర్థమైన ఓడలు ఉన్నవా ? చరిత్రకారులెవరూ ఆ సంగతి వ్రాయ లేదే ! అయితే ఆ ఈశపీఠ దేశభాషకు వంగదేశభాషకు కొన్ని సామ్యాలు చూపించాడాయన. ఒప్పుకొందాము అసలు వాళ్ళ ఊహాలు ఎట్లా ఉంటయంటే సంస్కృతభాష మొదటిది కాదని అస్తోష్ భట్టాచార్యులు—ఈయనయు వంగదేశీయుడే. ఆయన వ్రాశాడుగదా అనాదిలో హిందువులు కాని ఎవరో జాతి మాట్లాడుకొనే ఒకానొక భాషతో ఉండే దోమరాయి. దోమ్మా, దోర్మా ఇలాంటి శబ్దాలు సంస్కృతములోని ధర్మశబ్దాలుగా మారినవట. ఇంక వాళ్ళ ఊహా లక్షణాన్ని గురించి ఏమి చెప్పాలి ? ఇంగ్లీషు వాళ్ళు వాళ్ళు మనకు నేర్పినవిద్య ఇటు వంటి పండితుల దగ్గర రెట్టికి రెట్టింపుగా పండిందని అర్థం. డ్జామ్ అన్నమాట ఈశపీఠ భాషలో రాజదండము అన్న అర్థము కలిగింది. వంగభాషలో యమదండమునకు జామ్దణ్డ

అంటారు. యముడు ప్రకృతి. జముడు వికృతి. యమున సంస్కృతము జమున వికృతి అని చిన్నప్పుడు మేము వ్యాకరణములో చదువుకొన్నాము. సంస్కృతములోనున్న యకారము ప్రాకృతభాషలో జకారమౌతుంది. ఈ జాం అన్నమాటే సంస్కృతములో యమశబ్దమైందట. ఆ శబ్దము వంగభాషలో నించి పుట్టిందట. వేదాలల్లో యమశబ్దముంది. వాల్మీకంలో ఉంది. సంస్కృత భారతంలో ఉంది. ఈ వంగభాష వాటన్నింటికన్న పూర్వం ఉంది కాబోలు. ఇక్కడ ఒకమాట చెప్పాలి. వీనితో పాశ్చాత్యులు వాళ్ళననుసరించే మన పండితులు పెద్ద పొరపాటు ఎక్కడ ఉందంటే మానవసృష్టి జరిగి ఒక అయిదారు వేల సంవత్సరాలయింది అని అనుకోటంలో ఉంది. వాళ్ళు ఒక ఇరుకున పడ్డారు. కొన్నికోట్ల సంవత్సరాలకు పూర్వం ఉన్న వేదాలు కొన్ని లక్షలకు పూర్వం వ్రాయబడిన రామాయణం వీనినన్నింటిని ఈ ఆరువేల యేండ్లలోనికి చొప్పించవలసి వచ్చింది. ఇదంతా ఇల్లాచేసిన ఇంగ్లీషువాళ్ళు బుద్ధిపూర్వకంగా చేస్తే మనవాళ్లు గొర్రెల మందవలె వాళ్ళ వెంటబడ్డారు. పైగా వీళ్ళందరు సంస్కృతం మొఖమెరుగరు. సహజంగా ఆత్మ దేశాభిమానము లేదు. స్వభాషాభిమానము లేదు. స్వసంస్కృత్యభిమానములేదు. ఆ ఇంగ్లీషువాడు అవన్నీ లేకండా ఉండటానికి వాడి చదువులోనే కట్టుదిట్టాలు చేశాడు. చదువులో ఏమేమిచెబితే వీళ్ళు స్వాభిమానాన్ని పరిత్యజిస్తారో స్వసంప్రదాయాన్ని ఎదిరిస్తారో తమ నాగరికత కూడ నిన్న

మేమెన్నటిదీ అనుకొంటారో ఆ చదువు చెప్పాడు. పెద్దపెద్ద జీతాలు కొందరికి ఏర్పాటు చేశాడు. వాళ్లు తన మాటకి ఎదురు తిరక్కుండా మేక్ బంద్ చేశాడు. గాంధీగారు అంత పెద్ద ఉద్యమం నడిపితే ఈ దేశంలోఉన్న మన దేశీయులైన పెద్దపెద్ద అధికారులందరు ఇంగ్లీషు గవర్నమెంటువేపు. దేశ భక్తుల నందరిని శిక్షించింది, ఇరకటాన్ని పెట్టింది, ఖైదుల్లో వేసింది, మనవాళ్లే. వాళ్ల పెద్దజీతాలు పోతవి. పైగా వాడు చెప్పిన చదు వెట్లాంటిది ? ప్రతి చిన్న పాఠశాలలో కూడ వ్యాస రచనకు మొదటి విషయమేమిటంటే ఇంగ్లీషువాళ్ళు పాలించటం మూలంగా మనదేశమునకు కలిగిన లాభమేమి ? అన్న విషయము. అలా చిన్నప్పటినిరచి నేర్పబడ్డవాళ్ళు, పెద్ద పెద్ద జీతాలు ఆఇంగ్లీషువాళ్ళ దయ మూలంగా సంపాదిస్తున్న వాళ్ళు, సమృద్ధిగా వస్తున్న డబ్బుతో మద్యము మాంసము నిరంతరంగా ఆరగించటానికి వీలున్నవాళ్లు దేశభాషలంటే వాళ్ళకి తిరస్కారము. సంస్కృత భాషంటే పరభాష. వాళ్లు ఏమి రాస్తారు ? జమ అన్న పంగళబ్దంలోనించి యమ అన్న సంస్కృత శబ్దం పుట్టిందంటారు, వాళ్లు వాళ్ళ బైబులును మర్చిపోతే ఎంతో బాగుపడేవాళ్ళు. అంటే అబద్ధాలు వ్రాయకుండా సరిపొయ్యేది. అది బాగుపడటమే కదా ! అసత్యము లేకుండా పోయేది. ఆత్మవస్తువు కొంచెము ఔన్నత్యము పొందేది. ఇంక మనవాళ్ళ విషయము చెప్పేదేముంది ? అప్పుడు పాశ్చాత్యులకేమి తెలిసేదంటే ఈ భారతీయ నాగరకత

యొక్క ప్రాచీనత మనము కనుక్కోలేము. ఇది అనాదియైన భాష. సర్వభూగోళము భూగోళమునందలి సర్వదేశాలు ఇక్కడనుంచి వెళ్ళిపోయిన మానవజాతితోనే నిండిపోయినవని, మరింకొకటి వాళ్ళు తెలిసికోవాలి. వాళ్ళ ఇంగ్లండులో ప్రాత ఇంగ్లీషని క్రొత్త ఇంగ్లీషని రెండు భాషలున్నవి. అమెరికా వచ్చిన తర్వాత మరీ క్రొత్త ఇంగ్లీషు ఇంకొకటి వచ్చింది. వాళ్ళ జాతియొక్క బ్రతుకంతా ఆరువందల యేళ్ళులేదు. అందులో అప్పుడే ప్రాతభాష క్రొత్తభాషానా? లక్షల సంవత్సరాల మీద భాషలు ఎంత మారిపోతవి. మనుష్యులు ఎంత మారిపోతారు? మొదట ఒకభాషే వంద భాషలుగా కనిపిస్తుంది. ఒకజాతే దూరదూరాలుపోయి నివసిస్తూ ఉంటే వాళ్ళ ఆహార విహారాదులు వాళ్ళ ఆచారాదులు మారిపోతూఉంటే అక్కడి శీతోష్ణ పరిస్థితుల వత్తిడి ఎక్కువై మనుష్యుల ఆకార విశేషాలు మారిపోతవి, ఒకచోటి వాళ్ళు పొట్టివాళ్ళౌతారు. ఒక చోటి వాళ్ళకి ముక్కులు అతుక్కుపోతవి. చలి ఎక్కువై చిన్నప్పటినించి కాళ్ళు బిగించి కట్టుకుంటూ ఉంటే కాళ్ళు పెరగటం మానివేస్తవి, చర్మముయొక్క రంగు మారిపోతుంది. కొన్ని వందల తరాలు గడిచేటప్పటికి వాళ్ళింకొక జాతివాళ్ళనిపిస్తుంది. ఒక్కొక్కప్పుడు వైత్యంచేసి చెవికాని పెదవికాని వాస్తవి. దురద పెడుతుంది. మందువేస్తే తగ్గుతుంది. మన శరీరంలో సహజంగా ఉండే లక్షణానికి అది వ్యతిరేక లక్షణము. శరీరములో ఉండే లక్షణాలకది సహజమైతే ఆ ప్రాంతము

సందబి గాలులు ఆహార పదార్థాలు దానికి నశిపోతే ఆ ఆ వైన వెదవి స్థిరమైపోయి జాతి లక్షణంగా మారుతుంది. పైగా వాళ్ళు చెప్పిన సిద్ధాంతం ప్రకారమే మొట్టమొదట భగవంతుడు సృష్టించింది ఆదముని, అవ్వనే కదా! సర్వమానవులు వాళ్ళనించే పుట్టారుగా! ఆ ఆదము అవ్వ మొట్టమొదట ఎక్కడవుటారో సెమిటిక్ జాతి మంగోలియన్ జాతి ఆర్యన్ జాతి ఈ జాతి విభేదాలెప్పుడు కలిగినవో? అందరు ఆదమవ్వలనించే పుడితే ఈ జాతిభేదాలెందుకో! ఇంత మారేందుకు పదివేల యేండ్లు చాలుతవా? ఇంతకు ఇల్లా మొహాలు మారిపోతుంటే ఆకారాలు మారిపోతూఉంటే అందరూ ఒకే శబ్దాన్ని ఒకేరకంగా ఉచ్చరించలేకపోతూఉంటే వేల సంవత్స రాలమీద ఏ శబ్దం ఎల్లా మారిందో గుర్తు పట్టటానికి కూడ వీల్లేకపోతూఉంటే నూతన పరిస్థితుల్లో కొన్నిశబ్దాలు పుడుతూ వుండవచ్చు. ఎందుకు పుట్టకూడదు? జప్లిన్ అన్న శబ్దము ఉన్నది. అది కనిపెట్టిన వానిపేరు దానికి వచ్చింది. అది సంస్కృతభాషకు వచ్చిన అమర్యాద లేదు. ఆ భాషకు వచ్చిన మర్యాదలేదు. కాని ధర్మశబ్దము యమశబ్దము ఇటువంటి సంస్కృత భాషకు ప్రాణభూతమైన శబ్దాలు దేశ్య శబ్దముల యొక్క వికారాలనటం సంస్కృతభాష మన మాతృభాష గనుక అది మాతృద్రోహం వంటిది. ధర్మమన్న శబ్దము సంస్కృత భాషకు సంస్కృత భాషయందు ప్రతిఫలించే నాగరికతకు మూలస్తంభమయ్యే శబ్దము. నియమము యతి యముడు

ఈ శబ్దాలు యమ అనే ధాతువులోనించి పుట్టినవి. జామిలో నించి యమ శబ్దము పుట్టదు. పుడితే నానురొట్లై పుట్టాని. దీన్ని గురించి ఇంత విస్తరించి ఎందుకు చెప్పానంటే మనవాళ్ళ బుద్ధి వైభవము ఇలాఉంది. వీళ్ళకి ఏమీ తేలియదు, తెలియక పోవటానికి కారణము సంస్కృతము చదువుకోక పోవటను. ఆ సంస్కృతాన్ని ఎన్ని విధాలుగా వెనుక పట్టించాలో అన్ని విధాల ఇంగ్లీషువాడు పట్టించాడు. ఆ వెనుకపడ్డ వాళ్ళల్లో మన రాజకీయార్థికాది సర్వవిషయముల యందు అధికారంలో ఉన్న వాళ్లు ఉన్నారు. ఇలా మన నాగరకత నశించిపోతున్నది అని చెప్పటానికి చెప్పాను. ఈ సుధాంశ కుమార్ రే—ఈ రేని రా అనికూడ అనవచ్చు. ఈశ పీఠభూమిలో ఉండే దేవత పేరు రాయ్. అది రవి శబ్దమునుండి పుట్టింది అని అనవచ్చు. అ రార్ ఈ రే ఒకటేగదా! అందుచేత వీళ్లు ఒకటేనేమో మనకు తెలియదుగాని ఆయన తాను వ్రాసిన పుస్తకంలో ఒకమాట వ్రాశాడు. వంగదేశపు చేతిపనులు మహెంజోదారో ఎంత పురాతనమో అంత పురాతనములని. ఇది వాళ్ల లెక్క ప్రకారమే కుదురదు, ఈజిప్టు నాగరకత అయిదువేల ఏళ్ల క్రింద వున్నదని వాళ్ళే చెబుతున్నారు. మహెంజోదారో నాగరకత పదివేల యేండ్లక్రిందదని వాళ్ళే చెప్పారు.

ఇది ఇలా ఉండగా నిజానికి పురాతన మహా నాగరకతల, రాజుల, గ్రామముల, దేవతల పేర్లు ఉన్నవి ఉన్నట్లుగా

గ్రహిస్తే ఏమీ తేలదు. ఒక్క ఈజిప్టు విషయం చూస్తేనే గ్రీకులు ఆ పేర్లన్నీ మార్చేశారు. ఈజిప్టుని పాలించిన రాజులని ఫారోలు అని అంటారు. కాని ఈ రే ఏమన్నాడంటే అధి ఫేరో కాదు అసలు ఈజిప్టుమాట పెరో అని అనగా పెద్ద ఇల్లు అని అర్థమట. తొలుత అది రాచరికము చేయబడే స్థలానికి పేరై తరువాత చక్రవర్తికి పేరైందట. ఇప్పటికి వంగ దేశములో ఒక ఊరికి పేరు పెరో. పెరో అంటే గ్రామము. ఊరు అని అర్థము. అలాగే అనేక పేర్లు మారిపోయినవి. ఆ రే గారు పెరో శబ్దము దేశీయశబ్ద మనుకొన్నాడు. అది పుర అన్న శబ్దానికి దగ్గరగా లేదా? ఇప్పటికి వంగదేశీయులు అకారాన్ని ఒకారంగా ఉపయోగిస్తారు. వకారాన్ని బకారంగా ఉచ్చరిస్తారు. చాలామంది ఔత్తరాహులు సంయుక్తాక్షరాన్ని విడివిడిగా ఉచ్చరిస్తారు, ప్రాకృత భాషలన్నీ ఆ ఔత్తరాహుల ఉచ్చారణ సౌష్ఠవాన్ని బట్టే వచ్చినవి. ఆ ఈశపీఠ దేశవాసుల మాటలైతేనేమి తదితర ప్రాంతములందలి భాషలలోని మాటలైతేనేమి మారిపోయినవి. మారిపోగా తక్కినవి సంస్కృత శబ్దములనే స్ఫురింపజేస్తూ ఉంటవి. వంగదేశంలో ఫేస్విపాడి అనే ఒక ఊరుంది. ఈ ఫేస్వికేశి శబ్దము. అది శ్రీకృష్ణుడు సంహారించిన కేశి అనే రాక్షసుడి ఊరు. ఆ ప్రాంతాలంతా ఇప్పటికి కూడ అది కేశి రాక్షసుడి ప్రదేశమని చెప్పుకుంటూనే ఉంటారు. తామ్‌లుక్ అనే చోటికి పడమట యాభై మైళ్ళలో ఉందట ఆ ఊరు.

ఈ చెప్పిన అనేక విషయాలని పట్టిచూస్తే మొత్తానికి ఈజిప్టును ఆక్రమించుకొన్న వాళ్లల్లో వంగ దేశీయు లెక్కువ మంది ఉన్నట్లు ఉన్నది. ఇంకా కొన్ని విషయాలు చూస్తే తెలుగువాళ్ళుపోయి సుమేరు దేశంలో ప్రాధాన్యం వహించి నట్లు కనిపిస్తుంది. ఇదంతా ఊహా సుమండి! వాళ్లదీ ఊహే! నాదీ ఊహే! వాళ్ల ఊహాలు వాళ్ల బైబులుమీద ఆధారపడి ఉన్నవి. నా ఊహాలు మనమనుస్మృతి మన పురాణాలమీద ఆధారపడి ఉన్నవి. మన శ్రుతి స్మృతులయందు మన పురాణ ములయందు ఇంగ్లీషు చదువు ద్వేషం కల్పించింది గనక ఇప్పుడు మనదేశంలో చదువుకున్న వాండ్లూ అంటే ఇంగ్లీషు చదువుకున్న వాండ్లే గనుక వాళ్లు వాళ్ళ మాటలు నమ్ము తారు. నా మాటలు నమ్మరు. మరి ఎందుకు చెబుతున్నావు అంటే ఒక కూర ఉన్నది. తిన్నవాళ్ళందరూ అరిగించుకో గలరా? అరిగించుకోటము వాళ్ళ జీర్ణశక్తిమీద ఆధారపడి ఉంటుంది. కొందరరిగించుకోలేరని ఒక సంతర్పణ చేస్తుంటే ఒక పెండ్లి విందు జరుగుతుంటే ఒక దుంపకూర చేయటం మానివేస్తారా? ఈజిప్టు భాషలో రాయ్ అంటే రాణి. రాధ అనగా శ్రీకృష్ణుని మేనత్త రాణిగదా అందుచేత వాళ్ళ భాషలో రాయ్ అంటే రాణి. అని ఈ రాయ్‌గారు వ్రాశారు. మరి ఈయన రాయ్ ఏమిటి? ఈజిప్టు దేశీయుల దేవుడైన రే ఏమిటి? రాజశబ్దభవము రాయ్ ఎందుకు కాకూడదు? అది అవివక్షితంగా స్త్రీ కెందు కుపయోగించకూడదు. వంగ దేశ

ములో ఉన్న అనేక కుటుంబముల పేర్లు ఈశపీఠ భూమిలోని ఊర్లనుంచి అక్కడఉన్న వర్ణ భేదాలనుబట్టి వచ్చినవి అంటారు. అయ్యో వాళ్లువచ్చి ఇది ఆక్రమించారనుకోకపోతే ఈ వంగ దేశీయులైన భారతీయులు వెళ్ళి ఆ ఈశపీఠ దేశాన్ని ఆక్ర మించుకో కూడదా ? మన ఇంగ్లీషు చదువులు మన మనస్తత్వాలు ఇలా మార్చివేసినవి. అన్నింటికన్న ఆశ్చర్యం ఈశపీఠ దేశవాసులయొక్క స్వర్గం పేరు ద్యు — ద్యు అంటే సంస్కృతంలో స్వర్గం అని అర్ధం—ఇంక ఏం చెప్పాలి.

## 13

మరునాడు ప్రొద్దున వాళ్ళిద్దరికి మొన్న పోట్లాడుకున్నట్లే లేదు. నిన్న సోమనాథశాస్త్రి కొంచెము బెరకు బెరకుగా ఉన్నాడు. సోఫియా అతనికి దగ్గర దగ్గరగా నడవటం, ఏమి సోమనాథం అని బుజముమీద చేయివేయటం, అది తెచ్చిపెట్టు ఇది తెచ్చిపెట్టు అని అడగటం, అతని కేదైనా కావలసివస్తే తానే తీసికెళ్ళి యివ్వటం, ఆ రాత్రి తన కాకలిగా లేదంటే తను బలవంతంచేసి మొదట ముద్ద తానే అతని నోట్లో పెట్టడం ఈ యీ రీతిగా చేయటం మూలంగా అంతా పరిసిపోయింది. పైగా మొదటి రోజుల్లో హోటల్ నించే ఇద్దరికి కలిపి అన్నం వచ్చేది. వాడు రెండు విస్తళ్ళు పంపించేవాడు. రెండు దూర దూరముగా వేసుక తినేవాళ్లు. ఒకళ్ళ ఎంగిలి ఒకళ్ళు తగిలించు కొనేవాళ్ళు కారు. తరువాత తరువాత రెండు విస్తళ్ళు దగ్గరకు సాగినవి. పెద్ద ఎంగిలి లేకండానే తింటూ ఉన్నారు. రాత్రి మకీ సోఫియా ఏమి చేసిందంటే చివరకు తన కన్నం

తక్కువైతే అతిని కన్నం తక్కువైందంటూ ఉంటే అతని పేస్తట్లో అన్నం తింటూ తింటూ ఉన్నచేత్తో తానే తీసికొంది. ఇలాంటివి పడమటి దేశాల్లో ఏమోగాని 'మనదేశంలో ఎంత బాగుపడ్డామంటూ చెడిపోయినా ఎబ్బెరికంగానే ఉంటుంది. ఇంతదూరం వచ్చేటప్పటికి తెలియని ఒక రహస్యమైన మార్పు వస్తుంది. మన పెళ్ళిళ్ళల్లో పెళ్లికొడుక్కి పెళ్లికూతురికి కలిపి ఒక కంచంలో పెడతారు. వాళ్ళ ఎంగిలి వీళ్ళచేత తినిపిస్తారు. వీళ్ళ ఎంగిలి వాళ్ళచేత తినిపిస్తారు. ఆ ఎంగిలి కలిసేటప్పటికి వాళ్ళ ఆత్మలలో ఒక అభేదభావన కలగాలి అని. తిన్న ఆహారముచేత జీవుడు జీవిస్తాడు. బ్రతకటానికి అన్నము ప్రధానమైనది. మానవులందరు అన్నజీవులు. అన్నము లేకపోతే బ్రతకలేరు. అన్నము తిని పుష్టిగా ఉంటేనే స్త్రీ పురుషుల యొక్క సంగమము. శవాలు సంగమింపవు. కనీసము స్త్రీ పురుషులతో ఒకళ్ళయినా బ్రతికివుంటే కొందరు మహానుభావులు మిగిలిన వాళ్ళు శవమైనా సంగమిస్తారట. ఈ మధ్య ఒక డాక్టరల్లా చేశాడని వాడిమీద పెద్ద అభియోగం తెచ్చారు సృష్టిలో నీచత్వమని ఉదాత్తత అని రెండు ఉన్నవి. వాటిని పాటించేవాడు—మనుష్యుడు. పాటించనివాడు పశువు. పశువనటము పశువున కవమానము. పద్యం ఉన్నదే "ఆడినమాటను తప్పిన గాడిద కొడుకంచు తిట్టగా నయ్యయ్యో వీడా నాకొడుకంచును గాడిద యేడ్చును గదన్న ఘన సంపన్నా". పశువులు కూడ శవంతో సంగమించవు. కోడి జంతువు చచ్చిపోతే దాని

చూట్టూ కుంయి కుంయి లాడుతూ ఏడుస్తూ తిరుగుతవి. తన కామము తీర్చుకొందామని ప్రయత్నించవు. మనుష్యులలోనే ఇంతటి అధమాధములు జన్మిస్తారు. జన్మలు ఉన్నవి. మనము చేసిన కర్మలువట్టి నీచాతినీచమైన జన్మలు వస్తవి అనే విశ్వాసము ఎప్పుడు లేదో అప్పుడు వాడు చేసే పనికి అవధి యేముంది? పశ్చాత్తాప పడితే సర్వపాపాలు పోతవి అనే వాళ్ళకన్నా పాపాలే లేవనేవాళ్ళు మరీ గొప్పవాళ్ళు. ఏతా వాతా చెప్ప వచ్చిందేమిటంటే భోజనము అనగా అన్నము తినటము బ్రతకటానికి ప్రధానమైనది. అంత ప్రధానమైన దాన్ని అప్రధానంగా అనాగరకులు చేస్తారు. నాగరకులు దానికి ప్రాధాన్యమిచ్చి అది ఒక పవిత్ర కార్యంగా భావిస్తారు. మరిన్ని ఆ అన్నము తినటములో కలిసి తినటం ఒకటి. లోకంలో ఉన్న అన్ని పనులూ రెండు విధాలుగా సాగుతవి. ఒకటి గతిలేక. అప్పుడు ఊహ లేదు. ఆలోచన లేదు. వట్టి బ్రతకడమే ప్రధానము. అది వట్టి శరీర ధర్మము. అన్నీ సాగుతున్నప్పుడు దానికి శరీర ధర్మత్వము పోయి ఆత్మ ధర్మత్వము పడుతుంది. లోకంలో ఉన్న ఆచారాలన్నీ పరిస్థితులనుబట్టి సడలుతూ ఉంటవి. ఆ సడలటం నిత్యధర్మం కాదు. అయితే ప్రాణం పోయింది. రోజు పది గంటలకు భోంచేసేవాడు ఒకరోజున పన్నెండు గంటలకు భోంచేస్తాడు. నిన్న పన్నెండు గంటలకి చెయ్యలేదా ఇవ్వాళ కూడా అట్లాగే చెయ్యి అంటే నిన్న చేసినందుకే సగం చచ్చాడు. ఇవ్వాళ కడమ సగం చస్తాడు. అలాగే రైల్లో

మీనం ఎరగనివాళ్ళలో కూడ కలసి కూర్చుంటాము. ఆ వూరు వెళ్ళవలసిన అవసరం ఉన్నది. రైలు తప్ప గత్యంతరము లేదు. అక్కడ నీ వధికారివి కాదు. నీకు మల్లేనే చాలామంది ఉన్నారు. వాళ్ళు అవసరం కొద్దీ వెళుతున్నారు. వాళ్ళతో కలిసి కూర్చోటం నీకెంత తప్పలేదో నీతో కలిసి కూర్చోటం వాళ్ళకీ తప్పలేదు. అక్కడ కూర్చున్నావు గనక రోజూ నీ ఇంట్లో కూడ కలిసి కూర్చోమంటే ఎల్లా సాగుతుంది ?

ఎల్లా గై తేనేమి ? భోజనం ఒక విశిష్ట ధర్మము. పరమ విశిష్టమైన ధర్మము. జంతువుల బ్రతుకులు దానిమీద ఆధారపడి ఉన్నవి గనక. సర్వ ధర్మములు శరీరము ఉంటే ఉన్నవి. లేక పోతే లేవు. "శరీరమాద్యం ఖలుధర్మ సాధనం" ధర్మ సాధన ములలో మొదటిది శరీరము. ధర్మమును సాధించేందుకు కాక పోతే శరీర మక్కఱలేదు. శరీరానికి ప్రయోజనము లేకపోతే వట్టి శరీరము ఎందుకు ? ఫలములు లేకపోతే చెట్లెందుకు, కట్టెలకోసమా? కట్టెలు కూడా రానివి కంపకోసము. అదైనా ఎరువుకోసం పనికివస్తుంది. ధర్మంకోసం సంఘ క్షేమంకోసం పరస్పర సహాయంకోసం కాకపోతే శరీరమెందుకు ? వట్టి స్త్రీ సుఖంకోసము మాత్రమైతే మానవుడెందుకు ? పశువులు చాలవా ? ఈ స్త్రీ పురుష భేదము పశువులలోనే కాదు. వృక్షాలల్లో ఉంది. సర్వ పదార్థంలో ఉన్నదని తత్వవేత్తలు చెబుతున్నారు. ఆ స్త్రీ పురుష సంగమము మనస్సు కలిగిన మానవులలో ఒక ఉదాత్తత పొంది ధర్మమును రక్షించటానికి

ఆత్మ పదార్థాన్ని అవగతం చేసికోటానికి ఉపయోగించకపోతే వట్టి మన్ను, ఒక రాయి లేకపోతే పశువు వంటిది. పతా వతా ఇద్దరు స్త్రీ పురుషు లేకాంతంగా ఉండి సాగుబాటు బాగా ఉంటే పరిస్థితులు అనుకూలంగా ఉంటే ఒకరి ఎంగిలి ఒకరు తినటం వాళ్ళ యిద్దరి సంబంధాన్ని దూరంగా తీసికెళ్లుతుంది. ఇంత ప్రధానమైన భోజనంలో భేదం లేకపోతే తక్కిన వాటిల్లో గూడ భేదంలేదు అనే అంతదూరంలోకి వెళ్ళుతుంది మనసు అన్నా తమ్ములు అక్కా చెల్లెండ్లు చిన్నపిల్లలప్పుడు ఒకళ్ళ ఎంగిళ్ళు ఒకళ్ళు తింటారు. పెద్దయిన తరువాత కూడ అవసర మైతే కలసి భోంచేసేటప్పుడు తక్కువైతే వాళ్ళ విస్తట్లో వస్తువు వీళ్ళు తీసికొంటారు. ఇది బాగా సన్నిహిత బంధువు లల్లో జరుగుతుంది. మరిన్ని పెద్దవాళ్ళ ఎంగిలి ఆ కుటుంబంలో చిన్న వాళ్ళు తింటారు. పిల్లవాళ్ళ ఎంగిలి పెద్దవాళ్ళు తినరు. పెద్దవాళ్లే ఒకళ్ళ ఎంగిలి ఒకళ్ళు తినరు. ఇది వట్టి ఆచారమే కాదు ఆత్మ ధర్మము. పెరిగేటప్పటికి ఎవళ్ళ వ్యక్తిత్వము వాళ్ళకి వస్తున్నది. ఎవళ్ల ధర్మం వాళ్ళది. ఎవళ్ళ సాధన వాళ్ళది. ప్రతి శరీరము ఆధునిక భాషలో చెబితే విద్యుత్కేంద్రము. శరీరము అగ్నిమయము. ఆ అగ్ని విద్యుద్వికారము. విద్యుత్ కట్టలోంచి ప్రవహించదు గాని తక్కిన పదార్థాల్లోంచి ప్రసరిస్తుంది. భిన్న భిన్న విద్యుత్తరంగాలు ప్రసరిస్తూ ఉంటవి. ఆ తరంగాలు పరమ సూక్ష్మమైన ఇతర తరంగాలలోని భిన్నమైన లక్షణాలను స్వీకరించకూడదు. ఆ తరంగము యొక్క

సాధన వేరు ఈ తరంగముల యొక్క సాధన వేరు. రెండు భిన్న తరంగాలకి సంయోజనము కలిగితే సాధనామార్గము నందలి ఏకాభిముఖత్వం పోతుంది. ఇంతకంటే పరమ సూక్ష్మమైన విషయము ముండదు. అన్నీ స్థూలదృష్టితో చూచే ఆధునిక నాగరికత ఈ సూక్ష్మాలను చూడలేదు. తన చూడలేని శక్తిచేత అది లేనేలేదని వాదిస్తుంది. ఇది ఇంకా పుట్టబోతున్నది కాని భార్యాభర్తలమధ్య దీని పరిగణింపు తక్కువ. భర్త ఎంగిలి భార్య తినవచ్చు. భార్య ఎంగిలి భర్త తినరాదు. వాళ్ల ఇద్దరి శరీరాలలో ఉన్న ఈ విద్యుచ్ఛక్తి భరితమైన రక్త ప్రవాహాలల్లో ఒకానొక సామ్యధర్మము ఉత్పన్నము కావాలె. ఆ కలిగే సంతానములో భిన్న ధర్మాలుండవు. అయితే భార్య ఎంగిలి భర్త ఎందుకు తినగూడదు ? సంగమ కాలమందు పురుషుని రేతస్సు స్త్రీయందు నిక్షేపిత మౌతుంది కాని స్త్రీయొక్క రక్తము పురుషునియందు నిక్షేపితము కాదు. అందుచేత భర్తృ శరీరగత విద్యుద్రక్తాది ప్రవాహముతో భార్యా శరీరగత విద్యుద్రక్తాది ప్రవాహమునకు సామ్యము సంపాదింపబడవలె గాని స్త్రీ శరీరగత రక్తాదిసామ్యం పురుషుని కక్కఱలేదు. పురుషుడు కర్మములు చేస్తాడు. ధర్మము నాచరిస్తాడు. స్త్రీకి సహజంగా కర్మాధికారము లేదు. ధర్మమంటే ఇక్కడ ఒక ప్రత్యేకమైన అర్థము కలది. ఆ ధర్మము పురుషుడే చేస్తాడు. ఆవిడ సహధర్మచారిణి ఈ మాట కర్థము పురుష శరీరమునం దుత్పన్నమయ్యే రేతో ధర్మమునుండి వ్రతాలు పూజలు కర్మలు మొదలైన

బాహిర ధర్మములవఱకు వ్యాపించి యున్నది. వీని అన్నింటి యందు ఆమె భర్తను అనుసరించి ఉంటే కలిగే సంతానము లోక క్షేమకర మౌతుంది. లోకమంటే సంఘమే. నిత్యమైన వేదధర్మ పరాయణ రక్షణమౌతుంది. లేకపోతే మానవరూప పశువులు జన్మిస్తారు. ధర్మ బాహిరు లుదయిస్తారు. లోక విప్లవకారులు ప్రభవిస్తారు. స్త్రీగత కామము జన్మ పరమార్థ మని ప్రచారము చేసేవాళ్ళు పుడతారు. సంఘమంతా ఒక సమష్టి శరీరము అనే జ్ఞానం లేకుండా సంఘైక దేశమునందు ఈర్ష్య మాత్సర్యము విద్వేషము పెంచుకొని తాము విరోధ మవలంబించుచున్న సంఘైక దేశాన్ని నాశనము చేసేవాళ్ళు పుడతారు. వీళ్ళందరూ జగద్ద్రోహులు. ఆత్మశాంతి లేనివాళ్లు. శాంతి అనేది ఆత్మయొక్క ప్రధాన లక్షణాల్లో ఒకటి అని తెలియని వాళ్లు. ఇటువంటి వాళ్ళనే ఉపనిషత్తులు ఆత్మహులూ అన్నవి. వేదములు నిత్యమైన ఆత్మవస్తువును చెబుతున్నవి. వీళ్లు ఆత్మవిరోధులు వేద విరోధులు అవటంలో ఆశ్చర్య మేమున్నది? రెండు మాటలకి ఒకటేఅర్థము. ఈ స్త్రీపురుష సంగమంలో పరస్పర ఆకర్షణ పరస్పర సన్నిహితత్వ భావన కొన్నిదశలమీద ఉంటుంది. ఈ దశలలో ఉన్న ఈ ఆకర్షణ సన్నిహితత్వ భావనా పరమార్థభూత సంగమ పర్యంతము జరిగే విషయములన్నీ సూక్ష్మంగా సుకుమారంగా వర్ణించటము పేరు శృంగార రసము. నీలానది వట్టి బురదలో పుడుతుంది. ఆ బురదలని తఱలించుకొస్తుంది. బ్రహ్మాండమైన వరదలు వస్తవి. చుట్టుపట్ల

అంతా వరదలు చేస్తవి. అందుచేత ఆ రోజులలో అనగా పెరోలు రాజ్యాలుచేసే రోజుల్లో పెద్ద జలప్రవాహ నియమ శాస్త్రవేత్త లుండేవాళ్లు. 'ఇనేని' అనే గొప్పవాస్తు శాస్త్రజ్ఞు డుండేవాడు. ఆతడు రాజుల సమాధులన్నీ కట్టాడు. ఇంకొక పెద్దశాస్త్రజ్ఞుడు ఈ నదీజలాన్నంతా ఒక మహా తటాకంగా నిర్మించాడు. నీలానదికి నీలానది అని పేరు రావటానికి కార ణం దానినిండా బురదతో అది ప్రవహించటమే. ఎందుకు చెప్ప బడుతున్నదంటే ఆ బురద సేవ్యముకాదు. ఆ బురద పొలాల్లో నిండి ఎండిన తరువాత ఎక్కువపంట పండుతుంది కాని మంచి నీళ్లు త్రాగేందుకు పనికిరాదు. అల్లాగా వివశులేని స్త్రీ పురుష సంగమమువలన సంతానము కలగవచ్చు. అది శృంగారరసము కాదు. శృంగారరసము అనటముతోటే నీళ్లు తేరుకపోవాలె. శరత్కాలము రావాలె. అలాగా నాయికా నాయకులు సత్కుల ప్రసూతులు కావాలి. వాళ్ళ కలయిక ధర్మమైనది కావాలె. అప్పుడు దానియందు మనము రమిస్తాము. దుష్యం తుడు కణ్వాశ్రమంలో ఉన్న శకుంతలను చూచి ఆమెయందు కోరిక కలిగి 'అయ్యో నేను క్షత్రియుడనే ఈమె బ్రాహ్మణ కన్యయేమో' అని భయపడ్డాడు. నిజంగా ఆమె బ్రాహ్మణస్త్రీ అయితే పుట్టే సంతాన మెట్లాంటిది పుడుతుంది ? జమదగ్ని బ్రాహ్మణుడు, రేణుక క్షత్రియస్త్రీ. కలిగిన సంతానము పరశు రాముడు. ఆయన ఏమి చేశాడు ? ఇరవై ఒక్కసారి క్షత్రియ నిర్మూలనము చేశాడు. మన పురాణ కథలు ఇట్లాంటి రహ

స్యాలను వ్యంగ్యంగా చెబుతవి. వరుస వావిలేకండా సంగమం చేయుటం తప్పు. వర్ణ వివక్షలేకండా పెండ్లిండ్లు చేసికోటం కూడా తప్పు. కలిగే సంతానము లోకక్షేమానికి భంజకమైన సంతానము కలుగుతుంది. స్త్రీ పురుషుల మధ్య ఆకర్షణ సన్నిహితత్వం కలగటం. వారిద్దరు తెలిసికోనటం, ఇది ఏ ఇద్దరు స్త్రీ పురుషుల మధ్యనైనా జరగవచ్చు. దాన్ని వర్ణించ కూడదు. అదంతా నీలానది బురదనీళ్ళు. యోగ్యులైన స్త్రీ పురుషుల నడిమి సంగమము శరదృతువు నందలి నది నీళ్ళు. ఎటువంటి వాళ్ళయినా బురద నీళ్లు విరుచుకొని త్రాగుతారు. ఈ కాలపు వాళ్ళకి మాత్రం శరన్నదుల యందలి తేరుకొన్న నీళ్ళక్కఱ లేనట్లుంది.

సోఫియా సోమనాథశాస్త్రుల్లు వరసచేత అన్నా చెల్లెండ్రు. ఆ బాంధవ్యము పెరిగేందుకు ఆ భావన నాటుకొనేందుకు ఒక చోట పెరిగిన వాళ్ళుకారు. పైగా ఈ వరస ఇతనికి తన చెల్లెలు వలన సంక్రమించింది. ఆమెకు తా నెప్పుడూ ఎరగని మేనమామ కొడుకువల్ల సంక్రమించింది. ఆ వరసలో అంత పట్టింపు అసలు వాళ్ల ప్రాణాలలో లేదు. వాళ్ల జీవలక్షణాల లోను లేదు అతడవివాహితుడు. ఆమె కాముకి. ఇతడు ఇనప ముక్క వంటివాడు. పొలాలల్లో పని పాటలు చేసేవాళ్లకిమల్లే ఉంటాడు. కాముకియైన స్త్రీ పురుషుని యందొకటి వాంఛి స్తుంది; గాటమైన రతిశక్తి వాంఛిస్తుంది. అట్టి స్త్రీకి ఆ రతిశక్తి ఎవనియందో ఉంటుందని ఆ విడ మనస్సుకి తగలటం ప్రధానంగాని వాడి కులము వాడి సౌంద

ర్యము వాడి ధనము ప్రధానము కాదు. లోకంలో కొందరు స్త్రీలు కామాధిక్యము కలవాళ్లుంటారు. కొందరు పురుషులు కామాధిక్యం కలవాళ్ళుంటారు. ఈ కామాన్ని కొందరదుపులో పెట్టుకొంటారు. కొందరియందు పరమేశ్వరు డనుగ్రహం చూపించి ఆ దుష్టకామము సాగని పరిస్థితు లేర్పరుస్తాడు. ఆ పరిస్థితులే భగవంతుడు. ఎవళ్ళ జీవుడు నీచమార్గాన పోయే లక్షణాలు కలిగి ఉంటాడో వానియందు భగవదనుగ్రహము కూడా వాళ్ళా నీచకార్యం చేయటము జరుగుతుంది. కొందరి బుద్ధి నీచమై యథేచ్ఛంగా మాట్లాడుతారు. యథేచ్ఛంగా వ్రాస్తారు. కాని ఆ పాపకార్యం చెయ్యరు. మన మంత్రులు మొదలైన వాళ్లు దేశనాయకు లనిపించుకొనే వాళ్ళు ఓట్లు కావలసిన వాళ్ళు వర్ణాంతర వివాహాలకు అనుకూలంగా మాట్లాడుతారు. ప్రపంచకమంతా మారిపోవాలంటారు. 'ఎక్కడైనా బావా అనుగాని వంగతోటదగ్గర కాదన్నట్లు ఇన్ని చెప్పి తమ కూతుళ్ల పెండ్లి చేయటం కాడికి వచ్చేటప్పటికి తమ వర్ణమువారే కావాలి. వాడు ఇంజనీరు కావాలి. పెద్ద డబ్బు కలవాడు కావాలి. కనుక దుష్టభావాలు రావటము వేరు. దుష్టక్రియలు చెయ్యటం వేరు. ఇవి రెండు ఎవరో మరి మహానుభావులయందు కలిసిఉంటవి. కనుక సోఫియా సోమనాథశాస్త్రిలు కలిసి అన్నం తింటుంటే అతని ఎంగిలి ఆవిడ తీసుక తింటుంటే వాళ్ళ ఇద్దరి మనస్సుల్లో ఎక్కడో దూరాన కలిగిన కించిద్వికారానికి వెనక పీటీని ఇన్ని సంగతులున్నవి.

వికారము కలిగింది. ఇది ప్రథమ వికారమనటానికి ఇప్పుడు వీలులేదు. భవిష్యత్తులో ఇది వృద్ధిపొందితే అప్పుడిది ప్రప్రథమ వికారమనొచ్చు. కాని దీనికి పరిణామం లేకపోతే ఏదో వికారం ఉదయించింది అంతే! కాని ఒక్కటి మాత్రం కలిగింది. సోఫియా మొన్నటిరాత్రి సోమనాథాన్ని 'గడప త్రొక్కకు ఇక్కడనించి వెళ్ళిపో' అన్నది. అల్లా భవిష్యత్తుల్లో అనే సామర్థ్యాన్ని ఆవిడ తగ్గించుకొన్నది. ఇదివరకు ఆవిడ్ని సోమనాథం ఏకవచన సంబోధనలోనికి దింపాడు. ఇంక 'ఒసేవ్' అన్న నీచ సంబోధనకి కూడ దింపవచ్చు. ఇద్దరూ కలిసి ఇంకొక మెట్టు దిగారు. ఇంకో విషయము ఆవిడ ఢిల్లీలో ఉండటం మూలంగా జాకబ్‌కి భార్య అవటం మూలంగా వాళ్ళఇంట్లో ఎప్పుడూ ఇంగ్లీషు మాట్లాడటం మూలంగా ఈ దేశంలోఉన్న పెద్దరకం క్రైస్తవు లందరికి మాతృభాష ఇంగ్లీషుభాషే అవటం మూలంగా ఆవిడ అన్నదమ్ములు అక్కచెల్లెండ్రు అందరూ ఇంగ్లీషులోనే మాట్లాడటం మూలంగా ఆవిడ ఎప్పుడూఇంగ్లీషే మాట్లాడుతుంది. ఈ చిన్న పట్టణాలల్లో ఎం. ఏ. లు ప్యాసయినా జనం తెలుగే మాట్లాడుతారు. ఈ భేదం వాళ్ళిద్దరి మధ్యా మిగిలింది.

# 14

ఆనాటి సాయంత్రము మళ్ళీ ఉపన్యాసము ఎప్పటిమల్లేనే ఉంది. సోఫియా సోమనాథాలు తమలో తాము మునిగి ఉన్నట్లు ఉన్నారు. కమలా చిదంబరాలకు మాత్రం ఒళ్లు తెళ్లు ప్రాకినట్లుంది. సోమనాథము తమ ఇంటికన్నా రాడేమి? వద్దామని ప్రయత్నించనైనా ప్రయత్నించడేమి? చెల్లెలితోను బావమరిదితోను సభలోనైనా మాటాడడేమి? అతడాకై ౖస్తవ బాలికను పెండ్లి చేసుకోలేదు, ఇష్టము లేక నేకదా! ఏదో కొంత బ్రాహ్మణ్యం నిలబెట్టుకొందామనే కదా! ఇక్కడికి వచ్చేటప్పటికి సోఫియా కనిపించింది. అక్కడనుండి ఇతడ్ని వెళ్ళగొట్టాడని వాళ్ళిద్దరికి తెలిసింది. మొగుడు అతని ఉద్యోగము తీసివేస్తే సోఫియా ఇతని కాశ్రయ మిచ్చింది. ఆ మగనికి కోపము రాదా? వాళ్ళల్లో భర్తకు కోపమువస్తే భార్య లెక్క చేయదు కాబోలు. పాముకాళ్ళు పాముకే తెలుసు. వాళ్ళు ఏపని ఎందుకు చేస్తున్నారో ఎవరికీ తెలియదు. "ఫలాదు

మేయాః ప్రారంభాః" వాడెందు కాపని చేస్తున్నాడో దాని ఫలితము వచ్చిన తరువాత తెలియాలిసిందేతప్ప అంతవరకు తెలియదు. ఇది పూర్వరాజుల రాజనీతి అని కాళిదాసు రాశాడు. అంతకన్న ఎక్కువ రాజనీతి వేత్తలు ఇంగ్లీషువాళ్లు. ఫలము తెలిసిన తరువాత కూడ వాడాపని ఎందుకు చేశాడని తెలియదు. భారతీయులకు ఇంగ్లీషు నేర్పాడు. ఎందుకు నేర్పాడు ? ఇక్కడ వీళ్ళ చదువులు వీళ్ళు మరిచిపోయేం దుకు. వీళ్ళమతము వీళ్ళ వేదాలు పురాణాలు శాస్త్రాలు వీళ్ల ధర్మాలు ఎందుకూ పనికిరావు అని అనిపించేందుకు. ఆ ఫలితము చక్కగా కనిపిస్తున్నది. అయినా మనచేత ఇంగ్లీషు ఎందుకు చదివించాడురా అనే జ్ఞానము ఇక్కడి వాళ్లకు లేదు. వీళ్ళల్లో వీళ్ళకి ఎడతెగని ద్వేషాలు పుట్టించాడు. ఈ దేశాన్నంతా పాడుచేసింది బ్రాహ్మణులన్నాడు. ఇక్కడి బ్రాహ్మణేతరు లందరు ఆ వేదాలు పురాణాలు బ్రాహ్మణులు వ్రాసినవనీ అవన్నీ బ్రాహ్మణేతరులను మోసగించి వాళ్ళని ఎడతెగని బానిసలుగా చేసేందుకు వాళ్లవి వ్రాశారని వాళ్లందరు బాగా విశ్వసించేటట్టు చేశాడు. ఇది ఆశ్చర్యము. ఇదివరకెవడో మోసం చేశాడనుకొంటారు తప్ప ఇప్పుడు మోసం చేస్తున్న వాడు కూడ అట్లాంటి వాడేనన్న జ్ఞానం మానవజాతికి కలు గదు. ఇంగ్లీషువాడి రాజనీతి అట్లాంటిది. వీళ్ళు ఆ ఇంగ్లీషువాడి మానసిక సంతానము. వీళ్ళు మాత్రం తక్కువ వాళ్లా ? సోమ నాథశాస్త్రిని వలలో వేశారు, వల కాదన్నట్టు వదలించారు.

వేచ్చే నిన్ను పట్టుకుందామని కాదు. చమత్కారాని కన్నట్లు వదలిపెట్టారు. మళ్ళీ పట్టుకొన్నారు. ఇది పట్టుకోటం కాదని వాదనుకొంటాడు. ఇంక వాళ్ల వశంలో ఉండ వాళ్ళ పట్టుగో ఉండి తాను స్వతంత్రుణ్ణి అనుకొంటుంటాడు. చిదంబరానికెట్లా ఉన్నా కమలకి మాత్రం అన్నగారితో తాను మాట్లాడక పోవటము అన్నగారు తనతో మాట్లాడక పోవటం మనసుకి కష్టంగానే ఉంది. చిదంబరం కమలతో గట్టిగా చెప్పాడు. "అతనికి మనకు సంబంధము లేదు. నీ వతనితో జోక్యం పెట్టుకొన్నావా నేను నీతో మాట్లాడను. నే నింట్లోనించి వెళ్ళిపోతాను. మొదటిసారి మాట్లాడుతావు. రెండవసారి ఇంటికి వచ్చి చూచి పొమ్మంటావు. మూడవసారి భోంచేసి పో అన్నయ్యా అంటావు. నాల్గవసారి మొహమాటపడి సావిట్లో అన్నం పెడతావు. అయిదవసారి పడమటింట్లో పెడతావు. అక్కడనించి ఇక అన్నీ అయిదవసార్లే." ఈ కట్టుదిట్టం చేసిన తర్వాత కమల యేంచేస్తుంది? కాని ఇలా అన్నది. "ఆయన వస్తేమాత్రం తప్పేమి? పతంజలి శాస్త్రిగారితో మాట్లాడేందుకు అచ్చంగా క్రైస్తవులేవచ్చి మన సావిట్లో కూర్చొని మాట్లాడుతున్నారు" అంటే చిదంబరం అదివేరు ఇదివేరు అని దులపరించి పారవేశాడు. అయినాక మళ్ళీ అన్నదికదా "పతంజలిగారే వెళ్ళి సోఫియాతో మాట్లాడి వచ్చాడు" అంటే చిదంబరం "వచ్చి స్నానంచేసి జపం చేసికొన్నాడు.

"దానికి దీనికి సంబంధము లేదు. ఇంక నాతో ఆమాట మాట్లాడకు"

ఆ రోజున సాయంత్రము ఉపన్యాసము ఇలా ఉన్నది - "ఈశపీఠ రాజుల రాజ్యంలో ఉన్న పేర్లని గిరీశ (గ్రీస్) దేశస్థులు రోం సామ్రాజ్యము వాళ్లు వాళ్ళ యథేచ్ఛంగా మార్చివేశారు. ఈశపీఠ దేశముయొక్క రాజధాని వాళ్ళ పద్దెనిమిదవ రాజవంశకాలములోన ఆమను ఇది నామశబ్ద వికృతి నేను క్రేసేట్ అన్నది ఒక పట్టణము పేరు. ఇది శని శ్రేష్ఠ శబ్దమునకు దగ్గరగా ఉన్నది. ఈ పేరును గ్రీకులు సెసోస్ట్రిస్ అని మార్చారు. ఒక రాజు పేరు నార్మల్ లేకపోతే నర్మర్. దానిని గ్రీకులు మీన్స్ అని మార్చారు. ఆ శబ్దము నర్మ శబ్దము. మనము నర్మ భాషణ మంటాము. ఆ రాజు పేరు నర్మడు. సంస్కృతములో నర్మః. నర్మస్ నర్మర్ రెండూ అవుతుంది. ఒక దేశాన్ని ఇంకొక దేశం గెలవటంతోటే ఒక జాతిమీద ఇంకొక జాతి కధికారము రావటముతోటే ఆ గెలిచినవాళ్లు చేసే దుర్మార్గానికి అవధి ఉండదు, పేర్ల దగ్గరనించి మార్చివేస్తారు. టిప్పుసుల్తాను ఒక్క రోజులో అయిదువందల ఊళ్లపేర్లు తురకపేర్లు పెట్టివేశాడట. మదరాసు విశ్వవిద్యాలయము వాళ్ళు హైదరు చరిత్ర అని ఒక పుస్తకము ప్రకటించారు. అందులో ఈ సంగతి వ్రాశారు. ఇంక ఇంగ్లీషువాళ్లు మన ఊళ్లపేర్లు ఎన్ని మార్చారో చెప్పక్కర లేదుగదా ! కాళీ ఘట్టము కలకత్తా అయింది. హాస్తినాపురము ఢిల్లీ అయింది. కాలేదనుకో, దేహళి అన్న శబ్దము ఢిల్లీ

తయింది. దేహళీ అంటే గడప. దేహళీ దత్త దీపన్యాయము అని న్యాయమున్నది. గడపమీద పెట్టిన దీపమువలె, ఆ వెలుతురు లోపలికి కనిపిస్తుంది. బయటికి కనిపిస్తుంది. విశాఖపట్టణము వైజాగ్ అయింది. ఆ పేర్లు మార్చటానికి రెండు కోణాలుంటవి. రెండు కారణాలు మనపైన రాజ్యము చేసిన తురకలు మార్చిన పద్ధతిలో ఇంగ్లీషు వాళ్లు మార్చిన పద్ధతిలో కనిపిస్తూ ఉంటవి. తురకలు బుద్ధి పూర్వకంగా దురహంకారము చేత మార్చారు. ఇంగ్లీషు వాళ్లు నోరు తిరగక కూర్చారు. పాపం వాళ్ల ముఖావయవములు అచ్చులను హల్లులను విస్పష్టంగా పలకలేవు. వాళ్లు వాళ్లభాషనే అట్లా ఉచ్చరించు కుంటారు. ఫార్మర్ అన్నశబ్దం ఉంటె అది వాళ్లభాషే ఫామ అంటారు. ఇలా మారుతూ ఉంటవి శబ్దాలు. మన తెలుగు వాళ్ళము సంస్కృత శ్లోకాలు చదువుతూ ఉంటె ఉత్తర దేశస్థులెంతో సంతోషిస్తారు. వాళ్ళు ఏ అక్షరాన్ని ఆ అక్షరంగా పలకలేరు. మరీ వంగదేశస్థులు "దినకరకుల చంద్ర చంద్రకేతో" అని ఉంటే దినొకొరకులొ చంద్రొకేతో" ఇలా ఉచ్ఛరిస్తారు. మన సంస్కృతాన్ని మన దేశంలోనే ఇలా ఉచ్ఛరించే వాళ్లుంటే ఈ శబ్దాలు పరదేశాలుపోతే వేల సంవత్సరాలు గడిస్తే అవి ఏదిరకాలుగా ఉంచే ఏది జాతుల నోళ్ళలో పడితే వాటిని మనము గుర్తుపట్టటమెట్లా" బ్రహ్మ శబ్దము బరమ కావచ్చు. నయంకాదూ మొరవ అయితే ఏం చేస్తావు? చివరి మకార మేమో మొదటి మొకారమయింది. మొదటి బకారమేమో

చివరి ధుకారమయింది. నడిమి "ర" కదలకుండా ఉంది.
అందుకు సంతోషించాలి. ఇది బాషా శాస్త్రములో లేకపోతే
మన వ్యాకరణంలో వర్ణ వ్యత్యయమంటారు ఇక్కడి అక్షర
మక్కడికి అక్కడి అక్షర మిక్కడికి మారటము. ఇలా మారి
పోతూఉంటే లక్షల సంవత్సరాల మీద ఏది ఏదో తెలియకపోతే
మనుష్యుల మాటలే కాకుండా మాట్లాడేతరహాయే మారుతూ
ఉంటుంది. దీనినిబట్టి దేశ్య శబ్దాలని వాటికి సంస్కృతానికి
సంబంధం లేదని ఇది వేరే భాషా కుటుంబానికి చెందిందని
ఇలాంటి చిత్ర విచిత్రమైన సిద్ధాంతాలని ఇంగ్లీషు వాళ్ళు
లేవతీసి అది ఒక పెద్ద చదువునుచేసి అందులో డాక్టర్లిచ్చి వాళ్లకి
వేలకొద్ది జీతాలిచ్చి చేసిన మహాకార్య మేమిటయ్యా అంటే
ఇప్పుడు మనదేశములో ఉన్న మాతృ భాషలోను సంస్కృత
భాషలోను ఉన్న ఎం. ఏ. లల్లో సగంమంది ఒక పద్యానికి అర్థం
చెప్పలేరు. ఒక సంస్కృత శ్లోకాన్ని అన్వయం చేసికోలేరు.
ఇక రసానందం మాట చెప్పావు ? "మహారాజ మహా మహీ
దక్షిణ దక్ష దక్షిణ బాహుదంత దండితారాతి నిషధరాజాగ్రణి
నన్నిట్లు వీతదయుండవై విడచి పోవ" అన్న పద్యం ఉన్నదను
కోండి. ఇది నన్నయ్యగారి పద్యము సగము చీరచించికొని
నలుడు వెళ్ళిపోతే నిద్ర మేల్కొని దమయంతీ దేవి వగచిన
పద్ధతి వట్టి వృత్త్యనుప్రాసచేత అనగా వచ్చిన అక్షరమే మళ్ళీ
మళ్ళీ రావటముచేత దుఃఖాన్ని ధ్వనింపచేసిన వైఖరి. నన్నయ్య
గారి శిల్ప మార్గాలల్లో ఇది ఒకటి. మన భాషా శాస్త్రవేత్తలు

ఏం చేస్తారంటే ఆ దుఃఖము ఆ శబ్దములయొక్క రమణీయత ఆగ్రథనములోని నేర్పు సౌకుమార్యము అన్ని వదిలిపెట్టి హో అన్న శబ్దమున్నది. ఇది ఈజిప్టు భాషలోని మాట, కమ్మరి ఇంట్లో ఒక హో పూరుశాల ఉంటుంది. అక్కడ కొలిమితిత్తులు ఉంటవి. వంగదేశంలో ఉన్నవి. వంగదేశంలోని ఈ మాట ఈశ పీఠదేశం నుంచి వచ్చింది. కొలిమి తిత్తులు ఊదేటప్పటికి బొగ్గు లలో నించి అగ్నిజ్వాల హాప్ అని వస్తుంది. అట్లాగే చిన్న చిన్న మొక్కలు మనంవేసే దాని మొగ్గలు హావ్ అని బయట వస్తవి. కావలిస్తే అమరనాధురే రాసిన బాంగ్లార్ సబ్జి అనే గ్రంథమూ చూడండి, మనము ఎక్కువగా ఊర్పు తీసికొంటే దానిని వంగభాషలో హోపాహోపి అంటాము. ఎడతెగని ఊర్పుకి హోపాని అంటాము. ఊర్పుని వదలి పెట్టేందుకు హోప్ చారా అంటాము. ఇవన్నీ ఎక్కడినించి వచ్చినవి ? నీలానది పుట్టిన చోటికి హోపూర్ అనిపేరు. నీలానది దరి ఇద్దరు దేవత లున్నారు. ఒక దేవత పేరు హోప్. ఇంకొక దేవత పేరు హోపి. వాళ్ళిద్దరు మొగుడు పెళ్ళాలు కాబోలు ? అయినా ఈ లింగ భేదము సంస్కృత భాషలోనిది. ఇది స్త్రీ ప్రత్యయాధికరణం లోనిది. అసలు భాషకి వ్యాకరణమనేది ఉన్నదని తెలిపింది సంస్కృత భాషకు. ఆ వ్యాకరణమును ఒక శాస్త్రముగా చేసి నది సంస్కృతభాష. దానిని సూత్రించింది పాణీన్యాచార్యుల వారు. ఏ పాణినియొక్క సమగ్రమైన ఆశ్చర్యమైన సూత్ర నిర్మాణ పద్ధతిని చూచి బుద్ధిమంతులైన పాశ్చాత్య విద్వాం

ను మహాశ్చర్య చిత్తులైనారో ఆ పాణిని హాప్ హాపి అన్న పుంలింగ స్త్రీ లింగాలు ఉన్నవి అనటంతోటే అక్కడ సంస్కృత భాషా ముద్ర ఉన్నది అని అర్థం. ప్రపంచకంలో ఉన్న ఏ భాష లోను సంస్కృతభాషా సంబంధము లేకుండా ఈ ఏర్పాటు లేదు గనుక ఈ నీలానది రెండు చిన్న గుట్టలనుండి ప్రవహించ టం మొదలు పెట్టింది. ఆ గుట్టలలో ఒకదాని పేరు కోర్. హాపి రెండవదాని పేరు మూహాపి. ఈ రీతి అయినటువంటి బుద్ధి ఎక్కువై హా మహారాజ! అనటంతోటే ఈ పరిశోధన మీదికి పోతుంది తప్ప బుద్ధి రసానందము వైపుకి పోదు. ఈ శబ్దము అరవభాషలోంచి వచ్చింది. ఇది కన్నడ భాషలోంచి వచ్చింది.

ఈ పాండిత్య మెక్కువై సాహిత్యము ఆత్మానందము కోసము మనదేశములో నిర్మింపబడ్డది. మన మతము అహం బ్రహ్మాస్మి అని తెలిసికోటము పరమార్థము గాగలది. సర్వజనులయందు ఈ చైత న్యము ఉన్నది. ఈచైతన్యము బ్రహ్మలక్షణము-అందుచేత అందరు జీవులు బ్రహ్మ పదార్థమే. మాయావిహితుడై వాడు జీవుడగు చున్నాడు. ఆ మాయను తొలగించుకొనేందుకు ఎవడి వర్ణ ధర్మము వాడు చేయవలె. శమదమాది ఆత్మగుణముల నవలం బించవలె, మాత్సర్యము ద్వేషము క్రౌర్యము వీటిచేత ఇంకా మాయలో పడతావు. ఇంకా జన్మలెత్తుతావు. మరీ దుష్టపు కర్మలు చేసినకొద్దీ కుక్కగా పుడతావు, పందిగా పుడతావు. ఇవ్వాళ మనిషిగా ఉన్నానని పగల పడిపోకు. లోకంగా ఒక గొప్పస్థితికి రావలెనంటే ఆ పరిస్థితుల ననుసరించి ప్రవర్తించి

అక్కడి అధికారులను ప్రార్థిస్తే వాళ్ళకిష్టుడవుగా ప్రవర్తిస్తే ఆ పెద్ద ఉద్యోగమెల్లా పొందుతావో ఒక కులంలో పుడితే ఆ కుల ధర్మాల ననుసరిస్తూ ఆ సంఘధర్మాల ననుసరిస్తూ అధికారులవంటి దేవతల నాశ్రయిస్తూ ఉంటే ఆధ్యాత్మికంగా ఆ గొప్పస్థితి వస్తుంది. ఇది రహస్యము. మన పూర్వులు ఏ విద్యను నిర్మించినా ఆ ఆత్మానందము పరమావధిగా పెట్టి నిర్మించారు. రసమంటే అదే ! "రసోవై సః" రసమే బ్రహ్మ. ఆ రసమును పొంది ఆనంది అవుతాడు. ఆ ఆనందాన్ని మనచేత వదలిపెట్టింపించి పాశ్చాత్యుల చదువు ఏమి చేస్తున్నదంటే ఆ భాష వేరు ఈ భాష వేరు. ఆజాతి వేరు. ఈజాతి వేరు అనే అనేకత్వాన్ని చదువుగా చెబుతూ అందరూ ఒకటే సర్వమానవులు సమానమే అనే మాటని గాలిలో తేలిస్తూ తాను మంత్రి కూర్చున్నాడు తాను సేనాని అయి కూర్చున్నాడు. ప్రజలందరూ ఇక్కడే చస్తున్నారు. అదరగొండివాడు పైకొస్తున్నాడు. సాధువులైన వాళ్ళందరూ విద్యావంతులందరూ అణగారిపోతున్నారు. మన మందరము ఒకటేనని చెబుతున్నాడు. ఈ మూర్ఖులు నిజమనుకొంటున్నారు. వాళ్లు ఆ నియంత ఆ సేనాని ఆ అధికారి తాము అందరూ సమానులమే అనుకునేవాడికి ఇంకొక రాజ్యాంగ విధానములో మాత్రము ఎందుకనుకోకూడదు ? సామాన్య ప్రజ కందరకు అనుకోటమేగా మిగిలింది ? ఎవడైనా సరే ముఖ్యమంత్రి కావచ్చు. ఎనభై కోట్ల జనంలో ప్రతివాడు ఎప్పుడూ కాడుకదా ? కావటానికి వీలులేదుగదా ఒక

సారి ఒకడైతే ఐయిదేండ్లవరకు వాడే కదా. ఇంక ఐయిదేళ్ళ వరకు ఎన్నికలు లేవు అని వాడంటే పదేళ్ళవరకు వాడే కదా! కనీసం ఇరవై యేండ్లయినా కావాలిగదా హోదాస్థితి పొందేందుకు. పదేండ్లు బ్రతుకుతాడందాం అందరు పందేళ్ళు బ్రతుకుతారు. ఈ యెనభై కోట్ల మందిలో ఆ యెనభై ఏండ్లలో ఆ ముఖ్యమంత్రులయ్యే వాళ్ళు పదహారుగురే. ఎనభై కోట్లు ఎట్లా అవుతారబ్బా! మనుష్యులు ఎంత తెలివికలవాళ్ళబ్బా! దీన్ని నమ్ముతున్నారు. పాపం వాళ్ళకి వేదశాస్త్ర పురాణాలు నమ్మటమంటే కష్టంగా ఉన్నది. అదంతా మనకెందుకుగాని ఈ ఈశపితభూమి విషయము చూడండి. ఇందాక చెప్పిన సర్ముడు అనే రాజు తర్వాత ఏడుగురు రాజులున్నారు. వాళ్ళ పేర్లు ఆహో, జ్డేర్, జ్డట్, డేన్, జ్డీబ్, శమ, ఖ్రేట్, ఖ్య్ర. ఇవి చూడండి—ఆహో ఆహుడు ఆహో అనేవాడు ప్రస్తుత్పత్తి. రెండవవాడు జేరుడు చేట శబ్దభవము. మూడవవాడు జ్యేష్ఠుడు. నాల్గవవాడు దీనుడు. అయిదవవాడు అజీబుడు. ఆరవవాడు సమరఖేటుడు. ఏడవవాడు చానిసెరు గోశబ్దభవము. ఇలా ఉంటవి వాళ్ళ పేర్లు. వాళ్ళ సమాధులన్నీ శక్కర అనే స్థలంలో ఉన్నవి. ఇది శర్కరా శబ్దభవము. తెలుగులో ఈ మాట చక్కెర అయినది. చక్కెర అంటేపంచదార

“చక్కెర మాని వేముతిన జారిన కైవడి మానవాధముల్
పెక్కురు బక్కదైవముల వేమురు కార్చెదరట్లు కాదయా
మ్రొక్కిన నిక్కమొక్కవలె మోక్షము నొసంగిన నీవె యావలెన్

తక్కిన మాటలేమిటికి దాశరథీ కరుణాపయోనిధీ" దాశ రథీ శతకములోని పద్యము రామదాసుగారి రాసింది. కంచర్ల గోపన్న ఉన్నాడే ఆయన. కనుక ఆ ఈజిప్టులోని ఊరుపేరు చక్కెర. వాళ్లదేశంలో ఆ రోజుల్లో ప్రధాన దైవము రీ అని చెప్పాను కదూ రవి. ఆ ఈజిప్టు దేశస్థులు సూర్యునికి పెట్టిన పేరు రే. ఇంగ్లీషు వాళ్ళు సస్ అంటున్నారు. ఈ ఇంగ్లీషుజాతి మనకు ఆరు తరాలు దాటిన జాతి. యూఫరతీశ నదిదాటి త్రిగిరీశనదిదాటి ప్లక్ష ద్వీపములో హేబ్రూ నదినిదాటి గ్రీసు దేశందాటి రోమ్‌దాటి అయినవాళ్లు వీళ్ళు మన భారతీయ సంస్కృత నాగరకతను ఆరుసార్లు వడ బోస్తే వచ్చారు ఈజిప్టుదేశపు వాళ్లు మొదటి వడపోతవాళ్లే. వాళ్ళ దేవతల పేళ్ళు వాళ్ళ ఊళ్ల పేర్లు మనకు వాండ్లకి సంబంధం లేకుండా పోవటం మూలంగా బోలెడన్ని వికారాలు వచ్చినవి. వాళ్ళ దేవతలని గురించి రేపు చెబుతా—

# 15

"విఠల్‌రావుతో మాట్లాడావా"

"జీతం ఎంత ఇస్తాడంటావు"

"రెండు వందలన్నా ఇవ్వడా"

ఎం. ఏ ప్యాసైన చిదంబరానికి రెండువందలిచ్చి నీకు ఇస్తాడా"

"ఎవరు ప్యాసయినా ఎం. ఏ. ఏ గదా! అయితే పైన డాక్టరేట్ అవుతాడు, ఒకడికి రెండువేలు ఇస్తారు. ఇంకోకడికి రెండువందలే ఇస్తున్నారు. బి. ఏ. ప్యాసైన వాడికి రెండువేలు ఇస్తున్నారు. ఒక్కొక్కప్పుడు ఎం. ఏ. లు ప్యాసైన వాళ్ళకే తక్కువిస్తున్నారు.

"అయితే నీ కెక్కువిమ్మంటావా"

"ఆలూ లేదు చూలూ లేదు కొడుకు పేరు సోమలింగమట. అసలు విఠల్‌రావుతో మాట్లాడిందిలేదు, ఆయన తండ్రితో

చెప్పిందిలేదు. ఆయన ఒప్పుకున్నది లేదు.ఆయన ఎంత ఇవ్వాలి అన్నది మన ఇద్దరం తగాదాపడితే ఏమిలాభం"

"నిన్న జాకబ్ దగ్గరనించి ఒక ఉత్తరం వచ్చింది నీకు చూపించలేదు"

"ఇదివరకు చూపించటమే తప్పు. భార్యా భర్తలమధ్య ఉత్తరాలు ఇంకొకళ్లకి చూపించకూడదు"

"నేను బజారుకువెళ్ళి చొక్కాగుడ్డ కొన్నాను. గజము పదిరూపాయలు. మూడు గజాలంబావు పట్టింది. దర్జీవాడికి రెండురూపాయ లిచ్చాను. ఇదొక విషయము. నిన్న ఎగ్జిబిషన్‌కి వెళ్ళాను. అక్కడ మంచి వస్తువులు ఉన్నై. ఒక ఏనుగుంచే కొన్నాను. దాని కంబారీకూడ ఉన్నది. దానివెల పన్నెండు రూపాయలు. మన సావిట్లో ఈశాన్యంమూలనున్న గుండ్రని బల్లమీద పెట్టాను. మన సావిట్లో తివాసీ మాసిపోయింది. క్రొత్త తివాసీకొని వేస్తే ఈ ఏనుగుతో మన సావడికి చాలా శోభవస్తుంది. ఇదొక విషయం ఇలాంటి విషయాలు భర్త రాస్తాడు భార్యకు. ఆ ఉత్తరం కూడా చూపించ కూడదా?"

"మరి ఏ ఉత్తరం అయితే చూపించకూడదని నీ తాత్ప ర్యం"

"చూపించ కూడదని అన్నది నువ్వు. ఎట్లాంటి ఉత్తర

ములు చూపించకూడదో నువ్వు చెప్పాలి. నేను నిన్నడిగాను ఇలాంటి ఉత్తరం చూపించవచ్చా" అని.

"చూపించవచ్చు చెప్పేశావుగా. ఇంక చూపించ నక్కర లేదు"

"అలాంటి విషయాలన్నాను తప్ప శేరే విషయా లన లేదు"

"అయితే చూపించు"

"ఇంతకన్న ఎక్కువ విషయాలున్నవి అందులో"

"మీఇద్దరి నడుమా ఉన్న శృంగార విషయాలైతే చూపించకూడదు"

"శృంగార రసమంటే ఏమిటి ఒకానొక స్త్రీ ఒక పురుషుడికోసం తపిస్తున్నది. వ్యాధిగ్రస్తురాలై నది విరహ జ్వరము వల్ల బాధపడుతున్నది. దానికి క్షయవ్యాధి వంటిది పుట్టింది. దగ్గుతుంది. నెత్తురు జీరగల కళ్ళె పడుతున్నది. బరువు తగ్గిపోతున్నది. ఇది శృంగార రసమంటావా"

"శృంగారరసము, వ్యాధి, రెండు కలిసి"

"అసలు శృంగార రసమంటేనే వ్యాధేమో"

"దాని పేరు వేదాంతము"

"ఉత్తర మిమ్మంటావా"

"నాకర్థమైంది. అది సరేకాని జాకబ్ నిన్ను మోసం

చేసి పెళ్ళి చేసుకొన్నాడన్నావు ఆ మోసమేమిటో నాతో చెబుతావా"

"భార్యా భర్తలంటే ఏమిటి? అబలలంటే ఏమిటి? పతంజలిశాస్త్రిగారి నడుగుతానన్నావే ఎప్పుడడుగుతావు"

"ఇవ్వాళ ఈజిప్టు పూర్వరాజుల యొక్క మతాన్ని గురించి చెబుతానన్నాడు గదా ఆయన. అది విన్న తరువాత అడుగుతాను"

"అందులో భార్యాభర్తల విషయము వస్తుందా"

"పెండ్లిండ్లు చేసికోవటము మతములో భాగమేకదా"

"ఆ సంగతి నేను ఒప్పుకోను. దాన్ని మనవాళ్లు మతం క్రిందకు మార్చారు. స్త్రీ పురుషులున్నారు. వకళ్లనొకళ్లు కలిసికొంటారు. దీనికి మతమెందుకు"

"దేనికి కావాలి"

"దేనికీ అక్కరలేదు. మా జాకబ్ మతస్థులు "ఓ ప్రభూ! మాకు దైనందినమైన రొట్టెను ప్రసాదింపుము" అని, పొద్దున్నే ప్రార్థన చేస్తారు డబ్బు లేనివాడు చేస్తాడు. డబ్బు లేనివాడికేమో ఆ రొట్టె ఇవ్వటము లేదు. ఉన్నవాడికి ప్రార్థన చేయకపోయినా రొట్టె వస్తున్నది. భగవంతుడా నన్ను రక్షించు అని అన్ని మతాలవాళ్లూ ప్రార్థిస్తారు. మనవాళ్లు కవులు శతకాలు వ్రాస్తారు. వాడు రక్షిస్తున్నట్లు కనిపించదు. ఇన్ని శతకాలు

ప్రాస్తూనే వుంటారు. జరిగేవి జరుగుతూనే ఉన్నవి. కనుక నాకు దేవుడంటే విశ్వాసం లేదు."

"మనుష్యులంటే ఉంది. జాకబ్ అంటే వుంది"

"జాకబ్ దాకా ఎందుకు నువ్వన్నా ఉంది"

"నువ్వన్నా అంటే నే నెందుకు పనికిరాని వాణ్ణన్న మాట. ఎందుచేత పనికిరానివాణ్ణి. ఉద్యోగం లేనందుచేత. నా కుద్యోగం ఇప్పించు నేను సమర్థులైన పురుషుల్లో ఒకడ నౌతాను"

"మోటారు డ్రైవింగ్ నేర్చుకుంటానంటివా ఆరునెల్లు నేర్చుకొని రా ! నే నా డ్రైవరు తీసివేస్తాను. నీకు నెలకు వందరూపాయలిస్తాను"

"నేను పెళ్ళిచేసికొంటే మా ఇద్దరికి సరిపోదుగా"

"నీవు నా మేనమామ కొడుకు పెళ్ళానికి అన్న య్యావు"

"నేను పెళ్ళిచేసికొంటే ఆవిడ నీకు నీ మేనమామ కొడుకు పెళ్లాం అన్నయ్య పెళ్ళాము"

"మీ ఇద్దరు నా ఇంట్లోనే భోంచేద్దురుగాని. ఏ నెల కా నెల ఆ డబ్బు నిలవచేసికోవచ్చు"

"ఏది ఆ ఉత్తరం చూపించు"

"తూర్పుగా తిరిగి కూర్చో ఇస్తాను"

అనాడు సాయంత్రము పతంజలిశాస్త్రి ఉపన్యాసము ఇలా ఉంది. "అయిదారు రోజులక్రింద ఈ అనాది జాతులను కొనబడే వారి మత విశ్వాసాలను గురించి ఫ్రాంక్ బోర్టు అనే పాశ్చాత్యుడు రాసిన విషయం చెప్పానుకదా. వాళ్ళకి సర్వము జీవభరితమై కనిపించేది, శక్తిభరితమై ఉంటుంది. మన సిద్ధాంతము అదే. భగవంతుడైన శ్రీకృష్ణుడు భగవద్గీతలలో విభూతి యోగమని చెప్పాడు, ఆదిత్యులలో నేను విష్ణువను. జ్యోతిస్సులలో రవిని. మరుత్తులలో మరీచిని. నక్షత్రములలో శశిని. వేదములలో సామవేదమును. దేవతలలో ఇంద్రుడును. ఇంద్రియములలో మనస్సును. భూతములలో బుద్ధివృత్తిని. రుద్రులలో శంకరుడను. ఇలా చెప్పుకపోతూ కొండలలో మేరు పర్వతాన్ని. సరస్సులలో సముద్రాన్ని. సర్వవృక్షములలో రావిచెట్టును. ఆయుధములలో వజ్రాయుధమును. సర్పములలో వాసుకిని, మృగములలో సింహమును, పక్షులలో గరుత్మంతుడను, మాసములలో మార్గశీర్ష మాసాన్ని, ఋతువులలో వసంత ఋతువును అని చెప్పి చెప్పి చివరికి రెండు మూడు కొలికి పూసలు చెప్పాడు. "నతదస్తి వినాయత్ స్యాత్ మయాభూతం చరాచరం" అనగా నేను లేకుండా చరాచరములయందు ఏమీ లేదు అని చెప్పి ఇందులో ఇంకొక విశేషము చెప్పారు.

యద్యత్ విభూతిమత్ సత్వం శ్రీమదూర్జిత మేవవా
తత్తదేవావ గచ్ఛత్వం మమతేజోంశ సంభవమ్.

అనగా ఏది ఏది లోకంలో విభూతితో కూడిఉన్నదో లక్ష్మితో కూడిఉన్నదో అది అంతా ఈశ్వరుడనైన నాయొక్క తేజస్సులో ఏకదేశమనుకో. ఆ తేజస్సు నాదే అనుకో. భగవంతుని యొక్క ఈ మహాస్వరూపము సంపూర్ణంగా ఆయన చెప్పలేదు. చెప్పలేదు గనక తెలిసికోటానికి వీలులేదు. ఎక్కడ విభూతి ఉంటుందో అది నేననుకో అనగా ఈ లోకంలోగాని, పరలోకాలల్లోగాని, ప్రాణము కలిగినదైనాసరే, లేనిదైనా సరే ఒక ప్రభావము, ఒక ధనాతిశయము, పుణ్యకర్మలు చేస్తూ ఉండటము, పెద్ద విద్య ఉండటము తపస్సు ఉండటము, శౌర్యమో ధైర్యమో ఔదార్యమో శమమో దమమో ఈ మొదలైన మంచిగుణాలు—జ్ఞానమూ అవి అధికంగా ఉంటే అది నేను" అన్నాడు భగవంతుడు. విభూతి మత్ అంటే అది. ఇంక రెండున్నై. శ్రీమత్ అని ఒకటి; ఊర్జితమని ఇంకొకటి. శ్రీమత్ అంటే శోభ, లక్ష్మి, కాంతి, సరస్వతి, బుద్ధి, కీర్తి, స్ఫూర్తి ఇందులో ఏదైనాసరే. ఊర్జితమంటే ఓజస్సు, తేజస్సు, వేగము, బలము, పౌరుషము, సారము, ఆకారము, దార్ఢ్యము, ఉత్సాహము వీటిచేత ప్రకాశించేది అని అర్థము. అక్కడక్కడల్లా భగవంతుని సమృద్ధి ఉన్నదని అర్థము. సింహములో భగవద్విభూతి ఉన్నది. నక్కలో తెలివి ఎక్కువున్నది. ఇలా ప్రతి జంతువులో ఆ జంతువు పుష్టికలదైతే ఆ గుణము దానియందు అధికంగా ఉంటే అది భగవదంశ అన్నమాట. భగవంతుడు కాడు. భగవదంశ. సింహమున్నది. పరాక్రమము కలది. సహా

క్రమానికి చిహ్నముగా ఉంది. సింహము దగ్గఱకు పోయి ఓసి సింహమా నీలో భగవంతుడున్నాడు. నన్ను రక్షించు. నీ పరాక్రమము నాకియ్యి అని దాన్ని అడగబోతే అది పంజాబెట్టి కొడ్తుంది. మరి ఎల్లాగంటే సింహాన్ని మనస్సులో భావిస్తూ "ఆ సింహ పరాక్రమము నాకు రావాలి" అని ధ్యానిస్తే ఆ సింహ పరాక్రమము పరమేశ్వరుడు నీ కనుగ్రహించవచ్చు. సింహ పరాక్రమము నాకు రావాలి, అని ప్రార్థించేటప్పుడు ఏమి చేస్తున్నావు? సింహాన్ని మనసా భావిస్తున్నావు. మనసా భావించటమంటే ఏమిటి ? సింహమనే రెండక్షరాలనా ? ఆ అక్షరాల్లో ఏముంది ? పూర్ణానుస్వారే కార సహిత సకారము ఉన్నది అకార సహిత హకారమున్నది. అది కలిపితే అక్షరా లవుతవి, ఆ అక్షరాలు నీకేమీ ఇవ్వవు. అది కలిసి ఒక జంతువును చెబుతున్నవి. ఆ జంతువును చెప్పకపోతే ఆ అక్షరాల కర్థం లేదు. ఆ జంతువునందు పరాక్రమమనే గుణమున్నది గనక ఆ పరాక్రమమనే గుణాన్ని కూడా నీవు ప్రత్యేకంగా భావించటం సాధ్యంకాదు కనక జంత్వాకార సహితంగా భావిస్తే ఒక విస్పష్టత వస్తుంది. గనక ఆ జంత్వాకారాన్ని భావిస్తావు. ఆ ఆకారము మనస్సులో నిలుస్తుంది. నిలవడు కంటికెదురుగుండా కనిపిస్తున్న ఆకారమువలె మనస్సులోని ఆధారము నిలువడు. రెండూ ఆకారాలే. అది మనస్సులోది ఇది కంటికెదురు గూడా ఉన్నది. విగ్రహారాధనలో తప్పేమిటో ? ఆలోచనలేని అతి తెలివి పోవటమే తప్ప ఈ రీతిగా బహు జంతువుల యందలి

జహాలు గుణములు ప్రకాశిస్తూ ఉంటే ఆ గుణములను కోరు కొనే వాళ్ళు ఆ జంతు రూపమును పెట్టుకొని తద్గుణభావనను చేయటములో తప్పేమి ఉన్నట్లులేదు. వాడు సింహామంత పరాక్రమవంతుడు. వాడు పగపడితే త్రాచుపాము. వాడు జిత్తులమారి నక్కవంటివాడు. ఈమాటలు లోకంలో అంటూనే ఉన్నారు కదా. మనదేశంలోనే కాదు—ఇతర దేశాల్లోను అంటూనే ఉన్నారు. మన మతస్థులే కాదు. ఇతర మతస్థులు అంటూ ఉన్నారు. అక్కడ జంతువునకు కాదు. ప్రాధాన్యము గుణానికి. ఇక మన వాండ్లుగాని ఆ ఈశపీఠభూమి లేదా ఆ పాశ్చాత్యులు చెప్పే పూర్వనాగరకత రాజ్య ప్రజలుగాని ఇటువంటి విభూతి లక్షణములు కలిగినచోట్లు తీసికొని వాటిని దేవతలుగా భావించారు. దేవత అంటే ఏమిటి? ప్రకాశించునది అని అర్థము. ప్రకాశించటమంటే బుద్ధికి భాసించటము. బుద్ధికి అల్లా అనిపించటము. ఏ మతంలో ఉన్నా దేవుడైనాసరే ఇలా బుద్ధికి భాసించటమే తప్ప ఎక్కువ వెలగబెట్టేదేమీలేదు. కాని వాళ్ళకు మనకు ఒక్కటే భేదము. వాళ్ళు ఊరికే మనస్సుతో అనుకొంటూ ఉంటారు. ప్రార్థన చేస్తారు, కళ్ళు మూసికొని. మనస్సును నిలుపుతారో నిలపరో తెలియదు. భగవంతుడు ఇంద్రియములలో తాను మనస్సునని చెప్పాడు సుమండీ. కనుక భగవంతుని ద్వారా భగవంతుని సేవించటమన్న మాట. ధ్యానము చెయ్యటము మనస్సును నిలబెట్టటము; మనస్సుని నిలబెడితేనే ఆ వస్తువావస్తువుగా తెలుస్తున్నది. ఆ వస్తువుమీద

నిలబెట్టాలి. దాన్ని గురించి ఊహించాలి. మనస్సుపెట్టి ఆ విషయం భావిస్తే ఆ విషయం ఎలా చెయ్యాలో తెలుస్తుంది ఒక శత్రువును సాధించటమో ఒక కార్యాన్ని నెఱవేర్చటమో తీవ్రంగా ఆలోచిస్తేగదా తెలుస్తున్నది. దానిమీద నిలబడితే గదా తెలుస్తున్నది. అలాగే భగవంతునిమీద మనస్సు నిలిపితే వాడు తెలుస్తాడు. ఆ కాసేపు ప్రార్ధనచేస్తే తెలియదు. వానిని గురించి ధ్యానము చెయ్యాలి. సమాధిస్థితిలోకి వెళ్ళేటంత తీవ్రమైన వ్యగ్రత పొందాలి. ఇప్పుడు నీవుకోరేది పరాక్రమము దానికి నీవు పెట్టుకొన్న లక్ష్యము సింహము. ఆ సింహము యొక్క ఆకారము నీ మనస్సులో ఉండాలి. మనస్సులో ఆ బొమ్మ నిలవదు. ఏ ఆకారమైనా చూచిన తరువాత కొంత సేపు మనస్సులో ఆడుతుంది. తరువాత చెదరిపోతుంది. అప్పుడు మళ్ళీ ఆ బొమ్మను చూస్తే ఆ బొమ్మ మళ్ళీ వస్తుంది. ఇది విగ్రహారాధనలో ఉన్న సులువు. ఏమీ తెలియకపోతే ఏమీలేదు అందరినీ మన మతంలో కలుపుకొందామన్న పేరాసయేతప్ప నీకూ లాభములేదు. వాడికీ లాభములేదు. ధ్యానమగ్నుడు కాగలిగినవాడికి ఏ మతమైనా ఒకటే, అన్ని మతాలు ఒకట న్నప్పుడు వేరే వివక్షత ఉన్నది. మనస్సును నిలవబెట్టగలిగినంత వరకు ఒకటే ! తరువాత చూద్దాము. ఇంతమట్టుకే యేడ్చేది లేదాయె. జంతువుల ఆకారానికంటే మానవాకారము విశిష్ట మైనది కనుక మానవాకారముతో ఏ జంతువునందు ఒకానొక గుణమును ఊహిస్తున్నారో ఆ జంతువుయొక్క శిరస్సును

కలిపి అది ఒక దేవతగా భావిస్తున్నారు. వాడే పరమేశ్వరు డనుకోలేదు ఆ గుణానికి సంబంధించినంత మట్టుకు అక్కడ ప్రాధాన్యమిచ్చారు. మానవులకెన్ని ఊహాలు వుంటవో ఎన్ని మహా గుణాలు తమకు కావాలనుకొంటారో ఏయే రకాలైన భావాలు వాంఛిస్తారో వాని వానిని ప్రత్యేకంగా ఉపాసించేం దుకు ఆయా ప్రత్యేక రూపకల్పనలు చేసికొంటారు. రాజు రాజ్యంచేస్తూ రాజ్యాంగములో ఎన్ని శాఖలు పెడుతున్నాడు పైనించి కిందికి పెద్ద చిన్న ఎన్నిఉద్యోగాలు పెడుతున్నాడు. పురపాలక సంఘమువాళ్లు చేసిపెట్టే పనికోసం కలెక్టరు దగ్గరికి కలెక్టరు చేసిపెట్టే పనికోసము ముఖ్యమంత్రి దగ్గరికి, పోరు. అట్టే మాట్లాడితే ముఖ్యమంత్రి దగ్గరకు పోయి 'అయ్యా నూ వాకిట్లో మురికికాలవ వున్నది. కొంచెము ఫినయిల్ చల్లించి పెట్టండి' అని అడిగితే పోరా 'బుద్ధి హీనుడా' అంటాడు. అట్లాగే భగవంతుణ్ణి నాకొక శిల్కుచొక్కా కుట్టించి పెట్టు అని అడిగితే పోరా బుద్ధిహీనుడా అని కూడా అనడు. నీవు బుద్ధి హీనుడవని నీవు తెలుసుకోటానికి ఆ మాట కూడాఅనడు. ఆ ఈజిప్టు వాళ్ళకి అనేక దేవతలున్నారు. నక్క తలకాయగల ఒక దేవుడు. వాడు శ్మశానాల కధిపతి. వాడిపేరు అనుబిస్. శ్మశానాలకి నక్కలకి ఎంత సంబంధం! ప్రేమకు ఒక దేవత ఉన్నది. ఆమెపేరు "హాత్‌హోరు" ఇది "హృదయహారిణి" శబ్ద భవము. ఇదివరకు చెప్పాను ఈశిస్ — ఈశః ఓసిస్—ఈశ్వరః హోరస్-హారః రే రవి, ఇవన్నీ మన శబ్దాలే. వాళ్లక్కడికి

పోయి శబ్దాలను వేరుగా ఉచ్ఛరించటం మొదలెట్టి ఇక్కడ వేదాంతమంతా మఱచిపోయి తత్వశాస్త్రమంతా మఱచి పోయి అసలు పేరు అట్లాగే వుండగా తక్కిన కథలు కల్పనలు వాళ్ల ప్రకృతినిబట్టి వాళ్ళ జీవితాన్నిబట్టి వాళ్ళల్లో అప్పుడు వుండే తెలివికలవాళ్ళు చెప్పిన మాటలు కల్పించిన కల్పనలు ఆ దేవతల చుట్టూ నిర్మించుకొంటూ బ్రతికారు. అప్పటికవి నిజమే ఏ మతమైనా ఇలాగే చేసికొంటుంది. మతము లేనిచోట జీవితము కూడా ఇంతే.

# 16

సోమనాథశాస్త్రి అన్నాడు గదా "భార్యాభర్తలు, అబల

ఈ మాటలకి మీ పతంజలిశాస్త్రి చెప్పిన వ్యాఖ్యానాలెట్లా ఉన్నవి" అని.

సోఫియా అన్నది "మా పతంజలిశాస్త్రి" అంటే అర్థమేమిటి? "ఏ పతంజలిశాస్త్రి మహాపండితుడని నీ వనుకొంటున్నావో, ఏ పతంజలిశాస్త్రి ఉపన్యాసాలు వినేందుకు పని లేకపోయినా ఈ ఊళ్లోనే ఉంటున్నావో, ఇక్కడికి పంద మైళ్ళల్లో ఉన్న ఊరైనాసరే తెల్లవారుగట్ల నాలుగు గంటలకైనా సరే బయలుదేరి కారుమీద వెళ్ళి అక్కడఉన్న అనాథ శరణాలయాన్ని తనిఖీచేసి నీ ఉద్యోగ ధర్మము నెరవేర్చినట్లుగా దినచర్య రాసి ఏ పతంజలిశాస్త్రి ఉపన్యాసం వినేందుకు అయిదింటికల్లా ఊడిపడుతున్నావో, ఏ పతంజలిశాస్త్రి చెప్పే విప్లవ సిద్ధాంతాలన్నీ జాకబ్‌ని పెళ్లిచేసికొన్న నీకు గూడ చాలా తర్క సహితాలుగా కనిపిస్తున్నవో. సామాన్యంగా ఉపన్యా

సతులు వాళ్ళ ఉపన్యాసాలకి సంతోషించే మొహాలు కొన్ని ఉంటవి. వాళ్ళు ఏకాగ్రతతో వింటారు. తలలాడిస్తూ ఉంటారు కళ్ళల్లో ఏదో వెలుగు కనిపిస్తూ ఉంటుంది. ఉపన్యాసా లిచ్చి నంతసేపు మాటిమాటికి వాళ్ళవంకే చూస్తుంటారు. అలా ఏ పతంజలిశాస్త్రి ఉపన్యాసమిస్తూ ఇస్తూ మాటిమాటికి నీవంక చూస్తూ ఉంటాడో, ఆయన ఉపన్యాసాలు నీవు మెచ్చుకొం టున్నావన్న విషయం సభలో కొంతమందికి తెలియటం మూలంగా ఏ పతంజలిశాస్త్రికి ఈ ఊళ్ళో కొంత గౌరవ మెక్కువయిందో, ఏ పతంజలిశాస్త్రిని నీవు మెచ్చుకోటం మూలంగా నీ మేనమామ కొడుక్కి అతని పెళ్ళానికి నీ వంటే ఉన్న పూర్వవైరస్యం క్రమక్రమంగా తగ్గుతున్నదో, అది మీ పతంజలిశాస్త్రి అంటే."

సోఫియా అన్నదిగదా "ఆ మూడు మాటలకు ఆయన చెప్పిన అర్థాలు చాలా బాగా ఉన్నాయి. స్త్రీ యొక్క గర్భ రక్తము సంతానమునకు శరీరాన్ని ఇస్తుంది తప్ప దానియందు ప్రాణాధానం చెయ్యలేదు. ప్రాణాధానము పురుషుని రేతస్సు చేస్తున్నది. అందుచేత పురుషుడు భరిస్తున్నాడు. భార్య భరింప బడుతున్నది. వాడు సంపాదించి దీన్ని పోషిస్తున్నాడని అర్థము కాదు. ఒక్కొక్కప్పుడు భార్యయే సంపాదించి భర్త కన్నము పెడుతుంది. అప్పుడు భార్యను భర్త అనరుగదా! అబల అన్నమాటకు ఇదే అర్థము. ఆ స్త్రీకి ప్రాణములు నిలిపే బలము లేదు. పురుషునకున్నది. అందుచేత అబల అన్నారు. శరీరబలము

లేని పురుషులు చాలామంది ఉంటారు. యుద్ధముచేసే స్త్రీలు కూడ ఉంటారు. ఝాన్సీ లక్ష్మీభాయి ఉన్నది. ఆమె పేరు చెబితే ఆనాటి ఇంగ్లీషు సైనికులు గజగజ లాడిపోయినారట. విమానాలు చేసి బాంబులువేసే స్త్రీలుకూడా ఇప్పుడు యూరపులో నున్నారట, ఈ బలమంతా శరీర బలము. అబల అంటే శరీర బలము లేనిది అని అర్థముకాదు చెప్పారుగదా పతంజలి గారు. పూర్వకాలంలో ఆడవాళ్లు ప్రొద్దున్నే లేచి ముగ్గ చేసి ఇల్లు ఊడ్చి అలికి ముగ్గులువేసి పాలుతీసి పిడకలుచేసి వడ్లుదంచి అంట్లు తోముకొని ఇంటికి కావలసిన నీళ్ళన్నీ తోడి వంట చేసే వాళ్ళు అని. ఇది మన పూర్వులకు తెలుసు రోజూ చూచేదే. తెలిసి తెలిసి అబలా అన్నశబ్దంలోఉన్న బల అన్న మాటకు శరీర బలమని అర్థమైతే స్త్రీలను అబలు అంటారా ? నాకు పతంజలిగారు చెప్పిన వ్యాఖ్యానము బాగుగనే ఉన్నది."

"అందుకనే మీ పతంజలి శాస్త్రి అన్నాను"

"నీకు బాగుండలేదన్నమాట. నీవు మేరీని పెళ్ళిచేసి కొనేందుకు చాలా తగినవాడవు. నేను జాకబును చేసికొనేందుకు తగని దానిని. లోకంలో మనుష్యులు పొరపాట్లు చేస్తుంటారు. నేను చేసిన పొరపాటు జాకబును చేసికోటము. నీవు చేసిన పొరపాటు మేరీని వదలిపెట్టి రావటము. మొన్న పతంజలిగారు ఒక అష్టపది పాడాడు చూడు "సావిరహేతవదీనా రాధికా కృష్ణా రాధికా" మేరీ నిన్నుగురించి అలా ఉంది."

"రాధిక వేరు మేరీ వేరు కృష్ణుడు నల్లనివాడు రాధిక ఎఱ్ఱనిది."

"ఓయి సోమనాథశాస్త్రీ ! నీవు నీ మొఖాన్ని అద్దంలో చూచుకోవు కాబోలు. నీవు మేరీని పెళ్ళిచేసికొంటే మీ దంపతుల ఇద్దరి ఛాయాచిత్రము తీస్తే ఇల్లస్ట్రెటెడ్ వీక్లీలో వెయ్యటానికి ఎంతో బాగుంటుంది. ఫలానా కంపెనీ మేనేజరైన జాకబ్ గారి చెల్లెలిని సోమనాథశాస్త్రి గారు పెండ్లిచేసికొన్నారు అని క్రింద వ్రాస్తారు. అప్పుడెవళ్ళో వాళ్లకి ఉత్తరం రాస్తారు. ఈనబంటూ జాతివాడో నీగ్రో జాతివాడో అయిఉంటాడు. మీరు సోమనాథశాస్త్రి అని వ్రాశారు న్యాయమా" అని.

"నేను జాకబ్‌ని చూచాకదా. అతను క్రైస్తవుడల్లే ఉండడు బ్రాహ్మణుడల్లే ఉంటాడు ఎఱ్ఱగా ఉంటాడు. మనిషి కూడా చాలా పరిశుభ్రమైన వాడు. ఆ దిక్కుమాలిన మాంసాలు అవి తింటాడు తప్ప తెలియని వాళ్ళతన్ని క్రైస్తవుడనుకోరు నీకు ఎఱ్ఱని వాళ్లు బ్రాహ్మణుల వంటి ముఖ లక్షణాలు కలవాళ్ళు అంటే ఇష్టంలేదు. నీవు మళ్ళీ ఎఱ్ఱదానవే రాధకి కృష్ణుడిమీద ప్రేమకాదూ"

"ఔను సిద్దీబిలాల్ అల్లే ఉన్నావుకదూ నీవంటి వాళ్లని చూస్తే ప్రేమ. లేకపోతే నిన్ను కూర్చోపెట్టి మేపటమెందుకు నేను.".

"మేపటమన్నమాట బాగా వాడావు. నేను ఎద్దు నన్న మాట."

"జాకబు నిన్ను పంపించమని డబ్బు పంపించాడు. వెనుకటికి మల్లే ఢిల్లీచేరే డబ్బు మాత్రమే పంపించలేదు. నిన్ను ఫస్టుక్లాసులో రమ్మన్నాడు. నూటపాతికో నూట ముప్పయ్యో అవుతుంది. నాల్గువందలు పంపించాడు. అంతేకాదు. నీ వక్కడికి వెళ్ళటంతోచే నెలకి నాలుగువందల రూపాయల జీతమిస్తారట, నాలుగైదేండ్లల్లో వెయ్యి రూపాయలవుతుందట, ఆ కంపెనీలో క్రింది కార్యదర్శి ఉన్నాడు కదూ. ఆయనకు పదిహేనువందలు జీతము. నీ వెరుగుదువుగా ఆయన పోయినాడు ఆ ఉద్యోగము నీకు ఇప్పిస్తానని రాసినాడు."

"అయ్యో పాపము ఆయన చాలా మంచివాడే ఏ మొచ్చి పోయినాడో."

"ఏది ఒస్తే ఏమి పోయినాడు. అసలా కంపెనీలో పై కార్యదర్శులు క్రింది కార్యదర్శులుపోతూ ఉండట మల వాటే. జాకబ్ అదివరకు క్రింది కార్యదర్శి. అయిదేండ్లక్రింద ఆ పైకార్యదర్శిపోతే ఇతనికా ఉద్యోగమిచ్చారు."

"నేనా ఉద్యోగానికి వెళ్ళను"

"నా మాటవిని వెళ్ళు. ఈ రోజుల్లో ఒక చమత్కారం ఉంది. ఒకసారి ఒక పెద్ద ఉద్యోగమైందా ఇక వాడు క్రిందకి వెళ్ళడు. వాణ్ణి అట్లా పైకి ఎక్కతోస్తూనే ఉంటారు. వాడు

మృద్భాండమైనాసరే ! వాడు కనకకలశమనుకో, వాడికో పెద్ద ఉద్యోగమొచ్చే ఛాన్సురాలేదనుకో, అంతే గంగచెంబల్లె ఆ సీలుతో అట్లాగే కూర్చుంటాడు"

"నీ ఉద్దేశంలో నేను బ్రతకాలని లేదల్లే ఉంది"

"అబ్బాయీ! ఒకమాట చెబుతాను విను. మనకు ఉండటంలో లేకపోవటంలో ఏమీలేదు. నీవు చెప్పావుకదా నేను వేదాంతినని. మనము పుడతాము చస్తాము. ఎప్పుడు చస్తామో తెలియదు బ్రతికిన నాలుగురోజులు సుఖంగా బ్రతకాలె. నిన్ను మీ నాన్న వెళ్ళగొట్టాడు. అక్కడ జాకబ్ వెళ్లగొట్టాడు. మా పెద్దతండ్రి నేను జాకబ్‌ను చేసికొంటూ ఉంటే బ్రహ్మాండమైన ఆదుర్దాపడ్డాడు, నీవు మేరీని చేసికొంటావేమోనని మళ్ళీ అంత ఆదుర్దాపడ్డాడు. నీకు జాకబ్ ఉద్యోగం తీసివేస్తే నీ మొగంవంక చూడలేదు. నీవు నాకు వేరే ఉద్యోగం ఇప్పిస్తావా నన్ను మేరీని చేసికోమంటావా అని నీ నాయనను ఆ సంధిలో పెడితే ఉద్యోగం తప్పకుండా ఇప్పించేవాడు. ఆయనకా ఊళ్లో కాస్తా కూస్తా పలుకుబడి ఉందా ? ఆ ఊళ్ళో గవర్నమెంటు ఉద్యోగా లెన్నిఉన్నయో, కానివి వాటికి రెట్టింపు ఉన్నవి. నాకు తెలిసినంతమటుకు ఒకటే యథార్థము. ఏదైనా మన మొఖాన వ్రాసిఉండాలి. నేను చదివిన చదువుకి నేను చేసిన పనికి నేను ఉన్నస్థితికి ఇట్లా మాట్లాడటం జరగదు కాని నా మొఖాన అట్లా వ్రాసి ఉన్నది. నేను చెప్పిన మాటవిని ఈ డబ్బు పుచ్చుకొని ఢిల్లీవెళ్ళు. అక్కడ నీకా ఉద్యోగము ఇప్పి

స్తాడు జాకబ్. ఆ మేరీని చేసికో. నీకు పెద్ద ఉద్యోగ మవు తుంది. చాటుగా ఎన్ని మాటలు మాట్లాడినా డబ్బుగలవాణ్ణి ఎవ్వడు ఏమి చేయలేడు. వాణ్ణి అందరు అనుసరిస్తారు."

సోమనాథశాస్త్రి మాట్లాడకుండా ఎదురుగా కూర్చు న్నాడు. సోఫియా అన్నది. 'ఏమిటి ఆలోచిస్తున్నావు?' అని. అతనిట్లా అన్నాడు. "ఒకటి ఆ మేరీ చాలా అందవికారి. నేను అట్లాంటివాణ్ణే నన్నావుగదా! మా ఇద్దరికి సరిపోతుంది కాని ఆమె క్షయ వ్యాధితో బాధపడుతున్నది. నెమ్మదిస్తుందో నెమ్మదించదో! ఆ వ్యాధి వచ్చినవాళ్ళల్లో సగానికి సగము తేరుకోరు. సంసారము చేయటానికి పనికిరారు."

"ఇన్నాళ్ళు చేశావా? అదైనా వ్రాసిఉంటేనే జరుగు తుంది. ఒకానొకడు బహుజారుడు. ఒకానొక స్త్రీ కూడ జారి ణియే. వాళ్ళ మొగాన అట్లా వ్రాసి ఉంది. నేను కొన్ని విష యాలు నీతో సిగ్గువిడిచి చెబుతాను. ఒక స్త్రీకి ఒక పురుషుడికి సంబంధము ఉన్నదని చెప్పుకొనే వాండ్లందరు ఆక్షేపించే వాళ్ళందరు ఆ స్త్రీ తమకు లభించలేదే అని మనస్సులలో ఏడిచేవాళ్లే! ఆ ఏడుపే ఇలా బయటికి వస్తుంది"

"ఇది ఫ్రాయిడ్ సిద్ధాంతము"

"ఎవడి సిద్ధాంతమైతేనేమోయ్. అందులో చాలా నిజ ముంది. ఇక్కడ నువ్వు నేను కలిసి ఉంటున్నాము. మనిద్దరిని గురించి కూడ చెప్పుకొంటున్నారు. రెండురోజులక్రింద మన

మీద్దరము ఒక రాత్రివేళ కలిసివస్తున్నాము. వాళ్ళెవళ్ళో చీకట్లో మనకు కనపడలేదు గాని మనిద్దరిని గురించి వాళ్ళే మన్నారు ? నీవు పైకి రావాలి అంటే ఆ మేరీని చేసికో ! ఆబిడతో సంసారము చెయ్యక్కరలేదు. ఆబిడ ఎన్నాళ్లో బ్రతుకుతుందని నేననుకోను"

"నీకు జ్యోతిషం కూడ వచ్చా ?"

"నాకు కర్ణపిశాచి ఉంది. కొందరు కొందరికి కొన్ని కొన్ని అనిపిస్తవి. అట్లా జరగటం కూడా కద్దు. నా కనిపించి నవి కొన్ని అయినవి"

"సోఫియా ! నేను అలాంటి రోగిష్ఠిదాన్ని చేసికోను. సౌందర్యము మాట ఎట్లాఉన్నా అది ఆరోగ్యవతి కావలె ధనవంతురాలు కావలె ! నాకు సరదా అంటే ఇష్టము. అది ముంగి. అందుచేత దాన్ని నేను చేసికోను"

"నీకు తెలియదు. నువ్వు దాన్ని చేసికో. నేనింతకన్న ఏమి చెప్పను ?",

ఇదంతా అయి ఒకనాడు పతంజలిశాస్త్రి ఉపన్యాసము విని ఇద్దరు ఆయనతో చిదంబరశాస్త్రి ఇంటికి వెళ్లారు. అక్కడికీ చిదంబరం కమల వీళ్ళని రానీయరనుకొన్నారు. వీళ్ళు వెళితే వాళ్ళిద్దరు చాలా గౌరవం చేశారు. చెల్లెలు అన్నగారితో మాట్లాడింది. బావమరది మాట్లాడాడు. అతడువచ్చి చాలా రోజులయినా రోజూ ఒకరి నొకరు చూచుకొంటూ కూడా

ఇన్నాళ్ళు మాట్లాడకపోయినా సోమనాథం అప్పుడే వస్తే ఎంత ఆప్యాయంగా మాట్లాడుతారో ఎంత పరామర్శ చేస్తారో అంతా చేశారు. ఆ రోజున హఠాత్తుగా చిదంబరము సోఫియా మేనత్త మేనమామ బిడ్డలైనట్లుగా ప్రవర్తించారు ఒక గంట సేపు మాట్లాడేటప్పటికి చిదంబరం ఏమే నాగమ్మా అన్నాడు. ఆవిడ అసలు పేరు నాగలక్ష్మి. ఆవిడ కూడ అతన్ని మొదట రెండు మూడుసార్లు చిదంబరంగారూ అన్నది. మరి రెండు మూడుసార్లు పేరులేకండా ఏమండి ఏమండి మీరుమీరుఅన్నది. ఒకసారి చప్పున నీవు అన్నది. అతడు ఏమే అంటే ఈవిడ ఏమిరా అంది. వాళ్ళింట్లో సరిగ్గా రెండు గంటలున్నారు. ఇప్పుడు రెండు భాగాలు వాళ్ళక్రిందనే ఉన్నవిగా. ఆ ఇల్లంతా తమ స్వంతమల్లే కమల వాళ్ళిద్దర్ని తీసికెళ్లి దొడ్డిదోవ అన్నీ చూపించింది. ఉపన్యాసాలు వినటానికి వచ్చిన అయిదారు బ్రాహ్మణ కుటుంబాలు ఇంటినిండా ఉన్నారు. వాళ్లకి వీళ్ళెవరో తెలియదు. వీళ్ళూ బ్రాహ్మణులే అనుకొన్నారు. అతన్ని కాదేమో అనుకొన్నారు. కాని కమల అన్నగారని తెలిసింది, బ్రాహ్మణులు కాదేమో అన్న అనుమానము అతని విషయములో కలిగింది కాని సోఫియా విషయంలో కలగలేదు.

అక్కడనించి ఇంటికి తిరిగి వచ్చిన తర్వాత ఇద్దరిమధ్య ఈ ప్రసంగం సాగింది. అప్పటికే రాత్రి ఒంటిగంట అయింది. అంతరాంతరంలో సోమనాథానికి తన బ్రతుకంతా తన భవిష్య

త్రంతా సోఫియామీద ఆధారపడి ఉన్నట్లు అనిపిస్తున్నది. ప్రస్తుత మా సంగతి ప్రత్యక్షంగానే ఉన్నది.

వాళ్ల ఇద్దరి ప్రసంగంలో ఆవిడ అన్న అనేక మాటలు ఇతనికేవో అనేకార్థాలు కలిగిస్తున్నవి దరిద్రుడికి ఆకలి ఎక్కువ అని అతనికి యౌవ్వనము రాకముందునుంచి స్త్రీ భావన ఎక్కువ. మంచిచెడ్డ విచారణ లేనివాడు. అతనిలో మనస్సు తీవ్రంగా ఉంది. చాలా ఆలోచన చేస్తాడు. పతంజలి ఉపన్యాసాలు అతనికి ఎంతో బాగా ఉన్నవి. ఆ బాగా ఉండ టము వానిలోని తాత్పర్య విషయం కాదు. వానిలోని సూక్ష్మ తర్కవాదము అతనికెంతో నచ్చింది. సోఫియా అన్న ప్రతిమాట అతనికి సహజంగా వున్న కామాన్ని వృద్ధిపరుస్తూనే ఉంది. చివరిమాటలు అతని కామ భావానికి బాగా దోహద మిచ్చినవి. ఆ తయ వ్యాధిగ్రస్తురాలైన మేరీని చేసుకో మంటుంది. అది చస్తే చావవచ్చునంటుంది. జారత్వాన్ని గురించి మాట్లాడుతుంది. ఆ ప్రక్క గదిలో ఇతని మంచము ఉన్నది. అది మడత మంచము. ఒక దిండు వేసికొని ఇవ్వాళ్ల అతనిని ఆ గదిలో పడుకోపెట్టింది. ఆమె, తాను ఇవతలిగదిలో తన మెత్తని బెడ్డింగు నేలమీదనే వేసికొని పడుకొంటున్నది. కడచిన రాత్రి ఆ మంచము విరిగిపోయింది. నీవు నా పరుపు మీద పడుకో! నేను రగ్గు వేసికొని క్రింద పండుకుంటానన్నది. అతడు తానే క్రింద పండుకుంటానన్నాడు. మొత్తానికి చివరి కిద్దరు ఆ బెడ్డింగుమీదనే పడుకొన్నారు. మొత్తానికి మళ్ళీ తెల్ల

వారింది. ఇద్దరికి ఆ చిన్న పరుపు చాలలేదు. ఇద్దరూ నిద్ర
పోలేదు.

ఇద్దరూ ప్రొద్దెక్కి లేచారు. ఇద్దరూ ఏవో నవ్వు
కొన్నారు. రెండు మూడు రోజు లాగిన తరువాత ఇతను
ఢిల్లీ వెళ్లి ఆ ఉద్యోగము చేసేటట్లు మేరీని పెండ్లిచేసికొనేటట్లు
నిశ్చయమై పోయింది.

ఆ రోజున సాయంత్రము పతంజలిశాస్త్రి ఉపన్యాసము
సాంతము ఇది ; "ఆ ఈశపీర రాజులు చాలామంది ఉన్నారు.
ఇరవై వంశాలు ఉన్నవని చెప్పాకదా. వాళ్ళల్లో చివర ఒక
రాజున్నాడు. అతని పేరు అఖ్నాతేన్. దీనికి సంస్కృతము
చెప్పవలెనంటే అతుణదీనుడు అంటే తుణదీనుడు కాదన్నమాట
నిత్యదీనుడు అని అర్థము. అతడు తన రాజధానిని మార్చాడు.
అతడొక కవి. అతడి కింతమంది దేవతలు పనికిరాలేదు. భగ
వంతు డొక్కడే. ఇంతమంది దేవత లుండరు అన్నాడు. ఈ
రాజుయొక్క అసలుపేరు తూతన్‌ఖామన్ వాడి భార్య పేరు
అంఖేన్‌నామనన్. వాళ్ళిద్దరికి ఒక కూతురు పుట్టింది. దాని
పేరు అతే. ఆ రాజు తన కూతుర్ని పెళ్లిచేసికొన్నాడు. వాడు
చచ్చిపోయినాడు. ఆ కూతురు ఉన్నది విధవరాలు. దానిని
ఎవరు పెళ్ళిచేసికొంటే వాడు రాజౌతాడు. ప్లేటు ద్వీపంతో
అనగా ఈ హీబ్రూలు వాళ్ళు ఉన్నచోట సుబ్బులూయా అనే
రాజు ఉండేవాడు. వాడు చాలా గొప్పరాజు. వాడికి నలుగు
రైదుగురు కొడుకులున్నారు. ఈ కూతురు పెళ్లామైనగాని

తన రాజ్యంలో ఉండే మంత్రులు వాళ్లు తన్ను పెళ్లి చేసికో మంటే వాళ్ళను చేసికోలేదు. ఈ సుబ్బులూమాకి ఉత్తరం రాశింది. నీ కొడుకుల్లో ఒకణ్ణి నాకు పంపించు. నేను వాణ్ణి పెళ్లిచేసికొని ఈ రాజ్యం వాడికిస్తాను. పెద్ద పోట్లాట జరిగింది ఆ సుబ్బులూమా తన కొడుకు నొకణ్ణి పంఫించాడు. వాడు ఈజిప్టు చేరలేదు. ఆ మంత్రులలో ఒకడే గెల్చాడు. వాడే ఆ రాణిని పెండ్లి చేసికొన్నాడు. తరువాత ఆ ఈశపీఠ రాజ్యము క్రమ క్రమముగా విచ్ఛిన్నమయింది. గ్రీసుదేశపు రాజ్యాలు వృద్ధి పొందినవి. వాళ్ళు ఈశపీఠ సామ్రాజ్యముమీద దండెత్త టము ఆక్రమించుకోవటము ఇలా జరుగుతూ వచ్చింది. ఈ గ్రీసుదేశము ఈశపీఠ రాజ్యాన్ని కొంత నాశనము చేసింది. తరువాత హోమనుల సామ్రాజ్యము కొంత నాశనము చేసింది. ఈ గ్రీసుదేశము బలవత్తరము కాకముందు యూపరతీశనది త్రిగిరీశ నదుల తీరాలల్లో పెద్దసామ్రాజ్యాలు ఉన్నవి. ముందర వాటిగురించి మాట్లాడుతాను, రెండే విషయాలు చెప్పాలి. ఒకటి—ఆ నాగరకతలలో మన తెలుగువాళ్ళ లక్షణాలు కొన్ని ఉన్నవి. ఒక రాజుపేరు రామశేషు. ఒక రాజుపేరు సుబ్బులు. రెండవ దేమిటంటే—కూతుళ్ళను పెళ్లిచేసికోటము చెల్లెండ్లను చేసికోటము. అధర్మమూ సర్వనాశనమూ!

# తృతీయ భాగము

## యూపరతీశనది

### 1

ఏయ్ సోఫియా ?

సోఫియా సోమనాథం వంక కొంచెము నిశితంగా చూచింది. ఆ నిశితత్వం రేఖామాత్రంగా ఉంది. ఎన్నడూ అట్లా సోమనాథం పిలవలేదు. ఏవిధంగా పిలిచినా అతని కంఠ స్వరంలో ఒకానొక తారతమ్యము ఒకానొక భేదము ఒకానొక గౌరవము కనిపిస్తూనే ఉండేవి. ఈ నడుమ కొన్ని రోజుల్లో కొన్ని కొన్నిసార్లు గౌరవము లేకపోయినా ఒక సమానత్వము ఆమె ఇచ్చిన చనవుకొంత అపరిశీలనాబుద్ధి కనిపిస్తూ ఉన్నా మొత్తంమీద అగౌరవము కనిపించేదికాదు. ఇవ్వాళ అది ఏదో అతని కంఠంలో ఒక అధికారం వినిపించింది. అనగా తానామె కంటె ఎక్కువ. ఆమె తనకంటె తక్కువ అన్న భావం. భార్యా

భర్తలు ప్రసంగిస్తూ ఉంటే సామాన్య వ్యవహారాలు మాట్లాడు తున్నా వాళ్ళమధ్య ఉన్న సంబంధంచేత సంసార బాధ్యత ఇద్దరిదీ అవటంచేత పిల్లలయందు ప్రేమ ఇద్దరికి సమానముగా ఉండటముచేత కలపి సంసారము చెయ్యటముచేత ఒక ప్రేమ వల్ల కలిగిన చనవు వాళ్ళ ప్రసంగంలో అనుస్యూతంగా కని పిస్తూ ఉన్న భర్తయొక్క లక్షణంలో అతని కంఠధ్వనిలో ఏమాత్రం స్వాతంత్ర్య మవలంబిద్దామని భార్య ప్రయత్నించినా చప్పున అధికారం వైపునకు మొగ్గే ఒకానొక లక్షణం కని పిస్తూనే ఉంటుంది. ఒక యజమానీ సేవకుడూ ఉన్నారను. ఆ యజమాని సేవకునకు చాలా చనవు ఇచ్చినాడు. ఆ సేవ కుడు చనవును ఉపయోగించుకొనే పద్ధతిలో కూడ వాని సేవ కుని తనమును మఱచిపోడు. యజమాని తన యజమాని తనాన్ని మఱచిపోడు. వీడు ఆ చనవు ఇవ్వటంలో వాడు ఆ చనవును పుచ్చుకోటంలో పైకి చూడటానికి సమానులవలె కని పిస్తున్నా అంతః ప్రవాహముగా వాళ్ళ ఈ భేదం కనిపిస్తూనే ఉంటుంది. భార్యా భర్తలనటంతోటే ఇద్దరూ మాట్లాడే తరు వాలో ప్రధానంగా లైంగికమైన పరమ సన్నిహితమైన ధర్మమో పరస్పరానురాగమో భాసిస్తూ ఉన్నా జాగ్రత్తగా చూస్తే వాడు అధికారి ఈమె వానికి ఒదిగి ఉండేది అనే లక్ష ణము నిస్సందేహంగా కనిపిస్తుంది. ఒసేవ్ సోఫియా అని ఇప్పుడు సోమనాథం పిలిచిన పిలుపులో సోఫియాకి సోమనాథం తనమీద ఒక అధికారం కలవాడల్లే పిలిచాడన్న భావము కలి

గింది. మానవులు మాట్లాడుకుంటూ ఉండేటప్పుడు కొన్ని లక్షల సందర్భాలు ఉంటవి. కొన్ని లక్షల ప్రకృతులుంటవి. సందర్భాలు అనంతములు. ప్రకృతులు అనంతములు. మనుజుల వివేకమైన తారతమ్యము అనంతమైనది. అందరు మాట్లాడేవి ఒకటే భాష. అయినా ఒకే సందర్భములో అందరూ ఒకే పద్ధతిగా మాట్లాడరు. ఎవడి వాక్య విన్యాసము వాడిది. ఎవడు చెప్పే తరహా వాడిది. ఎవడు వాడే శబ్దాలు వాడివి. ఒక సందర్భములో ఒకడు ఒక లోకోక్తిని ఉపయోగిస్తాడు. మరొకడు లోకోక్తులను ఉపయోగించి ఒకడు తెలుగువాడైతే తెలుగు పలుకుబళ్ళను మిక్కిలిగా వాడతాడు. వాటిని వాడుతూవుంటే వాక్యానికి అర్థానికి స్థైరమ్యత వస్తుంది. "అబ్బాయీ నీకాపని సాధ్యంకాదు" అన్నమాటనే ఇంకోడంటాడు కదా నీవు తల క్రిందులుగా తపస్సు చేసినా నీవది చెయ్యలేవు. మరొకడు టాటా అనుకొన్నావా ఏమిటి? చేసి చూడు తెలుస్తుంది అంటాడు. ఇంకోడు నీ తలలో జేజెమ్మవంటివాడు చేయలేక పోయినాడు అంటాడు. ఈ చేయలేక పోయారన్న మాటకే ఒకడు వెల్లక్రింతల పడ్డాడంటాడు. ఒకడు వాడి ముక్కుకు మసైనంది అంటాడు—ఇలా పరిస్థితి ఒకటే అయినా తాత్పర్యము ఒకటే అయినా వాగ్లక్షణం అనేక రకాలుగా వుంటుంది సామాన్య మానవులలోనే ఇట్లాఉంటే గ్రంథాలు వ్రాసే కవుల్లో ఎట్లా ఉంటుందో ఆలోచించవచ్చు. శబ్దాలు వాక్యవిన్యాసాలు ఇన్ని భేదాలుగా ఉంటవి. మరి మాటలు మాట్లాడే

టుప్పుడు మనుష్యుల గొంతుకలలో నుండి వచ్చే సప్తస్వరాలు బహు భేదములు కలిగియుండి కాకువులు అనంత వైవిధ్యాన్ని సృజిస్తవి. మాట్లాడేవాడి వివేకమ్ముమీద ఆధారపడి ఉంటవి. వాడి ముఖావయవ విన్యాసంమీద ఆధారపడి ఉంటవి. వాళ్ళ ముఖ లక్షణాలమీద ఆధారపడి ఉంటవి. సూదులవంటి కన్నులు పలుచని చెక్కిళ్ళు పలుచని పెదవులు మరీ వెడల్పుకాని నోరు స్ఫూర్తి అయినమాట విస్పష్టమైన కంఠస్వరము కలవాడిలో కాకువు ఆక్షేపణ వెక్కిరింపు మొదలైనవి సునిశితంగా ఉంటవి. ఈ కంటిచూపు చెక్కిళ్ళ పెదవుల యొక్క సంబంధముగా ఉండటము కాక్వాక్షేపములను మందగింపిస్తవి. పలుచని చెక్కిళ్ళు సూదులవంటి కన్నులు కలవాని మాట వాడియైన కత్తి పదును వలె వుంటుంది. అవి మందగించినకొద్ది కట్టెపెట్టి కొట్టినట్లు ఉంటుంది. నోరు చిన్నది. నోరు ప్రమాణంగా ఉంటుంది. నోరు బాగా వెడల్పుగా ఉంటుంది. వాళ్ళ ముఖములలోనే భేదముంటుంది. చిన్న నోటివాడు ముంగిగా ఉంటాడు మరీ వెడలైన నోరు గలవాడు తెల్లగా వుంటాడు. సూదులవంటి కన్నులు పలుచని చెక్కిళ్లతోపాటు సన్నని పెదవులతో ప్రమాణమైన నోరు కలవాడు వివేకి. అయితే—సామాన్యంగా అలాటివాళ్ళు వివేకులయ్యే వుంటారు—వాడిలో ఈ కాకువు తీవ్రంగా భాసిస్తుంది.

మరి సోమనాథము తోంచెము బొద్దు. పట్టి బొద్దుకాడు ఈనపక్కడీవంటివాడు. దృఢకాయుడు అని చెప్ప అతని నేత్ర

ముఖములోను వైశాల్యము లేదు. మొగము గుండ్రదన అని చెప్పుటానికి వీలులేదు. కాని కోలమొగము మాత్రము కాదు. పలుచని చెక్కిళ్ళు అంతకు ముందేకావు. పెదవులు చిక్కనివి పట్టి చిక్కనవి మాత్రమే కావు. కాగా దలసరి పెదవులు. వీటి అన్నింటికంటె ఒక మహా విషయముంది. అతనిలో కళ్ళు పెదవులు ఎర్రగా వుంటవి. నల్లని మొగము గలవాడి పెదవులు పెద్దవై ఆ క్రింది పెదవి ఎర్రగా ఉంటే వాడు కొంచెంలో ఒక చిన్న దయ్యంలా ఉంటాడు అనటానికి ఏమీ అభ్యంతరం ఉండదు. అటువంటి వాడిలో సామాన్యంగా చురుకైన ఊహ ఉండదు. కాని ప్రతి సామాన్యశాస్త్రానికి అపవాద శాస్త్రము ఉంటుంది. ఈ సామాన్య శాస్త్రానికి అపవాదులు చాలా ఉంటవి. ఈ అపవాదలో ఒక చమత్కారమున్నది. ఆ లోపల ఉన్న వివేకము బయటికి వచ్చినా కనిపించదు. కనిపించదు సరికదా అది సామాన్యంగా వాడికే భాసించదు. కొన్ని కొన్ని పరిస్థితులలో వాడు చాలా సూక్ష్మంగా విచారిస్తాడు. తెలివి కలవాడనదగినట్లుంటాడు. ఆ పరిస్థితులు ఏమిటంటే, ఒకటి - చదువులో వాడిబుద్ధి నిశితంగా ఉంటుంది. రెండవది— వాడి ఉద్యోగము మొదలైన వాటిల్లో ఆలోచించి చేయటమనేది ఉంటుంది. కాని సామాన్యమైన లౌకిక విషయాలల్లో ప్రసంగ చాతుర్యంలో మందకొడిగా ఉంటాడు ఈ మందకొడితనం తనవు కలచోట మాట్లాడటంలో ఉండదు. క్రొత్తవాళ్ళు రావటంతోటే మొద్దబ్బాయవుతాడు. కాని సామాన్యంగా

మాట్లాడే టప్పుడు మోటుగా మాట్లాడుతాడు. సామాన్యంగా ఆలోచించి మాట్లాడడు. చాలామంది వివేకులు ప్రతిమాటలో వివేకాన్ని జోడిస్తూ ఉంటారు. కొందరు వివేకవంతులేమాటలో వాడితనం ఉన్నా ప్రతిమాటలో వివేకాన్ని జోడించరు. జోడించక పోయినా ఒక ఆలోచన ఉంటుంది. ఇలాంటివాళ్లు వట్టి స్థూలంగా పూర్వానుభవంమీద ఆధారపడి ఆ అనుభవాన్ని పురస్కరించుకొని యెక్కువభాగం మోటుగా మాట్లాడుతారు. సూక్ష్మంగా ఆలోచన చెయ్యరు. ఒసేవ్ సోఫియా అని సోమనాథం పిలిచినప్పుడు వాని స్థితి అలా ఉన్నది. అంటే ఆ సోఫియాని తాను ఒక గొడ్డుని యజమాని హై అని అదలించటంలో ఎంత ఆలోచన ఉండదో ఆ పశువు తనది అన్న భావము ఎంత ఉంటుందో అట్లా ఉంది. అందుచేతనే సోఫియా అతని వంక అంత నిశితంగా చూచింది. నిశితంగా చూచినా మనవాడి ప్రకృతి పట్టించుకునేది కాదు. కాని దాన్ని పట్టుకొని సోఫియా సాగతీస్తే ఆలోచించేశక్తి వానికున్నది. సోఫియా ఆలోచించింది. ఇతను నిరాధారుడు. తానాశ్రయమిచ్చింది. తనమీదపడి తింటున్నాడు. నిజమే—వాళ్ళ ఇద్దరి నడిమి సంబంధము చాలామారము పోయింది. ఆ సంబంధం అంత దూరం పోవటానికి ఇతడు తన్ను అంత నీచంగా పిలవటానికి ఏమి సంబంధం ఉన్నది? ఈ సంబంధం లోకంలో ఇటువంటిదా! ఎందుకు కావాలి ? గొప్పరాణులు గొప్ప గొప్ప అధికారుల భార్యలు సామాన్య మానవులతో సంబంధము పెట్టుకున్నా

రన్న కథలు ఉన్నవి అయినా వాళ్లు ఆ గొప్ప స్త్రీలను గౌర వించలేదా ? తెలియదు. ఆ గౌరవము ఎట్లాంటిదో లోకం కోసం తమ సంబంధం అందరికి తెలియకుండా ఉండటం కోసం బయట ఏమండీ అనటం మొదలైనవి చేస్తారేమో కాని అంత రాంతరంలో గౌరవమేమి ఉంటుంది ? ఆమె తమకు భోగ వస్తువు అనేభావమే రూఢమై ఉంటుంది. అది మనకు భోగవస్తు వన్న విషయము నిర్ధారితమైనప్పుడు దానియందు గౌరవ మెందుకుంటుంది ! గౌరవమనే భావము పోతుంది. దాని యందొక లాలస పుడుతుంది. ఆ లాలసతో ఒక లోకువతనం పుడుతుంది. ఆ భోగవస్తువు ప్రాణి అయి చైతన్యవంతమయితే ఈ లోకువతనాన్ని అది కూడ గ్రహిస్తుంది. లాలసత్వము ఆ భోగవస్తువుని లోకువతనంతో చూడటం ఈ రెండుగుణాలు ఉంటే అందులో లాలసత్వ మధికమైతే రెండవది కనిపించదు. ఒక స్త్రీ ఉన్నది. ఆమె ఒక్క పురుషునే ఎరుగును. ఆమెకున్న సర్వకామవాంఛ ఆ పురుషునందే నిండిఉంటుంది. వాడధికారం చెయ్యటం వాడికి తాను లోకువకావటం ఇలాంటి భావాలు ఆ నిండిఉన్న కామభావంలో కనిపించవు. ఆమెకు నలుగు రైదుగురు పురుషులతో సంబంధము ఉన్నది అని అనుకుందాం. ఆమె కామభావము ఒకచోట పరినిష్ఠితమైలేదు కదా! నాలైదు చోట్ల వ్యాపించియున్నది. అటువంటప్పుడు అందరికి తాను లోకువౌతుందా ? అందరిని తనమీద అధికారం చెయ్య నిస్తుందా? అప్పుడు ఈ కామభావానికి లోకు తగ్గుతుంది,

అది ఏమి చమత్కారమో అగాధత్వము విస్తారము రెండు ఒకచోట ఉండవల్లే ఉంది. ఒక్క సముద్రంలో ఉంటవి. బాగా లోతుఉంటే ఒక నదియో ఒక చెరువో ఒక కాలువయో పెద్ద వెడల్పుండవు. బాగా వెడల్పున్న చోట్లు ఎక్కువలోతు లుండవు. రాజకీయ వేత్తల మనస్సులు దేశములోఉండే బహు విషయములయందు వ్యాప్తములై సారస్వతము శిల్పము సంగీతము మొదలైన అగాధ విషయములను పట్టించుకోవు. పాపం! వాళ్ళ మనస్సులు వెడల్పైపోయి లోతులు తెచ్చుకోలేవు. కవులు గాయకులు మొదలైన వాళ్ళ మనస్సులు శిల్పపు లోతుల లోనికిపోయి పరిణాహాన్ని సంపాదించుకోలేవు. లౌకికములైన విషయాలల్లో జోక్యం పెట్టుకోలేవు. దానికి దీనికి సరిపోదు. ఇది సామాన్య ధర్మము. విశేష ధర్మాలు ఎక్కడా ఉంటవి. ఎప్పుడూ ఉంటవి. ఒకానొక పరమకాముకి పదిమంది భర్తలను సమానమైన లాలసతో చూస్తుంది. పురుషులలో కూడ అటువంటివాళ్ళు ఉంటారు. వాళ్ళని సాహిత్య శాస్త్ర పరిభాషలో దక్షిణ నాయకులు అంటారు. అటువంటి స్త్రీలను దక్షిణ నాయికలు అని ఎందుకనరాదు ? స్త్రీ విషయంలో ఏకపురుషగత బుద్ధియొక్క నియమమేమి ? పురుషుని విషయములో ఏకస్త్రీ గతబుద్ధి నియమమెందుకు లేదు? స్త్రీ యందు పురుషుడెంత రమిస్తున్నాడో పురుషునియందు స్త్రీ అంత రమిస్తున్నది. ఈ వాక్యమేతప్పు. ఎందుచేతనంటే స్త్రీ యందు పురుషుడు రమిస్తున్నాడు. పురుషునియందు స్త్రీ రమించటం లేదు. పురుషుని వలన రమిస్తున్నది. అందు అన్న సప్తమీవిభక్తి

ఆధారాధేయభావాన్ని చెబుతూ ఉన్నది. ఆ గిన్నెయందు ఈ పాలు ఉన్నవి. గిన్నె ఆధారము, పాలు ఆధేయము. స్త్రీ ఆధారము. పురుషుడు ఆధేయము. స్త్రీని ఆధారము చేసికొని సృష్టి సాగుతున్నది. ఆ స్త్రీ యందు పురుషుడు తాను ప్రవేశించి అనగా రేతోరూపంగా ప్రవేశించి సృష్టిని సాగిస్తున్నాడు స్త్రీయందు పురుషుడు ప్రవేశిస్తున్నాడు. ఇది సర్వ విదితమైన విషయమే. స్త్రీ పురుషునియందు ప్రవేశించటము లేదు. స్త్రీ అన్నచో పురుషునకు ప్రేమకలదు. పురుషుడన్నచో స్త్రీకి ప్రేమకలదు. ఈ ప్రేమకు ఆధారాధేయ భావానికి సంబంధము లేదు. కొడుకును తండ్రి ప్రేమిస్తాడు. తండ్రిని కొడుకు ప్రేమిస్తాడు. తండ్రి పోషించేవాడు. పెంచేవాడు. కొడుకు పోషింపబడేవాడు. పెంపబడేవాడు. ప్రేమ అన్నమాట రెండుచోట్ల ఒకటే. అట్లాగే స్త్రీ పురుషుల మధ్యగూడ ప్రేమ అన్నమాట ఒకటే. ప్రధానమైన భేదము ఈ ప్రేమ కలగటానికి హేతువులైన విషయాలల్లో ఉంటుంది. అలాగా స్త్రీయందు పురుషుడు రమిస్తున్నాడు. పురుషునియందు స్త్రీ రమించటము లేదు. ఆమె పురుషుని వలన రమిస్తున్నది. ఇది అపాదానకారకము. మనము దేనియందు రమిస్తామో దానియందు ఉంటాము. మనము దేనివలన రమిస్తామో దానివలన కొంత తీసికొంటాము స్త్రీ చేస్తున్నవని అది స్త్రీ అక్కడా తీసికొని ఇక్కడా తీసికొని ఎక్కడా ఒక్కణ్ణి ఉంచకుండా చేస్తుంది. మెంతి పెరుగు పోసిన వెండి గిన్నెలో ప్రొద్దున్నే పాలు పోయించుకుంటే

పాలు విరిగిపోతవి. పాలు విరిగి పోయినవంటే ఆ పోయించు కున్న పాత్ర పరిశుద్ధంగా లేదని అర్ధము. ఇవన్నీ సూక్ష్మ సూక్ష్మములైన విషయాలు. పరమేశ్వరానుగ్రహమువల్ల ఒకని బుద్ధి స్వచ్ఛంగా ఉండి గ్రహించవలసినదేకాని చెబితే తెలిసేవి కావు. జగత్తునకు విప్లవము ఒక్క యుద్ధాలవల్లే రాదు. ఒక్క యాటంబాంబులవల్లే రాదు. అటువంటి వాటివల్ల జరిగేది ప్రాణనష్టము మాత్రమే. ఇటువంటి వాటివల్ల జరిగేది జీవనష్టం. ప్రాణంవేరు. జీవం వేరు. ప్రాణం అంటే శరీరాల్లో ఆడే గాలి. జీవం అంటే నేను నాది అనుకునే చైతన్యం. దాని మీద సృష్టి జరుగుతున్నది, ఆ నేను అంటే ఏమిటో విస్పష్టంగా ఉండాలి. పరమార్ధంగా నేను అంటే బ్రహ్మ పదార్ధాన్ని అనే విషయం వేదాంతము. లౌకికంగా నేను అంటే విస్పష్టంగా ఉండటం పేరు ధర్మం. ధర్మాన్ని రక్షించవలెనంటే స్త్రీ ఏక పురుషగత బుద్ధి కావలె, ఇంకా చాలా ఉన్నవి ఏయ్ సోఫియా అంటే-ఎందుకెదురు తిరగాలి ?

## 2

ఆ రోజున అనగా ఏయ్ సోఫియా అని పిలిచిన మరునాడు ఉపన్యాసాన్నించి తిరిగివచ్చారు. ఈమధ్య అట్లాంటి పిలుపు మళ్ళీ రెండుసార్లయినా పిలిచాడు. మొదటిసారి ఎబ్బెరికం రెండవసారి తోచలేదు. మూడవసారి అసలు లేదు. పతంజలి శాస్త్రి ప్రపంచక చరిత్రను వదలిపెట్టి ఏదో ఉపన్యాసాలిస్తు న్నాడు. సోమనాథశాస్త్రి అన్నాడు గదా "మనదగ్గర ఏ వస్తువుంటే ఆ వస్తువుని అమ్ముతాము. అదే అన్ని వస్తువులు అని చెబుతాము" హఠాత్తుగా అన్న ఈ మాటకు అర్థ మేమిటో సోఫియాకు తెలియలేదు. నీవన్నమాట నా కర్థం కావటంలేదు అని అడగాలిగా ! సోఫియా అడగలేదు. ఏయ్ సోఫియా అన్నప్పటినుండి ఆమె కతనిమీద ఒకసన్నని గుబులుగా ఉంది. కాని కడచిన రాత్రి అదివరకటి రెండుమూడు రాత్రుల వలెనే గడచినది. లోకంలో భార్యాభర్త లుంటారు. వాళ్ళ కోపాలకి వాళ్ళు సంసారాలు చెయ్యటానికి ఒక్కొక్కప్పుడు

సంబంధ ముండదు. పురుషుడు తన కామవాంఛను ప్రక టిస్తాడు. భార్యకు అభిముఖ్యము లేదు. తిరస్కరించటములేదు. రాత్రి ఇద్దరము కలిసికొన్నాము కదా అని అతనిమీద ఆమెకు గల కోపము లుప్తమయి పోవటములేదు. మళ్ళి తెల్లవారే టప్పటికి ఆ కోపం ప్రత్యక్షమవుతూ ఉంటుంది. ఆ కోపము బతిమాలించుకొని బామాలించు కొంటేనేగాని పోదు. వాళ్ళి ద్దరు రాత్రిపూట కలిసికోటం లోకధర్మమల్లె దాంపత్య ధర్మ మల్లె సృష్టి ధర్మమల్లె శరీర ధర్మమల్లె వెళ్తుంది. తన కోపము అది పోవటము అది తన వ్యక్తిధర్మము. తన శరీరము వేరు. తన మనస్సువేరు. అనగా తాను వేరు. శతృరాజులు ఆ దేశము మీదపడి దోస్తారు. స్త్రీలను చెఱపడతారు. కొందరు మతావేశపరులు ఊళ్ళమీదపడి తగులపెట్టి స్త్రీల నెత్తుకె పోతారు. వాళ్ళని పెళ్ళి చేసికొంటూరు. లేదా వాళ్ళతో ఉంటారు. ఇలాంటి వాళ్ళల్లో కొంతమంది స్త్రీలు వాళ్ళనే ప్రేమించటము జరుగుతుంది. కాని ఎక్కువమంది స్త్రీలు చేసే డిదిలేక ఉంటారు. వాండ్లకి పిల్లలని కనటము కూడా జరుగు తుంది. కాని వాళ్ళ మనస్సుల కంగీకారములేదు. వాళ్ళకు దానియందు ఇష్టములేదు. వాళ్ళకది ప్రేమస్థానము కాదు. ఈ రీతిగా స్త్రీ పురుష సంగమములు అనంత విధాలుగా ఉంటవి. ఒక రాజ విప్లవమో దేశ విప్లవమో వచ్చినప్పుడు ఇవి జరుగుతవి. అటువంటి సమయాలల్లో స్త్రీ పురుష సంగమము లలో ఇట్లాంటి విపరీతాలు జరగవచ్చును. శాంత పరిస్థితులలో

జరుగవు అని అనటానికి వీలులేదు. ప్రేమించి పెండ్లిండ్లు చేసి కొన్న వాళ్ళ విషయములో పరిస్థితులన్ని బాగా ఉండి అన్ని దశాలకు లోపములేని భార్యాభర్తలు సంగమ విషయములో చెప్పలేము కాని సామాన్యముగా పూర్వ సంప్రదాయము నను సరించి జరిగే పెళ్ళిళ్ళల్లో ఇలాంటివి జరుగుతవి. పండుగకు అన్నగారు తీసుక వెళ్లటానికి వస్తాడు. భర్త పంపించనంటాడు. మరొకప్పుడు భార్య ఏదో అడుగుతుంది. భర్త నిరాకరిస్తాడు. ఇట్లాంటి సందర్భాలలో భార్యకు కోపము వస్తుంది. అతడు పలకరించినా మాట్లాడదు. తన్ను రాచుకపోవటానికి కూడ అంగీకరించదు. కాని గదిలో ఏకశయ్యాగతులై ఉంటారు, కలిసికొంటారు. అలా ఉంటవి సంసారాలు. శరీరము వేరు. దాని ధర్మము వేరు. మనస్సు వేరు. దాని ఇష్టానిష్టాలు వేరు— సోఫియా సోమనాథశాస్త్రి ఆ అన్నమాట ఏ ఉద్దేశ్యముతో అన్నాడో అడగలేదు. అడుగుతుందని అతననుకున్నాడు. ఆమె అడుగవలెనని తాను పతంజలిశాస్త్రిని గూర్చి విమర్శించవలె నని అతని ఊహ. ఆమె అడుగలేదు. తానంటే సోఫియాకేదో కొంచెము కోపము వంటిది వచ్చిందని అతడు గ్రహించాడు. ఎందుకు వచ్చిందో అతనికి తెలియలేదు. తానిక్కడకు వచ్చి చాలా రోజులయింది. ఇంచుమించుగా నెలనాళ్ళయింది. పూర్తిగా ఆమెమీద ఆధారపడి ఉన్నాడు. ఆధారపడి ఉన్నా నని అత ననుకోటము కూడా లేదు. ఇన్నాళ్ళు మనస్సులోని లోపొరలో ఆ భావము ఉండేదేమో ఇప్పుడదికూడ పూర్తిగా

తుడిచివేయ బడ్డట్లున్నది. ఆమె భావము మాత్ర మిట్లా ఉన్నది. "ఇతడు నిరాధారుడుగా ఉన్నాడు. నా దయమీద ఆధారపడి ఉన్నాడు. మహారాజువల్లె బ్రతుకుతున్నాడు సంచరిస్తున్నాడు. మా సంబంధము దాటరాని హద్దులు కూడ దాటింది. మొదట జాలి తరువాత వట్టి శరీరగత వ్యామోహము. అందుచేత ఇతనికి నామీద అధికార మెలా వస్తుంది? నేను చెప్పినట్లు ఇతడు వినాలిగాని ఇతనికి నామీద అధికార మెలా వస్తుంది" ఇలా ఆమె అనుకొంటున్నది తప్ప పైకి ఆ మాట అనదు. అంటే అతనికి తెలుస్తుంది. తెలిస్తే అతడు ఒళ్లు దగ్గిర పెట్టుక ఉండొచ్చు. మళ్ళీ ఈ మొహమాట మేమిటి? ఇట్లా అంటే అతడేమంటాడో? అతడు అనాగరకుడు వలె ఉన్నాడు. శరీరము ఉన్నది. మనస్సు ఉన్నది. రెండు వేరు వేరు. ఒక్కొక్కప్పుడు శరీరముయొక్క బలవంతముచేత ఇష్టము లేనిది చేస్తాము. పరాయిచోటికి వెళతాము. చచ్చేటట్టు ఆకలి అవుతూ ఉంటుంది. మనమెప్పుడు ఏదీ ఎవ్వరిని అడిగిన వాళ్లము కాము. అన్నోదకాలకి మనకు లోపములేదు. మన ఊళ్ళో మన కుటుంబానికి మంచి దర్జా ఉంది. నలుగురికి పెట్టే వాళ్ళమే కాని యాచించేవాళ్లము కాము. యాచించటమనేది నీచమన్న అభిప్రాయము మన మనస్సులో ఎంత దృఢమైంది అంటే యాచించేవాళ్ళని చులకనగా చూస్తాము, నీచముగా చూస్తాము. ఇట్టి మనము ఒక ఊరు వెళ్ళాము. అక్కడ డబ్బు పుచ్చుకొని అన్నము పెట్టేవాళ్ళు కూడా లేరు. ఇంకో ఊరికి

వెళదామంటే బండికట్టేవాడు లేడు. నడచిపోవటానికి అడుగు తీసి అడుగుపెట్టే స్థితిలో లేము. ఏమిచేస్తాము ? ఎవరింటికో పోయి "బాబూ మేము ఫలానా. ఈ ఊళ్లో చిక్కుకు పోయి నాను. ఆకలి అవుతున్నది" అని అడుగుతావా అడగవా ?—— ఇది ఒక విపరీత పరిస్థితి. అందరికి ఎప్పుడు ఇట్లా జరగదు. ఎప్పుడో ఎక్కడో ఎవరికో జరుగుతుంది. కాని జరిగిన విషయ మేమిటంటే మన మనస్సున కిష్టములేని దానిని సుతరాం ఇష్టము లేనిదానిని ఒక పరిస్థితి మన శరీరము మనచేత చేయిం చింది అన్న విషయము. తాత్పర్య మేమిటంటే మన కిష్టము లేనిదానిని మన శరీరము మనచేత చేయిస్తుందనే ఒకానొక విషయము సృష్టిలో ఉంటుంది అనటము —ఈ రీతిగా చూస్తే మరీ పట్టుదలలుకల విషయము చెప్పలేము. అట్లాంటి వాళ్ళు పదివేలమందిలో ఒకడుంటాడు. పరిస్థితులు మనోభావాలు సందర్భాలు వాటిలోని ఎక్కువ తక్కువలు మారటమే తప్ప శరీరము ఇష్టానిష్టాలకు సంబంధాలు లేకుండా తన్ను తాను నిలవత్రొక్కుకోటము సామాన్యముగా అందరి జీవితాలలో నున్నూ ఉంటుంది. సంబంధముకల ఇద్దరు స్త్రీ పురుషుల సంగమ వ్యవహారములో ఇది మరీ ఉంటుంది. అలాగే సోఫియా మనస్సులో ఉన్న గుబ్బు గుబ్బుగానే ఉన్నది. పైకి అనలేదు. అతడు గ్రహించలేదు. అతడనాగరకుడు స్త్రీ "పురుషుని కంటె తక్కువది" అనే మోటుతనం వాడి మనస్సును వదలి పెట్టలేదు. ఎట్లా వదలిపెడుతుంది ? అతడు పల్లెటూళ్ళవంటి

చిన్న చిన్న పట్టణాలల్లో చదివాడు. ఇక్కడి సంఘము చదువు నవ నాగరికము వంటి చదువు చదువా ? ఇండ్లల్లో ఆచారా లన్ని పూర్వకాలపువి, భావాలన్నీ ప్రాతవి, సంరక్షించు కొంటూ సంబాళించు కొంటూ వచ్చేడిది కనుక అతడి మనస్సు వృద్ధిపొందలేదు. అతడట్లాగే ఉన్నాడు.

ఎవరి గూర్చిట్లాడుతున్నావు ? అని సోఫియా అడగ లేదు. ఎందుకడగవు ? అని అతడు సోఫియాని ప్రశ్నవేశాడు. ఆమె "నేనడగటమెందుకు నీవు చెప్పాలనుకొన్నావు గదా చెప్పు" అన్నది. అతడు "ఈ రెండురోజులబట్టి నీవు నాతో ఎక్కువ మాట్లాడటము లేదేమి" అన్నాడు. ఆమె తెగబడి చీవాట్లు పెట్టింది. "నీవు వట్టి అనాగరికుడవు. పల్లెటూరి వాడవు. నీకు స్త్రీని గౌరవించటము తెలియదు. మగవాడు భార్యను "ఏయ్" అని "ఒసేవ్" అని ఎందుకనాలి ? అంత అగౌరవముగా ఎందుకు మాట్లాడాలి ? స్త్రీ భర్తను "ఏయ్" "ఒరేయ్" అని ఎందుకనకూడదు ? ఈ ప్రపంచకములో సహజంగానే స్త్రీలు పురుషులకంటె నాగరకులాండ్రు గనక భర్తలను అగౌరవపరచరు. పురుషులు జన్మచేతనే మోటువాండ్రు గనక స్త్రీలను అనగా భార్యలను అగౌరవ పరుస్తారు" అంటే సోమనాథమన్నాడు గదా భగవంతుడే అలా సృష్టి చేశాడన్న మాట. ఇంక మారేదేమున్నది ?"

భగవంతుడు చెయ్యలేదు. మన దేశములో ఉన్న మను ష్యులు చేశారు. ఇతర దేశాలల్లో ఇట్లాలేదు. పాశ్చాత్య దేశా లల్లో భార్యలను భర్తలు గౌరవిస్తారు. ఒకళ్ళని ఒకళ్ళు పేర్లతో పిలిచికొంటారు. ప్రియుడా ! అని ప్రియురాలా ! అని సర్వదా అనుకొంటారు."

"బాగానే ఉంది కాని అది మంచిదా. ఇది మంచిదా అని ఆలోచిస్తే నాకిదే మంచిదనిపిస్తున్నది."

"ఆలోచిస్తే అనకు. అది అలవాటైంది."

"ఇంతకూ ఈ ప్రశ్న ఎందుకు వచ్చింది? ఓహో నేను "ఏయ్" సోఫియా అన్నాను కదూ. రెండు మూడుసార్లు అన్నాను. నేను ఇట్లా ఊహించలేదు. ఏమంటే సోఫియా గారూ నావల్ల ఏదైనా దోషము ఉంటే మీరు నన్ను క్షమించాలి. "మీ దగ్గర ఈ తప్పు ఉన్నది. దీన్ని మీరు దిద్దుకోవాలి అని చెప్పాలి. మీరు పెద్దలు మేము పిన్నలము. ఇది పెద్ద వాళ్ళ విధి."

"నాకన్న నువ్వే పదాది పెద్దవాడవు."

"ఏమి పెద్ద ? తాడిచెట్టు పెద్ద. నీకు రెండువేల జీతము. నాలుగు వ్రేళ్ళు లోపలకు పోవుగదా ఒక వ్రేలు లోప లికి పొయ్యే జీతంకూడా లేదు. మీరు విఠల్ రావుతో చెబుతా మంటారు. చెప్పరు. నా యావజ్జీవము మీకు నేను కృతజ్ఞుడనై ఉండే పద్ధతిగా చేస్తున్నారు. నేను మీమీద ఆధారపడి ఉండ

వలె. మీరు ఏ పని చెప్పితే నేను ఆపని చెయ్యావలె. నాకేదైనా ఉద్యోగము ఇప్పిస్తే నేను స్వతంత్రుణ్ణి అవుతాను. నామీద మీకుఉన్న అధికారము పోతుంది. ఇలాగా జీవుడికి ఇంకొకడి మీద అధికారము చేయటము చాలా ఇష్టమైన వ్యవహారము. అందుకని ఇట్లా చేస్తున్నారు మీరు "

"నేను నీమీద ఏ మధికారము చేస్తున్నాను ?"

"చెయ్యానక్కరలేదు. చెయ్యటానికి యోగ్యమైన స్థలం వాడు. ఆ తృప్తి ఉంటుంది. మనస్సులో దాన్ని బెసగనివ్వకుండా పట్టుకరావటము.

"నీవు ఇంత తెలివికలవాడవు." ఈ తెలివి ఎప్పుడూ కనిపించదు"

మనదగ్గర ఒకటే వస్తువు ఉన్నది. అదే అన్ని వస్తువులు అని మనము చలామణి చేస్తాము" అని నేనన్నాను. ఏ సందర్భములో ఈ మాట నేనన్నాను అని మీరడగాలని ! మీరడగ లేదు. అందుచేత నేనే చెబుతున్నాను. మీ పతంజలిశాస్త్రి ఉన్నాడే—మీ "పతంజలిశాస్త్రి అని ఎందుకంటున్నానో ఇది వరకు చెప్పాను—ఆయనకొక ధోరణి ఉన్నది. మంచి అందమైన విగ్రహము ఆయనకు భగవంతుడిచ్చాడు. ఉబ్బిన చెక్కిళ్లు మంచిమంచి కళ్లు. ఎఱ్ఱని శరీరకాంతి ఉన్నవి. సంస్కృతము తెలుగు బాగా చదువుకొన్నాడు. ఆయన ఇంగ్లీషు పాండిత్యమెంతో నాకుతెలియదు. గొంతెత్తి కమ్మగా పద్యాలు చదువు

తాడు. జనానికేమి కావాలి ? సంగీతము పాడేవాడుంటే వాళ్లకింకేమీ అక్కరలేదు. ఈయన మనకు ప్రపంచ చరిత్ర చెబుతానన్నాడు. పూర్వకాలపు ఈజిప్టుదేశపు చరిత్ర చెబుతా నని ఏమి చెప్పాడు. కొన్ని మాటలుతీసి అవన్నీ సంస్కృతపు మాటలేనని మారిపోయినవని చెప్పాడు. దానితో ఈశపిత దేశ మన్నాడుగా ఆయన, ఆ చరిత్ర అయిపోయిందా ? మూడు రోజులక్రింద యూఫ్రటీస్ నదీ నాగరకతను గురించి చెబుతా నన్నాడు. అది యూఫ్రటీస్ కాదు యూపరతీశనదీ అన్నాడు. యజ్ఞము చేసేటప్పుడు పాతే స్తంభము పేరు యూపము. అని దానియందలి ఇష్టము యూపరతీ దానిమీద అధికారి ఈశుడు యూపరతీశుడు, అట్లా ఆ నదిపేరు యూపరతీశనది అయిన దన్నాడు. గడ్డానికి మోకాలికి ముడివేసినట్లున్నది. నీలానదిని గురించి చెప్పాడు. ఏమి చెప్పాడు ? ఏమీ చెప్పలేదు. చెప్పా డని అనుకున్నారు."

"ఆయన యేమి చెప్పాలో అది చెప్పాడు. ఇక్కడ గంగా యమునా సరస్వతులున్నవి. అక్కడ నీలానది ఉన్నది. ఇంకా ఇతర నదులు ఉన్నవి. వాటిని గురించి కూడ చెబు తాడు. ఆయన చెప్పిన పరమార్థము నీకు తెలియలేదు. ఒక్కటి చూడు. ఆ పాశ్చాత్యులే అనాదియైన నాగరకత మూడుచోట్ల ఉన్నదని వ్రాశారు. ఒకటి నైలునదీ నాగరికత. రెండవది—యూఫ్రటీస్ టైగ్రటీస్ నదులమధ్య ఉన్న నాగరి కత. మూడవది—గంగా యమునా సరస్వతీ నదుల నాగర

కత ఇవి మూడు అనాది నాగరికతలు కాగా నైలునదీ నాగర కత రెండువేల ఏండ్లక్రిందనే విచ్ఛిన్నమై పోయింది. తక్కిన నాగరకతలు అల్లాగే విచ్ఛిన్నమై పోయినవి. గంగా యమునా సరస్వతీ నదులయందలి నాగరకత విచ్ఛిన్నము కాలేదే ? మార్పులు పొందితే పొందవచ్చు. అప్పుడప్పుడు ఇతర మ్లేచ్ఛ జాతులు వచ్చి ఆక్రమించటము జరిగింది. ఇక్కడివాళ్లు వాళ్లని తరిమి పారవేయటము జరిగింది. వాళ్ళు కొందరిక్కడ స్థావరా లేర్పరచుకొన్నారు హిందూ రాజ్యాలు హిందూ ధర్మాలు నైలునది తదితరనదుల ప్రాంతాలలోవలె సంపూర్ణముగా నాశ నము కాలేదు త్రవ్వి బయటికి తీయవలసిన అవసరము ఇక్కడ పట్టలేదు. ఈ నాగరకత కూడా అంతటి అనాదిదే వాటి కెందు కాగతి పట్టింది ? వీటికెందుకు పట్టలేదు ? ఆయన ప్రధానంగా చెప్పదలచుకొన్నది ఈ సంగతి అనుకొంటాను. అది బాగానే చెప్పాడు."

"ఆయన చెప్పదలచుకొన్నది అది కాదు. ఆయన చెప్ప దలచుకొన్నది అన్ని దేశాలకు నాగరకత ఈ దేశమునుంచే వెళ్ళింది — అనే విషయము"

"సరే అది ఆయనేకాదు చాలామంది పాశ్చాత్యులే వ్రాశారు"

"వాళ్ళు ఈయనంత తెలివికలవాళ్లు"

ఈయనంత తెలివికలవాళ్లు ఆ దేశములోను కొందరు పుడతారు. వాళ్ళ దేశాలల్లో వాళ్ళ తెలివి ఉంటుంది. అలాంటి తెలివికలవాళ్ళు మన దేశములోను పుడతారు. ఎక్కువమంది ఉండటము తక్కువమంది ఉండటము ఎప్పటి కప్పటి ప్రపంచ పరిస్థితులమీద ఆధారపడి ఉంటుంది."

"మొత్తానికి నీకు బాగా పిచ్చి ఎక్కించాడన్నమాట"

"ఆయనను గురించి నీకు ఏమీ తెలియదు. ఆయన ఒక ఋషివంటివాడు"

"గడ్డాలు మీసాలే లేవు"—

# 3

కొందరు ప్రతిరోజు ఏమి ఉత్తరాలు వస్తాయో అని ఎదురు చూస్తూ కూర్చుంటారు. కొందరు వచ్చినప్పుడు చూసి కోటమే తప్ప వాటిని గురించి ఆలోచించరు. కొందరికి ఉత్తరాలే రావు. ఇది వచ్చేవాళ్ళ సంగతి. బంధువులు దూరములో ఉంటే చాలామంది ప్రతిరోజు ఉత్తరాలకోసము ఎదురు చూస్తూ ఉంటారు. ఏ ఉత్తరము వచ్చినాసరే అక్కడనుంచి వచ్చిందేమోనని ఆదుర్దాపడతారు. సోఫియా ఎప్పుడూ ఉత్తరాల కోసము ప్రతీక్షిస్తూనే ఉంటుంది. ఆవిడికి పలురకాల ఉత్తరాలు వస్తూ ఉంటవి. ఉద్యోగ ధర్మంగా ప్రతిరోజు ఒక కట్ట వస్తుంది. ఒక్కొక్కప్పుడు పత్రికా సంపాదకుడైన వాళ్లన్న గారి దగ్గరనుంచి వస్తుంది. వారానికొకసారి అయినా జాకబ్ దగ్గరనించి వస్తుంది. సోమనాథశాస్త్రికి ఉత్తరమే రాదు. ఆతనికి ఎక్కడినించి వస్తుంది ? చెల్లెలున్నదంటే ఊళ్ళోనే ఉన్నది. వాళ్ళ ఇంటి దగ్గరనించి వస్తుందేమో అనుకొంటే

తండ్రి వెళ్ళగొట్టాడు. తల్లికి ఉత్తరం రాయటము కూడ తెలియదు. ఆవిడ అంత పల్లెటూరిది. జాకబ్ ఇతనికి ఉత్తరం రాయడుగదా! వెనక ఒకసారి రాశాడు. అదైనా అతనికి రాయలేదు సోఫియాకు రాశాడు. దాన్ని ఇతను లెక్క పెట్ట లేదు. దాన్ని గురించి ఆలోచించలేదు. నిక్షేపమల్లె అక్కడకి వెళ్ళితే నెలకు నాలుగు వందలు వస్తవి. ఇక్కడ విఠల్ రావు చేత ఉద్యోగ మిప్పించమంటూ కూర్చున్నాడు పైగా పూర్వానికి మల్లె డబ్బు ఢిల్లీకి చేర్చేందుకు మాత్రమే పంపించలేదు. వెళ్ళి వాళ్ళింట్లో తినక్కరలేదు. ఇష్టంలేకపోతే తిరిగి రావచ్చు. అన్నింటికి తగినంత డబ్బు పంపిస్తానన్నాడు.ఆయన పంపించటమెందుకు? ఇతడు పైగ అంటే సోఫియా ఇస్తుంది. ఇప్పుడు సోఫియా దాని కంగీకరించదు-అని సోమనాథ మనుకొన్నాడు పతంజలిశాస్త్రి ఉపన్యాసాలు ఉంటే ఇంకొక నెలనాళ్ళు ఉంటవి. తరువాత సోఫియా ఢిల్లీకి పోవాలిసిందేకదా; కనుక ఆవిడకి తనమీద అభిమానమో ప్రేమో బూడిదో బుగ్గో ఏది ఉన్నా ఈ ఊళ్ళో తనకు ఉద్యోగము ఎందుకు కుదిరిస్తుంది? తన్నుగూడ ఢిల్లీకే తీసికెళ్ళుతుంది. మరి ఢిల్లీ వెళ్ళితే ఈ ఆట సాగుతుందా? ఏమో! అక్కడ జాకబ్ తనకు గూడ ఉద్యోగ మిప్పిస్తాడు. ఇద్దరు అనగా జాకబ్ తాను ఆఫీసులో ఒక్కసారే ఉండాలె. ఒక్కసారే ఇంటికి రావాలె. తనకు సోఫియాకు ఏకాంత మెట్లా కుదురుతుంది? అయినా ముందరి ఆలోచన చేయట మెందుకు? ఇతడు ఉత్తరాల కోసము ఎదురు

చూడదు. ఉత్తరాలు వచ్చేవేళకి యాదృచ్ఛికంగా అక్కడ ఉండవచ్చు. కాని ఉండవలెననే పట్టింపులేదు. పైగా ఉంటే ఒక బాధ ఉన్నది. ఒక గంటసేపు సోఫియా ఆ ఉత్తరాలు చూచుకుంటూ కూర్చుంటుంది. అప్పుడు తానొక్కడు తనలో తాను త్రవ్వుకుంటూ కూర్చోవాలి. తనలో తాను త్రవ్వు కుంటూ కూర్చుంటే ఎవ్వరికైనాసరే కాలము చక్కగా గడు స్తుంది. ఇతని కదేమీలేదు. బుద్ధుడల్లే కూర్చుంటాడు. బౌద్ధ మంటే శూన్యవాదము. ఏమీ ఆలోచించకుండా కూర్చుంటా డన్నమాట.

ఉత్తరాలు వచ్చినవి. జాకబ్ దగ్గరనించి ఒక చిన్న పుస్తకమంత ఉత్తరము వచ్చింది. ఏదైనా ముఖ్యమైన కాగి తాలు పంపించాడనుకుంది. సోఫియా ముందర తన ఉద్యోగ ధర్మానికి సంబంధించిన ఉత్తరాలు చూచి తరువాత ఆ సంచి చింపింది. తేలిగ్గా పది కాగితాలు ఉన్నవి. పైన అచ్చు కొట్టిం చిన తన చిరునామా కల పది కాగితాలమీద రెండువేపుల చిన్నచిన్న అక్షరాల్లో రాశాడు జాకబు. మొదటి కాగితము మొదటి వేపున చదివింది. అందులో ఉన్న సంగతి ఏమో తెలిసి పోయింది. ఆ ఉత్తరం సోమనాథశాస్త్రి చేతికిచ్చింది. "ఇదంతా నీ సంగతే చదువుకో" అన్నది. సోమనాథము నీవు చదివి నాకు చెప్పమన్నాడు. ఆవిడ "నిన్ను గురించి రాసిన ఉత్తరం నేను చదవటమెందుకు"

"నాకు రాసే ఉత్తరం నీకు పంపించటమెందుకు ? నీవు చదివి నాకు చెప్పవలెనని ఆ పోప్‌గారి అభిప్రాయము"

జాకబ్‌ని ఇంతమాట సోమనాథశాస్త్రి పూర్వము అనలేదు. సోఫియా తనతో కల్పించుకొన్న సంబంధము వలన ఆమె భర్తమీద ఇతనికి కొంచెము చులకన ఏర్పడ్డది సహజమే కదా ! మరొకని భార్యతో ఎవనికి సంబంధము కలుగుతుందో వాడామె భర్తను గౌరవిస్తాడా? వాడికన్న తా నందగాడు. వాడికన్న తాను ప్రతిభాశాలి. తన్ను స్త్రీలు వాంఛిస్తారు. ఆమె భర్త వట్టి నపుంసకుడు. తాను పరమ పుంస్త్వాభిరాముడు ఆమె భర్త అన్నివిధాలా తనకంటె లోచ్చు. అందుచేత జాకబ్‌ని గురించి ఒకమాట వదిలాడు. మరిన్నీ తన్ను తీసికొని పోయి వాళ్ళమతంలో చేర్చుకోవాలని ప్రయత్నించాడు కదా అందుచేత కూడా ఆ మాటను ప్రయోగించాడు.

ఆమె అన్నది. "నేను తరవాత చదువుతాను. మొదటి కాగితము చదివాను. కొన్ని విషయాలు ఎదటి వాళ్ళు చదివి చెప్పేవి. కొన్ని మనంతట మనము చదువుకోనేవి. ఇది అట్లాంటిది. నీవీ ఉత్తరము చదువుతూ ఉండు. నాకు వేరే ఉద్యోగపు పనిఉంది కదా ! నా ఉద్యోగము నేను చేస్తూ ఉంటేకదా నాకు జీతము వస్తుంది. వస్తేగదా ఖర్చులన్నీ మర్లుతవి. రెండు వందలు నెలకి కారుకవుతవి. ఈ ఊరు వచ్చిన తరువాత దాని మరమ్మతులకు మూడువందలైంది. నెలకి మన ఇద్దరి తిండికి

వందయాభై, రెండువంద లవుతున్నవి. పతంజలి శాస్త్రిగారికి సన్మానము చేసేందుకు చందాలు వసూలు చేస్తున్నారు. నేను పదిరూపాయలు ఇస్తానంటె కాదు వాళ్ళు వందరూపాయ లిమ్మన్నారు. ఆయనకి అయిదారు వేలు ఇవ్వాలట"

"అయిదారు వేలే! అందులో సగమిస్తే నాకు నేను ఆ పూర్వనాగరకతలను గురించి ఇంతకన్న నాలుగురెట్లు బాగా ఎక్కువగా చెబుతాను"

"నీ వెల్లా చెబుతావంటే పాశ్చాత్య దృష్టితో చెబుతావు ఆయన ప్రాచ్యదృష్టితో చెబుతున్నాడు నీవు చెబితే పుస్తకాల లోవి అప్ప జెబుతావు. సృష్టి నాలుగు వేలయేండ్ల క్రింద జరి గిందని చెబుతావు. ఈజిప్టు నాగరకత క్రీట్ వెళ్ళింది. తత్పూ ర్వం ట్రాయ్ ఉన్నది. అవి రెండు కలిపి గ్రీస్ వెళ్ళినవి. అది నేటి పాశ్చాత్య నాగరికతకు పునాది. ఆ నాగరికత గ్రీస్‌నించి రోమ్ వెళ్ళింది. అక్కడనించి యూరప్ అంతా వ్యాపించింది. దానితో ప్రపంచపు చరిత్రంతా ఆగిపోయింది.ఇది నీవు చెప్పేది మరిన్ని ఇందులో ఇంకొక సంగతి ఉన్నది. వాళ్ళ నాగరకత అంతా గ్రీస్‌లోనించి వచ్చింది. వాళ్ళ మతమంతా చిన్న ఆసియాలోంచి వచ్చింది. చిన్న ఆసియా అంటే పూర్వము మనవాళ్లు దాన్ని ప్లక్ష ద్వీపము అనేవాళ్ళు. నన్నడిగితే వాళ్ల హీబ్రూ మతమంతా అంతకంటే కూడ వాళ్ళ క్రైస్తవ మతము మనదేశాన్నించి వెళ్ళిన అనేక సిద్ధాంతాల్లోంచి పుట్టి

నవి. పూర్వమక్కడ జనమే లేరు. అందరూ ఇక్కడనించే వెళ్ళారు. ఇక్కడి భావాలతో అక్కడికి వెళ్ళి ఆయా దేశా ల్లో ఉంటూ వేదశాస్త్ర పురాణేతిహాసాలను మఱచిపోయి వాళ్ళ మనస్సులలో మిగిలిఉన్న మన మతాచార భావాలకు చిలవలు పలవలు కల్పించుకొని అనేకమతము అనేక నాగర కత ఎక్కడి కక్కడి కేదో కల్పించుకోటము ఇట్లా బ్రతకటము మొదలు పెట్టారు. ఆ రోజుల్లో ఆ దేశాలు నివాస యోగ్యా లుగా ఉండేవి కావు. రాళ్ళు,రప్పలు, మంచు, పెద్ద పెద్ద భూభా గాలు మహాజలములో మునిగి ఉండేవి.నడుమ నడుమ లంకలు ఉన్నా అక్కడికెవ్వడు పోతాడు? చిత్రచిత్రములైన మృగాలు ఉండేవి. ఈ సృష్టిలో ఒకప్పుడు సముద్రాలు పొంగి పెద్ద పెద్ద భూభాగాలు క్రమ్మివేస్తవి. అదివఱకులేని ఒక భూఖండము పైకి వస్తుంది. ఉన్న భూఖండము మహాసముద్రములో మునిగి పోతుంది. ఒక భూఖండము ఉన్నది. దానిలో ఒక నాగరకత ఉన్నది. అలాగే నాలుగైదు వేల సంవత్సరాలు గడుస్తవి. అప్పుడు ప్రళయము వస్తుంది. ఆ భూభాగము మునిగిపోతుంది. నడుమ ఒక చిన్న లంకవలె మిగులుతుంది. అందులో ఆ నాగరకతగల జనులు ఉంటారు. తక్కిన ప్రపంచానికి వాళ్ళకి సంబంధము తెగిపోతుంది. వాళ్లేమౌతారు. వాళ్ళ నాగరకత దిగజారిపోతుంది. ఎక్కువ వండదు. వృత్తులన్నీ చెడిపోతవి. రాజు లేడు. ఒక కొన్ని వందలయేండ్లు గడిచేటప్పటికి వాళ్ళు ఆటవికులు అయిపోతారు. తరువాత పాశ్చాత్య నాగరకతవంటి

నాగరికత ప్రబలిన అనమువచ్చి వాళ్లు ధాత్రిమీద అనాదివాసు లని భగవంతుడు సృష్టి మొట్టమొదలు అక్కడే చేశాడని పుస్త కాలువ్రాస్తే అవి చదివి అప్పజెబితే మన విశ్వవిద్యాలయాలు డాక్టరేట్లు ఇస్తే—మరిన్నీ ఆ అయిదారువేల ఏండ్లక్రింద పొంగిన సముద్రము మళ్ళీ క్రమంగా తీసింది. భూమి బయట పడ్డది. అక్కడ పూర్వ నాగరికతా చిహ్నాలు కనిపించినవి. త్రవ్వగా త్రవ్వగా మరీమర్రీ కనిపించినవి. అక్కడ ఒక త్రవ్వ కోల కనిపించింది. ఆనాటి జనానికి ఇనుముతో పనిముట్లు చేసి కొనేటంత నాగరికత ఉన్నది. ఇది ఒక సిద్ధాంతము. బంగారపు నగలు దొరికినవి. వాళ్ళు భూషణప్రియులు. ఇది ఒక సిద్ధాం తము. ఇలా చరిత్రను నిర్మించుకుంటూపోతే ఏమి ఫాయిదా ? మనకు యథార్థము ఏదో తెలియదాయె. అన్నీ ఊహాలేనాయె వాళ్లుకూడ ఇప్పుడు మనకెన్ని పుస్తకాలున్నవో అన్ని పుస్త కాలు వ్రాసుకొన్నారేమో ? అవన్నీ నశించిపోయినా యేమో ! ఇప్పుడు ఈజిప్టుదేశ మున్నది. గ్రీసు దేశమువాళ్ళు రోమ్ నగరము వాళ్లు ఈజిప్టు నాగరికతను చాలా ధ్వంసము చేశారు. ఈ దేశములో క్రైస్తవులు మసల్మానులు ఈ దేశపు మహా గ్రంథాల నెన్నింటినో తగులబెట్టించారట. ఇలా మనకు తెలిసిన కొద్దియేండ్లు చరిత్రలోనే అనేక విప్లవాలు జరిగి పూర్వ నాగరికత యొక్క చిహ్నాలు కాలవశాన కొన్ని దుష్టులైన రాజులచేత కొన్ని వాళ్ళ వాళ్ళ మతాలను ప్రచారం చేసి కొందామనే వాళ్ళచేత కొన్ని నాశనమైపోతూ ఉండగా మిగి

లిన వాటిని గురించి సిద్ధాంతాలను కట్టడం ఏమి వివేకమైన పని ? ఈ కట్టినవన్నీ చదివించి అది మహాజ్ఞానంగా వెలయింప జేయటము పరవంచనం, ఆత్మ వంచనం"

"ఇప్పుడు మీ పతంజలిశాస్త్రి చేసేది కూడా ఇదేగదా ! ఆయన కూడ లభ్యమానములైన విషయాలను తీసికొని ఏమి చేస్తున్నాడంటే పాశ్చాత్యులు అవన్నీ స్వతంత్ర నాగరకతలు అన్నారు. ఈయన కాదు భారతదేశమునించి వెళ్ళినవి అన్నారు. తాత్పర్యము రెండూ ఒకటే. అది నిష్ప్రయోజనమైతే ఇదీ నిష్ప్రయోజనమే ఎవరుచేసినా ఇంతే. ఇతరులపని తప్పుగా కనిపిస్తుంది"

"వారినే కనుక్కోవాలి. నాకు తెలిసినంతమట్టుకు ఆయన అట్లా చెయ్యరు."

"ఎవరి విశ్వాసము వాళ్లది. నీ కాయనమీద నమ్మక మున్నది. నాకు పాశ్చాత్యులమీద నమ్మకమున్నది. మన అభి ప్రాయాలు భేదమైనంత మాత్రాన దోషమేమి ?"

ఈ వాదనలో ఇద్దరూ కొంచెము తీవ్రముగా పోయి నారు. ఆవేశం పొందినారు. దానితో మళ్ళీ సామాన్యులా పోయి లాగా మాట్లాడుకొనేందుకు మనస్సు అంగీకరించలేదు. సోమ నాథశాస్త్రి ఆ ఉత్తరం తీసికొని చదవటము ప్రారంభించాడు "ప్రియమైన సోఫియాకు ! నీ దగ్గరనించి ఉత్తరము వచ్చి పది రోజులైంది. ఆ చిన్న పల్లెటూరువంటి చిన్నపట్టణంలో నీవు

రెండు నెల్లు ఉండటానికి ఎందుకు సంకల్పించావో నాకు తెలియటము లేదు. అక్కడ మన కనుకూలించే సంఘము లేదు. పెద్ద పెద్ద ఉద్యోగస్థు లుండరు. ధనవంతులుండరు. క్లబ్బులుండవు మోటార్లు ఉండవు. ఏమీ ఉండదు. కాలమెట్లా గడుస్తున్నది? నిన్ను వదలిపెట్టి చాలా రోజులైతే నేనూ ఉండలేను. సెలవు పెట్టి వద్దామంటే నా ఉద్యోగము సెలవు పెట్టేదికాదు. నీ ఉద్యోగపు ప్రధాన ఆఫీసు ఈ ఊళ్లో ఉన్నది. నీవు కదలకుండా అక్కడే ఉండటము ఈ ఆఫీసులో కొందరికి ఇష్టంగా లేదు. అక్కడ చేసే పనియొక్క వైనాలు ఆ ఊరు వెళ్ళానని ఈ ఊరు వెళ్ళానని అక్కడక్కడ అనాథశరణాలయాలను గురించి నీవు పంపిస్తున్న వాకబు వాటి అభివృద్ధికోసము నీవుచేసే సిఫార్సులు, వీళ్ళని నిన్ను గురించి ఏమి చెయ్యటానికి వీలు లేకుండా చేస్తున్నా నీ మీద నేదో ఆశాళరామన్న ఉత్తరాల్లు వచ్చినవట! ఈ అనాథ శరణాలయాల సిద్ధాంతాలకు ఈ సంఘము మారకానికి మొదలైన వాటికి నీవు వ్యతిరేకురాల వని, నీవు పూర్వాచార పరాయణురాలవని, ఆ ఊళ్ళో ఎవరో సన్యాసి ఉన్నాడట! నీవు వాడి శిష్యురాలివైనావని, ఆ సన్యాసి ఆధునిక ప్రపంచాభివృద్ధితో విరోధియని, నిన్నా ఉద్యోగములో ఉంచటం ఆ ఉద్యమానికే భంజకమని ఏవో ఏవో వ్రాశారు. కనుక నీవు ఎంత పెందలకడ. ఆ ఊరు వదలిపెట్టి వస్తే అంత మంచిది. వాళ్ళు వ్రాసినవి ఏవీ నేను నమ్మలేదు. ఎవరో కిట్టనివాళ్ళు వ్రాసి ఉంటారు. నేను చెప్పాను. "ఏమి

టయ్యా ఇది ఆమె నన్ను పెళ్ళిచేసికొన్నది. ఇంగ్లీషు భాషలో పట్టభద్రురాలు. ఆమెను కూడ అధునిక నాగరికతకు విరోధిని అనుకుంటే అర్థమేమున్నా ఉందా" అని చెప్పాను. వాళ్ళు ఊరుకొన్నారు. కనుక వెంటనే వచ్చేసెయ్యి. ఇది ఇట్లా ఉంచి ఆ సోమనాథశాస్త్రి కనుపించాడా ? ఎక్కడ ఉన్నాడు ? నీవతనిని కలిసి కొన్నావా ? అతనిని ఇంట్లోనించి వెళ్ళగొట్టారు అని చూచాయగా నీకు తెలిసిందని నీవు ఇరువదిరోజుల క్రింద వ్రాశావు. మళ్ళీ అతనిని గురించి ఏమీ వ్రాయలేదు. ఈ సంగతి చాలా ముఖ్యము. మేరీ స్థితి రోజు రోజుకు అధ్వాన్నంగా తయారవుతున్నది. నాకేమీ తోచలేదు. మన దేశములో పూర్వపు నాగరకతయందు ఎంత కట్టుదిట్టము చేశారో తలుచుకుంటె నాకు వాళ్ళమీద పట్టరానంత కోపము వస్తున్నది. నా తల్లిదండ్రులు చనిపోవటముతోటే నేను మేరీని ఇక్కడికి తీసికొచ్చాను. ఆ పేరు నేనే మార్చాను. దాని పేరు రేణుక. నా తల్లిదండ్రులు క్రైస్తవులు కారు. వారు హిందువులు. నేను క్రైస్తవులలో చేరటం మా నాయనకేమీ ఇష్టము లేదు. మా అమ్మకి అంతకంటె ఇష్టములేదు. మా గూడెములో బసవయ్య అని ఒక దాసరి ఉండేవాడు. అతడు పెద్ద పండితుడు. మేము శైవులము. ఈ క్రైస్తవ పాదరీలను ఆయన ప్రశ్నలు వేసేవాడు. వీళ్ళు ఉక్కిరి బిక్కిరయ్యే వాళ్ళు. ఈ పాదిరీలు ఆయన ఉన్న చుట్టుపట్లకి వెళ్ళేవాళ్ళు కారు. అతనంటే అంత భయము. ఆయనతో వీళ్లు వాదన పెట్టుకుంటే

ఇతరులను క్రైస్తవ మతములోనికి చేర్చటము కూడా పాడై పోతుంది. మా కుటుంబము ఆ బసవయ్య శిష్యులము. మా అమ్మ నాన్న వాళ్ళిద్దరి మెళ్ళల్లోను శివలింగాలుండేవి. రేణుక ఆ ఇంట్లో పెరిగింది. దానికెంత సేపటికి శివ పార్వతులు అర్ధ నారీశ్వరమూర్తి ఇదే గోల. ఈ సృష్టి అంతా అర్ధనారీశ్వరుడైన పరమేశ్వరుని యొక్క వికాసమట. అది ఎప్పుడూ మాట్లాడదు. ముభావంగా ఉంటుంది. రెండేండ్లు నీవు ఈ ఇంటిలో ఉన్నావు. అది నోరెత్తి మాట్లాడటము నీ వెరగవు. నీ వేమి అనుకోకుండా ఉంటే ఒక సంగతి చెబుతాను. దానిని గురించి పెద్ద లెక్క చెయ్యక్కరలేదనుకో కాని చెబుతున్నాను. నీవంటే దానికేమీ లెక్కలేదు. మనస్సులో నీవంటె ఒక ఏవగింపు. దివ్యమైన మతాన్ని వదలిపెట్టి ఈ అల్పపు మతాన్ని స్వీకరించావని, నన్ను పెళ్ళిచేసికోటము డబ్బు కోసము అధికారము కోసము చేశావని, నీవు రాకముందు రేణుకయొక్క ఈ మాటలు నేనెరుగుదును. కాని అది చిన్నపిల్ల. దానికింగ్లీషు చెప్పిస్తే బాగుపడుతుంది అనుకొన్నాను. బాగుపడ్డది అనుకొన్నాను. తీరా చూస్తే పూర్వముకంటె ముదిరిపోయింది ఈ నెల నాళ్ళల్లో నేను బతిమాలగా బతిమాలగా నాతో రెండుసార్లు మాట్లాడింది. దానిచేత మాట్లాడించవలెనంటె హిందూ మతాన్ని తిట్టాలి. దానికి ఓపిక లేకపోయినాసరే ఆ ఆవేశము ఆ తర్కము ఆనింద చెప్పటానికి వీలులేదు. ఈ స్థితిలో ఉండి, నాకేమి తోచటములేదు. దానిమీద నాకు

చాలా కోపము వస్తున్నది. కాని నేను కోపమంతా దిగమ్రింగు తున్నాను. ఏకగర్భ వాసులము. నా తల్లి కడుపున మేమిద్ద రమే పుట్టాము. నాకంటె అది పదహారేళ్ళు చిన్నది అదంటే నాకు ఎంతో ప్రాణము. చిన్నప్పుడు దాన్ని క్రింద దిగనిచ్చే వాణ్ణికాను. సోమనాథశాస్త్రిని మోసంచేసి తెచ్చాను. అతన్ని బాధపెట్టాను. బలవంతంగా నా తిండి తినిపించాను. ఇదంతా రేణుకకోసం చేశాను. వృథా అయిపోయింది. దాన్ని నేను మేరీ అని పిలిస్తే దానికి ఎంత కోపమో చెప్పటానికి వీలు లేదు. నా పేరు రేణుక. నేను మేరీని కాను అని నాలుగు రోజుల క్రిందట పెద్దకోపము తెచ్చుకొని ఆవేశము తెచ్చుకొని దగ్గి నెత్తురు జీరతో కూడిన ఇంత కళ్ళెను ఉమిసింది. నేను దానితో "అమ్మాయీ ! నీ భావాలన్నీ నోటితో చెప్పవద్దు. కాగితంమీద రాయి" అన్నాను. వ్రాసింది. పంపిస్తున్నాను.

## 4

"శ్రీ బోయిన నాగన్న అన్నగారికి చెల్లెలు రేణుక దండాలు పెట్టి చేసికొనే విన్నపము. నేను మాట్లాడితే నా ఆరోగ్యము చెడిపోతుందని నా ఆయుస్సు తగ్గిపోతుందని నన్ను కాగితంమీద వ్రాయమన్నావు. అలాగే రాస్తున్నాను. నేను మన పల్లెటూళ్లోనే ఉంటే నాకీ వ్రాయటము చేతనయ్యేది కాదు. మూడేళ్ళక్రింద నన్నీవూరు తీసుకొచ్చావు. ఒక ఏడాది నా దగ్గర కూర్చొని నాకు చదువు చెప్పావు. ఒక్క ఏడాదిలో నాకు ఆరేళ్ళ చదువు చెప్పావు. మనము తెలుగు వాళ్ళము గనక నీకు తెలుగు వచ్చుగనక నీకు చెప్పటము సాధ్యమయింది లేకపోతే ఈ ఊళ్ళో ఉన్న బళ్లకు పంపిస్తే వాళ్లు హిందీ చెప్పే వాళ్లు. నాకు తెలుగు వచ్చేది కాదు. బసవయ్య గురువుగారు చెప్పిన చదువంతా వృథా అయ్యేది. ప్రభవలు మాసాల పేర్లు ఋతువుల పేర్లు నక్షత్రాలు యోగాలు కరణాలు దిక్పాలకులు వాళ్ళ భార్యల పేర్లు పట్టణాల పేర్లు వాళ్ళ ఆయుధాల పేర్లు

దేవతల పేర్లు వాళ్ళ వాళ్ళ చుట్టరికాలు — గురువు ఎన్నో చెప్పాడు. నాకు అక్షరం వ్రాయటము చదవటము వచ్చేది కాదు. అంతా ఆయన నోటితో చెప్పాడు. నీవా చదువంతా వ్యర్థమనేవాడవు. నేను నీకు తెలియకుండా తెలుగు పుస్తకాలు తెప్పించుకొని నా అంతట నేనే చదువుకొన్నాను వ్రాయటం చదవటం నీవు నేర్పావు. నీ వెప్పుడు తెలుగులో మాటాడవు. వదినె ఎట్లాంటిదైనా తెలుగులో మాట్లాడుతుంది. నేనావిడతో ఇంగ్లీషులో మాట్లాడను గనక ఆవిడ తెలుగులోనే మాట్లాడేది తెలుగువాళ్ళు మన ఇంటికి వస్తూఉండటం పోతూ ఉండటము ఇదంతా నా తెలుగు చదువుకి దోహదం చేసింది. నీవు నాకు ఇంగ్లీషు చెప్పిద్దామనుకొన్నావు. అందులో నా బుద్ధి నడవ టము లేదు. ఇప్పుడదంతా ఎందుకు ? నన్ను రాయమన్నావు నేను ఇంగ్లీషులో రాయాలని నీ ఉద్దేశ్యము. నేనింగ్లీషులో రాస్తే అన్నీ తప్పులు వస్తవి. వాటినిబట్టి నీవు నన్ను కోప్పడ తావు. తెలుగులో వ్రాస్తే ఆ దోషము లేదు. తెలుగు నీకు బాగా రాదని వదినె నాతో నాలుగైదుసార్లు చెప్పింది. కనుక తప్పులు వచ్చినా ఫరవాలేదు అని వ్రాస్తున్నాను. నీవు నన్ను చర్చికి వెళ్ళమంటావు. వదినె వెళ్ళదు. ఆవిడ్ని నీవేమీ చెయ్య లేవు. ఆవిడ ఇష్టం వచ్చినట్లావిడ ఉంటూ ఉన్నది. చేసికొన్న పెళ్ళాన్ని నీవు ఆవిడ్ని అదుపులో పెట్టలేవుగాని నేను దిక్కు లేనిదాన్ని నీ పంచను చేరాను గనక నన్నదుపులో పెడతావు. అన్నగారు చెల్లెలిని పెట్టవచ్చు. కాని తప్పు నాది కాకపోయినా

తప్పు నాదనటం న్యాయము కాదు. ఆ క్రైస్తవమతము నాకు గిట్టదు. బసవయ్య గురువు ముందర ఆ ఫాదిరీ లెవ్వరు నిలిచే వాళ్లు కారు. ఆయనకొక దండము పెట్టి ఊరుకొన్నారు. అప్పట్నించి నాకు మనమతమే గొప్పది అన్న అభిప్రాయ మేర్పడ్డది. వదినెను చూచిన తర్వాత నాకింకొక విషయము బాగా తోచింది. ఆ మతము పుచ్చుకొనే వాళ్లందరు డబ్బుకోసం అధికారాల కోసం పుచ్చుకొంటారు అని. ఇంకొకటి ఏమిటంటే— అందరు జనులు సమానమని ఈ దేశములో బ్రాహ్మణులు తక్కిన కులాల వాళ్లని అణగ ద్రొక్కారని మనలను అస్పృశ్యులుగా ఉంచారని వాళ్ల మతము పుచ్చుకొంటే మనకు ఉద్యోగాలు వస్తవని మనము వాళ్ళతో సమాన మవుతామని ఇలాంటి భావాలు కలిపించి ఇట్లాంటి ఆశలు పెట్టి మనదేశంలో క్రైస్తవులు మనలో చాలామందిని వాళ్ళ మతంలోకి మార్చుకొన్నారు. ఇప్పుడు నేను కొన్ని విషయాలు వ్రాయాలి. ఇవన్నీ నాకెల్లా తెలుసునని నీవనుకొంటావేమో. నాకు వదినె అంటే పడదు. అంటే ఆవిడ చేసినపని నాకిషము లేదు ఆవిడ మీద నాకు కోపము ఉన్నది. ఒకసారి ఆవిడతోనే చెప్పాను, ఆవిడను గురించి నాకు తెలిసినది ఒకమాట చెబుతాను. నీ భార్యను గురించి ఇట్లా వ్రాస్తున్నానని నీకు కోపం వస్తుందేమో తెలియదు. ఎవరి కోపం నన్నేమి చేస్తుంది ? నీ కోపం కూడా నన్నేమి చేయలేదు. ఎందుచేతనంటే మన మిద్దరము ఒక కడుపున పుట్టామన్న ప్రేమ నీకు చాలా ఉంది. అదీ నాకు

ధైర్యము. నేను వదినని గురించి వ్రాయబోతున్న విషయము నీకావిడమీద కోపాన్ని తెప్పిస్తే నేనేమి బాధపడను. ఆవిడ నీకు తగిన పెళ్లాము కాదు, ఆవిడ మనస్సు సంప్రదాయము మీద ఉంటుంది. ఈ దేశములోని మతము ఈ దేశములోని నాగరకత వీటిని గురించి ఆవిడ ఎక్కువగా ఊహిస్తుంది. వాటిని గురించి ఎక్కువగా మాట్లాడుతుంది. నా కిద్దరే గురువులు. మొదటివాడు దాసరి బసవయ్య. రెండవ గురువు వదినె. ఆవిడ ఇలాంటిదైతే అనగా ఆవిడ మనస్సు ఇలాంటిదై ఆవిడ చేసేపనులు అనగా ఆవిడ శరీరము ధర్మానికి ఏమీ సంబంధించనిది. నేనింతకంటే ఎక్కువ వ్రాయకూడదు. నేనెప్పుడూ మాట్లాడనని నీకు తెలుసు కదా ! ఒకరోజున వదినెతో ఒకమాట అన్నాను. నాకు మేనల్లు డెప్పుడు పుడతాడు అని. ఆవిడ ఏమన్నదో తెలుసునా ? నీకు ఆశ్చర్యం వేస్తుంది. నాకే ఆశ్చర్యం వేసింది. బ్రాహ్మణ స్త్రీయందు శూద్రుడికి కలిగిన సంతానము చండాలు రౌతారట. ఇంక బ్రాహ్మణ స్త్రీయందు చండాలునికి కలిగిన సంతాన మేమౌతుంది ? నాకు సంతానము కలుగదు. నేను కనను అన్నది. ఏమంటావు ? ఆవిడ నిన్ను పెళ్ళి ఎందుకు చేసికొన్నట్లు ? నా కర్థం కాలేదు. అది అట్లా ఉంచి నా సంగతి వ్రాయాలి. నీవు నా సంగతే కదా వ్రాయమన్నావు, నా కర్మంకొద్దీ నాన్న అమ్మ చనిపోయినారు. వాళ్ళు బ్రతికిఉంటే అక్కడనే నేను మనకులము వాణ్ణి ఎవణ్ణో పెళ్లి చేసికొనే దాన్ని. ఆ పల్లెటూరి మాలపెళ్లి వైభవమంతా అనుభవించే దాన్ని. నా

మగడు పొలాన పనిచేస్తూ ఉంటే తట్టలో అన్నం పెట్టికొని అతనికి తీసికెళ్ళేదాన్ని. అది చాలా అందమైన విషయమట. రెండేండ్ల క్రింది ఆంధ్ర సభలో తెలుగు దేశాన్నించి ఎవరో కవి వస్తే ఆయనికి సన్మానం చేశారు. అప్పుడాయన తాను వ్రాసిన పద్యాలు చదివాడు. అందులో పల్లెటూరి జీవితాన్ని వర్ణిస్తూ నెత్తిన తట్టలో అన్నము పెట్టుకొని మగడి కోసము పొలానికి అన్నము తీసికెళ్ళే మాలపడుచుని వర్ణించాడు. జన మందరూ ప్రశంసగా చప్పట్లు కొట్టారు. అప్పట్నించి నాకు ఆ సౌభాగ్యము పోయింది అనిపిస్తుంది. అదంతా కవిత్వంలో అందమైనదై జీవితంలో అసహ్యించుకో దగినదై ఉంటుందా ? నేను చిన్నదాన్నే అనుకో. నీ అంత పండితురాలను కాదనుకో ! కాని నా కొకటనిపిస్తూ ఉంటుంది. శాంతంగా ఉండే జీవితాన్ని ఈ ఇంగ్లీషు నాగరికత వచ్చి అశాంత పరచింది అని మూడేండ్ల క్రింద నాకు పదమూడేండ్లు. అచ్చగా పసిపిల్లను కాదుగదా ! ఏదో కొంత కొంత తెలుస్తూ ఉండేది. సంఘములో పై కులాలవాళ్లు మన్ని అణగ త్రొక్కారు. సరేకాని అన్నయ్యా ! నీవు సోమనాథంగారికి ఉద్యోగము తీసివేశావు. ఎందుకు తీసేశావు? నన్నతనికిచ్చి పెళ్ళి చేద్దామనుకొన్నావు. అతడు ఉద్యోగము కుదిరేవరకు అనుసరించాడు. తరువాత ఎదురు తిరిగాడు. ఇది పై వాళ్ళు క్రింద వాళ్ళని అణగ త్రొక్కటం కాదా? పై వాళ్ళు క్రింద వాళ్ళని అణగ ద్రొక్కటం ఎన్ని విధాలగా ఉంటుంది ?

ఒక్క కులమేనా దానికి తార్కాణం ? బలశాలి బలహీనుడు ధనవంతుడు పేదవాడు పలుకుబడి కలవాడు లేనివాడు అధికారి అనధికారి మారణాయుధము లధికంగాగల దేశము లేని దేశము కసాయివాడు జాలిగుండె కలవాడు వాళ్ళు వీళ్ళని బాధించటం తప్ప ఇంకొకటి లేదే ఈ ప్రపంచములో ! దాని పేరే ప్రపంచము. ఇట్లా ఉండగా అకమంత్రిని పడదొయ్యాలని కొందరనుకొంటారు. వాడు తమ మాట వినటంలేదని విశ్వాస రాహిత్య తీర్మానం పెడతాడు. డబ్బిచ్చి ఓట్లు కొంటాడు. నా కీచదువంతా చెప్పింది వదినె. నీవు కంపెనీకి వెళతావు. ఆవిడ నాచేత మాట్లాడించాలని, నాచేత నవ్వించాలని, ఇవన్నీ చెబుతూ ఉంటుంది. ఎప్పుడో ఒకరోజున నే నడిగాను. నేను నవ్వితే నీ కేమి లాభమమ్మా అని అడిగాను ? ఆవిడ చెప్పిన సమాధానము చెప్పనా ? నాకప్పుడు ఏడుపు వచ్చింది. తరువాత కోపము వచ్చింది. తరువాత నిజమే ననిపించింది. ఇంకా ఆలోచిస్తే ఆవిడకంటే పూతన, శూర్పణఖ, తాటక మొదలైన వాళ్ళు నయమనిపించింది. ఆవిడ ఏమన్నదంటే "నీకన్న అంద వికారి సృష్టిలో ఉండదు. నీవు నవ్వితే నవ్వురెయొక్క అందము కూడా చెడిపోతుంది. ఆ చెడిపోవటము ఎట్లా ఉంటుందో చూద్దా"మని. లోకంలో దుర్జనులు క్రూరులు హింసాపరులు ఉంటారు. వాళ్ళు చదువుకుంటే ఏమవుతుందంటే వాళ్ల ఆ గుణాలు కత్తులైతే వాటికి విషం పూసినట్లౌతుంది. వాళ్ల తెలివి తేటలన్నీ వాళ్ళ దుష్టత్వాన్ని అధికము చేసేందుకు వాళ్ళు

చేసే దుర్మార్గాలు ఇతరులకు తెలియకుండా చేసేనేర్పు కలిగిస్తుంది. అందరికీ చదువు చెప్పకూడదు. చదువని దుర్మార్గుల దుర్మార్గత్వమే చాలు. సరే కానియ్యి. ఇదిట్లా ఉండగా సిగ్గు విడిచి చెబుతున్నాను. ప్రయోజనము లేదని తెలిసి చెబుతున్నాను. సరిగ్గా ఇల్లాగే ఉంటుంది. ప్రయోజనము లేకండా పనులు చెయ్యటమంటే. పాప మా సోమనాథము బ్రాహ్మణుడు. శాకాహారికి మాంసాహారికి భేదము పాటిస్తున్నారు కదా ! ఈ భేదము ఎందుకు పాటించాలి ? అందరూ మాంసమెందుకు తినకూడదు ? తినేట్టు చెయ్యాలి. అక్కడ దయ ఎందుకు ? కొందరు పందిమాంసము తినరు. గొడ్డు మాంసము తినరు. మనము గొడ్డు మాంసము తినము. మాదిగ వాళ్ళు తింటారు. చచ్చిన గొడ్డు మాంసము కూడ తింటారు. అందుచేత వాళ్ళకి మనకీ ఏమి సంబంధము లేదు. మనకూ మనకూ పొత్తు కుదురదు. వాళ్లంటే మనము చాలా తక్కువగా చూస్తాము. వాళ్ళూ మన్ని అలాగే చూస్తారు. నీవు ఇక్కడికి వచ్చిన తర్వాత మంచీ చెడ్డాలేకండా అన్నిమాంసాలు తింటున్నావు. నేను తినటము లేదు. నీకు నా మీద కోపము లేదే. ఈ మాంసాలు తినలేదని సోమనాథశాస్త్రిమీద ఎందుకు కోపము? ఆ జీవుడు ఎప్పుడూ మాంసము తినేవాడే కాదాయె అంతదాకా ఎందుకు ? ఉల్లిపాయలు తినని వాళ్లు ఉన్నారు. వాటిని దగ్గరకు రానీయరు. కొందరికి ఇంగువ వేస్తేనే పనికి రాదు. ప్రక్కన ఎవడో ఉల్లిపాయ తింటుంటే వాడికి డోకు వస్తుంది. కొందరలవాటు చేసికొంటారు. కొందరు చేసికోరు.

నీవు సిగరెట్లు కాలుస్తావు. నాకది ఏమీ పడదు. అయ్యో చుట్ట కాల్చేవాడు. నేను అన్నము డోక్కోనేదాన్ని. ప్రక్కన కూర్చొని ఒకడు మాంసము తింటూఉంటే మాంసము తినని వాళ్లు ఏమీ ఓర్చుకోలేరు. ఇంకా దూరముపోతే రెండు వంటలు ఒకడేచేస్తే వీడికి కూరలొడ్డిచ్చినా వీడు తినలేడు. ఇవన్నీ మనసుయొక్క సౌకుమార్యపు లక్షణాలు. మీ నాగరకత పూనిన వైరం మనుష్యులమీద కులాలమీద కాదు. మనస్సు యొక్క సౌకుమార్యంమీద. సూక్ష్మమైన జీవిత రహస్యాల మీద. నాకు సోమనాథశాస్త్రి అంటే మొదట గౌరవంగా ఉండేది. అతడు మన ఇంట్లో పడే బాధలను చూస్తే క్రమంగా జాలివేసింది. అయ్యో అతడు పేదవాడవటం మూలంగాకదా ఈ ఇక్కట్టులు పడుతున్నాడనిపించింది. తరువాత అతడు మనయింట్లో అన్నింటికి లోబడేటప్పటికి నా కతడంటే ఏవగింపు కలిగింది. కాని అతను నిస్సహాయుడవటం మూలంగా మళ్ళీ జాలివేసింది. ఇంతలో నాకు రెండు విషయాలు తెలిసినవి. అతన్ని నీవు ఇక్కడికి తీసికొని రావటానికి కారణం నన్ను తనకిచ్చి పెళ్ళిచేద్దామని—అనుకున్నది ఒకటి. రెండవది అతనికి నెలజీతము వచ్చేటప్పటికి అతడు స్వాతంత్ర్య మవలంబించాడన్నది. స్వాతంత్ర్య మవలంబించేటప్పటికి నా కతనిమీద గౌరవము కలిగింది. వీ ప్రయత్నము తెలిసేటప్పటికి నా కాశ కలిగింది. అతనిమీద ప్రేమ కలిగింది. ఒక బ్రాహ్మణ స్త్రీ నిన్ను పెండ్లిచేసికొన్నది. ఒక బ్రాహ్మణుడు నన్నెందుకు చేసికో

కూడదు. పైగా నాకతడు అలభ్యుడు కాడనిపించింది. ఎందు చేతనంటే ఒకప్పుడొక దానికి జొరబడ్డవాడు మరొకప్పుడు ఇంకొక దానికెందుకు జొరబడడు ? నా ప్రేమలో జాలి ఎక్కువగా ఉన్నది. అయ్యో వీరు దారిద్ర్యాన్ని గురించి ఏమీ లెక్క చెయ్యరే ? మనుష్యులుపడే కష్టాలంటే వీరు ఏమీ లెక్కచెయ్యక వాడు పెద్దకులమువాడు గనక వాడనుభవించా ల్సిందే ! వారేం చేశారు ? ఒకవేళ చేస్తే వాళ్ళపూర్వులు చేశారేమో ! దానికి వారిదేమి బాధ్యత ? ఇంగ్లీషులో ఉన్నదే తండ్రి పాదాలవచ్చి కొడుక్కి తగులుతవి అని. ఆ సిద్ధాంతము ప్రకారమా ? లోకంలోఉన్న ఇన్ని భేదాలు అని ఇన్ని అన్యాయాలు వీటిని గురించి పట్టించుకొనేవాళ్లు లేరే? కులభేదాలు పోతే అన్నీ పోతవి అని మతభేదాలు పోతే అన్నీ పోతవి అని నా కర్థంకాలేదు. మన ఊరి ప్రక్కని ఊళ్లో—ఆ ఊరు పెద్దది చిన్న పట్టణ మంతది. హిందూమతంలో చాలా భేదాలు ఉన్నవి. క్రైస్తవ మతంలో లేవని వాళ్లు చెప్పటం మనవాళ్ళు చాలామంది క్రైస్తవ మతము పుచ్చుకోటము జరిగింది. కొన్నాళ్ళయిన తర్వాత ఏమైందంటే చర్చిలో కూడ తెల్లవాళ్లు వేరు, నల్లవాళ్లు వేరు అయినారు. ఈ అవమానము భరించలేక దేశీయుడైన క్రైస్త వులు నల్లచర్చీ అని వేరే కట్టుకొన్నారు. అమెరికాలో నీగ్రో లందరూ క్రైస్తవులే. ఆఫ్రికాలో ఉన్న దేశీయులందరూ క్రైస్తవులే. పత్రికలలో ఉన్న వార్తలనుపట్టి చూస్తే అందరూ ఒకటే నన్నట్లు కనిపించటము లేదే ! వదినె చెప్పింది క్రైస్తవ

మతంలోనే కొన్ని వందల భేదాలున్నవట. అమెరికాలో తెల్ల వాళ్ళు వెళ్ళే పూటకూళ్ళ బసలకు నల్లవాళ్లు వెళ్లకూడదట! మరి—అందరూ ఒకటేమిటి? ఉన్న భేదాలు పోయేవరకు ఆ భేదానికి సంబంధించినంతవరకు ఈ ఉద్యమాలు. క్రొత్తభేదాలు పుడుతూనే ఉన్నవి. ఇప్పుడు బ్రతికిఉన్న వాళ్ళల్లో ఈభేదాలు తీసివేస్తామనే అనుకొందాము. ఇంకో యాభై యేళ్ళో వంద యేళ్ళో పోయిన తర్వాత ఇంకెవడో వస్తాడు. మళ్ళీ భేదాలు పెడతాడు. ఈ భేదాలు కాకపోతే ఇంకో మోస్తరు భేదాలు పెడతాడు. భేదాలెందుకుండ వన్నయ్యా? ఆంధ్రప్రభ చదువు తుంటాను నేను. మన కృష్ణానది అక్కడెక్కడో మహారాష్ట్ర దేశముపైన పుట్టి బందరు దాకా ప్రవహిస్తున్నది. బెజవాడ దగ్గర ఆనకట్ట కడితే ఆ ప్రాంతాలనంతా తెగ పండిస్తున్నది. మహారాష్ట్రులు పైన ఆనకట్ట కడతారట. కృష్ణాజిల్లా వాళ్ళే మౌతారు? చిక్కాకురా మిడతంభొట్లు అన్నట్లౌతుంది. భేదాలు తీసి వేస్తావు? అందరికి కూడు గుడ్డ పెట్టు చాలు. ఇందులో మళ్ళీ కులభేదాలు చేయకు. బంధువుల కుద్యోగా లివ్వటం తక్కిన వాళ్ళకు లేదు పొమ్మనటం చేయకు. వీళ్ళ తరహా అంతా చూస్తే నాకేమనిపిస్తున్నదంటే నడిమి కులాల వాండ్లు సంఖ్యా బలముచేత అధికారాల్లోకి వచ్చారు. అందరూ సమానమే అన్న సిద్ధాంతముతో పై కులాల వాళ్ళని కిందకు లాగాలి. అట్టడుగున ఉన్న కులాలున్నూ ఈ నడిమి కులా లున్నూ మళ్ళీ సమానము కాదు. ఆలోచన చేయరు కాని

అన్నయ్యా ! సమానత్వమనేది ఈ సృష్టిలో లేదు. ఇది వదినె చేసిపెట్టిన సిద్ధాంతము. దీన్ని కాదనటము బ్రహ్మాతరము కాదు. ఇంక ఏమిటయ్యా అంటే ఆ వదినె వట్టి దౌర్భాగ్యురాలు. ఈ మంత్రులు నాయకులు అందరూ తనవంటి వాళ్ళే నంటుంది. వాళ్లు చెప్పేది వేరు చేసేది వేరూనట. పైగా పై దోషాలన్ని వాళ్ళదగ్గరే వున్నవట. ఇక నేను సోమనాథ శాస్త్రినే ప్రేమిస్తున్నాను. ఇంకొకణ్ణి పెండ్లి చేసికోను. అతడు నన్ను చేసుకోడు. నేను ఆకారముచేత కోతిని. రంభవచ్చి ఒర్రిగించే దేమిటో నాకు తెలియదు. నేను స్త్రీనే. నేను మాల పడుచునైతే అతనిదివరకే చెడిపోయినాడు. నే నెట్లాగూ బ్రతకను. అతని భార్య ననిపించుకొందామని ఉన్నది. అతనికి ఇష్టము లేదు" రేణుక.

# 5

ఈ సృష్టి ఎట్లా జరిగింది అన్నది ప్రశ్న. ఇతర దేశాలల్లో అనేక సిద్ధాంతాలు ఉన్నవి. ప్రధానంగా హిబ్రూ వాళ్లు చేసిన సిద్ధాంతము ఉన్నది. అది ఒక్కటే మిగిలియున్నది. వాళ్ళు బైబులు అన్న ఒక గ్రంథము వ్రాశారు. ప్లక్ష ద్వీప మనగా నేటి ఆసియా మైనరు జార్డర్ అనిపించుకొనే దేశాలు. ఆ ప్రాంతాలలో వాళ్ళు ఉండేవాళ్లు. వాళ్లు పెద్ద రాజ్యాలు చేసిన వాళ్ళేమీ కాదు. వాళ్ళల్లో అనేకమంది ప్రవక్తలు పుట్టారు. వాళ్ళు ప్రతివాళ్లు తమకు తోచిన సిద్ధాంతాలు వ్రాయటము నీతులు మతమునకు సంబంధించిన విషయాలు వ్రాసి అట్టే పెడుతూ ఉండేవాళ్లు. సుమేరు దేశమువాళ్ళు అక్షత (అక్కడ్) దేశమువాళ్ళు ఇస్సీరియా (అసురులు) దేశము వాళ్ళు ఇలాంటివాళ్ళు చాలామంది పెద్దపెద్ద రాజ్యాలు నిర్మించారు. పంటలు పండించారు. క్షత్రియులు రథాలు యుద్ధాలు కవచాలు ధనస్సులు ఈ గోలంతా ఉన్నది. పురో

హితులు దేవాలయాలు పూజలు పురస్కారాలు ఈ తతంగ మంతా ఉండేది. మరిన్నీ కమ్మరులు కుమ్మరులు పద్మశాలీలు ఇలాంటి వృత్తులన్నీ ఉండేవి. రాజ్యాంగాలు రాయబారాలు సంధి విగ్రహాలు ఇప్పటి ప్రపంచములో ఎంత హంగామా ఉన్నదో అంత హంగామా ఆ దేశాలలోను ఉండేది. ఈ హంగామా అంతా భారతదేశములోను అనాదినుంచి ఉన్నది. ఒక దేశము సుభిక్షమయితే జనసంఖ్య ఎక్కువైతే మానవులు బ్రతకటానికి గుడ్డ గోచి పాఱ పలుగు కావాలి ఎప్పుడు ఏది కావలిస్తే మానవ బుద్ధి దానిని నిర్మించుకుంటుంది. నూటికి కోటికి ఒక విశేష విషయము ప్రాదుర్భవించుటతప్ప సామాన్య జీవితానికి కావలసిన పరికరాలన్నీ సహజంగానే మానవుడు నిర్మించుకొంటాడు. వ్రాయటం నేర్చుకొంటాడు. కాగితాలు లేకపోతే ఆకులమీద వ్రాస్తాడు. చెట్ల పట్టలమీద వ్రాస్తాడు. శిలలమీద వ్రాస్తాడు. శిలలమీద వ్రాస్తే శాశ్వతంగా ఉంటుం దనుకొంటాడు. అందుకనే మనదేశంలో అది శిలా శాసనంగా ఉండిపోయింది అని అంటారు. లేకపోతే కుండ పెంకులమీద వ్రాస్తాడు. ఆ హిబ్రూలు వాళ్ళ ప్రవక్తలు వ్రాసిన గ్రంథా లను భద్రంగా దాచి అట్టిపెట్టుకొన్నారు. ఆ హిబ్రూ జాతి యొక్క ప్రత్యేక వైలక్ష్య మిదొక్కటే. పాశ్చాత్యులు వ్రాసిన అనాది నాగరకతలను గూర్చిన కథలు చదివితే వాళ్లు చేసిన పరిశోధనలను చూస్తె ఇంతకంటె విశేషమేమీ ఉండదు. యూఫరతీశనది త్రిగిరీశనది (టైగ్రిస్) ఈ రెండునదుల నడిమి

దేశము. అటు నిటుగల దేశాలు పూర్వము జన సమ్మర్ధముతో కూడియుండేవి. ఆ నదులయొక్క వరదలు పట్టటానికి వీలు లేదు. ఆ నదులు నేటి చైనా దేశములో ఉన్నవి. వాటి వరదల కవధిలేదు. సంవత్సరానికి రెండు మూడుసార్లు వరదలు వస్తవి. పంటలు పాడుచేస్తవి. అందుచేత చైనాదేశము ఎప్పుడూ సుఖితంగా ఉండదు. పండించే దానికంటే పాడుచేసే దెక్కువ. ఆ హిబ్రూ జాతి ప్లవ ద్వీపంలో నదుల ఈ వరదల ఒత్తిడిలేని ఈ ప్రాంతాలలో ఉండేది. ఆ జాతి ఎప్పుడు జానిసలే ఇలా ఉండగా యూపరతీశనది తెగ పొంగివచ్చేది. ఒకప్పుడా సర్వ దేశాన్ని నాశనం చేసింది. అదే ప్రళయమనుకొన్నారు. అందులో కొందరు మిగిలారు. అదే సృష్టికి మొదలను బైబులు కథ అక్కడ మొదలు పెట్టింది. ఈ కథకు పునాది ఉన్నది. మన పురాణాలలో ఉన్నది. ఒక మనువు నదిలోకి స్నానానికి వెళ్ళాడు. ఒక చేప నన్ను రక్షించమన్నది. ఆయన తన చెంబులోకి తీసికొన్నాడు. ఆ చేప పెరిగి తన కా చెంబు చాలదన్నది. ఒక బిందెలో వేశాడు. అది ఇంకా పెరిగింది. అక్కడ నించి తీసికొని వెళ్ళి చెరువులో వేశాడు. అది ఇంకా పెరిగి "అయ్యా ప్రళయము వస్తున్నది సముద్రము పొంగుతుంది. ధాత్రినంతా ముంచి వేస్తుంది. నీవు నీ భార్య అన్ని జంతువుల స్త్రీ పురుష ద్వంద్వములు ఆహార పదార్థాల సన్నసన్నని బీజాలు అన్నింటిని నమూనాలుగా పట్టుకొని నామీద ఉండు. ప్రళయ సముద్రము తీసిన తర్వాత నీవు మళ్ళీ భూమిమీదికి

వెళ్ళి అన్నింటిని వృద్ధి పొందింతువు కాని" అన్నది ఆ చేప. ఆయన అట్లా చేశాడు. ఈ కథే ఆ దేశాలల్లో వ్యాపిస్తే ఆ బైబులు వ్రాసిన పూర్వులు ఆ సుమేరు దేశంలో వచ్చిన యూఫరటీశనదియొక్క పెద్ద పొంగు ప్రళయమనుకొని ఈ కథను నిర్మించుకొన్నారు. అందుచేత బైబిలులో చెప్పిన ఆ ప్రళయము సృష్టికి మొదలనుకొన్నారు వాళ్ళు. ఆ హిబ్రూ జాతిలోనే యేసుక్రీస్తు పుట్టాడు. ఆ మతము వృద్ధి పొందింది. యూరపు దేశమంతా ఆక్రమించింది. కడచిన నాలుగైదు వందల యేండ్లుగా ఆ యూరపు దేశీయుల జాతకాలు బాగా ఉన్నవి. ఎక్కడికి వెళ్ళినా వాళ్లదే గెలుపు. వాళ్ల ఆశకు అవధి లేదు. ప్రపంచాన్నంతా నూరుక త్రాగుదాము అనే దురాశ మన పురాణాల్లో ఉండే రాక్షసులయందు కనిపిస్తుంది. తరువాత ఈనాటి యూరపియనుల యందు కనిపిస్తుంది. తమ దగ్గర అధికమైన మారణాయుధాలు ఉన్నవి. వాటిని ఉపయోగించే నేర్పు బాగా నేర్చుకొన్నారు. మన నాగరకతకంటె గొప్ప నాగరకత సృష్టిలో ఉండదు. మన మతముకంటె గొప్ప మతము సృష్టిలో ఉండదు. ఈ రెండు అహంకారాలు వాళ్ళ దగ్గర నూటికి నూటయాభై పాళ్ళు ఉన్నవి. అబద్ధాలు, అన్యాయాలు, దౌర్జన్యాలు, క్రౌర్యాలు, మోసాలు, ఎదటివాడు పెరిగితే తరగటాలు, తరిగితే పెరగటాలు మొదలైన గుణాలకు వాళ్లు పుట్టిన ఇండ్లు. అమెరికాని సంపూర్ణంగా ఆక్రమించారు. ఆస్ట్రేలియాలోని అనాది జాతులను సర్వనిర్మూ

నంచేసి పారవేశారు. ఆఫ్రికాలోని నల్ల జాతులను పీల్చి పిప్పి చేశారు. పాపము వాళ్లకి ఒక్క భారతదేశమే కొలుకుడు పడలేదు. ఎన్నెన్ని మతాలని ధ్వంసం చేశారు. బుద్ధిమంతులైన వాళ్లు ఒకటి ఊహించాలి. సృష్టి యందంతా భగవంతుడు నిండి యున్నాడు అనేది ఒక సిద్ధాంతము కాదు. భగవంతుడెక్కడో ఉన్నాడు. వాడొక్కడే. ఒక్కడో ఇద్దరో అదట్లాఉంచి భగ వంతుడు వేరే ఎక్కడో: ఉన్నాడు. ఇది ఒక సిద్ధాంతము. ఈ రెండు సిద్ధాంతాలలో దేనియందు సామంజస్యము ఉన్నది ? భగవంతుడున్నాడు లేదు అది అట్లాఉంచి ఉన్నాడా లేడా అన్న ప్రశ్న ఎప్పుడు పుట్టింది ? ఎందుకు పుట్టింది ? ఎక్కడ పుట్టింది ? ఎల్లాగు పుట్టింది ? మనుష్యునితో పుట్టింది. మను ష్యుడు ఆలోచనాపరుడు. మనుష్యుడే ఈ సృష్టిలో లేకపోతే భగవంతుడున్నాడా లేడా అన్న ప్రశ్న లేదు. భగవంతుడు ఆలో చనచేత పుడుతున్నాడు గనక భగవంతుని స్థితి ఎక్కడఉన్నది? ఆలోచనలో ఉన్నది. ఆలోచన చేయగలవాడు మనుష్యు డొక్కడే. అందుచేత భగవంతుడు మనుష్యునితో పుట్టాడు. మనుష్యుడు లేకపోతే భగవంతుడు లేడా ? ఉన్నాడో లేడో ఎవడికి కావాలి ? చెట్లు పండ్లు పండుతున్నవి. తినేవాడున్న ప్పుడు దాని ఆహారత్వ లక్షణము. అడవిలో ఎన్ని చెట్లు పండు తున్నవి కావు, రాలిపోతున్నవి కావు ఎండిపోతున్నవి కావు ! అలాగే భగవంతుణ్ణి గురించి ఆలోచించి నిర్ణయించే మతము

మతముగాని గొడ్డుగా నమ్మే మతము మతమేమిటి? అసలు భగవంతుణ్ణి గురించి ఎందు కాలోచించాలి ? ఆలోచించేవాడు మనుష్యుడు గనక వాడి ఆలోచనంతా వాడి పరిస్థితుల మీద ఆధారపడి ఉంటుంది. సర్వమైన ఆలోచనా పరిస్థితులపైననే ఉంటుంది గనక ఆలోచనయొక్క స్వరూపమే అది గనుక. కుజగ్రహము ఉన్నది. అది మనకెంత దూరాన ఉన్నది అన్న ఊహ ఎందుకు వచ్చింది ? దూరము దగ్గరతనము అనే రెండు విషయాలు మనము చూస్తున్న వస్తువుల నడుమ కనిపిస్తున్నవి. ఈ భావాన్ని తీసికెళ్ళి కుజగ్రహమునకు సంబంధింప చేశాము. ఆలోచన అంతా ఇంతే. ఇప్పుడు భగవంతుణ్ణి గురించి ఎందు కాలోచించాలి ? మానవుడు సర్వకాలమునందు బ్రతికి ఉండా లని ఊహిస్తాడు. వీడికి సాధ్యము కావటములేదు. మరణము తటస్థిస్తున్నది. ఆకాశములోనికి ఎగురుదా మనుకొంటాడు. ఎగరలేడు. శత్రువుని గెలుద్దామనుకొంటాడు వాడే గెలుస్తు న్నాడు. పది పుట్లు పండిద్దామనుకొన్నాడు. వఱద వచ్చి కొట్టుకపోయింది. చేనుకు చీడపట్టింది. ఇలా జీవితము జీవిత మంతా మానవునకు తాననుకొన్నట్లు సాగటము లేదు. అన్నీ ప్రతిబంధకాలే వస్తున్నవి. కొన్ని ప్రతిబంధకాలను తాను సర్దుకో గలిగినా ఎక్కువ ప్రతిబంధకాలను తాను తట్టుకోలేక పోతు న్నాడు. నది పొంగిపస్తే తానేమి చేయలేడు. పెద్ద ఝంఝా మారుతాన్ని తా నడ్డుకోలేడు. సముద్రములో లేచిన తుపాను

నకు తన మోకాటిని అడ్డము పెట్టలేదు ఆకాశమునందుండి నిప్పులు కురుస్తుంటే వేడి పాలను ఉఫ్ ఉఫ్ అని ఊది చల్లార్చు కున్నట్లుగా చల్లార్చుకోలేదు. ప్రతి పదమునందు ఇలాంటి అభ్యంతరాలు అనంతములుగా ఉన్నవి. కనుక మానవుడు ఆలోచించాడు. తనకంటె అధికమైన శక్తి ఈ సృష్టిలో ఏదో ఉన్నది. అది ప్రకృతియా అంతకంటె ఇంకొకటియా ? ప్రకృతి అయితే ఆ ప్రకృతికి ప్రాణము లేకపోతే ఆ ప్రకృతిలో చైతన్యము లేకపోతే అది వట్టి జడమైతే గ్రుడ్డివేటుగా ఉండవలె గాని ఒక పథకం ప్రకారము సాగకూడదు. ఈ జరిగే అన్నింటి వెనుక ఒక పథకం ఒక ఊహ ఒక నియమము ఒక విలక్షణత్వము కనిపిస్తూ ఉన్నవి. ఒక వివేకము లేకుండా ఇది ఇట్లా జరిగేటట్లు కనిపించటంలేదు. బజారు ఇక్కడికి ఒక మైలు ఉన్నది. ఎవణ్ణో ఒక పనిమీద అక్కడికి పంపించాము. వెళ్లేందుకు పది నిమిషాలు వచ్చేందుకు పది నిమిషాలు. ఆ పనియొక్క స్వభావాన్ని పట్టి పది నిమిషాలు వాడర గంటలో వస్తాడని లెక్కవేశాము. వాడు రాలేదు. ఎందుకు రాలేదా అని ఆదుర్దాపడ్డాము. చైతన్యముతో ఆలోచనతో ఒక పథకంతో చేసేపనియొక్క స్వరూపము ఇలా ఉంటుంది; మనము పంపించాము. దూరాన్ని కాలాన్ని మనుష్యుని యొక్క నడకవేగాన్ని ఆ పనికి చేయటానికి పట్టే సమయాన్ని లెక్కకట్టాము. ఇది పథకమంటే. ఇలాంటి పథకము సృష్టిలో కనిపిస్తున్నది. కనుక ఈ సృష్టి

వెనుక మనకు కనిపించని వాడొకడున్నాడు. వాడు సర్వజ్ఞుడు. వాడు సర్వశక్తిమంతుడు. ఈ రీతిగా భగవంతుడు నిర్ధారితమైనాడు. అప్పుడు భగవంతుడు ఎలా ఉన్నాడు అన్నది ప్రశ్న. వాడి ఆకారమెల్లా ఉంటుంది అన్నది ప్రశ్న. వాడు మనకు కనపడటములేదు. వాడు వట్టి శక్తియా పురుషుడా స్త్రీయా నిర్ణయించటానికి వీలులేకుండా ఉన్నది. వాణ్ణి గురించి మానవుడెందు కూహించాలి ? తన అశక్తతచేత. తన అశక్తత ఎల్లా తెలుస్తున్నది ? పరిస్థితులచేత. ఒక వరద ఒక ఝంఝ ఒక తుపాను ఒక ఒక అగ్నివర్షము ఇవి ఒక జాతి. ఇంకొకజాతి అభ్యంతరాలున్నవి. అనుకున్నది. అనుకున్నట్లు కాకపోవటము, ఆ ఊరు వెళదామనుకొంటుంటే ఆ నడుమ మనము ఎరుగని ఒక నది ఉండటం. వాడు తప్పకుండా వస్తాడనుకున్న వాడు రాకపోవటము. వెళ్ళదామనకొంటే తీరా వెళ్లటానికి వీలులేని సంఘటన లేర్పడటం. పెండ్లికి ముహూర్తం పెట్టి అన్నీ సిద్ధము చేసికొంటే మైలరావటము. ఇవి ఒక జాతి అభ్యంతరాలు. వాయువు అగ్ని జలము మహాశక్తివంతములై అవి భగవన్మయములు అనుకొందామంటే ఈ పరిస్థితులమాట ఏమి చెప్పాలి ? కనుక ప్రపంచంలోఉన్న పరిస్థితంతా నడక అంతా భగవన్మయం కావలె. ఆ భగవంతుడు చైతన్య పూర్ణుడని ఇందాకటి ఆలోచన వలన తేలినదికదా ! ఆ చైతన్యము మనలో ఉన్నది కదా ! మానవులలోనే ఉన్నదా ? జంతువు

లలో ఉన్నది. కుక్క కట్టనుచూచి పారిపోతుంది. అదలిస్తే పశువు తొలగిపోతున్నది. ఇది చైతన్యమే కదా! విత్తనములో నించి మొక్క వస్తున్నది పెరుగుతున్నది పూస్తున్నది కాస్తు న్నది. ఇది చైతన్యమే కదా! చైతన్యము! భగవంతుని యొక్క స్వరూపమయితే సర్వ సృష్టియందు భగవంతుడు నిండియున్నా డనటానికి అభ్యంతరమేమీ ఉండకూడదు. కాని భిన్న స్థలా లల్లో ఉండే భిన్న చైతన్యాలకుండే శక్తులలో తారతమ్యాలు ఉన్నవి. అవి ప్రకటింపబడే లక్షణాలల్లో కూడా తారతమ్యా లున్నవి. అగ్ని మండిస్తుంది. వాయువు ఎగర గొడుతుంది. జలము ముంచివేస్తుంది. మనుష్యుడు వాడి పరిధిలో ఉన్న పను లను ఇలా సాధిస్తానని నూటికి తొంభై పాళ్లు సాధిస్తాడు. తక్కిన పది పాళ్లు సాధించలేడు. అది దైవాధీనమైన వ్యవహారము గనక. మానవుడు తొంభై పాళ్లు సాధిస్తాడనటంలో మానవుడు అన్నది సమష్టిమీద అన్న మాట. ప్రతి మానవుడు అని అర్థము కాదు. వేయిమందిలో ఒకడు అని అర్థము. ఇంకొక మాట చెప్పాను. తన పరిధిలో అన్నమాట. ఎలగ్జాండరు పెద్ద విజేత ఆసియా ఆసియా అంతా గెలిచాడు. భారతదేశానికి వచ్చాడు. చావచితకబాదారు ఇక్కడివాళ్ళు. పారిపోయినాడు, దిగులు పడి మృతి నందివాడు. కనుక ఏమైంది ? ఇది ఇలా ఉండగా ఈ దేశాన్ని గెలిచినట్లు వ్రాయించుకొన్నాడు. ఒక దుష్కా లం వచ్చేటప్పటికి దానిని నిజమనుకునే వాళ్లు బయలుదేరారు.

భగవల్లీల ఇట్లా ఉంటుంది. ఎక్కడ ఎప్పుడు ఏది ఎందుకు ఎలా జరుగుతుందో తెలియదు. ఇలాఉన్న ఈ పరమ రహస్యాన్ని భగవంతుడనుకోటములో వాడు సర్వ సృష్టియందు నిండి ఉన్నాడనుకోటములో మూడు కాలములయందు ఉన్నాడను కోటములో తప్పేమున్నది. తప్పు కాదు సరికదా అది వివేక లక్షణము. వివేకము మానవుని లక్షణము. వివేకమైన కొద్ది మానవత్వము తక్కువైనదని అర్థము. తాను సరిగా ఆలోచించలేదు సరిగదా తన ఆలోచనే పరమ ప్రమాణ మనుకొనే వాడు అడవిలో అన్ని జంతువులను చంపుతున్నాం కదా అనే ధైర్యముతో పెద్దపులిపోయి కొండసిలువ నెదిరించి నశ్లొతుంది. ఆ కొండసిలువ ఎక్కడి కక్కడికి బిగించి ప్రాణాలు లాగి పార వేస్తుంది. పెద్దపులిని గూడ సంహరింపగల కొండసిలువ గోరిల్లా మీదికి పోరాదు. గోరిల్లా దానిని చీల్చి కుప్పలు పెడుతుంది. ఎందుచేత ? పెద్దపులిలో చైతన్యము అఖండముగా ఉన్నది బలము ఉన్నది శక్తి ఉన్నది. లాఘవము ఉన్నది. కొండ సిలువలో ఈ శక్తులన్నీ ఇబ్బడిగా ఉన్నవి. ఈ రెంటిలో కూడ అధికమైన వివేకము లేదు. గోరిల్లాలో ఈ శక్తులతో పాటు వివేకము ఉన్నది. ఆ కొండసిలువను ఎక్కడ పట్టు కొంటే దానిప్రాణాన్ని స్తంభింప చేయవచ్చునో తెలిసికొనే తెలివి ఉన్నది. సృష్టిమీద ఉండే జంతువులలో ఈ వివేకము పరమాధికంగా ఉన్నది మనుష్యునిలో. అందుచేత వీడు

జంతువు లన్నింటిలో అధికుడు. కాని ఈ వివేకము మానవు లలోనే అనంత తారతమ్యాలతో ఉంటుంది. కొందఱకు వివే కమే ఉండదు. కొందఱ కధికమైన శక్తి ఉంటుంది. కొందరు క్రౌర్యమే ప్రధానంగా బ్రతుకుతారు, కొందరు తమకున్న అధికార బలముచేత అవివేకు లౌతారు. మానవుడై ఊహించ గలశక్తి ఇంతకంటె అధికంగా సృష్టిలో ఉండటానికి వీలు లేదు అన్న లక్షణము ఆధునిక జగత్తులో భగవత్పాదులైన శ్రీ ఆదిశంకరులకు మాత్రమే ఉన్నది. తక్కిన అన్ని ఊహాలు ఏ కొంచెమో లోచ్చే. జగత్తునిండా భగవంతుడు నిండి ఉన్నాడన్న మహా విషయాన్ని యుగయుగాలుగా భారతదేశము నందలి మహర్షులకు తెలిసిన విషయాన్ని సామాన్య జనులాచరిస్తున్న విషయాన్ని విశ్వసిస్తున్న విష యాన్ని ఇక్కడనించి జనము ఈజిప్టుకు ఇస్సీరియాకు సుమేరు దేశానికి అక్షత దేశానికి ప్లక్ష ద్వీపానికి తరలిపోయిన జనము యొక్క మనస్సులలో రూఢమైనదాన్ని మహా వేదాంత విద్యా విజ్ఞాన పరమ క్షీరాంబోధియైన శ్రీ శంకరులు మళ్ళీ నిరూపించి చూపించారు. ఈ గడ్డలో పుట్టిన ఈ విజ్ఞా నపు వాదనతో ప్రపంచమంతా వెళ్ళి ఆక్రమించి రాజ్యాలు నిర్మించుకొన్న ఆ పూర్వప్రజలు సృష్టి అంతా భగవన్మయ మనుకొని అధికమైన చైతన్యము అధికమైన శక్తి ఎక్కడ కనిపిస్తే అక్కడ మూర్తి కల్పనచేసి భగవంతుడిగా ఆరాధి స్తే

తప్పా ? వాళ్ళు అవివేకులా ? నీవు ఎవడవో నిర్ణయించి చెప్పలేని ఒక భగవంతుడున్నాడని చెప్పి వాడే భగవంతుడని విశ్వసిస్తే ఒప్పా ? మానవుడి ప్రవర్తనను గురించి చెప్పిన వాడు స్మృతికర్త. మానవుడి యొక్క ఆత్మను గురించి చెప్పినవాడు మతకర్త. సర్వ సృష్టియందు పరమేశ్వరుని మహాత్మ్య మున్నదని చెప్పినవాడు మహర్షి. ఈజిప్టు ఇసీరియా, సుమేరు, అకుత మొదలైన పూర్వజాతుల విశ్వాసము భారతజాతియొక్క విశ్వాసం—

6

ఇలాంటి మహా మతము ఉంటే ఏ మతమూ దాని అంతట అది ఉండదు. దాన్ని ఆచరణలో పెడతాడు మానవుడు. పురుషునకు భార్యఅంటే ప్రేమ. ప్రేమ ప్రేమగా ఉంటుంది ? ఉంటే ఉందో లేదో తెలియదు. ఆ ప్రేమ ఆవిష్కరింపబడుతుంది. పడ్డప్పుడే ఆ ప్రేమయొక్క స్వరూపము తెలుస్తుంది. ఆ ఆవిష్కరింప బడటములో బహిఃపరిస్థితుల ననుసరించి ఆవిష్కరింపబడుతుంది. వాడి దగ్గర నాలుగు లక్షలుఉంటే రెండువేలు పెట్టి పెళ్లానికి రవ్వల ఉంగరము చేయిస్తాడు. వాడికి నెలకు రెండువందల జీతమైతే ఒక నలభై రూపాయలుపెట్టి రాళ్ళ ఉంగరం చేయిస్తాడు. హిందూ దేశములో ఉంగరాలు చేయిస్తారు. నగలు చేయిస్తారు. యూరపులో గౌనులు కుట్టిస్తారు. ఆఫ్రికాలో ముంజేతి దగ్గరనుంచి మణికట్టుదాకా దంతపు కడియాలు చేయిస్తారు. ప్రేమ ప్రేమే. ఆవిష్కరణ స్వరూపము దేశాలనుపట్టి,లభించే వస్తువులనుపట్టి, ఆచారాలనుపట్టి అలవాటు

లనుపట్టి భేదిస్తుంటుంది. కొంచెము వెనక్కు వెళ్ళి వాదిస్తే వీటిని బట్టి ఆ ప్రేమకూడ వికారము పొందుతుందా ! అంటే పొంది తీరాలి. ఎందుచేతనంటే-ఒక పొలముఉన్నది. ప్రతి సంవత్సరము దానిలో వరివేస్తావు. పండుతూ ఉంటుంది. ఆపొలానికి ఈ వరికి ప్రమాణము సరిపోతుంది, ఆ పొలములో ఉన్న సారాన్ని ఈ వరిపంట మళ్ళీ వచ్చే ఏడాదిలో ఆ పొలము దీనికి పనికిరాదు అనటానికి వీలులేనంత గ్రహిస్తుంది. ఈ సంవత్సరము ఆ పొల ములో చెఱకు వెయ్యి. ముందునాటికి మళ్ళీ చెఱకు వెయ్య టానికి వీలులేదు. మళ్ళీ వరి వేసుకోవాలి. ఎందుకంటే ఆ భూమిలో ఉన్న సారాన్ని చెఱకు ఎక్కువగా లాగివేస్తుంది. అంటే పండే పంటనుబట్టి భూమియొక్క సారము వికారము పొందుతున్నదని అర్థము. అలా ప్రేమకూడా వికారము పొందుతుంది. వికారము పొందుటమంటే దానిశక్తి లోపించ టము వస్తువు మంచిదైనా ఉపయోగించే పద్ధతివలన చెడి పోతుంది. ఇలా సర్వ జగత్తునా నిండి ఉన్నటువంటి పరమేశ్వర భావము, అది అల్లా నిండిఉన్నదని తెలిసికొనటము, మహావిష యమే. ఆ విషయాని కెప్పుడూ భంగములేదు. కాని ఆచరణ లోనికి వచ్చేటప్పటికి ఆచరణ నానా దుష్ట మార్గాలను అవలం బించేటప్పటికి అసలు వస్తువే చెడ్డదా అనిపించేటంత ఘోరమైన పరిస్థితులు ఏర్పడతవి. ఇదివఱకు చెప్పాను. పరమేశ్వర విభూతి యోగములో భగవంతుడు మాసములలో నేను మార్గశీర్ష మును. ధానుష్కులలో నేనర్జునుడను. ఇలా చెప్పాడు గదా

ఇక్కడ ఒక విషయము ఆలోచించాలి. మనపురాణ కథలన్నిం టిలో మహాధానుష్కు లిద్దరు. రాముడు అర్జునుడు. భగవం తుడు తాను ధానుష్కులలో రాముడేనని చెప్పక అర్జునుడనని చెప్పినాడు. రాముడని చెప్పలేదేమి? సర్పములలో తాను వాసుకినని చెప్పినాడు. ఆదిశేషువునని చెప్పలేదేమి? దాని పేరు విభూతియోగము. అధికమైన పరమేశ్వర శక్తిలో కలసి పోదగినంత లక్షణమునకు వెలిగానున్న మహా విభూతిని చెబు తున్నాడు తప్ప మరొకటి చెప్పటములేదు. ఏది ఏది విభూతి మత్తో అది అది తాను. ఆరాధన చేసేవాడు దీనిని తెలుసుకో వాలి. తెలిసికోకపోతే ధర్మము చెడిపోతుంది. వట్టి విభూతి కలచోట ఆరాధన చెయ్యనక్కరలేదు. అవి పరమేశ్వరుని గుర్తు పెట్టుకోటానికి లక్షణాలు. అర్జునుణ్ణి మనము దేవుడుగా కొల వము. వాసుకి నారాధించము. మనకు మార్గశీర్ష మాసము కంటె పుష్య మాఖ మాసాలు గొప్పవి. పుష్య మాసములో ఉత్తరాయణ సంక్రాంతి వస్తుంది. మాఖమంతా స్నానాలు నక్తాలు చెప్పదలచుకొన్న దేమిటంటే సర్వజగత్తు భగవంతుని చేత నిండియున్నదని తెలిసికొన్నంత మాత్రముచేత చాలదు. ఎచ్చట విభూతి ఉన్నది? దాని నతిశయించి పరమేశ్వర భావ ఆధిక్య సన్నికర్షణలచేత ఆరాధనీయమైన స్థానమేది? ఇక్కడ ఉన్నది తగాదా. మనుష్యుడు సహజముగా అహంకారి. పట్టు దలకలవాడు. అన్నోదకాలు ఉంటేనే వాడికి పట్టుపగ్గాలు లేవు. ఎక్కువ ధనము, ఎక్కువ బలము, ఎక్కువ పరాక్రమము

ఎక్కువ పలుకుబడి, పదిమంది తనమాట వినేవాళ్లు ఉండటము, సులభముగా ఇతరులను చంపగలిగిన శక్తి ఉండటము, ఇలాంటి లక్షణాలు కలప్పుడు జన్మ ఎత్తటంతోటే సహజంగా ఉన్న ఆశ అనే గుణాన్ని తనకున్న ఆయా గుణములయొక్క అతిశయాన్నిపట్టి, దాని ప్రకారము వ్యాపింప చేయటానికి కలిగిన వీలునుపట్టి ఈ ఆశను వ్యాపింపచేసికొంటూ ఉంటాడు. వాడి ఆశకి వాడి అహంకారానికి ఈ దైవభావాన్ని కూడ ఒక సాధనంగా ఉపయోగిస్తాడు. ఇది వాడి చరిత్ర. అయితే ప్రపంచమంతా భగవచ్ఛక్తిచేత నిండిఉంటే గొడ్డుగా భగవంతుడు భగవంతుడనుకోవటము పరమ సామాన్య విషయము. సృష్టిని విభాగించి ఇది సృష్టి ఇది స్థితి ఇది లయము. సత్వరజస్తమో గుణముల వలన కలుగుతున్నది అని నిర్ణయించటము అధిక వివేకము. అందుచేత ఆ ఒక్కడైనా భగవంతుడు ముగ్గురుగా తేలారు. ఇందులో మనుష్యుడు పుట్టటము చావటము రెండూ ఆశ్చర్యములే. మానవ బుద్ధికిగాని శక్తికిగాని అతీతములు. మానవుడు బ్రతికి ఉండటమనేది స్థితిఅని అనుకుందాము తాత్కాలికంగా ఈ స్థితి మానవుడే చేస్తున్నట్లు కనిపిస్తున్నది. పండిస్తున్నాడు, మేడలు కడుతున్నాడు. చదువులు చదువుతున్నాడు, రాజ్యాలు నిర్మిస్తున్నాడు. కనుక మృత్యువునకే ప్రాధాన్యము వచ్చింది. మానవుడు మృత్యువును గూర్చి ఆలోచించినంత జన్మను గూర్చి ఆలోచించడు. ఏదో పుడుతున్నారు పుట్టినరోజు పండగలు చేసికొంటున్నారు. కనుక బ్రతకటాన్ని

గురించి మృత్యువుని గురించి ఎక్కువ ఆలోచిస్తాడు. అందు చేత విష్ణువు శివుడు పరమ దేవతలైనారు. ఏటిని గురించి చెబితే లక్ష చెప్పాలి, మనకథ అదికాదు. భారత దేశములోని ప్రజలు కొందరు విష్ణువునే పరమ దైవమనే వాళ్లు కొందరు, శివుడే పరమ దైవమనే వాళ్లు, సృష్టి మొదలు పెడుతూనే ఈ భేదముతో మొదలు పెట్టినట్లుంది. మొదలు పెట్టిందల్లే ఉందనటంతోటే ఒక మొదలు ఉన్నదని అనుకోకండి. మొదలు నడుమ చివర ఎప్పుడూ ఉన్నవి. విషయము విమర్శించి చెప్పే టప్పుడు అవి ఉంటవి. మనమింకొక విధంగా చెప్పలేము గనక, నిన్న చెప్పాను కదా. మన ఆలోచన అంతా మన ఊహా అంతా మన ఎరిగిఉన్న విషయాలను గురించి, వాటికి సంబం ధించినట్లే ఉంటుంది. ఇంకొక విధంగా మనము ఊహించలేము అందుకనే భగవంతుణ్ణి గురించి అనాదిని ధనుడు అన్నారు. ఆది మధ్యాంతరహితుడు అన్నారు. ఈ దేశములో శివ కేశవు లిద్దరూ సమానులే! మన దృష్టితో చూస్తే ఒక్కొకప్పు డొకొక్కక్క రధికంగా కనిపిస్తారు. సురలు వైష్ణవులు, అసు రులు శైవులు, అసురులి కీ దేశంలో స్థానములేక ఉత్తర ధ్రువానికేసి వెళ్లారు. ఎక్కువమంది వెళ్ళారనే అర్థం. అది అసురదేశమైనది. మారి అస్సీరియా అయింది. ఇలాగా కాల క్రమేణ అనేకసార్లు ఇక్కడనించి వెళ్ళకొట్టబడో, ఇక్కడ తిండి చాలకో పరాయి చోట్లకు వెళితే నిర్వివాదంగా బ్రతక వచ్చునని యోజనము తుకిడీలు తుకిడీలు వెళ్ళిపోతూ వచ్చారు.

మనుష్యుడు ఎక్కడకు వెళ్ళినా త్రావటానికి నీళ్ళు కావాలి. తిన టానికి తిండి కావాలి. అవి రెండు ఉన్న తర్వాత వాడి దర్జా. ఈ త్రిగిరీశనది ఉన్నది. బాగానే ఉన్నది. నివాసాలు ఏర్పరచు కొన్నారు. మళ్ళీ క్రొత్తజనం వచ్చింది. ఇందులో కొంతమంది యూ రతీశనది దగ్గరకు పోయినారు. ఉంటున్నారు. ఉప్పె నలు వస్తున్నవి. వరదలు వస్తున్నవి. భూకంపాలు వస్తున్నవి. నాగరకతలు పెంచుకుంటున్నారు. నాశనమై పోతున్నారు. మళ్ళీ ఊళ్ళు కడుతున్నారు. మళ్ళీ రాజ్యాలు నిర్మిస్తున్నారు. మళ్లీ దండయాత్రలు. మళ్ళీ వృత్తులు, మళ్లీ మతాలు, మళ్లీ చదువులు, మళ్లీ ఎప్పటి కప్పటికి భారతదేశము నుంచి వెళు తూనే ఉన్నారు. ఇంక అక్కడి మతాలు, అక్కడి జీవితాలు, అక్కడి విశ్వాసాలు. ఎన్ని వడపోతలు పొందినవి. ఎన్ని మార్పులు పొందినవి. ఎప్పటికప్పుడు క్రొత్త అనుకుంటే ఎట్లా రెండువందలయేండ్లు ఈ దేశాన్ని ఇంగ్లీషువారు పాలించి తన చదువు మనచేత చదివించేటప్పటికి మన విశ్వాసాలు సగానికి సగము చిరిగి పోయినవి. చిమ్మట్లు కొట్టినవి. ఎలుకలు కొట్టి నవి ఆ యూరపులోని నాగరకత మాత్రము ఏమిటి ? విశ్వ విద్యాలయాలు మొదలైనవంతా రోము నాగరకత; తత్వ శాస్త్రము, ప్రజా స్వామికము మొదలైనవి గ్రీకు నాగరికత; మతము మత విశ్వాసాలు హీబ్రూ నాగరికత. బైబులులోని కథలు కొన్ని హోమర్ మొదలైన కవుల గ్రంథాలలో కథలు కొన్ని. పురాణ కథలుకొన్ని. త్రవ్వి తీసిన భూగర్భ

శాస్త్ర పరిశోధనా ఫలిత విశ్వాసాలు కొన్ని వాళ్ళ ప్రకృతి శాస్త్ర పరిశోధనా జనిత గాఢ విశ్వాసాలు కొన్ని. ఇదంతా కలిపి వాళ్ళ నాగరకత. వాళ్లు భోంచేస్తూ ఉంటె బల్లలమీద భోంచేస్తారు కదూ. మనము విస్తళ్ళంటాము వాళ్ళు బల్ల అంటారు. ఏడుగురు ఒక బల్లదగ్గర కూర్చోకూడదు ఇది యేసు క్రీస్తు చెప్పిన బోధలలో ఒకటి కనుక అతుత దేశంలో త్రవ్వి సుమేర్ దేశములో త్రవ్వి జ్వార్డర్ లో త్రవ్వి ఈజిప్టులో త్రవ్వి ఆనాటి నాగరకత ఆనాటి జనుల విశ్వాసాలు అని పెద్ద పెద్ద గ్రంథాలు వ్రాసి ఇది గూడ తమ నాగరకతలో ఒక భాగ మ్మనుకోటం మహా బుద్ధిమంతుల లక్షణము కాదు. అది ఒక వినోదము. వినోదము వేరు. ఆనందము వేరు. విద్య ఆనంద మును కలిగించేదిగా ఉండాలి. ఈ రహస్యము పాశ్చాత్యులకు తెలియదు. వాళ్ళ ననుసరించే మనవాళ్ళకు తెలియుటం లేదు. మొదట కొన్ని విషయాలు చెప్పాలి. ఆ ఈశ పీఠభూమిలో గాని ఈ త్రిగిరీశ యూపరతీశ నదుల నాగరకతలలోగాని అక్కడఉన్న పేర్లచేత ఆచారాలచేత విశ్వాసాలచేత భారత దేశ నాగరకత ఉన్నదని విస్పష్టంగా కనిపిస్తూ ఉండటమే కాకుండా కొన్ని పేర్లల్లో మన తెలుగువాళ్ళ లక్షణం కనిపిస్తూ ఉన్నది. ఆంధ్రుల నాటినుంచి సముద్రాలమీద వెళ్ళి ఇతర దేశాల నాక్రమించిన వాళ్ళు అనేవిషయము ఆధునిక చరిత్ర కారులు వ్రాస్తూనే ఉన్నారు. మనకు సముద్రతీరము ఉన్నది. మహారాష్ట్రులకు ఉన్నా ఎక్కువ కొండలతో నిండిఉన్నది. ఈ

పరదేశాలకు వెళ్ళి ఆక్రమించిన వాళ్ళల్లో వంగదేశస్థులు ఓఢ్రులు ఆంధ్రులు కేరళులు ప్రధానంగా ఉన్నారు. కేరళ దేశానికి సముద్రానికి చాలా సంబంధము ఉన్నది. వాళ్ళకి బాగా నావలు ఉండేవి. అందుకనే బుడతకీచులు వలందులు మొట్టమొదట కేరళ దేశములో దిగారు. కేరళ దేశములో క్రైస్తవమత ప్రచారకులు స్థావర మేర్పరచుకొన్నారు. అందుకనే ఇప్పటికి కేరళ దేశములో ఉన్నంతమంది క్రైస్తవులు ఇంకొక దేశములో లేరు. వంగదేశము కూడ క్రైస్తవులకు ఆట పట్టయింది. కాని కేరళ దేశముకంటె వంగదేశము విప్లవ బుద్ధులుకల జన బాహుళ్యంకల దేశం గనక ఆ క్రైస్తవ మతము తట్టుకునేందుకు బ్రహ్మ సమాజమతము మొదలు పెట్టింది. ఆంధ్రదేశము భిన్న లక్షణాలు కలది గనుక అట్లా ఇట్లా కాకండా ఉన్నది. ఆంధ్రులకు రాజకీయ విప్లవాలు పట్టినంత ఇతర విప్లవాలు పట్టవు. కమ్యూనిజానికి ఆంధ్రదేశము కేంద్రము కావటానికి ఆంధ్ర జాతిలోని ఈ లక్షణమే ప్రధాన కారణము. ఈశపీఠ దేశ నాగరికతలో వంగదేశ లక్షణాలు ఉన్నవి అని చెప్పాను. అసలా రాజులపేర్లే తెలుగుపేర్లు. రామశేషు ఇలాంటి పేరు ఇంకో భాషలో లేదు. ఇట్లా ఉండగా సుమేరు అక్షత ఈ రెండుపేర్లు సంస్కృతపు పేర్లు. ఉత్తర ధ్రువానికి మేరు పర్వతం అని పేరు. మేరువనగా భూమికి నడిబొడ్డు. దక్షిణ ధ్రువమంతా జలమయమైనప్పుడు భూమికి నడిబొడ్డు ఉత్తర ధ్రువం కాక మరేమవుతుంది. భూమి

సూర్యుడివైపుకు ఉత్తర ధ్రువంవైపు మళ్ళి ఉన్నది. ఆరునెల్లు రాత్రైనా ఆరునెల్లు పగలక్కడే. అందుచేత ఉత్తరధ్రువం మేరువైతే ఈ యూపరతీశనది త్రిగిరీశనదులు ప్రవహించే ప్రదేశము సుమేరు దేశము ఎందుకుకాదు ? ఇట్లా ఉండగా ఈశపీఠ దేశములో శర్కర శబ్దమే శక్కర ఇయినదని చెప్పాను కదా. ఈ సుమేరు దేశములో కొన్ని పేర్లు ఉన్నవి. అచ్చంగా తెలుగుపేర్లు. భూగర్భ శాస్త్రవేత్తలు ఒకచోట త్రవ్వకం త్రవ్వారు అది సుమేరు దేశములో ఒక పెద్ద పట్టణము. ఆ ఊరి పేరు నిప్పూరు. ఈమాట ఇంకొక భాషలో ఎట్లా ఉంటుంది. అది అట్లాఉంచి నేటి ఉబాబిలాను బస్రా అనే పట్ట ణాల నడుమ ఇంచుమించుగా యూపరతీశనది ఒడ్డున ఒక ఊరు న్నది. దానిపేరు "ఊరు" అక్కడ పెద్ద రాజ్యము ఉండేది. ఇప్పుడు మనకు లభ్యమానమయ్యే పేర్లనుపట్టే విచారిస్తు న్నాము. ఆ పాశ్చాత్య పరిశోధకులైనా వీటినిపట్టే విచారిం చరుకదా ! కనుక ఆంధ్రులు అనాదినించి పరదేశాలకు వెళ్లి సుమిత్రా ద్వీపము యవద్వీపము వర్ణద్వీపము ఆక్రమించటమే కాదు. పోయి ఆసియాలోనే రాజ్యాలు స్థాపించినవాళ్ళు. ఈ సుమేరియా దేశములోని ప్రజలు ఈశపీఠ దేశములోని ప్రజల వలె వెళ్ళటం అక్కడే ఆగిపోవటం మళ్ళీ క్రొత్తగా జనము రాకపోవటము ఏదో వాళ్ళ ఇష్టము వచ్చినట్లుగా వాళ్ళ మతాలు పెరుగుతూ ఉండటము అల్లా ఏకాకి బ్రతుకు బ్రతక లేదు. ఈ సుమేరు, అశుత, జోర్డన్, ఏరబ్, గ్రీస్, రోము

మొదలైన దేశాలకు భారతదేశమునుండి జనులు మాటిమాటికి వెళుతూనే ఉండేవాళ్ళు. అందుచేత ఎప్పటి కప్పటికి మన శాస్త్రాలు సిద్ధాంతాలు ఆ దేశాలకు వెళుతూనే ఉన్నవి. సుమేరు భాషలో అణు అన్న శబ్దము ఉన్నది దానికి ఆకాశ మని పేరు. ఫి అను శబ్దమున్నది. దానికి భూమి అని పేరు. అణువు అన్నది తర్క శాస్త్రములోని మాట ఆకాశముకూడ అణువులతో నిండే ఉన్నది. ఈ పరమ రహస్యాన్ని పురస్క రించుకొని వాళ్ళు ఆకాశాధి దేవతకు అణుదేవత అని పేరెట్టు కొన్నారు. కు అనగా భూమి. కుజము చెట్టు భూమినుండి పుట్టినది. ఉకారముపోయి ఇకారము వచ్చింది. కి అనగా భూదేవత. ఆ పేర్లు ఎంతో చెడిపోయినా ఇప్పటికి వాటి తెలుగు వాసన సంస్కృత వాసన భారత దేశభాషల వాసన పోగొట్టుకొనలేదు. బాబిలాన్ దగ్గర కీష్ అను ఊరున్నది. కీశుడు అనగా కోతి. ఊరుదగ్గర ఏరీదు అను ఒక వూరున్నది. తెలుగు మాటల్లే ఉంది. ఆ పైన ఉరుకు అను ఒక ఊరున్నది. ఉరుకులు అంటే దూకుట. తెలుగుమాట. ఇదంతా ఘుణాక్షర న్యాయము. అంటే పాశ్చాత్యుల చేసిన పరిశోధనలో నూటికి డెభై అయిదు వంతులు ఘుణాక్షర న్యాయమే వాడు రాసిన చరిత్రలో నూటికి తొంభై పాళ్ళు ఊహలు. అదంతా ఇప్పుడు మనకు చదువైంది. నేను చెప్పిందీ కావచ్చు. మీద చు:—

## 7

"దయ, తితిక్ష, శాంతి దాంతి ఇలాంటివి ఆత్మగుణా లంటారు. బ్రాహ్మణునికి చతుశ్చత్వారింశత్ సంస్కారా లని చేస్తారు. పుంసవనము మొదలు జాతకము ఉపనయనము చౌలము ఈ మొదలైనవన్నీ ఈ సంస్కారాలు. వాటివల్ల బ్రాహ్మణు డౌతాడు. దయ మొదలైనవి ఆత్మగుణాలు. ఈ ఆత్మగుణాలు లేకపోతే ఈ సంస్కారాలన్నీ వృథా. బ్రాహ్మ ణునికి ప్రధానమైనవి ఈ ఆత్మగుణాలు.

"అబ్బో నీకు ధర్మశాస్త్రాలు తెలుసే. ఇవన్నీ ఎప్పుడు చదివావబ్బా."

"ఏమీ చదవకుండానే జాకబ్‌ని పెండ్లి చేసికొన్నా నంటావా ?"

"ఇంతకు ఏమంటావు. నన్నేమి చేయమంటావు"

"ఒక్క సంగతి చెబుతున్నా విను. నా సిద్ధాంతాలు వేరు, నా మతము వేరు. నీవు నా మతస్థుడవు కావాలి. నా మతము చాలా గొప్పమతము"

"సోఫియా మతమని నేనెప్పుడూ వినలేదు. హిందూ మతమని ఉన్నది. క్రైస్తవ మతమని ఉన్నది. ముసల్మాను మతమని ఉన్నది. సోఫియా మతము వినలేదు"

"శాయిబాబా మతముంది. రాధాస్వామి మతముంది. సోఫియామత మెందుకుండకూడదు ? నేనే దేవుణ్ణి కృష్ణుడే నేనుగా అవతరించాను. 'నన్ను నమ్ముకుంటే మిమ్మల్ని రక్షిస్తాను, మీకు మోక్ష మిప్పిస్తాను' అని నేను గనక కూర్చుంటే నాదీ ఒక మతమౌతుంది. నా చుట్టు జనము చేరుతారు"

"అదేమంత తేలికగాదు. ఆ శాయిబాబా మొదలైన వాళ్ళు సిద్ధులు. వాళ్ళ మాహాత్మ్యంవల్ల వ్యాధులు నయమౌతవి. అనుకున్నపనులు జరుగుతవి. ఆపదలు నివారింపబడుతవి. ఇక్కట్లు తీరుతవి, ఇది ప్రత్యక్షము"

"అది నా మతములోను జరుగుతుంది. నేనేకాదు నీవు కూడ ఒక మతము పెట్టు. ఆ మతములోను జరుగుతవి. సుమేరు దేశంలో ఒక దేవత ఉండేది. అది పిల్లిదేవత. పిల్లినే వాళ్ళొక దేవతగా ఆరాధించేవాళ్లు. విభూతి యోగంలో

శ్రీకృష్ణుడు ధానుష్కులలోనే నర్జునుణ్ణి మాసములలో నేను మార్గశీర్షాన్ని అని చెప్పాడు కదూ! జంతువులలో నేను పిల్లిని అని చెప్పలేదు. బుబేస్టిస్ అని ఒక ఊరున్నది. అది ఈజిప్టులో కథ. అక్కడ పిల్లిదేవత ఉన్నది. ఆ దేవత పేరు ఉబాస్తి. నీటి గుఱ్ఱమని పుస్తకాల్లో చదివావుకదూ దాన్ని ఇంగ్లీషులో హిప్పోపొటోమస్ అంటారు. ఆ దేవత ఉన్నది. దాని పేరు ఏపెట్, ఇలా అనేక దేవతలు. ఒక పిల్లిదేవత. ఒక కుక్కదేవత. మనవాళ్ళ కాల భైరవస్వామి. మన విఘ్నేశ్వరుడు ఎలుకమీద ఎక్కుతాడని అంటారే కాని ఆ ఎలుకను మనవాళ్లు దేవతగా పూజించటము లేదు. ఈజిప్టు, సుమేరు, అక్కడి దేశాల్లో వాళ్ళు ఏ జంతువును పడితే ఆజంతువును తీసికొని ఒక దేవతగా చేసివేశారు. అలాగే నీవుకూడ ఒక మతము పెట్టు. నీ వొక దేవతవై పోతావు"

"అంటే నేనొక జంతువు నంటావా"

"జంతువంటే తప్పంటావా? మనకేమీ తప్పులేదు. జంతువన్నా పశువన్నా ఒకటే. మన శివుడికి పశుపతి అని పేరు. మన మందరము పశువులము. ఆయన మనకు పతి. అందు చేత ఆయన పశుపతి"

"నేనవుదును కాను. నీవు మతము పెట్టావు గనక పెట్టానని అంటున్నావు గనక నీవు మాత్రమగుదువు. నన్నెం దుకు చేస్తావు"

"కాదయ్యో మతము పెట్టటముతోటే మనము పశువులము కాము. పశుపతుల మవుతాము. దేవుడిలో భాగమవుతాము కదూ అదీ రహస్యము"

"బాగానే ఉంది. కఱ్ఱదెబ్బలు తినాలి. మనమే దేవుళ్ళ మంటాము. వాళ్లు మన్ని ప్రార్థిస్తారు. వాళ్ల ఆపదలు తీరవు. అప్పుడు కఱ్ఱలు పుచ్చుకొని మనవెంట పడతారు. నేను దెబ్బలు తినలేనబ్బా నాచేతకాదు"

"నీవు కూడ దెబ్బలు తినలేకపోతే నేనేమి చెయ్యను ? పిడిరాయి వంటి మనిషివి. దేవుడి గుళ్ళో శిలా విగ్రహా లెల్లా ఉంటయో నీవట్లా ఉంటావు. నీవు "నేను దేవుణ్ణి" అను నోరెత్తకుండా ఒప్పుకొంటారు. దేవుడి గుళ్ళల్లో విగ్రహాలు నీకన్నా ఏమైనా పొడిచినయా."

"సరేనమ్మా తల్లీ ! ఏదో కొంచెము కాకపోతే కొంచెమైనా మహత్తు ఉండాలికదా"

"అందుకనే నీకు ఉద్యోగము రాలేదు. నీకు ప్రపంచ జ్ఞానము తక్కువ. మూర్తిమంతము బాగానే ఉందిగాని నీకు మనస్సు దిటవులేదు. ఈ కాల మెట్లాంటిదంటే నాకన్న పండితుడు లేడు. విద్య అంతా నాకేవచ్చు. 'నా ముందర ఎవరూ పనికిరారు' అని చెప్పాలె తీవిగా ప్రవర్తించాలె. ఒక దర్జా వెళ్ళబుచ్చాలె. ఆ ఉద్యోగాలిచ్చేవాళ్లు ఉన్నారే వారందరూ అదృష్టవంతులు. వాళ్ళల్లో సమర్థులు తక్కువమంది. వాళ్ళల్లో

పండితుల సంఖ్య ఇంకా తక్కువ. ఎవడైతే 'నేనే పండితుణ్ణి' అంటాడో అనటంకంటే అభినయిస్తాడో, పైకి అభినయించి లోపల ఆశ్రయిస్తాడో వాడిపని మూడు పువ్వులు ఆరు కాయలు. సామాన్యంగా నీవంటివాళ్ళు ఏమి చేస్తారంటే మన కావ్యాల్లో నాయకులు లేరూ వాళ్ళకు కొన్ని గుణాలు చెప్పారు. అందులో అవి కత్థనత్యము ఒకటి. అంటే తన్ను తాను పొగడుకోకుండా ఉండటము. మనవాళ్ళకి తక్కిన నాయకగుణాలు ఏమీ లేకపోయినా ఈ గుణము ఒకటుంటుంది. ఆ గుణము సహజంగా ఉండికాదు—సిగ్గు బిడియం ఆడవాళ్ళ కన్న కనాకష్టపు జాతి. ఉద్యోగాలెల్లా వస్తవి"

"అయితే మతము పెట్టటమే మంచిది. కాని మహాత్తు?"

"మహాత్తు అమహాత్తు మహాదమహాత్తు, ఓరి వెఱ్ఱివాడా? మనకూ దేవుడికీ ఏమిటి భేదము ? మనకు ప్రపంచము గట్టిగా తెలియదు. దేవుడికి గట్టిగా తెలుసు. మనకు కూడ గట్టిగా తెలిసిందనుకో. మనము దేవుళ్ళమై పోతాము. గట్టిగా తెలియటమంటే ఏమిటి ? లోకంలో పిల్లలు పుడుతున్నారు. ఇంచుమించుగా చెరిసగంగా ఆడవాళ్ళు మగవాళ్లు పుడతారు. అందుచేత మా ఆవిడ ఈసారి ఆడపిల్లకంటుందా మగపిల్లవాణ్ణి కంటుందా అని ప్రశ్న వేస్తే రూపాయి పుచ్చుక ఎగరెయ్యి బొమ్మవస్తే మగపిల్లవాడు, అక్షరాలు వస్తే ఆడపిల్ల. అల్లా చెప్పు. రైటు కాదనుకొంటావేమో నూటికి యెనభై పాళ్లు రైటవుతుంది. నీ కెట్లా తెలుసునూ అంటావా ? నేను భగవం

తుణ్ణి అంటే మరి ఏమిటి? ఇదే! రహస్య మిందులో ఉంది. అబ్బాయీ ఒకమాట చెబుతున్నాను విను. రైళ్ళు పడి జనము చస్తున్నారుకదా! ఏరోప్లైన్లు తగులబడిపోయి జనము చస్తు న్నారుకదా! వ్యాధులు వచ్చి జనము చస్తున్నారుకదా! అనేక విధాలుగా చస్తున్నారు. ఇంతమంది చస్తూఉంటే మిగి లినవాళ్ళకి బియ్యము చాలటము లేదు. అంటె ఎంతమందికి బియ్యము చాలుతవో ఆ లెక్క చూచుకొని చావటంలేదన్న మాట అంటె తక్కువమంది చస్తారన్నమాట. అనగా బ్రతికే వాళ్ళు ఎక్కువమంది. చచ్చేవాళ్లు తక్కువమంది. యుద్ధా లప్పటిమాట. లోకము సాగుతున్నదంటే అయ్యేపను లెక్కువ కానిపనులు తక్కువ. నిమ్మదించే వ్యాధులెక్కువ. నిమ్మదించని వ్యాధులు తక్కువ. ఇది లోకముయొక్క రహస్యము. లేక పోతే ఈ సృష్టి సాగదు. ఇది భగవంతుడి పథకము. కనుక నీవు 'నేనే దేవుణ్ణి' అని రక్షరేకులు కట్టు. విభూతులు పెట్టు. జప ములు చెయ్యి. అసలు సృష్టియొక్క పథకమువల్ల వందమందికి జబ్బుచేస్తే తొంభై అయిదుగురు బ్రతుకుతారాయె. వంద ఆపదలలో యెనభై ఆపదలు తీరుతాయాయె. వాటంతట అవే తీరుతవి. కాని ఈ మానవులున్నారే నీవు భగవంతుడవని నీవు తీర్చిపెట్టావని నీ మహాత్తు వలన వాళ్ళు సుఖపడుతున్నారని అనుకొంటారు. నీ తిరుపతి వెంకటేశ్వరస్వామి కాని యేసు క్రీస్తు మహాప్రభువు కాని అల్లాకాని అందరూ ఇంతే. వాళ్ళు

చేసేది ఏమీలేదు. అసలు సృష్టిలోనే ఉంది సాగటమనే లక్షణం. జబ్బుచేసిన వాళ్లందరు చస్తే బ్రతికే వాళ్లెవరు ? లోకమేముంది ? ఎవరికీ ఉద్యోగము రాకపోతే రాచరికమెట్లా సాగుతుంది ? కనుక నూటికి తొంభై పాళ్లు దానంతట అదే జరుగుతుంది. నీవు తెలివి కలవాడివైతే ఏం చెయ్యాలంటే ఇందులో కొంతభాగము నీవల్ల జరిగినట్లు చూపించుకోవాలి. ఇదీ మత కర్తలంటే సిద్ధులంటే. దీనికి మంచి విలువున్నది. ఎందుచేతనంటే జనము నూటికి తొంభై పాళ్లు మూఢులు. తక్కిన పదిమంది పట్టుకుంటారేమో అని భయమా ? ఏమీ భయమక్కరలేదు. చచ్చేదివాళ్లే. ఎందుచేతనంటే భగవంతుడికీ తెలుసు. తెలివికల వాళ్లు బ్రతికితే వాడికే ఇబ్బంది. వాణ్ణి కాదంటారు. భారతంలో కథ వినలేదా ? సుభద్ర కడుపుతో ఉంది. తొమ్మిది నెలలు వచ్చినవి ఇంకా నీళ్లాడలేదు. లోపల అభిమన్యుడు తయారుగా ఉన్నాడు. అర్జునుడు ఆ కడుపులో ఉన్న పిల్లవానికి పద్మవ్యూహములో ప్రవేశించటం భేదించటం నేర్పుదామని సుభద్రతో ఆకథంతా చెబుతున్నాడు. ప్రవేశించటమెల్లాగో చెప్పాడు కృష్ణుడు భగవంతుడుకాదూ! ఆ కడుపులోఉన్న అభిమన్యుడికి ఆ భేదించటంకూడా తెలిస్తే వాణ్ణిప్రపంచంలో గెలిచేవాడెవడూ ఉండడు. వాణ్ణి చంపాలి అంటే మళ్ళీ తానవతారమెత్తాలి. పాపమా భగవంతునికి అదే ఎనిమిదవ అవతారము ఇంక రెండవతారాలే మిగిలినవి.తరువాతఒక పద్దెనిమిది వందల

యేండ్లకో ఎప్పటికో బుద్ధావతార మెత్తాలి. బుద్ధావతారమంటే వట్టి బుద్ధావతారమే. లోకంలో ఎద్దు మొద్దు స్వరూపంగాణ్ణి బుద్ధావతార మంటారు. ఈ మాటకి ముద్దుమాట కూడా ఒక టుంది బుద్ధు అని. ప్రపంచకాన్ని ప్రధానంగా భారతదేశాన్ని కలియుగాని కనుకూలంగా చెయ్యాలి. అందు చేత కృష్ణుడేమి చేశాడంటే పని పెట్టుకొని సరిగ్గా ఆ వేళకుపోయి వాళ్ళ గది తలుపు తట్టి అర్జునా అర్జునా కొంప మునిగిపోతున్నది రమ్మ న్నాడు. పాప మా అర్జునుడు ఆ బావ ఎంతచెబితే అంత. యుద్ధ భూమిలో నిలుచోపెట్టి పద్దెనిమిది అధ్యాయాలు భగవద్గీత చెబితే కుయిక్ మనకుండా విన్నాడు. పద్మవ్యూహం ఎలా ఛేదించాలో ఆ అభిమన్యుడికి చచ్చేదాకా తెలియదు. ఇదీ రహస్యము, కనుక భగవంతుడు సృష్టికి మించిన తెలివికల వాళ్ళని బ్రతకనివ్వడు. ఇది భగవంతుడి లక్షణము. ఎక్క డుంటే అక్కడల్లా నిజమే ఉద్యోగా లెవరికి వస్తవి ? పై వాళ్ళు తనమాట ఎవడు వింటారనుకొంటారో వాళ్లకిస్తారు. స్వతంత్రుడి కివ్వరు. లోకమే ఇంత. అజ్ఞానమయం దుఃఖమయం కష్టమయం. ఒకళ్ళతో ఒకళ్ళు పోట్లాడుకొంటారు. మళ్ళా కలుస్తారు. లోపల గుట్టు గుట్టే. పైకి స్నేహమే. వాడి ఆస్తి వీడికి రావాలి. లంచాలు తినాలి అధికారులు కావాలి. తన సిద్ధాంతాలకు అనుకూలించని వాళ్లు చావాలి. ఇది సృష్టి లక్షణం. ఇందులోనించి స్వర్గాన్ని సృష్టిస్తారట. ఇంగ్లీషులో వానిపేరు మిలీనియమ్. అవివేకులైన స్వార్థపరులు అవివేకులు

కాకపోతే పర ప్రచారణ పరాయణులు. చెప్పేమాటలు చేసే పనులు "ఓయమ్మ సోఫియా ! నీవు మతము పెట్టుకో నాకెం దుకు ! మతము పెట్టు కొబ్బరికాయలు కొట్టించు. అగరవత్తులు వెలిగించు. శిష్యుల డబ్బుతో మొదటి తరగతిలో విమాన ములో ప్రయాణము చెయ్యి. పట్టు పరుపులమీద పడుకో. పట్టు చీరలు కట్టుకోవచ్చు. ఉల్లిపొరలవంటి గోధుమవన్నె క్రాచు రంగు పట్టుబట్టలు. అవి కట్టుకుంటే ఒక కాటు వెయ్యటమే మిగులుతుంది" నేను కాటు వెయ్యటానికి ఆ పట్టుచీర అక్కర లేదు. జాకబుని కాటువేశాను నిన్ను వేశాను. అదట్లాఉంచు. దీనిలో ఏమున్నదోయ్. ఇన్ని మతాలు ఉన్నా నాకు ఒక్క మతమే బాగుంది. అది బౌద్ధమతము. ఉన్నమతాల్లో బాగున్న మతం అదికాని అది సర్వోత్తమ మతమని నాకు నమ్మకము లేదు. నా ఉద్దేశ్యములో సర్వోత్తమ మతమంటే అహింసా మతము కాదు. దయామతము. దయ ఒక్కటి తప్ప ఈ మానవ జాతిని రక్షించేమతము ఇంకొకటి లేదు. ఎవడు దయావంతుడో వాడు దేవుడు. సృష్టికి ఉపకారము జరగాలంటే వాడివల్లనే జరగాలి. అందరూ దయావంతులైతే చెప్పావు"

"అందరూ దయావంతులైతే దయ చూపించేది ఎవరిమీద ! దయ చూపించాలి అంటే చూపించే సామర్థ్యము ఉండాలి. ఎవడిమీద చూపించాలో వాడసమర్థుడై ఉండాలె. అప్పుడు అందరూ దయావంతులు కావటానికి వీలులేదు"

"దయ విషయములో ఆ భయ మక్కర లేదు. అసలు సృష్టిలో భేదాలు ఎప్పుడూ ఉంటవిగా. ఒకడు పొట్టివాడు, ఒకడు పొడుగువాడు. పొడుగువాడు పొట్టివాడిమీద దయ చూపించవచ్చు. ఎలా చూపించటమంటావా ? వంగి మాట్లాడడం దయ చూపించటం. కాకపోతే వాణ్ణి చంకనెత్తుకొని మాట్లాడటం. అసలన్నింటికన్న ఒక పెద్ద భేదమున్నదికదా ! మగవాళ్ళు ఆడవాళ్ళు వాళ్ళమీద వీళ్ళ దయచూపించవచ్చు. వీళ్లమీద వాళ్లు దయ చూపించవచ్చు"

"నీవు నామీద చూపించినట్టు"

"అది శృంగార రసము. ఆడవాళ్లతో మగవాళ్ళట్లా అంటారు నేను నీమీద దయ చూపించలేదు. నేను నీమీద దయ చూపించలేదు. స్త్రీ పురుషులలా కలుసుకొన్నాం. నే నెవడిమీద దయ చూపించను. ఒకడు నామీద చూపించ నక్కర లేదు. అవతలివాడి దయ కావాలి అనుకొనే స్త్రీలు కొందరుంటారు. ఆ స్త్రీ నామీద దయ చూపించాలి అనుకొనే పురుషు లుంటారు. అటువంటి పురుషుడితో నాకు సంబంధము లేదు. ఆ రేణుకి ఉన్నదే అది నీ దయను వాంఛిస్తున్నది. దాని యందు దయ చూపించు"

"ఇందాకటిమట్టి వాదన దీనికోసమా ? దాన్ని నేను పెళ్ళి చేసికోను"

"చేసికొంటే తప్పేమిటి"

"దానితో నేను సంసారము చెయ్యలేను"

"నిన్నెవరు చెయ్యమన్నారు? అది బతకదే ! ఆరునెల్లో ఏడాదో తరువాత దానిదారి నదేపోతుంది. నీ దయ మిగులుతుంది"

"ఓయి బాబోయ్ ! నీ కాసంగతి తెలియదు. అదేదో నవలలో ఇట్లాగే చస్తుందికదా అని ఒక బ్రాహ్మణదాన్ని ఒక హరిజనుడు పెళ్ళిచేసుకొన్నాడు. అది బతికి ఊరుకొంది. వాడి గడ్డి వాణ్ని కరిపించింది. పాప మా పుస్తకము రాసిన ఆతరువాత అంత ఇబ్బంది పడాలిసి వచ్చింది. ఇంకొక బ్రాహ్మణ దానిచేత ఇంకొక హరిజనుడికి పెండ్లి చేయించి వాళ్ళిద్దరిచేత చక్కగా సంసారం చేయించవలసిన అవసరం పట్టింది. ఏదో లోకాన్ని సముద్ధరిద్దామని చేసే పనులన్నీ ఇట్లాగే ఉంటవి. మేరీని పెళ్ళిచేసికొని లోకాన్ని సముద్ధరిద్దామని నాకు లేదు. అది దయ అని నేననను. నాకు తెలిసినంతమట్టుకు తక్కిన వాటికి మల్లేనే ఈ స్త్రీ పురుష సంబంధము కూడా వాళ్ళ జాతకాలనిబట్టి ఉంటుంది. వాళ్ళ కర్మలనిబట్టి ఉంటుంది. ఒకడు పెద్ద మహామంత్రి అయినాడంటే ఒకడు పెద్ద గాయకుడైనాడంటే ఒకడు గొప్ప కవి అయినాడంటే ఒక బ్రాహ్మణుడు మాలదాన్ని పెండ్లి చేసుకొన్నాడంటే ఒక బ్రాహ్మణది మాలవాణ్ణి చేసికొన్నదంటే రైలు ఢీకొని వాడు చచ్చాడంటే ఇల్లు

ముట్టిస్తే అందులో తగలబడి పోయినారంటే అన్ని జాతకా లల్లో రాసే ఉంటవి. నీవు నామీద దయ చూపించలేదు. నేను నీమీద చూపించలేదు. ఇలా వ్రాసి ఉన్నది ఇలా అయింది"

"అంటే మనకు తెలియకుండానే అలా జరుగుతుం దంటావు"

"ఔను. ఏదో మనకు తెలియని కారణాలు సంఘ టిస్తవి. అది అల్లా జరుగుతుంది"

"అయితే నీవు మేరీని పెళ్ళి చేసికోటమని వ్రాసి ఉన్న దేమో"

"వ్రాసి ఉంటే నేను చేసేదేముంది ? చేసికొంటాను"

"నేనదే చెప్పేది. వ్రాసి ఉన్నది. చేసికో అది చచ్చిపో తుంది. నీవు పెద్ద సంఘ సంస్కర్త వౌతావు. వెంటనే నాల్గు వందల రూపాయల జీతం వస్తుంది నెలకి. శతవిధాల జాకాబ్ ఉద్యోగం నీకు వస్తుంది నీకేం నష్టం ?"

"అయితే నీకు జాకాబ్ మీద ఎక్కువ ప్రేమా నామీద ఎక్కువ ప్రేమా ? ఆ సంగతి చెప్పు"

"వ్రతం చెడ్డా సుఖం దక్కాలి. నేనేదో పంచముణ్ణి చేసికొన్నాగదా అనుకొన్నాను. వాడిది వట్టిచవట బ్రాహ్మణ

మొఖం. నీది ఫస్టుక్లాసు హారిజన మొఖం. నీవు సీగ్రోవు. నీవు బంటూవు. అపలింకోటి చూచావు. ఈ కథ ఇల్లా జరిగితే గాని యూపరతీశనదీనాగరికత అంతంకాదు. లితుల సంవత్సరాలు భారతీయ నాగరకత ఇట్లాగే ఉంది. ఆ నాగరకతలన్నీ వందల యేండ్లు వేల యేండ్లు వుండి ఎందుకు పోయినవనుకున్నావ్. అక్కడ సోఫియాలు సోమనాథాలు పెరిగిపోయినారు.

# చతుర్థ భాగము

## త్రిగిరీశ నది

### 1

నిజంగా మాట్లాడితే ముందర త్రిగిరీశనదిని గురించి మాట్లాడాలె. తరువాత యూఫరతీశ నదిని గురించి మాట్లాడాలె. ఎందుకంటే మన భారత దేశాన్నించి అటు అతుత సుమేరు దేశాలకి వలసపోయే వాళ్ళకి మొదట తగిలేది త్రిగిరీశనది. ఆ కొన్ని వేల యేండ్లక్రిందట ప్రపంచకంలో ఇన్ని వందల జాతులు లేవు. ఇన్ని భాషలులేవు. ఇన్ని మతాలులేవు. ఏదో ఇక్కడ భారతదేశంలో జనము మన ధర్మానికి ఎదురు తిరగటం, వాళ్లు మ్లేచ్ఛులు కావటం, ఇక్కడనుంచి తరిమివేయ బడటం ఇక్కడినించి వెళ్ళిన తరువాత ముక్కు మొగములేని మతాలు ఏర్పఅచుకోవటము — మతమంటే ఏమిటి ? మానవుడు బ్రతుకుతున్నాడు; సర్వమానవులు మరణిస్తున్నారు. జన్మిస్తున్నారు;

వట్టి పశువులవలె పుట్టటము చావటము జరిగి నడుమ న బ్రతకటం చేస్తున్నారు గనక ఏ ఆలోచనా లేకండా బ్రతికినన్నాళ్లు సంపాదించుక తినటము మాత్రమే సమస్త ప్రయోజనముగా భావిస్తూ ఉండటము మన తరువాత మనపిల్లలు వాళ్లపిల్లలు ఉండటమునేది ఒకటి ఎంత సామాన్యబుద్ధికైనా గోచరిస్తుంది గనక పిల్లలను గురించి జాగ్రత్త పడటం మానవులే కాదు పశువులు గూడ చేస్తున్నవి గనక ఈ మాత్రముతో సర్వ దేశాలలోను సర్వ కాలాలలోను సాగుతూనే ఉన్నది గనక ఇట్లా సాగుతూ ఉండటమే మతమా ? ఇది దానంతట అదే సాగుతూ ఉన్నది. దీనికి మానవులకు సహజముగా ఉన్న లక్షణమే చాలు. కాకపోతే మానవుడు మూకలు మూకలుగా బ్రతుకుతాడు గనక జన మెక్కువైనకొద్దీ ఆహార పదార్థాలు సంపాదించటము కష్టమౌతూ ఉంది గనక ఒకరినొకరు మోసం చేసికోటము చంపుకోటము ఒకళ్ళ ఆస్తిని ఒకళ్ళు కాజేయటము కనిపిస్తూ ఉంది గనక జంతువులకన్న విశేష మేమిటయ్యా అంటే జాతులుగా ఏర్పడటము రాజ్యాలు నిర్మించటము అంతర్భద్రతను ఏర్పాటు చేసికోవడము ఇది మానవునిలో కనిపిస్తున్నది. అయిన తరువాత ఏమవుతున్నది ? మొదట ఏ అభద్రత వ్యక్తులమధ్య కనిపించటము మూలముగా జాతులు రాజ్యాలు ఏర్పడ్డయ్యో ఇప్పుడు జాతులమధ్య రాజ్యాలమధ్య అదే అభద్రత ఏర్పడ్డది. ఆధునిక పాశ్చాత్య తత్వవేత్తలు మహా రాజ్యాంగ నిర్మాతలు మాటిమాటికి అంటూ ఉంటారు. పాపం వాళ్ళు ప్రయత్నాలు

కూడ చేస్తున్నారు. ఎందుకంటే ఈ భిన్న జాతుల మధ్య ఈ విరోధము ఈ అభద్రత లేకుండా సర్వలోకాన్ని సర్వధాత్రిని ఏకమానవ కుటుంబముగా చేద్దామని. అది సాధ్యము కావటము లేదు. అది సాధ్యము కాని విషయమని వాళ్ళకి తెలియటము లేదు. ఉట్టికెక్కలేనమ్మ స్వర్గాని కెక్కుతుందా ? అని ఏ జాతి ఆ జాతిలో ఏ దేశము అ దేశములో అంతర్భద్రత నిస్థిరంగా సంపాదించుకోలేదు. మూక ఉమ్మడిగా రాజ్యము సాగుతూ ఉండటము. న్యాయచట్టాలు రాజ్యానికి వెనకఉన్న సైన్యము యొక్క బలముచేత సైన్యమువలన భీతిచేత సాగుతూ ఉండ టమే తప్ప ఏ దేశంలో ఏ జాతిలో ఏ సంఘములో భద్రతఉంది? ఈ కాలంలో అమెరికా గొప్పనాగరకత గలది అనుకొందాము దొంగతనము దోపిళ్ళు ఆ దేశములో ఒక పెద్ద శిల్పకళగా బయలుదేరింది. ఆధునిక నాగరికత వృద్ధి పొందించిన ప్రకృతి శాస్త్ర మహా పరిశోధనలన్ని సగం దొంగలని పట్టుకునేందుకే ఉపయోగింప బడుతున్నవి. మోసాలు దురహంకారాలు క్రోధాలు విరోధులను చంపటానికి ప్రయత్నించటాలు ఎదటి వాడి ఆస్తిని అపహరించటాలు ఇతరుల భార్యల నపహరించ టాలు జారత్వాలు చోరత్వాలు ఇవేకదా సంఘమునందలి అభద్రత. వీటి న్యాయచట్టాలు శిక్షాస్మృతులు అనంతకోటి సంవత్సరాలనుండి భారతదేశములో ఇవే ఉన్నవి. అవిలేకుండా చేస్తే రామరాజ్య మన్నారు. ఆ రాముడై పోవటంతోటే భీముడొచ్చాడు. భీమరాజ్యమై పోతుంది. సంఘానికి ఒక

వ్యవస్థ ఏర్పాటుచేసికొన్న అన్నిచోట్ల ఇదేస్థితి. దుర్జనులనుండి సజ్జనులను రక్షించటము, సగము దుర్జనులను రాజభయముచేత సజ్జనులవలె ప్రవర్తింపజేయటము ఇదీ రాజ్యాంగమంటే ఆ మధ్య బియ్యపు కంట్రోలు పెట్టారు కంట్రోలు పెట్టడం తోటే వర్తకుడు తన ఇష్టమువచ్చిన ధరకు అమ్ముకోటానికి వీలులేదు గనక సరుకు దాచేస్తాడు చాటుమాటుగా ఎక్కువ ధరకు అమ్ముకొంటాడు. దీనికే నల్ల అంగడి అని ఒక క్రొత్త నామకరణము చేశారు ఇలా ఉండగా ఒక పెద్ద రాజకీయాధి కారి ఒక ఊళ్ళో వర్తకులను బెదిరించాడట. మీ రిలా చేస్తే బియ్యమన్ని రాచరికమే వశం చేసికొంటుంది అని. వివేకి అయిన వర్తకుడు సమాధానము చెప్పాడు. "అయ్యా రాచరికంవారన్నా మనుష్యులేకదా" అని. తాత్పర్య మేమిటంటే లంచగొండితనము, ఎక్కువ సంపాదించా లనుకోటము నిలవ చేద్దామనుకోటము అధికభోగా లనుభవిద్దా మనుకోటము పిల్లల కిచ్చిపోదా మనుకోటము ఇది మానవజాతి లక్షణము. ఈ దుర్లక్షణాలను అదుపులో పెట్టడం ఎలాగ ? నేను శిక్షా సూత్రములను నిర్మిస్తాను. రాజ్యాంగ వ్యవస్థను తిరిగి నిర్మాణము చేస్తాను. మొదలైన బయటినించి మానవ ప్రకృతిమీదికి తెచ్చే ఒత్తిడి వలన సర్వమానవ కుటుంబాన్నిఏర్పాటుచేస్తాడా? ఇంత భారీఎత్తున కాకపోయినా పూర్వ చరిత్రలో ఉన్న కొందరు చక్రవర్తుల కొన్ని ప్రయత్నాలు ఈ ముఖంగా జరిగినవి ఉన్నవి. బౌద్ధమతము ఒకటి ఇట్లాంటిది. అక్బరు చక్రవర్తి

ఏ తదభిముఖంగా కొంత చేశాడని చెబుతున్నారు. ఎవడు ఏమి చేసినా తాత్కాలికమేగాని శాశ్వతముకాదు అని తెలుస్తూనే ఉన్నదిగదా ! ఎందుచేత శాశ్వతము కాదు ? ఇది మానవ ప్రకృతిలో ఉన్న సహజ దౌర్బల్యము. ఇది భగవంతుడు చేసిన సృష్టిలో సహజముగా ఉన్నది. దానిని కొంత కొంత అదుపులో పెట్టగలవు గాని అచ్చముగా నిర్మూలము చేయటము నీ తల లోని జేజెమ్మకు కూడ చేతకాదు. ఈ రహస్యము తెలిసి శిశా స్మృతులను నిర్మించేవాడు వివేకి. తెలియకుండా మట్టిని బంగా రము చేస్తాననేవాడు అవివేకి. వాడు అయితే అవివేకౌతాడు లేకపోతే మోసగాడవుతాడు. ఎక్కువభాగము మోసగాడే అవుతాడు. ఎందుచేతనంటే ఇలా సర్వమానవ కుటుంబము ఏర్పాటు చేస్తామనేవాళ్ళలో అవివేకముకంటే మోసమెక్కువ కనిపిస్తున్నది. వాళ్లల్లో ఎక్కువమంది సర్వమానవులూ ఒకటే నంటారు. అన్నిజాతులూ ఒకటే నంటారు. అన్నిమతాలు ఒకటేనంటారు బ్రహ్మాండములైన ఉపన్యాసాలు చేస్తారు. గ్రంథాలు వ్రాసారు. దేశనాయకులు ప్రపంచ నాయకులు అవుతారు. వాడి కూతురు తన కులము కానివాణ్ణి ప్రేమిస్తే వాడు ఏడ్పేపడుపు దిక్కులుపట్టడు. వాడు గొప్ప అధికార ములో ఉంటాడు కాబట్టి అన్ని పెద్ద ఉద్యోగాలు తన కొడుకు లకు అల్లుళ్ళకు మేనల్లుళ్ళకు తరతమ భేదాలుగా ఇస్తూ ఉంటాడు. చిన్నచిన్న ఉద్యోగాలు కూడ వాళ్ల కులమువాడికి ముందర ఇస్తాడు. కాని మాట్లాడటము సర్వమానవ కుటుం

బాన్ని గురించి మాట్లాడుతాడు - తేలిన సారాంశమేమిటంటే మానవుణ్ణి బాగుచేద్దామనుకునేది మానవుడు. అనగా ఇతర మానవులను బాగుచేద్దామంటాడు తప్ప తన్ను తాను బాగు పఱచుకొందామని అనుకోడు. తనచేతిలో అధికారము ఉన్నది గనక తనమాట వినేవాళ్ళు చాలామంది ఉన్నారు గనక తాను సంపూర్ణ పురుషుడు. ఎంతసేపటికి క్రింది మట్టములో సామాన్య మానవుడికి ఏ ఆశలు ఏ లోభాలు ఏ వాంఛలు ఏ దుర్గుణాలు ఏ భయాలు ఉండటము మూలముగా మానవ జీవితము అభద్రమైనదో పై మట్టములో ఈ గుణాలు పనికి రావంటూ ఈ నాయకులు ఈ రాజులు ఈ ప్రవక్తలు ఈ తత్వ వేత్తలు వాటినే ఆచరిస్తూ ఉంటారు. వాడెవడో చెప్పినట్లుగా వ్యక్తి చేసినది దొంగతనము. రాజు చేసినది ధర్మము రాజనీతి లోక క్షేమము.

మానవుని యొక్క స్వరూపము సర్వకాలమునందు ఇంతే ! పైకి ధర్మమల్లే ఉంటుంది. చేసేపని తనకో తన సంఘానికో తన జాతికో తన సిద్ధాంతానికో ప్రాధాన్యం తెచ్చేదిగా ఉంటుంది. వాడి సిద్ధాంతాన్ని వాడు నమ్మకపోవచ్చు. ఆ సిద్ధాంతాన్ని తన్ను అనుసరించే వాళ్ళు విశ్వసిస్తున్నారు గనక—వాళ్ళు వాళ్లంతట వాళ్ళు విశ్వసించటము లేదు. వాళ్ళ నాయకుడు చెప్పాడు గనక అది నిజమై యుంటుందని నమ్ముతున్నారు—విప్లవాలు లేవతీస్తాడు ఉన్న సంఘాన్ని చెదరకొడతాడు. క్రొత్త సంఘాన్ని నిర్మిస్తానంటాడు. గతాను

గతికోలోకః నలోకః పారమార్థికః మానవ జాతియొక్క యథార్థమైన చరిత్ర ఇది. సృష్టిలోనే మనుష్యుడు పుట్టటం తోటే సహజముగా ఉన్న ఈ కామక్రోధలోభాది గుణాలను కురుపొకచోట మందొకచోట అన్నట్లుగా ఇవన్నీ ఉద్భవించే చోటు మనస్సు గనక మందు అక్కడ వెయ్యాలిగాని నేను సర్వమానవ కుటుంబాన్ని స్థాపిస్తాను; అందరు మానవులు ఒకటే; ఇలాంటి శుష్క వాక్యాలవల్ల వ్యర్థప్రయత్నాలవల్ల ఫలితముండదు. ఈ సంగతి బాగా తెలిసికూడ స్వార్థపరులు ఒప్పుకోరు. అవివేకులు వాళ్ళని నాయకు లనుకొంటారు. కనుక మతమనేది మనస్సును నియమించటముతో ప్రారంభిస్తుంది. అక్కడకూడ మతాలు బాహిర ప్రయత్నాలే చేసినవి. ఈ ప్రయత్నాలల్లో ఉన్న వైవిధ్యమే బహుమతాలు. ఈ వైవిధ్యము ఒప్పుకున్నకొద్దీ ప్రధాన విషయాన్ని మరుగుపఱచి బయట పరిస్థితులు క్రొత్తవి క్రొత్తవి తెచ్చినకొద్దీ అభివృద్ధి అనుకుంటూ ఉంటే ఎవడు చేసేదేమున్నది ? ఇది అనాదినుంచి జరుగుతూనే ఉంది. వాళ్లే వెళ్లారు. త్రిగిరీశనదివద్ద రాజ్యాలు స్థాపించారు. కిందపడ్డారు పైనపడ్డారు. క్రొత్తగా వలసలు వచ్చారు. వాళ్ళకీ వీళ్ళకీ యుద్ధాలు. అక్కడ భద్రముకాదను కొన్నారు. యూపరతీశ నదివద్దకు పోయినారు. అక్కడ కొంత భద్రత పర్పడ్డది. ఎందుకంటే ఈ క్రొత్తమతాలు స్థాపించి భారతదేశమునుండి వెళ్ళకొట్టబడి వలసవచ్చే క్రొత్త జనుల తాకిడి అక్కడ తక్కువగా ఉన్నది. అక్కడా నాగరకత

వంటిది వృద్ధి పొందింది. కవిత్వాలు బయలుదేరినవి. గ్రంథాలు వచ్చినవి. అక్కడి మతాలు అక్కడి సిద్ధాంతాలు విపరీతముగా ప్రబలినవి, ఇదివరకు చెప్పాను. ఆకాశాది దేవతకు అను దేవత అని సుమేరు దేశస్థులు పేరు పెట్టుకొన్నారు. సముద్రాది దేవతకు ఏక్‌వీల్ (అనగా అనులీల) అని పేరెట్టుకొన్నారు. బైబులులో చెప్పబడ్డ ప్రళయ సముద్రము ఉన్నదే దాన్ని గురించి సుమేరు భాషలో ఒక పద్యమున్నది.

> ఈ అను అనులీలయు తమ ఆజ్ఞను లోకము ధిక్క
> రించినదని
>
> ఘనులైన దేవతల సభలో ఒక నిశ్చయము చేశారు
>
> భిన్నమతాల కూడలులలో
>
> ఉన్న జనాన్ని నశింప చేద్దామని
>
> మహాశక్తిగల తుపాను గాలులన్నీ ఒక్కటియై
>
> విహారము చెయ్యవలెనని ఒకేసారి ముట్టడించవలెనని
>
> ఏడు పగళ్ళేడు రాత్రులు ప్రళయ సముద్రం ప్రళయ
> సముద్రమే మానవజాతిని
>
> పాడు చేయాలని గాదు పట్టిచాలని
>
> తుపానుగాలులు కృపావిహీనంగా పెద్దపడవను
>
> తుపాదివాలు కుదిలించగా కుదిలించగా చీకటిమయం
> కాగా

ద్యుమ్నాద్రుడు పడవ కిటికీని తెరిచాడు ఉటూ దేవత
లోనికి వచ్చాడు
ద్యుమ్నాద్రుడు రాజు అతడుటూకు సాష్టాంగపడ్డాడు

ఉటూ అంటే ఉషఃకాలము కాంతిరేఖ. తెలుగులో ఊటుట అనే ధాతువు ఉన్నది. అనగా విసరుట. చొచ్చుకొని పోవుట. ఇది తెలుగుమాట.

ఈ రీతిగా రకరకాలుగా ఆ నాగరకతలు సాగినవి. సముద్రాలు తీసినవి. ఒక చమత్కారమున్నది. త్రిగిరీశ యూపరతీశనదులు ప్రవహించే దేశము రెండు నదులమధ్య చాలా దూరమున్నా సమాన లక్షణం కలదిగా ఉంటుంది. దివారాత్రములు సంవత్సరంలో చాలాకాలము నిర్మేఘంగా ఉంటుంది. ధాత్రి పండుతుంది. జనము సుఖంగా నదీతీరముల యందు నివసించవచ్చు. పశువులను పెంచవచ్చు. నదులమీద ప్రయాణాలు సాగించవచ్చు. సుమేరుదేశము దక్షిణాన ఉన్నది. అక్షతదేశము ఉత్తరాన ఉన్నది. ఆ మొదటి రోజులలో భారత దేశమునుండి వచ్చేజనము మూలముగా ఈ ప్రాంతాలయందు భద్రత తక్కువగా ఉండేది ఆ రోజులలో మ్లేచ్ఛభావాలు కల వాళ్ళని వేదధర్మమును పాలించేరాజులు మాటిమాటికి వెళ్ళ గొడుతూ ఉండేవాళ్ళు. తరువాత తరువాత అనగా రెండు మూడువేల యేండ్లకు పూర్వమునుంచి వేదధర్మముయొక్క పటుత్వము తగ్గిపోయింది. కాలము మారిపోయింది. కాలము నకు శక్తి లోపించింది. కలికాలము వచ్చింది. కలికాలములో

రెండువేల యేండ్లు గడిచేటప్పటికి ధర్మము తపస్సు వైదికమైన శక్తులు క్షీణదశను పట్టినవి. జనానికి విశ్వాసము సడలిపోయింది మనోనిగ్రహము తగ్గింది. తపస్సుచేత బహు విషయాలను సాధించవచ్చుననే లక్షణం సర్వము భగవదధీనమనే విశ్వాసము క్షీణించి అంతా పౌరుషముమీదనే సాధించవచ్చు అనే భావము వృద్ధిపొందుతూ వచ్చింది. ఒక భావమేమి ఒక పదార్థమేమి ఒక వస్తువేమి మొదట్లో స్వచ్ఛంగా పరిశుద్ధంగా శక్తివంతముగా ఉండి కాలము గడచినకొద్ది స్వచ్ఛత్వము మాసిపోతుంది. పరిశుద్ధత్వము తగ్గిపోతుంది. పటుత్వము లోపిస్తుంది. శరీరానికి మొదట్లో బాల్య యౌవనదశలలో ఉన్నస్థితి కౌమారములో కొంచెము తగ్గి వార్ధక్యములో పూర్తిగా తగ్గుతుంది. ఒక తోట ఉన్నది. నలభై యేండ్లు సమృద్ధిగా కాస్తుంది. తరువాత చెట్లు ముసలివైపోతవి. ఆ చెట్లు కొట్టివేసి వంటచెఱకు చేసికోటము మళ్ళీ క్రొత్తతోట కోసము మొక్కలు వేసికోటము. ఒక స్త్రీని ప్రేమించావు. ఆ మొదట్లో ఏమి సరదా ఏమి ఉత్సాహము ఏమి తద్భావన ? కాలము గడిచేటప్పటికి అంతా తరిగి పోయింది. ఇది లోకంలోఉన్న అన్ని విషయాల యొక్క స్వరూపము. కాలముయొక్క స్వరూపమే ఇది. మొదట కాలమునకు పటుత్వమున్నది. శక్తి ఉన్నది. ఆనాటికాలము తపస్సు చెయ్యటానికి యోగ్యమైన కాలము. కృతయుగములో మనుష్యులు అస్థిగత జీవులు. వాళ్ళ ప్రాణాలు బొమికెల నంటి పెట్టుకొని యుండేవి. త్రేతాయుగంలో చర్మగతజీవులు.

చర్మము ఉన్నన్నాళ్ళు వాళ్ళ ప్రాణాలుండేవి. ద్వాపర యుగములో మాంసగత జీవులు. శరీరములో మాంసము ఉన్నన్నాళ్ళు ప్రాణము ఉండేది. కలియుగములో జీవులు అన్నగత జీవులు. వరుసగా పది రోజులు అన్నము లేకపోతే చచ్చి ఊరుకొంటారు. ఇంకొక లక్షణమున్నది. పూర్వాపూర్వ యుగాలలో మనుష్యులు అధికాధికంగా దీర్ఘ దీర్ఘమై అయుర్దాయము కలవారు. అనంత బలశాలులు. పక్షులలో గరుత్మంతుడు జటాయువు సంపాతీ మొదలైనవారు ఉండేవారు. వానరులలో వాలి సుగ్రీవుడు అంగదుడు ఆంజనేయులు ఇలాంటివాళ్ళు పుట్టారు. మానవులలో ద్వాపరయుగము చివరకూడా వెయ్యి ఏనుగుల బలముకల ధృతరాష్ట్రుడు, వంద ఏనుగుల బలముకల భీముడు పుట్టారు. మరి ఇంకొక భేదము ఉండేది. రాక్షసులు దేవతలు మానవులు వాళ్ళకి కామచారత్వము ఉండేది. వాళ్ల ఇష్టమువచ్చిన రూపాలు ధరించటానికి వాళ్ళకి శక్తి ఉండేది. మానవులకు సురాసురులకు భేదమిది ఇంకొక లక్షణమున్నది. ఒక్కొక్క జాతియొక్క గుణాలనుపట్టి వాళ్ళ ఆకార విశేషాలు ఉండేవి. రాక్షసులకు కోఱలు మిడిగ్రుడ్లు తాడిచెట్టంత శరీరాలు ! ఇవన్ని కలికాలము వచ్చేటప్పటికి ఎక్కడి వక్కడ సర్దుకున్నవి. మానవులకు విశ్వాసశక్తి సడలిపోయింది. తపశ్శక్తి పోయింది. ఉత్తర ధ్రువ ప్రాంతములో ఉండే అసురులుకూడా గుణాలచేతనే రాక్షసులుకాని కోఱలు మొదలైనవి లేనివాళ్లుగా తయారైనారు.

# 2

"నీవు నన్ను ఎట్లాగైనా ఇక్కడనించి పంపించాలని ఊహిస్తు న్నావు నేనిక్కడనించి వెళ్ళను. నేను నిన్ను వదలిపెట్టి ఉండలేను"

"నీవు నాకు బరువుగా ఉన్నావు. నామీద ఆధారపడి ఉన్నావు. మన ఇద్దరికి తెచ్చే అన్నము నీ ఒక్కడికి చాలదు. నేను నాలుగన్నాలు తెప్పిస్తుంటే నీవు మూడు అన్నాలు తింటున్నావు. నాలుగన్నాలు నెలకు రెండువందల రూపాయ లవుతున్నది. ఒక స్త్రీమీద ప్రేమఉంటే దానిమీద ఆధారపడి బ్రతకకూడదు. నాకు వేరే భర్త ఉన్నాడు. అతనికి తెలిస్తే మన ఇద్దర్ని చంపుతాడు"

"ఎప్పుడూ చంపడు. చాలా సంతోషిస్తాడు. ఆధునిక నాగరకత అంటే అంత తెలియని వాణ్ణనుకున్నావా? ఏమిటి? ఇష్టములేని స్త్రీని బలవంతము చేయకూడదు. తన భార్యకు

ఇంకొకడిమీద ప్రేమ ఉన్నది. అంటే వాళ్ళ ఇద్దరిని సంధాన పరచటం ఆధునిక నాగరికతకు శిఖరీభూతమైన విషయము. అధములు ఆ భార్యను చంపుతారు. మధ్యములు విడాకులిస్తారు ఉత్తములు సంధాన పరుస్తారు"

"నేను నిన్ను ప్రేమించటము లేదు. నన్ను నీవు బలవంతము చేస్తున్నట్లు అర్థమౌతుంది. నీవు శిక్షార్హుడ వవుతావు. నిన్ను చంపుతాడు"

"నీకూ నాకు సంబంధము ఉన్నదని నేను చెబుతాను. అప్పుడతనికి తెలుస్తుంది"

"ఓరి పిచ్చివాడా ! నా మాట నమ్ముతాడు గాని నీ మాట నమ్మడు"

"ఇంతకు నీవు నన్ను ప్రేమిస్తున్నావా లేదా ? ఆ సంగతి చెప్పు"

"ప్రేమ అంటే ఏమిటో నాకు మొట్టమొదట చెప్పు. వెధవ కవిత్వం మాట్లాడకు. విషయం విషయంగానే చెప్ప గలిగితే చెప్పు. ప్రేమ ప్రేమ అని గంతులువేసే వాళ్ళని నే నెరుగుదును వాళ్ళకి బుఱ్ఱలుండవు. ఒక్క ప్రేమయే కాదు. అనేక సిద్ధాంతాలు అనగా ఇజములు పట్టుకొని నరీనృత్యంతే అనగా ఎడతెగకుండా తైతక్క లాడుతున్నారని అర్థం. వాళ్ళ మనస్సు లేమిటో వాళ్ళకి తెలియవు"

"నీకు సంస్కృతము కూడా వచ్చునే"

"నీకు ఇది సంస్కృతమని తెలిసిందే! చిన్నప్పుడు మా నాన్న నాకు సంస్కృతం చెప్పించాడు. అదే మా అన్నయ్యకు నాకు భేదము. అతనికి సంస్కృతమూ రాదు తెనుగూ రాదు. నాకు రెండూవచ్చు. బాగా వచ్చని చెప్పాలి. ఎప్పుడో పతంజలి శాస్త్రిని పిలిచి వాడలగొట్టాలి. మా మేనత్త కొడుకున్నాడు, మీ చెల్లెలున్నది. వాళ్లందరు పెద్ద పండితులమని వాళ్ల ఉద్దేశం. ఒక పథకం వేశాను. పది రోజుల్లో అంతా తేలుస్తాను. నీవుండగా ఆ పథకం సాగదు. కనుక నామాట విని నీవు వెళ్లు. ఇవ్వాళనే వెళ్లు. నీవు వెళ్లేందుకు నీ ఇతర ఖర్చులకు జాకబ్ నాలుగువందల రూపాయలు పంపించాడు. వెళ్ళి ఉద్యోగంలో ప్రవేశించు. నీవు బాగుపడవలెనంటే నీమీద నాకు దయ కలుగవలెనంటే పోయి మేరీని పెళ్ళిచేసుకో. నేనుచెప్పినట్లు చెయ్యి. నీపని నిమ్మకాయవాటము చేస్తాను"

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను అని నీవు నోటితో అను. నేను వెళ్ళుతాను"

"ఓరి దేవయ్యా ఖాన్ బహద్దర్! నీవు దానిమీద కూర్చో అని అంటే అది కుర్చీవలె కనిపిస్తూ ఉంటే అది కుర్చీయే అయితే అదికుర్చీ అనిచెప్పు. అప్పుడు నేను దానిమీద కూర్చుంటానన్నట్లుంది"

"అయితే వెడతాను. చెప్పక పోయినానంటే అదికుర్చీ అని జ్ఞాపకముంచుకో"

సోఫియా ఒకనవ్వు నవ్వింది. సోమనాథము పురుషుడు గనక, అందులో ఆమె తనకు ప్రథమ పరిచితురాలు గనుక, స్త్రీ అన్నది ఎరగటం వానిజన్మ కిదే మొదలు గనక, ఈ ఎర గటం సృష్టిలో అధిక సంఖ్యాకులలో జీవితాంత మదే అనే లక్షణం భగవంతు డేర్పాటు చేసినట్లు కనిపిస్తుంది గనక; ఆ ఏర్పాటు చెయ్యటం వల్లనే సృష్టి హద్దులలో ఉంది. సంఘ ములు జాతులు సాగుతున్నవి. జీవులయొక్క నియమిత ధర్మ ములు పరిపాలింపబడుతూ సంఘమునందు వ్యవస్థ ఉంటున్నది— ఆ నవ్వు చూడటంతోచే వానికి బ్రహ్మాండమైన దుఃఖము వచ్చింది. ఏదో ఒక అమృతపు పాత్రని చేతికందిచ్చి ఒకగ్రుక్క మ్రింగటంతోచే తక్కిన దానిలో విషం పోసినట్లుంది. కాని మానవుని ఆశ విచిత్రమైనది గదా! తేనె చిక్కని ద్రవ్యము గనక పైనపడ్డ రెండు విషపుబొట్లు వెంటనే అట్టడుగునకు పోవు. ఒక గరిటెతో ఆ పై భాగము తీసివేస్తే తక్కిన మధు వంతా సేవ్యమౌతుంది; అనుకుంటాడు. ఆ ఆశమీద బ్రతుకు తాడు.

ఆ రాత్రికి సోమనాథాన్ని సోఫియా రై లెక్కించింది. అతడు రై లెక్కాడో లేదో తెలియదు. అతని శరీరం ఎక్కింది. ఆ శరీరము ఢిల్లీ వెళ్ళుతున్నది. మనస్సు చిత్రమైంది. శరీరము ఢిల్లీ వెళ్ళేందుకు కావలసినంత మనస్సు దాన్ని అంటుకొని ఉంటుంది అదీ అర్ధము. అదీ లేకపోతే అది శవము అవుతుంది. ఇదివరకు ఢిల్లీ వెళ్ళాడు. అప్పుడు శరీరము ఏ కొద్దిపాలులో

ఉన్నదో ఇప్పుడు మనస్సు ఆ కొద్దిపాలులో ఉన్నది. అప్పుడు ప్రాధాన్యము మనస్సునకు ఇప్పుడు ప్రాధాన్యము శరీరానికి. అప్పటికి ఇప్పటికి భేదమేమిటంటే అప్పుడు జేబులో నాలు గణాలైనా లేవు. ఇప్పుడు జేబులో నాలుగు నందలున్నవి టిక్కెట్టు సోఫియా కొనిచ్చింది.

అతని కథ తర్వాత. ఇక్కడ సోఫియా మరునాడు ఉప న్యాసానికి వెళ్ళింది. ఉపన్యాసము ఇలా ఉన్నది.

"త్రిగిరీశ యూపరతీశ నదులమధ్య నివాస యోగ్య మైన దేశమున్నది. ఉత్తరాన్నించి దక్షిణానికి మూడు రాజ్యా లున్నవి, బాగా ఉత్తరాన అసురులు ఉన్నారు. నడుమ అతిత దేశమున్నది. రెంటికి దక్షిణాన సుమేరు దేశమున్నది మేరు పర్వతముమీద దేవతలు ఉంటారని మన పురాణాల్లో ఉన్నది. మనకొక సంవత్సరమైతే వాళ్లకొక్క దినమౌతుంది అని లెక్క. అనగా వాళ్ళకు మన ఆరునెల్లుపగలు, ఇంకొక ఆరునెల్లురాత్రి. ఇప్పటికి కూడ ఉత్తరధ్రువ ప్రాంతాలల్లో అంతే. అక్కడ ఆరు నెలలు చీకటి. తక్కిన ఆరునెలలు వెలుతురు. దీనిబట్టే ఆధునిక చరిత్రకారులు ఆర్యుల నివాసము తొలుత ఉత్తర ధ్రువందగ్గర ఉండేది అని వ్రాస్తున్నారు. ఆర్యులు వేరు. సురలు వేరు. సురలు అనగా దేవతలు. ఆర్యులు మానవులు. ఎట్లా పొసగు తుంది? ఆ ఉత్తర ధ్రువందగ్గర ఉషఃకాలమనేది నెలనాళ్లు ఉన్నా ఉంటుంది. ఋగ్వేదంలో ఉషోదేవతను గూర్చి చాలా

ఋక్కులు ఉన్నవి. అందుచేత ఆర్యులు అక్కడివాళ్లు అని అంటున్నారు. ఋగ్వేదంలో వరుణుడు ఇంద్రుడు అపాన్నపాత్ దేవతలు సవితయముడు మొదలైన పెక్కు దేవతలను గురించిన స్తోత్రములున్నవి. వరుణుడు జలాధిదేవత. అపాన్నపాత్ దేవతలు జలాధి దేవతలు. ఇంద్రుడు పర్జన్యాధిపతియైన దేవత. ఆ ఉత్తర ధృవందగ్గర ఈ దేవతల ప్రసక్తి అంత ఉండదేమో! అది అల్లాఉంచి ఉత్తర ధృవందగ్గర ఉన్న మనుష్యులు మన సంవత్సరంలెక్క ఒకరోజుగా వందయేండ్లు బ్రతకాలిగా. ఈ లెక్క కుదిరేటట్లులేదే, సరే వాళ్ళ ఊహాలు వాళ్ళవి మనకెందుకు? ఒక విషయ మేమిటంటే ఆ అసురులు సుమేరు దేశంలో ఉండే జనమువలె సురూపులుకారు. సుమేరుదేశంలో వాళ్లుకూడ అంత సురూపులుకారు. ఈశపీఠదేశంలో ఉండే వాళ్ళు మనదృష్టిలో అందమైనవాళ్ళు. బక్క పలుచనివాళ్లు దీర్ఘనాసులు సూదులవంటి కన్నులు కలవాళ్లు అని ఎలా తెలుసునంటే వాళ్ళ శరీరాలు చెడిపోకండా ఇప్పటికి ఆ గోళాకృతులైన సమాధులలో ఉన్నవికదా! మరిన్ని వాళ్ళ బొమ్మలు రాళ్ళమీద చెక్కబడి ఉన్నవి. అల్లాగే ఆనాటి సుమేర్యతుశాసుర దేశీయుల బొమ్మలు కూడ త్రవ్వకం పెట్టిన భూగర్భంలో రాళ్ళమీద మట్టిపెంకులమీద వెతికివచ్చిన గోడల మీద కనిపిస్తూ ఉన్నవి. అందుచేత ఆధునిక భూగర్భ శాస్త్ర వేత్తలు చెప్పారు. సుమేరు దేశీయులు కొంచెము పొట్టివారు. కొంచెము బొద్దుగా ఉంటారు. ముఖంలో తేజస్సు తక్కువ.

అక్షత దేశీయులు ఇంతకంటె మోటుగా ఉంటారు. అసురులు మరీ మోటు. ఇంతంతలావు పెదవులు క్రూరములైన నేత్రాలు, దృఢకాయులు. స్వభావముచేత అతిక్రూరులు. సుమేర్యాక్షత దేశీయులు పరస్పరం కొంత లావాదేవీలు కలిగి ఉండేవాళ్లు ఆసురదేశీయులకు వీళ్ళకు ఎప్పుడూ విరోధమే. అసురు లెప్పుడూ వీళ్ళమీద దండయాత్రలు చేయటమే. వీళ్ళ ఊళ్లు తగలబెట్టడము ధన ధాన్యాదులను దోచుకొని పోవటము వీళ్ళ స్త్రీలను ఎత్తుకొనిపోవటము. అనాదినుంచి రాక్షసులింతే. పురాణాలలోని రాక్షసులు ఇంతే. కొన్ని వేల యేండ్లక్రింద రాక్షసులు ఇంతే. ఇప్పటి రాక్షసులు ఇంతే. అనగా ఊళ్లు తగలబెట్టడము దోచుకపోవటము స్త్రీల నపహరించటము మొదలైన గుణాలు భగవంతుడుసృష్టిచేస్తూనే రాక్షస గుణాలుగా నిర్ణయించాడు. పూర్వయుగాలలో రాక్షసులకు కోఱలు ఉండేవి. వాళ్లు కామ రూపులు. ఆ యుగములతో ఆ లక్షణాలు పోయినవి కలి కాలము వచ్చేటప్పటికి గుణాలు మాత్రము మిగిలినవి మరి ఒక్కొకప్పుడు ఆ రాక్షసులలో గుణాలు మాత్రమే ఉండి ఆకారముచేత వాళ్ళుకూడ దేవతలవలె ఆర్యులవలె ఉండటము మొదలు పెట్టారు. ఈ నాగరకతలయొక్క పరస్పర సంఘర్షణలతో ఆ రెండునదుల నడిమి ప్రదేశము వెయ్యి రెండువేల యేండ్లు రాజ్యాలు పంటలు కోటలు మొదలైనవి సాగినవి, ఇంతలో జనము పెరిగారు. ఆ దేశము చాలలేదు. జనము పడమరకు ప్రయాణము చేశారు. మధ్యధరా సముద్రముదాకా

వ్యాపించారు. ప్రతి చిన్న దేశములో అది ఒక చిన్న జాతిగా బయలుదేరారు. అవ్వే మాటలు ఇంకొకరీతిగా ఉచ్ఛరించటం. ఒక ఇంగ్లీషు భాష ఉందనుకోండి. ప్రాత ఇంగ్లీషు క్రొత్త ఇంగ్లీషు అని రెండు ఉన్నవి. ఇంగ్లీషువాండ్ల ఇంగ్లీషు అమెరికన్‌వాండ్ల ఇంగ్లీషు అని రెండువున్నవి. మాట్లాడే ఇంగ్లీషు పుస్తకాలలోని ఇంగ్లీషు అని రెండు వున్నవి. ఒకటే భాష పది జిల్లాలల్లో పది రకాలుగా ఉంటుంది. ఒక సమానత్వము ఉంటుంది. భేదాలుగూడ సమృద్ధిగా ఉంటవి. కృష్ణా గుంటూరు జిల్లాలల్లో కుఱ్ఱవాడు పిల్లవాడు అంటాము. గోదావరి విశాఖ పట్నం జిల్లాలల్లో పోరడు అంటారు. ఆ వేపున ఆడపిల్లని గుంట అంటారు. తెలంగాణాలో మగపిల్లవాడు పుట్టాడు అనటానికి మోతగాడు అంటారు. ఆడపిల్ల పుట్టిందనటానికి సొన్నాయి పుట్టిందంటారు. ఏరాలు, అరమర మొదలైన శబ్దాలు కృష్ణా గోదావరి జిల్లాలలో గ్రాంథికాలు. తెలంగాణంలో వాడుక భాష. పొద్దుటే అంటే దత్తమండలాలల్లో వెళ్ళటము కృష్ణా గోదావరుల నడుమ గొయ్యిత్రవ్వి పాతిపెట్టడం, ఇవన్నీ అర్థవిపరిణామాలు అంటారు. వీటిని అట్లాఉంచి శబ్దాలుమారిపోతవి. వచ్చుచున్నాడు, వస్తున్నాడు. వస్తున్నడు. వసుత్తుండు. వస్తుండు ఇట్లా శబ్దాలు రకరకాలుగా మారిపోతవి. రూపాన్ని గుర్తు పట్టటానికి కూడ వీలులేదు. ఒక ప్రాంతములో ఒకభాష మాట్లాడుతూ ఉంటారు. వందయేండ్లు గడిచేటప్పటికి ఆ భాషే ఇంకొకరీతిగా వినిపిస్తుంది. నేనొకసారి బొంబాయివెళ్ళి పూనా

నించి ఔరంగాబాద్ రైల్లో ప్రయాణము చేస్తున్నాను. పూనాలో పాతిక ముప్ఫయిమంది కూలివాండ్లు స్త్రీపురుషులు రైలు ఎక్కారు. వాళ్లు వాళ్ళల్లో ఏదో మాట్లాడుకొంటున్నారు. అది హిందీకాదు. మహారాష్ట్రం కాదు. ఏ భాషో తెలియలేదు. అయిదారు స్టేషన్లు వెళ్ళిన తర్వాత నాకు బోధ కట్టింది. అది తెలుగుభాష. కొన్ని వందలయేండ్ల క్రింద పీష్వాల కాలంలో తెలుగు వాళ్ళనేకమంది మహారాష్ట్రదేశము వెళ్లారు అక్కడే నిలచిపోయినారు. వాళ్ళందరు ఇవాల మహారాష్ట్రమే మాట్లాడుతారు. కాని వాళ్ళ ఇళ్ళల్లో ఇప్పటికి తెలుగే మాట్లాడుతారు. ఆ తెలుగు ఇల్లా మారిపోయింది. నాలుగైదు వందల యేండ్లల్లో ఒకభాష ఇట్లా మారిపోతే భారతదేశాన్ని వదలిపెట్టిపోయిన జాతులు వేలకొలది సంవత్సరాలు పరదేశాల్లో ఉంటే అక్కడ పరిస్థితులు భిన్నముగా ఉంటే అదేభాష పూర్వాపూర్వులచేత పలు వికారాలు పొందినది వేరేభాషగా వ్యవహరింపబడుతూ వస్తే శబ్దాలు ఎన్నిరకాలుగా మారవచ్చు? పైగా ఈ ఉచ్చారణ నియమితముగా ఉండదు. తినే పదార్థాలనుబట్టి ఆచారాలనుబట్టి శీతోష్ణస్థితులనుబట్టి పరిస్థితులనుబట్టి తెగమారుతూ ఉంటుంది. కొన్ని శబ్దాలను గుర్తించటానికి వీలౌతుంది. కొన్నిటిని గుర్తించటానికి వీలేఉండదు. అలాగే మనుష్యుల ఆకార విశేషాలు ముఖలక్షణాలు తెగ మారి పోతవి. ఒకేజాతి ఒకేచోట కొన్ని వందలయేండ్లు ఉంటె అవి స్థిరపడి పోతవి. తత్తత్కాలములయందు అది వేరేజాతి అనే

వ్యవహారము చేయవచ్చుగాని అది స్వతంత్రముగా ఉద్భవించింది అని అనటానికి వీలులేదు. తెలుగులో వెళ్ళుట అనే ధాతువు ఉన్నది గమనము చేయుట అని అర్థము. ఇది దేశ్యశబ్దముగా పరిగణిస్తారు. దేశ్యమనగా సంస్కృత భాషలోనుంచి పుట్టలేదు. సహజముగా ఈ దేశములో పుట్టింది. ఎట్లా పుట్టిందో తెలియదు అని అర్థము. తీరా చూస్తే సంస్కృత వ్యాకరణములో ధాతు పాఠములో వేల్ గమనే అన్న ధాతువు ఉంది. వెళ్ళుట సరిపోతున్నది. ఇల్లా కొన్ని శబ్దాలని మనము పరిశీలించకుండా దేశ్యము అంటాము. పరిశీలిస్తే చాలా దేశ్య శబ్దాలకు సంస్కృత మాతృకలు దూరముగా గోచరిస్తవి. మాతృక గోచరించటానికి వీలులేనంత మార్పులుకూడ భిన్న భిన్న దేశాలల్లో అనంతకాలము మీద జరుగుతుంది. ఇది సృష్టి ధర్మము. సర్వ భాషలు సర్వజాతులు భారతదేశమునుంచి వెళ్ళినవాళ్లే ఎట్లా అయినారో అల్లాగే సంస్కృత భాషనించే పుట్టినవి. కొన్ని శబ్దాలు సందర్భాలనుబట్టి అక్కడక్కడ పుట్టవచ్చు. ధ్వన్యనుకరణ శబ్దాలు భిన్న స్థలాలల్లో ఉదయించవచ్చు. ఈశ దేశ భాషలోని హాప్ శబ్దమువలె మొట్టమొదట కనిపెట్టబడ్డ విమానముపేరు జప్లిన్. జప్లిన్ అనేవాడు దానిని కనిపెట్టాడు దానికా పేరు వచ్చింది. ఇట్లా చాలాశబ్దాలకి భిన్న భిన్నమైన ఉత్పత్తి స్థానాలు ఉండవచ్చు. అంతే. ప్రధానముగా సర్వ భాషలు సంస్కృతము నుండియే ఉదయించినవి. ఎందుచేత నంటే శబ్దము ఆలోచనలోనుండి పుడుతుంది. ఊహాకు అది

వికృతి. ధ్వన్యనుకరణాది శబ్దాలు తీసివేస్తే ఊహా లేకుండా వ్యుత్పత్తి లేకుండా ప్రధానములైన శబ్దము లుండవు. సుష్ఠుగా నిర్మింపబడిన భాషలో సర్వశబ్దాలకు వ్యుత్పత్తి ఉంటుంది. జగత్తు అంటే నడచినది—అంటే క్రియారూపమైనది. క్రియ లేకుండా జగత్తులేదు. క్రియలు మొట్టమొదట ఏర్పాటు కావాలె. ఒకడు ఒకచోటినించి ఇంకొకచోటికి వెళ్ళాడు గమనము చేశాడు గమించాడు. ఈ 'గం' అన్నది ధాతువు. ఇట్లా సర్వ క్రియలకు మొదటివి ధాతురూపాలు. వాటిమీద కృత్తులు తద్ధితాలు మొదలైన రూపాలు వస్తవి. కొన్ని నామములు ఏర్పడుతవి. వాటియొక్క తొలుతటి రూపముకూడ ఎప్పుడో ఎల్లాగో ధాతువునుంచే పుట్టివుంటుంది. ఈ మహాకార్యము కోట్ల సంవత్సరాలక్రింద భారతదేశములో జరిగింది ఒకప్పుడు జరిగినదనటానికి వీలులేదు. ఇల్లా నిత్యముగా ఉంది. ఒక ప్రళయము వచ్చింది. మళ్ళీ సృష్టి జరిగింది అంటున్నారు. సృష్టి జరిగిందంటే మానవజాతి సంపూర్ణంగా నశించి పోయిందని మళ్ళీ భగవంతు డీ మట్టిబొమ్మను నిర్మించాడని అర్థముకాదు. "తం సృష్ట్వాతమేవాను ప్రావిశత్" అన్న వేద వాక్యాని కర్థము బైబులులో సృష్టి జరిగిందని చెప్పినటువంటిది కాదు. మానవునియందు పరమేశ్వర చైతన్యము ఉన్నది. అది నిత్యమైనది అని అర్థము. వ్యవహార దృష్ట్యా అట్లా చెప్పబడుతుంది. ఇంతే దీని తాత్పర్యము.

ఉపన్యాసమైన తర్వాత సోఫియా పతంజలిశాస్త్రివద్దకు వెళ్ళి నమస్కారము చేసింది. సోమనాథశాస్త్రి ఏడీ అని ఆయన అడిగాడు. అతడు ఢిల్లీ వెళ్ళాడని ఆమె చెప్పింది. ఎందుకు అన్నాడు శాస్త్రి. సోఫియా "మా ఆడబిడ్డ ఉన్నది. ఆమె పేరు మేరీ. ఆమె ఇతనిని ప్రేమించింది. ఇతని విరహ మనుభవించలేక ఆమె వ్యాధిగ్రస్తురాలై మంచాన పడి ప్రాణావశిష్టురాలుగా ఉంది. ఇతన్ని ఒక్కసారి చూచి చచ్చిపోదామని ఆమె కోర్కె అని నా భర్త వ్రాశాడు. సోమనాథము పోనంటే పోనన్నాడు. నేను చెప్పాను ఇది పట్టి మానవ ధర్మము. భూతదయవంటిది. ఇందులో దోష మేమీలేదు. నీవు వెళ్ళి ఆవిడని చూస్తే ఆమె ప్రాణ నిష్క్రమణము గాసుఖం జరుగుతుంది. నీవు పుణ్యకార్యము చేసినట్లేకాని పాపకార్యము చేసినట్లుకాదు" అని బలవంతముచేసి పంపించాను. ఈ విషయంలో తమరి అభిప్రాయమేమిటో నాకు తెలియదు. కొన్నాళ్ళక్రింద మొదట్లో మీరు నేనున్నచోటికి వచ్చారు. మళ్ళీ ఒకసారి ఎప్పుడైనా దయచేస్తే సంతోషిస్తాను" అన్నది. పతంజలిశాస్త్రి 'ఇప్పుడే వస్తాను' అని బయలుదేరాడు.

# 3

"నిజమే. అరుంధతి మాలపడుచని చెబుతారు. నే నెప్పుడూ చూడలేదు. ఈ కథ ఏదో పురాణములో ఉన్నదట. పిళ్లను కొన్నట్లు లేదు. వసిష్ఠమహర్షి ఒక గూడెముమీదుగా వెళ్ళు తుండగా ఒక మాలపిల్ల ఆయన వెంటబడి వస్తున్నది. ఆయన వెనుతిరిగి చూచాడు నావెంట రాకు. వెళ్ళి పొమ్మన్నాడట. కొంత దూరము వెళ్ళి చూస్తే ఇంకా వెంటనే వస్తున్నదట. ఆయన ఆ అమ్మాయి మనస్సు గ్రహించాడు. 'ఛీ!' అని ఆమెను తన తపోగ్నిచేత తగులబెట్టాడు. ఆమె భస్మమై పోయింది. మళ్ళీ తిరిగి వెళుతున్నాడు. ఆయనకు జాలివేసింది. మళ్ళీ ఆవిడ్ని బ్రతికించి నీ దారిని నీవు పో అని తన దారిని తాను వెడుతున్నాడు. మళ్ళీ కొంచెము దూరము వెళ్ళి చూస్తే మళ్ళీ వెంటనే వస్తున్నది. మళ్ళీ తగులబెట్టాడు. మళ్లీ జాలి పడ్డాడు. మళ్లీ బ్రతికించాడు. ఇలా వందసార్లయింది. ఆవిడ ఎట్లాగూ వెనక్కి తిరిగి వెళ్లదు. ఆవిడ తనమీద ప్రేమతో వస్తు

న్నది. అప్పుడామెను వివాహమాడాడు. ఇది పురాణములో ఉన్న కథ. అరుంధతి మాలపడుచు అని కొందరు వేసే గంతులకు ఈ కథకు ఏమి సంబంధము ? అవిడ వంద జన్మలెత్తిన తర్వాత అనగా వందసార్లు భస్మము చేయబడి బ్రతికించబడిన తర్వాత అనగా ఈ వంద జన్మలలోను అవిడ ఏకాగ్రత అలాగే ఉన్న తర్వాత ఆ వందజన్మలు కాలపరిమితి తక్కువది యగుట చేత ఆమెచేసిన వేరొక కర్మ లేకపోవుటచేత వంద జన్మలు అచ్చముగా పరిశుభ్రములై ఉండుటచేత ఆ మొదటి జన్మయే సంపూర్ణముగా మహాగాఢమైన ఏకాగ్రతగల నిశ్చయము కలిగి ఉన్న జన్మ అవటముచేత ఆమెయొక్క వెనుకటి ఎన్నో జన్మలు మహాతపస్సమాధి నిష్ఠములై ఏ కించిద్దోషము చేతనో పంచమ కులంలో పుట్టటం మాత్రం జరిగింది కాబోలు. అటువంటి ఆమెను తత్పూర్వము అనేక జన్మలయందు మహా తపస్సంపన్నురాలిని అప్పుడెత్తిన ఆ మాలజన్మ వలన కలిగిన దోషాన్ని వందసార్లు భస్మముచేసి వందసార్లు బ్రతికించినదాన్ని మాలపడుచు అనటం ఎలా ఉంది ? మకరధ్వజాన్ని చూచి ఇది పాదరస మన్నట్లున్నది. పాదరసము తాగితే చస్తావు. మకరధ్వజాన్ని సేవిస్తే ఆయుర్వృద్ధి వాజీకరణము. వంకాయ కూర చూచి ఇది ఎమోనియా అనటము, వట్టివంకాయ ఎవడూ తినడు తరిగి కారు పోయేందుకు నీళ్లతోకడిగి అల్లము పచ్చిమెరపకాయలు జీలకఱ్ఱ మొదలయినవి వేసి ఉప్పువేసి నేతితోనో నూనెతోనో పోపుపెడితే తినటానికి యోగ్యమౌతుంది.

వట్టి వంకాయను ఎవరూ తినరు. వంకాయ అన్నా ఫరవాలేదు. వంగవిత్తు అనటం ఎట్లు ? అట్లాచూస్తే మనము ప్రతివాళ్ళము వంద జన్మలక్రింద ఎవళ్ళమో ! వంద జన్మలక్రింద నువ్వు నేను ఒక పిల్లిజన్మ ఎత్తి ఉండవచ్చు. ఒక కుక్కజన్మ ఎత్తి ఉండ వచ్చు. నిన్ను జాకబ్ పెండ్లిచేసికొన్నాడు. నీవు వంద జన్మల క్రింద కుక్కవు. కుక్కలన్నీ కలిసి సోఫియా మా కుక్క జాతిది అని జాకబ్ కొంపనిండా చేరితే అతనికి మూడువేల రూపా యల జీతముగదా ! అందులో క్రైస్తవుడు ఆయన దగ్గర ఉంచే రివాల్వరు ఉండవచ్చు. ఉంచే ఈ కుక్కల నన్నిటిని షూటు చేస్తాడు"

"ఆ వందజన్మల క్రింద ఆమె మాలది అనుకొందాము. కాని మనిషికదా. ఆమెకి కోర్కెలు ఉన్నవికదా. సుఖవాంఛ ఉన్నదికదా. చీము నెత్తురు లున్నవికదా. ఈ వందజన్మలెత్తిన తర్వాత కూడ ఆ కోర్కెలు ఆసుఖ దుఃఖానుభవ పరమార్థము అదేకదా ! పెద్ద భేదము ఏమీ కనపడదు"

"అయితే ఆ లెక్కను పశువులకు మానవులకు కూడ భేదములేదు"

"పశువు లాలోచించలేవు. మన మాలోచించ గలుగు దుము. అవి మాట్లాడలేవు మనము మాట్లాడగలుగుదుము. ఈ భేదము పెద్దగా ఉన్నది"

"మాట్లాడటము అట్లా అట్టిపెట్టు. అవి ఆలోచించ గలవు. పులి ఒకచోట కొడుతుంది. మళ్లీ అక్కడ కొట్టదు.

కొన్ని మైళ్ళదూరము పోయి అక్కడ కొడుతుంది. మానవులను చంపటము అలవాటైన పులులను వేటాడే వేటకాండ్లు వ్రాసిన గ్రంథాలు చదివితే మృగాలకు ఎంత తెలివి ఉన్నదో తెలుస్తుంది. మనవాండ్లు సామాన్యంగా పిపీలికాది బ్రహ్మ పర్యంతం అంటారు. పిపీలిక అంటె చీమ బ్రహ్మ అంటే చతుర్ముఖ బ్రహ్మ.అక్కడ ఇక్కడ చైతన్యము ఒకటే మోస్తరుగా ఉంటుందని అర్థము"

"ఆ బ్రహ్మ చతుర్ముఖ బ్రహ్మ ఎందుకు కావాలి ? బ్రహ్మ పదార్థంలో ఉన్న బ్రహ్మ ఎందుకు కాకూడదు ? బ్రహ్మానందము వలెనే"

"బ్రహ్మానందములో ఉన్న బ్రహ్మకూడ చతుర్ముఖ బ్రహ్మ అనే అర్థము. బ్రహ్మ పదార్థమునకు ఆనందము ఉపలక్షక శబ్దము కాని స్వరూప లక్షక శబ్దముకాదు. బ్రహ్మ పదార్థము నిర్గుణము. చైతన్యము దాని స్వభావము. బ్రహ్మ విష్ణు మహేశ్వరులయందు తక్కిన దేవతలయందు మానవులయందు ఈ చైతన్యము ఉంటుంది. చతుర్ముఖ బ్రహ్మయందూ ఉంటుంది"

"చైతన్యమంటే వృత్తిచేత అనుమీయమాన మయ్యేది కదా"

పతంజలిశాస్త్రి ఆశ్చర్యపోయినాడు. ఇంతవఱకు ఆమె చాలా వివేకవతి మాత్రమేనని అనుకొన్నాడు. ఆమె పండితు

రాలని అనుకోలేదు. ఈ తెలివి ఏమి ? ఈ పాండిత్య మేమి ? జ్ఞాకబును పెండ్లి చేసికోటమేమి ? అని ఇలా అన్నాడు.

"ఔను వృత్తిచేతనే చైతన్యము తెలియబడుతుంది"

"అయితే ఈ చైతన్యానికి బ్రహ్మ పదార్థానికీ అభేద ప్రతిపత్తి కావాలి. సనత్సు జాతీయ భాష్యములో కాబోలు. ఆత్మకు చైతన్యానికి గల సంబంధము భిన్నమా? అభిన్నమా ! భిన్నాభిన్నమా ? అని శంకర భగవత్పాదులు విచారణ చేశారు. చివరకు చైతన్యము ఆత్మయొక్క స్వభావమని నిర్ణ యించారు. వానికి వాని స్వభావానికి భేదమేముంటుంది. స్వభావ మణురూపంగా ఉంటే ఆ అణువులు వానిలో అంత ర్భూతమై రెండూ ఒకటే అవుతుంది. కాదనటానికి వీలుం డదు"

"నీతో మాట్లాడటం కష్టమల్లే ఉందే ! కాని ఒక్కటి చూడు—చైతన్యమని వృత్తి అని నీవే అన్నావుకదా. ఒక తటాకము ఉన్నది. జలము స్రవణశీలము. నీరు తటాకములోంచి కదలదు, కట్ట తెగేవరకు నేను ప్రవహించగలనని ఆ తటాక మనుకోదు. లోకములో మనుష్యులూ అంతే. ఒకపని చేయ వలసి వస్తుంది. ఇది నేను చేయగలుగుదునా అని అనుకొంటాడు. చెయ్యక తప్పదు. ఆరంభిస్తాడు. చేస్తాడు. చెయ్యగలుగుదునే అనుకొంటాడు. ఆ చెయ్యటమనేది ఎట్లా జరిగింది ? చెయ్యట మంటే ఏమిటి ? ఒక పని చెయ్యటమంటే ఏమిటి ? ఆ పనిలో ఉన్న భావములో వస్తువులో విషయములో ముందు వెనక

ప్రక్కలు పైభాగము అధోభాగము ఆ ఈ దెసలకు సర్దుకోటము కదలటము పూర్వస్థితినుంచి మరియొక స్థితికి రావటము. ఇదీ ఒకపని చెయ్యటమంటే అది అల్లా జరగటానికి పనిచేసినవాడు కర్తవలె కనిపించటము వాని అంతట అవి జరిగే లక్షణము వానియందే ఉన్నది. దానికి ఒక శక్తి సహాయము చేయటము చేసినట్లు కనిపించటము చేసిందో లేదో తెలియదు. ఇది ఒక విచిత్రమైన సూక్ష్మతరమైన భ్రాంతి. దానిని పరమ గాఢమైన హృదయాంతరాంతర పరమ సుకుమార లక్షణంచేత గ్రహించ వలసినదే తప్ప స్థూలముగా గ్రహించటము కష్టము. అది అట్లా ఉంచి జంతువులకు వివేకము ఉంటుంది. మనుష్యులకు ఎంత ఉంటుందో జంతువులకు అంత ఉంటుంది. మనుష్యులలో మాత్రము వివేకము అందరికి సమానంగా ఉంటుందా? ఉంటే ఒకడు మహాకవి కావటమెందుకు? తక్కినవాళ్ళు సామాన్య కవులు కావట మెందుకు? ఒకడు పెద్ద రాజకీయవేత్త కావట మెందుకు? తక్కినవాళ్ళు వాడితోకను పట్టుక వేళ్ళాడట మెందుకు? ఒకరాజ్య నిర్మాణములో మానవులయందెంత వివేకము కన్పిస్తున్నదో చీమలలో అంత వివేకమున్నదని ఆధు నిక పరిశోధకులే నిరూపించారు. ఆ చీమలలో రాజు మంత్రులు సైనికులు సేనానాయకులు యుద్ధాలు సైన్యాలు నడపటాలు ఆహార పదార్థాలను సమకూర్చుకోటాలు ఈ గోల అంతా ఉందిట. ఇదంతా పూర్వము మనవాళ్ళకు కూడ తెలుసు కాబోలు. అందుచేతనే వాళ్ళు చైతన్య స్వరూపాన్ని చెబుతూ

పిపీలికాది బ్రహ్మ పర్యంత మన్నారు. జంతువులకు మనకు మల్లే వివేకము ఉన్నదా ! అంటే ఉన్నదని ఋజువవుతున్నదిగదా. అవి మనకుమల్లే మాట్లాడ కలవా ? అన్నది రెండవ ప్రశ్న. మన పూర్వకథలలో అనేక కథలున్నవి. జంతువుల భాష పశుల భాష తెలిసినవాళ్లు పూర్వముండేవాళ్లు అని. రాముణ్ణి అడవికి పంపించిన కైకమ్మ ఉన్నదే ఆమెను సుమంత్రుడు వసిష్ఠుడు ఆక్షేపిస్తూ నీతల్లి లక్షణము ఎక్కడికి పోతుంది అని ఆక్షేపించారు. ఆతల్లి లక్షణమేమిటో తెలుసునా ? కేకయ రాజునకు జంతుభాష తెలుసును. ఒకప్పుడు ఏవో జంతువులు మాట్లాడుతుంటే ఆయన విని నవ్వాడట. ఎందుకు నవ్వావు చెప్పమన్నది పెళ్ళాము. నేను చెప్పకూడదు. చెబితే నేను చచ్చిపోతానన్నాడట. పాపమాయన. నీవు చచ్చినాసరే చెప్ప మని పట్టుబట్టిందావిడ. ఛీ దౌర్భాగ్యురాలా అని ఆవిడని వదలిపెట్టేశాడు. ఇది కథ. వాటిభాష మనకు తెలియదు. తెలియదు గనక వాటికి భాష లేదనుకొంటే ఎట్లా ? చీమలు బారుగా వెళుతూ ఉంటవి. ఎక్కడనించో నూకలో ఏమిటో తెచ్చుకుంటూ ఉంటవి. ఎదురుగా వచ్చే చీమలు ఇవి ముఖము ముఖము కలుపుకుంటూ ఉంటవి. అవి మాట్లాడుకుంటవి కాబోలు "ఇదే త్రోవ అక్కడ నూకలు ఉన్నవి వెళ్ళు" అని చెబుతుంది కాబోలు ఆచీమ. అది భాషకాదు. "పసి" అని నీ వంటావేమో "పసి" అంటే ఇంగ్లీషు పభాలో ఇన్‌స్టింక్ట్సు అని అంటారు. ఇన్‌స్టింక్ట్సు అనేమాటకు వాళ్ళు సరిగా అర్ధ

నిరూపణము చేసికోలేదు. ఇంద్రియముల యొక్క అవసరము జంతువులకు హఠాత్తుగా స్ఫురిస్తుంది అని ఆ మాటకు అర్థము చెప్పాలి. మనము చేసేపనికి మాత్రము వేరే అర్థముందా! మనమాటలు అవ్వే. ఆ స్ఫురణకు శబ్దరూపము ఇస్తాము. శబ్దములో అక్షరాలున్నవి ప్రత్యయాలు విభక్తులు వచనాలు లింగాలు మూడుకాలాలు ఈ మొదలైన వానిచేత మన భాషా స్వరూపము వృద్ధిపొందింది. వెనుక ఉన్నది స్ఫురణయే. ఆ అంతస్ఫురణకు ఇది బహిరాకృతి ఒకభాష వృద్ధిపొందుతుంది ఒకభాష వృద్ధిపొందదు సంస్కృత భాషలో ఉన్న వ్యాకరణము వృద్ధిపొందినంత సృష్టిలో ఏ భాషకు వృద్ధిపొందలేదు. కొన్ని భాషలకు అక్షరాలు లేవు. అనగా వ్రాయబడలేదని అర్థముతప్ప అచ్చులు హల్లులు లేకుండా ఏ భాషా ఉండదు. సూక్ష్మంగా విచారిస్తే భేదములట్లా ఉంచితే జంతువులకు కూడ వివేకము ఉన్నది. వాటికి భాషలు ఉన్నవి. అందుచేత—"

ఒక విషయములో నాకు సందేహము తీరలేదు. ఆత్మపదార్థము చైతన్యము ఈ రెండు ఉన్నవి. దానికిది స్వభావము అన్నారు. కట్ట తెగేవరకు తన ప్రవహణశీలత్వము అనగా ప్రవహించే స్వభావము తనయందు ఉన్నదని తటాకమునకు తెలియదు అనటము నా కర్థము కాలేదు"

"నిజమే అర్థము కావటము కష్టము. కష్టమే. ఒక్కటి చూడండి"

"మీరు నన్ను అడిగింది అనకూడదు. నీవు అంటే చాలు-
చాలుకాదు అంతే". "మీరు ఎం. ఏ, ప్యాసయినారు.
సంస్కృతభాషలో మీకున్న పాండిత్యము ఎంతో నాకు తెలియు-
టంలేదు. నాకే విచిత్రంగా ఉంది. ఇంత శాస్త్ర పరిజ్ఞానము
ఎలా ఉన్నది ? ఇంత సూక్ష్మభావన ఎలా చేశారు ? మీరు
పెద్ద ఉద్యోగస్థులు. రెండువేల జీతమంటే మనదేశములో
చాలా గొప్ప. నేను మిమ్మల్ని నువ్వు అనటం ఎలా
సాధ్యం ?"

"మీలో సోమనాథశాస్త్రి ఎన్నోవంతు ? అతను నన్ను
నీవనటమే కాదు. ఏయ్ సోఫియా అని పిలవటము మొదలు-
పెట్టాడు"

"మీరు మీరు చుట్టాలు"

"అది ఎలా ఉందంటే ఒక నది ప్రవహించింది. నడుమన
ఎండిపోయింది. చివర వడియకట్టింది. ఆ గుంటలోని నీళ్ళు ఆ
నది–అన్నట్లుంది. అతనే నన్ను నీవు అంటుంటే మీ రెండు
కనకూడదు. మీరు నన్ను నువ్వు అనితీరాలి. లేకపోతే మీతో
మాట్లాడటము నాకు కష్టముగా ఉంటుంది"

"సరే నువ్వు. మనము నిద్రపోతూ ఉంటాము. మేలు-
కొంటాము. మేలు కొనటముతోటే అన్ని స్ఫురణలు వస్తాయి.
నిద్రపోయేటప్పుడు ఈ చైతన్యము అక్కడ లేదనటానికి వీలు-
లేదుకదా ? లేదంటే అది శవము కాని చైతన్యముగల శరీ-
రము కాదుగదా"

"కానక్కరలేదు. ప్రాణముపోతే శవము. ప్రాణము ఉన్నంతసేపు శరీరము. నిద్రపోతున్నప్పుడు ప్రాణమున్నది. అందుచేత శరీరము బ్రతికి ఉన్నది. చైతన్యము ఉండనక్కర లేదు"

"ఓరి బాబోయ్ నువ్వెక్కడ? ఎవరిచేతనో శపింపబడి భూమిమీద నవతరించిన దేవతవలె ఉన్నావు. ఈ పూర్వపక్షము ఎవ్వరూ చేయలేదు. అందుకనే విద్యారణ్యులవారు నిద్రపోయే సమయంలో కూడా జీవుడున్నాడనేందుకు మేలుకొన్న తర్వాత నేనిందాకటినుంచి నిద్రపోయినాను. అని మనుష్యులనే మాటను తీసికొని నిద్రాకాలమునందు కూడ జీవుడున్నాడు అన్న విషయాన్ని నిర్ధారణ చేశాడు. దీనికికూడ ఏమైనా పూర్వపక్షము చెబుతావా ?"

"అది పూర్వపక్షము చెప్పటానికి వీలులేనట్లుగా ఉన్నది. ఏదో చెప్పినా నిలవదు"

"సరే అయితే! ఆ నిద్రా సమయములో జీవుడు ఉంటే అతడు చైతన్య స్వరూపుడైతే స్ఫురణ లేకుండా ఉండే స్థితి ఆత్మకి ఉన్నదన్నది ఋజువైంది. ఈ మహా సత్యానికి ఇంతకంటె ఒక గొప్ప ఋజువున్నది. ఆ ఋజువు శ్రీ ఆంజనేయస్వామి. ఆయన వట్టి చైతన్య స్వరూపమైనస్వామి. ఆయనశక్తి ఆయనకు తెలియదు. ఎవరైనా చెబితేగాని తెలియదు. ఆయనకు స్ఫురణ కలిగించాలి. స్ఫురణ విరహితమైన

మూర్తిమంతమైన శుద్ధ సత్వము శ్రీ ఆంజనేయస్వామి. ఇంత కంటె ఋజువేమి కావలె"

"అంటే జంతువులకు మనుష్యులకు భేదమున్నట్లుగా మనుష్యులలో మనుష్యులకు గూడ భేదము ఉంటుంది—అని మీరు చెప్పదలచుకొన్నారు. పాశ్చాత్యులు, ప్రధానంగా క్రైస్తవులు జంతువులలో జీవుడు లేడంటారు"

"ఇందాకటి స్ఫురణ వాదముచేత అది నిరస్తమైంది. వాళ్లు అనాదిలో సోమరులు. ఆ దేశాలల్లో పంటలు తక్కువ. జంతువులను చంపుక తినటము వాళ్ళకి ప్రధానాహారమయింది. అందుచేత వాళ్ళల్లా కలిపించుకొన్నారు. సామాన్యులైన మానవులు కల్పించుకొనే మతాలు వాళ్ళ ఆచార వ్యవహారాలు అవసరానవసరాలను పురస్కరించుకొని ఉంటవి. విశ్వాసాలు వాటినిబట్టే ప్రబలుతవి"

"కావచ్చు. కాని జంతువులకు మనకు చాలా భేదము ఉన్నది. ఆకారాలలో ముఖాద్యవయవములలో చాలా భేదము ఉన్నది. మానవులలో ఆభేదము లేదుకదా ఇక్కడ బ్రాహ్మణుడేమి పంచముడేమి ?"

"చూడు. జంతువులకు మనుష్యులకు వివేకములో కామక్రోధలోభాది గుణములలో స్ఫురణలో ఎక్కువ భేదాలు లేకపోయినా ఆకార విశేషముచేతఉన్న భేదము ఇది బయటికి కనిపించేభేదము. ఇది ప్రబలమయి జంతువులకు మానవులకు

ఇంతదూరము చేసింది. నిజంగా మాట్లాడితే ఆకారము అల్ప మైన భేదము. గుణాలల్లో భేదమే నిజానికి అధికమయినది. మానవులలో గుణములను బట్టి బ్రహ్మాండమైన భేదములు ఉంటవి. ఆకార సామ్యము ఉన్నా గుణభేదాన్ని బట్టి ఈ ఎడము మానవుడు ప్రధానముగా వివేకి గనక; స్ఫురణను మించిన ఆలోచనాశక్తి వివేచనాశక్తి వానిలో పరాకాష్ఠను పొందింది గనక; పశువులు వట్టి స్ఫురణ మాత్రము కలవే కాని జీవుణ్ణి గురించి భావింపలేవు గనక; జీవ స్వరూపాన్ని ముక్తిని మన్నించలేవు గనక; వాటిని మన్నించి భావిస్తేకాని ముక్తి గమ్యము కాదుగనక; ఈ భావన ఈ నిష్ఠ అతిశయమైన వివే కముమీద ఆధారపడి ఉన్నవి గనక; ఆ వివేకము సద్గుణములు కలసి ఉంటున్నట్లుగా కనిపిస్తున్నది గనక, రెండు సహజీవనము చేస్తున్నట్లు తెలుస్తున్నది గనక; గుణములు శరీరగత రక్త నిష్ఠములు గనక; ఆ రక్తమును పరిశుభ్రముగా ఉంచితే సద్గు ణముల యొక్క బాహుళ్యము ఉండి శాంతి, దాంతి, క్షమా దయాది గుణములు సమీకృతములై వివేకము. ముక్తిభావన, దాని కనుకూలమైన సాధన ఏర్పడుతవి గనక; వర్ణమంటే తదనుకూల గుణ సహిత రక్తమును రక్షించటము కోసము బోదెలు కట్టటము వంటిది కనుక ఈ విభేదాలు ఉండాలి. ఉండ టము ఒకళ్ళని తగ్గించటము కోసము కాదు. ఒకళ్ళకాధిక్యము సమకూర్చటము కోసము కాదు. నేను వెళ్ళాలి. మళ్ళీ ఇంకొక సారి మాట్లాడుదాము"

"కాదుఇక్కడే ఉంకండి.మీరు రాత్రిళ్ళు భో౦ంచెయ్యరు కదా ! పళ్ళు తెప్పిస్తాను. నా గది మీకు పనికిరాకపోతే తోట ఉన్నదె. ఆరామము.అక్కడ జపము చేసికోండి. జపమైన తరువాత ఫలహారమైన తరువాత మరికొంతసేపు నాకేవై నా చెప్పి మీ కభ్యంతరము లేకపోతే ఇక్కడే పడుకోవచ్చు" అనగా పతంజలిశాస్త్రి ఇవ్వాళ కాదులే ! మళ్ళీ వస్తానని వెళ్ళాడు—

# 4

"ఇంత ప్రొద్దుపోయి వచ్చారు ఎక్కడికి వెళ్ళారు"

"మీ సోఫియా ఇంటికి వెళ్ళాను. ఆవిడ ఏదో మాట్లాడుతూ కూర్చుంది"

"ప్రొద్దుపోయింది. వేణ్ణీళ్ళు పెట్టించమంటారా! స్నానంచేసి జపం చేసికోవాలె కదా"

"చేస్తానులే కాని అదేమి సోఫియా! ఆవిడ తెలివి ఎంత! ఆవిడ పాండిత్యమెంత? నాకు దిగ్భ్రమ కలిగించింది. ఆడవాళ్ళల్లో అంత పాండిత్యము నేనెప్పుడూ చూడలేదు"

"పాండిత్యమంటే ఇంగ్లీషు పుస్తకాలల్లో కూడా చాలా విషయాలుంటవి. అవన్నీ చదివింది కాబోలు. ఇంగ్లీషు పుస్తకాలు చమత్కారంగా ఉంటవి. వట్టి ఊహ వట్టి ఆలోచన. వెనుక ఒక సంప్రదాయము లేకుండా నియమము లేకుండా హద్దులు లేకుండా ఊహ ఎంతదూరము పోవచ్చునో అంత

దూరము పోయేటటువంటి చదువు ఆ భాషలో చాలాఉన్నది. మనఊహాలు తర్కశాస్త్ర సంబంధములచేత నిబాధితములౌతవి. వేదశాస్త్రముల యందలి విస్పష్టార్థములచేత నియతములవుతవి. వాళ్ళ ఊహాలకా పద్ధతిలేదు. వాళ్ళు చాలా తీవ్రంగా వాదిస్తారు. దేవుడున్నాడుకదా అంటారు. దేవుడున్నాడని ఎందు కంటున్నామో వాళ్ళు చెప్పలేరు. దేవుడు లేడని మన మన్నామా వాళ్లు తెల్లమొగాలు వేస్తారు. ఉన్నాడని ఒప్పుకొంటే వాళ్లు వాదనచేస్తారు. కొన్ని వాదనలు వివేకవంతముగా ఉంటవి. వివేకము ఎక్కడైనా ఒకటేకదా ! మనస్సు యొక్క చురుకుదనము ఎక్కడైనా ఉండవచ్చుగదా ! తెలివి కలది గాబోలు"

"అల్లా కాదయ్యా ఆమె సంస్కృతములో పండితురాలు. సనత్సుజాతీయము మొదలైన గ్రంథాలు చదివింది. సంస్కృతములో మాట్లాడుతుంది"

"మీ రన్నది నా కర్థము కావటములేదు"

"అర్థము కావటానికి ఏమీలేదు. ఆమె పండితురాలు. గొప్ప వాక్చాతుర్యముకల మనిషి. నీవూ సోమనాథశాస్త్రి చుట్టాలుకదా అనినేనంటే ఆవిడ అన్నదికదా ఏమి చుట్టరికము లేండి. ప్రవహిస్తూ ఉన్న ఒకనది నడుమన ఎండిపోయింది. చివరి భాగము వడియ కట్టింది. అది నది అవుతుందా అన్నది"

"నిజంగా అన్నదా అంటే బంధుత్వము చెడగొట్టుకున్నామని యేడుస్తున్నదన్నమాట. నిజమే. అందుకనే సోమనాథశాస్త్రిని దగ్గరకు తీసింది. అతనికి డబ్బు పెడుతున్నది. లేకపోతే అతడేమయ్యేవాడో. పోయి ఆ పంచమురాలిని పెండ్లి చేసికొనేవాడు."

"ఇప్పుడేమీ ఆ ఆపద తొలగిపోలేదు. ఆమెను పెండ్లి చేసికోమని ఈవిడే మళ్లీ అతనిని పంపించింది"

"ఓసి దుర్మార్గురాలా ! తాచెడ్డ కోతి వనమెల్లా చెరిచిందట."

"అది కాదయ్యా! ఇంటికి వచ్చిన కొడుకును మీ మామగారు వెళ్లకొట్టటమేమిటి ? ఏ దర్భపుల్లో కాలిచి నాలుకమీద పెట్టి ప్రాయశ్చిత్తముచేసి రక్షించుకోకుండా ఇంటిలోనుండి వెడల నడచినాడాయెను. అతనిక్కడికి వచ్చాడు. నీవుగాని నీభార్య కమలగాని అన్నయ్యా రమ్మని ఆవిడ అనలేదు, శాస్త్రి రమ్మని నువ్వు పిలవలేదు."

"అతనిక్కడికి రాలేదుగా"

"ఎవళ్ళ పట్టుదలలు వాళ్ళవి. ఇంతలో అన్నపుకుండ కుక్కముట్టుక పోయింది. తల్లీ కూతురు పడమటింటి తలుపు నీవు వేసిరా అంటే నీవు వేసిరా. వంతులు పోయినారు. ఈ లోపుగా కుక్కవచ్చింది. ఇందులో ఇంకొక చమత్కారముంది. ఈవిడకంటె సోము ఆవిడదగ్గర ఎక్కువ. ఆవిడకంటె

సోము ఈవిడ దగ్గర. కుక్క ముట్టుకపోయిందని ఇద్దరికి తెలుసు. ఈవిడకి తెలియకుండా ఆవిడ చూసింది. ఆవిడకి తెలియకుండా ఈవిడ చూసింది. చూచామని చెబితే పేచి. ఆ అన్నము పార వెయ్యాలి ఆ గిన్నె తోమాలి. తలనిండా స్నానము చెయ్య వలె, దక్కిస్తూ మళ్ళీ అన్నము వండవలె. కనుక ఎవరి వారిని వారు ఊరుకొన్నారు. పై మెతుకులు తీసివేశారు. ఇంట్లో అందరికీ ఆ అన్నమే పెట్టారు. తాము తినకపోతే తగాదా పుడుతుంది. ఎందుకు తినలేదని ప్రశ్న పుడుతుంది. అందు కోసము నోరుమూసుక వాళ్ళు తిన్నారు. అనాచారము ఇట్లా ప్రారంభిస్తుంది. పరిణమిస్తుంది. మర్నాడు పొద్దున ఒకళ్ళకి తెలియకుండా ఒకళ్ళు స్నానాలు చేశారు. దానితో కుక్క ఎంగిలంతా వెళ్ళిపోయినట్లు. వీళ్లమాట అట్లా ఉంచు. పక్కన వాళ్ళమాట యేమిటి"

"వాళ్ళ కసలు తెలియదు కనక వాళ్లకి పాపములేదు. వాళ్ళకి అనాచారము లేదు."

"ఇది పెద్ద ప్రశ్న. రెండు సంగతులున్నవి. అగ్ని ఉన్నది. తెలియకండా ముట్టుకుంటే కాలటము మాని వేస్తుందా ! అన్నది ఒకటి. అల్లాగా తెలియకండా చేసినా పాపము పాపమే. దాని శిక్ష అనుభవించి తీరాలి. ఒకడు తెలియకండా ఒక చెల్లెలితో ఒక కూతురితో సంగమము చేస్తాడు. దానివల్ల పాపము లేకపోవాలి. తరువాత తెలుస్తుంది. బాధ పడతాడు. చచ్చేటంత బాధ పడతాడు. ఇలాంటి గ్రీకు

నాటకము ఒకటుంది. వాడు తన తల్లితో సంసారము చేశాడు. ఆ నాటకకర్త ఏమి చేశాడంటే ఆమె తల్లియని వాడికి తెలిసింది. వాడు సర్వనాశనమైనాడు. తెలియకండా సర్వనాశనమైనాడనుకో. అప్పుడు భగవంతుడున్నాడని తెలిసేది. ఇప్పుడేమైందంటే అదంతా పశ్చాత్తాప ఫలమయింది. ఇది రెండవ విషయము. తెలియకపోతే పాపములేదు అనటానికివీలున్నదా? దోషము లేనిచోటకూడా దోషము ఉన్నదనుకొంటే ఫలితము వస్తున్నది. ఒక పాశ్చాత్య వైద్యుడు ఒక ప్రయోగము చేశాడట. ఒకణ్ణి పడుకోపెట్టి వాడి శరీరములో ఒక చిన్న గొట్టమువలె చొప్పించి నీనెత్తురు కార్చివేస్తున్నాను అన్నాడు. నిజానికి వాడి శరీరములోనించి ఒక్క నెత్తురుబొట్టు కూడ క్రిందికి కార్చలేదు. కాని ప్రక్కన ఒక నీటిగిన్నె పెట్టి అందులో నించి ఒక సన్ననిగొట్టము పెట్టి ఆనీళ్ళు మరొక గిన్నెలోకి కారుస్తున్నాడు. ఆ ధ్వని ఈ పడుకున్నవానికి వినిపిస్తున్నది—తన నెత్తురే కారుతున్నదనుకొన్నాడు వాడు. కొంతసేపటికి దిగులుబడి చనిపోయినాడు. ఇలా అనుకోటమువల్ల మృత్యువు వచ్చింది. పాపంకూడా అల్లాగే వస్తుంది. ఉదంకుడి కథ చదివావుకదా ! గురుపత్నికి కుండలములు తేవటానికి వెళుతూ ఉంటే ఇంద్రుడు ఉదంకునితో పందెమువేసి వీడు ఓడిపోవటము మూలంగా ఇతనిచేత ఆవు పేడ తినిపించాడు. అది పేడకాదు అమృతము. అది ఆవుకాదు ఉచ్చైశ్శ్రవము కాని ఇతడు అది గోవనుకొన్నాడు. అది పేడనుకొన్నాడు. అందుచేత అప

మిత్రులకు కనిపించని పేష్వ మహారాజు భార్య అతనికి కనిపించ లేదు. ఇలా ఉంటుంది పాపము. మనస్సులో ఉంది. అది భయమువంటిది. అందుచేత తెలియకండా పాపముచేస్తే తప్పు లేదు. అనటానికి ఈ కథలు సహాయపడుతున్నవి. కాని ఇందాక చెప్పిన నిప్పుతోడి సామ్యము తెలియకండా చేసినాసరే పాప ఫలము అనుభవించి తీరవలె అన్నట్లుగా చెబుతున్నది. ఆ రీతిగా ఆ కుక్క ఎంగిలి తెలియకండా తిన్నవాళ్ళకి ఆచార భంగము కలగలేదు. అనటానికి వీలులేదు. పాప విషయము విచారిస్తే ఆ తల్లీ కూతుళ్ళకి మాత్రము నిస్సందేహముగా పాపము. ఆ రీతిగా ఓయి చిదంబరమా నీవూ నీ భార్య కసుల అతనితో మాట్లాడలేదు. అతన్ని రమ్మనలేదు. అతనికి వేరే ఆధారము లేకపోయింది. అతడు సోఫియా పజ్జను చేరాడు. ఆమె ఆశ్రయ మిచ్చింది. అతడేమిచేస్తాడు. శరీరమాద్యం ఖలు ధర్మసాధనం. పొట్ట పోషించుకోవలె కదా ? ఇక్కడి ధర్మ సూక్ష్మము విచారించు. అతనిదేమీ తప్పుగాదు. తప్పంతా మీ మామగారిది, మీది !"

"అసలు సోఫియా ఎందుకాశ్రయ మివ్వాలి ? అతన్ని పాడుచేద్దామనే ఇచ్చింది. ఆ పాపము అది అనుభవిస్తుంది"

"ఎక్కడి కక్కడికి ఎవళ్ళ పాపము వాళ్లు అనుభవించక తప్పదు. పాప పుణ్యాలు అట్లాఉంచు. ఆమె గొప్ప పండితు రాలు. చాలా వివేకవతి. గొప్ప వాక్చాతుర్యము కల మనిషి."

మొత్తానికి మిమ్మల్ని ఏదో టోపీలో వేసింది. మిమ్మల్ని ఇంతమాట నే ననకూడదు కాని నాకల్లా అనిపిస్తున్నది.

"ఒప్పుకున్నాను. నన్ను టోపీలో వేసింది. నీవు వెళ్ళి మాటాడిరా. టోపీలో పడకండారా! అసలు నన్నడిగితే నిన్నావిడ తన గుమ్మమే తొక్కనియ్యదు. ఆమెను నేను మీరు ఏమండి అంటూ వచ్చాను. ఆమె "మీరు నన్నట్లా అన కూడదు. నీవు అనే ఏకవచనమే ప్రయోగించాలి. అని బల వంతముచేసి నీవు అనిపించుకొన్నది నేను చెప్పాను. నీవెక్కడ నేనెక్కడమ్మా? నీకు నెలకు రెండువేల జీతము. సంస్కృ తాంగ్లభాషలలో పండితురాలవు. గొప్ప ఉద్యోగస్థుడి భార్యవు అన్నాను వినలేదు"

"ఆమె చాలా అందకత్తె. యౌవనవతి. దాన్ని చూచి అందరు మోసపోతారు. దానికి పాండిత్యములేదు. దాని శ్రాద్ధములేదు. మీవంటివారే ఇలా దానివైపున మాట్లాడు తుంటే ఇతరులమాట చెప్పవలసిందేమిటి"

"చిదంబరం! నేనొక్కమాట చెబుతా విను! నీవు నీ భార్య ఇద్దరు చక్కని దంపతులు. అన్యోన్యానురాగము కల వారు. ఇద్దరు తెలివికలవారు. డొక్కశుద్ధి అయినవారు. ఆచార వంతులు. సంప్రదాయమంటే చాలా అభిరుచికలవారు. నేను మీ దాంపత్యము చూచి చాలా సంతోషిస్తున్నాను. దీనికిదే. సోఫియా పండితురాలు కాదు అనకు ఆమె నిస్సందేహముగా

పండితురాలు. ఆమె యౌవనవతి. సౌందర్యవతి అన్న మాట గూడ నిజమే. కాని వానితో నాకేమి సంబంధము ? ఆవిడ చాలా మంచిది. వినయవంతురాలు. ఏదో జాతకములో వ్రాసి ఉన్నది. ఆ పెండ్లి చేసికొన్నది. కర్మ బలీయమైనది. ఎవరు తప్పించగలరు? ఆమెను గూర్చి నా అభిప్రాయమింతే. ఇప్పుడు ప్రొద్దుపోయింది. నేను స్నానము చేయలేను. ఈ పాటు నే పడు కుంటాను. నా స్నానము జపము రేపు ప్రొద్దున చేస్తాను. ఎందు చేతనో ఒళ్ళంతా విరగబొడిచినట్లున్నది. ప్రొద్దున గుమ్మడి కాయకూర ఆవకాయ మామిడికాయ పచ్చడి ములకగాడల పులుసు అన్నీ అగ్నిహోత్రాలే. పాపము ఆ సోఫియా ఏవో పళ్ళు తెప్పిస్తానన్నది. నన్నక్కడే పడుకోమన్నది. ఆ రహా దారి బంగళా నానుకొని తోట ఉందికదా. అందులో బావి ఉన్నది. ఆరామము కదా తోటలో జపము చేసుకోమంది. ఆరామము అన్నది. సంప్రదాయపు మాట. వాళ్ళ తండ్రులు అచ్చంగా ఢిల్లీలో పెరిగినా వాళ్ల ఇళ్ళల్లో సంప్రదాయము చచ్చినట్లులేదు. నేనక్కడ జపము చేసినా అక్కడ ఎట్లా పడు కోను ? అందుచేత వచ్చివేశాను"

"నాకు గూడ వెళ్ళి ఆవిడ తరహా ఏమిటో చూడాలని పిస్తున్నది. నాకు మేనమామ కూతురేకదా? నాలుగు చీవాట్లు పెట్టి వస్తాను. మీరు మంచిదంటున్నారు కదా ? అది చస్తే చచ్చింది సోమనాథశాస్త్రిని పాడుచేయట మెందుకు ?" మీరు చెప్పినట్లుగా వాడొక ఎస్సీరియర్ (అసురుడు) ఇంక ఈ పెండ్లి కూడ చేసికొంటే చెప్పారు ?"

మరునాడు కమల తల్లికి ప్రాణముమీదికి వచ్చిందని కబురు వచ్చింది. ఎవరో వచ్చారు. కమలని పుట్టింటికి పంపవలసి వచ్చింది. ఆమెను పంపినా చిదంబరానికి భోజనానికి ఫరవా లేదు గదా ? ఇంట్లో పతంజలి సత్రము నడుస్తున్నది. వంట బ్రాహ్మణుడున్నాడు. అత్తగారికి నెమ్మదిగా ఉన్న విషయము తెలియజేయమని భార్యతో చెప్పి కమలని పంపించాడు చిదంబరం. ఎంత పంపించినా పెండ్లాము పిల్లలు లేకపోయిన తరహా వేరు. మూడు రోజులు గడచినవి. అత్తగారింటి దగ్గరనుంచి వార్తలు లేవు. అత్తగారికి నెమ్మదిగా ఉన్నది కనకనే వార్త రాలేదని సగము తృప్తిపడ్డాడు. వచ్చి తినిపోయే సిబ్బంది మూలంగా ఇల్లు సత్రంగా ఉండటము మూలంగా తాను తన భార్య తనపిల్లలు రెండు గదులు ప్రత్యేకంగా తమక్రింద ఉంచుకొన్నారు. కమల ఉండగా ఆ ప్రత్యేకత సాగింది. రెండు రోజులు గడిచేటప్పటికి ఆ ప్రత్యేకత పోయింది. వంట బ్రాహ్మణుడు వద్దనకత్తె పీళ్ళ ఇద్దరికీ ఏమి కావాలన్నా కమల తెచ్చి ఇస్తూ ఉండేది. ఇప్పుడు వాళ్ళు ప్రతిదానికి చిదంబరాన్ని అడగటం. ఇతనాబాధ పడలేక తాను కచేరీకి వెళుతూ కూడ తాళపుచెవి వాళ్ళ మొహానే పారవేశాడు. నాలుగైదు రోజులు గడిచేటప్పటికి తన గదిలో తాను పడుకోటానికి కూడ కష్టము వేసింది. వాళ్ళు గదంతా ఏమిటో అక్కడిదితీసి ఇక్కడ ఇక్కడిదితీసి ఆక్కడవేసి మంచంమీద ఉన్న దుప్పటికూడ పాడు చేశారు. ఎక్కడికైనా పోయి పడుకుంటే బాగుండురా అని

పించింది. ఒకరోజున రాత్రి ఉపన్యాసమైన తరువాత వెళ్ళి తన ఇంట్లోనే సత్రపు భోజనము చేశాడు. కాసేపు అటూ ఇటూ తిరిగి వద్దామని తెలియకండా రహదారి బంగళాకి వెళ్ళాడు. ఆవిడ ఉండేగదులు తెఱచి ఉన్నవి. ఆవిడలేదు. తలుపులు తెఱచి ఎక్కడికి వెళ్ళిందో తెలియలేదు. తానేమి చేయవలె? తిరిగి పోవలెనా. ఆమె కోసము ప్రతీక్షించవలెనా? ప్రతీక్షించ వలెనంటే అక్కడి కుర్చీలో కూర్చోవాలి, ఆ కుర్చీ గుడ్డకుర్చీ పడకకుర్చీ. కూర్చున్నవాళ్ళ తలనూనె అంటి కుర్చీగుడ్డ పాడు కాకుండా తల ఆనుకొనేమేర ఒక తెల్లని గుడ్డ అమర్చబడి ఉంది. కుర్చీగుడ్డ నారగుడ్డే ఈ గుడ్డ నూలుగుడ్డ. ఇంతదూరము వచ్చి వెళ్ళటమెందుకు ? భోజనము చేశాడుగా! రేపు ప్రొద్దున ఎట్లాగు స్నానము చేస్తాడు. ఆమెను గట్టిగా మందలిద్దామని ఉన్నది. తన కోపము ప్రదర్శిద్దామని ఉంది. ఆమె పాండిత్య మేమిటో చూద్దామని కూడ ఉంది. అందుచేత ఏమైనాసరే ఆ కుర్చీలో కూర్చున్నాడు. ఆ గది ఆ కుర్చీఉన్న స్థలము ఆ గదిలోకివెళ్ళే ద్వారబంధము అక్కడ ఉన్న మంచము చిత్ర చిత్రములైన స్థానాల్లో ఉన్నవి. ఇతడు కూర్చున్న కుర్చీకి కుడివైపున ఈ గదిలోనించి ఇంకొక గదిలోనికి త్రోవ ఉన్నది. ఆ గది స్నానాలగది. ఆ గదిలోనించివచ్చి ఈ గది తలుపు వేయవచ్చు. కుర్చీలో ఎవరైనా కూర్చుంటే వాళ్లని చూడ కండా కూడ వెళ్ళి తలుపు వేయవచ్చు. అక్కడ ఎవళ్ళూ లేరనుకుంటే అ స్నానాల గదిలోనించివచ్చి ఈ గది తలుపు

వేసి వివస్త్రయైన స్త్రీ గదిలో చీర ధరించటానికి ప్రయత్నము చేయవచ్చు. ఆమె ఈ లోపల ఇతడున్నాడని ఎట్లా ఎరుగును? గదిలో స్నానము చేసింది. మూరెడున్నర తువాల జఘన భాగమునందు చుట్టితిరుగని దానిని చుట్టుకున్నట్లు చుట్టుకొని అతనిని చూడకండా వెళ్ళి తలుపు గడియవేసింది. విద్యుద్దీపము జేగంటగా వెలుగుతున్నది. కుర్చీవంక చూడకండానే మంచము దగ్గరకు వెళ్ళింది. దాని క్రిందనున్న పెట్టెను బయటకు లాగింది. ఏ చీర కట్టుకుందామా అని వెతుకుతున్నది—

ఇతనేమి చెయ్యాలి ? ఇతని పై ప్రాణాలు పైన పోయినవి. దగ్గియో తుమ్మియో తానక్కడ నున్నానని ఆమెకు తెలియజేయవలెనా ! వేళ మించిపోయింది. ఆమెను దండిద్దామని వచ్చాడు. ఆమెమీద కోపము వెలారుద్దామని వచ్చాడు. ఆమెను తక్కువ పరుద్దామని వచ్చాడు. ఇంతలో తనయందు బ్రహ్మాండమైన దోషము దానిఅంతట అది నెలకొన్నది. ఆమె తనను చెప్పుపెట్టి కొట్టినా కొట్టవచ్చు. కాండ్రించి మొగాన ఉమ్మివేసినా వేయవచ్చు. నీవు వాకిట్లో నిలుచుండి పిలవకండా ఎందుకొచ్చావు ? నీ వెవడవు ? తినటానికి తిండిలేనివాడవు ? నీ సంవత్సరము జీతము నా ఒక్క నెల జీతానికి చాలదు. అధికారులావిడచేతిలో ఉన్నారు. రంగయ్యా షాహుకారు ఆవిడ ఎట్లాచెబితే అట్లా చేస్తాడు. ఇప్పుడు నెమ్మదిగా లేచివెళ్ళి తలుపు గడియ తీసికొని బయటపడితే—తానెవరో ఆమెకు తెలియదు. దొంగలు దొంగలు అని అరిస్తే తన ఒళ్ళు హూనమై

పోతుంది. అందు చేత పాపము ఆ జీవుడు అల్లాగే కూర్చున్నాడు. కళ్ళు మూసికొందామన్న ఊహకూడ రాలేదు. ఇలా ఉండగా అప్సర స్త్రీలయొక్క శరీర సౌభాగ్యమైనా ఇలా ఉంటుందా ? అని ఆశ్చర్యము కలిగించే ఆమె శరీర సౌభాగ్యము భయము భయముగానే ఉన్నది. చెప్పను వాల్చనియ్యటము లేదు.

ఆమె చీరను తీసింది. కట్టుకుందామని ఇటు తిరిగింది. ఎదురుగా చిదంబరాన్ని చూచింది. ఏమీ అనలేదు సరిగదా జగన్మోహనంగా ప్రవరాఖ్యు డంగీకరిస్తే వరూధుని ఎలా నవ్వేందో అలా నవ్వింది. అతనికి ఏమీ తోచటము లేదు. అతని మనస్సులో కలిగిన భావములు వంద ఒకేసారి కలిగినవి. భయమో, బ్రతికామురా అన్న ఊరటో, క్షమించమని అడుగుదా మనుకోటమో, తొట్రుపాటో. ఆవేగమో, అంతరాంతములందలి కామమో, నెమ్మదిగా లేచి నిలుచున్నాడేమో. సోఫియా తన కందుబాటులో ఉన్న విద్యుద్దీపాన్ని ఆర్పివేసింది. అతడు కాళ్ళమీద పడ్డాడో ఆమె కౌగిలించుకుందో-

# 5

"భారతదేశాన్నించి వెళ్ళిన వాళ్ళు ఇతర ప్రపంచంలో అనేక స్థలాలల్లో వలసలు ఏర్పరచుకొన్నారూ అంటే వాళ్లు ఇక్కడఉన్న సిద్ధాంతాలలో వ్యతిరేకించి వెళ్ళటమో వెళ్ళ గొట్టబడటమో జరిగిందని చెప్పాముగదా ! ఇక్కడ ఉన్న వాళ్ళల్లోనే ఎన్ని మతభేదాలు ఉన్నవికావు ? శ్రీ శంకర భగవత్పాదులు కాశ్మీరమునుండి రామేశ్వరము వఱకు సంచ రించి షణ్మతస్థాపన చేసిన రోజులలోనే ఎన్నో మతాలు ఉండి ఉండవలె. వాటిల్లో వేదాన్ని అంగీకరించే ఆరు మతాలని ఎన్ని, వారు వాటిని అంగీకరించారని అర్థము. పాషండులు శాక్తేయులు మొదలైన వాళ్ళు ఉండేవాళ్లు. నాస్తికులు కూడ ఉండేవాళ్లు. నాస్తికులంటే దేవుడు లేడనేవాళ్లు కారు వేదాన్ని అంగీకరించని వాళ్లు. ఒకస్థితి హేతువునో ఒక రాజ్యాంగ పద్ధతినో అంగీకరించకపోతే ఏ దేశములోనైనా అరాజక మేర్పడుతుంది. ఇప్పుడు మనదేశములో ప్రజాస్వామిక

సామ్యవాదము అనే రాజ్యాంగ పద్ధతిని స్వీకరించి నడుపు తున్నారు. రాజ్యాంగ పద్ధతులలో చాలా మార్గాలు ఉన్నవి. ఒక రాజు నంగీకరించి ప్రజలా రాజుయొక్క అజ్ఞలకు కట్టు బడి వ్యవహరించటము అనాదినుంచి వస్తున్న మార్గము. దేశ ములో పండితులైన వాళ్ళను ఎన్నుకొని వాళ్ళ అదుపు ఆజ్ఞ లలో ఉండటము ఒకటి. పరాక్రమవంతులైన కొందరిని సర్వాధినాధులుగా గుర్తించి వాళ్ళ ప్రకారము నడపటము ఒకటి. ఎన్నికలలో సర్వజనులకు ఎన్నుకొనే అధికార మిచ్చి వాళ్ళవలన ఏర్పడిన కొందరు పెద్దవాళ్లని రాజ్యాంగ రథ సారధులుగా నిర్ణయించుకోటము ఒకటి. ఏదో పద్ధతి నంగీక రించకపోతే దేశములో శాంతి ఉండదు. ప్రజా సౌఖ్యము ఉండదు. వ్యవస్థగాని సుస్థితిగాని ఉండదు. ఇది రాజకీయ వ్యవ హారాలలోని పరిస్థితి. ఇక ఆధ్యాత్మికంగానో అధి దైవికం గానో సర్వజనులకు ఒక వ్యవస్థ ఉండాలి. ఆధ్యాత్మికంగా ఫర్వాలేదు. వాడి వాడి పూర్వజన్మ సంస్కారాను రూపంగా వాడి నీతి వాడి దర్శనము వాడి తపస్సు ఎవడికి వాడికి వాడివి గానే ఉంటవి. ఈ రాజ్యాంగాలు అధి భౌతికాలు. ఇంక అధి దైవికమున్నది. అది భౌతికములో ఎల్లాగో అధి దైవికములో కూడ ఇలాగే ఒక వ్యవస్థ ఉండాలి .అందుచేతనే ఆది శంకరులు షణ్మత స్థాపన చేశారు. కుమారిల భట్టు యజ్ఞ యాగాది క్రతు వుల వలననే మోక్షము వస్తుంది అనగా స్వర్గము వస్తుంది. "స్వర్గకామో యజేత" అని వేదమే చెప్పింది. వేదములో

అనేకచోట్ల యజ్ఞములయొక్క ప్రాముఖ్యము చెప్పబడ్డది. యజ్ఞములచేతనే సర్వకామములు సిద్ధిస్తవి, భగవంతుడు తాను తొట్టతొల్త యజ్ఞములను సృష్టించాడు అని ఉన్నది. వేద ములో ఒకచోట "ప్రజాపతి మొదట పశులను సృష్టించి రెండవ సారి తపస్సుచేసి పాములను సృష్టించి మూడవసారి తపస్సు చేసి దీక్షిత వాదాన్ని సృష్టిచేశాడు" అని ఉన్నది. దీక్షిత వాదమంటే యజ్ఞ యాగాది క్రతువులు. ఏదైనా ఒక మహా విషయము ప్రారంభదశలో స్వచ్ఛంగా ఉంటుంది. ఏ ధర్మమును నిలబెట్టేందుకు ఏ లక్ష్యములను మనస్సులో పెట్టుకొని ఆ ధర్మము ప్రారంభింపబడుతుందో ఆ ధర్మము యొక్కయు ఆ లక్ష్యముల యొక్కయు స్వచ్ఛత్వతీవ్రత్వములు ప్రథమ దినము లలో చక్కగా ఉంటవి. ప్రథమ దినాలల్లో మానవులు తమ స్వార్థముకంటె తమ లాభముకంటె ఆదర్శ రక్షణమును ప్రధా నముగా పాటిస్తూ ఉంటారు. రోజులు కడచిన కొలది ఆ తీవ్ర త్వము సడలిపోతుంది. అశ్రద్ధ ఎక్కువౌతుంది. నేను రోజూ ప్రొద్దున్నే లేవటముతోటే స్నానముచేసి ఏదో కొంత భగవ ధ్యానముచేసి కాని ఇంత యేమ పని చేయను అని నిర్ణయిస్తును కొన్నాడనుకో. . . రెండురోజులు గడిచింది. మూడవరోజున తెల్లవారకముందే ఒక భార్యకో ఒక బిడ్డకో ప్రాణము మీదికి వచ్చింది. వెంటనే వైద్యుడి దగ్గరకు పోవాలి. అక్కడనించి వచ్చేటప్పటికి పగలు రెండు జాములైంది. నియమ మేమైనది? రాత్రి ఇంట్లో దొంగలు పడ్డారు. ప్రొద్దున్నే ఆ నియమము

సాగదు. రాత్రి జ్వరము వచ్చింది. ఆ నియమము సాగదు. దూరపు ప్రయాణము చేస్తున్నాడు. తెల్లవారేటప్పటికి రైల్లో ఉన్నాడు. ఆ నియమము సాగదు. నాలుగు రోజులు వరుసగా కారణాంతరాలచేత ఆ నియమము సాగకపోతే అయిదవరోజున దానిని బుద్ధిపూర్వకంగానే మానివేస్తాడు మానవుని ప్రకృతిలో ఒక మాంద్యము ఉన్నది. వానికి తెలియకుండా ఒక అలవాటుపడే లక్షణమున్నది వీటన్నింటికంటె వ్యామోహపడే లక్షణము చాలా ఉన్నది. రంభవచ్చి అడిగితే వద్దనేవారు ఒక్క శుకమహర్షే. ఊర్వశిని కాదన్నాడు అర్జునుడు కాని ఉలూచిని అనలేదు. బభ్రువాహనుని తల్లిని చిత్రాంగద ననలేదు. సుభద్ర సంగతి సరే, ఈ కామము లోకాన్ని గ్రసిస్తుంది తినివేస్తుంది. ఆధ్యాత్మికాన్ని చెడగొడుతుంది. ఆధిదైవికాన్ని చెడగొడుతుంది. నియమాన్ని భంగము చేస్తుంది. దానికి ఉన్న శక్తి ఇంత అనటానికి వీలులేదు. పాపం కూర్చొని ఋషులు బ్రహ్మాండంగా తపస్సు చేస్తుంటే ఆ ఇంద్రుడికి తెలుసుగా ఈ రహస్యము ఒక అప్సరసని పంపించేవాడు. దాంతో తపస్సు సర్వనాశనము. ఈకథల వెనక ఒక రహస్యము ఉన్నది. భగవంతుడో లేకపోతే ఇదే ప్రకృతిలో ఉన్న ఒక పథకమో ఏది అయితేనేమి అధ్యాత్మిక వృత్తినుండి జనాన్ని మరలించటం. అది ఒక నిత్య ప్రయత్నంగా ఈ సృష్టిలో సాగుతున్నట్లు కనిపిస్తుంది సన్యాసమెందుకు పుచ్చుకొంటారు ? ఈ ప్రపంచమంతా దుఃఖభూయిష్ఠము. భగవధ్యానమో ఆత్మధ్యానమో చేసికొంటూ

ఉందామని కదా ! ఆ సన్యాసము పుచ్చుకొన్నవాడు ఒక శిష్యురాలిని దగ్గర చేరుస్తాడు–నేనేదో దేవాలయము కడుతున్నానంటాడు, ఒక పాఠశాల పెడుతున్నానంటాడు. వాడికి డబ్బెవరిస్తారు ? శివాలయము కడుతున్నానంటే శైవులిస్తారు. విష్ణాలయం కట్టిస్తున్నానంటే వైష్ణవులిస్తారు. కులభేదము ఉండకూడదనే సిద్ధాంతము ఒకటి మనదేశములో ఈనాడు క్రొత్తగా రాలేదు. వీరశైవము ఈ బాపతుదే. కులమువద్దనే వాడికి ఉన్నంత కులాభిమానము, ఇంకొకడి కుండదు. ఈ సన్యాసులు కొందరు ఈ కులాభిమానాలని శాఖాభిమానాలని పురస్కరించుకొని డబ్బు సంపాదిస్తారు, గౌరవాన్ని సంపాదిస్తారు. చివరకి తాత్పర్యము ఏమవుతున్నదంటే ఒక మతమో ఒక లక్ష్యమో ప్రధాన విషయాన్ని వదలిపెట్టి ఆ ప్రధాన విషయాలకి ప్రాధాన్యము ఇవ్వటము జరుగుతున్నది. ఈ లక్షణం ఒక్క ఈ కాలములోనే ఉన్నదనుకో నక్కరలేదు. సర్వకాలములయందు సర్వదేశములయందు మానవుడంటూ ఎక్కడ ఉంటే అక్కడల్లా ఇదే లక్షణము. శివుడు పరమదైవమని కొందరు విష్ణువని కొందరు, కాదు యజ్ఞయాగాది పరమార్గమేనని కొందరు శివునికంటె ఆయన వాహనమైన నందీశ్వరుడే గొప్పవాడని కొందరు. విష్ణుమూర్తికంటె ఆయన పానుపైన పాము గొప్పవాడని కొందరు. ఛీ ఛీ సూర్యుడు లేకపోతే మనకు వెలుగులేదు అతడే దేవుడని కొందరు. మరి కొందరు ఇంకా బుద్ధిమంతులు రోజు పిల్లి పాలు తాగిపో

తున్నది. కాఫీకి ఇబ్బంది పడుతున్నాము కనుక నిజమైన భగవంతుడు పిల్లి. మరి మేము చాలా తెలివిగల వాళ్ళమనుకునే కొందరు పర భార్యను దొంగిలించ కూడదు. పరవిత్తాన్ని అపహరించకూడదు. హింసచేయకూడదు. దయుగానుండాలి- ఇలాంటి వీలాంటివి మత సిద్ధాంతాలుగా పెట్టుకొని వ్యవహరిస్తారు. అంతకన్న ఇందులో ఏమీలేదు; ఇలా ఉండగా అపూర్వకాలములో యజ్ఞాలు చేయటములో మార్గాలు భేదించినవి. యూపమంటే యజ్ఞము చేసేటప్పుడు పాతే స్తంభము; ఆ స్తంభానికే ఎక్కువ ప్రాముఖ్యము అన్నవాళ్ళు బయలుదేరి లేచిపోయి యూపరతీశనది దగ్గర ఏర్పడ్డారు. శివునకు గిరీశుడని పేరు ఆయన రజత గిరీశుడు. ఛీ! ఛీ! ఒక కొండగాదు. మూడు కొండలున్నవి - మూడు గుణాలకు మూడు కొండలుండాలి. కనక శివుడు త్రిగిరీశుడు. అని త్రిగిరీశనది దగ్గర ఆ నది కా పేరు పెట్టి అక్కడ వాళ్ళ పూజలు పురస్కారాలు గ్రామాలు రాజ్యాలు పట్టణాలు పెంచుకొన్నారు. ఒక మహా నాగరకతలోనించి బయటికివస్తే బతికే బతుకులోని సౌలభ్యాలు వాటంతట అవ్వే సిద్ధిస్తవి. అనాదిలో ఇంగ్లండు వట్టి ఆటవిక దేశము. రోమ్ చక్రవర్తి సీజరు ఆ దేశముమీద దండెత్తాడు. ఆధునిక నాగరకత అంటుకొంది. అయిదారు వందల ఏండ్లలో ఫ్రాన్సు ఎంతదేశమో అంతదేశమైంది. అల్లాగా ఉంటుంది. ఏ నాగరకతతోను సంబంధము లేకపోతే ఆటవికు లాటవికులుగానే ఉంటారు. గ్రామ సింహాలు ఉన్నవి. కనపడితే కఱ్ఱతో

కొండతారు గనక వాటికి కష్టం భయము తెలిసింది. లేకపోతే ఏమి తెలుస్తుంది ? అవి వాటి అంతట అవి నాగరకత నేర్చు కొన్నవి అనటము ఎప్పుడూ సాధ్యము కాదు. అది కానివ్వండి. ఇప్పుడు ఈ త్రిగిరీశ యూపరతీశ నదుల నడుమ వృద్ధి పొందిన నాగరకతలలో పట్టణాలు నిర్మించారు. చుట్టూ పొలాలు ఉంటవి. పంట కాలువలు బోదెలు. ఇవిదాటితే ఒక ఊరికి చుట్టూ కట్టుకొన్న పెద్ద ప్రాకారపు గోడ. నాలుగువేపుల నాలుగు ద్వారబంధాలు; లోపలికి వెళ్ళటంతోటే వీధులు. లోపల మిద్దెలు. కాల్చిన ఇటుకలతో కట్టిన గోడలు. ఇది దాటి పోతే మళ్ళీ ఇంకొక ప్రాకారము. మళ్ళీ వీళ్లు ఇంకా లోపలికి పోతే మరింకొక ప్రాకారము. అది ఎత్తైన స్థలము. ఇట్లా ఒక్కొక్క పట్టణంలో రెండు ప్రాకారాలు ఉండొచ్చు ఎక్కువ కూడ ఉండొచ్చు. ఆ లోపలి ప్రాకారములో దేవాలయము. అక్కడ పురోహితులు. ఒక అంగవస్త్రము కట్టుకొని ఒక అంగ వస్త్రము పైన వేసికొని తిరుగుతూ ఉండేవాళ్లు. ఇలా ఆ ఊళ్లు ఉండేవని పాశ్చాత్య భూగర్భశాస్త్ర వేత్తలు వ్రాశారు. మూడువేల యేండ్లక్రిందట ఆ దేశంలో ఇట్లా ఉండేదిట. ఇప్పుడు మన దేవాలయాలు ఇట్లాగే ఉన్నవి. పూర్వము మన రాజధానులు ఇట్లాగే ఉండేవి. పాడుపడిన మన కోటల లక్షణం కూడ ఇదే. జమీందారీలు పోయినా ఆ జమీందారీ గ్రామాలు ఇప్పటికీ ఇలాగే ఉన్నవి. కొన్ని లక్షల సంవత్సరాల క్రింద రాయబడ్డ రామాయణంలో ఉన్న రావణాసురుని కోట కూడ

ఇలాగే ఉ ద ి వర్ణించాడు వాల్మీకి మహర్షి. ఇదంతా నాగరకత అంటే ఈ నాగరకతని ఆ రెండు నదుల నడిమిదేశము వారు తాము సృష్టించుకొన్నారనుకోటము శత్రువులభయము ఎక్కువగా ఉంది గనక ఆసురులు వాళ్ళమీద దండెత్తే వాళ్లు గనక, ఆ భయంచేత వాళ్ళు ప్రాకారాలు కట్టారు అనటం ఒక పెద్ద విషయము కాదు. మానవుడు ఉన్నన్నినాళ్ళు ఇది ఉండేదే. నేడు చైనావాడేమి చేస్తున్నాడు ? ఈ హిందూ దేశములో చాలా భాగం వాడిదేనట. నిన్నటి దాకా ఇంగ్లీషు వాడేమి చేశాడు ? సాగితే చాపక్రింద ఆరు కుంపట్లు తొమ్మిది నెగళ్లున్నూ. ఆ నాగరికతలన్నీ హిందూదేశములో నించి వెళ్ళినవే. ప్రతి విషయము దీన్నే ఋజువు చేస్తున్నది. "దుమూజీ" అని వాళ్ళ సస్యాధి దేవత. వాడు మగవాడు. ఈ శబ్దము చూడండి. మన తెలుగుమాట "దుమ్ము" అని ఉన్నది. దానికి "జి" చేరిస్తే "దుమ్ముజి" అయినాడు. జి గౌరవ వాచకము. నేటికి జొత్తరాహులు వాడుతునే ఉంటారుకదా ? దేవతలకి కూడ ఇది తగిలిస్తుంటారు. ఢిల్లీలో "కాల్కాజి" అని ఒక పేట ఉంది. "కాళికాజి" అని అర్థము. తిరుపతి శ్రీరామానుజులు వైష్ణవ క్షేత్రముగా మార్చకముందు దేవీ క్షేత్రమంటారు. అక్కడఉన్న దేవత బాలాత్రిపుర సుందరి. ఇప్పటికీ జొత్తరాహులు తిరుపతిలో ఉన్న దైవాన్ని బాలాజి అంటారు. కాళహస్తిలో శ్రీ కాళహస్తీశ్వరుడున్నాడు. కాళహస్తిలోని గోపురము దగ్గరనుండి తిరుపతి కొండమీది గోపురానికి సూటిగా

దారము కట్టవచ్చునట. శివుడు ఇక్కడ కూర్చుండి అమ్మవారు అక్కడ కూర్చుంటే తనభార్య తనకు నిత్యము కనపడుతూ ఉండాలని ఆవిడ దేవాలయము అక్కడ కట్టించాడట. విష్ణువు కూడ శివుని భార్యయే శివుని హృదయంలో ఉన్న పరాశక్తి రెండుగా విభజింపబడి సగము పురుషుడు సగము స్త్రీ అయినది. ఆ పురుషుడు విష్ణువు. ఆ స్త్రీ పార్వతి. అందుకనే విష్ణువు పార్వతి అన్నా చెల్లెండ్లు, లేకపోతే అక్కా తమ్ముళ్ళు. ఈ దుమ్మూజీ ఉన్నాడే వీడు సస్యాధి దేవత. వాడు ప్రతి సంవత్సరం చస్తాడట. "ఇనన్నా"అన్న దేవత వాణ్ణి ప్రతిసంవత్సరం బ్రతికిస్తుందట. ఇద్దరికి పెళ్ళిచేసే వాళ్ళట. ఇది కథ. ఇనన్నా అంటే అన్నము. అన్నము కోసము సస్యము కావలె. ఇలాంటి కథలు ఈజిప్టులో ఉన్నవి. గ్రీక్ దేశాల్లో ఉన్నవి. సిరియా ఇంకోటి ఉండేది. దాన్ని నేటివాళ్లు లగాష్ అంటున్నారు. వాళ్ళకి పెద్ద బావుటాలు ఉండేవి. వూల్లి అనే పరిశోధకుడు దాన్ని కనిపెట్టాడు. వాళ్ళకి పెద్ద పదాతి సైన్యము రథ సైన్యము దేశములో ఉన్నవి. ఈ సిరియా దేశము గ్రీసు దేశానికి కొంచెము దగ్గర. అస్సీరియనులు సిరియనులు. వాళ్ళు అసురులు వీళ్లుసురులు. వాళ్ళకు వీళ్ళకు నిత్య విరోధము. ఈ మాటలు ఈ సంప్రదాయాలు ఈ భేదాలు అన్ని భారత దేశాన్నించి వెళ్ళినట్లు కనిపిస్తూ ఉన్నవి కదా ! అక్కడి రాజులు రాణులు బంగారపు నగలు ధరించేవాళ్లు. ఆ స్థలం త్రవ్వితే బంగారపు కిరీటాలు బంగారపు గిన్నెలు మణులు పొదిగిన

నగలు ఖడ్గాలు వెండి ఆడుకొనే బల్లలు బంగారపు చదరంగపు బల్లలు ఎన్నో కనిపించినవి. ఆ దేవతా విగ్రహాలు ఆ రాజ భోగాలు వాటినన్నిటిని చూస్తే వాళ్ళ మతమంటే వాళ్ళకు ఎంత గాఢమైన విశ్వాసముండేదో వాళ్లెంత ధైర్యవంతులో వాళ్ళెంతెంతటి పెద్దపెద్ద రాజ్యాలు స్థాపించారో తెలుస్తుంది

ఇట్లా ఉండగా అక్కడ అనేక మహాపట్టణాలు ఉండేవి ఉరుపు, ఊరునిప్పూరు. కీశ నగరాల పేర్లు ఇదివరకే చెప్పాను. లక్ష్మీశ నగరమని రథ గజతురగ పదాతులు ఉండేవాళ్లు. ఇదంతా ఎక్కడిది ? వాళ్ళల్లో పెద్దపెద్ద ఏక ఛత్రాధిపతులు గూడ పుట్టారు. సార్గన్ అనే ఒక వీరుడు ఉన్నాడు. ఈ శబ్దము "సారగాన" శబ్దము కావచ్చు. ఇతడు ఉత్తరానఉన్న కీశ నగరాన్నించి వచ్చాడు. సుమేరు దేశమంతా ఆక్రమించాడు. ఈ సారగాన చక్రవర్తి మధ్యధరా సముద్రము వరకు ప్లక్ష ద్వీపమంతా ఆక్రమించినట్లు కనిపిస్తున్నది. ఊరు నగరాధిపతి అతని పేరు "ఊరు నమ్ముడు" ఈ నమ్ము శబ్దము నర్మశబ్ద భవము. నర్మము అంటే రహస్యము. లేకపోతే చమత్కారము. నర్మ భాషణము అంటే కొంచెము చమత్కారముతో కూడిన పరాచకపుమాట. ఆ రాజు పేరు ఊరు నర్ముడు. ఊరు అనేది నగరపు పేరుగదా దానియందు యథేచ్ఛంగా లీలగా ప్రవర్తించిన వాడని అర్థము. అతను చాలా గొప్పవాడట. ఈ ఊరు నగరంలో అతడు చంద్రాధి దేవతకు ఒక పెద్ద గోపురము కట్టించాడట. రెండువందల అడుగుల పొడుగు. నూట నలభై అడు

గుల వెడల్పు కలిగిన రాతి కట్టడముమీద డెబ్బై ఏడడుగుల వెడల్పు పెట్టి యెనభై అడుగుల ఎత్తు గోపురము కట్టాడట. అతడు పెద్ద సాహిత్య పోషకుడు పాఠశాలల్లోను మేరు భాషలో పాఠ్యగ్రంథాలు వ్రాయించాడట. కొలతలు ప్రమాణాలు నిర్ణయించాడట. చివరకింత రాజ్యము నాశనమై పోయింది. అసురులు వచ్చి నాశనము చేశారు. ఆ సంగతి తరువాత చెబుతాను. "హమ్మురాజు" అనే గొప్ప రాజ్యాంగవేత్త ఉండేవాడు. "గ్రామరవి" అన్న శబ్దం కావచ్చును ఇది. గ్రామ మనగా పట్టణమే. పట్టణాన్ని మహాగ్రామమంటారు. ప్రపంచకానికి సూర్యుడెట్లాంటివాడో మహా గ్రామమును వృద్ధి పరిచేందుకు ఇతనట్లాంటి వాడన్నమాట బైబిలులో కూడ ఆ హిబ్రూ పండితులను రాబీల్ అంటారు. అనగా రవులు. రవి శబ్దమే "రబి"అయింది. ఇప్పటికి వంగదేశీయులు"వ"కారాన్ని "బ" కారంగా ఉచ్చరిస్తూనే ఉన్నారు కదా ! "వ" అనే అక్షరాన్ని ఉచ్చరించేందుకు క్రింది పెదవిని రెండు దంతముల వరుస నడుమకి చొప్పించి పైదంతముల వరుసతో ఆ పెదవిని నొక్కాలి. అధరాధరము పలుచగా ఉండాలి. పెదవి లావైన కొద్దీ "వ" పలుకదు "బ" అయి ఊరుకొంటుంది. ఆహార పదార్థాలల్లో నియమము లేకపోతే అది జాతి కలవాలైపోతే శీతోష్ణ పరిస్థితులు కూడ అనుకూలంగా లేకపోతే దంత ధావనాదులు సరిగ్గా చేసికోకపోతే శబ్దోచ్చారణకు అక్షర విస్పష్టోచ్చారణ ననుకూలపరచే దవడలు పెదవులు దంతములు నాలుక

మోటుబారిపోతే అక్షరాలు పలకవు. మరిన్నీ తినే పదార్థాలు నాభిదగ్గరనించి గొంతుదాకా తవాయివుంటే కొన్ని ధ్వనులు నాభిస్థానమునుండి స్వచ్ఛముగా బయలుదేరితేగాని రావు. ఆ ధ్వని కొన్ని మాంసపు ముక్కలలోనుండి బయటికి చప్పున వెల్లగించుకొని రాదు. ఇలా సంస్కృత భాష దురాచార భూయిష్ఠమైన దేశాలలోకి వెళ్ళి అక్కడి జనముయొక్క దురాచార దుర్మాంస ఖాదవాద్యాచారములచేత కలుషితమైపోయి ఉచ్చారణ సౌష్ఠవము చెడిపోయి అనాగరక భాషలుగా తయారైంది. ఆధునిక పండితులు వాటి వ్యుత్పత్తిని యథేచ్ఛంగా, ఎవడికి ఇష్టం వచ్చినట్లు వాడు కల్పించి చెబుతున్నారు; వ్రాస్తున్నారు. అదంతా భాషా శాస్త్రమని చదివిస్తున్నారు. అసలు చదువుకంటె దీనికి ప్రాముఖ్యం వచ్చింది.

6

"యూ ఫరటీశనదికి బాగా ఉత్తరాన బాబిలాన్ అన్న ఒకమహా నగరము ఉండేది. వాయుబలము అంటే సరిపోతుంది ఇది అనాదిలో అసురులకు స్థానము. భారతదేశంలో కోట్ల సంవత్సరాలనుండి ఉన్న నాగరకతను గురించి విచారిస్తే దేవతలు ప్రధానంగా యజ్ఞహవిర్భోక్తలు, రాక్షసులు యజ్ఞధ్వంసకులు అని తెలుస్తుంది. ఏమి టీభేదమని విచారిస్తే దేవతలు పరలోక నివాసము అందలి భోగమును గూర్చి ఎక్కువ శ్రద్ధ వహించేవారని రాక్షసులు ఐహిక భోగ విచారణాసక్తులని తెలుస్తుంది. వాళ్ళకి వీళ్ళకి ఒకభేదము ఉన్నది. కొంచెము జాగ్రత్తగా పరిశీలిస్తే వాళ్ళు వీళ్ళుకూడ మానవులమీద అధారపడి ఉన్నవాళ్ళే. దేవతలకు మానవులకు ఏమీ సంబంధము లేదు. మానవులు చేసే యజ్ఞయాగాది క్రతువుల ఫలితాన్ని మాత్రమే దేవతలు పొందుతారు. దేవత లెక్కడో స్వర్గంలో ఉంటారు. రాక్షసులు మానవులకు మల్లేనే భూమి మీద

ఉంటూరు. నిజంపడితే మానవులకు రాక్షసులకు విరోధము కావాలి. రాక్షసులకు దేవతలకు విరోధమేమిటి ? అంటే ఒక భేదమున్నది. ఈ రాక్షసులు దేవతలవలె కామరూపులు. మానవులవలె పాంచభౌతిక శరీరధారులు. వాళ్ళ శక్తులు మానవుల శక్తులకంటె అతీతమైనవి. మానవులను చంపి వాళ్ళ మాంసము తింటూరు. రాక్షసులను చంపే బలశాలులు కూడ మానవులలో పుట్టేవాళ్ళు. మయుడు అనేవాడు పెద్ద మహా శిల్పి. అతడు రాక్షసుడు. ఈ మానవులు ఎక్కువ భాగము యజ్ఞయాగాది క్రతువులు చెయ్యటము పరలోక భావన చెయ్యటము తపస్సులు చెయ్యటము మానవుని నీతి ధర్మము ఇలాంటివి ఆలోచించే వాళ్ళల్లే ఉన్నది. రాక్షసులు శిల్పులు. శిల్పులనటంతోటే బీజగణితము, క్షేత్రగణితము, వాస్తు జ్యోతిషము ఇలాంటి మహావిద్యలన్నీ వాళ్లదగ్గర ఉండేవి అని అనుకోవచ్చు. న్యాయానికి అందరు భూమిమీద జన్మించి కలిసే ఉండేవాళ్ళు. ఇద్దరు పినతల్లి పెదతల్లి సంతానము. పుడుతూనే ఒకళ్ళమీద ఒకళ్ళకి మాత్సర్యము. ఈ అన్నాతమ్ముల నడుమ సృష్టికి ప్రథమంగా ఉదయించిన మాత్సర్యము భారత యుద్ధము నాటికిగాని సంపూర్ణముగా పరిపక్వమైనట్టులేదు. దేవతలు రాక్షసులు సవతి తల్లుల బిడ్డలు. ఈ భావానికి రామాయణములోని కైక చాలా దోహదము చేద్దామనుకొన్నది. కాని శంఖ స్వచ్ఛమైన భరతుని బుద్ధి దాన్ని సాగనివ్వలేదు. క్రమక్రమంగా దేవతలు తమ తపశ్శక్తిచేత రాక్ష

సుల లౌకికశక్తిని అణగద్రొక్కి వాళ్ళని భారత దేశములో నుంచి వెళ్లగొట్టారు. ఎంతవెళ్లగొట్టినా కలిసి ఉందామను కొనేవాళ్ళు ఇక్కడే ఉండిపోయినారు. రాక్షసులయందభిమా నముకల మానవులు వాళ్ళతో వెళ్ళిపోయినారు. కనుక పజాతి ప్రత్యేకంగా లేరు. కలసిపోయే ఉన్నారు. కనుక గుణభేదమే తప్ప విస్పష్టమైన జాతిభేదము లేకపోయింది. ఉన్నదని చెప్ప టానికి వీలు లేదు. అందరూ అన్నదమ్ములే. వాళ్ల విద్యలు వీళ్ళకీ తెలుసు వీళ్ళ విద్యలు వాళ్ళకీ తెలుసు. ఆరాక్షసులలో కూడ చాలామంది యజ్ఞయాగాది క్రతువులుచేసే వాళ్ళు తపస్సులుచేసే వాళ్ళు: వాళ్ళకి వీళ్ళకీ ఒకటే భేదము. మాన వులు తపస్సులు చేసినా యజ్ఞాలుచేసినా మోక్షము పరలోక సుఖము. దీనిని వాంఛించి చేసేవాళ్ళు. రాక్షసులు అనంత మైన బలము, చావులేకండా ఉండటము. సర్వ జగత్తును గెలిచి రాజ్యము చేయటము వీటిని వాంఛించి చేసేవాళ్ళు. అనగా మానవులది పారలౌకిక బుద్ధి. రాక్షసులది ఇహ లౌకికబుద్ధి ఈ అసురులు ఇక్కడ తూగక లేచిపోయినారు. అసురులు అంటే అసురులలో చాలా మంది అని అర్థము. వాండ్లందరూ వెళ్ళి ఉత్తరధ్రువందగ్గర అస్సీరియాలో నివాసా లేర్పరచు కొన్నారు. ఈ వాయు బలములో అనగా బాబిలాన్ నగర ములో పెద్దరాజ్యము నిర్మించారు పేరు రాజ్యమేగాని వాళ్ళు చాల విచిత్రమైన జాతి. పంటలు పండించటము వృత్తులు చెయ్యటము శాంతముగా బ్రతకటము వాళ్ళనెత్తురు

లో లేదు. వాళ్ళ వృత్తి ఏమిటంటే యుద్ధము చెయ్యటము. ఇతరులమీదికి దండెత్తటము. వాళ్ళని చంపటము, తగల పెట్ట టము దోచుకోటము, స్త్రీ బాల, వృద్ధులను నఱకటము ఆడవాళ్ళను ఎత్తుకపోవటము. వాళ్ళ వృత్తి ఇదే. ఇవన్నీ చెయ్యాలంటే ప్రక్కన రాక్షసులు కానివాళ్లు ఒకళ్లు ఉండాలి కదా? అందరూ పల్లకీ ఎక్కితే మోసేవాళ్లెవరు? అన్నట్లుగా ఈ భారతదేశములో అసురులు కొందరు ఉంటే మరి ఇంకొజాతిబయలుదేరింది. వాళ్లు సురులు వేరేలేరు మనమే సురులము అనేవాళ్లు. వాళ్ళనీ వెళ్ళకొట్టారు ఇక్కడి భారతదేశీయులు. వాళ్లుపోయి ఒక చోట నివాస మేర్పరుచు కొన్నారు. ఆదే సిరియాదేశము. కొందరు వాళ్ళల్లో సుమేరు దేశాన్ని నిర్మించుకొన్నారు. వాళ్ళకీ ఈ అసురులకు నిత్య విరోధమైంది. ఈ అసురులు చాలానిర్దయులు, దయారహి తులు, దుర్మార్గులు. వాళ్ళకీ చంపట మంటే ఎంతో ఇష్టము. ఆవధని గురించి ఎంతోగొప్పగా రాసుకొంటారు. ఒక అసురుడు చేసిన ఘోరాలను గురించి ఇట్లా రాసుకొన్నాడు. ప్రతి ఇద్దరిలో ఒకణ్ణి నేను చంపాను. వాళ్ళపట్టణపు ద్వారబం ధముల ముందర గోడలకు కట్టేశాను. వాళ్ళచర్మములు ఒలి చాను. ఆ శత్రువులయొక్క ఒలిచినచర్మాలతో తక్కినగోడ లలంకరించారు. బతికున్న మనుష్యుల చుట్టు ఇటికగోడలు కట్టాను. గోడలలో మేకులుకొట్టి ఆమేకులులలో మనుష్యు లను దిగవేశాను. కొన్నివేల మంది నాయెదుట చర్మము ఒలి

పింప బడ్డారు. ఇటువంటి మహాకార్యాలను ఆ అసురులు చేయించే వారు. చేయించి మేమంత గొప్పపనులు చేశామని శిలాశాసనాలు చెక్కించారు. తరువాత తరువాత ఈ మహా కార్యాలన్నీ రోమ్‌సామ్రాజ్యములో ఇంగ్లీషువాళ్లు ముసల్మా నులు సమృద్ధిగా చేయిస్తూనే వచ్చారు. ఇదంతా ఒక పరంపరా ప్రాప్తమైనవిద్య. పాశ్చాత్యులు ముసల్మానులు మనదేశములో ఇలాంటివి చాలా చేయించారు. కొన్నాళ్ళకు ఈ వాయుజల నివాసులైన అసురులు తరిమి వేయబడ్డారు. వాళ్ళు 'నీనెనా' అన్న ఒక రాజధానిని కట్టుకొన్నారు. పరిషియా రాజ్యము ఒకటి బయలు దేరింది. వాళ్ళు కొంత సాధువులు. అందులో పెద్ద పెద్ద రాజులు బయలుదేరారు. "సైరస్, డేరియస్, క్సెర్ క్సెస్" ఇలాంటి పేర్లుగల రాజులు. ఈ అసురులను సుమేరులను అతుతులను వాయుబలాధిపతులను నీడులను సిథియనులను అందరిని గెలిచి పెద్దరాజ్యము స్థాపించారు. "మీ డ్సు" అనగా అజామీఢుని సంతానము, అజామీఢుడు అన్నరాజుండేవాడు పూర్వము. అతడు చాలా క్రూరుడు. వాడు తన కొడుక్కి నారాయణుడని పేరు పెట్టాడు. దీనినే కృష్ణశతకంలో పద్యంగా రాశాడు తిక్కన్న గారు. కృష్ణశతకము తిక్కన రాశాడంటారు. నిజమో అబద్ధమో ! నేను చెప్పేదంతా నిజమైంది. గనకనా పాశ్చా త్యులు రాసిందంతా నిజమైంది గనకనా "మెగాస్థనీసు" మొద లైనవాళ్ళు వ్రాసిన వ్రాతలు అబద్ధాలు అని ఋజువైనది.

ఏమిలాభము? "క్రూరాత్ముడజామీళుడు నారాయణుడంచు నాత్మనందను బిలువన్" అని కృష్ణశతకము చెప్పియున్నారు. వాళ్లు ఈజిప్టులు. వాళ్ళు నరకాసురుని సంతానమేమో !

ఈ పర్షియన్లు ఈజిప్టుదేశముగూడ ఆక్రమించారు. ఈజిప్టుదేశంలో వెయ్యేండ్ల క్రింద శశాంకుడనే రాజుండేవాడు. బైబిలులో వీడిపేరు "షిషక్" అని ఉన్నది. "షెషాంక్" అని ఈజిప్టుదేశ భూగర్భ ఖనన శాస్త్రజ్ఞులు వ్రాశారు. శబ్దము శశాంకశబ్దము. శబ్దాలు ఎల్లామారిపోతవి. బైబిలులో లోపించిన అనుస్వారాన్ని భూగర్భ వేత్తలు సముద్ధరించారు. మనము "షి" కారాన్ని తొలిగించి "శ" కారాన్ని సముద్ధరిస్తే అసలు శబ్దము బయటికి వచ్చింది. పాపము ఈ శబ్దము ఎంతమార్చినా మార్చటానికి వీలులేనిది. వీటికంటె పూర్వము ఒక రాజ్యము ఉండేది. దాని పేరు త్రయీ రాజ్యము. త్రయీ అంటే వేదము. వేదములు మూడు గనుక దానికి త్రయీ అనే పేరు వచ్చింది. త్రయీ అంటే ఋగ్వేదము. యజుర్వేదము సామవేదము. ఈ మూడు వేదాలు ప్రధానమైనవని త్రయి వచ్చిందని కొందరంటారు. మంత్రము బ్రాహ్మణము ఉపనిషత్తు అని మూడు భాగాలు ఎట్లాగైనానరే. త్రయీ అంటే వేదము. ఈ అసీరియన్లు సిరియన్లు సుమేరు దేశస్థులు హీబ్రూ వాళ్ళు వీళ్ళందరూ వేదాన్ని తిరస్కరించి ఇక్కడికివచ్చి రాజ్యాలు నిర్మించినవాళ్ళు. అందులో కొందరు మరీ వేదాలు కావాలనే వాళ్ళు వచ్చారు. వివేకానందస్వామి

అమెరికాకు వెళ్ళి వేదాంతోపన్యాసాలు చెబితే అక్కడి వాళ్లు చాలా మంది వేదాంతులైనారు. క్రైస్తవ మతము వదలి పెట్టారు. మనదేశములో చాలామంది క్రైస్తవులలో తురకలైనారు. దీనికి నియమమెక్కడ! మానవుడన్న జంతువే చాలా విచిత్రమైన జంతువు. అల్లాగే ఆ రోజులలో అన్ని వేల యేండ్లక్రింద వాళ్ళల్లో వేదాభిమానులుపుట్టి త్రయీ రాజ్యమని ఒక రాజ్యము నిర్మించారు. వాళ్ళఊరికి త్రయీ నగరమని పేరు పెట్టుకొన్నారు. అదే "ట్రాయ్" అయినది. ఆ ఊరి జనులు త్రియీ జనులు "ట్రోజాన్సు" అయినారు. ఈ కథలు తరువాత చెబుతాను. మొత్తానికి ఈ కథంతా అసురుల పరాక్రమ క్రౌర్యానికి ఉదాహరణ. మానవచరిత్ర వ్రాసిన పాశ్చాత్యులు కాని భూగర్భ వేత్తలుకాని ఇల్లా వ్రాశారు రక్తపాతానికికాని కసాయిలుగా ప్రవర్తించేందుకుగాని మానవ చరిత్రలో అసురులను మించినవాళ్ళు ఉండరని వ్రాశారు. వాళ్ళ క్రౌర్యము వాళ్ళ పశుత్వము చరిత్రలో పోలిక లేనిది. వాళ్లు రాజులు, సేనానాయకులు. వాళ్ల వర్తకము యుద్ధము ఇదంతా వాళ్ల చిత్రకళా శిల్పములనుండి గ్రహించవచ్చు ఈ వాయుబిల నగరము నాశనమైపోయింది. దాన్ని గురించి కవి పద్యాడు, ఆ పద్యం ఇది—

అయ్యో వాయుబల మహానగరమా ?
మహాశక్తిగల నగరమా
ఒకగంటలో నీ కర్మము కాలినది

నాశనమైతివి
ప్రపంచకములోనున్న
వర్తకులందరు నీకోసం ఏడుస్తారు
బంగారము వెండి రత్నములు
ముత్యాలు సన్ననిడన్ని
ఊదారంగుపట్టు
నీదగ్గర దొరికే కలప
ఏనుగదంతపు గిన్నెలు
దాసినచెక్క అత్తరులు
సువాసనా తైలములు
ద్రాక్షారసము నూనె గోధుములు
పశువులు గొఱ్ఱెలు గుఱ్ఱాలు
రథాలు బానిసలు అనేక జీవులు
ప్రపంచకమంతా
వీటిని గూర్చి ఏడుస్తుంది.

దీనినిబట్టి వాయుబలనగరముగాని ఊరు నగరముగాని వాటి నాగరకత ఎంత గొప్పదో ఊహించుకోవచ్చు. నాగరకత అంటే బాహిరమైన నాగరకత కాదు. అంతరమైన నాగరకత కాదు. ఖగోళశాస్త్రము అనగా సిద్ధాంతము గణిత శాస్త్రము సారస్వతము ఇవన్నీ అక్కడ బ్రహ్మాండమైన వృద్ధిని పొందినవి. అంటే భారతదేశంలో ఆయా శాస్త్రాలు పొందిన వృద్ధి అంతా అక్కడకు వెళ్ళింది. ఈ నాగరకతనంతా హీబ్రూలు

కొంత సంపాదించారు. తరువాత గ్రీకులు దీనిని పొందారు. పాశ్చాత్య నాగరకతకు ఇది మూలము. దీనికి భారతదేశ నాగరకత మూలము. ఈ నగరము ఒకసారి పాడై పోయింది. నెబూఛడ్నజార్, బెల్షడ్జా అనేరాజులు మళ్ళీ కొన్నాళ్లు వాయుబల నగరాన్ని సముద్ధరించారు. మళ్లీ నాశనమైంది.

అది ఏమిటో భారతదేశమునుంచి ఈశపిత దేశానికిగాని అక్షుత సుమేరు దేశాలల్లో ఉన్న ఊరు, కీశ, లక్షేశ, వాయుబలాది నగరములలోగాని ఉన్న వాళ్లందరు చనిపోయినవాళ్లని దహనం చేసేవాళ్లు కారు, ఈ దహనం చెయ్యటము భారతదేశములోనే అద్వైతులయందు వైష్ణవులయందు మాత్రమే ఉన్నట్లున్నది. పారశీకులు తమ శవాలను పెద్ద గోపురాలుకట్టి వాటిపైన పెడతారట గ్రద్దలెత్తుకుపోయేందుకు. శైవులును ఇతర దేశాలలోని తక్కినవారును భూమిలో పాతిపెడతారు. మన్ను తిన్నంతమట్టుకు తినేస్తుంది. కాని ఈశపిత దేశములోను ఈ రాజ్యాలలోను చనిపోయిన శరీరాలు చెడిపోకుండా వాటిని రక్షించటానికి ఏవో ఓషధీ రసాలుపోసి పెద్దపెద్ద గుహలలో దాచేవాళ్లు. అక్కడ అనేక ఆహార పదార్థాలు ఉంచేవాళ్లు. వాళ్లు అనుభవిస్తారని. ఇది వట్టి నమ్మకమే కాని ఇందులో ఏమీ నిజములేదని వాళ్లకి మాత్రము తెలియదా! ఇది ఒక ఆత్మవంచన. పాతిపెట్టబడ్డ శవాలని భగవంతుడెప్పుడో లేవతీస్తాడనుకోటమేమిటి ? తర్కానికందదు. అనుభవానికి చాలదు. చచ్చిపోయినాడంటే వానిలోనించి ప్రాణము వెళ్లి

పోయిందికదా! ఒక వేళ మళ్ళీ ప్రాణమువస్తే అప్పటికిని క్రిమి కల పోగో విడిపోయిన క్రిమికలో లేకపోతే ఆ క్రిమికలనుకూడ మన్ను తినేస్తుందేమో! శరీరములో క్రిమిక లుండాలె. మాంసము ఉండాలె, నెత్తురు ఉండాలె, వస ఉండాలె ఇంకా ఏవోఏవో ఉండాలె. ప్రేవులు ఉండాలె. లోపల ఎన్ని యంత్రాలు ఉండాలో నేటి వైద్యులకు తెలుసు. వీటి అన్నింటిపైన చర్మము ఉండాలె. ఆ లోపల ప్రాణము ఉండాలె వట్టి ప్రాణము చాలదు చైతన్యము ఉండాలె. వివేకము ఉండాలె. ఇవన్నీపోయిన ఆ శవాన్ని రక్షించుకోటము అది ఏదో అవుతుందనుకోటము అనుభవానికి పరమ విరుద్ధమైన వ్యవహారము. ఆ ఈజిప్టు దేశాది దేశాలల్లో భూమిలో పాతిపెట్టిన శవాలు వేల యేండ్లుగా ఉన్నవి. కొన్ని ఉన్నవి. కొన్ని పోయినవి. ఉన్నవి ఇంకా కొన్ని వేలయేండ్లు ఉంటవి అనుకొందాము. అప్పుడూ ఇంతేగా కుళ్ళిపోతవి మన్నైపోతవి. అందుకనే పాశ్చాత్య వేదాంతా లల్లో "నీవు మన్నువు మంటికి తిరిగిపోతావు" అని చెబుతారు, వాళ్ళ ఊహ ఇక్కడ ఉన్నది. ఇది మన్ను అనుకోటము. ఈ శరీరము వట్టి మన్ను కాదు ఇందులో పంచభూతాలు ఉన్నవి. అగ్ని, జలము, ఆకాశము, వాయువు అన్నీ యున్నవి. గాలి వెళ్ళిపోయ్యేటప్పటికి ఇవేవీ పనిచేయలేదు. ఆ గాలికంటె మించి నది ఒకటి ఉన్నది. అది చైతన్యము. దానిమూలంగా వివేక మున్నది. దాని మూలంగా బ్రతుకుతున్నాడు. దానిమూలంగా శాస్త్ర పరిశోధన చేస్తున్నాడు. దానిమూలంగా భోగా లనుభ

విస్తున్నాడు. పరమ ప్రధానమైన ఆ చైతన్యాన్ని వదలిపెట్టి ఆ దేవుణ్ణి వదలిపెట్టి అంతర్యామియైన భగవంతుణ్ణి వదలిపెట్టి పిచ్చివాళ్లు ఈ మన్నుని పట్టుకొని దేవులాడారు. దేవులాడుతున్నారు. ఏమి లాభము? ఇది పెద్ద అధర్మము. అధర్మమంటే సృష్టి రహస్యాన్ని తెలిసికోలేక పోవటములో మొదటిది. ఆ రహస్య మందరకు అందదు.తల్లితో చెల్లెలితో రమించకూడదు. తండ్రి నెదిరించకూడదు. ఉపకారము చేసినవానికి అపకారము చేయకూడదు. పెద్దల నగౌరవపరచరాదు. బ్రహ్మపదార్థము లేదనరాదు. ఇవంతా అధర్మము. ఇవి ఇల్లా చెయ్యకూడదనటానికి మానవబుద్ధి కారణాలు చెప్పలేదు. ఇది ధర్మము వాడుకయింది? వేదము చెప్పింది గనుక. అక్కడ తర్కముులేదు. ఆదరిస్తే ధర్మము. ఆదరించకపోతే అధర్మము. అధర్మముచేస్తే మానవుడు కష్టాలనుభవిస్తాడు ప్రస్తుతము కాకపోతే భవిష్యత్తున అనుభవిస్తాడు ఈ జన్మలో కాకపోతే మరుజన్మలో అనుభవిస్తాడు. మళ్ళీ మనుష్యజన్మ ఎత్తుతాడని నమ్మకము లేదు నీవు నమ్మకపోవటముచేత అది జరగకపోవట మనేదిలేదు.సముద్రము పొంగి వచ్చేవేళకు నీవులేదని కూర్చుంటే రాదా? వ్యక్తిచేసే అధర్మానికి ఫలిత మిట్లుండగా ఒక జాతిచేసే అధర్మానికి ఒక సంఘముచేసే అధర్మానికి ఒక ప్రాంతంలో జరిగే అధర్మానికి భగవంతుడు శిక్షలు విధిస్తాడు పోలెండు వాళ్లు ఆఫ్రికాలో ఎన్నో ఘోరాలు చేశారు. మొదటి ప్రపంచక యుద్ధంలో కైజర్ ఆ ప్రజలను అన్ని హింసలు చేశారు. ఇంగ్లీషు వాళ్ళు

మనదేశంలో ఎన్నో ఘోరాలు చేశారు వాళ్ల సామ్రాజ్యమే అంతరించి పోయింది. ఒక ప్రాంతము సముద్రములో మునిగి పోతున్నది. మరియొక ప్రాంతము దగ్ధమై పోతున్నది, ఇంకొక ప్రాంతము అగ్నిపర్వతాలు విరిసి భస్మీపటలమై పోతున్నది. మరియొక ప్రాంతము భూకంపమువచ్చి గోతులు పడిపోతున్నది. మన భాషలో ఒక నానుడి ఉన్నది. నవ్వుతూ చెయ్యటం ఏడుస్తూ అనుభవించటం అని.ఇదంతా ఇలా చెప్పటం చాదస్తమని పూర్వాచార పరాయణత్వమని అవివేకమని అనుకునే మహాప్రభువులు ఉన్నారు. వాళ్ళయినా స్థిరంగా ఉంటారేమో."

# 7

చిదంబరం సోఫియాను చూడటానికి వెళ్ళిన మరునాడు తెల్లవారేటప్పటికి కమల పిల్లలతో సహా వచ్చింది. ఇతడు తీవ్రారుణ నేత్రములతో నిద్దుర లేని ప్రాల్ మాలికతో నలిగి పోయిన దుస్తులతో కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి వెళ్ళాడు. ఆమె తెల్లవారకమున్న ఇంటికి వచ్చింది. ఆ ఇంట్లో ఉన్న వడ్డన కత్తె "మీ ఆయన రాత్రికి ఇంటికి రాలేదు. అని చెప్పింది. ఈ ఆకారంతో ఉన్న భర్తను ఆవిడ చూచింది. ఆమెకు కూడ తెల్లవారులు నిద్ర లేకపోయినా ప్రయాణపు బడలిక మొగములో ఉన్నా వస్తూనే స్నానముచేసి ఉదికిన చీర కట్టుకొని మొగాన కుంకుమ బొట్టు పెట్టుకొని లక్ష్మీదేవివలె వాకిటిలో నిలుచుంది. అతనిని చూడటంతోటే ఆమె మనస్సులో అనిష్టమైనది హఠాత్తుగా స్ఫురించింది. ఇదివరకు తానూళ్లో లేకపోవటము చాలాసార్లు జరిగింది. పుట్టింటి నుంచి వచ్చినప్పుడల్లా ఇల్లాగే తిరిగి వచ్చేది. వచ్చి తలుపు తట్టి భర్తను నిద్దుర లేపేది ఆమె ఎరిగి ఉన్నంత

వరకు చిదంబరం ఇల్లు వదలి ఎక్కడికోపోయి నిద్రగ పోయిన రోజులేదు. ఇదే మొదటిసారి. ఇల్లంతా జనసమ్మర్దముగా ఉన్నది. వెళ్ళితే వెళ్లాడేమో. కాని ఈ ఆకారమేమిటి ? సామాన్య పరిస్థితిలో "అదేమిటి అట్లా ఉన్నారు. ఎక్కడికి వెళ్ళారు ? తెల్లవారులు నిద్రలేదా ఏమిటి" అని అడగాలి. ఆ వేళా విశేష మేమిటో ఆ స్ఫురణ ఏమిటో సంగతి కనుక్కోకుండానే ఆమె మనస్సులో పెద్ద అనుమానము కలగటం వెంటనే ఒక కోపము రావటము ఆమె మాట్లాడకండా ఒక కోపదృష్టితో అక్కడ నిల్చోటము జరిగింది. ఇతనైనా "ఏమి ఎప్పుడు వచ్చావు అత్తగారికి నిమ్మదిగా ఉందా" అని అడగలేకపోయి నాడు. ఎప్పుడూ పాపము చేసేవాడు చేసిన పాపాన్ని వెంటనే కప్పి పుచ్చుకోకలడు. చేయనట్లే నటించగలడు. ఎన్నడూ చెయ్యనివాడు కాలు జారి పడితే వాడు పడే గాబరాకు భయా నికి అవధి యేముంటుంది ? వాడి మొహం చూస్తేనే వాడా పాపముచేసినట్లు తెలుస్తుంది. వాడు గోపనము చేసికోలేడు. పైగా తానే అందించినట్లు ప్రవర్తిస్తాడు. అంతే. ఆ రోజల్లా ఇద్దరూ మాట్లాడుకోలేదు వరుస వెంటనే భార్యా భర్తలు మాట్లాడు కోకండా రోజులు గడుస్తూన్నవి. ఇంట్లో వంట బ్రాహ్మడున్నాడు. వడ్డనకత్తె ఉన్నది. ఎప్పుడూ వేడి నీళ్ళు కాగుతూనే ఉంటున్నవి. ఎవరు స్నానం చేసినా నీళ్లతోడే పరి చారకుడున్నాడు భార్యా భర్తలు ఇద్దరు మాత్రమే ఉండి సంసారము చేస్తుంటే ఇంట్లోకి కావలసినవి ఆవిడ అడగటము.

తనకు కావలసినవి ఆవిడ నడిగి భర్తచేయించుకోటము, భార్య వడ్డిస్తూ ఉంటే మాట్లాడటము. ఇష్టము లేకపోయినా వద్దనటానికి చెయ్యడ్డము పెట్టడము, ఏదైనా కావలిస్తే ముభావంగా కూర్చొని ఆవిడే గ్రహించాలని ప్రతీక్షిస్తూ ఉండటము జరుగుతుంది. కోపము వచ్చింది భార్య కయితే అతనే అడగటం, ఏదో చిన్న చిన్న వాటికి కవ్వించటం, రోజు రెండు రోజులలో వ్యవహారం పరిష్కారమైపోతుంది. ఇంట్లో ఇద్దరికి కావలసిన పనులు చేసేవాండ్లు వేరే ఉంటే పైగా ఏకాంతముగా ఉండటానికి వీలులేకపోతే ఆ కోపము కోషము అల్లాగే రోజుల కొద్దీఉంటుంది.మరీ కోపకారణము శీలవిషయమైతే బిగింపు మరీ ఎక్కువౌతుంది. కొన్ని ప్రకృతులు చమత్కారంగా ఉంటవి. ఒక భార్యయో ఒక భర్తయో ఉంటే వాళ్ళ పట్టుదల ఎక్కువగా ఉంటుంది. తప్పు ఎవరిదైనాసరే. ఎక్కువ బిగింపుగలది. భార్య అయితే తప్పు భార్యదైనాసరే సంధి కోసము ప్రయత్నము భర్తే చెయ్యాలి. ఆబిగింపు కలవాడు భర్త అయితే దోషము వాడిదైనాసరే సంధి ప్రయత్నము భార్యయే చెయ్యాలి. ఇట్లా ఉండగా కమలా చిదంబరాల మధ్య కమలకే ఎక్కువ బిగింపు. ఆవిడ తప్పైతేనే చిదంబరం బతిమాలాలె బామాలాలెగదా. ఇంక చిదంబరానిదే తప్పైతే చెప్పాలా ? అందులో ఆ తప్పు సామాన్యమైనది కాదాయె. మరిన్నీ ఇదే ప్రథమ దోషమాయె. కథ చివరికి ఎల్లా తేలిందంటే మళ్ళీ వీళ్ళిద్దరు భార్య భర్తలుగా ఉంటారా ఉండరా అన్నంత వరకు

తేలింది. ఇందులో మెరుగేమిటంటే కమలపుట్టిల్లు నిప్పచ్చరపు
కొంప మొగుడి మీద కోపము వచ్చి అక్కడికి వెళ్ళేందుకు
లేదు. మరిన్ని కమల దురభిమానము కలది. పోయి చావనైనా
చస్తుంది తప్ప పుట్టింటికిపోదు. రెండు రోజులు మూడు
రోజులు నాలుగు రోజులు గడుస్తున్నవి. గడిచినకొద్ది ఆమెకు
చద్దామన్న భావమే వృద్ధిపొందుతున్నది. కాని ఇద్దరు పిల్లలు
న్నారు. వీళ్ళేమౌతారు ? ఇలా ఉండగా చిదంబరము సంగతి
ఎలా ఉందంటే తాను చేసిన మహాపాపానికి నిష్కృతి ఏమిటి ?
తానెందుకు చేశాడు? అది స్త్రీ కాదు. అది ఏదో గ్రహము.
తానెంతో నియమము కలవాడు. నియమమంతా నిమిసములో
నీటయి పోయింది. అయ్యయ్యో ! ఈ జీవుణ్ణి పట్టుకొని
పరమ నిగూఢముగా ఎంత కామము దాగి ఉంటుంది ? కమల
క్షమించినా క్షమించకపోయినా జరిగిన పాపము ఆమెతో చెప్పి
క్షమాపణ వేడికొందా మనిపించింది. ఆమె క్షమిస్తుందా
క్షమించదు. చెప్పటము తప్పు. వ్యవహారాన్ని ఇంకా పాడు
చేసికోట మవుతుందేమో ! అత్తగారికి నిమ్మదిగానే ఉండి
ఉండాలి. లేకపోతే ఎందుకు తిరిగి వస్తుంది ? ఈ కొంప
అంతా సత్రము క్రింద మారిపోయింది. ఇది సత్రమే కాకపోతే
నాలుగైదు రోజులలో ఈ పుండు మానటానికి వీలు ఉండేది
ఈ పతంజలి శాస్త్రి ఇంట్లోనించి వెళ్ళిపోతే బాగుండును.
తాను కమల మాట్లాడు కోటానికి బలవంతంగానైనా నాసరే సన్ని
హితంగా ఉండటానికి వీలుండేది. ఆ మొదట ఆయన వచ్చి

తన ఇంట్లో ఉండటము తనకు చాలా మేలనిపించింది. లౌకి
కంగా ధన విషయికంగా కొంత మేలుకాక పోలేదు. కడచిన
నెల తన జీతంలో దమ్మిడీ వ్యయము కాలేదు. కాని ఇప్పుడ
తడు తన ఇంట్లో ఉండటము తన భార్యా భర్తల ఏకాంతానికి
భంజకమౌతున్నది.కమల తన్ను పరిహరించటానికి ఎంతో వీలా
తున్నది. అయినా సోఫియాని చీవాట్లు పెట్టటానికి తానె
వరు ? ఆమె తన మేనమామ కూతురవటమా ! చిన్నప్పు
డెప్పుడో ఒక్కసారి చూచాడు. కాని వాళ్ళకి తనకు ఏమీ
సంబంధములేదే ! ఆవిడకు ఎంతో జీతమే ! ఆవిడ జీతములో
తనది ఏదోవంతులేదే ! వాళ్ళందరు పెద్ద పెద్ద ఉద్యోగస్థులే !
పైగా ఆవిడ క్రైస్తవుణ్ణి పెండ్లిచేసి కొందే ! ఆవిడ వర్ణభ్రష్టు
రాలే ! తానవన్నీ చూడటానికి ఎందుకు వెళ్ళాడు ? తన
ఆచారసంపద యేమైంది ? ఆ గుడ్డ కుర్చీలో ఏ మొగము
పెట్టుకొని కూర్చున్నాడు ? ఇంటికి వచ్చి స్నానము చేసి
క్రొత్త జంధ్యాలు వేసికొని దర్భకాల్చి నాలికకంటించు
కొంటే కాని ఆ కుర్చీలో కూర్చున్న దానికే ప్రాయశ్చిత్తము
కాదే? ఇంకతాను చేసినపనికి ప్రాయశ్చిత్తమంటూఉంటుందా?
ఇంత ఊహ జరుగుతూనే ఉండగా వెనక ఎక్కడో అంత
రంతరాలల్లో తాడితోతున జీవునియొక్క ఆశ అనే కూపా
ధోధః ప్రదేశమున ఒక తృప్తియో ఒక సమ్మోదరేఖా
స్పర్శయో ఉంటూనే ఉన్నది. కమలతో సోఫియాతో
అక్కడ సామ్యము కలుగుతూనే ఉన్నది. ఇద్దరి యౌవనాలకు

భేదము కనిపిస్తూనే ఉన్నది. ఇద్దరి రతికేళులకు భేదము కనిపిస్తూనే ఉన్నది. తాను పొందిన సుఖ పరమార్థంలో దూరము కనిపిస్తున్నది. ఈ జీవుడు శరీరములో ఎందుకు ప్రవేశించాడు ? ఈ శరీరము ద్వారా శరీరము సాధనముగా ఏదో సుఖాన్ని త్రవ్వుకుందామనే కదా ! అట్టి సుఖాలల్లో పరమోత్కృష్టమైన సుఖము స్త్రీ పురుష సంగమవేళా సుఖమువలె కన్పిస్తున్నది. తక్కిన సుఖములను పరిత్యజించటము పోలికచేసి చూస్తే చాలా తేలికవలె ఉన్నది, ఈ సుఖాన్ని పరిహరించటము సాధ్యము కానట్లున్నది. అయ్యో మహర్షులు మోహాశచేత తపస్సులు చేస్తూ అప్సర స్త్రీలకు లొంగిపోయినారట ! దేవర్షియైన నారదుని వంటివాడు మోహముక్రమ్మి తాను స్త్రీగామారి సంతానమును కన్నాడట ! తాను లెక్క ఏమిటి ? మరిన్ని ఇదంతా ప్రారబ్ధము. కర్మానుగతంగా నడుస్తున్నది. తానిచట కర్త కాదు. ఇది వేదాంతముగాని లోకాన్ని విశ్వసింపచేయుట యెలాగ ? వాడు చెడిపోయినాడు. వాడు గడ్డి తిన్నాడు. వాడు నికృష్టబుద్ధి. ఎందుకు ఇన్ని పండ్లు వచ్చినవి ? యోగ్యురాలు బంగారమువంటి పెండ్లాము ఇంట్లో ఉండగా పోయి దొంగ మేత మేసివచ్చాడు అని అంటుందిగాని లోకము మరీ శిష్టమైన లోకము వాణ్ణి పరిహరిస్తుందిగాని "అయ్యో పాపము వాడి ప్రారబ్ధమల్లా ఉంది. అతడు యోగ్యుడే. ఆవేళ అట్లాంటిది" అని దయ చూపించదే ఈ ప్రారబ్ధాధీనత్వానికి ఈ కర్తృత్వ వివక్షకు సంబంధము కనపడటము లేదే ! ఈ వ్యక్తిత్వము

ఎక్కడ ఉన్నది ? ఎంత సూక్ష్మముగా ఉన్నది ? మరిన్నీ ఈ సోఫియా ఎంత పరమ కాముకి ? ఎంత లజ్జా విహీనురాలు ! సంఘ మర్యాద నెంత పాటించదు ? లోకమునందలి తన మర్యాద తన సంపద తన చదువు వాటిని పురస్కరించుకొని ధర్మాన్ని మర్యాదని నీతిని ఎంత తిరస్కరిస్తున్నది ? ఎంత అధఃకరిస్తున్నది ? సోమనాథశాస్త్రిని ఈమె చెలుపలేదని నమ్మేక మేమున్నది? ఆతనికి ఈమెకు వరుసకాదు వరుస వరుసా ! అయ్యయ్యో. ఎంతమాట. ఈమెను నమ్మకూడదు. పతంజలిశాస్త్రినే ఈమె బుట్టలో వేసికోటానికి ప్రయత్నిస్తున్నట్లున్నది. పండితురాలు కాబోలు తన పాండిత్యాన్ని ప్రదర్శించి ఈ కామసౌఖ్య సౌధానికి ఆయన్ని మొదట మెట్టెక్కించింది. అక్కడే పడుకోమందిట, రెండవ మెట్టెక్కిద్దామని ఆ వేళకు అదృష్టవంతుడు గనుక రెండవమెట్టు ఎక్కకుండా తిరిగి వచ్చాడు. ఆయనతో చెప్పవలె. ఓయి మహా ప్రభో ! అది కబంధుడి అప్పగారు, దూరాన్నించె ఊరికె ఆకర్షిస్తుంది అని చెప్పాలి."

ఈ నాలుగురోజులు ఉపన్యాసాలు జరుగుతూనే ఉన్నవి. చిదంబరం కూడా వెళ్లుతున్నాడు. తలఎత్తి సోఫియావంక చూడటములేదు యాదాలాపంగా ఒకటి రెండుసార్లు ఆమె వంక చూచినప్పుడు ఆమె తనవంక చూచి నవ్వుతున్నది. ఆ నవ్వు ఎట్లా ఉన్నది. "ఒరే బావా ఎందుకల్లా గాభరాపడతావు ? భయపడి ఎందుకు సుఖాన్ని పాడుచేసికొంటావు ?

ఏమీ భయములేదు. నేను నీ సొమ్మును. వచ్చి సుఖాన్ని చేర లతో త్రావు. ఇందులో ఏమీలేదు. శుష్క వేదాంతాలు పెట్టు కోకు. నీ వలన నేను బ్రహ్మానంద మనుభవించాను" అన్నట్లుగా ఉంది. మరియును ఆ కలసికొన్న రాత్రి ఆమె ఒక్కమాట అన్నది. ఎన్నడూ తామిద్దరూ ఒకళ్ళ నొకళ్లు ఎరుగరు. బావా అని ఎన్నిసార్లు పిలిచింది, తాను చిన్నప్పటినించి చిదంబరాన్నే ప్రేమించినదట! ఆ వెనుక ఎప్పుడో చూచినప్పుడే తన చిన్న ప్పుడే ఆ ప్రేమ కలిగిందట! తన్ను వివాహ మాడటానికి వీలు లేని హేతువుచేతనే తెగించి ఆ క్రైస్తవుని పెండ్లాడిందట! తానెంత మూఢుడు. అప్పుడా మాటలన్నీ నిజమేనను కొన్నాడు. తన కీ వ్యామోహము తొలగిపోయే గీత వ్రాసి ఉన్నది గనుక ఆ సంబంధము వృద్ధి పొందలేదు. మరునాడే కమల వచ్చింది.

పతంజలి ఉపన్యాసము చివరిది సాగుతున్నది. ఆయన భార్యకి జబ్బుగా ఉందట. మరునాడు వెళ్ళిపోతాడట. మళ్ళీ పది రోజులాగి వస్తాడట. ఈసారికిదే చివరి ఉపన్యాసమట. చిదంబరం చాలా అదృష్టవంతుడు. ఆయన వెళ్ళిపోతే తన విరిగి పోయిన శీలానికి కట్టు కట్టించుకోవచ్చు. ఈసారివస్తే ఆయన్ని తన ఇంట్లో ఉంచుకోడు. అదట్లాఉంచి కమలని సముదాయించు కోట మెట్లా? తాను ప్రాయశ్చిత్తము చేసికోట మెట్లా? ఆవిడ తన్ను ముట్టుకో నంటుందేమో, తాకనంటుందేమో? అయ్యో!

తనతో సంసారము చేసినప్పుడల్లా స్నానముచేసి ప్రాయశ్చిత్తము చేసికొంటుందా ?

పతంజలిశాస్త్రి రేపు వెళ్లుతున్నాడుగదా! ఈ ఉపన్యాసము చిన్నది చేశాడు "ఇవ్వాళటితో త్రిగిరీశనది పూర్తి అవుతున్నది. ఈ రెండునదులు ఇంచుమించుగా ఒకటేనని చెప్పాను. ఈశపీఠదేశ నాగరకత ఒక్కటే. ఆ రాజ్యము ఒక్కటే. ఈ రెండు నదుల నాగరకత అల్లాకాదు ఇక్కడ ఎన్నో రాజ్యాలు ఉన్నవి. సుమేరు రాజ్యము, అక్షత రాజ్యము, అసురుల రాజ్యము, సురల రాజ్యము, వాయుబల నగర రాజ్యము, హీబ్రూల రాజ్యము, పర్షియనుల రాజ్యము. నిజానికి త్రయీ నగరరాజ్యము కూడ ఇందులో కలిపి చెప్పవలె. దాని వైలక్షణ్యాము వేరే ఉన్నది. అందుచేత కలిపి చెప్పటము లేదు. చెప్పానుకదా వేదధర్మ విరోధులు భిన్నాచారులు వచ్చి ఈయీ రాజ్యాలు స్థాపించారని మహారాజ్యాలు స్థాపించారు. ఒక్కొక్క రాజ్యము కొన్నివందల యేండ్లు సాగింది. కలియుగములోఉన్న రాజ్యాలకు పూర్వయుగాలలోఉన్న రాజ్యాలకు చాలా భేదము ఉన్నది. ఆ పూర్వయుగాలల్లో ఒక్కొక్క రాజవంశము ఉంటే లక్షలాది సంవత్సరాలు ఆ వంశము రాజ్యం చేస్తూ ఉండేది. కాళిదాసు రఘువంశము వ్రాశాడంటే ఆ రఘువంశము దిలీప మహారాజుతో మొదలు పెట్టాడు. వాళ్లది సూర్యవంశము.సూర్యునినుండి వైవస్వతమనువు ఉద్భవించాడు. అది మన్వంతరమునకు మొదటిమాట. ఆ సూర్యవంశము రామ

చంద్రుడివరకు ఎంతమంది రాజులో అయినారు. తరువాత ఎంతమంది రాజులో అయినారు. ఆ వంశము ఎందుకు అంతరించింది ? వాల్మీకి స్పష్టంగా చెప్పలేదు కాని కాళిదాసు వ్రాశాడు. వాళ్ళు త్రాగుబోతులైనారు. ధర్మవిరుద్ధ ప్రవర్తన కలవాళ్లు అయినారు. ఏ వంశములో భగవంతుడైన శ్రీరామచంద్రుడు ఉదయించాడో, ధర్మము తప్పితే, ఆ వంశమే అంతరించింది. అట్లాగే చంద్రవంశపు రాజులుకూడ ధర్మాత్ములై ఉన్నన్ని నాళ్లు లక్షలాది సంవత్సరాలు రాజ్యము చేస్తునే ఉన్నారు. ఇది పూర్వయుగ రాజుల చరిత్ర కలియుగ రాజుల చరిత్ర చూడండి. కలికాలము మొదట ఈశపీఠ సామ్రాజ్యమువలె వెయ్యి రెండు వేలయేండ్లు సాగిన సామ్రాజ్యాలు ఉన్నవి. పఠాణుల సామ్రాజ్యము కూడ ఎక్కువకాలమే సాగిన దనవచ్చును. గ్రీకులు, రోమనులు, ఫ్రెంచివాళ్ళు, స్పెయిన్ వాళ్ళు, ఇంగ్లీషు వాళ్లు, తురకవాళ్లు ఆ దేశాలల్లో. మనదేశంలో చిన్ని చిన్ని సామ్రాజ్యాలు ఎన్ని ? మగధ సామ్రాజ్యము, శాతవాహనుల సామ్రాజ్యము, గుప్త చక్రవర్తుల సామ్రాజ్యము, అగ్నివంశ క్షత్రియుల సామ్రాజ్యము.అన్ని రెండువందల యేండ్లు మూడు వందల యేండ్లు ఇలా కొలది కాలములో పెద్ద పెద్ద సామ్రాజ్యాలు ఎందుకు నశించిపోయినవి? ఎందుకు నశించి పోతున్నవి? ఈ సామ్రాజ్య నిర్మాత లెందుకు ఆలోచించరు ? మొగలు సామ్రాజ్యము మరికొన్నాళ్లుండేదేమో ! ఔరంగజేబు చేసిన అధర్మాలవల్ల నశించిపోయినవి. దక్షిణ దేశములో విజయనగర

సామ్రాజ్య మంతరించి పోయినది. స్థూల దృష్టికి అతనుచేసిన అవివేకము సామ్రాజ్య నాశనానికి హేతువనిపిస్తున్నది. నిజమైన కారణము అతనుచేసిన అధర్మము. అధర్మము ఎన్ని రకాలుగా ఉంటుందో మొన్న చెప్పాను. ఇంకా కొన్ని రకాలుగా ఉంటుంది. వర్ణ ధర్మాలను పాటించకపోవట మధర్మము. వర్ణభేదాలే ఉండగూడ దంటున్నారుగా! ఇది చాలా విచారించవలసిన విషయము. చెప్పానుకదా. సుమేరు రాజ్యము బ్రహ్మాండమైన మహోచ్ఛదశ పొందినదని. వాళ్ళందరు తాము దేవతల మనుకొన్నారు. స్వర్గలోకము భోగభూమి ఈ ధాత్రి కర్మభూమి. సుమేరుదేశము స్వర్గముకదా! వాళ్ల భోగాలను పట్టుకోటానికి వీలు ఉండి ఉండదు. ఓహో! లోకాన్ని సంగ్రహిద్దామని. స్త్రీ సంగమంలో విరతులేదు. వందలకొలది స్త్రీలను వివాహము చేసికోటము వాడుచస్తే వాడితోపాటు వాళ్ళ భార్యలందరు పరిచారికలందరు చావవలసిందే! భూమిలో పెద్ద గొయ్యి తియ్యటము ఈ రాజు శవాన్ని అక్కడ పెట్టడము. వాడి భార్యలు వేలకొద్ది పరిచారికలు వాడు ఉపయోగించిన సర్వభోగ సాధనాలు బంగారము వెండి రత్నాలు వాటితో సహా వాళ్ళందరిని గోతిలో దింపటము. ఇన్ని వేలమంది బ్రతికి ఉండగానే ఆ గోయి మూతి పూడ్చివేయటము. వాళ్లందరూ లోపల లోపలే నశించిపోవటము. భూగర్భ శాస్త్రవేత్తలు ఈలాంటి గోతులను చాలా త్రవ్వారు. ఈ సుమేరుదేశములో ఊరు నగరము చాలా గొప్పది అని చెప్పానుకదా! ఆ ఊరు

నగరము నాశనమైపోతే ఒక సుమేరుదేశ కవి ఇలా పడ్చాడు—

'ఓ అంబర చుంబి ప్రాకారశోభి
మహానగరమా ! నీ శోభ నశించి పోయింది
ఓ నా మహాపట్టణమా ! నీ వాక
ఆడ గొఱ్ఱెవు నీ పిల్లను లాగివేశారు
ఓసి ఊరు నగరమా ! ఒక అమాయకపు ఆడ మేక
నుండి దాని బిడ్డ లాగివేయఃబడినది
నీ దుఃఖము కఠోరమైనది నీ భర్త ఎంత పడుస్తాడో
నీ ప్రాకార కుడ్యములు చిల్లులుపడ్డవి జనము తిరిగే
చోట శవాలు పడి ఉన్నవి
పూర్వము విందులు జరిగిన నీ విశాల వీథులలో
శవాలు పడి ఉన్నవి
ఆ శవాలు సూర్యాతపములో కరిగిపోతున్నవి
శిశుబాల వృద్ధు లగ్ని కాహుతులై పోయినారు
తల్లుల శవాలమీద బిడ్డల శవాలు పడి ఉన్నవి
ఎంతభోగము ! ఎంతభోగము ! సర్వము అంతర్హిత
మైనది !'

# పంచమ భాగము

## త్రయీనగరము

### 1

అనంతకాలములో ఎప్పుడు ఎట్లా జరుగుతుందో ఎవ్వరికీ తెలియదు. ఎవళ్ళు ఈ కాలముయొక్క అనంతత్వాన్ని అల్పమైన మనశ్శక్తిచేత ఊహించలేరో వాళ్ళు కొన్ని మహా యాథార్థ్యములను గ్రహించలేరు. ఆగ్రహించ లేకపోవటానికి మానవుని అజ్ఞత్వము కారణము. ఈ రకమైన అజ్ఞత్వము అనేక విధాలుగా ఉంటుంది. లోపలఉన్న చైతన్యశక్తి మనస్సు ద్వారా బయటకు ప్రసరిస్తుంది. మనస్సు మానవునిది మానవుడు బహు సంస్కారముల సంపుటి. వాడి అనేక పూర్వజన్మల యందలి సంస్కారముల చేతనే ఒకచోట నిర్బంధింపబడతాడు. అందరు జీవులేకదా ! అందరూ చైతన్యము కలవాళ్ళేకదా ? అందరికి ప్రాణములు మనస్సులు ఉన్నవికదా ! అందరికీ శరీరములుఉంటూనే ఉన్నావికదా ! అందరూ ఒక్కచోటనే ఒక్క

తల్లిదండ్రుల కడుపునే ఎందుకు పుట్టకూడదు ? ఆ తల్లిదండ్రుల కడుపునందే పదిమంది పదిసార్లు పుడితే పది భేదాలు వచ్చినవి. ఒక తల్లిదండ్రుల కడుపున పుట్టిన పదిమంది సంతానములో కొన్ని సామాన్య లక్షణాలున్నా విభేదాలు ఉంటూనే ఉన్నవి కదా ! ఒక్కటే భేదము, ఒక్కటే లక్షణము ఉండాలి. అంటే అందరు మానవులు కలిసి ఒక్క తల్లికడుపున ఒక్కసారిగా పుట్టాలి. అప్పుడు ప్రపంచమూ లేదు. జీలకఱ్ఱాలేదు సింగినాదమూ లేదు. అందరూ కలిసి ఒక్క నిమిషములో ఒక్క తల్లి కడుపున ఒక్కసారిగా పుట్టారంటే ఏమున్నది ? సర్వ మానవులయొక్క జీవులయొక్క సమాహార భూతమైన చైతన్యము ఇదిగో అని ముద్దగా చూపించినట్లు. ఎవ్వరికి చూపించటం ? వాడొక్కడేగా ఉన్నాడు చూపింపబడేవాడు, వాడే. చూచేవాడు వాడే అట్టే మాట్లాడితే చూపేవాడు. ఇది కుదరదు. అంటే ప్రపంచము లేదు. ప్రపంచకమంటే విస్తరించటము అని అర్థము. అందుకనే ఏదన్నా విషయాన్ని ప్రపంచించాడు అంటారు. పంచ అంటే అయిదు. ఈ అయిదు అయిదు భూతాలని అర్థము కనుక ఈ చైతన్యము ఈ అయిదు భూతాలలోనికి వెళ్ళుతున్నది. తెలుగులో పంచుట క్రియ ఉన్నది. పంచుట అంటే ఒక వస్తువును నలుగురికి నాలుగు కాస్తలు ఇవ్వటం అంటే ఆ వస్తువుని ముక్కలు ముక్కలుగా చేయుటము. ఒక దాన్ని పదిగా చేయటము. పదిగా చేస్తే ఏమవుతుంది? ప్రమాణము తగ్గుతుంది. కాని దానిరుచి ఒక్కటే. మిఠాయి తెచ్చి

నలుగురి పిల్లలకు పంచిపెడితే మిఠాయి రుచి మిఠాయిదే. అందరికి తలోముక్క వస్తుంది. అలాగా చైతన్యము తన సహజ లక్షణమైన మనస్సుద్వారా ప్రసరించే గుణాన్ని మాత్రము కలిగిఉంది. ప్రమాణాన్ని తగ్గించుకొని రుచిని మాత్రము రక్షించుకొని తృప్తిని తగ్గించుకొంటుంది ఇందులో అనేక భేదాలు ఉంటవి. ఒకసారి ఆ మిఠాయి అందరికి పంచిపెడితే సరే పిల్లవాడు స్కూలుకెళ్ళాడు. రాత్రికి పెడదామని తల్లి దాస్తుంది. ఎంత దాచినా ఆ అలమరలోని గాలి దానికేదో వికారము తెస్తుంది. చిమ్మెట ముట్టుకొంటే ఒక దోషము వస్తుంది.బల్లి మురకచూస్తే దానియందు విషమే సంక్రమిస్తుంది. ఎలిక దాని దగ్గరగాపోతే దాని శరీర వాసన చాలా సూక్ష్మంగా దీనియందు సంక్రమిస్తుంది. భద్రంగా ఒక చిన్న డబ్బాలో పెడతావు. ఆ డబ్బాలో కుంభించి ఉన్నగాలి తత్పదార్థమునందు రుచిని తగ్గిస్తుంది. ఇంక జీవులుగా అయ్యే చైతన్యంలో కలిగే మార్పులు చెప్పటానికి వీలా ? ఆ చైతన్యము మనస్సుద్వారా తెలియబడుతుంది. ఆ మనస్సు ఈ సర్వ వికారాలను పొందుతుంది. ఈ జీవ చైతన్యము పొందే ఈ వికారాలు, ఎలా పొందుతుంది ? బహు పూర్వజన్మలయందు పొందుతుంది. జన్మ అంటే ఒక భిన్నకాలాన్ని ఆశ్రయించింది. ఒక భిన్న దేశాన్ని ఒక భిన్న శరీరాన్ని ఆశ్రయించి ఉంటుంది. ఆ కాలము ఆ దేశము ఆ శరీరము వాటి వాటి లక్షణాలను ఈ చైతన్యమువందు సంక్రమింపజేస్తవి. వీటి అన్నింటి సంపుటీ కలిసి అది

ఒక జీవుడుగా అవుతాడు. వాడు "నేను" అనుకొంటాడు. వాడు ప్రయాణము సాగిస్తాడు. అందరు జీవులు కలిసి ఒక్క సారి పుట్టలేరుగా ! అందుచేత కాలభేదము వస్తున్నది. ఒక్క చోట పుట్టలేరుగా ! అందుచేత దేశభేదము వస్తున్నది. కాలము అనంతముగా ఉంటున్నది. దేశాలు అనంతముగా ఉంటున్నవి. ఈదేశ కాలభేదములచేత జీవులయందు కలిగే మార్పులు అనంతములుగా ఉంటవి. ఎందుకనగా కాలమునుబట్టి ఒక్కొక్క దేశములో అనేక మార్పులు వస్తవి. దేశాన్నిబట్టి కాలములో మార్పులు వస్తవి. ఒక్క భారతదేశము తీసికొందాము. ఉత్తర దేశము రాముడు కృష్ణుడు వీళ్లు బ్రతికున్నప్పుడు ఎలా ఉండేది ? తురుష్కులు రాజ్యము చేసినప్పుడు ఎట్లాఉంది ? ఇప్పుడు పాశ్చాత్య నాగరకతా ముద్రపడి హిందూమతమంటే వైముఖ్యము కలిగినప్పు డెట్లాఉంది ? ఇట్లాగే ఏదేశమైనా భిన్నకాలాలల్లో మారుతూనే ఉంటుంది. ఇదికాక శీతోష్ణ పరిస్థితులచేత మారుతుంది. ఇంక ఈ భేదాలను నిర్ణయించేదెవరు ? నాలుగువందల ఏండ్లక్రింద ఇంగ్లండులో పుట్టాడు ఒకజీవుడు. పుట్టాడు చచ్చాడు. ఆ ఇంగ్లండు రెక్కలుచాచి సామ్రాజ్యాన్ని పెంపొందించిన రోజులలో పుట్టిన జీవుడు మేము ప్రపంచాన్నంతా గెలువ గలుగుదుము అనేఅహంకారముతో పుట్టాడు. వట్టి దౌర్భాగ్యుడు ఎందుకు పనికిరాడన్న క్లైవు (Clive) ఇక్కడికి వచ్చి లార్డు అయినాడు. బ్రిటిష్ సామ్రాజ్యానికి పునాదులు వేశాడు. మూడువందల యేండ్లు గడిచినవి. ఇంగ్లండు మళ్ళీ

సామాన్య దేశమయి పోయింది. ఇట్లా ఒక్కొక్క దేశానికి ఒక్కొక్కప్పుడు ప్రాధాన్యం వస్తుంటుంది. ఒక్కొక్క మతానికి ఒక్కొక్కప్పుడు ప్రాధాన్యము వస్తుంది. వస్తూ ఉంటే కొందరు జీవులు ఆ దేశంలో ఆ మతంలో పుడితే వాడి భోగము, ఆ భావముయొక్క అతిశయము అధికంగా కలుగుతున్నవికదా ! ఆఫ్రికాలో గాంధి సత్యాగ్రహము మొదలు పెట్టాడు. అప్పుడు మనదేశము పరాధీనమై ఉన్నది. ఆ సత్యాగ్రహము ఇక్కడ జేశాడు ఫెళ్ళుమని పోయినాడు. కారణమేమిటి ? పరిస్థితులు. ఈ పరిస్థితులు లేకపోతే ఒక సాయిబాబాయో ఒక రాధాస్వామియో అయ్యేవాడు ఆ జీవుడిలో ఒక వైలక్షణ్యాం ఉంది గనక రాజకీయంగా భాసించాడు. ఏదో కారణాలచేత ఇంగ్లీషువాడు ఇక్కడనించి పోక తప్పిందికాదు. ఆ సమయంలో జవ్హార్ లాల్ ముఖ్యమంత్రి అయినాడు. ఆ జీవుడు మహాతపశ్శాలి. ఈ దేశములోనే కాకండా పరదేశాలలో కూడా తన ప్రతిభ పదిహేడేండ్లు సాగించాడు. ఆ జీవుడి లక్షణమది. ఆయన్ని గురించి ఒక కథ చెబుతారు. ఎంతనిజమో తెలియదు. మోతీలాల్ నెహ్రూకు మగ సంతానములేక మోతీలాల్, మదనమోహన మాలవ్యా మరి ఎవరో ఒక శాస్త్రిఅట ముగ్గురూ కలిసి హృషీకేశము వెళ్ళారట, అక్కడ ఒక చెట్టుమీద ఒకయోగి కూర్చొని తపస్సుచేస్తూ ఉండేవాడట. ఆ చెట్టుక్రింద ఒక కుంపటి ఎవరన్నా డబ్బు వేసేందుకు ఒక డబ్బీ. వెళ్ళి అడిగితే ప్రశ్నలు చెప్పేవాడట. చెట్టుదిగి వచ్చే

వాడట. వీళ్లు ముగ్గురూ ప్రశ్న అడిగేందుకు వెళ్ళారు. ఆయన దిగివచ్చాడు. మోతీలాల్‌కి పురుష సంతానము కలుగుతుందా అని ప్రశ్న వేశాడు ఆయన కలగదని చెప్పాడట. మీ వంటి యోగుల దర్శనము చేశాము. కలగకండా ఉండటము ఏమి న్యాయము అన్నారట. నాకే తెచ్చిపెట్టారా అన్నాడట. అయన రేపు రండి అన్నాడట. మర్నాడు వీళ్లు వెళ్లారు. ఆ యోగి శవము అక్కడ పడిఉన్నది. తరువాత జవ్వాహరులాల్ తల్లి గర్భవతి అయింది. ఆ శాస్త్రిగారిని కనుక్కొంటే ఈ కథ నిజమేనన్నాడట. జవ్హార్‌లాల్ కూడా నిజమేనన్నాడట. దీన్ని పట్టిచూస్తే ఆ యోగి జవ్హార్‌లాల్‌గా పుట్టాడని అర్థము. లేకపోతే అంత ప్రతిభ ఎట్లా వస్తుంది? అసలు అంత గొప్ప ఇంట్లో ఎందుకు పుట్టాలి? అక్కడ పుట్టాడు గనుక గాంధీకి ప్రియశిష్యుడైనాడు. ఇంగ్లండులో చదివాడు. ఠీవి, దర్జా, అహంకారము, కోపము, అన్నమాట నిభాయించు కోటము, పదిహేడేండ్ల ఈ గొప్పతనము సాగటానికి తగినన్ని లక్షణాలు వచ్చినవి. ఆ జీవుడిలోనున్నది ఇది అంతా పూర్వ జన్మ సంస్కారము. గొప్ప సంస్కారముగల జీవులు గొప్ప పురుషులుగా తక్కువ సంస్కారముగల జీవులు తక్కువ జీవులుగా పుడతారు. ఈ సిద్ధాంతము కాదన్నదేశాలలో కూడా అలాగే పుడుతున్నారు. అనుభవించే రోజులైపోతే స్టాలిన్‌వలె కృశ్చేవ్‌వలె పడిపోతారు. రోజుమంచిదయ్యేటప్పటికి చౌఎన్‌లై కొసిగిన్, వీళ్లకుమల్లే పైకివస్తారు. ప్రెసిడెంటు జాన్‌సన్

ఎన్నికలలో గెలుస్తాడు. అతను పూర్వము కాశీనగరములో ఉండే ఒకయోగి అని ఢిల్లీలో బిర్లా మందిరంలో ఉండే గోస్వామి అనే పండితుడు చెప్పాడట. జాన్సన్ గెలిచి తీరాడు. ఇలాగాజీవులు సంస్కార విశేషాలనిబట్టి పుడతారు. వాటిని పట్టి భగవంతుడు వాణ్ణి ఏ కాలంలో ఎక్కడ పుట్టించాలో అక్కడ పుట్టిస్తాడు. భగవంతుడు లేదనుకొందాము. ఆజీవులే వాళ్ళ సంస్కారబలము కొద్దీ వాళ్ళు ఎక్కడ పుట్టాలో అక్కడ పుడతారు. ఇది అంతా ఒక మహాపెద్ద పథకము. ఒక మహాచమత్కారము. ఈ మార్గంలో ఆలోచిస్తే కొంత కాక పోతే కొంత తెలుస్తుంది. నే నాలోచించను. నే నిప్పుడిక్కడు న్నాను, ఈ ప్రపంచాన్నిలా మారుస్తాను. ఇప్పుడెదో ఉద్యమ మున్నది. ఈ ఉద్యమమే సర్వజగత్తును రక్షిస్తుంది. సర్వమాన వజాతిని సముద్ధరిస్తుంది. అని అనుకునేవాళ్లెంత మందిఉన్నారు? అటువంటివి లేకపోతే ప్రపంచములో ఘోరాలు ఎట్లాజరుగుతవి. జరగకపోతే ప్రపంచ మెందుకవుతుంది! జీవులు కొందఱు ఘోరమైన చావు చావవలసి ఉంటుంది. వాడి కర్మనిబట్టి ఆ చావు నిర్ణయింపబడి ఉంటుంది. ఒక మతావేశపరులో రాజ్య విస్తరణ కాంక్షా రాక్షసులో పుట్టి పర మతము మీద పర రాజ్యము మీద దాడిచేస్తారు. పిల్లలని వృద్ధులని గొడ్లని చంపే స్తారు. ఆ జీవుడు అల్లా చచ్చాడంటే ఆ జీవుడు ఆ కష్టాలను భవించాడంటే ఆ జీవుడు తాడిఎత్తున పెరిగాడంటే అంతతాడి చెట్టు ఝంఝూమారుతమువచ్చి విరుచక పడ్డదంటే ఆ జీవుల

సంస్కారాలు ఆ దేశము ఆ కాలము అన్నీకలిసి అల్లా చేసినవి. అలా జరుగుతున్నది అనే ఒక మహావిషయము హేతుకల్పన చేసికొని ఊహించటము పేరు ఆలోచన. అది అధిక వివేక సంస్కారము గలిగిన జీవుడి లక్షణము. ఇది ఇట్లాగే ఉంటుంది; దీనికి ఎవ్వడు కారణము కాడు. ఇది ఇంతే అనటము ఈ కార్యకారణ భావము కలిపించుకొని ఆలోచనచేసి అధిక మానవత్వము ఉండటానికి వీలులేని ఒక మొద్దుజీవుడి లక్షణము. ఇందులో భేదము చమత్కారముగా ఉంటుంది. ఆ జీవుడంత మొద్దు. వాడికొక భోగము వ్రాసిఉంటుంది. దానికి దీనికి ఏమీ సంబంధములేదు. వాడొక పెద్ద కవి కావచ్చు. నోబెల్ ప్రైజ్ కూడా రావచ్చు. ఒక పెద్ద పత్రికాధిపతి కావచ్చు. కొన్ని వేలమందిని వాడు చేతిలో పెట్టుకొని ఆడించవచ్చు. ఒక మంత్రికావచ్చు. ఒక రాజు కావచ్చు. ఈ భోగాలు వేరు. వివేకము వేరు. ఈ జీవితంలో ఎన్ని భేదాలు ఉన్నవో అన్ని భేదాలకు అన్ని సంస్కారాలు ఉంటవి. వాడు చాలా ధనవంతుడు. వంకాయలు వీశె రెండు రూపాయలైనా కొనుక్కొని తినగలడు, కాని కొనుక్కొనితింటే తలకాయ నొప్పి వస్తుంది. కడుపులో నొప్పి వస్తుంది. డబ్బు ఉంటే సంస్కారము వేరు. అన్నం తింటే అరిగి ఆరోగ్యంగా ఉంటే సంస్కారము వేరు. ఇటు ముఖ్యమంత్రి అవుతాడు; ఆ రోజుననే చేతికి ఎదిగి వచ్చిన కొడుకు మోటారుక్రింద పడి చస్తాడు. వాడికి ఫెడరల్ కోర్టు జస్టిస్ ఉద్యోగమౌతుంది. ఉద్యోగానికి వెళ్ళ

టానికి వెళుతూ ఏరోప్లేను తగులబడి చస్తాడు. ఈ మహారహ స్యాన్ని భావించలేనివాడు మానవుడై పుట్టిన మహా ప్రయోజ నాన్ని ఎరుగనివాడు. పరమ చైతన్య స్వరూపము ఒకటే ఉన్నది. అనే మహార్ధాన్ని అవగతము చేసికోటము మానవ జన్మకు పరమార్ధమైతే ఆ పరమార్ధానికి ఎంతో దూరంగా తన్ను తానే చేసికొనేవాడు. అభగవంతుడే ఈ పరమార్ధ జ్ఞానము మానవకోటికి కలగకుండా చేస్తాడు. చెయ్యకపోతే వాడికి లోకము ఎట్లా సాగుతుంది ? ప్రజలలో భిన్నాభిప్రా యాలు కలిగించి తాను రాజ్యమునందు అధికారము వహిం చేందుకు దుష్ట రాజనీతి ఎలా ప్రవర్తిస్తుందో ఇంచుమించుగా భగవంతుడు లోకాన్ని సాగించేందుకు కూడా అలాంటినీతినే ప్రయోగిస్తాడు. అయితే ఈ రాజు ఎలాంటి దుష్టుడో ఆ భగవంతుడూ అలాంటి దుష్టుడు కావాలి. అందుచేత భగవం తుణ్ణి కర్మ ఫలదాత అనటం. కర్మ చేసేవాడు భగవంతుడు కాడు. వాడు జీవుడు. దుష్ట నీతిగల రాజు భగవంతుని వంటి వాడు కాడు. ఇదీ భేదము.

అట్లా నానాప్రకారముగా సృష్టి ఉంటే సంస్కారాలు భిన్నభిన్నాలుగా ఉంటూఉంటే సంస్కారాలల్లో చాలా చోట్ల సామాన్యము భాసిస్తూ ఉంటే ఈ సమానత్వముకల జీవులు ఎక్కువ మంది ఉంటే వాళ్ళ సంఖ్య ఎక్కువైతే వాళ్ళ సంస్కారము బలవత్తరమైతే వాళ్ళకి ఒకచోట ఒకప్పుడు ప్రాబల్యము వస్తుంది. ఇంకొక మహా రహస్యముంది. భగవం

తుడు ధర్మస్వరూపుడు. ఒక జడ్జ ఉన్నాడనుకోండి. దుష్టరాజు పరిపాలన చేస్తూఉంటే వాడి తీర్పులన్నీ ఆ రాజు చెప్పినట్లే చేయవలసి వచ్చినా ఆ జడ్జి సహజంగా న్యాయమైన బుద్ధి కల వాడు అయితే తనకు చేతనయినంతలో న్యాయము చేయటానికే ప్రయత్నిస్తాడు. ఏ మాత్రము వీలున్నా చేస్తాడు. భగవంతుడూ అల్లాగే. ఆయన ధర్మ స్వరూపుడు వేద స్వరూపుడు. వేదాలను తా నావిష్కరించాడు. ఏ మాత్రము వీలున్నా ఆ వేద ధర్మానికి ప్రాధాన్యము తీసికొని వస్తూఉంటాడు. నీలా, త్రిగిరీశ, యూపరతీశనదీ జల పరిపోషిత దేశాలల్లో వేద ధర్మము క్రమంగా నశించిపోతూ ఉంటే అక్కడ సాక్షాత్తుగా వేద ధర్మాన్ని నిలబెట్టటానికి వీలులేకపోయినా వేద ధర్మవాసన కొంచెమెక్కువగా ఉండేందుకయినా వీలైన చోట్ల పైకి రానిస్తాడు. అది త్రయీనగరము. వాళ్లు వేరే వేదము పేరు పెట్టుకొన్నారు. వాయుబలము, సుమేరు దేశము, సురాసురదేశాలు, అక్షత దేశము విజృంభిస్తూఉంటే క్రుడ్డిలో మెల్లగా ఈ త్రయీనగరము బయలు దేరింది.

## 2

కొన్ని నాగరపు మాటలనే అందులో అసభ్యము ఏమీ లేక పోయినా కొందరు మోటువాళ్లు మాట్లాడుతూ ఉంటారు. అర్థంలో ఏమీ మోటుతనము ఉండదు. నిజము భళ్లున పగులుతుంది అంటారు. ఈభళ్లున అన్న శబ్దముయొక్క ఉచ్చారణలో ఉన్న ఆ సౌకుమార్యము తప్ప ఇందులో మోటుతనమేమీ లేదు. భళ్లున తెల్లవారింది అంటారు. అక్కడ ఏమీ మోటుతనము లేదు. నిజము భళ్ళున పగిలింది అనటంలో ఏదో మోటుతనము వచ్చింది. ఎట్లా వచ్చిందో చెప్పలేము. నిజము అనేది ఒకానొక నాగరక లక్షణమైన భావము గనక పగులుట అన్నది ఏదో ఒక ఏవగింపు దూరంగా కలిగించేమాట గనుక ఈ భళ్లున అన్నమాటలో ఉన్న ఒత్తక్షరం ద్విత్తళకారము దానికి మోటుతనము తెచ్చినవేమో ! శబ్దార్థాలు మనస్సులో కలిగించే సౌకుమార్యాన్ని గాని ఒకవిధమైన ఏవగింపునుగాని ఇల్లా కలుగుతవని చెప్పలేము. "కళ్యాణీ బతగాథేయం లౌకికీ ప్రతి

భాతిమే" ఈకూర్పురులో ఏమి రామణీయకమున్నదో తెలియదు. ఒకప్పుడు నా హృదయానికి ఈ కూర్పులో ఎంతో మాధుర్యమున్నదనిపించింది. దాన్ని చర్వణముచేస్తూ ఉంటే కళ్ళవెంట నీళ్ళుకూడ వచ్చినవి. ఒకవేళ అందామా ? కొన్ని అసభ్యపు మాటలు ఉంటవి. ఒక సందర్భములో ఉపయోగిస్తే ఔచిత్యము పోషింపబడ్డట్టుగానే ఉంటుంది. సుదక్షిణాదేవిని కాళిదాసు "అపాంసులా నాంధురి కీర్తనీయా" అన్నాడు. పాంసుల వ్యభిచారిణి అయిన స్త్రీ. అపాంసులా అంటే వ్యభిచారిణికాని స్త్రీ అనగా పతివ్రత. పతివ్రత అనేందుకు వ్యభిచారిణికానిది అనటమేమిటి ? మరీ సుకుమారమైన మనః ప్రవృత్తి కలవాడికి ఈ శబ్దము పట్టిస్తుందేమో ! కాని వ్రాసినవాడు కాళిదాసు. ఆయన సర్వమైన ఔచిత్యానికి సముద్రమువంటివాడు. ఆయన్ని మించి ఔచిత్యాన్ని భావించటమెల్లా ? కాని ప్రత్యక్షంగా సామాన్యబుద్ధికి "అపాంసులానాం" అనటంలో పాంసులా శబ్దం బాగా లేదల్లేనే ఉన్నది. ఔచిత్య పరిజ్ఞానం ఈ సామాన్య జ్ఞానాన్ని అతిశయించినదా యేమి ? నిజము. యెప్పుడో అప్పుడు బయట పడుతుంది. అని చెప్పటము న్యాయము. ఈ మాటని అంతకంటె ఎక్కువగా చెప్పనక్కరలేదేమో ! నిజము భళ్ళున పగులుతుంది అన్నంత కఠినంగా ఆయాభార్ధ్యము యొక్క ఆవిర్భావాన్ని చెప్పగూడదేమో ! లేకపోతే ఈ నుడికారము తెలుగు దేశములో కొంచెము అనాగరకలైన స్త్రీలలో మాత్రమే ఎందుకు వినిపిస్తుంది ? ఇంతకు ఈ మాట

అన్నది చిదంబరం ఇంట్లో పతంజలి ఉండటం మూలంగా ఏర్పా
టైన తాత్కాలిక సత్రంలో వడ్డనకత్తెయైన లక్ష్మమ్మయమ్మ
కమలతో ఒకటై నాలుగైదు రోజులు చిదంబరము యొక్క
శీలాన్ని గూర్చి తెలివి తక్కువగా కమల తన దుఃఖాన్ని ఆ
మోటు స్త్రీతో చెప్పి ఆవిడతో తన రహస్యము చెప్పకూడ
దన్న ఔచిత్యాన్ని గ్రహించలేక ప్రవర్తించినప్పుడు, కమలా
చిదంబరాలిద్దరు నాలుగు రోజులు ఎడమొగం పెడమొగంతో
ఉండగా, ఒకనాడు సోఫియా హఠాత్తుగా వారింటికిరాగా,
రావటమే కాకుండా వచ్చి చిన్నప్పటినించి మేనత్తకొడుకుతో
ఎంతో పరిచయముగల స్త్రీవలె మంచముమీద కూర్చొని,
పడమటింట్లోనించి నడిచి, దొడ్డిలోనికి వెళ్ళి, కమలయొక్క
ప్రవర్తన తనకేమీ అనుకూలము లేకపోవటమే కాకుండా ప్రత్య
క్షంగా కనిపిస్తూ ఉండగా, కమలను లెక్కచేయకుండా, కమల
అవిద్యావతి అనాగరకురాలు పూర్వాచార పరాయణురాలు,
పూర్వాచార పరాయణత్వం ఈ కాలానికి పనికిరాదు, అది
కల వాళ్లందరు మూర్ఖులు, వాళ్ళని లెక్కచెయ్యనక్కరలేదు,
గ్రుడ్డికన్ను మూస్తే ఎంత? తెరుస్తే ఎంత ? అన్నట్లుగా
తిరిగి, ఆ మేనత్త కొడుకుతో పూసికొని తిరిగి, వాళ్ళిద్దరు
భార్యాభర్తలకంటె దగ్గర వాళ్లన్నట్లుగా ఇతరుల కనిపించే
టట్లు ప్రవర్తించి ఆవిడ వెళ్లటంతోటే పెద్ద తుపానుగాలి వచ్చి
చెట్ల నెక్కడ వాని నక్కడ విఱిచి వెళ్ళిపోగా, ఒకతోట ఎట్లా
ఉంటుందో కొంపంతా అట్లాచేసి, మంచాలు గుడ్డలు బల్లలు

అన్నింటిని మళ్లీ తడుపుకొని ఎండబెట్టుకోవలసిన స్థితికివచ్చి, పడమటింటిలో మళ్ళీ పుణ్యాహవాచనము చేయిస్తేతప్ప మడి కట్టుక వంటచేసేందుకుగాని, అక్కడఉన్న పూజామందిరము దగ్గర ఒక అగురవత్తి వెలిగించటానికో, రెండుపూలు స్వామి పటముమీద వేయటానికోగాని వీలులేనట్లుగా చేసివెడితే. చిదంబరం సోఫియాని పంపించటానికి వెడితే, కమల ఏడుస్తూ "ఇదే నమ్మా నా కొంపతీసింది" అంటే ఆ లక్ష్మాయమ్మ "ఎప్పటికైనా నిజం భళ్లున పగులుతుంది" అన్నది—అప్పుడు పతంజలి శాస్త్రి ఇంట్లోలేడు. ఇంట్లోనే కాదు ఊళ్లోలేడు. ఆయన తన భార్యకు జబ్బు చేసినదని వెళ్ళినాడు. పదిరోజులదాకా రాడను కొన్న పతంజలిశాస్త్రి నాలుగు రోజుల్లోనే వచ్చాడు. కాని పది రోజులదాకా రాడని చిదంబరంగారి ఇంట్లోని సత్రము మరునాడే మానిపించారు. అందరు వెళ్లారు. ఒక్క లక్ష్మాయమ్మే వెళ్ళలే. కమల వెళ్ళనివ్వలేదు. ఇంటినిండా బోలెడు సంభారాలున్నవి. ఏవి ఎక్కడ ఉన్నవో లక్ష్మాయమ్మకు తెలుసు. ఆవిడ తన ఇంటికి చేరవేయగలిగినన్ని చేరవేసింది. అన్నీ చేరవేయలేక పోయింది, కమల భర్తతో మాట్లాడటం మానివేసినా లక్ష్మాయమ్మ దొంగతనంగా ఎన్ని తీసికెళ్ళినా అన్నీ తీసికొని వెళ్ళటం ఆవిడకు సాధ్యంకాలేదు. అందులో ఇద్దరికి స్నేహమయింది. లక్ష్మాయమ్మ ఎత్తుక పోయినవి చాలక కొన్ని అడిగి తీసికెళ్ళింది. కొన్నింటిని గడుసుగా కమల చూస్తుండగానే తీసికెళ్లింది. తన మగనిమీద ఇంత ఫిర్యాదు

చేసిన కమల ఆమెకు లోకువై పోయింది. ఆ లోకువైన ప్రమా-
ణాన్ని పట్టి వేనిని తీసికొనిపోతూ ఉంటే కమల మాట్లాడలేదు
అనుకొంటుందో వాటిని తీసుకపోయింది. కమల ఇంట్లో
ఎందరు ? మొగుడు పెండ్లాము ఇద్దరు పిల్లలు. అరబస్తా బియ్యా
మైతే నెలంతా వెక్కితొక్కి. సవాశేరు మెంతులు ఎన్నాళ్ళకి
వస్తై ? ఎన్నాళ్ళకైనా రావచ్చు ఇలా ఉన్నవి సంభారాలు.
ఇంక కమలయొక్క మనస్సెల్లా ఉన్నది ? లక్ష్మాయమ్మ
మూలంగా సంభారాలన్ని గడప దాటుతున్నవని ఆవిడకి
తెలుసు. ఇది నిజమో అబద్ధమో మేనత్తా మేనమామ బిడ్డలు
పదిహేనేండ్లు కలవకపోతే మాత్రం మళ్ళీ కలసినప్పుడు బావా
మరదులు కాకపోతారా? అన్నాతమ్ములున్నారు. చిన్నప్పుడే
విడిపోయినారు. ముప్పై యేళ్ళయిన తర్వాత కలిసికొన్నారు.
మా తమ్ముడా ఊళ్ళో ఉన్నాడని ఇతడు చెబుతాడు. మా
అన్నగారా ఊళ్ళో ఉన్నాడని అతడూ అంటాడు. ముప్పై
యేండ్ల తర్వాత కలిసికొంటే అన్నగారు తమ్ముణ్ణి ఏరా అనే
పిలుస్తాడు. తమ్ముడు అన్నగారిని అన్నయ్యా అంటాడు. నువ్వో
అంటాడు. రక్తస్పర్శలో ఉన్నది.

పతంజలి ఇవ్వాళ మధ్యాహ్నము వస్తున్నానని ఉత్త
రము రాశాడు. రంగన్న షావుకారికి వాళ్ళకి రాశాడు.
భోంచేసే వస్తాను. వస్తూనే ఉపన్యాసం చేస్తాను. ఆ రోజున
శనివారము. నేను రాత్రికి భోంచెయ్యను. ఈ ఊళ్ళోనే ఫలానా
శాస్త్రుల్లుగారున్నారు. ఈ రాత్రికి వారింట్లోనే ఇన్ని మజ్జిగ

తాగి పడుకుంటాను అని రాశాడు. ఉపన్యాస మవటంలో చే
పతంజలిశాస్త్రి అక్కడికి వెళ్ళాడు.సోఫియా ఇక్కడికొచ్చింది.
ఇది జరిగిన కథ. చిదంబరం సోఫియాని పంపించి తిరిగి ఇంటికి
వచ్చాడు. వచ్చి మంచాలు గుడ్డలు అన్నీ తానే తడిపాడు
అతనికి రెండు పౌరోహిత్యపు ముక్కలు గూడవచ్చు.పుణ్యాహ
వాచనము చేశాడు. ఈ నాల్గురోజులు అతను లక్ష్మాయమ్మను
ఏమీ అనలేదు, ఇల్లంతా పరిశుద్ధము చేసినంతసేపు లక్ష్మాయమ్మ
దగ్గరకొస్తే కసురుకున్నాడు. ఒక సమయములో నా కొంప
లోంచి లేచి పొమ్మన్నాడు. ఆవిడ గుంజుకోటము మొదలు
పెట్టింది. ఏదో చదవటము మొదలు పెట్టింది. ఈ సొమ్మంతా
నీదికాదని ఆగావుగా వచ్చిన వస్తువులన్నీ ఊావుకుందామా
అని. చిదంబరానికి మరీ కోపమువచ్చి గెంటి తలుపువేశాడు.
అన్ని గుడ్డలు తడిపాడు. నవ్వారు మంచము కూడ తడిపాడు.
పెట్టెలో ఉతికిన బట్టలన్నీ తీశాడు. ఆరాత్రికి చాపమీద ఉండు
పెట్టుకొని దుప్పటి పరుచుకొని పడుకోటము మాత్రము మిగి
లేట్టుచేశాడు, పెట్టెలో తన మామగారెప్పుడో పెట్టిన పట్టు
బట్ట ఉన్నది. ఆరేళ్ళమట్టి అట్లాగే ఉన్నది. పురుగు పట్టకుండా
మధ్యమధ్య ఈ పట్టుబట్టను గర్భాదానమునాడు కమలకు పెట్టిన
కంచి పట్టుచీరెను ఈ రెంటిని పదిరోజులకో పదిహేనురోజు
లకో ఎండలో ఎండ వేస్తుంటారు. ఎప్పుడూ ఆ పెట్టెలో కలరా
ఉండలు వేస్తుంటారు. అవి రెండే వాళ్ళ సంపదకు చిహ్నాలు.
ఆ పట్టుబట్ట కట్టుకొని కూర్చున్నాడు. జపం చేస్తున్నాడు.

ఇంతలో కమలకు తన అనుమానము తొంభై పాళ్లు విచ్ఛేద మైంది. మడి కట్టుకుంది వంట చేసింది, నాలుగు రోజులమట్టి మొగుడుకి పెళ్ళానికి మాటలులేవు. వంట అయింది లెమ్మని ఆవిడ అనాలె. వంటైతే వడ్డించు అని ఇతడనాలె. ఇతడు జపము పూర్తిచేసి పిండి పెట్టిన గుడ్డలన్నీ దొడ్లో దణ్ణేలమీద ఎండ వేస్తున్నాడు. "రేపు ప్రొద్దున నేను ఎండవేస్తాను. రాత్రి ఎవ ళ్ళన్నా వచ్చి ఎత్తుక పోతారేమో" అని ఆమె అన్నది. క్రమంగా మాటలు కలిసినవి. భోజనాలైనవి. సోఫియా ముట్టు కోని మంచముమీద పిల్లలిద్దరు పడుకొన్నారు. ఒక చాపమీద దుప్పటి వేసికొని అతను పడుకొన్నాడు. ఆ ఇంట్లో అదివరకు ఒక్కటే చాప. ఇప్పుడైదారు చాపలు. ఇంకొక చాపతెచ్చి కమల వేసికొని పడుకొన్నది. ఆవిడ పీట తలకింద పెట్టు కొన్నది. కప్పు కొనేందుకేమీ లేకపోయింది. చిదంబరం తన ఉత్తరీయం తీసికెళ్ళి కప్పాడు, ఆవిడ ఊరుకొంది. ఆ రాత్రి రాజీ అంతమట్టుకే. మళ్ళీ రెండు రోజులైన తర్వాత పతంజలి మళ్ళీ ఇక్కడకే వస్తానన్నాడు. చిదంబరం అన్నాడు గదా "మీ రొక్కరూ వస్తేరండి, ఈ సత్రము మా ఇంట్లో వీలులేదు. ఊళ్లో సత్రమున్నదిగదా ! ఆ వంట బ్రాహ్మణ్ణి ఆ వడ్డనకత్తెని ఏర్పాటుచేసి వచ్చేపొయ్యే వాళ్ళకి అక్కడ ఏర్పాటు చేయిం చండి" అన్నాడు. పతంజలిశాస్త్రి రంగన్న షాహుకారుతో అన్నాడు. ఆయన ఒప్పుకొన్నాడు. మరునాడు పతంజలిశాస్త్రి ఇక్కడికే వచ్చాడు. ఆయన ఒక్కడే వచ్చినా సంభారా లేమీ తగ్గలేదు. కమలకు ఇదే లాభంగా కనిపించింది.

ఆనాడు మళ్ళీ ఉపన్యాస మవటంతోటే సోఫియా వచ్చింది. కమలకు గుండె గుభీలుమన్నది. మళ్ళీ కొంపంతా పులికాపు ఎక్కడ పెట్టుకొంటాము. మళ్ళీ తుంగచాపమీద ఎక్కడ పడుకొంటాము. కమల కే మనిపించిందంటే ఇది విశ్వామిత్రుణ్ణి పట్టుకున్న మేనక. రుక్మాంగద మహారాజు యొక్క ఏకాదశీవ్రతము పాడు చేయటానికి వచ్చిన మోహిని. కాని సోఫియా వచ్చింది. వాకిట్లోనే కూర్చుంది. వాకిట్లో రెండు కొయ్యకుర్చీలు మాత్రమే ఉన్నవి. అక్కడే ముగ్గురూ మాట్లాడుతూ కూర్చున్నారు. నిన్న సోఫియా కమలతో మాటాడదామని ఎంతో ప్రయత్నించింది. కమల సమాధానము చెప్పలేదు. కమల ఇల్లా అనుకొంది. "ఇల్లా కులము చెడిపోయిన వాళ్లు చెడిపోనివాళ్లు ఎటువంటి చనవుతో నుంచి ఇళ్ళల్లో తిరుగుతారో అల్లా తిరగాలని చెడిపోయినా చెడిపోని వాళ్ళని చూపించినట్లు చూపించుకోవాలని వాళ్ళకి ఆశ ఉంటుంది. రావటము ముట్టుకోటము మహా చొరవగా చేస్తారు. ఈ ఆచారాలమీద ఈ మర్యాదలమీద అంత ప్రేమ ఉంటే ఎందుకు చెడిపోవాలి ? అవ్వా కావాలి బువ్వా కావాలి అంటే ఎట్లా వస్తాయి ? వాళ్ళ మనస్సుల్లో వాళ్ళకే మంచి చెడ్డ వివక్షలేదు. చెడ్డగా ప్రవర్తించి మంచి వాళ్ళనిపించుకోట మెట్లాగ"

తరువాత చిదంబరము ఇంట్లోకి వచ్చాడు. కమల ఇలా అన్నది. "మీ ప్రియురాలు ఇవ్వాళ ఇంట్లోకి రాలేదేం"

"సవతిమీద కోపం" అని మళ్ళీ అన్నాడు "నిన్న దానితో వెళ్ళి చెప్పాను "అమ్మాయీ నీవు నా మేనమామ కూతురు వన్న మాట నిజమే. మనము బ్రాహ్మణులము. నీవు కాలు జారావు. మేము జారలేదు. ఇది కాలు జారటము కాదు అని నీవను కుంటే అది నీ మనో లక్షణ మౌతుంది. ఇది జారటము అను కొనుట మా మనోలక్షణ మెట్లా అవుతుంది ? ఈ లోకములో అతని వాండ్లని గౌరవము చేయటమంటే వాళ్ళ మనోలక్ష ణాన్ని మన్నించటం. ఒక సంఘము ఉన్నది. ఒక వ్యక్తి ఉంటాడు. ఆ సంఘమునందు కొన్ని దుష్ట లక్షణాలని నీవు ఆరోపిస్తావు. ఆ వ్యక్తి ఆ సంఘములోని వాడు. అతనియందా లక్షణాలు ఉన్నవి. వాణ్ణి దుష్టుడనటము న్యాయము కాదు. ఆ సంఘము యొక్క లక్షణాలను వాడు పాటిస్తాడు. అంత వరకే ఈ విభేద జ్ఞానము లేనివాడు సంస్కారికాడు. నన్నడి గితే వాడొక మూర్ఖుడు. ఆ సంఘ లక్షణాలు దుష్టములో కావో తెలియవు. కాని వీడికి లక్షణము మాత్రము నిశ్చయ ముగా దుష్టమైనదే. సరేకాని నిన్ను మా ఇంట్లోకి రానివ్వ లేదని దూరంగా ఉండమన్నామని నీకు కోపం గదా ! దీని పేరు సంఘ దౌర్జన్యమన్నావుగదా ! నీవు ఢిల్లీలో ఉన్నావు. అక్కడ పెద్దపెద్ద మంత్రులు ఉన్నారు. వాళ్ళ ఇళ్ళకి వెళ తావు. చీటి పంపించాలి. వారువస్తే లేచి నిలుచుండాలి. దూరంగా కూర్చోవాలి. లేకపోతే నిలుచుండి మాట్లాడాలి. వినయంగా మాట్లాడాలి. ఎకాఎకి వాళ్ళ ఇంట్లోకి వెళ్లటానికి

వీలులేదే. నిన్ను పిలిచి విస్తట్లో అన్నము వడ్డించరే. నీ తాక త్తునకు తగిన కుర్చీలో కూర్చోవాలి కాని అక్కడ బ్రహ్మాండ మైన సోఫాఉంటే దానిమీద కూర్చోటానికి వీలులేదే! నమ స్కారముచేసి సెలవు పుచ్చుకొని రావలసినదే కాని కరస్పర్శ చాలనములు కూడ చేయటానికి వీలులేదే. ఈ రాజ్యాలల్లో ఇంతే. సామ్యవాద రాజ్యాలల్లో ఈ భేదముండదంటావా ?! వీటికి వందరెట్లు భేదా లెక్కువుంటాయి. అక్కడ నీకు దర్శ నమే కాదు. చీటి పంపించటం కూడానా ? ఇది నిన్ను అవ మానపరచటం కాదా ! నీ అవమానమంతా సంఘాచారము లలో నున్నది ? ధనాధికార భేదాలల్లో లేదన్నమాట ! ఇలా చెప్పాను—

కమలకు మగనితో బాగా రాజీ కుదిరింది—

## 3

పులిమీదపుట్ర అన్నట్లు ఒకరోజున ఒక ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరం ఎవరు వ్రాశారో తెలియదు. అది ఆకాశరామన్న ఉత్తరం. ఆకాశరామన్న ఉత్తరాలు వస్తే బుద్ధిమంతులు వాటిని లెక్కచేయరు. బుద్ధిమంతులు అనడంకంటే, ఈ లోకపు త్రోవలు తెలిసిన వాళ్లు అనడం మంచిది. కొందరు మెత్తని మనస్సు కలవాళ్లు ప్రతిదానికి తలక్రిందులై పోతూవుంటారు. ముక్కుకు సూటిగా పోయేవాళ్లు మరీ గాబరా పడతారు. ఆ ఉత్తరం చూచుకొని చిదంబరం అల్లా దిగులుబడి పోయినాడు. పాతాళానికి అణగద్రొక్క బడినట్లయినాడు. ఆ ఉత్తరం పతంజలి శాస్త్రికి చూపించాలా? సోఫియాకు చూపించాలా? తన భార్యకు చూపించాలా? భార్యకూ తనకూ ప్రస్తుతం రాజీ అయినా ఏదోగానే వుంది. పైగా ఈ ఉత్తరం చేయక చేయక తను ఒక పొరపాటుచేస్తే దానిని వేలెట్టి పొడిచినట్లుంది. తన్ను సోఫియా క్రుంగలాగింది. ఇతనిలోవున్న జ్ఞానం

పనిచేయని సమయంలో పశు కామం దానంతట అది బయటకు వచ్చే సమయంలో సోఫియా ఇతణ్ణి క్రుంగదీసింది. అది అర్థ రాత్రి వేళ—అప్పుడు తనకు సోఫియాకూ జరిగిన ఈ వ్యవహారం ఎల్లా లోకానికి తెలుస్తుంది ? ఎల్లా తెలిసింది ? తనకు కూడా విరోధులున్నారా ! లేకపోతే ఆ సమయానికి ఎవడు కాపువేసి వున్నాడు ? తాను సోఫియా ఇంటికి వెళ్ళాడని, ఆ రాత్రి ఇంచుమించుగా అక్కడే వున్నాడనీ, ఇది బయటకు ఎల్లా వచ్చింది? ఇంక ఆ ఉత్తరంలో వ్రాసిన మాటలు సహించడానికి వీలులేకుండా వున్నవి, వ్రాసిన వాడికేమి, వాడెవడో నీకు తెలియదాయె. ఆ ఉత్తరం ఏ వూరునుండి పోస్టుచేశారో తెలియదాయె, ఒక వూళ్లో వ్రాసి మరో ఊళ్ళో వెయ్యవచ్చు వాయె, ఇంత గందరగోళంగా వుంది. ఆ ఉత్తరం మడిచి, జేబులో పెట్టుకున్నాడు.

ఆరోజున పతంజలిశాస్త్రి ఉపన్యాసం సాగుతోంది. ఇతను తలవంచుకు కూర్చున్నాడు. సోఫియా ఇతనివంకే చూస్తున్నది. అతన్ని చూచినకొద్దీ సోఫియాకి ఏదో అనిపించింది. ఇతన్ని తాను పాడుచేసింది. అప్పటినుంచి ఇతని మొగం బేలపోతోంది. ఇవ్వాళ మరీ ఘోరంగా వుంది. మొఖంచూస్తే పోయి ఆత్మహత్య చేసుకుంటాడా అన్నట్లు వుంది. తానితన్ని కలుసుకోవాలి. ఎట్లా! అతనిభార్య పుట్టింటినుంచి వచ్చిందట. ఇప్పుడు మరీ సాధ్యం కాదేమో !—ఉపన్యాసం అయిన తరువాత పతంజలిశాస్త్రిగారి దగ్గరికి వెళ్ళి "అయ్యా ! తమరు మా యింటి

కొకసారి రావాలి" అన్నది. ఆయన 'ఇదివర కొకటి రెండు సార్లు వచ్చానుకదా' అన్నాడు. సోఫియా 'ఈసారి మీరూ చిదంబరం ఇద్దరూ కలిసి రావాలి మీరు చిదంబరాన్ని చూస్తున్నారు కదా, ఎలా వున్నాడు ?' అన్నది.

"ఆయనా ! ఉత్సాహంగా లేడు" అన్నాడు

సోఫియా అన్నది "మీరు రమ్మంటే కాదు, మీరు ఎక్కడికో తీసుకు వెళ్తున్నట్లు నటించి నాయింటికి తీసుకురావాలి. పతంజలిశాస్త్రి. 'ఏమిటి విశేషమ'న్నాడు—సోఫియా చెప్ప లేదు.

మరునాడు—ఎట్లాగయితేనేమి, పతంజలిశాస్త్రి చిదంబరాన్ని సోఫియా దగ్గరకు తీసుకెళ్ళాడు. ఎక్కడికి వెళ్తున్నారో చిదంబరానికి వెళ్ళేదాకా తెలియలేదు. తీరా గేటు దగ్గఱకు వెళ్లాక తెలిసింది. లోపలికి రానన్నాడు. పతంజలి శాస్త్రి బలవంతంచేసి తీసికొని వెళ్ళాడు—అక్కడ కొంతసేపు కూర్చున్నాడు. కూర్చున్నంతసేపు చిదంబరం ముళ్ళమీద కూర్చున్నట్లు కూర్చున్నాడు. లేచిపోదా మంటుంది మనస్సు. మనస్సు వెనుక ఏదో ఉంది. అది 'కూర్చోరా' అంటుంది. సోఫియా చెప్పరానంత చనువుతో మాట్లాడుతోంది. వాళ్ళ మేనత్త మేనమామ బిడ్డలతనం చిన్నప్పటినుంచి బ్రహ్మాండమైన అమలులో ఉన్నట్లు మాట్లాడుతోంది. అరగంటసేపైన తర్వాత ముఖం గంటుపెట్టుకొని చిదంబరం జేబులోనుండి ఉత్తరంతీసి ఆమె మొఖాన పారవేశాడు ఆవిడ తీసింది, చదువు

కొన్నది. విరగబడి నవ్వడం మొదలుపెట్టింది. ఆ ఉత్తరాన్ని చూచి సోఫియా తనతప్పు తాను తెలిసికొంటుందని చిదంబరం అనుకున్నాడు. కాని ఆవిడ నవ్వినకొద్ది చిదంబరానికి తాను చేసిన తప్పు ఇరవై అంతలు అయినట్లుగా వుంది. సోఫియా గ్రహించి ఇల్లా అంది. "ఇదా, నాలుగైదు రోజులనుంచి నీ ముఖం మరీ వాడిపోయింది. ఇవ్వాళ చూస్తే పోయి ఆత్మహత్య చేసుకుంటావేమో ననుకున్నాను. ఆత్మహత్య చేసుకో నక్కరలేదు. నీకో ధర్మం చెబుతా విను. భారతంలో ఒకసారి ధర్మరాజుకు అర్జునుడిమీద కోపంవచ్చి నీవు కర్ణుణ్ణి ఎట్లాగు చంపలేవు. ఆ గాండీవం ఎవరికన్నా ఇమ్మన్నాడు. అర్జునుడికి బాగా కోపం వచ్చింది. "ఆమాట ఎవడంటాడో వాణ్ణి చంపుతాన"ని అర్జునుడు అదివరకే ప్రతిజ్ఞచేశాడు. ఇప్పుడు ధర్మరాజును చంపాలి. కృష్ణుడు చంపనివ్వడు. ఏమి చేయాలి? ఎవడైతే చేసిన ప్రతిజ్ఞను నిర్వహించుకోలేడో వాడాత్మహత్య చేసుకోవాలి. అందుచేత అర్జునుడు తన్ను తాను చంపుకోడానికి తయారైనాడు. కృష్ణుడన్నాడుకదా! "అది ఏమీ అక్కరలేదయ్యా! ఆత్మస్తుతి, ఆత్మహత్య రెండూ ఒక్కటే జాతి. ఆత్మస్తుతి చేసుకో—నేనింతవాణ్ణి, అంతవాణ్ణి అను, దానితో తీరిపోయింది-అన్ననూ చంపక్కరలేదు, నీవూ చావక్కరలేదు-మరీ చాలకపోతే మీ అన్నను మరి పది తిట్టమన్నాడు. అర్జునుడు అటూ, ఇటూ నోరుచేసుకున్నాడు—దానితో అయిపోయింది—కనుక ఓయి చిదంబరం! నీవు ఆత్మహత్య చేసుకోనక్కరలేదు.

ఆ పని, ఇదివరకే జరిగిందికదా! నేను నీవు ఆత్మహత్య చేసు
కునేటట్లే చేశాను. నేను నిన్ను చంపాను. ఆ చంపడం ఎల్లా
చంపానంటే నిన్ను నీవు చంపుకున్నట్లుగా చేశాను. అదీ నీవు
పడేబాధ—పైగా ఈ ఉత్తరం వ్రాసినవాడు ఎవడు? దీని
కోసం నీవింత గాబరాపడటం ఎందుకు? గాబరాపడితే
వాడెంత బుద్ధిహీనుడో నీవంత బుద్ధిహీనుడవవుతావు. మన
దేశంలో చావు ఉత్తరాలు వస్తే చింపివేస్తారు. ఈ ఉత్తరం
నీవు చింపివేశావనుకో. ఇది వాడి చావు ఉత్తరం అని అర్థమవు
తుంది. 'వాడికి తెలియదుకదా! ఎట్లా అవుతుంద'ని నీవంటే
వాడెవడో నీకు తెలియదుకదా! వాడు చచ్చినవాడు కాక
పోతే పేరుంటుందికదా! వాడు బ్రతికిలేడు కనుకనే వాడికి
పేరులేదు. వాడు నిన్ను నన్ను కలిపి వ్రాశాడు-నాకు చాలా
సంతోషంగా వుంది. వాడు చేసిన తప్పేమిటంటే కమలను
గూర్చి వ్రాశాడు, దానికి నరకలోకాలకు పోతాడు-మీ అమ్మ
గారిని గురించి వ్రాశాడు, దానికి ఏ లోకాలకు పోతాడో
నాకు తెలియదు—మా అమ్మగారిని గూర్చి వ్రాశాడు. మా
అమ్మచేసిన తప్పేమీలేదు-నేనావిడ కడుపున పుట్టడం తప్పు-
అది ఆవిడ తప్పా? కాదనడానికి వీలుందా? తెలిసికోలేని
ఏ దోషమో ఉన్నది కనుకనే నేను కడుపున పుట్టాను-నే నిప్పు
డన్నానే మాట-ఆ జ్ఞానం ఇల్లాంటి చవటల కుంటుందా?
అసలింకొకటి చూడు—వాడు పేరు దాచుకొని ఉత్తరం
వ్రాశాడంటే ఇంకొక అర్థం వుంది. వాడి జన్మలో ఏదో చాటు

తనం వుందయ్యా ! వాడు సరిగ్గా వాడి తండ్రికి పుట్టినవాడు కాడు. వాడి తల్లి వాడిని రహస్యంగా కనివుంటుంది వాడు ఇలాంటి పనులు చేయక ఎలాంటి పనులు చేస్తాడు ? మనంచేసే పనులన్నింటికీ మనకు తెలియకుండా వెనుక కారణా లుంటాయి. నేనిట్లాంటిదాన్న య్యేందుకేదో కారణంవుంది. నేను నిన్ను పాడుచేస్తే నీవు లొంగిపోయేందుకు వేఱే కారణం ఎదో వుంటుంది. ఈ ఉత్తరం వ్రాసినవాడు ఇల్లా నోటికి వచ్చినట్లు వ్రాయశానికి వేఱే కారణం వుండాలి. వాడి జన్మహేతు వేదో వుంటుంది. వాడి సంస్కారమేమిటో వాడు విచారించుకోకుండా ఇల్లా వ్రాశాడు—వెనుకటికి, పిండి ప్రోలు లక్ష్మణకవిని ఒకాయన పైజారులతో తన్నిస్తానన్నాడు. పైజారులంటే ఒకానొక రకపు చెప్పులు. అంతే లక్ష్మణకవి "పైజారుల మాట తర్వాత చూద్దువుగాని, ముందు లోజారులను చూచుకో" మన్నాడట అంటే వాడి తల్లి, వాడి పెండ్లాము—వాడి చెల్లెలు మొదలైనవారు జారిణులని అర్థం" అని సోఫియా మళ్ళీ విరగబడి నవ్వడం మొదలు పెట్టింది.

ఇదంతా చూచి పతంజలి శాస్త్రి, నివ్వెరపోతున్నాడు వీళ్ళిద్దరికీ ఇంత కామాటం ఎప్పుడు బలిసింది ? ఎలా బలిసింది? "ఓహో ! కామము—దీనిని గెలిచినవాడెవడు ? ఏ పురుషు డెట్లాంటివాడో వాడికే తెలియాలి ! ఏ స్త్రీ ఎట్లాంటిదో దానికే తెలియాలి. వాళ్ళ వాళ్ళ శీలాలను గూర్చి వాళ్ళ బంధువుల కహంకారమెందుకు ?? మనకు తెలియని దాని

విషయంలో గర్వమెందుకు ? ఒకానొకడు తనకు మానాభి మానాలు ఉన్నవనుకుంటాడు—వాడి ఇంట్లో వ్యవహారం వాడి కేమి తెలుసు ? తెలుసుననుకుంటాడు - ఇంత భ్రాంతిలో ఉన్న లోకం శాంతిని గురించి ఉపన్యాసాలిస్తుంది — నా ఉపన్యాసాలూ ఇంతేనేమో"

తరువాత సోఫియా మళ్ళీ ఇలా అంది "చిదంబరం ! నీ వంటివాళ్ళు, వట్టి అమాయకులు. ఈ ఉత్తరం వ్రాసినవాడు నీ కంటె అమాయికుడు. వాడికేవో సిద్ధాంతాలున్నాయి. మతద్వేషా లున్నాయి, కులద్వేషా లున్నాయి - వాడికున్న జ్ఞానం అంతే ! వాడు చచ్చినా బాగుపడడు. వాడియొక్క ఈ మనః ప్రవృత్తికి వాడు పుట్టినవర్ణం ఈ కాలం, వాడి దురహంకారం, వాడికి అన్నోదకాలుండటం, ఇలాంటివి చాలా కారణాలున్నాయి. ఈ పరిస్థితులలో పుట్టిన పశువు వాడు మనందరం కూడా తలా ఒక పరిస్థితిలో పుట్టిన పశువులమే. నిజం విచారిస్తే పలుమంది పలువిధాలుగా పడుతారు- అయ్యా ! పతంజలి శాస్త్రిగారూ ! ఈయనను తీసుకు వెళ్ళండి"

పతంజలిశాస్త్రి చిదంబరం కలసి వస్తున్నారు.పతంజలిశాస్త్రి ఇలా అన్నాడు — "చూచావుటయ్యా ! మనిషి-ఏమంటావు? ఆవిడ స్వరూపమేమిటి ? యోగిని కాని యోగిని అనడానికి వీలులేదు - జీవితంలో ఒక మొండితనం అలవాటయింది. దేనినీ గురించీ లెక్కచేయదు- అన్నింటికీ వ్యాఖ్యానాలు చేస్తుంది.

ఆవిడ వ్యాఖ్యానాలు కాదనడానికీ వీలులేదు. యథార్థమల్లా వుంటుందేమో ననిపిస్తుంది. నీకు జాబు వ్రాసినవాడిని గురించి ఆవిడ అన్నమాటలు నిజమే నేమో - వాడిని అన్నదికదా, అని తానూరుకుందా ! తన స్వరూపం చెప్పింది. అవిజ్ఞాతమైన ఈ సృష్టి రహస్యం, అదొక విలక్షణంగా తెలిసిన వ్యక్తులలో ఆవిడ ఒకర్తె. నువ్వేమీ దిగులు పడకు - ఎవ్వడూ పడక్కర్లేదు."

# 4

రైలు స్టేషను ఉన్న ఊళ్లకు మెయిలువచ్చే వేళను బట్టి ఉత్తరాలు వస్తవి అందుచేత ఒక్కొక్క ఊళ్లో ఉత్తరాలు వచ్చే వేళ ఒక్కొక్కటి. ఆ ఊళ్ళోకి ఉత్తరాలు ప్రొద్దుటిపూట సూర్యుడు బారెడు ప్రొద్దెక్కేలోపుగా వస్తవి. వచ్చే ఉత్తరాలనుబట్టి వాటి కలవాళ్ళైన మనుష్యుల మనః ప్రవృత్తులు మారుతూ ఉంటవి. ఇందులో కొంత వెసులుబాటు ఉంది. ఆ ఉత్తరాన్నిబట్టి ఏదైనా పనిచేసికోవలసివస్తే పగలల్లా చేసికోవచ్చు. ఏదైనా సుఖమైన వార్తవస్తే పగలల్లా ఉత్సాహంగా ఉండొచ్చు. ఇంతమట్టుకు బాగానే ఉందిగాని వచ్చినది దుఃఖ వార్తగాని మనస్సును కష్టపెట్టే వార్తగాని అయితే మాత్రము పగలు పగలల్లా నరకమే. ఈ సుఖ మనుభవించటమో పని ఏదైనా ఉంటే చేసికోటమో మనుష్యుల ప్రకృతులను బట్టి. ఒక సోమరి ఉంటాడు. ఒకపని చేయవలె. చెయ్యవలెనని ఉత్తరము వచ్చింది వాడెందుకు చేస్తాడు ? వాడుగాని చెయ్యడు.

సృష్టిచేసిన బ్రహ్మకు స్త్రీని సంరక్షించే విష్ణువునకు సంహారము చేసే శివుడికి మొదటి అభ్యంతరం వాడు. వాళ్ల పథకాలని వీడేమీ సాగనివ్వడు. ఎక్కడికక్కడికి వాయిదాలు వేస్తాడు. ఒక్కొక్కప్పుడు ఆ పనే చెయ్యడు. సూర్యచంద్రుల నాపగల వాళ్ళిద్దరే! మొదటి వ్యక్తి పతివ్రత. సుమతీ మొదలైన పతివ్రతలు సూర్యచంద్రుల నడక నాపారని కథలు ఉన్నవి. పురాణములను నమ్మని వారున్నారు. మనము నమ్ముతాముగా అందుచేత సూర్యచంద్రుల నడకనాపే మొదటివ్యక్తి పతివ్రత. అంతకంటె గొప్పవ్యక్తి రెండవవాడు సోమరి. ఆ పతివ్రత సూర్యచంద్రుల గమనాన్ని ఏదో ప్రయోజనము కోసం అవుతుంది. మనవాడున్నాడే సోమరి. వీడు నిష్ప్రయోజనంగా ఆపుతాడు. ఇప్పు డాపుతాడు ఇప్పుడాపడు అనిలేదు. ఎప్పుడు పడితే అప్పుడు ఆపుతాడు. సూర్యచంద్రులు వాళ్లని తెల్లపోయి చూస్తుంటారు. వాళ్ళమీద ఎవ్వళ్లకీ కోపమురాదు. ఒకవేళవస్తే వ్యర్థమైన కోపము అంటూ లోకములో ఒకటి ఉంటే దానికా కోపము ప్రథమోదాహరణ, మరి సుఖవార్తలు తెచ్చే ఉత్తరాలు దుఃఖ వార్తలు తెచ్చే ఉత్తరాలు పుచ్చుకొనే వాళ్ళున్నారు. సుఖ వార్తలు వచ్చినవాళ్లు సరే! ఎటువంటి వాడైనా సుఖమనుభవించేదే! వద్దన్నా అనుభవించేదే! నాకు సుఖ దుఃఖాలు రెండు ఒకటే అనేమెట్ట వేదాంతులుంటారు. వాళ్లు కూడ సుఖమనుభవించేదే! ఇంక దుఃఖపు వార్తలు వస్తవి. వాటి ననుభవించటములో ఉన్నది. ఈ సృష్టిలోని వైవిధ్య

మంతా. ఆ ఒక లక్షణము సోఫియా దగ్గర ఉన్నది. ఆ రోజున ఆవిడకు రెండు ఉత్తరాలొచ్చినవి. ఒక ఉత్తరము జాకబ్ దగ్గర నుంచి వచ్చింది. రెండవ ఉత్తరము సోమనాథశాస్త్రి దగ్గర నుంచి వచ్చింది. సోఫియాకు ముందర ఏ ఉత్తరము చదువుదాము అన్నది ప్రశ్న. అయిదు నిమిషాలు తటపటాయించింది. ఎవళ్ళ ప్రేమ ఎక్కువుంటే ముందర వాళ్లు వ్రాసిన ఉత్తరము చదువుతారు. తనకెవరిమీద ఎక్కువ ప్రేమ ఉన్నది ? మనస్సులో ఆలోచించింది. పెళ్ళిచేసికొన్నది. అందుచేత జాకబ్ మీద ఎక్కువ ప్రేమ ఉండాలి, కాని సోమనాథశాస్త్రిని తానను గ్రహించింది. వాడు తానంటే పడిచస్తున్నాడు. అతడంటే తనకేమీ లెక్కలేదు. వాడు తన చేతిలోని కీలుబొమ్మ. వాడి మీద తనకెక్కువ ఆదరము ఉన్నది. ఈ సృష్టిలో ప్రేమ అన్న మాటకు ఈ అర్థమని చెప్పటానికి వీలులేదు. స్వార్థము ఆదరము అభిమానము కామము సరదా లాభము వస్తుందన్న ఆశ ఒక్కొక్క వేళలో ఒక్కొక్కడికి కలిగే ఆవేశము కంటికి నదరుగా కనిపించటము ఇలాంటి వెయ్యైనా ప్రేమ అన్న శబ్దానికి అర్థాలే ! ఇది ఒక గుండవంటిది. కొంచెము శనగ పిండి కొంచెము పెసరపిండి కొంచెము మినప్పిండి కొంత కందిపిండి జీలకఱ్ఱ ఉప్పు మిరపకాయలు అన్నీ కలిపి గుండ కొడతారు. సామాన్యంగా విసురుతారు. ఢిల్లీలో తిరగళ్ళు ఉండవు గదూ అందుచేత మరపట్టిస్తారు. అందుచేత పిండి అనాలిసి వస్తున్నది. ఈ గుండ అన్నంలో కలుపుకొంటే కడుపులో నెప్పి వస్తుంది.

నాలుగుకలిపిన వస్తువులెవ్వైనాసరే జీర్ణకోశములో అరగటానికి కొంత శ్రమ ఇస్తుంది. అసలు ఒక వస్తువేమిటి మిశ్రమైతే అది అధిక బాధను తప్ప కండా కలిగిస్తుంది. ఇప్పటి నాస్తికు లున్నారు చూడండి. వాళ్ళు నాస్తికులుకారు. రహస్యంగా సామ్యవాదులు. రుద్రాభిషేకాలు చేయిస్తారు. వర్ణభేదాలు పనికిరావన్న వాళ్ళు తమ కూతుళ్ళను దగ్గర బంధువుల కిస్తారు. బ్రహ్మసమాజ మతస్థులై కూతుళ్ళని వాళ్ల కులము వాళ్లకే ఇస్తారు. ఆ కూతుళ్ళు మొట్టో నేను వాణ్ణెవణ్ణో ప్రేమించా మంటారు. ఆమె ప్రేమించినవాడు గుఱ్ఱంబండి వాడైనాడు. ఎల్లా కుదురుతుంది ? న్యాయమా ? వీడు తాసిల్దారాయె. దిక్కుమాలిన నాస్తికత్వం పేరుపెట్టిన సర్వసామ్యము పేరు పెట్టి ప్రేమ భగవంతుడనే సిద్ధాంతాన్నిబట్టి తాసిల్దారు తన కూతుర్ని గుఱ్ఱంబండి వాడికిస్తాడా ? ఎట్లాగూ ఇవ్వడు గనక తాను కులమత వివక్షత లేనివాడయ్యేను తనకులము వాడికే ఇస్తాడు, అన్నాడుకదూ మహాకవి. "అన్నమైతేనేమిరా మరి సున్నమైతేనేమిరా అందుచే ఈ పాడు పొట్టకు అన్నమే వేతామురా" అని. కులమత వివక్షలు లేవనుకో అయినా మన అమ్మాయిని మనవాడికే ఇద్దాము ఈ రీతిగా ఉంటుంది.

ఇంతకూ సోఫియా ఎవరిని ఎక్కువ ప్రేమిస్తున్నది. సోమనాథశాస్త్రినా జాకబ్‌నా ? లోకంలో ఇంకొక లక్షణము ఉన్నది రెండు పదార్థాలుంటే అందులో ఒకటి బాగా ఇష్టమైతే దానిని చివరకట్టి పెట్టుకోవటము, జాకబ్ ఉత్తరాన్నే తీసింది

"నా ప్రియతమురాలైన సోఫియాకు—నీ దగ్గరనించి ఉత్తరమే లేదు. రెండు నెలలు ఆ ఊళ్ళో ఉంటానన్నావు నెలపైన గడిచింది. అక్కడ ఎవరో ఒకాయన భూగర్భ శాస్త్రవేత్తల పరిశోధనలను గురించి తన ఇష్టము వచ్చినట్లుగా వ్యాఖ్యానాలు చేసి ఉపన్యాసాలిస్తున్నాడట. వాటిని నీవు చాలా ఆదరముగా వింటున్నావట. అసలు నీ వా ఊళ్లో ఉంటున్నది ఆ ఉపన్యాసాలు వినేందుకేనట. ఈ సంగతి బాగాలేదు. నీకున్న సంస్కారానికి ఇటువంటి వెఱ్ఱి నమ్మకాలు పనికిరావు. ఆధునిక నాగరకతా శిఖరాయమానమైన నీ మతి వైభవమెక్కడ ? ఈ చాదస్తపు మాటలెక్కడ? నీవు వెంటనే ఆ ఊరినించి కదలి ఇంకొక దేశములో—ఎన్నాళ్లు తెలుగు దేశములోనేనా కన్నడ ద్రావిడ మహారాష్ట్ర కేరళదేశములకు పోవలె. నీ ఉద్యోగము నిలవటము కష్టము. నీకు తెలుసు కదా ! వెనుక నున్న రహస్యమేమిటి ? నీవు సంఘ సంస్కారపు పెళ్ళి చేసికొన్నావు గనక నీకింత ఉద్యోగము వచ్చింది. ఈ ఉద్యోగము నీకు మూడేళ్ళ కిచ్చారు నీవు ఇల్లాగే ఉంటే ఈ మూడేళ్లు అయిపోవటముతోటే ఆ ఉద్యోగము కూడా అయిపోతుంది. కనుక జాగ్రత్తగా ఉండాలి." సోఫియా ఉత్తరం చదివింది. ఇందులో పేరు మాటే లేదు. నీకోసము నేను ప్రతీక్షిస్తున్నానని కాని నీ వియోగము సహించలేకుండా ఉన్నానని కాని నాకు తెల్లవారటము లేదని కాని ఆఫీసులో తోచటములేదని కాని ఇలాంటివి సగము సగమబద్ధాలైనాలేవు. మేరీని గురించిన ఉత్తరంలో

మేరీ తన్ను గురించి జాకబ్‌కు అపనమ్మకాలు కలిగే మాటలు చెప్పిందని తెలిసింది, ప్రేమలేకపోతే మానె ఈ జాకబ్‌కు ఈర్ష్య కూడ లేనట్లుంది ఈర్ష్య ప్రేమకు లక్షణ మనుకుంటారు కొందరు. అది స్వార్థానికి లక్షణం గాని ప్రేమకు లక్షణమెలా అవుతుంది ? అవుతుందో కాదో దాని దుంపతెగ కొంచెము ఈర్ష్య అయినా ఉంటే సంతోషించవచ్చు. ఈ జాకబ్ యొక్క హృదయం నిర్గుణ పదార్థంలా ఉంది. అంతకుముందు నాలుగు రోజుల క్రింద తేగలు అమ్మ వచ్చినవి. తేగలంటే తాటికాయలు వేస్తే భూమిలో అవి పొడుగ్గా తేగలవలె సాగుతవి. వాటిని కాల్చుకొని తింటారు, ఎందుకు తింటారో తెలియదు అది ఏమైనా బలవర్థకమైన వస్తువా ? కాదు. రుచిగా ఉంటుందా ? ఉండదు మరి ఏమిటయ్యా ! ఆ పైన తొక్కతీసి తుంచుకుని దాన్నిండా పీచు ఉంటుంది ఆపీచు పళ్ళల్లో చిక్కుకొంటుంది. దాన్ని నవులుతూ తింటారు. ఎందుకు కాలుస్తారు ? గమ్ అనేదాన్ని నములుతారు — ఎందుకు నములుతారు ? ఎందుకో మానవులనేక పనులు చేస్తుంటారు. నిష్ప్రయోజనంగా చేస్తారు. దవడలు ఎపుడూ ఆడిస్తూ ఉంటే బ్రతికి ఉన్నామన వాళ్ళంతట వాళ్ళ కనిపించేందుకేమో ? జాకబ్ ఉత్తరం ఆ తేగలను తిన్నట్లు ఉన్నది.

సోఫియా సోమనాథశాస్త్రి ఉత్తరాన్ని తీసింది. "ప్రియ మైన సోఫియాకు, నిన్ను దేవతగా ఆరాధించే సోమనాథశాస్త్రి వ్రాయునదేమనగా — వచ్చాను; పూట కూళ్ళింట భోంచే

శాను; జాకబ్ ఇంటికి వెళ్ళలేదు. ఎకాయెకి కంపెనీ ఆఫీసుకి వెళ్ళాను. జాకబ్ నా వంక చూచాడు. నేను సెల్యూట్ చేయలేదు. అతనేమీ మాట్లాడలేదు ఉద్యోగపు కాగితము చేతి కిచ్చాడు. వెంటనే పనిలో ప్రవేశించాను. నెలకు నాలుగు వందలు జీతము. నాచేతిలో ఇప్పుడు మూడు వందలు ఉన్నవి. మాఇంటికి రమ్మని జాకబ్ అనలేదు. మూడు రోజులయిన తర్వాత మర్యాదగా ఉండదని నేనే అతని ఇంటికి వెళ్ళాను. హాల్లో కూర్చుంటే జాకబ్ వచ్చి మేరీని చూచి రమ్మన్నాడు. లోపలికి వెళ్లాను. గది అంతా పరిశుభ్రముగా ఉన్నది. దుర్వాసన ఏమీ లేకండా సాంక్రామికత్వ చిహ్నం కూడా లేకండా ఎప్పటికప్పుడు డెట్టాల్‌తో కడుగుతున్నారు. మేరీ ఉల్లిపొర లాంటి మల్లెపూవులవంటి తెల్లనిచీర కట్టుకొనిపడుకొన్నది. గౌను వేసికోనన్నదట. 'అది పాశ్చాత్యులు ధరిస్తారు. నేను హైందవ స్త్రీని నేను ధరించనన్న' దట. ఆ తెల్లని ఉడుపులలో తెల్లని దుప్పట్లు పఱచిన మంచముమీద ఆమె నల్లని మొగముఒక్కటే కనిపిస్తున్నది. ఆమె మొగము పూర్వము నేను చూచి నప్పుడు ఇంత కంటె అంద వికారమైన మొగము ఉంటుందా? అనుకొన్నాను. ఆరోజున చూస్తే అంత ఏవగింపు కలుగలేదు. నావంక చూచింది. దాని కళ్ళల్లోకి ప్రాణాలు వచ్చినవి. ఓరి దీనిదుంపతెగ హృదయము ! అవతలి వాళ్ళెట్లాంటి వాళ్లై నా సరే మనలను ప్రేమిస్తున్నారంటే మన హృదయంలో మధుర స్పందనము కలుగుతుందే ! కుక్కల్ని పెంచుతాము. అవి

జంతువులు. నీచ జంతువులు. అవి దగ్గరకు వచ్చి తోక ఆడించి మెడ ఎత్తి ఒక చనువును ప్రకటిస్తవని వాటిని ప్రేమిస్తారు అటువంటప్పుడు మేరీ నన్ను చూడటముతోటే తన కళ్ళలోకి అంత ప్రేమ తెచ్చుకొన్నదంటే నా హృదయము స్పందించ టంలో తప్పేమున్నది ? ఈ మాటకి ఆమెను నేను ప్రేమిస్తు న్నానని గాని ఆమెయందు నాకు ప్రేమోదయము కలిగిందని కాని అర్ధము చేసికోకూడదు ! నా హృదయము నీ యందే లగ్నమైయున్నది. నేనీ ఉద్యోగము చేస్తున్నానంటే నీవు చేయమన్నావని చేస్తున్నాను. మేరీ నన్ను ప్రతిరోజు వచ్చి చూడమన్నది నాకు వీలు లేదన్నాను. రోజు విడిచి రోజో రెండురోజుల కొకసారియో అయినా వచ్చి చూడమంది 'నేను కాదు ప్రతి ఆదివారము వస్తా'నన్నాను 'మీదయ' అన్నది. కాని ఏదో చెప్పుదామని ఆమె ఉద్దేశము నేనే వారించాను. "ఓపిక రానియ్యి మాట్లాడుదువుగాని' అన్నాను. ఓసి ప్రియు రాలా ! నేను నిన్ను వదలిపెట్టి ఉండలేను. నా మహా సౌఖ్య సౌధానికి తలుపు తెరచినదానవు నీవు నీవు లేకండా నా జీవి తము వృథా. తండ్రి నన్ను వెళ్ళగొట్టాడు. చెల్లెలు నే నన్న గారినే కాదనుకొంది. నీ వొక ర్తవు తప్ప నా కింకెవ్వరూ లేరు. ఏ ఒక్కరూ తప్ప నాకింకెవ్వరూ లేరో ఆ ఒక్కరు నా జీవితంలో స్వర్గ కవాటం తెఱచినవారు కావటం నా జీవితంలో ఉన్న అదృష్టము ఏకైక మహాభాగ్యము. "నీ చరణదాసుడు సోమనాథశాస్త్రి—"

సోఫియా ఈ ఉత్తరము చదవటము పూర్తిచేసింది. దీనిని గురించి భావించటానికి ఎడమివ్వకండా ఎవరో ఇద్దరు పెద్దమనుష్యులు లోపలికివచ్చారు సోఫియా వాళ్లని కూర్చోమన్నది. వాళ్లు కూర్చున్నారు. వాళ్లొకళ్ళ తర్వాత ఒకళ్లుగుక్కతిప్పకుండా కథ మొదలు పెట్టారు. విన్నారా మన విఠల్ రావు సంగతి-డబ్బు ఉంటే ఎన్నివేషాలైనా వేస్తారు అతను ఈఊళ్లో ఎంతమంది ఆడపిల్లలనో చెడగొట్టాడు. అతనికి తైనాతీగాళ్ళు ఉన్నారు. వాళ్లందరికీ డబ్బు పెడతాడు. ఇది పల్లెటూరు కాదు, బస్తీ కాదు. పెద్దమనిషైన కొంచెమందమైన పిల్ల కనిపిస్తే తనకు నచ్చితే దానికొంఅకు ఉచ్చులు పోస్తాడు. బాతినీలు పెడతాడు. ఏ కులము స్త్రీ అయినా సరే! కొంతమంది బ్రాహ్మణ కన్యలనే చెరిపాడు. డబ్బిస్తాడు, చీరెలు కొనిపెడతాడు. నగలు చేయించుతాడు ఏదో ఆపదలో ఉంటే పరామర్శించేవాడికిమల్లే వెడతాడు. డబ్బుకోసం రవికెలకోసం మెతకబడే వాళ్లుంటే వాళ్ల ద్వారానే ఆ కూతుళ్ళని సాధిస్తాడు. కంచెయే చేను మేసిన కలదె దిక్కు - అంటారుకదా! తల్లులే అంగీకరిస్తే ఎవరేమి చేస్తారు? వాళ్లందరూ పెళ్ళిళ్లైన పిల్లలే. ఇల్లా చెడిపోయిన పిల్లలను తల్లులు వాళ్ళ అల్లుళ్ళ దగ్గరికి సంపిస్తున్నారు. వాళ్లు ఏ లోకానికి పోతారో తెలియదు. ఆ రంగన్న షావుకారు పరమ సాధువు. ఆయన్ని చూచి ఊరుకొంటున్నారు జనం. ఈ ఊళ్ళో వాడొక పెద్దమనిషి. పండితుడు విద్యావంతుడు.

పతంజలిశాస్త్రిగారికి పోటీ. మీకు సన్మానము చేయిద్దామని ప్రారంభించినవాడు" అని అంటూ ఉంటే సోఫియా నవ్వి అసలు కథ ఏమిటో చెప్పమంది. వాళ్లిట్లా చెప్పారు. "ఎవళ్ళు తీసికొన్న గోతిలో వాళ్ళే పడతారు. మా ఊరికికూడ కొంత దూరంలో గూడెము ఉన్నది. అందులో నాగడని ఒక ఆసామి పాలేరు. వాడు చాలా మర్యాద కలవాడు, న్యాయము కల వాడు. బాగా పండితుడు. అతడు శైవుడు. మాల దాసరి. గొప్ప మర్యాద కలవాడు. ఈ ఊళ్ళో న్యాయము చెప్పవలె నంటే వాణ్ణి పెద్దమనిషిగా పిలుస్తారు. వాడెంత చెబితే అంత చేస్తారు. వాడు చాలా గొప్ప పౌరుషశాలి. కఱ్ఱసాము కత్తి సాము నేర్చినవాడు. వాడి కిద్దరు కొడుకు లున్నారు. ఇద్దరూ జమాజట్టీలు. తండ్రివలె పండితులు కాకపోయినా మంచి మర్యాద కలవాండ్లు, వాండ్లని ఎవళ్ళూ తిట్టటానికి వీలులేదు. మాట మిగలటానికి వీలులేదు. వాళ్ళ చెల్లెలు ఉన్నది చక్కని చుక్క. యౌవనమంతా అదే అన్నట్లుగా తయారైంది. విఠల్ రావు దాన్ని సాధిద్దామని మొదలు పెట్టాడు. అది అన్నలతో చెప్పింది. తండ్రితో చెప్పింది. నాగడికి మేనల్లుడున్నాడు. ఈ పిల్లని వానికిద్దామని. వాడు చూద్దామని వచ్చాడు. వాళ్లి ద్దరూ ఒకళ్ళ నొకళ్ళు ప్రేమించుకొంటున్నారట. విఠల్ రావు బాధ అది పడలేకుండా ఉంది. ఊరి చివర పాత గ్రామదేవత యొక్క గుడి వుంది. అక్కడ కలుసుకుందామని దానిచేత చెప్పించాడు. నిన్నరాత్రి ప్రొద్దుపోయి విఠల్ రావుగారు,

అక్కడికి దయచేశారు. ఆ ముగ్గురు పట్టుకొని వీణ్ణి చితక కొట్టారు. శోభమ్మగారూ!! సున్నంలోకి ఎముక లేకుండా కొట్టారు. భీముడు కీచకుణ్ణి కూడా అట్లా మర్దించి ఉండడు, అన్నిటికంటే ఆశ్చర్య మేమిటంటే ప్రాణంతో మిగిలిఉన్న ఆ విఠల్ రావు శవము తెల్లవారుతూ ఉంటే రంగన్న షావుకారి వారి వాకిట్లో కనిపించింది. వైద్యు లొస్తున్నారు. వాళ్ల ఇల్లు తీర్థప్రజలా ఉంది. ఊరు ఊరంతా సంతోషిస్తున్న దనుకోండి—"

## 5

ఆరోజున ఉపన్యాసము ఉంటుందా ఉండదా అన్నది ప్రశ్న అయింది. లేదని ఎవరూ అనలేదు. ఉన్నదనే అర్థము. కాని ఉంటుందా అన్న సందేహము. రంగన్న షావుకారు ఉపన్యాసానికివచ్చాడు.అంటేఉన్నదన్న మాటఅందరూ బిలబల మూగారు. పతంజలిశాస్త్రిఆరంభించాడు."ఈ త్రయీనగరముఉన్నదో లేదో ఎవరికీ తెలియదు.లేదనే చాలామంది అనుకొన్నారు.పట్టి కల్పన అనుకున్నారు. ఈ త్రయీనగరము యొక్క ప్రస్తావన చేసిన వారు హోమర్ అనే గ్రీకుభాషా మహాకవి. ఆయన రెండు గ్రంథాలు వ్రాశాడు. ఆగ్రంథాలనుబట్టి ఈ త్రయీనగరము ఉన్నది, ఉండకపోతే ఉండి ఉండాలి అన్న విషయము తెలిసింది. ఆ గ్రంథాలు హోమర్ వ్రాసినవా ? అన్న ప్రశ్న కూడ ఉన్నది. ఎందుచేతనంటే ఆ హోమరే ఆ గ్రంథాలలో ఉన్న కథలన్నీ పూర్వము పాటలుగా ఉండేవనీ వాటినన్నింటినీ అతడు గుంఫించాడు కాని స్వంతముగా వ్రాయలేదని ఒక

ప్రథ ఉన్నది. ఆ కథలనేక విధాలుగా పూర్వము ఉంటే ఆ కథలను తీసికొని ఈయన ఒక మహా గ్రంథముగా వ్రాశాడు. అనాది నాగరకతలన్నీ ఇట్లాగే ఉంటవి. ఆకాశములోనించే ఎవళ్ళూ ఊడిపడరు. ఒక పెద్ద రాజ్యము ఉంటుంది. ఆ రాజ్యము నశించిపోతుంది. దాని కథలు లోకములో మిగులుతవి. ఒక గొప్ప కవి వాటి నన్నిటిని సంగ్రహించి సంంధిగ్రహిస్తాడు. పాణిన్యాచార్యులకు పూర్వము చాలా వ్యాకరణాలున్నవి. కాని పాణిని వాటిని సంగ్రహించి దోషాలు తొలగించి వాటి నన్నింటిని సూత్రించాడు. ఆ చేసిన గ్రంథము 'నభూతో నభవిష్యతి' అన్నట్లుగా ఉన్నది. దానికి ప్రామాణ్యము వచ్చింది. ఎంత ప్రామాణ్యము వచ్చిందంటే సంస్కృతభాషలో ఒక శబ్దము తప్పు అనటానికి అది అపాణినీయము అన్నంత ప్రాముఖ్యము వచ్చింది. ఇప్పుడు సంస్కృతభాషని చంపేందుకు మనవాళ్ళు అన్ని ప్రయత్నాలు చేస్తున్నారు. కొన్నాళ్ళకు సంస్కృతభాష పోతే పాణిని ఏమౌతాడు ? ఆయన పేరు ఎవరు చెబుతారు ? పాణిని అనే గొప్ప వ్యాకరణాచార్యులవారుండేవారు అని మాత్రము మిగలవచ్చు. సంస్కృత భాషలో ఉన్న ఏ శాస్త్రము తీసికొన్నా తత్పూర్వమా శాస్త్రాలు ఉంటూ ఉంటే ఒక మహర్షియో ఒక మహా మునియో ఆ చెదరిపోతున్న వాటి నన్నింటిని సూత్రాలుగా నిర్మించారు అనే తెలుస్తుంది. కపిలుని సాంఖ్యము ఉన్నది. ఆ సాంఖ్యాన్ని గురించి అనేక గ్రంథాలల్లో ప్రస్తావన ఉన్నది.

భారతములో గూడ సాంఖ్య మతము చెప్పబడి ఉన్నది. కాని ఈశ్వర కృష్ణుడు అనే ఆయన ఆ మతాన్ని సూత్రాలుగా వ్రాశాడు. ఇప్పుడు ప్రమాణము ఆ గ్రంథము. అంతదాకా ఎందుకు ? వ్యాసమహర్షి అష్టాదశ పురాణములు వ్రాశాడు. కల్పించి వ్రాశారా ఆయన ? పరంపరగా వస్తున్న కథలు అప్పటికి ఉన్న అనేక గ్రంథాలు బహు పండితుల వాక్కుల యందు తాండవించుచున్న శ్లోక రూపమైన ఘట్టాలు కథలు తీసికొని వ్రాశారు. అలాగే హోమర్ కూడ వ్రాశాడు. వ్రాసినదాన్ని పట్టి విచారిస్తే త్రయీ నగరము ఉన్నది. ఆ నగరాధిపతి ఉన్నాడు. ఆయన కొడుకులలో ఒకడు చాలా అందకాడు. అతనేమి చేశాడంటే మరో దేశము పోయి అక్కడ ఒక రాజు పెళ్ళాన్ని చాలా అందకత్తెని వ్యామోహ పెట్టి మోసము చేసి ఎత్తుక వచ్చాడు; ఆవిడ పేరు హెలీనా. గ్రీకులకు పూర్వము ఈజియనులు అని పేరు. ఈ త్రయీ నగరము సముద్రపు ఒడ్డున నున్నది. అది మహానగరము. అభేద్యమైన కోట. ఆర్గాస్ అనే పట్టణానికి రాజైన మెనిలాన్ అనే వాడి భార్య హెలీనా, ఈ మెనిలాస్ రాజు ఈ గ్రీకుజాతికి చెందిన మహావీరుల నందరిని పోగుచేశాడు. పెద్ద సైన్యము ఓడలమీద వెళ్ళి ఆ త్రయీ నగరాన్ని ముట్టడించారు త్రయీ నగరాధిపతులను అక్కడి సేనలును వాళ్ళు చాలా పరాక్రమవంతులు. కొన్ని సంవత్సరాలు సాగింది ఈ ముట్టడి. ఈ దండెత్తి వెళ్ళినవాళ్ళు వట్టి సైనికులు. పెద్ద రాజ్యాలు లేవు.

వాళ్ళలో చదువు గిదువు కూడ వుందో లేదో తెలియదు. కానీ భట్రాజులవంటి వాళ్లు ఉండేవాళ్లు. వాళ్ళు వచ్చి ఆ పూర్వ గాథలన్ని పాడుతూ ఉండేవాళ్ళు. ఆ పాటలు తర తరాలుగా వచ్చేవి. చివరకు కొందరు కవులు వాటిని గ్రంథాలుగా వ్రాశారు. వాళ్లల్లో అగ్రేసరుడు హోమర్. ఆయన పాటి అన్నింటికి గ్రంథరూపము ఇచ్చాడు.

ఇదంతా కట్టుకథ అని త్రయీనగరమనేదే లేదని అనుకొంటూ ఉండేవాళ్లు. ఇట్లా ఉండగా ఒక జర్మనీదేశపు భూగర్భ శాస్త్రవేత్త అతని పేరు హీన్ రిచ్చిస్కీమన్, ఏష్యామైనరులో త్రయీ నగరము ఉండేది అన్న స్థలంచోట త్రవ్వాడు. ఈ స్థలం డార్డినల్సు జలసంధి దగ్గర బాలీదాగ్ అనే ప్రదేశము. బాలీదాగ్ అన్నది బలిదాహ శబ్దమువలె ఉన్నది. ఇలాగా ఈ శబ్దము లన్నింటికి సంస్కృత శబ్దాలు వెతికితే చాలా వాటికి దొరుకుతవి. జర్మనీ అన్నమాటకే శర్మణ్యాదేశమని, జర్మన్ అంటే శర్మన్ అని అంటున్నారు. ఈ త్రవ్వకాలవల్ల అక్కడే పెద్ద మహానగరము ఉండేది అన్న విషయము ఋజువైంది. హెలీనా భర్త అర్గాసునకు రాజు. గదా! ఈ స్కీమను ఆర్గాస్ వెళ్ళి త్రవ్వటం మొదలు పెట్టాడు. ఈ అర్గాసు మైసినీదగ్గర ఉన్నది. మైసినీ బంగారమునకు ప్రసిద్ధమైన దేశమని హోమర్ వ్రాశాడు. ఈ స్కీమన్‌కు డబ్బంటే అమిత ఇష్టము. ఇంక అతనికి ఎన్ని దొరికినవో చెప్పటానికి వీలులేదు. హోమరు వ్రాసిన త్రయీ నగర యుద్ధవర్ణనలో ఉన్న అనేక విషయాలు

కట్టుకథలు కావు అన్న విషయములు ఋజువు చేశాడు. ఆ గ్రంథాలు చదవని వాళ్ళకి త్రయీ నగరము త్రయీ జన యుద్ధము అవన్నీ గ్రీకు పురాణ కథలవలె ఉంటవి. అవి పురాణ కథలు కావు. చక్కగా జరిగిన కథలే. ఆ కథలలో జరిగిన వాటిలో కొన్నిటియందు అనగా కొన్ని అంశాలయందు నమ్మకము కొన్ని అంశాలయందు అపనమ్మకము ఉండటము జరుగుతుంది. మొదట ఒకసారి మీకు నమ్మకమంటే ఎట్లా ఉంటుందో అపనమ్మకమంటే ఎలా ఉంటుందో చెప్పినట్లు జ్ఞాపకం. ఆ విషయము మళ్ళీ చెబుతాను. ముందర ఈ హోమర్ వ్రాసిన రెండు కావ్యాలల్లో మొదటి దాని పేరు ఇలియడ్. ఈ కథలో ఎచ్చిలీస్ అనే మహావీరుని యొక్క కోపము, అతని కోపము మూలంగా గ్రీకుసేన లనుభవించిన బాధలు వర్ణింపబడి ఉన్నవి. ప్రధానకథ. మినిలాస్ భార్యను ఎలెన్‌నును త్రయీ నగరరాజు చిన్నకొడుకు ఎత్తుక రావటము, గ్రీకు లందరు దండెత్తి రావటము, ఈ త్రయీ నగరాన్ని నాశనము చేయటము ఇది కథ. ఈ కథ చూడండి. సీతాదేవిని రావణా సురు డెత్తుకపోవటము కోతులతో రాముడు దండెత్తి రావ టము, ఆ లంకానగరాన్ని ధ్వంసము చెయ్యటము ఈ పోలిక ఉంది. చాలామంది ఏమనుకొంటారంటే హోమర్ వ్రాసిన ఇలియడ్ రామాయణము వంటిదని హోమరు వాల్మీకివంటి కవి అని అనుకొంటారు. ఎక్కువమంది రామాయణము చదివిన వాళ్ళు కారు. మనదేశములో చదవకపోయినా రామా

యణకథ అందరికి తెలిసే పద్ధతి ఉన్నది. రామాయణంలో ప్రధానముగా ఆరుకాండ లున్నవి. అందులో యుద్ధకాండ ఒకటి. ఇలియడ్ అంతా ఒక్క యుద్ధకాండే. అందులో ఇంకొక కాండ లేనేలేదు, పోలికలేదు. కాని ఒక చమత్కారము ఉంది. ఎవడో ఎవని భార్యనో ఎత్తుక పోవటము. ఆ స్త్రీని రక్షించేందుకు ఈ వైపు వాళ్లు దండెత్తి వెళ్ళటం ఆ ఎత్తుకపోయిన వాణ్ణి నశింపు చేయటము. ఇది ప్రధానకథ. ఇటు రామాయణమైనా అటు ఇలియడ్ అయినా రచన లెట్టివైనా రచయిత లెట్టివాళ్లైనా ప్రధానాంశము ఇది. అనగా ఒకని భార్యను మరొకడు దొంగిలించడం. ఇది పరమమైన అధర్మము. ఇది అధర్మమనే విశ్వాసము అనాదినించి మానవజాతియందు రూఢమైయున్నది ఇంకా ఏమున్నదంటే - స్త్రీ భర్తను వదలి పోరాదు అని ఉన్నది. సీత పతివ్రత. ఆమె ననుమానించి రాముడామెచేత అగ్నిప్రవేశము చేయించాడు. ఇది భారతదేశకథ అక్కడ గ్రీకులు ట్రయీ నగరాన్ని నాశనముచేసి హెలెనును తీసుక వెళ్ళారు. మినిలాసు ఆమెను తీసుకువెళ్లాడు. మళ్ళీ అతనితో సంసారము చేసింది. ఇది పాశ్చాత్య కథ. భారత ధర్మము భారతదేశము వదలిపెట్టి పోయ్యేటప్పటికి ఆ విధంగా మారిపోయింది. అప్పటినించి ఇప్పటివరకు మానవుని హృదయము కావ్య రూపముగా స్పందించాలి. అంటే స్త్రీకి సంబంధించినది కావాలి అన్నట్లుగా ఉంది. ఈ స్త్రీ పురుష సంబంధమైన కథ అందులో సంసారము యొక్క నిర్వహణమును గూర్చిన కథ.

మానవుని యొక్క హృదయాన్ని ఆకర్షిస్తున్నట్లు ఉన్నది. పేరు త్రయానగరము మరి వాళ్ళు ఎక్కువ వేదధర్మాన్ని పాటించా రేమో తెలియదు. అరాచకాలకు ఆమె నెత్తుక రావటమువల్ల ఇలియడ్‌లో త్రయా నగరవాసుల దుర్మార్గాలేమీ వర్ణింపబడ లేదు. ఎక్కువ వర్ణింపబడినవి గ్రీకుల దేవతలు గ్రీకుల నమ్మ కాలు ఇవి వర్ణింపబడినవి. కావ్యమునందంతా గ్రీకుల కథ త్రయా జనుల కథ కాదు. ఆ కథని చూస్తే ఒకటనిపిస్తుంది. ధర్మపరులై ఉన్న ఒక జాతిలో ఒక దుర్జనుడుదయిస్తే వాడు జాతిజాతిని నాశనము చేస్తాడు. ఆ జాతి నాశనానికి హేతు వౌతాడు. ఆదే మహార్థాన్ని చెప్పటానికి వ్రాసిన కథగా ఉంటుంది. కాని ఆ గ్రంథము అందుకు వ్రాయబడలేదు. గ్రీకుల పరాక్రమాన్ని గ్రీకుల అతిశయాన్ని గ్రీకుల విశ్వాసాలని గ్రీకుల దైవ భావనాదులను వర్ణించేందుకు వ్రాసి నట్లుంది. త్రయా నగరానికి ప్రాధాన్యము లేదు. గ్రీకుల దేవత లున్నారు. వాళ్లు సగము మనుష్యులు సగము దేవతలు. అదంతా నీలానదీ నాగరకత మారిపోయి పరోక్ష రూపము వహించినట్లుంటుంది. హోమర్ రాసిన రెండవ కావ్యము పేరు ఒడిస్సి. ఒక గొప్పవీరుడు ఈ త్రయానగర యుద్ధానికి వచ్చాడు. అతని భార్య పేరు పెనులోపి. ఆవిడ పతివ్రతగా ఉంది. ఈ వీరుడు చనిపోయినాడు. ఆవిడ తమరిని పెళ్ళిచేసి కోవాలి అని అక్కడి వీరులు బలవంతము చేస్తున్నారు. ఆమె లొంగలేదు. ఇతను తిరిగి వెళ్ళాడు వాళ్ళని సంహరించాడు

ళ్ళినప్పుడితడు మారువేషముతో వెళ్ళాడు. ఇతని వెంట ఒక దేవత వెళ్ళింది. ఇతని పందులను కాసే సేవకుడొకడున్నాడు. వాడి కుక్క ఈ వీరుణ్ణి చూచి తోకాడించింది. ఆ దేవతను చూచి మొరిగింది. ఆ దేవత ఇతర మానవుల కదృశ్యంగా ఉంది. కాని కుక్కకు కనిపించింది. ఇది ఒక చమత్కారము. ఇప్పటికి మనదేశములో కుక్కలకు దయ్యాలు కనిపిస్తవని ఒక విశ్వాసమున్నది రాత్రిపూట బజారులలో కుక్కలూరకే మొరుగుతూ ఉంటవి. ఎందుకయ్యా అంటే వాటికి దయ్యాలు కనిపిస్తవి అంటారు. ఈ విశ్వాసము ఆ ఒడిస్సి అన్న కావ్యములో కనిపిస్తున్నది. ఇలాంటివి ఇప్పటికీ మనదేశములో ఉన్న కొన్ని విశ్వాసాలు పామరజనుల విశ్వాసాలు హోమరు వ్రాసిన గ్రంథాలల్లో కనుపిస్తున్నవి. దీనికి రెండు హేతువులు కావాలి. ఒకటి యాదృచ్ఛికంగా ఇక్కడి జనము ఊహించినట్లే అక్కడి అప్పటి జనము ఊహించారనాలి. లేదా ఇక్కడ ఈ విశ్వాసాలు కలిగిన జనులు కాలంమీద అక్కడికి వెళ్ళారు. కొన్ని విశ్వాసాలు మారకండా అట్లాగే ఉండిపోయినవి అనుకోవాలె. హోమర్ రాసిన రెండు గ్రంథాలల్లో ఇలియడ్ గ్రంథములోని కథానాయిక భర్తను వదలిపెట్టి లేచిపోయింది. ఆమె వ్యభిచారిణి. ఆవిడ్ని తెచ్చి మళ్ళీ భర్త ఏలుకొన్నాడు. ఈ కథ ఇలా ఉండగా హెలెన్ మొగుడైన మెనిలాసుకు ఆగమెమ్నాన్ అని ఒక తమ్ముడున్నాడు. అతడు పెద్దవీరుడు. యచ్ఛిలీస్ అన్నవాడు యుద్ధము చెయ్యనని భీష్మించి కూర్చు

న్నాడు. వీళ్ళిద్దరికీ విరోధము వచ్చింది. అయాగ మెమ్నాన్ యుద్ధానికి వెళ్ళితే వాడి భార్య ఇంటిదగ్గర ఒక దెవ్వడితోనో ఉండి వచ్చిన మగనిని చంపించింది. యచ్ఛిలీసు భారతంలోని అర్జునునివలె ఉంటాడు లేకపోతే కరుడివలె ఉంటాడు భీష్ముడు చచ్చిపోతేగాని యుద్ధము చేయనని నాడు పట్టుబట్టాడుగదూ అల్లా ఉంది ఇది. కొన్నిచోట్ల రామాయణ సాదృశ్యం కొన్ని చోట్ల భారత సాదృశ్యం. ఏ మహా సంస్కృతి భారత రామాయణాలల్లో ఉందో ఆ సంస్కృతిలోఉన్న స్వచ్ఛత్వం గాఢత్వం గూఢత్వం మూడు పోయి మానవశౌర్యము పరాక్రమము మిగిలి ఆ కథలైనట్లుగా కనిపిస్తుంది. అయితే ఆ కథలు జరగ లేదు. ఇక్కడినించి వెళ్ళినవాళ్లు ఈ కథలనే మార్చుకొని పాట లుగా నిర్మించుకొని ఉంటూఉండగా కొన్నాళ్ళకి అవే ఒక కావ్యరూపము పొందినవి అందామంటే వీలులేదు. ఒక భావ పరంపర ఒక మహా సంస్కార లక్షణము ఒకదేశములో ఉన్న ఒకజాతిని పట్టుకుంటే ఆ జాతిలోఉన్న మనుష్యులందరు తద్భావనాభావితులై జీవితాలు అట్లాగే గడుపుతుంటారు. ఏ కొంచెము మార్పుతోనే ఆ కథల్లాగే గడుస్తుంటవి. త్రయీ నగరము ఆర్గాసు ఇవన్నీ ఉన్నచోట్ల ఈ స్కీమెర్ అనేవాడు త్రవ్వి ఆ నాగరకత అంతా బయటకు తీశాడు అని చెప్పాము కదా! ఇంకొక సమానముగాఉన్న విషయము కనిపిస్తున్నది. ఆ నాగరకత లన్నింటిలో కంచురథాలు ఉన్నట్లుగా ఉన్నది. ఆ నాగరకతలయొక్క కాలపరిమితిని ఆ భూగర్భ శాస్త్ర

వేత్తలు క్రీస్తుపూర్వము మూడు వేల యేండ్లుగా చెబుతూ ఉన్నారు. అనగా ఇప్పటికి అయిదు వేల యేండ్లు దాటినట్లు. భారతయుద్ధ మిప్పటికి షుమారు అయిదు వేల వంద యేండ్ల క్రింద జరిగింది. ఈ కాలాన్ని పాశ్చాత్యులు తగ్గించినా మన లెక్కలు సమృద్ధిగా ఋజువు చేస్తున్నవి. ఆ భారత యుద్ధ కాలములో కంచురథాలు ఉన్నవి. సంశప్తకులు అరువది వేల మంది కంచు రథాలమీద యుద్ధము చేశారని భారతములో ఉన్నది. పాశ్చాత్యులు మట్టి యుగమని ఇత్తడి యుగమని కంచుయుగమని ఇనప యుగమని విభాగించారు. ఇనుప యుగము నాగరకత సంపూర్ణమైన యుగమని వాళ్ళుద్దేశము. ఎలాగైతేనేమి అక్కడి కంచురథాలు ఇక్కడి కంచురథాలతో పోలిస్తే ఆనాగరకత ఇక్కడినించి వెళ్ళిందని తెలుస్తుంది ప్రధానంగా ట్రయీ నగరం అధర్మంవల్ల నశించింది—"

# షష్ఠ భాగము

## క్రీత ద్వీపము

### 1

మధ్యధరా సముద్రమున్నది. దాని చుట్టున అనేక రాజ్యాలు వెలసినవి. ఈశపీఠ భూమి నుంచియో సుమేరియా ప్రముఖ దేశాలనుంచియో ప్లక్ష ద్వీపము నుంచియో జనము వేల సంవత్సరాలమీద వెళ్ళిపోతూ వచ్చారు, ఎక్కడ వీలైతే అక్కడ నివాసము ఏర్పఱచు కొనటము, అక్కడ పెరగటము, రాజ్యాలు నిర్మించటము, ఆరాజ్యాలు కొన్ని వందల యేండ్లు సాగటము, నాశనమై పోవటము, ఇది ప్రపంచ చరిత్రగా కనిపిస్తుంది, ఆ ఆ రాజ్యాలల్లో ఒక్కొక్క రాజ్యములో ఒక్కొక్క విధమైన భోగము ఒక్కొక్క విధమైన మత విశ్వాసము ఒక్కొక్క విధమైన దౌర్జన్యము చివరకంతా నాశనమై పోవటము, అయితే సర్వనాశనము కావటము, లేకపోతే ఏదో కొత్త నాగరికతయో ఒక క్రొత్త సంస్కృతియో ఒక క్రొత్త

మతమో ఒక క్రొత్త జాతియో రావటము దాన్ని ఆక్రమించ
టము, ఆ పూర్వ చిహ్నముకూడ లేకండా పోవటము. ఇది
సృష్టిలోనే వుంది. మానవ స్వభావములోనే ఉంది. ఒక్క మన
భారతదేశమే తీసికోండి. ఇక్కడ ఎన్ని మతాలు - పాషండులు
కాపాలికులు నాస్తికులు గాణాపత్యులు బౌద్ధులు జైనులు—
చెప్పటానికి వీలులేనన్ని మతాలు ఉన్నవి. శాక్తేయులు
అందులో వామాచారులు, కాపాలికులున్నారు. వాళ్లు మను
ష్యులను తీసుకువెళ్ళి ఆ దేవతకు బలియిచ్చేవాళ్లు. ఇలాంటి
మతాలు రహస్యంగా ఇప్పటికీ దేశంలో ఉన్నవి. ఎన్ని దుష్ట
మైన విశ్వాసాలు ఎంతమట్టుకు నిజమో తెలియదు! దత్త
మండలాల్లో ఒక దురాచారము ఉన్నదంటారు. ఈ దేశములో
భర్త చనిపోతే మళ్ళీ వివాహము చేసికోరాదు గదా! భర్త
చిన్నప్పుడు చచ్చిపోతే అది బాల విధవ. ఏ అన్నగారింట్లోనో
ఏ బంధువులింట్లోనో జీవితాంతము వాళ్ళకి పరిచర్యచేస్తూ
బ్రతుకవలసిందే. ఈ విధవలు అవివాహితలన్న జాలిని మనకు
కలిగించినా వాళ్ళల్లో చాలామంది తాటకలు పూతనలు
ఉంటారు. ఆ కొంపలలో వాళ్ళదే అధికారము. అన్నగార్లమీద
వాళ్ళదే అధికారము. వదినెగారలను మరదండ్రను వాళ్లు
పెట్టే రొష్టు భగవంతుడికి తెలియాలి. కాని స్త్రీ పురుష సంగ
మమే జీవితానికి పరమావధిగా యెంచే సంఘ సంస్కారులు
అది ఒక పెద్ద తీరని మచ్చగా సంఘాన్ని విమర్శిస్తారు. పెండ్లి
అయి మొగుళ్ళు పోయిన వాళ్ళని గురించి పట్టించుకొన్నంత

ఈ సంఘ సంస్కారులు అసలే పెండ్లికాని వాండ్లని గురించి పట్టించుకోనట్లు కనిపిస్తుంది. ఇంతకూ ఆ దత్త మండలంలో కొన్ని పల్లెటూళ్లల్లో ఉండే ఇండ్లల్లో బాల విధవలు ఇంటి కెవ రైనా కంటికి నదరుగా ఉండే యువకులువస్తే వాళ్ళకు గారెలుచేసి పెడతారట. ఆ గారెల్లో ఒక పిండి కలుపుతారు. ఆ పిండి ఏమిటంటే నానపోసిన బియ్యము దంచి అది పిండిగా ఒక గుడ్డమీద ఆరపోసి బ్రతికివున్న బల్లిని పట్టుకొని దాని తోకకు తాడు బిగించి ఆ పిండిమీద వ్రేలాడగడతారట. ఆ బల్లి చొంగ ఆ పిండిలో పడుతుంది. బల్లిచొంగ అంటే ఎంత విషమంటే దాని ముందర పొటాషియముసైనైడ్ పనికిరాదు ఆ పిండి గారెలో కలిపి వండి పెడతారు. వాడు మరునాటికి చస్తాడు. వాడు తిరిగి తనకు భర్తయై పుడతాడని వాళ్ళ విశ్వాసమట. ఎవరు చెబుతారు ? దక్షిణదేశపు బ్రాహ్మణులు చేపలు తినరు ఉత్తర దేశములో బ్రాహ్మణులు తింటారు. ఆంధ్ర బ్రాహ్మణులు సంస్కృతము చదువుతున్నా మాట్లాడినా ఉచ్ఛారణ చక్కగా ఉంటుంది. ఈ సంగతి ఇదివరకు చెప్పాను. ఆంధ్రదేశ పండితులని చూస్తే ఉత్తర దేశములో కొంత ప్రశంస ఉన్నది. ఇప్పుడు మనదేశములో బ్రతికిఉన్న ఒక పెద్ద తార్కి-కుడు—వారికి ఖండన ఖాద్యమంతా కంఠతః వచ్చునట—ఆయన ఒకప్పుడు వంగదేశము వెళ్ళి ఒక పల్లెటూళ్లో రెండు మూడు రోజులుండటము తటస్థించింది. ఏ పూట ఈయన బయలుదేరినా వాళ్ళాపటము జరిగింది. ఏమిటిరా" అని అను

కొంటూ ఉంటే ఆ పొరుగు వాళ్ళెవరో చెప్పారట. 'ఓయి స్వామీ! ఎల్లుండి శుక్రవారము నిన్ను కాళికాదేవికి బలి యిస్తారు' అని. ఈయన భయపడి ఎల్లాగో ఓ అల్లాగా తప్పించు కొని బయటపడ్డాడు. ఇలాంటివి ఎప్పుడూ ఉంటవి. ఒక మత మేమిటి ? ఇలాంటివి యూరపులో ఇప్పుడు గూడ ఉన్నవి. ఓ హెనీ అన్న గొప్ప కథానికా రచయిత ఒక దుష్టమైన మత సిద్ధాంతాన్ని గురించిన కథ వ్రాశాడు. ఇలాంటివి పెరిగిన కొద్దీ అధర్మము పెరిగిపోతూ ఉంటుంది. దానికి నిష్కృతి జర గకపోతే భగవంతుడు ఈ మహా జగత్తును నడిపించే పథకంలో ఆ జాతిని ఆ దేశాన్ని సర్వనాశనము చేసిపారేస్తాడు.మన దేశ ములో కొల్లేరు కథ ఇదే. అంతా సర్వనాశనమయింది అనటా నికి అంతా కొల్లేరయిందంటారు. అవన్నీ దురాచారాలు, అసభ్యమైన అలవాట్లు, అవాచ్యమైన కార్యాలు, నోటితో చెబితేనే జుగుప్స కల్గుతుంది. కాని ఈ దేశములోకూడ అనాది నించి అక్కడక్కడ ఇట్టి దుష్టాచారాలు దుష్టమతాలు ఉంటూ ఉన్నా ప్రధానమైనది పరమ నాగరకమైనది వైదికమతము సర్వదా అభివ్యాప్తమై ప్రాబల్యము వహించి యుండటం మూలంగా ఎన్ని దుష్టరాజ్యాలు వచ్చినా ఎన్ని దుష్టమతాలు ప్రబలినా ఆ ఈశపీఠదేశమువలె సుమేరు వాయుబల అశుత త్రయీ నగర రాజ్యములవలె సంస్కృతులవలె నాశనము కాలేదు. అల్లాంటి ఒక రాజ్యాన్ని గురించి ఇప్పుడు చెప్పబో తున్నాను. మధ్యధరా సముద్రంలో గ్రీసుదేశము క్రింద క్రీట్

ద్వీపమని ఒకటి ఉన్నది. దాని పేరు క్రీతద్వీపము. క్రీతమనగా కొనబడినది అని అర్థము. మైనాస్ అన్న ఒక రాజు దానిని ఈశ పీఠ రాజులనుండి కొని ఉండవచ్చు, ఇదికూడ అయోధ్యానగరము వలె కట్టుకథ అని పురాణమువంటి కల్పన అని అనుకొనే వాళ్ళు. పురాణములన్నీ కల్పనలు కాదుకదా. అవి కల్పనలని ఇంగ్లీషువాళ్లు చెబితే ఆ చదువు చదివి ఆ ఆసనూనెలో మాగిన మామిడికాయల ముక్కలవంటి బుద్ధులు గలిగిన మనవాండ్లు నిజమే అంటేనిజమే ననుకొంటున్నారు 'పురాణం పంచలక్షణం' అని. సృష్టి ప్రతిసృష్టి అర్థవాదాలు పూర్వరాజ చరిత్రలు ఇవి అయిదింటిలో నాలుగు లక్షణాలు మహా ప్రళయమైన తరువాత మహాప్రళయ జలధియందు శ్రీ మహావిష్ణువు వటపత్ర శాయియై నిద్రించిన తరువాత జరిగిన సృష్టి సృష్టి. తాత్కాలిక ప్రళయములువచ్చి మళ్ళీ సృష్టి జరిగింది. అది ప్రతిసృష్టి చెంబులో మనువు చేపని పట్టుకొన్నాడు అని కథ చెప్పారు. అట్లాంటిది ప్రతిసృష్టి. అంటే ఈ కథలన్నీ వలసపోయిన భారతీయుల వలన సుమేర్యాది దేశములలో వ్యాపించి ప్లక్ష ద్వీపంలో వ్యాపించి (అరేబియా. పాలస్తీనా, జోర్డాన్ మొదలైన దేశాలు ఉండే భూభాగము పేరు పూర్వము ప్లక్షద్వీపము) అక్కడి జనులలో ఈ ప్రతిసృష్టి వార్త మిగిలియుండవలె. దానిని హీబ్రూజాతి సృష్టి అనుకొన్నారు. అది ప్రతిసృష్టి. మన పురాణాలలోని చెంబులో చేపని పట్టుకొచ్చిన మనువు కథ వంటిది బైబులులో ఈ కథ ఉన్నది.అదే మహాపరమార్థమై

పోయింది యూరప్ దేశస్థులకు. ఆడలేక మద్దెల ఓడన్నట్లు ఆలోచించలేక అర్థము చేసికోలేక జన్మచేత సంస్కారముచేత సంప్రదాయ హీనత్వముచేత దురహంకారముచేత పాశ్చాత్యులదే నిజమనుకోటము కాక మన పురాణాలన్నీ తప్పులనీ అబద్ధాలనీ కల్పితాలనీ వ్రాసి పారవేశారు. మనవాళ్ళు విశ్వసిస్తున్నారు. పాశ్చాత్యులలో ఆధునిక యుగమునకు శిఖరాయమానమైన బుద్ధిగల మహా ప్రతిభావంతులు పుట్టారు. నిన్న చెప్పిన పార్ రిచ్చి స్క్రెమెర్ వంటి గొప్ప పరిశోధకులు వాళ్ల దేశాలల్లో వందలమంది పుట్టారు. వాళ్ళు చేసిన పరిశోధనలు స్వతంత్రంగా చేశారు. త్రయీనగరాన్ని గురించి చెప్పబడ్డ విషయాలు క్రీతద్వీపాన్ని గురించి చెప్పబడ్డ విషయాలు పుక్కిటి కథలా యథార్థాలా అని ఆ స్క్లిమర్ పోయి పరిశోధనలు చేశాడు. మన పురాణాలలో కథలు వాళ్ల దేశాలలోని సామాన్య చరిత్రకారులు రాచకీయ దురహంకారముచేత ప్రోత్సహింపబడ్డ చరిత్రకారులు మన పురాణాలన్నీ పుక్కిటి పురాణాలనీ రాస్తే మన డూడూ బసవన్నలు నిజమేనని నృత్యము చెయ్యటమే కాని తమ అంతట తాము స్వతంత్ర పరిశోధన చేసినవాళ్లు కారు. వాళ్లు వాళ్ళ చదువు చదవటము, వాళ్లు చెప్పినవన్నీ రైటనటము. వాళ్ళ మార్గంలో పెద్దపెద్ద పరీక్షలు ప్యాసు కావటము. విశ్వవిద్యాలయాలలో ఆచార్య స్థానాలు అందటము, అదే జీవిత పరమార్థమన్నట్లు ప్రవర్తించటము. మన నాగరకత వాండ్ల నాగరకతకు లొచ్చు అనుకోటము, స్వతంత్రంగా ఊహించలేక పోవటము, స్వదే

శాభిమానము స్వమతాభిమానము స్వజాత్యభిమానము స్వాభి మానము లేకపోవటము. వాళ్లుచేసిన పరిశోధనలు వాళ్ల మత సిద్ధాంతాలను కాదన్నవి. సృష్టి యేసుక్రీస్తుకు పూర్వము రెండువేల యేండ్లక్రింద జరిగినది అని బైబులులో ఉంటే వాళ్లుచేసిన పరిశోధనల వలన క్రీస్తు పూర్వము ఎనిమిదివేల యేండ్లకు పూర్వము కూడా ప్రపంచకములో పెద్దపెద్ద రాజ్యాలు ఉన్నవి. నాగరికతలున్నవి అని వాళ్లు పరిశోధనలు చేసి స్థాపించారు. వాళ్ళ మతగ్రంథమైన బైబిలులో ఉన్న కాల నిర్ణయము వాళ్లుచేసిన భూగర్భ ఖననాది క్రియులచేత తప్పని వాళ్ళే ఋజువు చేసికొన్నారు. మన భారతయుద్ధము అయిదు వేల వందల యేండ్లక్రింద జరిగిందంటే మన పండితులు నమ్మరే వాళ్ళు చదివిన చదువులో అట్లాలేదు. పైగా పాశ్చాత్యుల పరి శోధనలన్నీ భూమిని త్రవ్వి మట్టిముక్కలు ఇనప ముక్కలు గోడలు కాలువలు రాళ్ళు వీటినిబట్టి నిర్ణయించినవి గ్రహ ములు కాలముయొక్క నడక ఉత్తరాయణము దక్షిణా యనము ఈ సంక్రమణము జరగటములో కాలము జరుగగా జరుగగా ఎడము కలుగుట, దానినిపట్టి గడచిన కాలము నిర్ణ యించటానికి వీలుండుట, ఇవన్నీ మన పూర్వగ్రంథాలలో వ్రాసి ఉండటము. ఇవి ఏవీ మనవాండ్లకు ప్రమాణాలు కావ టము లేదు—వీళ్ళ పరిశోధనంతా వాళ్ళకిపల్లేనే మట్టి త్రవ్వ టమే ప్రధానమైనదిగా ఉన్నది. మన పురాణాలల్లో పూర్వ రాజ చరిత్రములున్నవి. అర్థవాదము లున్నవి. ఏవి అర్థవాద

ములో ఏవి పూర్వరాజ చరిత్రములో విచారిద్దామని లేదు. ఆ పురాణములలో పాఠభేదాలు ఉంటవి. ఈ పరిశోధనలుచేసే భారతీయ చరిత్రకారులలో సంస్కృత భాషాజ్ఞానము గట్టిగా కలవాడొక్కడు లేడు. వీళ్ళ ఇష్టము వచ్చినట్లు వ్యాఖ్యానము చేయటము. శబ్దాలు మార్చివేయటము. ఎంతసేపటికి ఆ పాశ్చాత్యకారులు వ్రాసిపెట్టిన కాలానికి సరిపెడదామనే ప్రయత్నమే తప్ప మన పురాణాలలో పూర్వఋషులు చెప్పిన కాలము సరిపోతుందా అన్న విచారణలేదు. అందుచేత భారతము క్రీస్తుపూర్వము రెండువేల యేండ్లక్రింద వ్రాయబడ్డది. ఇంకొక రెండువందల యేండ్లక్రింద రామాయణము వ్రాయబడ్డది. బస్ సరిపోయింది, ఇంక బస్సెక్కు కాలేజీకి వేళవుతున్నది.

అదంతా అల్లా ఉండగా ఈ క్రీతద్వీపము ఉన్నది. మైనాస్ అన్నరాజు ఆ ద్వీపాన్ని కొన్నాడు క్రీత శబ్దమునకు కొనబడినది అన్న అర్థము గనక ఇల్లా చెబుతున్నాము. అంతే. లేదా శౌర్యముచేత సాధించాడు. శౌర్యక్రీతము.పరాక్రమము చేత సాధింపబడ్డది అని అర్థము చెప్పవచ్చు.తపఃక్రీతము తపస్సు చేత సాధింపబడ్డది—అనవచ్చు. క్రీతమన్న శబ్దానికి అది లక్షణార్థమవుతుంది. ఎట్లాగైతేనేమి అది క్రీతద్వీపము, తపఃక్రీతము అనటానికి ఒక వీలున్నది: ఇదివరకు చెప్పానుకదా ! వాళ్ళ దేవతలను గురించి. కొంత సూర్యోపాసకులు మనదేశములోనే వినాయకుడు పరమేశ్వరుడనే వాండ్లు గాణాపత్యకులు. గణ

పతి అనగా వినాయకుడు. శివుని వాహనము నంది. ఆయన వృషభము. మన దేశములోనే వీరశైవులు ఈ నందీశ్వరుణ్ణి ఆరాధిస్తారు. కాకతీయ సామ్రాజ్యమువారు తత్పూర్వ మందున్నూ పశ్చిమ చాళుక్య రాజ్యమంత్రియైన బసవేశ్వరుడు కాకతీయ సామ్రాజ్యములో పాల్కురికి సోమనాథుడు ఈ వీరశైవాన్ని ప్రచారము చేసినవాళ్లు, బసవేశ్వరుడు నందీశ్వరుని యొక్క యవతారమని వాళ్ళు విశ్వసిస్తారు ఒక మహా విషయము ఉన్నది. విష్ణుమూర్తి భగవంతుడు. ఆయన భార్య లక్ష్మీదేవి భగవతి. ఆయన ఎక్కే వాహనము గరుత్మంతుడు. గరుత్మంతుడూ భగవంతుడే, ఆయన పాన్పు ఆదిశేషుడు. ఆయన భగవంతుడే. అచ్చంగా భగవంతుడంత కాకపోయినా ఏ కొంచెమో తక్కువగానైనా కాకపోతారా! మన ప్రాణానికి వాళ్ళు చాలక పోతారా? యేసుక్రీస్తు భగవంతుని కొడుకు. భగవంతుడంతవాడు కాలా? యేసుక్రీస్తుని మేరీ అన్న ఆవిడ కన్నది ఆవిడ త్రితయంలో ఒక వ్యక్తి కాలా? క్రైస్తవులు ఈ త్రితయాన్ని ట్రినిటీ అంటారు. క్రీస్తు, మేరీ, హోలీ హోలీ ఘోస్టు. హోలీఘోస్టంటే పవిత్రాత్మ. ఇలాగే అందరున్నూ. శివుడు పరమేశ్వరుడు. ఆయన భార్య పార్వతి ఆయనకంటె గొప్పది. ఆయన కొడుకు గణపతి మళ్ళీ అంత వాడు. ఆయన వాహనము వృషభము నందీశ్వరుడు, అట్లాగే వీళ్ళల్లో ఎవళ్ళనో ఒకళ్ళని పుచ్చుకోవటం వాళ్ళని ఆరాధించటం వాళ్ళే మోక్షమిస్తారనుకోటము ఇల్లా జరుగుతుంది

నిజంగా విచారిస్తే ఇందులో తప్పేమీలేదు. ఎందుచేతనంటే పరమేశ్వర చైతన్యము సర్వత్రా అభివ్యాప్తమై ఉన్నది; గనక ఎక్కడ అధిక విభూతి మత్తుగా ఉంటుందో అక్కడ భగవంతుడున్నాడనటను న్యాయమే. అన్యాయమేమిటంటే సృష్టిలో రెండున్నవి. న్యాయ శాస్త్ర అన్యాయము, సత్తు అసత్తు సాధుత్వము క్రూరత్వము సజ్జనులు దుర్జనులు శాంతము ద్వేషము వీటినిపట్టే దేవతలు రాక్షసులు, పూర్వ గుణాలు కలవాళ్ళు దేవతలు పరగుణాలు కలవాళ్లు రాక్షసులు, రాక్షసులు శైవులు బ్రాహ్మణులు. ద్రావిడులు కారు. వాళ్ళ క్రూరత్వము మూలంగా వాళ్ళు సత్తు శాంతి సాధుత్వము మొదలైనవాటికి దూరమైనారు. ఇలా ఉండగా మరింకొకటుంది. మంచిచెడ్డలు లేకండా ప్రయత్నాధిక్యముచేత బలాధిక్యముచేత కొన్నిశక్తులు కలుగుతవి. యోగము అభ్యాసముచేస్తే దుర్భావముతోచేస్తే దుష్టశక్తులు కలుగుతవి. ఒకసిద్ధి కలుగుతుంది. సామాన్య జనానికి ఆశ్చర్యము కలుగుతుంది. ఇది ఒక లక్షణం ఉంది. ఇది రేపు చెబుతాను.

## 2

ఉపన్యాసమై ఇంటికి రావటముతోనే పతంజలిశాస్త్రి ఇంటి వద్దనుండి వార్త వచ్చింది. ఆయన భార్యకు మళ్ళీ తిరగ బెట్టిందని వెంటనే రమ్మని. ఏం చేస్తాడు ? రంగయ్య షాపుకా రింటికి వెళ్లాడు. అక్కడ విఠల్‌రావు క్రిందట్టు మీదట్టుగా ఉన్నాడు. చెప్పాలా చెప్పక్కరలేదా ? అందరూ నాగడి మీద దావా వేయమని డాక్టరు దగ్గర సర్టిఫికెట్టు తీసుకోమని చెబుతున్నారు. నాగడి మీద అభియోగము నిలవదు. నాగడు అతని కొడుకులు మేనల్లుడు నలుగురి మీద దావా వెయ్యాలి. రంగన్న షావుకారుకేమీ ఇష్టములేదు. డాక్టరు వచ్చాడు పరీక్ష చేశాడు. తెల్లవారటము కష్టమన్నాడు. దావా కాగితాలు ఒక వేపున సిద్ధమైనవి. పతంజలి శాస్త్రి పోయి విఠల్‌రావును చూచాడు. రంగన్న షావుకారు "అయ్యా మీరు మహా పండి తులు మహాసత్పురుషులు జపితలు. నా కొడుకును బ్రతికించి పెట్టండి. అతడు దుర్మార్గుడే కాని కడుపున పుట్టిన బిడ్డ. మీరు

వీణ్ణి బ్రతికిస్తే మీకేమి యివ్వమంటే అది ఇస్తాను, నాలుగు వేలిస్తాను. ముందర రెండు వేలిప్పుడే ఇస్తాను," అని వద్దంటున్న కొద్దీ రెండు వేలు తెచ్చి పతంజలి శాస్త్రి ముందర పోశాడు. పతంజలి శాస్త్రి ఏమి చేస్తాడు? ఆయనతో చెప్పి ఇంటికి పోదామని వచ్చాడు. తానేదో గొప్పవాడని రంగన్న పావుకా రనుకొంటున్నాడు. తనకట్లాంటి శక్తి ఏమీ లేదు. ఇదివరకు తన అనుభవములో లేదు. పతంజలి శాస్త్రి కట్టి కోరిక లేదు. ఆయన ఇంగ్లీషు చదువు కొన్నమాట నిజమే. మొదట కొన్నాళ్ళేదో ఉద్యోగము చేశాడు, అతని కేదో మోస్తరు మాగాని పదెకరాలుంది. పుట్లు కట్టుబడి వస్తుంది. అయిదారేండ్లు ఉద్యోగము చేశాడు. ఆజీతము గొఱ్ఱెతోకవలె పెరగలేదు. అతడొక్కడే సోదరుడు. చెల్లెండ్లు అక్కలు గూడ లేరు. ఉద్యోగము ఆ రేళ్లయిన తర్వాత తండ్రి చనిపోయి నాడు. తల్లి అదివరకే చనిపోయింది. తండ్రి వాళ్ళ ఊళ్ళో ఉండి పొలము చూస్తూ ఉండేవాడు. భార్య వ్యాధిగ్రస్థురాలయింది. ఎప్పుడూ ఏదో తీసికొంటునే వుంటుంది. ఎప్పుడూ మందులే. ఎప్పుడూ డాక్టర్లే ఎంతమంది డాక్టర్లు చెప్పినా పట్టణ వాసము పనికిరాదు. పల్లెటూళ్లో పోయి ఉంటే మంచిది. పరిశుద్ధమైనగాలి, ఎరువులు వేసి పెంచని కూరలు, దంపుడు బియ్యము ఇలా ఉంటే ఆరోగ్యముగా ఉంటుందన్నారు. అయినా ఒక ఏడాది ఉద్యోగ మల్లాగే సాగించాడు. పొలం కట్టుబడిస్తే వాళ్ళు సరిగ్గా ఇవ్వలేదు. ఇంతలో రాజరికపు

చట్టాలు వచ్చినవి స్వంతంగా చేసికోకపోతె జిరాయితీ హక్కు అయ్యేటట్లుంది. స్వంతంగా చేసికోటమంటే అక్కడ ఉండి చేయించుకోటము అని అర్థమంటుంది ఆఉద్యోగము వదలిపెట్టి ఇంటికి వచ్చాడు. పొలం చూచుకొంటున్నాడు, భార్యకు నెమ్మదించినట్లనిపించింది. సంస్కృతాలు తెలుగులు వేరేమీ పనిలేదు గనుక పుస్తకాలు తేవటము చదవటము. చివరికి రెండు వేల రూపాయల గ్రంథాలు తెలుగైతేనేమి సంస్కృతమైతే నేమి ఇంగ్లీషైతేనేమి నాలుగైదేండ్లల్లో కొన్నాడు. అన్నీ చదివాడు. వాళ్ళ ఊళ్లో ఒక చిన్న సంస్కృత పాఠశాల ఉంది, పట్టణాలకు వెళ్ళి బి. ఏ. లు ఎం. ఏ. లు చదివే వాళ్ళున్నారు. విద్యా వ్యాసంగం బాగా ఎక్కువయింది. చురుకైన బుద్ధి కలవాడని మంచి విమర్శ చేస్తాడని బహు గ్రంథములయందు పరిశ్రమ చేశాడని నలుగురూ చెప్పుకోటము మొదలెట్టారు. క్రమంగా ఇంటికి ముందర డాబా వేశాడు, అంతా ఆధునిక గృహంగా తయారుచేశాడు. కొన్నపుస్తక భాండాగారమునకేమి ఇంటి మార్పులకేమి అయిదారువేల అప్పయింది. భార్య ఆరోగ్యము మాత్రము బాగుపడ్డట్లు ఉన్నదే తప్ప ఏమీ బాగుపడలేదు. ఉండి ఉండి కాళ్లుచేతులు లాక్కుపోతున్నా యంటుంది. ఒళ్ళు దొంద పారింది. ఎప్పుడూ తన కేదో ఇబ్బందనుకోటము తన కలవాటైంది. వైద్యులు చూస్తారు. ఏమీ లేదంటారు. మరింకొక పెద్ద బాధ అయింది. ఆవిడకి తనభర్త తనను వదలిపెట్టి ఎక్కడికి వెళ్ళకూడదు.

ఎప్పుడూ ఎక్కడికీ వెళ్ళక ఎలా చస్తాడు ? ఒక గంటసేపు సంస్కృత కళాశాలకు వెళ్ళి వాళ్ళతో మాట్లాడి వచ్చినాసరే ఆ ఊళ్ళో ఎం. ఏ. లు, బి. ఏ. లు చదివే పిల్లలు ఏ సెలవులకో ఇంటికివస్తే కాసేపు వాళ్ళతో మాట్లాడదామని వెళ్ళినాసరే పాలివాడితో మాట్లాడటానికి వెళ్ళినాసరే రావటముతోనే ఆవిడ సాధింపు "నా మీద మీకు ప్రేమ ఉన్నదా ? నేనేమై పోతే మీకేమి ! నా దారిన నేనుపోతే మళ్ళీ పెళ్లిచేసికోవచ్చు" ఈ వరసలో చదువుతుంది. ఆవిడదగ్గర కూర్చున్నంతసేపు కాళ్లు పిసకాలి, చేతులు పిసకాలి, తల నొక్కాలి ఒక్క గుణమేమి టంటే ప్రొద్దుటపూట మాత్రం ఎట్లాగో అట్లాలేచి అపసోపాలు పడుతూ కూడు ఉడకేసి పెడుతుంది. వాళ్ళకి సంతానము లేదు. ఆవిడ కాపరానికి వచ్చిన కొత్తలో ఒక మగపిల్లవాడు కలిగి మూడునెలలు బ్రతికి చచ్చిపోయినాడు వాడు పోయి నాడని మూడు నాలుగేండ్లు ఏడిచింది. అదే వ్యాధిగా పరిణ మించిందేమో తెలియదు, వాడుపోయి పన్నెండేండ్లయినా అయింది. ఇప్పటికి వాణ్ణి తలుచుకొని శోకాలు పెడుతుంది. మళ్ళీ గర్భము రాలేదు. ఇదంతా పతంజలిశాస్త్రి దోషము. భర్తకు చాలా ఉపకరిస్తుంది. అతనిచేత నానా చాకిరి చేయి స్తుంది. అతడు నోరు మూసికొని చేస్తాడు, ఆ భార్య అంటే అతనికి అదే మోహము. అతడు ఇతరులతో మాట్లాడేటప్పుడు చాలా శృంగార రసంగా మాట్లాడుతాడు. అతని మాటలు వింటే అతని జీవుడు అతని భార్య ఇలాంటిదై నిత్య వ్యాధి

గ్రస్తురాలవటమేకాక బాధా హేతువుకూడ అయిందని పరిత పిస్తున్నాడని బాధపడుతున్నాడని తెలుస్తుంది. అతనిలో ఒక విశేషమున్నది. ఎవరి దగ్గరో ఏదో ఉపదేశమైనాడు. ఆ మంత్రము ప్రతిరోజు రాత్రిళ్ళు రెండుగంటల సేపు జపము చేస్తాడు. ఆ సమయములో పెళ్ళామా ఏడిచినాసరే మొత్తు కున్నాసరే పలుకడు. ఆ సంగతి ఆమెకు తెలుసు. మొత్తము మీద ఆ ఇంట్లో వాళ్ళిద్దరే ! రాత్రి యందామె వంటచేయదు. పాపమతడు కొన్నాళ్ళు ఆమె ప్రొద్దుటిపూట వండిన అన్నమే రాత్రిళ్లు పెట్టుకొని తినేవాడు. ఈ జప మెక్కువైనకొద్దీ దాన్ని మానేశాడు. పెసలో శెనగలో గోధుమలో ఒక గుప్పెడు ప్రొద్దుటిపూట నానవెయ్యటం రాత్రిపూట వాటిని తినటం పడుకోటము. ఈ ఆహార విషయములో ఈ భార్య యొక్క వ్యాధి మూలంగా చాలా మార్పులు చేస్తూవచ్చాడు. ఆసనాలు వెయ్యటము అట్లాంటివి కూడ ఉన్నవి. మొత్తము మీద అతనిది ఒక దుఃఖమయ జీవితము. ఇది ఇట్లా ఉండగా ఆరువేలు అప్పయింది. మహా అమ్మితే తన ఎకరము ఒక్కొ కటి రెండువేలు అమ్ముతుంది. అప్పు తీర్చాలి అంటే మూడు యెకరాలు అమ్మాలి. ప్రతి సంవత్సరము కొంత సొరు కట్టు కొని వడ్డీ తీర్చేటప్పటికే అతని తల ప్రాణము తోక కొస్తు న్నది. ఒకటి రెండుసార్లు తెగనమ్మి తీరుద్దామనుకొన్నాడు. అమ్మ చూపితే ఊళ్ళో వాళ్లు ఎక్కలేదు. ఇలా ఉండగా ఆ ఊరు ఒక బి.ఏ. విద్యార్థి వచ్చాడు. ఆ ఊళ్ళో ఒకతనికి స్నేహి

తుడు. పతంజలిశాస్త్రి వాళ్ళతో మాట్లాడుతుంటే విని వాళ్ళ ఊరు రమ్మన్నాడు. ఏదైనా ఇప్పిస్తానన్నాడు. అతడు ధనవంతులబిడ్డ. ఇక్కడ పెళ్ళాన్ని పంచేసి పోవాలి? తనకు వేలువిడిచిన మేనమామ కూతురొకతె ఉన్నది. దాన్ని భర్త వదలిపెట్టాడు. అది అప్పుడప్పుడిక్కడికి వస్తూఉంటుంది. ఆ అమ్మాయికి కబురు పెట్టి భార్యకి నచ్చచెప్పి ఆమెనుతోడించి వాళ్ళ ఊరు వెళ్ళాడు పతంజలిశాస్త్రి. అక్కడ ఇతనిచేత నాలుగైదు ఉపన్యాసాలిప్పించి ఆ బి.ఏ. విద్యార్థి నాలుగువంద లిప్పించాడు. ఆ సంవత్సరము వడ్డీ చెల్లుబడి అయింది. అసలు అప్పు మాట అట్లుంచి ఏ సంవత్సరాని కాసంవత్సరము ఇట్లా వడ్డీ అయినా తీర్చుకుంటూ ఉంటే భగవంతు డనుగ్రహించినపుడు అసలప్పు క్రిమక్రిమంగా తీర్చుకోవచ్చునని అతనికి ఆశ. రెండేళ్ళు ఇట్లా సర్దుకొన్నాడు. రెండు మూడుచోట్ల ఉపన్యాసాలిస్తే కాని వడ్డీ సర్దుబాటయ్యేటట్లులేదు. ఏ ఊరు వెళ్ళితే బాగుంటుంది అనీ అనుకోటము విచారించటము. ఆ ఊళ్ళో ఉదారులున్నారు అని వాకబు తెలిసికొని ఆ ఊరు వెళ్ళటము చేస్తున్నాడు. అల్లా వచ్చాడు. ఈ ఊరు, ఆ భార్య యొక్క వ్యాధి వ్యాధి కాదు తనకు తెలుసు. పాపము అతను తన ప్రాణాన్ని తాను పట్టుకోలేదు. పట్టు పట్టుమని పదిరోజు లేవూళ్ళోను ఉండలేదు రెండు నెల్లు ఇక్కడ ఉంటే రెండు మూడువేలు సంపాదించుకపోవచ్చు. సగమప్పన్నా తీరుతుందని అనుకొన్నాడు. ఇదీ అతని స్థితి.

రెండువే ఎదురు గుండా కనిపిస్తున్నవి. లోపలనించి జీవుడి కాళపుట్టింది. మనస్సులో వంద ఊహాలు కలిగినవి. అన్ని ఊహాలు అరనిమిషములో పరిభ్రమించినవి "ఈ డబ్బు మీరు తీసుకోండి. నేనింటికిపోయి జపము చేస్తాను. దానివలన ఫలితం ఉంటుందో ఉండదో నాకు తెలియదు. ఉంటే అప్పుడు ఈ డబ్బు నాకివ్వండి" అందామని ఒకటి. ఇప్పటి వేడి రేపు ప్రొద్దున ఉండదు. రేపు ప్రొద్దుటికి అతనికి కొంచెము నెమ్మదిస్తే తరువాత డబ్బు రేపిస్తానులే అనవచ్చు. లేకపోతే వెయ్యి రూపాయలే ఇవ్వవచ్చు. తన జపము ఫలవంత మౌతుందని నమ్మకమేమి ? కాకపోతే అతని డబ్బు అతనికి రేపు ప్రొద్దున ఇవ్వవచ్చు. ఈ డబ్బుఇట్లా ఉంచి ఆ విఠల్ రావు తెల్లవారక ముందే పాండురంగవిఠల్ దగ్గరకు పోతే ఈ డబ్బులేదు సరి కదా ఇంక ఉపన్యాసాలులేవు. ఇంకొక పదిరోజులో పదిహేను రోజులో గడచిన తర్వాత ఆ వచ్చే డబ్బులే. ఒకవేళ ఇప్పుడీ డబ్బు తాను తీసికెళ్ళితే రంగన్న షావుకారు ఉదారుడు అతనికి నెమ్మదించకపోతే మళ్లీ తాను ఆ డబ్బు తీసుకెళ్లి ఇవ్వపోతే అంత కొడుకే పోయినాడు ఈ డబ్బు ఏం చేస్తుంది వెండి అని వదలి పెట్టినా వదలి పెట్టవచ్చు. ఔదార్యముగా ఉంటే దుఃఖముదానికి ప్రోద్బలమిస్తుంది. పైగా అప్పిచ్చిన వాడికి రెండువేలైనా బాకీ చెల్లగడితేగాని అక్కడ మర్యాదనిలిచే టట్టులేదు. ఏ సంవత్సరము వడ్డీ ఆ సంవత్సరము తీర్చివేస్తుంటే అతనికి కోపముగా ఉంది. ఇతని పదెకరాలు మింగుదామని

ఇచ్చాడుగాని ఇతని అప్పు తీర్పించుకుందామని ఇవ్వలేదు 'ఎప్పుడూ వడ్డీ ఇస్తావు; అసలులో పైసాగూడ జమలేదు' అని అతని ఒత్తిడి ఎక్కువైంది. రెండు నెలలు ఈఉపన్యాసాలిస్తానని పతంజలిశాస్త్రి తనంతట తానే చెప్పుకొన్నాడు. వాళ్ళు దయతో అంగీకరించారు. చివరకొక పదివేలనువందలన్నా ముట్టచెప్పగా, అని ఆశ పెట్టుకొన్నాడు సంస్కృతము ప్రధానముగా చదువుకొన్న ఏ పండితుడన్నా అయితే రామాయణమో భారతమో భాగవతమో రెండునెలలు పురాణము చెప్పి రోజూ పిండివంటలతో విందులారగిస్తూ మధ్యమధ్య నాలుగు ఉపనిషత్తులలోని మాటలు శాస్త్రిలలో విన్న పది పంక్తులు మధ్యమధ్య జోడిస్తూ సంగీతాలు పాడుతూ చివరకు ఇన్ని గుడ్డలు ఉంగరాలు సింహ తలాటపు మురుగులు ఒక రెండువేల రూపాయలు వేసుకపోతాడు. తీరా చూస్తే ఆ పండితుడికి పతంజలిశాస్త్రి కున్నంత పాండిత్య ముండదు. ఇతని విచారణాశీలత్వము ఉండదు. కాని మూఢులు వాడే పండితు డనుకొంటారు. ఇతనికి బజారు పాండిత్యము లేదు. వచ్చిన ఇబ్బంది అక్కడ ఉన్నది. ఏదో డబ్బు కనిపిస్తున్నది. భగవంతుడి అనుగ్రహముంటే ఈ డబ్బు తనకు దక్కవచ్చును. అసలు ఆయుర్దాయ మనేది వాడికి ఉంటే బతుకుతాడు. ఔషధము మంత్రము కర్మయొక్క ఉగ్రత్వాన్ని శాంతింపజేస్తవి. ఆయుర్దాయాన్ని ఇవ్వవు. మణి మంత్ర జలౌషధైః. ఆధునికులు నాస్తికులై గ్రహించలేరుగాని ఔషధ మెట్లాంటిదో

మంత్రము అట్లాంటిదే. కొన్ని వ్యాధులు ఔషధానికి లొంగు తవి. కొన్ని మంత్రానికే లొంగుతవి. ఒక్కొక్క దానికి అచ్చంగా మంత్రమే పనిచేస్తుంది. మంత్రము కూడ అక్కర లేదు. దృష్టి తగిలితే జ్వరము వస్తుంది. మీ థర్మామీటరు మీ సారిడాను ఏమి చేయలేవు ? గుప్పెడు మిరపకాయలు తీసి పొయ్యిలోవేస్తే వెంటనే తగ్గుతుంది ఇది ప్రత్యక్షమయిన విష యము. మా ఇంటికి ప్రక్క ఒక కుఱ్ఱవాడికి తలలోపోటు చెవులోపోటు మొదలు పెట్టినవి. డాక్టర్లు చూశారు. పెద్ద పెద్ద డాక్టర్లు వచ్చారు. ఇన్‌జక్షన్లు టానిక్‌లు వ్రాశారు. పిల్లవాడికి ఏమి జబ్బులేదని చెప్పారు పైగా. పిల్లవాడికి అన్నము సయిం చదు చిక్కిపోతున్నాడు, ప్రతిరోజు బాధ పడుతున్నాడు. చివ రకు వాళ్ళ తల్లి రెండురోజులు వరసగా ఎఱ్ఱనీళ్లు తీసిపోసింది. మర్నాడు లేచాడు, ఆడుకున్నాడు. ఇది ప్రత్యక్షమైన విష యము. నాస్తికులకు నమ్మకము లేకపోతే దానిని నిత్యవ్యాధిగా చేసికొని డాక్టర్ల చుట్టూ తిరుగుతూ ఇబ్బంది పడమనండి. ఆస్తి కులని బాధించుట మెందుకు? తాచెడ్డకోతి వనమెల్ల చెరిచిందని తనకు పెండ్లి ఇష్టము లేకపోతే తాను మానివేయవలెను తప్ప తనచేతిలో సైన్యము ఉన్నదని తాను రాజ్యాన్ని చేతిలో పెట్టుక కూర్చున్నానుగదా అని లోకమందరికి పెళ్ళిళ్లు మాని పించట మెందుకు ? ఆ దౌర్భాగ్యుడి చేతిలోనికి అనవసరంగా రాజ్య మొచ్చినట్టు ఇంకొక దౌర్భాగ్యుణ్ణి అనవసరంగా వంద మంది స్త్రీలు ప్రేమిస్తారు. ఒక దౌర్భాగ్యుడు పెద్దకవి అవు

తాడు. ఇంకొక దౌర్భాగ్యుడు మహాబలశాలి అవుతాడు. ఇంక తక్కిన వాళ్ళ అందరి నెత్తినా మన్నేనా ? పెండ్లి అక్కర లేదంటే పాపము ఒకానొకడికి బ్రతికి ఉండగా స్త్రీ సుఖము ఉండనే ఉండదు. తన జపముచేత ఈ విఠల్‌రావుకి రేపు ప్రొద్దు టికి తగ్గుతుందేమో! వైద్యులు తెల్లవారటము కష్టమన్నారు గదా! తెల్లవారితే వైద్యుల శక్తి కాదుగదా! తాను జపము చేస్తే విఠల్‌రావుకి తెల్లవారితే తన జపము శక్తి కావచ్చు గదా! అసలు నిజమాలోచిస్తే వాడికి తెల్లవారటము వ్రాసి ఉంటే ఎల్లాగు తెల్లవారుతుంది. వైద్యులు కాళ్లు జాపారు గనక అది తన జపముయొక్క శక్తి అవుతుంది ? అలా ఊహించబడుతుంది. ఔషధాలు కాని మంత్రాలు కాని కొంత సాహాయ్య పడవచ్చును"—పతంజలిశాస్త్రి డబ్బు పుచ్చుకొని చిదంబరం ఇంటికి వెళ్ళాడు.

# 3

పతంజలిశాస్త్రి మళ్ళీ ఇంటికి తిరిగి వచ్చేటప్పటికి చిదంబరము కమల నిర్వేర పోయినారు. ఆయన ఇదివరకు జపము చేసికొనే వెళ్ళారు. మళ్ళీ స్నానము చేశాడు. మళ్ళీ జపానికి కూర్చు న్నాడు. అప్పటికి పొద్దుపోయింది. ఇప్పుడు వెళ్ళినా రైలందదు. చిదంబరము కథ ఏమిటో కనుక్కొందామనీ విఠల్ రావుని చూచి వచ్చినట్లుంటుందనీ రంగన్న షావుకారు సంతోషిస్తాడనీ అక్కడికి బయలుదేరాడు. అక్కడ చూడటానికి వచ్చిన వాళ్లు చాలామంది వెళ్ళిపోయినా ఇంకా కొంతమంది ఉన్నారు. వెళ్ళాడు, విఠల్ రావుని చూచాడు. ఇంక ఏ ఆశాలేదు; పతంజలి శాస్త్రిగారి ఆశ ఒక్కటే ఉన్నది. ఆయన ఇతన్ని బతికిస్తా నని జపము చేసేందుకు వెళ్ళాడు. ఆయన జపమువల్ల బతికితే బతకాలి లేకపోతే లేదు అనుకొంటున్నారు. చిదంబరానికి తెలిసింది ఇంతేకాదు. రంగన్న రెండు వేలిచ్చాడని అది పుచ్చుకొని పతంజలి వెళ్ళాడని కూడ తెలిసింది. పతంజలిశాస్త్రి రోజు

రాత్రిళ్ళు కూర్చొని గంటన్నర రెండుగంటలు జపము చేస్తాడని చిదంబరానికి తెలుసు. కాని ఆ జపము ఇంత గొప్ప జపమని తెలియదు. ఇత నాశ్చర్య పోయినాడు. అప్పటికే ఒకగంట సేపయింది. మళ్ళీ డాక్టరొచ్చాడు చూచాడు నిలబడి ఉండండి అన్నాడు. అతడు బయటికి వెళ్ళి ఎవరితోనో ఈపాటికే పోవాలి. మహా ఉంటే ఇంకోగంట ఉంటాడు. అన్నాడు. ఎంత రహస్యంగా ఒకడితో చెప్పినా ఆ మాట పదిమందికీ తెలిసింది. రంగన్నకూ తెలిసింది. గంట బతికినవాడు ఇంకోగంట ఎందుకు బతకడు అనే ఆశకూడ కలిగింది. రంగన్న షావుకారుకు చిదంబరమంటే ఒక అభిమాన మున్నది. తన కొడుకుని చూడటానికి వచ్చాడని సంతోషించాడు. "చిదంబరం గారూ! మీరింటికి వదండి. మా తిప్పలు మేము పడతాముగదా" అన్నాడు. చిదంబరం నెమ్మదిగా బయలుదేరాడు. ఎదురుగా సోఫియా వచ్చింది "ఏమిరా బావా! ఎల్లాగ ఉంది" అంది. చూసి వద్దాము రా అని మళ్లీ లోపలికి తీసికెళ్ళి ది. కొంతసేపున్నారు. ఆవిడ బయలుదేరింది. బావనికూడ రమ్మంది. ఇద్దరు కలసి వస్తున్నారు. ఇతనింటి త్రోవకు మళ్ళబోయినాడు, ఆవిడ తన ఇంటికి రమ్మంది. ఇతనికి రాననే ధైర్యములేదు. వెళదామని ఉంది. వెళితే కమల ఏమంటుందో అని ఉంది.ఏదో పొరపాటున అప్పుడు జరిగింది. దీనిని పూర్తిగా వదిలి పెడదామని నిశ్చయము చేసికొన్నాడు. ఆ నిశ్చయము ఇప్పుడు నిలిచేటట్టు కన పడటములేదు. పైగా సోఫియా అతని మోచేతికట్టులో తన

మోచేతికట్టువేసి లాక్కుపోతున్నది. తన కిష్టములేనట్లు ప్రవ
ర్తిస్తే ఇష్టము లేదని చెబితే ఆవిడ ఏమనుకుంటుందో ? ఏమను
కొంటుందో అన్న ప్రశ్న ఏమిటి ? లోపల త్రెంచుకోలేని ఆశ
ఇలా ఊహింప జేస్తున్నది. వధ్య స్థానానికి తీసుకుపోబడిన మేక
వలె నడుస్తున్నాడు. కాని ఆ మేకకు చిదంబరానికి ఒక భేద
మున్నది. ఆ మేక చావటము తప్ప ఇంకేమీ చేయలేదు. ఈ
చిదంబరము చచ్చినా స్వర్గానికి వెళ్ళినట్లుంటుంది. ఆ మేకకు
చావటానికి వెళ్లుతున్నామని తెలియదు. ఈ మేకకు తెలుసు.
చచ్చినా స్వర్గసుఖము వస్తుందన్న కోరికతో వెళ్ళుతున్నది.
ఆ మేకకు ఈ మేకకు ఇంకొక భేదమున్నది. వధ్య స్థానానికి
తీసుకుపోబడే మేక అని చూచేవా డనుకొంటాడు తప్ప ఆ
మేక అనుకోదు. ఈ మేకను చూచేవాళ్లనుకోరు ఈ మేకే అను
కొంటుంది. చూచేవాళ్ళు ఏమనుకొంటారు ? పరిస్థితులు
మారితే మాత్రమేమి ! వాళ్ళిద్దరూ మేనత్త మేనమామ బిడ్డలు.
ఇతడు రెండువందల జీతగాడు. ఆవిడకి రెండువేల జీతము. ఆవిడ
మొగుడికి మూడు వేల రూపాయలు జీతము. ఊరికే మేనత్తకొడు
కని మాట్లాడుతుంది తప్ప లేకపోతే అసలు వాడి మొఖము వంక
చూస్తుందా? ఇట్లా లోకమనుకొంటుంది. వాడెవడో అన్నాడు
స్త్రీలు ఎప్పుడూ తన భర్తకంటె తక్కువవాడితో వ్యభిచరిస్తా
రేమిటిఅని అంటె ఈ కాపుదల కోసము అంటారు-సరే ఇద్దరు
సోఫియా ఇంటిదాకా వెళ్లారు. అంతవరకూ సందిగ్ధావస్థలో
ఉన్న చిదంబరం తానింటికి పోతానని పట్టుబట్టాడు. సోఫియా

అన్నదిగదా "ఒరే బావా చిన్నప్పుడు నిన్ను చూచాను. అప్పుడే నిన్ను భర్తనుగా వరించాను. నీకు మాకు దూరమై పోయింది. నేనెవ్వళ్లతోను చెప్పలేదు ఎవరితోను చెప్పను, ఎట్లా చెప్పను? నాకు వయస్సు వచ్చిన తర్వాత మా బావని పెళ్ళిచేసికొనటం ఎట్లాగూ పడదు. గనక నేను పెళ్ళేచేసికోను అని నిశ్చయము చేసికొన్నాను. కాని ఆ జాకాబ్ నన్ను మోసము చేశాడు. నీమీద కోపముకొద్ది మన సంసార పరిస్థితులమీది కోపముకొద్ది సంఘముమీద నీమీద మా నాన్నమీద పగతీర్చుకొందామని ఈ పెళ్లి చేసికొన్నాను. చేసికొన్నాను అనుభవిస్తున్నాను. చూడటానికి బాగానే ఉంది. డబ్బు బాగా వస్తున్నది, గౌరవము కూడ బాగానే ఉంది. కాని నా యేడుపు అలాగే ఉంది. మొన్న నీవు నన్నను గ్రహించావు. భగవంతుడు నాకా సుఖాన్ని కలిగించాడు నీ సంసారము నేను పాడు చెయ్యను. ఇది రహస్యంగానే ఉంచుదాము. నీ భార్య నాతో చనువుగా ఉంటుందేమో అనుకొన్నాను. అది చాలా పూర్వాచార పరాయణురాలు. నా కాసంగతి తెలిసింది. మర్నాడు మీ ఇంటి లోపలికి రాలేదుగదా! నీవు చెప్పకపోయినా మీ ఇంట్లో దుప్పట్లు మంచాలు అన్నీ తడుపుకున్నారని నాకు తెలుసు. గడ్డి తిన్నావనుకో. ఒకసారి తింటే రైటున్నూ రెండు సార్లు తింటే తప్పూనా? నీవు నన్ను వాంఛించలేదు. నేనే నిన్ను వాంఛించాను. నీవు నేనంటే పడిచావటము లేదు. నేనే నీవంటే పడిచస్తున్నాను. ఇంత సిగ్గువిడిచి ఏ ఆడది చెప్పదురా!

నే నీవూరువచ్చి రెండు నెల్లు మకాము వేశానంటే పతంజలి శాస్త్రి ఉపన్యాసాలకోసము కాదు. నీ కోసము. ఈ సంగతి జాకబ్ కు కూడా తెలుసు. నేనతనితో చెప్పాను. నా మేనత్త కొడుకున్నాడు. అతని పేరు చిదంబరం. నే నతన్ని నా చిన్నప్పుడు పదేండ్లప్పుడు ప్రేమించాను. నా కతడే భర్త. నీ కిష్టమైతే నన్ను పెండ్లిచేసికో. అతనిని నేను పెండ్లి చేసికోటము పడదు. నా హృదయాధి నాథుడతడేనని. అతడొప్పుకొని పెండ్లి చేసికొన్నాడు. నీకు కావలిస్తే ఢిల్లీలో ఉద్యోగ మిప్పిస్తాను. ఇస్తూనే అయిదారు వందలిస్తారు. సోమనాథానికి నాలుగు వందలు ఉద్యోగము ఇప్పించాను. అతనికి వెయ్యి రెండువేల జీతమవుతుంది. నీవు బ్రాహ్మణ్యము చెడనక్కర లేదు. నా సంపర్కమువల్ల నీకు పాపంరాదు. పోయి స్నానము చేసి క్రొత్త జందెములు వేసికొని ఎప్పటికప్పుడు సహస్ర గాయిత్రీ చేసికొంటుండు నేననకూడదుగాని మా పినతండ్రి ఇట్లాగే చేస్తుండేవాడు. కుటుంబములో లేకపోతే ఈ చాలిక ఎందకు వస్తుంది ? లేకపోతే నేను క్రైస్తవుణ్ణి పెండ్లాడటము ఎందుకు జరుగుతుంది ? నేను నీకొక పరమ రహస్యము చెబుతాను. అది ఒక మహావిషయము. ఒకటికాదు రెండువిషయాలు. ఒకటి ఏమిటంటే—కోరివచ్చిన స్త్రీని పరిత్యజించకూడదు. అదితప్పు. చాలా దోషము. కోరి వచ్చిన పురుషుణ్ణి స్త్రీ కాదన కూడదు. ఈ సిద్ధాంతము చాలా విపరీతముగా ఉంటుంది. ఈ సిద్ధాంతానికి ధర్మశాస్త్రాలకు నీతిశాస్త్రానికి వేదధర్మానికి

ఏమీ సంబంధము లేదు. అవన్నీ జీవుడు మోక్షము పొందేందుకు ఏర్పడ్డ మార్గాలు మోక్షదృష్టికి లౌకికమైన వాంఛా దృష్టికి సంబంధము లేదు, మోక్షమంటే ఏమిటి ? ఇంద్రియములయందు రమించకండా ఉండటము, ఇంద్రియములను నియమించటము అనగా సుఖాలని వదలి పెట్టడము - ఆ దృష్టిలో చెప్పబడ్డది ఈ ధర్మము. ఆ ధర్మము మోక్షానికి దారితీస్తుంది. ఆ ధర్మము అవలంబిస్తుంటే ఎక్కడికక్కడికి శరీరసుఖాన్ని వదలి పెట్టుకో వలసి వస్తుందన్నమాట. ఇంద్రియ సుఖములయందు రమించ టాన్ని వదలి పెట్టటాన్ని అలవాటు చేసికోటమన్నమాట. ఇదీ రహస్యము పదిమంది స్త్రీలమీద నీకు వాంఛ కలిగింది ఆ అన్ని వాంఛలను కుదించుకొని ఆ వాంఛను భార్యయందు మాత్రమే తీర్చుకో, అంటే వాంఛను నియమించుకో, ఇది నీకు ఉత్తరోత్తరా మోక్షమునకు హేతువౌతుంది. అని అర్థము. ఈ మోక్షము అనే విషయమేకాక ఈ నియమించు కోటము వల్ల సంఘానికి మేలు జరుగుతున్నది. ఇంకొకని భార్యతో నీవు సంగమించటమువల్ల వాడికి దుఃఖము కలుగుతున్నది. దాని మోక్షానికి భంగము కలుగుతున్నది. నీవు దానికి కారణమౌ తున్నావు. దీని వలన నీకు పాపము వస్తున్నది. ఇది కాక దాని సంబంధమైన పురుషులు నిన్ను శిక్షించవచ్చును. చంప వచ్చును. ఈ శరీరయాత్రకే భంగము కలుగుతున్నది, ఇంద్రియ సుఖమొకటి, పాపము ఒకటి, మోక్షము ఒకటి. ఇవి మూడు పెనవేసికొని ఉన్నవి. ముప్పేటగా ఉన్నవి. ఇప్పుడు వేరే

విచారిస్తే ఇంకొక విషయమున్నది. ఒక స్త్రీ నిన్ను వాంఛిం
చింది. నీవు నిరాకరించావు. దాని మనస్సు కష్టపడ్డది. ధర్మ
దృష్ట్యా మోక్షదృష్ట్యా నీవు చేసినది న్యాయమే. వట్టి లౌకిక
మైన దృష్టిచేత దానిమనస్సునకు దుఃఖము కలిగించావు దాని
ఫలితము నిన్నువదలిపెట్టదు.నీకెప్పుడో లౌకికంగా ఆ దుఃఖము
కలగనే కలుగుతుంది. ఈ సృష్టిలో దేనికదే. భారతములో
ధర్మరాజు అబద్ధము చెప్పాడు. చెప్పకపోతే స్వకుల నాశనము
జరుగుతుంది. స్వకుల నాశన హేతుత్వ జనితపాపము ఉన్నది.
అసత్య జనిత పాపము ఉన్నది. రెంటిలో తక్కువ పాపము
అసత్య జనిత పాపముది. అందుచేత భగవంతుడు ధర్మరాజుతో
తక్కువ పాపము చెయ్యవోయి అన్నాడు. ఆ ధర్మము కోసము
ఈ అధర్మము చేస్తే దీని ఫలిత మేమీపోలేదు. వేన్ని దీనికిగా
అనుభవించవలసిందే. ఈ సృష్టి లెక్కలేనన్ని దారాలు వేసిన
ముడి ముడి విప్పటకు కష్టము కాని ఏ దారానికి దారమే
ఉంది. అట్లాగా నీ వొక స్త్రీని నిరాకరిస్తే దాన్ని అనుభ
విస్తావు భగవంతుడైన రామచంద్రుని కీపాట్లు తప్పలేదు.
శూర్పణఖ ముసలిదని రాక్షసి అని దాన్ని నిరాకరించాడు.
కాని దాని పెట్టు భార్యా దుఃఖ మనుభవించాడు.నీవు రామ
చంద్రుడవు కావు. నేను సీతాదేవినికాదు. ఒక వేళ నీవైతే
అవుతావేమోగాని నేను మాత్రము చచ్చినా కాను, అయ్యో
దాన్నేమో ! నిన్ను పెండ్లి చేసికోలేదు. దానితో ఆ దశ
తొలగిపోయింది. నేను వట్టి కాముకినిగా తయారైనాను. ఇంక

రెండో విషయము చెబుతాను విను-నాకు బాగా సాముద్రికము తెలుసు. ఆ రోజున నీ సుఖము ప్రథమముగా నేననుభవించిన రోజున తెల్లవారు కడ నీవు ఒళ్లు తెలియకుండాపడి నిద్రపోతున్నావు. నేను లైటువేసి నీ చెయ్యిచూచాను నీ చేతిలో ద్వికళత్ర యోగమున్నది. నీవు జారత్వము చేస్తే నీకా దుర్యోగము తప్పుతుంది. నీవు లోపలికిరా ! విద్యుద్దీపము వెలిగించి నీకా రేఖలు చూపిస్తాను నేను వర్ణభ్రష్టురాలైనా నన్నమాట నిజమే. నాకింకో విషయము తెలుసు. నా జీవుడు గొప్ప సంస్కారముగల జీవుడు. ఈ జన్మ ఇలా ఎత్తాడు. భవిష్యత్ జన్మ నాకు ఒక యోగినీ జన్మ వస్తుంది. నేను ఎట్లా చస్తానో ఎప్పుడు చస్తానో నాకు తెలుసు అది అట్లా ఉంచు. లోపలికిరా! లౌకికంగా నీవు సుఖపడతావు. నేనింతే చెప్పగలను.

చిదంబరం నోరు మూసికొని ఆవిడ వెంటవెళ్లాడు. రెండు గంటలో మూడు గంటలో అయిన తరువాత చిదంబరం ఇంటికి బయలుదేరాడు. తూలిపోతున్నాడు. ఇతనికి ఒక ఊహ కలిగింది. ఇది మానుష స్త్రీ కాదు ఏదో పిశాచము. ఇలా మానవ జన్మ ఎత్తింది. ఇంటికి వెళ్ళాడు. కమల పడుకొని నిద్రపోతున్నది. బ్రతికానురా అనుకొన్నాడు. ఒక చాప వేసికొని పడుకొన్నాడు, ప్రొద్దున్నే కమల చూచింది. అయ్యో క్రింద పడుకొన్నారే అనుకొన్నది. లేపేదే కాని నిద్ర చెడగొట్టుట మెందుకనుకొన్నది. ఇంతలో పతంజలిశాస్త్రి లేచి స్నానము చేశాడు. ఆయనకి అవ్వి ఇవ్వి అందించవలసి వచ్చింది

ఇంతలో చిదంబరము లేచాడు. కాలకృత్యాలు తీర్చుకొని వెంటనే స్నానము చేశాడు. జపానికి కూర్చున్నాడు. పతంజలి శాస్త్రి ఎవరినో పిలిచి రంగన్న షావుకారు ఇంటికి వెళ్లి కొడుక్కి ఎలాఉందో చూచిరమ్మన్నాడు, పది నిమిషాలలో వాడు వచ్చాడు.అల్లాగే నిలబడి ఉన్నది అని చెప్పాడు. తేనెలో నీళ్ళుపోసి మింగితే త్రాగించమన్నాడట డాక్టరు. రెండు మూడుసార్లు పోశారు. సెలవుల వెంట కార్చాడు అని చెప్పాడు. పతంజలిశాస్త్రి మళ్ళీ మడికట్టుకొని జపము చేసిన తీర్థము పుచ్చుకొని వెళ్ళాడు. ఆయన మహాత్మ్యం వల్లనే బ్రతికి ఉన్నాడని అక్కడి జనము అనుకోకపోలేదు. పతంజలి ఈ తీర్థము అతని నోట్లో పొయ్యమన్నాడు మింగటము లేదు; సెలవులవెంట కార్చి వేస్తున్నాడని చెప్పారు. పతంజలి తానే పోస్తానని వెళ్ళాడు. విఠల్ రావు తల్లి పెదవులు పైకి క్రిందికి తీసింది; పళ్లుకూడ కొంచెము ఎడము చేసింది. పతంజలి ఒక ఉద్ధరిణెడు నీళ్లు పండ్లసందున పోశాడు. అతను క్రక్కలేదు. మ్రింగుడు కూడ పడలేదు. ఆ నీళ్ళు అట్లాగే ఉన్నవి. అయిదు నిమిషాలైన తరువాత పతంజలిశాస్త్రి మళ్ళీ ఉద్ధరిణెడు నీళ్ళు పోశాడు. విఠల్ రావు ఈసారి గుటక వేశాడు. అందరికీ ప్రాణాలు తేరుకొన్నవి. ఆ తీర్థము ఒక వెండిగిన్నెలో పోసి ప్రతి అయిదు నిమిషాలకు పోస్తూ ఉండమని చెప్పి పతంజలి శాస్త్రి వెళ్ళాడు. పతంజలి మళ్ళీ మధ్యాహ్నము తీర్థము తీసికొనివచ్చి ఇచ్చాడు. సాయంకాలము ఆరింటికి తెచ్చిఇచ్చాడు.

రాత్రి పదింటికి తెచ్చిఇచ్చాడు. మరునాటి ప్రొద్దుటికి క్రమ క్రమంగా విఠల్ రావు తీర్థము పోస్తుంటే తానే నోరు తెఱవ టము, తరువాత కళ్ళు తెఱవటము, తేనె నీళ్ళు త్రాగటము జరిగినవి. డాక్టరు వచ్చాడు. నాడీ హృదయములు క్రుంగి పోకండా ఇన్‌జక్షన్ ఇచ్చాడు. తేనెనీళ్ళు గ్లూకోసు నీళ్లు పర్యా య ంగా ఇస్తూనే ఉన్నారు.మూడవరోజున విఠల్ రావు మాట్లా డాడు. మూడురోజులు అవ్యవహితంగా తీర్థపు నీళ్లు ఇస్తూనే ఉన్నారు. ఇంక బ్రతుకుతాడని గట్టిగా నమ్మకము ఏర్పడ్డది. పతంజలిశాస్త్రి తన ఊరువెళ్ళి రెండురోజులు ఉండి వస్తానని రంగన్న షావుకారుతో చెప్పాడు. ఆయన తక్కిన రెండువేలు ఇవ్వబోతూఉంటే ఆయన పెండ్లాము తక్కిన కొడుకులు చాలా అడ్డగించారు. "ఆయుర్దాయము ఉండి బ్రతికాడుగాని ఈయన జప తీర్థముతో బతికాడా అని. డాక్టరిచ్చిన మందే క్రమంగాపనిచేసిందని ఇదివఱకిచ్చిన రెండువేలే చాలా అనవసర మని. ఈ మాత్రం తీర్థము పది రూపాయలిస్తే ఎవరైనా ఇస్తా రని. ఒకమాట యేమిటి వందమాటలన్నారు. రంగన్న ఏమి చేస్తాడు ? ఇస్తే వాళ్ళందరికి కోపాలు వచ్చేటట్లుంది. ఎట్లా గైనా ఉపన్యాసాలైన తరువాత ముట్టచెబుదామని మన స్సులో సరిపుచ్చుకొని ఆయన్ని వాళ్ల ఊరు వెళ్లిరమ్మన్నాడు. ఈ లోపల జరిగే గబ్బిసలాట అంతా బయటఉన్న పతంజలి శాస్త్రికి తెలుస్తూనే ఉంది. ఏమి చేస్తాడు ? మనకింతే దక్కట మనుకొన్నాడు. ఆయనకు తన జపము వలననే విఠల్ రావు

బ్రతికాడని నమ్మకము. ఎందుకంటే అతని జన్మలో యెన్నడూ లేని ఒక అనుభవము వచ్చింది అర్థరాత్రివేళ రెండు మూడు గంటల మధ్య ఆజానుబాహువు గౌరవర్ణుడు ఒక మహా పురుషుడు కనిపించి 'ఫరవాలేదు బ్రతుకుతాడు' అని చెప్పాడు.

పతంజలి వాళ్ళ ఊరు వెళ్ళాడు. రెండువేలు జమ కట్టాడు. ఆ అప్పిచ్చిన షావుకారుయొక్క నవనాడులు క్రుంగి పోయినవి. 'లాభములేదు. ఇతను అప్పు తీరుస్తాడు. ఆ పదెక రాలు మనకురాదు' అని నిశ్చయమై పోయింది.

# 4

పతంజలిశాస్త్రి మూడు రోజులకు తిరిగి వచ్చాడు. ఆ రోజున సాయంత్రము ఉపన్యాసము. విఠల్ రావు మంచంలోంచి లేవటములేదు గాని మాట్లాడటము, కొంచెము వేళకు ఏదైనా యివ్వకపోతే కోపపడటము మంచముమీదనే ఆహార పదార్థాలు పుచ్చుకోటము సాగుతున్నది. సోఫియా చిదంబరం కమల అందరూ ఉపన్యాసానికి వచ్చారు. ఇదివరకు కమల కన్నెత్తి సోఫియావంక చూచేదికాదు. ఇప్పుడు చూస్తున్నది. చిదంబరం కమలతో సోఫియాని గురించి ఏదేదో చెప్పాడు. అమె బాగా ప్రసన్నురాలైంది. పతంజలి ఉపన్యాసముప్రారంభించాడు. "ఇది వరకు చెప్పాను. కాలమునకు శక్తి తగ్గుచున్నది. పూర్వమందాశక్తి ఉండేది. భారతములోని యుద్ధాలను గురించి చదువుతాము. ఆగ్నేయాస్త్రము వాయవ్యాస్త్రము పాశుపతము నారాయణము ప్రయోగిస్తారు. పెద్దగాలి పెద్దవాన పెద్దమంటలు ఇవన్నీ పుడతవి. రాక్షసులు

ఉన్నారు. హిడింబ పూతన ఘటోత్కచుడు. ఇపుడు వీళ్ళే
వళ్ళు లేరు. ఆ అస్త్రాలన్నీ నశించిపోయినవి. ఆ రూపాలన్నీ
కనవడటములేదు. కలిలో పది పన్నెండు వందల యేండ్లు జరిగే
వరకు అవన్నీ ఉంటూ ఉండేవి. తరువాత అదంతా అంతరించి
పోయింది. కాలమునకు శక్తి తగ్గిపోయింది. మహర్షులు కని
పించటములేదు. దేవతలు కనిపించటములేదు. ఒక మంత్రము
గాని ఒక యోగము కాని రూపుకట్టటములేదు. క్రమంగా జనా
నికి ఆ విశ్వాసాలన్నీ పోయినవి. ప్రత్యక్ష ప్రమాణ వాదులౌ
తారు జనము. ప్రత్యక్షాన్ని కూడ నమ్మరు. ఏటో ఏదో గోల
గించి మాట్లాడుతారు. తపశ్శక్తి వల్ల నేను విఠల్ రావు గారిని
మృత్యుముఖంలోనించి ఇవతలకు తీసికొచ్చాను అంటే యెవళ్లూ
నమ్మరు. దానికేమి ? అనేక యోగాలున్నవి. జలంధరుడన్న
రాక్షసుడుండేవాడు. అతని భార్య తులసి. యోగాభ్యాసంలో
జాలంధరోడ్యాణమని ఒకటి ఉన్నది పొట్ట అక్కళించి పొట్ట
నరాలని సన్నగా త్రాడువలెచేసి దానిని గిరగిర త్రిప్పటము
పేరు ఉడ్యాణము అంటారు. ఇది ఆ జలంధరుడనే రాక్షసుడు
కనిపెట్టినయోగము, అందుచేత దానికి జాలంధరోడ్యాణమని
పేరు వచ్చినది. కుడి బాహువును మధించి అందులోనించి
అతడొక మహాశక్తిని పుట్టించాడని అంటారు. ఇవన్నీ పూర్వ
కాలపు మాటలు. మనయోగ విద్య యోగాభ్యాసము వీటిని
గురించి రష్యాలో అమెరికాలో జనము ఆశ్చర్యపోతున్నారు.
వీటిని అభ్యాసము చేస్తున్నారట. ఒక తపస్సుచేత ఒక అభ్యా

సముచేత గొప్ప శక్తులు కలుగుతవి. నేను విఠల్ రావుగారి కోసము జపము చేస్తుంటే ఒక మహాపురుషుడు కనిపించి ఫరవా లేదు నయమవుతుందని చెప్పాడు. నేను దీనిని చెబితే ఎవళ్ళూ నమ్మరు. ప్రకృతి శాస్త్రజ్ఞానము ఎక్కువైపోయింది. అది ఒక మానసికమైన భ్రాంతి అంటారు మా అద్వైతులు అట్లాగే అంటారు. కాని ఈ ప్రపంచమే ఒక భ్రాంతి. పాంచ భౌతిక మైన శరీరాలు వ్యావహారికంగా ఉన్నవన్నట్లు ఇది భ్రాంతి. తైజసికమైన రూపాలు ఉన్నట్లుగా అది మానసికమైన భ్రాంతి. ఈ లోక వ్యవహారములో ఒక నియతి ఉన్నది. అట్లాగే మనస్సులో తపస్సుచేత నిర్మితమైన ఈ తైజసిక మూర్తులయందు వాటి క్రియలయందు ఒకనియతి ఉన్నది. అదే దేవతాకృతి. ఇదంతా ఎందుకు చెప్పానంటే క్రీతద్వీపములో మినాస్ అన్న రాజు ఉండేవాడు అతడు వీరశైవుడు. అక్కడికి వెళ్లేటప్పటికి శైవమే ఎంతో మారిపోయింది. వీరశైవులే బసవేశ్వరారాధకులని చెప్పానుకదా! వాళ్లు నందిని ఆరాధిస్తారు ఈ ఆరాధనలు ముప్విధములు భగవంతుడు భగవద్గీతలో భక్తి ముప్విధములని చెప్పాడు. గుణత్రయ విభాగయోగమని ఒక అధ్యాయము సాత్వికభక్తి రాజసభక్తి తామసభక్తి. వీరశైవములో చాలా భాగము తామసభక్తి. దేవుణ్ణి కనపడతావా కనపడవా ? కనపడకపోతే ఇదిగో ఈ కత్తిపెట్టి నేను పొడుచుకొని చస్తాను. నీ లింగాన్ని పగలగొడతాను" ఇదంతా తామసభక్తి. రావణాసురుడు తన తలకాయలుకోసి శివుడికి నైవేద్యము పెట్టే

వాడు ఇది తామసభక్తి. వీరభద్ర పళ్లెమని పడతారు. నార సాలు దిగవేసుకొంటారు. ముసల్మానులు నిప్పులలో నడుస్తారు. క్రైస్తవులలో కూడ ఇలాంటివి ఉన్నవట. ఇది అంతా తామసికభక్తి. ఈ భక్తితో శక్తి ఉడుగని కాలమహాత్మ్యము జోడిస్తే ఏమి జరుగుతుంది ? మానవులు అనేకములైన రూపములను కల్పించు కొంటారు. కొన్ని రూపాలు అనాలోచితముగా మనస్సులలో ఉంటవి. భయపడ్డప్పుడు ఏదో పిచ్చిరూపము కనిపిస్తుంది. మిడిగ్రుడ్లు కోరలు తాడంత ఎత్తు మనిషి ఏవో వికార వికార రూపాలు కనిపిస్తవి. ఎక్కడినించి వచ్చినవి ? మనస్సు కల్పన చేసికొన్నది. మనస్సు ఎందుకు చేసుకొన్నది ? మనస్సులో ఆ లక్షణ మున్నది. అవి మనస్సుకే కనిపిస్తవి. కంటికి కనిపించవు, మనస్సుకు కనిపించటము వేరు, కంటికి కనిపించటము వేరు. మనస్సుకి కనిపించేది వాడిమట్టుకు వాడికే కనిపిస్తుంది. ఒక్కొక్కప్పుడు కంటికి కనిపించేది కూడా వాడి కంటికే కనిపించవచ్చు. అంటే ఏమిటి ? మనస్సులో పొందిన భ్రాంతి వృద్ధమైతే కంటికి కూడ కనిపిస్తుంది. అప్పుడు ఇప్పుడు కూడ అది వట్టి తేజోరూపమే,ఒక యోగశక్తిచేత దానికి పాంచభౌతికమైన రూపము సిద్ధింప చేయగలిగితే అది అందరికి కనిపిస్తుంది. తేజోమయాకృతికి పాంచ భౌతికాకృతికి చాలా భేదమే కాదు చాలాదూరమున్నది. దీనిని ప్రత్యక్ష మంటారు. ఇదంతా చెప్పటంకంటే క్రీత దేశములో ఉన్న మినాస్ అనేరాజు ఒక యోగముచేత వాడు వీరశైవుడై బసవేశ్వర ఆరాధకుడై ఒక

మహా జంతువునకు రూపము కల్పించాడు. దానికి మినాటూర్ అని పేరు. ఆ జంతువుయొక్క శిరస్సు, దాని శరీరము మానవ శరీరము. మన వరాహ అవతారము, నారసింహావతారము, కాలభైరవస్వామి. ఈ రీతిగా అట్లాంటి మూర్తిని భావించి ఒక తపశ్శక్తి చేతను ఒక యోగశక్తి చేతను కలి బాగా ముదరక ముందు అటువంటిది కన్పించటం సాధ్యమయ్యేది అని నేను పూర్వము చెప్పిన కారణాలచేత మీరు విశ్వసిస్తే విశ్వసించండి, లేకపోతే కట్టుకథ అనుకోండి. మినాస్ అన్నశబ్దము మీనము అంటే చేప. ఈ క్రీతద్వీపము సముద్రము నడుమ ఉన్నది గనుక దానినొక మీనముగా భావించినాడు. తనపేరు మీనావతార మన్నమాటకు దగ్గరగా ఉన్నది. అర్థము కుదరకపోయినా శబ్దాలకు సామీప్యము కుదురుతున్నది. అప్పుడు వాళ్ళు ఏమను కొన్నారో మీనము అంటే వాళ్ళు ఎద్దు అని అర్థము చెప్పు కొన్నారేమో ! ఎలాగైతేనేమి ? ఆ దేశము చమత్కార ముగా ఉన్నది. భూగర్భ శాస్త్రవేత్తలు అక్కడి వర్తకులు ఉద్యోగస్థులు అనేక అంతస్తులుగల మేడలు వెడల్పు రోడ్లు ఇండ్లు శిల్పశాస్త్రము చిత్రకళ మొదలైనవి ఉండేవి అని చెబు తున్నారు. ఆ దేశస్థులు సన్నని నడుములు కలవాళ్ళు. వాళ్ళ మొగములలో ఆలోచన కనిపించేది. వాళ్ళకి జులపాలు ఉండేవి. వాళ్ళ స్త్రీలు ఒయ్యారులు. ఆ దేశాన్ని గురించి మొట్ట మొదట హోమర్ వ్రాశారు. గొప్పగా వ్రాశాడు. అక్కడ కొండలమీద ఉన్న ఒక శిఖరము పేరు ఇడా శిఖరము. ఇడా

నాడి పింగళానాడి ఈ రెంటిమధ్య సుషుమ్నానాడి ఉంటుంది అని మన యోగశాస్త్రము చెబుతున్నది. ఈ పేరు అక్కడి ఒకగిరి శిఖరానికి పెట్టడము నేను చెప్పిన యోగశాస్త్ర సంబంధాన్ని నిజమే కావచ్చు నంటున్నది. ఆ ద్వీపములో తొంభయి మహా పట్టణాలు ఉండేవిట. అందులో నాసాస్ అనే పట్టణానికి ఈ మినాస్ రాజు. నాస అంటే ముక్కు. ఈ మీనరాజు చాలా దుష్టుడు. గ్రీసుదేశపు ప్రజలమీద వాడికి కోపము. గ్రీసు అన్న మాట గిరిశ శబ్దానికి వికృతి. ఈ గిరిశదేశములో ఏథెన్సు అన్న ఒక పట్టణమున్నది. ఈ మీనరాజు ప్రతి సంవత్సరము పదుగురు యువకులు యువతులు ఈ గ్రీసు దేశాన్నుండి వచ్చి ఈ మీనావతారానికి బలికావాలి వాళ్ళని బంధించి తెచ్చేవాడు. ఈ మీనావతారము వాడితల ఎద్దుతల; వాడి శరీరము మనిషి శరీరము. ఈ రాజుయొక్క అంతఃపురము క్రింది భాగములో భూగర్భములో ఒక వ్యూహాముగా నిర్మింపబడిన ఒక పెద్ద భూగర్భ గృహాము ఉండేది. దానిలోవ అంతా తికమకలుగా ఉండేది. లోపలకు వెళ్ళినవాడు మళ్ళీ బయటకు రానటము అసంభవము. ఆ మీనావతారము ఆ వ్యూహాములో తిరుగుతూ ఉండేది. ఈ యువకులను యువతులను పట్టుకొని చంపి తినేది. ఈ మీనరాజు దగ్గర దాదిలుడు అని ఒక పెద్ద శిల్పి ఉండేవాడు. ఈ భూగర్భ వ్యూహాగృహాన్ని ఆ దాదిలుడు నిర్మించాడు. వాడు బ్రహ్మాండమైన వివేకి. శిల్పజ్ఞుడు మయునివంటి వాడు. ఇలాంటి గృహాము ఒకటి నేటికి లక్నోలో ఉన్నది. ఆ

లోపలికి వెళ్ళితే మనము రాలేము. దోవ తెలిసినవాళ్ళు తీసుకు రావాలి. ఒక గ్రీకు వీరుడు ఉన్నాడు. వానిపేరు థీస్యూస్ ఇది దస్యు శబ్దము. మీన రాజునకు వీరందరు సేవకులు, క్రింది వాళ్ళు. అందుచేత దస్యులు అయినారేమో. ఒక సంవత్సరము బలిగా పంపించబడిన ఏడుగురు యువతీ యువకులలో ఈ దస్యు డున్నాడు. మీనరాజు కూతురు ఈ దస్యుణ్ణి ప్రేమించింది. ఈ దస్యుడు వీరుడు. మీనావతారాన్ని చంపగలవాడు. బకాసు రుణ్ణి భీముడు చంపినట్లు ఆ కథల సామ్యాన్ని బట్టి మన నాగర కత అక్కడికి వెళ్ళినట్టు తెలుస్తుంది. ఈ రాజు కూతురు దాది లుని అభ్యర్థించింది. దస్యుడు మీనావతారుని చంపినా ఆ వ్యూహాన్ని భేదించుకొని రాలేదు. అందుచేత దాదిలుడు దస్యునికొక జిగురుదార మిచ్చాడు. అది చాల పొడుగైన దారము. ఆ దారాన్ని ద్వారానికి బిగించి కండె ఊడదీసి కొంటూ లోపలికి పోవటము తిరిగి వచ్చేటప్పుడు కండె చుట్టు కుంటూవస్తే బయటికి వస్తాడు. దస్యుడు వెళ్ళాడు, మీనావ తారుణ్ణి చంపాడు. మళ్ళీ తిరిగి వచ్చాడు. రహస్యంగా రాజు కూతురు దస్యుడు పారిపొయ్యారు. అప్పుడు మీనరాజునకు తెలిసింది. దాదిలుడు చెప్పకపోతే ఈ ఉపాయము దస్యుడికి తెలియదు. దాదిలుడు కొడుకు పేరు వికారుడు. వీడి పేరు గ్రీకు పుస్తకాలల్లో ఇకారన్ అని ఉన్నది. చివరి నకారము విసర్గ స్థానీయం. "వి" "ఇ"గా మారింది. మీనరాజు తండ్రి కొడుకులను బంధించమని ఆజ్ఞయిచ్చాడు. రాజు తన్ను తన

కొడుకుని చంపుతాడని దాదిలుని కదివరకే తెలుసు. వాడు పెద్ద శిల్పిగదా వాడు తన కొడుకునకు ఆకాశములో ఎగిరి పోవటానికి రెక్కలు చేశాడు. ఇద్దరూ కట్టుకొన్నారు. ఒక జిగురుతో ఆ రెక్క లంటించుకొన్నారు. వాటితో ఆకాశంలో చాలా ఎత్తుకు పోకూడదు. ఆ జిగురు సూర్యుని వేడిమికి కరిగి పోతుంది. రెక్కలు రాలిపోతవి. కాని సముద్రపు చెమ్మ తగల నంత ఎత్తున ఎగురుతుండాలి. చెమ్మ తగిలితే ఆ రెక్కలు విడి పోతవి. కొడుక్కి ఈ సంగతి చెప్పాడు. కాని వికారుడు మూర్ఖుడు. వాడి పేరే వికారుడు. వాడు గాలిలో ఎగురు తుంటే వాడు ఉత్సాహము పట్టలేకపోయాడు. ఇంకా ఎత్తు పోదాము. ఇంకా ఎత్తు పోదాము అని పోయినాడు. సూర్య రశ్మికి జిగురు కరిగిపోయింది. వాడు సముద్రంలో పడ్డాడు. చచ్చిపోయినాడు. ఆ సముద్రానికి ఇప్పుడు కూడ ఇకారియన్ సముద్రమని పేరు అనగా వికారుని సముద్రము. ఈ చివర ఉన్న అన్ అనే ప్రత్యయము ఇంగ్లీషులో దానికి సంబంధించిన అని వస్తుంటుంది. ఏష్యన్ ఇండియన్ ఇకారియన్ వికారుని ఇది తెలుగు ప్రత్యయము. తరువాత దేనికిబడితే దానికి వాడు కున్నా వాళ్లు అందులో తెలుగు భాషా లక్షణమున్నది. పది పదేనువేల యేండ్లుగా ఆ దేశాలకు పోయిన వాళ్లల్లో తెలుగు వాళ్ళ ప్రాబల్యం ఉన్నదని చాలా గుర్తులు చూపించాను. అందులో ఇది ఒకటి. ఈ దాదిలుడు పారిపోయి శిశిలీద్వీపంలో (ఈ శబ్దము శిశిర శబ్దము కావచ్చు లేకపోతే సుశీల శబ్దము

కావచ్చు) కోసలు డన్న రాజు మరుగు చొచ్చాడు (ఈ శబ్దము కోకలుడు కోశలుడు శోశలుడు ఎట్లాగైనాసరే ఉచ్చరించ టానికి వీలుగా వాళ్ళ పుస్తకాల్లో వ్రాసి ఉన్నది) మీనరాజుకి దాదిలుడిమీద కోపము పోలేదు. వాణ్ణి ఎల్లాగు పట్టుకోవాలి. అన్ని దేశాలు తిరిగాడు. ఈ సుశీల దేశము వచ్చాడు. ఈ మీనరాజు ఎక్కడికి వెళ్ళినా ఒక శంఖాన్ని తీసికెళ్ళి దీనిలోపలి పొరల పొడుగెంతే కనుక్కోమంటూ ప్రశ్న వేయటము మొదలెట్టాడు? ఆ రాజు దాదిలుని కిచ్చాడు. వాడు చెప్పాడు. వాడల్లా పట్టుబడ్డాడు. ఇదంతా ప్రక్కిటి పురాణమల్లె ఉంది గాని నేను పూర్వము చెప్పిన స్క్రీమర్ను ఈ వాన్సు అనే ఇంకొక పండితుడు క్రీత ద్వీపంలో త్రవ్వకాలు పెట్టి ఈ భూగర్భ వ్యూహాగృహ నిర్మాణము ఇంకా ఎన్నో విషయాలు ఉన్నవని ఋజువు చేశారు. మొన్న మొన్నటిదాకా ఇవన్నీ కట్టుకథలు. ఇప్పుడు యధార్థాలు. ఈ వాన్సు ఆ సాగరము దగ్గర త్రవ్వి ఇవన్నీ పెల్లగించి చూపించాడు. అందులో గోడల మీద మీనావతారపు బొమ్మ, దానితో యువతీ యువకులు పోట్లాడటము ఇవన్నీ గోడలమీద చిత్రింపబడి ఉన్నవి. అది ఒక పెద్ద యజ్ఞము వంటిది కాబోలు—ఒక జాతరవంటిది—వీళ్ళని బలివేసేవాళ్లు అంతా నిజమని ఈ వాన్సు తేల్చాడు. ఇదంతా భారత దేశాన్నించి వెళ్ళిన సంప్రదాయాలయొక్క విపరీత లక్షణము. అధర్మము పెరగటము, దుష్టమైన యోగ సిద్ధులు, సర్వనాశనం కావటం.

# స ప్త మ భా గ ము

## గ రీ శ దే శ ము

## 1

సోఫియాకు ఆ బాటసారి బంగళాలో ఒక బంట్రోతు వుండే వాడు. రోజూ పూటకూళ్ళ ఇంటి నుంచి వాడన్నం తెచ్చేవాడు. గది ఊడవటం; గుడ్డ లుతకటం, నీళ్ళు తేవటం, గిన్నెలు తోమటం ఇవన్నీ వాడు చేసేవాడు. వాడికి నెలకు పది రూపాయి లిచ్చేది. వాడిది యేదో వూరు. ఇక్కడ వుండి ఈ పనులు చేస్తూ ఇలా సంపాదించి పెళ్లాం బిడ్డలకి పంపించు కుంటూ వుండేవాడు. పాపం వాడికి భార్యాబిడ్డలను పోషిం చట మేకాని వాళ్ళ సుఖం అనుభవించే గీత లేదు. సృష్టిలో ఇలా చాలామంది జీవులు వుంటారు. సంపాదించటం, వాళ్ళకు పంపిస్తూ వుండటం. వాళ్ళు చస్తే ఏడవటం, ఇదొక విలక్షణ మైన జీవయాత్ర. ఇలా వుంటూవుండగా వాడికి యింటి దగ్గర నుండి వార్త వచ్చింది. తన భార్యకు జబ్బుగా ఉందని. వీడై

దారు రోజులు వెళ్ళలేదు. చివరకు భార్య పోయిందన్న వార్త వచ్చింది. సోఫియా వాడికి వంద రూపాయ లిచ్చి పంపించింది. అదందరికీ తెలిసింది. ఆమె యెంత దయామతి. ఆ వూళ్ళో ఆమె కీర్తి మరి రెండు రెట్లయింది. వాడు వెళ్ళిన తర్వాత మళ్ళీ సేవకుడు కుదుర లేదు. కుదిరేటప్పటికి నాలుగురోజులైంది ముందర కుదిరిన విషయం చెప్పి కుదరని నాలుగు రోజులు కథ తర్వాత చెప్పవలసి వస్తున్నది. ఆ వూరి పేరు నవాబుపాలెం. పేరున కొక్క ఊరుకాని నిజానికవి మూడు వూళ్ళు. అసలు వూరు ఒకటి. ఆనుకొని అనగా వూళ్లో కలిసియే తురక పాలెం ఒకటి. మరీ దగ్గరా కాకుండా దూరమూ కాకుండా హరిజనుల గూడెము ఒకటి, తురకపాలెం ఊరుకంటె ఒకటిన్నర రెట్లు, హరిజనుల గూడెం, ఊరికి రెండురెట్లు, కొన్నివందల యేండ్ల క్రిందనె అది ప్రధానంగా తురకల ఊరు. ఇంగ్లీషు వాళ్ళు వచ్చిన తర్వాత తురకల ప్రాబల్యంపోయిన తర్వాత క్రమంగా హిందువుల ప్రాబల్యం వెలిసింది. ఈ దక్షిణదేశంలో తురకలు రాజ్యం చేసినప్పుడు కూడా ఎక్కడికక్కడికి తురకల ప్రాబల్యం తక్కువగానే వుండేది. ఎన్ని తురక రాజ్యాలుంటే అన్ని హిందూ రాజ్యా లుండేవి. వాళ్లకి వీళ్లకీ ఎప్పుడూ యుద్ధాలే. తురక రాజులు కూడా ఎవ్వడో టిప్పుసుల్తాను వంటి వాడికింద తప్ప తక్కినప్పుడు మరీ ఘోరం చేయటానికి వీలులేకుండా వుండేది. వాళ్ళ వుద్యోగస్థులలో సగానికి సగం హిందువులే వుండేవారు. ఈ దేశమునందలి జనుల మనః సంపుటి లక్షణం

ప్రకారం ఆ హైందవోద్యోగస్థులకు రాజభక్తి తప్ప జాత్యభిమానం లేదనటానికి వీలుండేది కాదు. ఈ దేశంలో పూర్వమదేమిలక్షణం? పూర్వందాకా ఎందుకు ఇప్పుడు కూడా అంతే. రాజభక్తి అనేది ఒక మూఢ విశ్వాసము. రాజులు మహానుభావులైనప్పుడు, ధర్మపరులైనప్పుడు వేద ధర్మం రక్షించేటప్పుడు, నా విష్ణుః పృథివీపతిః అనేసూక్తి యొక్క యర్థము నూటికి నూరుపాళ్లు నిజమైనప్పుడు రాజభక్తి మంచిదే—అది లోకస్థితి హేతువు. ఆ రాజు జారుడు, చోరుడు, క్రూరుడూ అయి విష్ణుత్వం యొక్క లేశముకూడా వానివద్ద లేనప్పుడు వాడపండితుడైనప్పుడు ఆ వాక్యము యొక్క యర్థము పట్టదు. ప్రజల యొక్క రాజభక్తి వృధా వృధా. వృధా కావడమే కాకుండా నాశన హేతువవుతుంది. రాజశబ్దము యొక్క అన్వర్థతలేని పలుమంది రాజులు దేశంలో వెలిసినప్పుడు ఒక వైపున వాళ్ళ దుష్క్రియలు వాళ్ళు చేస్తూవుంటే యింకొక వైపున రాజభక్తిని నెఱపు జనులుండటము కలిగె లోకానికి దుస్థితి ఏమవుతుంది? స్వాతంత్ర్య మెప్పుడో పోయింది. రాజులు జమీందారులైనారు. వాళ్ళు ఇంగ్లీషు వారికి పత్తేదారులైనారు. వాళ్లకు ప్రజాక్షేమ మక్కరలేదు. వాళ్ళు పెద్ద భూస్వాములక్రింద తయారైనారా? వాళ్ళ యందు రాజభక్తి ఏమిటి? వాళ్లు రాజశబ్ద వాచ్యులేకాదు. అందుచేత రాజభక్తి యన్నశబ్దము నిరర్థకమై పోవటమే కాదు అనర్థకమై పోయింది. ప్రజాస్వామికం వచ్చిన తర్వాత దాని

దుర్లక్షణం మరీ బైటపడింది. ఆ ప్రాంతాలలోని ఓట్లన్నీ ఆ జమీందారులకు వస్తాయి. తక్కిన ఓట్లు సంపాదించేవారు వెలగ బెట్టేరని కాదు. ఈ వోట్లూ అలాగే పనికిరానివవుతున్నై. ఇంగ్లీషు వాళ్ళు రాజ్యం చేసేప్పుడు కూడా మన వాళ్ళు రాజ భక్తిని పాటించే వాళ్ళు. వాళ్ళు రాజ్యం చేసేటప్పుడు రాజు లేడు. ఇంగ్లండు రాజుని రాజుగా పరిగణింపచేసారు. మనని నిజంగా పాలించింది బ్రిటిషు వాళ్ల రాజ్యసభ. మరి యెందు కయ్యా ఈ వ్యత్యాసం వచ్చిందంటే దీనికి రెండు కారణా లున్నై. ఒకటి తర తరాలుగా ఈ ప్రజలలో వున్న మూఢ విశ్వాసం. రెండవది ఆవిశ్వాసాన్ని అట్లాగేవుంచి పాలించే వాళ్ళు దానిని ఉపయోగించు కోవటము. ఈ కృత్రిమలక్షణం ఇప్పటికీ అట్లాగే సాగుతూంది. ప్రజలకు చదువు చెప్పరు. ఒక వేళ చెపితే అది ప్రాథమిక విద్య. అది నిష్ప్రయోజనం. విషయం తెలియటం చదువుకొని పుస్తకం చదవటం చదువు కాదు అనే మహావిషయాన్ని ఈ సృష్టి జరుగక ముందే తెలుసు కున్నారు. భారతీయులు అనేక సంస్థలవల్ల సర్వభావ ప్రచా రమూ చేస్తూవుండే వాళ్లు, ఐహికాధ్యాత్మికములైన రెండు విషయాలూ అందరికీ తెలిసేవి. పరాయివాడు రాజ్యం పాలిం చడానికి రావటముతోటే వాడి దేశంలోని అల్ప లక్షణాలు తీసుకొని వచ్చి యిక్కడ ప్రవేశ పెట్టాడు. రెంటికీ సంఘర్షణ ప్రారంభమైంది. అది విప్లవానికి హేతువైనది కాని, దేశసుస్థి తికి హేతువు కాలేదు. ఎలాగైతేనేమి ఈ హిందూ జాతిలోని

దృఢమైన అవిద్యా మానమైన ఒక శక్తియున్నది. అది నిర్మూ లింపబడదు. విక్టోరియా రాణి చేత ఇంగ్లీషు వాళ్లు భారత దేశానికి ఒక అభయ హస్తం యిప్పించక పూర్వం పంద, పంద యేభై యేళ్ళ పూర్వము క్రైస్తవ మత ప్రచారకులు ప్రజ లను ఈ దేశంలో పెట్టిన బాధలు నరక బాధలకంటె తక్కు వవికావు. ఆయినా భారతదేశ ప్రజలు తమ ధర్మము నుండి వీగిపోలేదు ఈ భారతదేశ ప్రజల యొక్క గాఢవిశ్వాసాన్ని గూర్చి వాళ్ళు ఆశ్చర్యపోతూ పై అధికారులకు ఉత్తరాలు వ్రాసుకొనేవారు. ఆ ఉత్తరాలు ఆ కైఫీయతులూ ఇప్పటికీ వున్నవి పతావాతా చెప్ప వచ్చినదేమంటే ఆ వూరు త్రిభా విభక్తమైయున్నది. దేనికదే. ఇట్లా వుండగా క్రైస్తవులిచ్చట రాజ్యము చేసినప్పుడు అనగా ఇంగ్లీషు వాళ్ళు రాజ్యము చేసి నప్పుడు హరిజనులలో కొంత మందిని క్రైస్తవులుగా మార్చి వాళ్ళకు చిన్న చిన్న ఉద్యోగా లిచ్చినారేకాని వాళ్ళ సంఘాన్ని యధార్థంగా లౌకికంగా బాగుచేసిం దేమీలేదు. ఎక్కడ వున్నావే గొంగళీ అంటే వేసినచోటనే వున్నా మంటున్నవి ఆ కులాలు. ఇంగ్లీషు వాళ్లు బాగు చేసిందీలేదు. గాంధీ బాగు చేసిందీలేదు. అమెరికాలోనూ ఇంగ్లండులోనూ తల్లులు సినిమాలకుపోయి పసిపిల్లలకు నల్లమందు పేసిపోతారట. వాళ్లా ఆయనా కూడా హరిజనులకు ఒక నల్లమందు వేశారు. ఈ నల్లమందు అస్పృశ్యతా నివారణ మన్నమాట. రెండవ నల్లమందు హరిజన దేవాలయ ప్రవేశము. అదీ సాగలేదు ఇదీ

సాగలేదు - కడచిన ఏభై అరవై యేండ్లుగా మనదేశంలో ఇంగ్లీషు వాళ్ళూ వాళ్ళని అనుసరించిన గాంధీ మతస్థులూ చేసిన మహా కార్యమేమంటే దేశంలో శాంతి అనేది లేకుండా చేశారు. విప్లవ భావాలను రేకెత్తించారు. కులం పేరు చెప్పి మతంపేరు చెప్పి వర్ణం పేరుచెప్పి ఎవరు ధనవంతులో వారి మీద ఎక్కువ దౌర్జన్యం చేయడానికి వీ లేర్పరచారు. ఈ ప్రజా స్వామికం వచ్చిన తర్వాత ఈ లక్షణం మరీ వృద్ధి పొందింది. హారిజనులు మరీ అధోగతికి పోయినారు. అదివరకు తిండీ తిప్పలూ ఎట్లున్నా మానవుల మధ్య ఒక సౌహార్ధం వుండేది. అందరం కలిసి బ్రతకాలి. అనే భావం వుండేది. ఇప్పుడది విచ్ఛిన్నమై పోయింది. ఆ నడిమికాలంలో తురకవాళ్ళూ హిందువులూ కూడా బాగా కలిసి వుండేవారు. బ్రిటిషువాళ్లు చివరి రోజులలో హిందువుల మధ్య తురకల మధ్య చాలా భేదాలు పెట్టారు. భారతీయ స్వాతంత్ర్యయుద్ధం (ఇంగ్లీషువారు దీనిని సిపాయి మ్యూటినీ అన్నారు.) జరిగినప్పుడు యింగ్లీషు వాడి మీద దెబ్బతీసిన వారిలో ఎక్కువమంది మహమ్మదీయులు. అందుచేత వాడు ఏమిచేశాడంటే మహమ్మదీయులను అణగద్రొక్కాడు. వాళ్ళకి ఉప్పు పుట్టకుండ చేశాడు. ఈ హైందవులు వాడి చదువే చదివి వాడి చదువు వాడికి ఒప్ప జెప్పడం మొదలు పెట్టారు. ఓహో! వ్యవహారం బెడిసిపోతున్నదని అక్కడినుంచి హిందువులను అణగద్రొక్కి తురక వాళ్ళను పైకి తీసుకువచ్చాడు. వాళ్లుకూడా స్వరాజ్యం కావాలనటము

మొదలు పెట్టారు. అప్పుడు బ్రాహ్మణులకూ బ్రాహ్మణేతరులకూ మధ్య వైవిధ్యం కల్పించారు. వాడు ఇట్లా దేశాన్ని మూడుగా చీల్చాడు. ఎంత జేసినా హరిజను లక్కడే వున్నారు. ఇలా ఉండగా అన్ని వర్ణాలవారికీ ప్రాతినిధ్యమనే సూత్రం వచ్చింది. హరిజనులకు ప్రాతినిధ్యం వచ్చింది. వాళ్లల్లో చెదురుగా కొందరు మంత్రులైనారు. వాళ్ళని సముద్ధరించేందుకు రాజ్యాంగము లక్షలు వ్యయపెట్టటం మొదలు పెట్టింది. ఏమిటయ్యా లాభమంటే ఆ లక్షలు తీసికొన్నవాళ్లు వాళ్లే మ్రింగివేయట మారంభించారు. వాళ్లకు నూతులు త్రవ్వించిన వాళ్లు కూడా లేరు. వారికి పారిశుధ్యం పరిశుభ్రతా అలవాటు చేసిన వారు కూడా లేరు. ఇది యిట్లా వుండగా యీ దేశంలో అనేక భేదాలున్నవి. (ఈ భేదాలు యిక్కడ లేవు. ఏ దేశంలోనైనా వుంటవి. మానవుని లక్షణమది. భేదం లేకపోతే మానవ సృష్టి లేదు) దేశభక్తి జాతీయత అనే భావాలలో భేదములు అంతరించి పోతవి. ఇదికూడా మానవజాతి లక్షణమే. దేశమునేది వచ్చినప్పుడు పరరాజు మనలని ఆక్రమించడానికి వస్తున్నాడు అనే భావం వచ్చినప్పుడు ఈ భేదా లుండకూడదు. పూర్వముండేవి కావు. గోరంతలైన ఈ భేదాలను కొండంతలుచేసి యింగ్లీషువాడు ఈ దేశాన్ని నాశనం చేశాడు. వాడీ స్వలాభం కోసం చేశాడు. వాడు వెళ్ళిన తర్వాత కూడా మనల్ని ఆ దయ్యం పట్టుకొని పీక్కు తింటున్నది. స్వార్థం మానవులకు సహజంగా వుంటుంది. దానితోపాటు దైవభక్తి, జాతీయత,

సంప్రదాయాభిముఖ్యం,విద్యాభిలాష, ధర్మంఅన్నీ పాళ్లుపాళ్లుగా మానవులలో వుంటవి. ఈ యింగ్లీషువాడు చేసిన కుతంత్రం మూలంగా దేశంలో వర్ణ భేదాలు ప్రాముఖ్యం వహించి వాటితో స్వార్థాన్ని జోడించి ఆ రెండు గుణాలకీ పట్టాభిషేకం జరిగింది రాజ్యాంగ విధాన లక్షణంచేత ధనవంతులు మాత్రమే పైకి రావటానికి వీలవుతున్నది. ధనగర్వము, వర్ణద్వేషము, జాతీయత లేకపోవటము, సంప్రదాయ వైముఖ్యము ఈ నాలుగూ కలిసే టప్పటికి దేశం ఏమి కావాలో అదియైనది. ఈ లక్షణము లన్నీ దేశంలో ప్రతి చిన్న పల్లెటూరులోనూ చక్కగా ప్రతిబింబించటం మొదలు పెట్టినై. నాగరికత మంచిదో చెడ్డదో అతి చక్కగా సర్వగ్రామములందూ అభివ్యక్తమైతే ప్రతి గ్రామమూ తన్నాగరకతా ప్రతిబింబముగా వుంటుంది.నవాబు పాలెం దీనికి ప్రతిబింబము. తురకలకూ హిందువులకూ పడదు. హరిజనులకు తురకలకు పడదు.హరిజనులు మతముచేత హిందువులవైపు వాళ్ళల్లో క్రైస్తవులు కూడా వీళ్లైనంతమటుకు హిందువులవైపు. ఎందు చేతనంటే క్రైస్తవుల యొక్క ఆశ యేమిటంటే ఎప్పటికైనాసరే హిందువులనందరను క్రైస్తవులను చేద్దామని: తురక వాళ్ళను చేద్దామని వాళ్ళు అనుకోరు. ఎందుకనంటే వాళ్ళు గుడిలో లింగాన్ని మింగుదామనుకుంటే వీళ్ళు గుడినే మింగుదామనుకుంటారు. తురక వాడు చచ్చినా యింకొక మతం పుచ్చుకోడు. హిందువుడు పుచ్చుకొనేందుకు తయారు. కాని హిందువులలో కూడా కొందరు చావనైనా

చస్తారు కాని పెడమతం స్వీకరించరు. హరిజనులలోనే ఎంత మంది క్రైస్తవులైనారు? హరిజనులలో వైష్ణవులూ శైవులూ వున్నారు. వాళ్లల్లో మత సిద్ధాంతాలు జీర్ణించిన పండితులు వున్నారు. పూర్వం ఉండేవాళ్లు, ఇప్పటికైనా యింగువ కట్టిన గుడ్డలు చాలా ఉన్నవి. అందుచేత క్రైస్తవులకు సాధ్యం కాలేదు. సృష్టిలోనే ఈ చమత్కారం ఉందేమో. వందల యేండ్లుగా చిత్రవధచేసి బాధించి నిన్న కాక మొన్న హిట్లరు చేత దేశంనుండి వెళ్ళకొట్టించుకోబడ్డ యూదులనే సంపూర్ణముగా పాశ్చాత్య దేశీయులు నిర్మూలించలేక పోయినారే ఇప్పటికీ అక్కడ యూదులు వుండనేవున్నారే. ఇంక ఈ దేశంలో హిందూమతాన్ని సంపూర్ణముగా లేకుండా చేయడం ఎవరితరమౌతుంది ? అది భగవత్సంకల్పానికి వ్యతిరేకమైన విషయమేమో. ఏ దేశమైనా తాత్కాలికంగా లొంగిపోవచ్చు. అది రెండు మూడువందల యేండ్లు కావచ్చు. మళ్ళీ వాళ్ళు పైకివస్తారు. ఈ ఎగిరిన జాతి రెక్కలువిరిగి క్రింద పడుతుంది. ఇది సృష్టి రహస్యంగా కనిపిస్తుంది. ఎప్పటికప్పటికి ఈ మహారహస్యం తెలియని అల్పబుద్ధులు తమ సైన్యబలం చేత అధికార బలంచేత సృష్టిలో విప్లవాలు తీసుకువస్తారు. పరమేశ్వరుని సంకల్పము వారికి అనుకూలంగా అప్పుడుంటుంది. తరువాత ఆ యెద్దు కాడిని క్రిందపడవేస్తుంది. సామాన్యంగా అనేకచోట్ల ఈ దేశంలో తురకలుఎప్పుడో మూడువందల ఏండ్ల క్రింద రాజ్యం చేశామన్న దురహంకారం వదలి పెట్టుకోలేక

ఆస్తులు సంపాదించుకోలేదు. సంపాదించుకున్నా నిలవబెట్టుకోలేదు. వాళ్ళల్లో ఎక్కువ మంది పేదవాళ్ళుగానే వుంటారు. గుఱ్ఱపు బండ్లు తోలటం, చొక్కాలు కుట్టటం, పరుపులు కుట్టటం, చిన్న చిన్న పనులు చేయటం, రిక్షాలు లాగటం, కూరలమ్మటం, ఇలాంటి వృత్తులు చేయటం తప్ప పైకి పోరు. ఎందుకో తెలియదు. వాళ్ళు సహజంగా సోమరులు. జీవితము యొక్క గాఢత్వం వాళ్ళకు తెలియదు. వాళ్ళకుగాని క్రైస్తవులకు గాని వాళ్ల మతం ఆంతరంగా సగం బాహిరంగా సగం వుంటుంది. హైందవుల యొక్క మతం ఆంతరంగా తొంభై పాళ్ళుంటుంది. బాహిరంగా పదిపాళ్ళు ఉంటుంది. ఈ క్రైస్తవులు ముసల్మానులూ వాళ్ళ మతంలో సగానికి సగం ఇతర మతస్థులను తమ మతంలో చేర్చుకోవాలనుకోవటము. నిత్యమూ అప్రయత్నంలో వుండటము. దీనిని వాళ్లు హరిజనులతో చేయలేరు. ఎందుచేతనంటే తురకలు ఎంత కర్ర పుచ్చుకు బయలుదేరుతారో పంచములూ అంత కర్ర పుచ్చుకు బయలుదేరుతారు. ఈ పాలెమూ ఆగూడెమూ రెండు కూడా తాము బ్రతకటానికి ఆవూళ్లో వున్న హైందవులైన ధనవంతులైన వ్యవసాయదారులైన వర్తకులైనవారి మీదనే ఆధారపడివుంటారు. ఇట్లా వుండగా తురకలకు పీర్ల పండుగ వస్తుంది. ఉరుసులు వస్తాయి హిందువులకు దసరా ఉత్సవాలు వస్తాయి ఆశక్తి వేషాలతో వీళ్ళు ఊరేగేటప్పుడు వాళ్లు అల్లరులు సాగిస్తారు. కొట్టుకుంటారు పొడుచుకుంటారు. తలలు పగుల

కొట్టుకుంటారు. తురకల దాడికి కులస్థులైన హిందువులు పట్టు కోలేరు. హరిజనులు సాయం వస్తారు. నాలుగు రోజులు సాగుతూ వుంటుంది. అంతా సద్దు మణగిన తర్వాత పోలీసు వాళ్ళు వస్తారు. వాళ్ళకు కావలసినది. వాళ్ళు చేసికొని వెళ్తారు.

హరిజనులు హిందువులు తురకలు అహైందవులు హిందు వులు దూరంగా వుంచితే తురకలను వుంచాలి హరిజనులను కాదు. అస్పృశ్యత తురకల మధ్య హిందువుల మధ్య ఉండాలి ఇప్పుడు అస్పృశ్యత ఎవరి మధ్య వుంది ? హిందువులు హిందు వుల మధ్య ఉన్నది. నిజానికి న్యాయం కాదు. కాని మన తమ్ముడు చెడిపోయినాడు. వాణ్ణి వెళ్ళగొడ్తాం కాని చెడి పోయిన ప్రక్కయింటి వాడితో మనకేమి? వాణ్ణి రానిస్తాము. ఈ ఒక న్యాయమున్నదేమో. అయినా వెళ్ళగొట్టబడిన మన తమ్ముడు అవసరం వస్తే మనని ఆదుకుంటాడు. ఇంటికి రానిచ్చిన చెడిపోయిన ఆహారుగువాడు మనకు అక్కరకురాడు. పైగా తురకలు రాజ్యం చేశారు కనుక వాళ్ళని అస్పృశ్యు లుగా వుంచడానికి వీలులేక పోయింది. ఇంతకు పూర్వం వరకూ క్రైస్తవులు కూడా ఈ మర్యాదను పొందుతూ వుండేవాళ్ళు. ఇప్పుడెలా అయింది.అధికారంలోవున్న హరిజనులు స్పృశ్యులు, తక్కిన వాళ్లు అస్పృశ్యులు. ఇదంతా ఎందుకు చెప్పవలసి వచ్చినదంటే సోఫియా సేవకుడుగా తురకవాణ్ణి పెట్టుకోవలసి వచ్చింది.

## 2

క్రొత్తగా కుదిరిన సాయిబు బంట్రోతు పేరు జైనూరు. సామాన్యంగా సాయిబులలో యీ పేరు కొంచెం మర్యాదగల కుటుంబాలలో కాని ఉండదు. ఇతను అట్లా పుట్టినవాడే. వాళ్ల ఆస్తి అంతా పోయినది. బ్రాహ్మల, సాయిబుల ఆస్తి పోవటములో ఏమీ ఆశ్చర్యము లేదు. నూటికి కోటికి ఉండటమే ఆశ్చర్యము. బ్రాహ్మలు పప్పు దప్పళాల క్రింద దంచివేస్తారు. సమారాధనలు, సంతర్పణలు, సప్తాహాలు, పెళ్ళిళ్ళకు తుడిచి పెడతారు. సాయిబులు గుడ్డలకు పెడతారు. అత్తర్లకు పెడతారు. పలావులకు పెడతారు. ఈ జైనూరు తండ్రి అట్లా పాడు చేశాడు. అల్లాంటి వాళ్ళ సంసారాలలో పుట్టినవాళ్ళు గోచీకి పెద్దది. గావంచాకి చిన్నదిగా ఉంటారు. మర్యాదకల కుటుంబము అవటము మూలంగా పనికి చొరబడలేదు. తినటానికి ఉండదు. సాగదు. పైగా బోలెడంత టెక్కు. ఈ జైనూరు రిఖాలాగడు. వాడి మర్యాదకి నష్టము. ఇంక ఏమైనా పని

చేయాలంటే వాడికేమీ చేతకాదు. చివరకి యీ ప్రయాణీకుల బంగళాలో బంట్రోతుగా చేరితే చేసేపని యేమీలేదు మర్యాదకు భంగములేదు. పైగా నెలకు ముప్పై రూపాయలు. ఊరికే వస్తవి. ఈ సోఫియాలాంటి వాళ్లు వస్తే వాళ్లు ఊరికే డబ్బుయిస్తూ ఉంటారు. ఒక్కొక్క నెలలో గిట్టితే వందకూడా గిట్టవచ్చు అని, వాళ్లు వీళ్ళు నచ్చచెబితే కుదిరాడు. వాడిని చూస్తే నవాబు అనుకోవలసిందే తప్ప బంట్రోతు అనుకోవటానికి వీలులేదు. దానికితోడు అతను ఖట్టా ముసల్మాను. ఆరునూరైనా ఆ వేళకు నమాజు చేయవలసిందే శుక్రవారము సెలవు తీసుకోవలసిందే. ఇలాంటి వాటికి వప్పుకునే వాడిని తెచ్చారు. మరిన్నీ వాడికి ఆస్తిపోయినా వెల్వెటు, సిల్కు, బనారసు పట్టులుంగీలు పట్టు చొక్కాలు పెట్టెడు ఉన్నవి. అప్పుడప్పుడు కొన్ని అమ్మినా ఉన్నవే చాలా ఉన్నవి. గడ్డము మీసాలు వాడికి యిరువది నాలుగేండ్లు. వస్తాదువంటి వాడు. వాడు కుదిరాడు సోఫియాకి పనిచేసేటందుకు. వీడు కుదరక ముందు నాలుగురోజులు సోఫియాకి ఎట్లా గడచినవంటే—

పతంజలిశాస్త్రి ఊళ్లోలేడు. చిదంబరం ఎలాగైనా ఒకసారి తనయింటికి వస్తాడేమోనని యీమె ఎదురు చూచింది. అతను రాలేదు. సోఫియా మనస్సులో అనుకుంది. "సోమనాథము నన్ను ప్రేమించాడు. నేను లేకపోతే వాడి ప్రాణము పోతుంది. నేను చిదంబరాన్ని ప్రేమించాను. అతను లేకపోతే నా ప్రాణము పోతుంది. నేను వాళ్ళ యింటికివెళితే బాగుండ

దేమో ? ఆ కమల చండ ప్రచండురాలు. నేను వెళితే నా మొఖాన పేడనీళ్ళు చల్లుతుంది. పూటకూళ్ళ బసకి వెళ్లి తిన టము నాకు మర్యాద నష్టము" అని సోఫియా నవ్వుకుంది. మర్యాద అంటేఏమిటి? చాలామంది హోటలుకి వెళ్ళి భోజనము చేస్తారు వాళ్ళ మర్యాద ఎందుకు నష్టముకాలేదు? తన మర్యాద ఎందుకు నష్టమవుతుంది ? తాను బాగా చదువుకున్నది కనుక తనకు రెండువేలు జీతము వస్తుంది కనుక తానొక సేవకునిచేత అన్నం తెప్పించుకోగలదు కనుక తెప్పించుతోగలిగి తెప్పించుకో లేకపోవటము మర్యాదా నష్టమా! ఈ మర్యాద అన్నమాటకు అర్థము బలేగా ఉన్నది ధనము అధికారము, శక్తి, సంఘ గౌర వము, యివన్నీ కలిసి విడివిడిగాను మర్యాద అనేమాటయొక్క అర్థాన్ని భిన్నభిన్న స్థలాలలో భిన్న భిన్నంగా మారుస్తున్నవి. తాను చిదంబరము ఇంటికివెళ్ళి అన్నం పెట్టమంటే, చిదంబరం మొగమాట పడతాడు. కమల పెట్టనే పెట్టదు. పల్లెటూళ్లల్లో పూర్వము మాదిగ మాల పాలేళ్ళకు గుమ్మడాకులో అన్నము పెట్టి వీధి గోడదగ్గర పెట్టేవాళ్ళట. పాకీవాళ్ళకి యిప్పుడు కూడా అట్లాగే చేస్తున్నారు. హరిజనులలో పాకీవాళ్ళు లేరు. ఎంత స్వరాజ్యము వచ్చినా ఎంత ప్రజాస్వామ్యము వచ్చినా పాకీవాళ్ళకు సమాన ప్రతిపత్తిలేదు కాబోలు, ఏంచేయాలి ?" అని యెట్లా ఉంటుందో చూద్దామని చిదంబరం యింటికి వెళ్ళింది. చిదంబరం యింట్లో తన కవమానం జరిగినా ఫరవా లేదు ఈ అవమానం చమత్కారమైంది. అమర్యాద వంటిదే.

స్నేహితులు, బంధువులు తిట్టినా తప్పులేదు. వెక్కిరించినా తప్పులేదు. పరాయివాళ్ళు కొంచెము లఘువుగా మాట్లాడితే చాలు. అది అవమానముక్రింద లెఖ్ఖ. ఈనాడు వర్ణభేదాలు, కుల భేదాలు, శాఖా భేదాలు చెప్పరానన్ని ఉన్నవి. ఇన్ని ఉన్నా స్నేహితులు స్నేహితులు కూర్చుని ఈ భేదాలను గురించి ఉటంకించు కుంటూనే ఉంటారు. అక్కడ ఏమీ తప్పులేదు. ఈ తప్పు అంతా పత్రికలలోకి వచ్చేటప్పటికి వస్తుంది. నలుగురు స్నేహితులు కూర్చుని వాళ్లు మాట్లాడుకునేటప్పుడు ఈ శాఖల పట్టింపు లేకుండా మాట్లాడుకుంటూరు. ఇలా మాట్లాడు కున్నారు అనే విషయం ఒక కథగా వ్రాస్తే అది సహజంగానే ఉంటుంది మరి. కాని ఒకకొకిబికి మతివాడు ఆడుగో అడుగో ఇతను భేదాలు పాటిస్తున్నాడు అని ఆరాతీస్తాడు ఇల్లా ఉంటుంది. మొత్తానికి అవమానమనేది మనము బుద్ధిపూర్వ కంగా ఘటించుకునేది తప్ప దేనిలోనూ లేదు. మర్యాద కూడ యిట్టిదే. అస లీసంఘంలో ఉండే దుర్వేషాలల్లో నూటికితొంభై యిలా వ్యర్థంగా కల్పించుకున్నవే. కొన్నింటిని మరీ కాదన టానికి వీల్లేదు. కాని చాలా భాగము మనుష్యుడు తన దుర హంకారముచేత గర్వముచేత తెచ్చుకుంటాడు.

సోఫియా చూదామ అని వెళ్లింది. భోజనము వేళ వెళ్లింది. వీధి అరుగుమీద కూర్చుంది. పైన నసారా ఉన్నది. చిదంబరము అప్పుడే భోజనము చేశాడు. ఆనాడు ఆదివారము చూచాడు. మోస్తరు చూస్తే భోజనం చేయనట్లున్నది. అడ

గాలా అక్కర్లేదా ? అడక్కపోటం హిందూ ధర్మముకాదు. ఆకలి అవుతున్న వాళ్ళకి అన్నం పెట్టటంకంటే అధిక పుణ్యం లేదు. భాగవతంలో రంతి దేవుడి కథ ఉన్నది. ఈ రంతిదేవుడు మహాయజ్ఞాలుచేసి అంతా దానముచేసి పారేసి నిర్ధనుడై తిండికి కూడా లేక ఎక్కడో అన్నము సంపాదించి తినబోతూ ఉంటే దానశీలాన్ని పరీక్షిద్దామని ఇంద్రుడు ఒక బ్రాహ్మణ వేషముతో వచ్చి ఆకలి అవుతున్నదన్నాడు. రంతిదేవుడు ఆ అన్నము అతనికిచ్చేశాడు. ఆయన ఉన్న దేశంలో మంచినీళ్ళుకూడా దొరకవు. పాపమా రంతిదేవుడు మంచినీళ్ళు త్రాగటానికి సిద్ధమవుతున్నాడు. ఇంతలో మళ్ళీ ఇంద్రుడు ఒక మాలవాడుగా వచ్చి ఓ అయ్యా ! నాలిక ఎండిపోతున్నది కొంచెము అన్నము ఉంటే పెట్టించుబాబు. అన్నము లేకపోతే కాసిని మంచి నీళ్ళన్నా యివ్వమన్నాడు. ఏమి చేస్తాడు రంతి దేవుడు ? "అన్నములేదు. కొన్ని మధురాంబువు లున్నవి, త్రాగుమన్న, రావన్న, శరీరధారులకు నాపదలైనెడ వారి యాపదల్ క్రన్నన మాన్పి వారికి సుఖం బొడ కూర్చుటకంటె ధాత్రి మేలున్నదె" అని ఆ మంచినీళ్లు ఆ పుల్కసునకు యిచ్చివేశాడు ఇది భారతదేశ ధర్మము. చిదంబరం "భోజనం చేయనట్లున్నదే" అన్నాడు. ఆమె చెయ్యలేదు. మీయింటికే వచ్చాను. మీ ఆవిడ నాకు అన్నము పెట్టదని తెలుసు. నేను పంచమురాలిని. అయినా ఆకలి అవుతున్నది. అన్నము పెడితే తింటాను. విస్తరి నేనే ఎత్తివేసుకొంటాను. పసుపునీళ్లు చల్లుకోమను"

అన్నది. ఏం చేస్తాడు ? నోరు విడిచి చెబుతున్నది. ఇంట్లోకి వెళ్ళాడు. కమల తాను పెట్టనంటే పెట్టనన్నది. చిదంబరం తాను పెడతానన్నాడు. కమల "మీరు పెట్టినా పనికిరాదు. క్రొత్త యజ్ఞోపవీతము వేసుకోవాలి. స్నానము చేయాలి. సహస్ర గాయత్రీ చేయాలి. అన్నది. చేస్తానన్నాడు" చిదంబరం, వీలులేదన్నది. కమల మాలదానికి విస్తట్లో ఎట్లా వడ్డిస్తారు అన్నది ? చిదంబర మన్నాడుగదా "కొంచెము శాంతముగా ఆలోచించు ఇందులో చాలా సూక్ష్మ ధర్మాలు యిమిడి ఉన్నవి. ఆవిడ వెళ్ళి హోటలులో భోజనం చేయవచ్చు. అది ఒక అమర్యాదా ఇని యిక్కడికి వచ్చింది. నీ అన్నగారు సోమనాథం ఆవిడ తిండితిన్నాడు, ఇక్కడ తినటమేకాదు. అక్కడికి పోయి తిన్నాడు. ఇది హరిజనుని చేసుకుంటే అతను హరిజనురాలిని చేసుకునేటట్టున్నాడు. ఇదివరకే చేసుకున్నాడోయేమో తెలియదు మతాలు మారినంత మాత్రంచేత బంధుత్వాలు పోవు. ఇక్కడున్నన్నాళ్లు మీ అన్నయ్యకు ఆమె అన్నం పెట్టింది కాబట్టి సరిపోయింది, లేకపోతే మన యింటికి వచ్చేవాడు. అన్నం పెట్టేదానవా ? పెట్టని దానవా ? అసలు వాళ్ళల్లో జొరబడి తినడమేతప్ప, పెళ్లి చేసుకోలేదు కనుక కులభ్రష్టుడు కాలేదంటావా ? నేనెరుగుదును ఈ దేశములో చాలామంది క్రైస్తవమతం పుచ్చుకున్నారు. బ్రాహ్మణులే పుచ్చుకున్నారు. మొట్టమొదట నాలుగైదేళ్లు వాళ్ళు వీళ్ళు ఎడమొఖముగా పెడమొఖంగా ఉండటము. తర్వాత వాళ్ళు

వీళ్ళ యింటికి రావటం సావడులలో అన్నాలు పెట్టడం చాలా యిళ్ళల్లో జరుగుతున్నది. వంగదేశములో యిది చాలా ఎక్కువ అట, కొడుకు వెళతాడు. ఎవతెనో పెళ్ళి చేసుకుంటాడు. నాలుగేళ్ళు రానివ్వరు. తరువాత వాళ్ళు వస్తారు. కోడలుకి చీరెలుకూడా పెట్టి పంపిస్తారు. వాడు వర్ణం చెడ్డవాడు గనుక వాడికి పెద్దపెద్ద ఉద్యోగాలు వస్తవి. ఈ వర్ణం లోనే పెళ్ళి చేసుకున్న కొడుకుల పిల్లలు ఉంటారు. వీళ్ళకు ఉద్యోగాలు కావాలంటే క్రైస్తవమతం పుచ్చుకున్న ఆ పిన తండ్రి ఉన్నాడు కదా! ఆయన దగ్గరకు వెళతాడు. అన్న కొడుకని ఉద్యోగము యిప్పిస్తాడు. కనుక యిదంతా మన మేమీ చెప్పలేము. నా ఉద్దేశ్యంలో ఈ కాలంలో మతమంటే మనం మడికట్టుకుని మన జపం మనం చేసుకోవటము, భగవం తుడ్ని ధ్యానం చేసుకోవటం, సత్యం, అహింస, దాక్షిణ్యము న్యాయము మొదలైన గుణాలను సాధ్యమైనంతవరకు వదలి పెట్టకుండా నడుస్తూ ఉండటం అని నా ఉద్దేశ్యము. ఇంకొక విధంగా ఈ రోజులలో సాగదేమో అని నా ఉద్దేశ్యం. మీ అన్నయ్య చెడిపోయినాడేమో అని అనుకుందాము. అతను బాగుపడాలి అంటే, బాగుపడటం అంటే లౌకికంగా బాగు పడటం. సోఫియా సాహాయ్యం చేయకపోతే బాగుపడడు. మనం వీరవ్రత మవలంబించి అన్నం పెట్టకుండా అవమానంచేసి పంపిస్తాము. ఆవిడకు కోపము వస్తుంది. ఆవిడ అంటే రంగన్న షాహుకారు మొదలైనవాళ్ళు గౌరవముగా ఉంటున్నారు.

మనం ఆవిడను అవమానంచేస్తే వాళ్ళకు మనమీద అభిమానం పోతుంది. నా ఉద్యోగం వాళ్ళ దయమీద ఆధారపడి ఉన్నది. మరిన్నీ కొందఱు జన్మచేత బ్రాహ్మణులు. చెడిపోయినమాట నిజమే. జన్మచేత బ్రాహ్మణులైన వాళ్లు జన్మచేత కాని వాళ్లు ఒకటే నంటావా ? మన ధర్మశాస్త్రాల్లో మరీ గౌతమ ధర్మ సూత్రాలల్లో ఒక బ్రాహ్మణుడు ఒక క్షత్రియ స్త్రీని పెండ్లి చేసుకుంటాడు. జన్మించినవాడు బ్రాహ్మణుడేనట. ఇలా ఏడు తరాలవరకు బ్రాహ్మణ్యం పోదన్నారు. దాని దుంపతెగ స్త్రీకి ఆ జన్మకైనా కొంత కాకపోతే కొంతైనా బ్రాహ్మణ్యం నిలవదా ? మన పతంజలి శాస్త్రిగారే ఆవిడ యింటికి వెళ్ళి మాట్లాడి వచ్చారు. ఆవిడ చాలా పండితురాలన్నారు."

చిదంబరం యిలా చెబుతూనే ఉన్నాడు. విస్తట్లో అన్నం వడ్డిస్తూనే ఉన్నాడు. ఆధరువులు వేస్తున్నాడు. కమల ఏమీ మాట్లాడటం లేదు. ఆధరువులు అవీ అతనే వేశాడు. విస్తరి తీసుకు వెళ్ళి సావిట్లో పెట్టాడు. రమ్మన్నాడు. సోఫియా వచ్చి కూర్చుంది. మంచినీళ్లివ్వబోతుంటే కమల అన్నదిగదా యీ చెంబులతో వద్దు ఆ పని చేసేదాని గ్లాసు ఉన్నది. దానితో యివ్వమన్నది, చిదంబరం అట్లా చేయటం తప్పు. అంతగా కాదంటే ఆ చెంబు ఎవరికైనా యిచ్చివేద్దాములే అన్నాడు. సోఫియా భోంచేసింది. ఆ విస్తరిని పనిచేసేదాన్ని ఎత్తమంటే పనిచేసేది ఎత్తనన్నది. సోఫియా అన్నది కదా " మొగవాళ్ళు భోంచేసిన విస్తళ్లు ఆడవాళ్లు ఎత్తుతారు గాని, ఆడవాళ్ళు

భోంచేసిన విస్తళ్లు వాళ్ళే యెత్తుకుంటారు గదా" అనీ అన్నది. అని విస్తరి యెత్తివేసుకున్నది. కమల తాను భోంచేసి అక్కడ పసుపునీళ్లు, పేడనీళ్ళు పదిసార్లు పెట్టి ఆ చెంబు నిప్పుల్లో దొర్లించి నానా హంగామా చేసింది. సోఫియా మూడురోజులు యిల్లాగే భోంచేసింది. కమల ఏమిచేస్తుంది ? చెంబు నిప్పులలో దొర్లించటంపోయి తోలవటం కాడికి వచ్చింది. మరిన్నీ యీ మూడు రోజులలో ఒక చమత్కారం జరిగింది. సోఫియా జాతకం చెబుతుంది. చేతులు చూస్తుంది. నాల్గవరోజున కమల చేయి చూచింది. పిల్లల చేతులు చూచింది. దివ్యంగా చెప్పింది. సోఫియా మీది ద్వేషం సగానికి సగం తగ్గింది.

# 3

పతంజలిశాస్త్రి వచ్చి మళ్ళీ ఉపన్యాసము ప్రారంభించాడు.

గిరీశశబ్దము గ్రీసుగా మారింది. గిరీశుడనగా శివుడు శివప్రసాదము వలన ఆ రాజ్యము వృద్ధిపొందింది. శివప్రసాద మంటే వారు శివారాధకులని కాదు. శివశక్తిని సమారాధించే వాళ్లు అనవచ్చు. శక్తి శివాధీనమై ఉంటుంది శక్తిని ఆ పేరు పెట్టి నీవు పిల్చినా శక్తే పేరుపెట్టకపోయినా శక్తియే. లోకములో ఇన్ని మతాలున్నవి. అందఱు భగవంతుణ్ణి ఆరాధించే వారే. భగవంతుడొక్కడు అనుకునేవాళ్ళే. రాజు ఒక్కడై రాజోద్యోగాలు లక్షమందికి ఉంటే తత్తత్ ప్రయోజనాలకు తత్తత్ అధికారుల నెట్లా ఆశ్రయిస్తామో రాజ్యమెట్లాంటిదో సృష్టి అట్లాంటిదే అని తెలిసికొంటే అల్పశక్తులు కలిగిన యితర దేవతలను కూడా జనులు ఆరాధిస్తారు. మాకు ఒక్కడే భగవంతుడు వాళ్ళకు చాలామంది దేవతలు ఉన్నారు అనే వాళ్ళు ప్రపంచాన్ని సరిగా తెలుసుకోలేనివాళ్ళు. నేను రాజు

నొక్కణ్నే కొలుస్తాను. అధికారులంటే నాకు లెఖ్కలేదు. అనుకునేవాడి పనులు యెన్నైనా చెడిపోవచ్చు. రాజ్య మెట్లాగు సాగుతుంది. కనుక ఉద్యోగస్థులందఱు వాళ్ల వాళ్ళ ధర్మాలుచేస్తూ ఉంటారు గనుక సాగుతూనే ఉంటుంది. కాని తత్తదధికారుల నాశ్రయించటముచేత అధిక ఫలము నిస్సంశ యముగా వస్తుంది. ఆ దేవుడిని నమ్ముకుంటే మోక్షము వస్తుం దంటే యీ దేవుళ్ళను నమ్ముకుంటే లౌకికమైన సుఖసంపాదన జరుగుతుంది. మోక్షమార్గము సులభమవుతుంది. ఒక జంతు ఉన్నది. ఒక వృక్షమున్నది. వీటికి భిన్న దేశములయందు భిన్న నామములుంటవి.శీతోష్ణ పరిస్థితులు గ్రహించటముచేత జంతువు వృక్షము ఒకటే జాతియైనా ఆకారాలలో కొంత భేద ముంటుంది. సింహము హిందూదేశములోను ఉంది. ఆఫ్రికా లోనూ ఉంది. కాని ఆఫ్రికా సింహాలకీ హిందూదేశపు సింహాలకీ భేదాలున్నవి. అలవాట్లల్లో కూడా భేదాలున్నవి. అలాగే దేవతలను గురించి భావించేటప్పుడు దేవతలయొక్క రూప నిర్మాణాలు వాళ్ళను గుఱించి భావించే మనుష్యులయొక్క ఊహలను బట్టి ఆ ఊహలు వీళ్ళ ఆహార ఆచారాలనుబట్టి ఉంటవి. ఒకడే దేవుడు అన్నవాడు కామక్రోధ దూషితుడే. వందమంది అన్నవాళ్ళు కామక్రోధ దూషితులే. ఈ కామక్రోధ దూషితత్త్వము మానవుడు తనకున్నదానిని దేవతలకు కూడా ఆరోపిస్తాడు. ఈ కామ క్రోధాదులు విరోధులు. వీటిని జయిం చాలి అని యే జాతి అనుకొంటుందో ఆ జాతియొక్క దేవతలు

కూడా కామ క్రోధ సహితులుగా నిర్మింపబడ్డా, ఈ ఫలితము లను ఆ దేవతలుకూడా అనుభవించేటట్లు చేస్తారు. ఈ యింద్రియ జయము మోక్షమునకు ప్రధాన విషయము అనే అభిప్రాయము లేనివారు పూర్వము మన రాక్షసులవలె శక్తి కొఱకు శివుడిని ఉపాసిస్తారు. రావణాసురుడు, బాణాసురుడు శివుడిని ఆరాధించారు. దేనికొఱకు ? శక్తి కొఱకు. శక్తి అంటే బాహు బలము, సంపద, శత్రువులను గెలవటము యితర రాజ్యాలను ఆక్రమించటము-యిటువంటివి. ఆరాధన రెండు విధాలు. ఒకటి మానసికంగా ఆరాధించటం. మనస్సును నిలబెట్టి మంత్ర తంత్ర ములతో యోగములు చేస్తే ఒక శక్తి వస్తుంది ఒక సిద్ధి వస్తుంది. రెండవది శారీరకంగా వ్యాయామము చేస్తే అభ్యాసముచేస్తే శరీరబలము సమకూరుతుంది. ఒక వ్యక్తికి యిల్లా సమకూరినట్లే ఒక సంఘంలో యువకులందఱు కలసి వ్యాయామము చేసి శిక్షణ పొందితే ఆ సంఘానికి బలము వస్తుంది. అట్లాగా రాజ్యవిషయములో కూడాను పెద్ద సేనను తయారుచేయు వాళ్ళందరను శిక్షించు. ధైర్యవంతులనే ఎన్నుకో. దేశభక్తి. రాజభక్తి కలవాళ్ళనే ఎన్నుకో. అడుగు వెనుకకు తీయని సాహసులను యెన్నుకో. వాళ్ళను వరుసలో నడిపించు. శత్రువులను సులభంగా ఎదుర్కొనటానికి వీలైన ప్రదేశంలో నిలబెట్టు. గెలుపు సిద్ధి అవుతుంది. ఇదియంతా శక్తిని ఆరాధించటమే. అల్లాగే ఒక కవి శబ్దార్థాలు తెలిసికొని ఛందస్సు తెలిసికొని అభ్యాసము చేసికొని గొప్పకవి అవుతాడు. ఇదంతా

కవిత్వం వ్రాసేందుకు శక్తిని సంపాదించటం. సర్వ మానవు లకు యీ సాధన ఉండనే ఉన్నది. ఆ దేశము గిరీశదేశ మవ టంతో గిరీశ శబ్దార్థము శివుడవటంతో శక్తి ఆయనవెంట నిత్యము ఉండటంతో గ్రీసుదేశంవాళ్ళు ఒక గొప్పస్థాయిని అందుకున్నారు నువ్వు అనుకోకపోయినా శక్తి శక్తే. భగ వంతుడు భగవంతుడే. అందుకనే పుష్పదంతాచార్యులవారు "ఓయి శివా ! నీవు ఎటువంటివాడవో నాకు తెలియదు. ఎటు వంటివాడవో అటువంటివానికి నమస్కారము చేస్తున్నాను" అన్నాడు. ఈ గిరీశదేశ వాసులు ఎవరు అంటే యిదమిద్ధమని చెప్పలేము. హోమరు వ్రాసిన 'ఇలియడ్' అనే గ్రంథంలో ఈజియనులు అని ఉన్నది. అనగా ఈ జనులు. ఇకారము శక్తి వాచకము. అక్షర నిఘంటువుచూస్తే ఇ అనగా శక్తి అని అర్థము. అనాదిలో వీళ్ళు శక్త్యుపాసకులై ఉంటారు. శక్తి అనగా లక్ష్మి. హ్రస్వ ఇకారమునకు శివుడని అర్థము. దీర్ఘ యీకారమునకు లక్ష్మి అని అర్థము. వాళ్లు ఈ జనులు, వాళ్లు గ్రీకులు ఒకటవునో కాదో తెలియదు, కాని తాము తాము ఒకటే ననుకున్నారు. ఇంక వాళ్ళ దేవతలు బలిశారు. వాళ్ళు ఎటువంటి వాళ్ళో ఆ దేవతలు అట్లాంటివాళ్ళే. సహజమే కదా ! ఈ దేవతలు రకరకాలైనవాళ్ళు. అపోలో అని ఒక దేవత. వాడు డాఫ్ని అనే ఒక దేవతాకన్యను తరిమాడు. చివరకది పారిపోయి ఒక పుష్ప నికుంజముగా మారిపోయింది. వాళ్ళ దేవతల కందరికి ఒక రాజు ఉన్నాడు. అతనిపేరు

జ్యూసి. ఇది శ్రీశశబ్ద భవము. ఆ దేవుడు ఎంతమంది స్త్రీల మానభంగము చేశాడో చెప్పటానికి వీల్లేదు. ఈ కథను చూస్తే కృష్ణుడు పదహారువేల గోపికలు కథని దురర్థం చేసికొన్న జాతియొక్క కల్పన అనిపిస్తుంది. ఎఫ్రొడైట్ అన్న ఆవిడ ప్రేమ దేవత. ఒక అందవికారియైన కమ్మరిని పెళ్లిచేసికొన్నది. భర్త యింట్లో లేనప్పుడు యుద్ధదేవతయైన అరిస్ అనేవానితో సుఖమనుభ విస్తున్నది. అని కమ్మరివాడు అయిన ఆ దేవత కనుమానము. వాడు వీళ్లిద్దరిని ఒక వలలో పట్టాడు. అందలు దేవతలను పిలిపించి చూపించాడు. వాళ్లు కోపపడటానికి బదులు హాస్యరస మనుభవించారు. ఈ కథ చూడండి. ఎంత విచిత్రముగా ఉందో ! పాపమనేభావము లేదు. దానికి శిక్ష లేదు. వాళ్ళందరికి నవ్వులాటగా యున్నది. ఇల్లా మన పురాణాలలో ఒక్క కథఅయినాలేదు. వీటి వెనుక ఉన్న చమత్కారమేమంటే ఒక్కొక్క జాతియొక్క మతంగాని వాళ్ళ సిద్ధాంతాలు కాని వాళ్ల దేవతలు కాని జాతిలక్షణాన్ని పరచి పర్చ్రరచుకొంటారు. ఈ జాతి లక్షణాలకు ఆ భావనిర్మాణ సంపుటికి అవి నా భావ సంబంధంగా ఉంటుంది. అది పరంపర పుతుంది. పూర్వజన్మలు పరజన్మలు లేవు అని నీవొక సిద్ధాంతం పెట్టుకున్నావనుకో - ఫలితమేమవుతుంది ? ఎవడుపడితే వాడు యీ అనంత కాలంలో అనంతదేశాలలో ఒక్కసారే పుడతాడు. చిన్నప్పుడే చస్తే పీడ వదలిపోతుంది. డెభ్భై ఎనభై యేళ్లు బ్రతికితే ప్రతి మనుష్యుడు సర్వసుఖాలు అనుభవించాలి గనక

సర్వ వాంఛలు తీర్చుకోవాలి గనుక అనంతకాలానంత దేశము లందున్న సర్వ వాంఛలు సర్వసుఖాలు వాడికి ఆ జన్మలోనే తీరాలి గనుక వాడి ఆరీతి ప్రవర్తన కవధి ఉండదు. ఇది ఒక జాతి లక్షణమైతే సృష్టిలో వాళ్ళ వల్లజరిగే ఘోరాలకు అవధి ఉండదు. ఇట్లా ఒకజాతి నిర్మించుకొన్న మతము, మతసిద్ధాంతతాలు, దేవతాభావనా, నీతి భావనా వాటిమీద ఆ జాతి యొక్క ప్రవర్తన సాగుతూ ఉంటుంది. ఇప్పుడు యీగిరీశ దేశము వాళ్ళ కథవల్ల యేమి తేలుతున్నది ? వివాహమన్నది యేదో సంఘంలో అవసరమైన ఒక నియమమే తప్పదానికి పెద్ద పట్టింపులేదు. ఆ హెఫాస్టసు తన భార్యని, తన రంకు మగనిని పట్టుకున్న తెలివి తేటలకు వాళ్లు సంతోషించారు కాని, యింకొకటి చేయలేదు. వాళ్ళ మతము యిదివరకు మనము తెలిసికొన్న అన్ని నాగరక జాతులమతము కంటె, లోచైౘన మత మని చెప్పాలి. కాని తత్పూర్వ నాగరకతల పాండిత్యాలేమిటో శాస్త్రాలేమిటో వాళ్ల శిల్పులెవరో వాళ్ళ సాహిత్యాలెట్లాంటివో ఏమీ తెలియవు. చాలా కొంచెం తెలుసు. ఈ జిప్టులో కొందరు శిల్పులు ఉన్నారు. వాళ్లల్లో ఒక పెద్దశిల్పి నీలాహారీ జలమును పెద్ద తటాకంగా నిర్మించాడు ఆ చనిపోయిన రాజుల శవాలు చెడిపోకుండా ఓషధులు కని పెట్టారు. ఆ మహోన్నత గోళాకృతి సమాధులను నిర్మించ టానికి గొప్ప గణితశాస్త్ర పరిజ్ఞానం కావాలి. ఆ మొదలైన విద్యలన్నీ ప్రకాశించిన గొప్ప శిల్పులు వాళ్లల్లో ఉండేవారు.

అలాగే సుమేరియా దేశంలో కూడా గొప్ప గొప్ప శిల్పు
లున్నారు మహా పండితులున్నారు. పార్థినాన్ అని ఒక పెద్ద
కట్టడమున్నది. ఆ గోడలు పలకలు పలకలుగా కట్టారు. నిజా
నికి అన్నీ వంగిఉంటవి. చూడటానికి నిలువుగా ఉన్నట్లు
కనిపిస్తవి. ఆ పనితనము ఆ మహా శిలలను పైకియెత్తటం
ఆ స్తంభనిర్మాణము ఆ బిలుగుపని ఆ సర్వనాగరకతలలో
చూస్తే వాళ్ళ శిల్పాదిశాస్త్ర పరిజ్ఞానం ఏదీ తక్కువదికాదని
పిస్తుంది. ఇహా యిట్లా ఉండగా ఈ గిరీశదేశవాసుల విశేషమే
మిటంటే వాళ్లు వ్రాసిన అనేక గ్రంథాలు యిప్పుడు లభ్య
మానములై ఉన్నవి. అందుచేత వీళ్ళకే వ్రాయటం తెలుసు
వీళ్ళకే చదువువచ్చు; వీళ్లకే లిపిజ్ఞానముఉన్నది;అని పాశ్చాత్యు
లనుకోటం జరిగింది. ఎంతమటుకు తెలిస్తే అంతమటుకే
మనకు తెలియటం యింతవరకు తెలిసింది అనుకోవాలి తప్ప
మనకు తెలియనిది లేదనుకోవటం ఏమి జ్ఞానం ? కళ్ళతో
చూచినది ఉన్నది అని చెప్పటానికి నీవు కావాలా ? ఇది
ప్రత్యక్ష ప్రమాణవాదుల అవివేకము యొక్క పరమార్థము.
ఈ గిరీశదేశవాసులలో హోమరు గొప్పకవి ఉన్నాడుకదా !
నాటకకర్తలు సాహిత్యవేత్తలు వేదాంతులు చరిత్రకారులు
తత్త్వవేత్తలు ప్రకృతిశాస్త్ర పరిజ్ఞాతలు వందలకొద్దీ ఉన్నారు
వాళ్ళన్నీ వ్రాశారు. వాటి నన్నింటిని పాశ్చాత్యులు మిగుల్చు
కొన్నారు. పాశ్చాత్య నాగరకతకు వాళ్ళ గ్రంథాలే మూలా
ధారము. పాశ్చాత్యుల నాగరకత అంతా గ్రీకు నాగరకత.

వాళ్ళ మతమంతా పాలస్తీనా మతం. ఈ సర్వ నాగరకతలు భారతదేశంనుండే వెళ్ళితే పాశ్చాత్య నాగరకత క్రొత్తగా మొలుచుకువచ్చినట్లు కాదు కదా ? ఈ పాలస్తీనా గిరీశదేశ నాగరకతలో చెబితే దాని స్వరూపము తెలిసికుంటే పాశ్చాత్య నాగరకత బండారం బయటపడుతుంది. ఒక జాతియొక్క నాగరకత వాళ్ళ మతము వాళ్ళ సిద్ధాంతాలు వాళ్ళ జీవితం అన్నీ అవినాభావా సంబంధంగా ఉన్న జాతి సంపూర్ణజాతి. మన దేశంలో వేదశాస్త్ర పురాణములు పునాదులు. మతాలు అందులోంచి పుట్టినవి. వేదాన్త మందులోనుంచి పుట్టింది. సంఘ నిర్మాణ మందులోంచి పుట్టింది దైనందిన జీవిత మందు లోంచి పుట్టింది, వేదశాస్త్ర పురాణాది మహాగ్రంథ సముదా యములోనుంచి మహార్థ ప్రతిబింబముకాని మానవజీవితము అణుమాత్రమైన యథార్థమైన భారత దేశమునందులేదు. పరమత పరసిద్ధాంత వ్యామోహముచేత సంక్షుభితులైన జనం మాటతీసి అవతలపెడితే ప్రాతఃకాలము నిద్రలేచి నప్పటినుండి మళ్ళీ నిద్రపోయేవరకు ఎన్ని లిప్తలు ఉన్నాయో అన్ని లిప్తలు మానవుల ప్రవర్తన భిన్న వర్ణముల నాశ్రయించి భిన్న దేశముల నాశ్రయించి భిన్న ఆచారముల నాశ్రయించి వేద ముపదేశించిన మార్గానికి సూటిగా ఎదురుగా వెళ్ళటమే. అదే పరమ ప్రయోజనం. మనము ఎన్ని నాగరకతలను గురించి ఎన్ని దేశాలనుగురించి ఎన్ని వేలసంవత్సరాలను గురించి చదివినా మిగిలిన దేమిటి ? అవి యేమీ మిగలలేదు. అట్లాగే

యిదివేమీ మిగలదు. ఈ మహార్ధం ఒక్కటీ తెలిసికోకపోతే దాని నాగరకత అన్నీ ఎందుకు చెప్పాలి ? అని రమెందు కనాలి ? ఈ మహార్ధం తెలియనివాళ్ళు ఏదో బావు కుందామని ప్రయత్నం. బావుకుందామని పూర్వం ప్రయత్నం చేసిన వాళ్ళ తత్కాల విజృంభణను వ్రాసి చదివి బుణాలు పొందించు కోవటం, తామల్పజ్ఞులై ఇతరులను తమకుమల్లే అల్పజ్ఞులనుగా తయారు చేయటం

# 4

గ్రీకుల నాగరికతను గురించి ఎక్కువగా తెలిసికోవాలి. వాళ్ళకు యింత ప్రాముఖ్యము రావటానికి కారణాలు రెండు ఉన్నవి. మొదటిది ఏమిటంటే భారతదేశము యొక్క పడమటి భాగాన్నుండి అనగా నేడు హిందూకుష్ పర్వతములు అనేచోటునుండి మధ్యధరాసముద్రము దాకా ఉన్న సర్వ భూభాగము క్రమక్రమంగా పర్షియనులు అనే జాతి వాళ్ళ అధికారం క్రిందికి వచ్చింది. అది పెద్ద మహాసామ్రాజ్యమై వచ్చింది. ఒక్క భారతదేశాన్ని మినహాయిస్తే ఆసియా ఖండమంత పర్షియనుల వశమైపోయినది. అనగా జంబూ ప్లక్ష ద్వీపములు అనిపించుకునే భూభాగమంతా వాళ్ల చేతులలో ఉన్నది. ఇలా ఉండగా ప్రస్తుతం యూరపు అనిపించుకునే భూభాగానికి కుశ ద్వీపమని పేరు. ఈ పర్షియా రాజులు కుశ ద్వీపాన్ని కూడా తమ వశం చేసుకుందామని నిత్యం ప్రయత్నం చేస్తూ ఉండేవాళ్లు. ఆ ప్రయత్నాన్ని గిరీశ దేశవాసులు అనగా

గ్రీకులు సంపూర్ణంగా విఫల పరచారు. పరచటమే కాకుండా పర్షియనుల సామ్రాజ్యాన్నే నాశనముచేసి పారేశారు. దీనితో యూరపునకు ఒక వ్యక్తిత్వం వచ్చింది. ఆ యూరపులో పెరిగిన నాగరికత ఒక ప్రత్యేకత కావటానికి అని అనుకోవటానికి వీలి చ్చింది. పర్షియా అనగా పార్శ్విక దేశము. భారతదేశ మహా నాగరికతకు అది పార్శ్వము నందున్నది ఈ పార్శ్వక శబ్దము వకారాన్ని పోగొట్టుకుని పార్షి అయినది. అది పర్షియా అయినది. ఆ పూర్వ భాషలన్నీ సంస్కృత భాషాజన్యములు గనుక దేశవాచక శబ్దానికి చివర స్త్రీ లింగ ప్రత్యయాలని కలుపుకునేవి. యీ లక్షణం యిప్పటికి రష్యనుల భాషలో ఉన్నది. ఫ్రెంచి భాషలో కూడా ఉన్నది. భిన్న కాలములయందు భిన్న జాతులు శబ్దములను ఉచ్చరించటంలో నానా మార్పులు వస్తవికదా! ఆ లెఖ్ఖలో పార్శ్వ శబ్దములో వకారము పోయి నది. పార్ష శబ్ద మయింది స్త్రీలింగ ప్రత్యయము చేర్చినది. పర్షియా అయినది. ఆసియా ఆశాశబ్దమునకు ఇయా చేరితే అయింది. సైరంధ్రీ శబ్దమున్నది సైర్వరముగా ధరించు చున్నది అనే వ్యుత్పత్తిచేత సైరంధ్రీ అయినది. మొదటి వకారము పోయినది. ఈ గిరీశదేశములో పట్టణములు ప్రబలి రాజ్యము లైనవి. ఏథెన్సు అన్న రాజ్యము బాగా ప్రశస్తిలోకి వచ్చింది. గిరీశ దేశములో అన్నీ నగర రాజ్యములు. ఈ గిరీశ దేశము కుశ ద్వీపములో మరికొన్ని పట్టణాల నాక్రమించి తన సామ్రాజ్య చిహ్నాలని యూరపులో నెలకొల్పింది. పడమట

శిశిర ద్వీపంలో సైరక్యూస్ అనే ఊరు, అక్రగాస్ అనే ఊరు గ్రీకులయొక్క రెండు దుర్గాలుగా ఉండేవి. ఆ నగరంలో ఈ నగరంలో కూడా యిరవై వేల యిరవై వేల పౌరులుండేవాళ్లు. హెల్లాన్ అనే పెద్దనగరం ఉన్నది. గ్రీకులు తమ నాగరికతను హెల్లాన్‌నాగరికత అని పిలుచుకునే వాళ్ళు ఏథెన్సు తరువాత సైరక్యూస్ గొప్ప. గిరీశ గొప్పనాగరికతా మూలస్థానమైంది. ఇటలీలోని దక్షిణ భాగమంతా గ్రీకుల వశమైంది.

పాశ్చాత్యుల సర్వ విద్యలు సర్వ నాగరికతా గ్రీకుల నుండి పుట్టినవి. ఆ గ్రీకులయొక్క సర్వవిద్యలు నాగరికతలు ప్రాశ్చ్య దేశస్థులనుండి పుట్టినవి అని గ్రీకులే వప్పుకున్నారు. వాళ్ళ ప్రకృతి శాస్త్రజ్ఞానము వాళ్ళ శిల్పములు వాళ్ళ వృత్తులు అన్ని ప్రాచ్య దేశమునుండే వెళ్ళినవి. వాళ్లు కొంత వృద్ధిచేసుకున్నారు.

ఇలా ఉండగా ఏ జాతిలో బైబిల్ పుట్టినదో ఏ బైబిలు నుండి కైస్తవమతం పుట్టిందో ఆ హీబ్రూజాతి ఒకటి ఉన్నది. ఆ జాతికి పూర్వం నామరూపాలు లేవు. వాళ్ళు గొఱ్ఱెలను కాచుకునే వాళ్ళు. అవ్వి అవ్వి అమ్ముకుని బ్రతికేవాళ్ళు. వారికి రాజ్యాలు లేవు. వాళ్లు పూర్వం భారత దేశమునుంచి వెళ్ళినవాళ్లే. వెళ్లి అక్కడ నివాసము ఏర్పరచుకున్న వాళ్లు. అక్కడ మిగిలిపోయిన వాళ్ళు. ఈ హీబ్రూ శబ్దాన్ని గురించి విచారిస్తే సంస్కృతములో ఒక శబ్దమున్నది. వనౌషధివర్గంలో హ్రీబేర శబ్దమొకటి ఉన్నది. దీని కర్థము కురువేరు అని. ఇది

ఒక సుగంధ ద్రవ్యము. భారత దేశమునుండి అనేకములైన సుగంధ ద్రవ్యములు పాశ్చాత్య దేశములకు తీసికొని పోబడేవి. తక్కోలము, కుందురుష్కము, కురువేరు, రాతిపువ్వు సురధాతకీ కుసుమము, ఏలకులు, చెంగల్వకోష్టు, నేల ఉసిరిక, పుండరీకము, నల్లకచోరము, పులిగోరు, నలి, దాచనచెక్క, తుంగ ముస్తలు, మాచిపత్రి, లవంగాలు, జటామాంసి మొదలైన యెన్నో సుగంధ ద్రవ్యాలు భారతదేశమునుండి జంబూ ప్లక్ష కుశ ద్వీపాలకు అనగా ఆసియా, అరేబియా, యూరపు దేశాలకు వర్తకులు తీసుకుపోయి అమ్ముతుండే వాళ్ళు. ఈ హ్రీబేరము అనగా కురువేరు ఔషధీలతల వేళ్ళు. అది ముడుచుకుంటుంది, ఒక విలక్షణమైన సువాసన ఉంటుంది. ఈ హ్రీబేరమనే వస్తువుతో వర్తకము చేసేవాళ్లు హీబ్రూలైనారు. వీళ్ళు యుద్ధము చేయలేరు. రాజ్యాలు స్థాపించలేరు. వట్టి వర్తకులు. ఆ వర్తకముకూడా ఆ ఒక్క వస్తువుతోనే. యిప్పటికికూడా మనదేశములో మందులమ్మే వాళ్లు వస్తారు. శాస్త్రీవో మూలికలు తీసుకొనివచ్చి అమ్ముతారు. ఈ కురువేరు ఎట్లా ముడుచుకు పోతుందో ఆ హిబ్రూ జాతికూడా అట్లాగే ముడుచుకు పోయేది. ముడుచుకు పోవటము ఆ జాతి లక్షణమై పోయింది. సృష్టిలో యిదొక విలక్షణత్వము నీవుచేసే పనినిబట్టి నీ గుణాలు మారటం. మాంసమమ్మే వాడియందు దయ యుంటుందా? కసాయి వాడిదగ్గర జాలి యుంటుందా? కత్తులమ్మే వాడికి ధైర్యముంటుంది. క్రూరత్వ ముంటుంది. అలాగా హిబ్రూజాతి

అధైర్యంగల జాతి అయింది. పూర్వపు హీబ్రూజాతి బొమ్మ లను బట్టి వాళ్ళవేషాలు వాళ్ల ముఖలక్షణాలు చూస్తే సరిగ్గా యిప్పుడు మనదేశంలో యీ మందులమ్మే వాళ్ళ లక్షణాలు కనిపిస్తవి. కొన్నివేల యేండ్లక్రింద వాళ్ళక్కడికి పోయినారు. వీళ్ళిక్కడున్నారు. వాళ్లు అక్కడ పెరిగారు. వీళ్లు యిక్కడ పెరిగారు. జాతియొక్క ఆకార విశేషాలు అలాగే మిగిలినవి. ఈ హీబేర జాతివారు బిలరాజ్యంలో సుమేరు రాజ్యంలో సురాసుర రాజ్యాలలో చెదురు చెదురుగా ఉంటూనే వచ్చారు. చివరకు పాలస్తీనాలో చేరారు. వీళ్ళనించి యూరపుయొక్క మతం ఒయలుదేరింది. వాళ్ల మతం యూదుమతం. వాళ్ళని వాళ్లు యూదులని పిలుచుకునేవాళ్ళు. పాశ్చాత్యులు వాళ్లని జ్యూస్ అనేవాళ్లు. జ్యూస్ అన్నవాడు ఆ పూర్వ మతాల్లో దేవతలకు రాజు. వాడే శ్రీశుడని చెప్పబడ్డాడు. రెండు శబ్దాలు ఒక్కటే. ఆ భాషలో ఈ యూదులయొక్క జాతిని చెప్పే టప్పుడు జకారముతో మొదలుపెట్టి వ్రాస్తారు, ఆ దేవతా రాజును గురించి చెప్పేటప్పుడు జకారముతో మొదలుపెట్టి వ్రాస్తారు. ఇంతే భేదము. ఒకటి తాలవ్య జకారము. ఒకటి దంత్య జకారము. వాళ్ల దేవుడు జావే. ఈ పేరునే నేడు జహోవా అంటున్నారు. జావే అనగా ద్యావా శబ్దభవము. ద్యావా పృథవులు. ఆకాశమునకు భూమికీ పేర్లు. ద్యావా శబ్దము జావే అయింది. ఇవి వాళ్ళ పునాదులు. వాళ్లొక విచిత్రమైన జాతి. జ్యూడియా అన్న దేశంలో ఉండేవారు. జరు

నెలం అన్న పట్టణం వాళ్ళకి ముఖ్యస్థానం. ఆ ఊరొక చిన్న కొండమీద ఉన్నది. ఆ జనులు పశువులను గొఱ్ఱలను కాచు కుంటూ ఉండేవాళ్ళు. కొద్దిగా వ్యవసాయము చేసుకుంటూ ఉండేవాళ్లు. చాల అనాగరకులు. అక్కడ ఒక చిన్న చెఱువు ఉన్నది. దానిపేరు గాలిలీ. అది తర్వాత ప్రసిద్ధమైంది. కాని వీళ్ళు చాలా ఒక విలక్షణమైన జాతి. వాళ్ళు ఎక్కడఉన్నా జానిసలే, సేవకులే. రాజ్యాలు నిర్మించే శక్తిలేదు. పౌరుషము చేత నిలబడదామన్న సాహసములేదు. వాళ్ళు ప్రధానంగా మందులు అమ్మేవాళ్ళు. మందులమ్మే వాళ్ళల్లో ఒక లక్షణం చూడండి. వాళ్ళు చాలా ప్రధానంగా పట్టుదల కలవాళ్ళై ఉంటారు. ఆ మందుల రహస్యాలు చాలా భద్రంగా దాచు కుంటారు. వాళ్ళ ఆడవాళ్ళల్లో శీల సంబంధమైన నిజాయితీ చాల ఉంటుంది. వాళ్ళదగ్గర మంత్రాలు ఉంటవి. పల్లెటూళ్ళల్లో వాళ్లు మంత్రించి మచ్చు చల్లి బిచ్చం పెట్టేవాళ్ళచేత అది తీసుకురా ఇది తీసుకురా అని దోచుకుపోతారు. ఇట్లా ఆర్జిం చటమే కాని దొంగతనాలు చేయరు. వాళ్ళల్లో వాళ్ళ మంత్రాలయందు వాళ్ల మందులయందు అధిక విశ్వాస ముంటుంది. వాళ్ళు ఒక్కడే దేవుడంటారు. ఏ యితర దేవతలని కొలవరు. వాళ్ళకు మూడే లక్షణాలు. దేవుడు ఒక దేవుంటము ఈ మందులు అన్ని అమ్మి పొట్టగడుపుకోటం. మూడవది మచ్చులు చల్లి మంత్రాలు పెట్టడం. ఇల్లాంటి లక్షణాలు కల యీ హీబ్రేరజాతి ఆ దేశాలలో నిలచిపోయి భారతదేశా

న్నుంచి వెళ్ళిన ఇతరులందరు ఇక్కడఉన్న ప్రధాన మతాలను అక్కడికి వెళ్ళి రాజ్యాలు సంపాదించి పట్టణాలనుకట్టి ధనాధికారాలు బలిసి వెట్టి వేషాలువేసి అనేక దేవతలను పెంచుకొని అనేక రకాలుగా బ్రతుకుతూ ఉంటే ఈ హ్రీబేరులు సంఖ్యచేత తక్కువవాళ్లు అసమర్థులు పట్టుదల గలవాళ్ళు ద్యావాను మాత్రమే నమ్ముకుని అన్నివేల ఏండ్లు ఉంటూనే వచ్చారు. ద్యావా అంటే ఆకాశము. పైన భగవంతుడు ఉన్నాడు అంటామే అది. వాడాకాశములో ఉన్నాడని, అంతకన్న యింకేమీలేదు. అదే ఒక పెద్ద మతమైపోయినది. దానిని మతము చేయటానికి క్రైస్తవులు కారణం. ఆ మతము పెరగటానికి వేరే కారణాలున్నాయి. ఈ హ్రీబేర జాతిలో ఎవడో ఒకడు తనకు భగవంతుడు కనబడ్డాడనటం ఆ భగవంతుడు ఇట్లా చెప్పాడనటం, అవన్నీ రాసుకోవటం, అవి దాచుకోవటం ఈ దాచేది ఎక్కడ ? జెరుసెలంలో, మోజస్ అనే ప్రవక్త మొరలు రెండవ ఎసయ్యా (ఇతని పేరు ఈశయ్య తెలుగు మాట. వీళ్ళు అనాదిలో తెలుగుదేశపు మందుల వాళ్ళై యుంటారు. ఒకరయ్య ఈశయ్య యివన్నీ తెలుగు వాళ్ళ పేర్లు) ఆ గ్రంథాల నన్నింటిని ఈద్యావాజాతి మత గురువులు సంరక్షించుకున్నారు. న్యాయవాదులు రాజులు మొదలైన వాళ్ళ చెరిత్రలు. డేవిడ్ గీతాలు ప్రవక్తల బోధలు. డెబోరామిరియం, సోలమన్ మొదలైన వాళ్ల భక్తి గీతాలు, యుద్ధ కథలు, ప్రేమ కథలు, చరిత్ర విజ్ఞానము,

భవిష్యత్తుని చెప్పటం మొదలైనవాటి నన్నింటిని గురించి వ్రాసుకున్నారు. దాచుకున్నారు. ఈ హీబ్రూ జాతివారు ఒకతత్వశాస్త్రముగాని ఒక వేదాంతశాస్త్రముగాని ఒకగణిత శాస్త్రముగాని యుద్ధనీతి సంఘనీతి మొదలైన మహావిషయాలు గాని వృద్ధిపొందించు కున్న వాళ్లు కారు. గొడ్డుగా దేవుడొకడే అని విశ్వసించటం. ఆ దేవుడు ఆకాశము ద్వారా అన్న మాట ఉన్నది. అదిద్వారావే అయింది. ఇంక అంతే. వాళ్ళ ప్రవక్త లందరికి దేవుడు కనిపించేవాడట. ఇప్పుడూ మన దేశంలో చాలామంది ఉన్నారు. తమకు దేవుడు కనిపించాడని యిలా యిలా చెప్పాడని. అట్టే మాట్లాడుతే అంతకన్న గొప్ప వాళ్లున్నారు. చాలామంది తామే భగవంతుల్ల మంటున్నారు. తామే చెబుతున్నారు. ఈ దేశంలో యివన్నీ సామాన్య విషయాలు. ఆ జంబుద్వీపాల చివళ్ళల్లో ఒక రెండువేల పండ్ల క్రింద వాళ్ళందరి దేవుళ్లు వందలకొద్ది ఉంటూ ఉంటే ఆ దేవుళ్ళకు ఆ మనుష్యులకు ఎక్కువ భేదములేని స్థితి ఏర్పడితే ఒక్కడే దేవుడు అనే యీజాతి వ్రాసి అట్టిపెట్టుకున్న పుస్తకాలకు గొప్ప ప్రాముఖ్యము వచ్చింది. ఆ మతములో ఏసు క్రీస్తు పుట్టటం జరిగింది. ఆమతము తెగ వ్యాపించింది. ఆ మతానికి పూర్వ చరిత్ర హిబ్రూ చరిత్ర అయింది. ఇట్లా వాళ్ళకి ప్రాముఖ్యం వచ్చింది. వాళ్ల జావా ఒక జాతిదేవతయే కాకుండా న్యాయస్థుడు దయావంతుడు సత్యవంతుడుగా ఆ హిబేరులు చెప్పుకుంటూ వచ్చారు. ఈ రీతిగా ఉన్నటు వంటి

ఈ హ్రిబేర జాతితో గ్రీకులకుగాని పార్శ్వజాతికిగాని సంబంధమే లేదు. ఎల్లా ఉంటుంది ? వీళ్ళేమో యెక్కడో మూలనున్న వాళ్ళు పలుచోట్ల నుంచి తరుమబడిన వాళ్ళు పశువుల కాపరులు. గొఱ్ఱెలను కాచుకునే వాళ్లు. రాజ్యాలు చేసేవాళ్లు. రాజ్యాలను నిర్మించేవాళ్ళు వీళ్లను గురించి పట్టించు కుంటారా ? భగవంతుడు ఎప్పుడు దేనిని ఎందుకు చేస్తాడో తెలియదు. దేనిని ఎందుకు నిలబెడతాడో తెలియదు. కొన్ని వందల యేండ్లు పర్షియా సామ్రాజ్యము విజృంభించి యున్నది. హిందూకుశ పర్వతాలదాక వాళ్ళ రాజ్యమున్నది. వాళ్ళుపోయి కుశద్వీపాన్ని ఆక్రమించు దామనుకున్నారు. తప్ప భరతఖండాన్ని ఆక్రమించుదామని ఎందుకనుకోలేదు ? పర్షియాదేశపు రాజుకి అవధిలేని సైన్యముండేది. అది సుశిక్షితముకాదు. అంతే. ఏమిటీ చిత్రము ? భారతదేశంలో సుశిక్షితమైన సామ్రాజ్యాలు మహానాగరకతలు ఉండి వాళ్ళ చూపును యిటు మరలించలేక పోయినవి

# 5

ఒక వంద యేండ్లలో ఏథెన్సు నగరంలో గ్రీకుదేశము గొప్ప కవులని, తత్వవేత్తలని, చరిత్రకారులని, రాజకీయ వేత్తలని, శిల్పజ్ఞులని, బోలెడుమందిని సృష్టించింది. వాళ్ళల్లో గొప్ప నాటక కర్తలు పుట్టారు హోమరు తరువాత వాళ్లే కవులు. చాలా గొప్ప నాటకాలు వ్రాశారు. వాళ్ళు తీసుకొన్న కథలన్నీ ఇంచుమించుగా హోమరులోని కథలే. వాళ్ళ రచనలలో చాలా మానవత్వముంటుంది. అన్ని నాటకాలలోను ముఖ్యముగా కనిపించేది విధి నిర్మాతమైనది అన్న విషయము. అంతా ఇదివరకే వ్రాయబడి ఉన్నది. దాని ప్రకారమే జరుగుతుంది. డెల్ఫాస్ అని ఒక ప్రదేశమున్నది. అక్కడ ఒక సోదె చెప్పటము జరుగుతుంది. సోదె అనటముకంటె ఒక భవిష్యత్తు చెప్పబడుతుంది. వాళ్ళకు కూడా ప్రకృతి శక్తులే దేవతలు. వాళ్ళ పర్వతాలకి, నదులకు, అడవులకు దేవతలు ఉంటారు. సరిగ్గా మనగిరి దేవతలు, నదీదేవతలు, వనదేవతలవలె భూదేవత

ఉన్నది సూర్యుడు దైవము. వాళ్లల్లో ఎక్కువమంది దేవతలు స్త్రీలు. డెల్ఫి అనేచోట అప్పాలో అనే దేవతకి గుడి ఉన్నది. ఈ డెల్ఫి భావిసూచన దేవత బ్రహ్మాండమైన దేవత. గ్రీకుల చరిత్ర అంతా యీ దేవతచెప్పే ఫలితాలమీద వాళ్ళు నడచిన నడకతో ఏర్పాటు అయినది. ఈ డెల్ఫిలో తొలుత ఉన్నది భూదేవత. ఆవిడ పేరు గీ. ఈ గీ పూర్వము చెప్పిన సుమేర్వాది దేశాలలో ఉండే కు అనే దేవతే. ఆ కకారమే గకారమైనది. కు అంటే భూమి అని చెప్పానుగదా. ఇదంతా ఒకటే పరంపర. భారత దేశంలోని లక్షణాలన్నీ మార్పుతో ప్రత్యక్షమైన చోట్లు. పూర్వము యీ డెల్ఫిని ఒక పెద్ద మహాసర్పము చుట్టి ఉండేది. శరసంధాన నిపుణుడైన అపోలో అనే దేవత యీ సర్పాన్ని చంపి యీ డెల్ఫిని ఆక్రమించాడని కథ ఈ సర్పానికి పైథో అని పేరు. ఈ పైథో పృదాకు శబ్దభవము. పృదాకు శబ్దానికి వ్యుత్పత్తి ఏమిటంటే పర్దతి యితి పృదాకుః. పర్ద మనగా కుత్సిత శబ్దము కుత్సితముగా పలుకునది. ఇది పృదాకువు, దానిమీద వచ్చినది. పైథో అన్న శబ్దము. ఈ డెల్ఫి గ్రామమున భవిష్యత్తు చెప్పబడును, చెప్పేది పైథో ఆ భవిష్యత్తు చెప్పటమంతా రెండర్థాలు వచ్చేట్టు చెప్పబడుతుంది. అర్థం నిశ్చయంగా ఉండదు. చివరకు యథార్థమవుతుంది. ఇది పైథో అంటే పృదాకు శబ్దభవము వ్యుత్పత్త్యర్థముతో సహా సరిపోతున్నది. పైథాగరస్ అని గ్రీకుల గొప్ప తత్త్వవేత్త ఉన్నాడు. ఈ శబ్దము పైథో గురు శబ్దము. పృదాకు గురుశబ్ద

భవము. వాళ్ళ శబ్దాలన్నీ యిల్లాఉంటై అచ్చముగా సంస్కృత శబ్దాలు. వాళ్లల్లో నల్గురు ప్రసిద్ధులైన నాటక కర్తలున్నారు. ఒకడిపేరు ఐస్కిలస్. ఆశ్చలః. ఆ అంటే ఆశ్చర్యమునుగాని కోపమునుగాని చెప్పే అవ్యయము ఆః అనే వృత్తియందు చలించెడివాడు అని అవుతుంది. యూరిపిడిస్. పదశబ్దము వాళ్ళ భాషలో పిండి అవుతున్నది. యూరిపదుడు అనగా ఊరుపదుడు లేకపోతే ఉరుపదుడు. పెద్దకాళ్ళు కలవాడు. సోఫోకిల్స్, శోభాకలుడు. ఎరిష్టోఫేన్స్, అరిష్టఫేనుడు. ఫేనము అంటే నురుసు. ఈ రీతిగా వాళ్ళ నామములన్నీ దేవతల పేర్లు. మనుష్యుల పేర్లు సంస్కృత శబ్దములే. వాని వికారములు. ఈ మధ్య గ్రీకుభాష రోమనుభాష పర్షియనుభాష సంస్కృతభాష యీ భాషలకున్న అత్యంత సాన్నిహిత్యము చూసి పాశ్చాత్యులైన భాషాశాస్త్రవేత్తలు ఆ భాషలన్నీ సంస్కృతమునుండి పుట్టినవి అనలేక హిందూ యూరపుభాషపూర్వమొకటియుండేది, అని దానినుండి యీ భాషలన్నీ పుట్టినవనీ ఆ భాష అంతరించిపోయినదని ఒక సిద్ధాంతం లేవదీశారు. మన విశ్వవిద్యాలయాలలో ఆ సిద్ధాంతాన్ని చదివిస్తారు పరిశోధనలు చేయిస్తారు. శబ్దముల మార్పులను గురించి సూత్రాలుగా చెబుతారు. పద శబ్దము ఉన్నది. కొన్నిచోట్ల యిది పిడి అవుతున్నది. కొన్ని చోట్ల పెడ్ అవుతున్నది. దీనినిబట్టి అకారము ఇకారముగను ఎకారముగను మారవచ్చును. ఇది ఒక సూత్రము. దీని అంతకు కారణము వాళ్ళ ప్రాణానికి వాళ్ల భూగర్భ పరిశోధనల వలన

మానవ ప్రాచీనత బైబులులో చెప్పిన దానికంటే యింకా నాలుగైదు వేలయేండ్లు వెనక్కి తోసుకు పోవటానికే దుఃఖ పడుతూ ఉంటే యీ జంబూ ప్లక్ష కుశద్వీప భాషలు సంస్కృత ములోనుంచి పుట్టినవంటే ఆ సంస్కృతము యింకో పదివేల యేండ్లకు పూర్వముకూడా యున్నది అనవలసివస్తే తల్లడిల్లి పోవాలి. ఇట్టికుత్సిత బుద్ధులై దూరదృష్టి లేనివాళ్ళైదైవవశాన భారత దేశము వాళ్ళ అధికారములో ఉండటం మూలంగా పూర్వభారతీయుల ప్రాధాన్యం అంగీకరిస్తే వాళ్ళతల తీసివేసి నట్లుంటుందని వాళ్ళట్లా చేయలేదు. గ్రీకుల నాటివఱకు నిత్యము భారతదేశమునుండి వర్తకులు పండితులు వెళుతూనే ఉండేవారు, వస్తూనే ఉండేవారు. సుమేరు సురపార్శ్వ సర్వ రాజ్యాల వారికి ఆ నాలుగైదు వేలయేండ్లు భారతదేశము తమ మాతృదేశమని తెలుసు. ఆ దేశము మీదికి దండెత్తేవాళ్లు కారు. అన్ని విద్యలూ అక్కడనుంచే తెచ్చుకున్నారు వాళ్లు. భారతదేశాన్ని మాతృస్థానంగా గౌరవించేవారు. ఈనాడు అమెరికా మహాశక్తిగల రాజ్యము. ఇంగ్లండు చిన్నది. ఐనా అమెరికా దేశస్థులు ఇంగ్లాండు దేశాన్ని పితృస్థానమునందు పెట్టి పూజిస్తారు. ఆనాడు జంబూద్వీప వాసులైన యీ భిన్న జాతులకు భారతదేశానికి ఆ సంబంధం ఉండేది. అంతే కాకుండా యీ భారతదేశము వాళ్ళు దండయాత్ర వెడితే చితికిపోయే దుస్థితి వాళ్లకుండేది కాదు. వాళ్ళమీదికి దండెత్త డానికున్నూడా భయంగా ఉండేది. చివరికి అలెగ్జాండరు ఆ పని

చేశాడు. దెబ్బ తిన్నాడు. భారతదేశ వాయవ్య దిశలో ఒక పర్వతముమీద ఉన్న శిఖరము పేరు న్యాసశిఖరము. గ్రీకుల పురాణాలలో ఈ న్యాసశిఖరము చెప్పబడి ఉన్నది. గ్రీకు సైనికులువచ్చి ఆ న్యాస శిఖరాన్ని చూచి వాళ్ళపూర్వులు తత్పూర్వము భారతదేశాన్ని గెలిచారు; గెలిచి దానికా పేరు పెట్టారు అని వ్రాసిన చరిత్రకారుల వివేకము ఏమని చెప్పాలి? వాళ్ళందరు యిక్కడనుంచి వెళ్ళినవాళ్ళే. వైదిక ధర్మమునుండి పరిచ్యుతులై భారతదేశము నుండి తరిమి వేయబడి వాయువ్య దిశయందు యవన రాజ్యములు ఏర్పరచుకొని అక్కడనుండి మరీ మరీ పడమరకు పోతూ పోతూ రాజ్యాలు నిర్మించుకొని పురాణములు కథలు ఆ తొలుత వెళ్ళిపోయిన వాళ్ళనుండి పరంపరగా తెచ్చుకుంటూ ఆ పేర్లే పురాణములయందు దేవత నామములయందు నిలబడి ఉండగా కాలము గడచినకొద్దీ అంతా మరచిపోయి తాము స్వతంత్రులమని భూమిలోనుండి పుట్టుకు వచ్చామని అన్న దుర్భావములు పెంచుకుంటూ తల్లిని మరచిపోయిన బిడ్డలవలె తయారయ్యారు. వట్టి శస్త్ర జీవులవటం మూలంగా త్రావినచోటనే గ్రుద్దుటకు తయారైనారు.

హిబ్రేర జాతి విషయం కొంత చెప్పవలసివస్తే పాలస్తీనాలో ఏసుక్రీస్తు పుట్టాడు. జెరుసెలంలో పుట్టాడు. కథ అంతా పెరిగింది. అనాదిలో వాళ్ళు ఈశపీఠ దేశంలో దాసులుగా ఉండేవాళ్లు. వాళ్లు కొన్ని మంత్రాలు కలవాళ్లుకదా. ఆ ఈశపీఠ చక్రవర్తి రాజ్యంలో మోజెస్ అనే ప్రథమ ప్రవక్త

బావురుకప్పలని సృష్టించాడు. కఱ్ఱవేసి పాముగా చూపించాడు. రాజ్యంలోఉన్న సర్వ కుటుంబాలలోను ప్రథమ సంతానాన్ని నశింపచేశాడు. ఇల్లాంటి పనులు భారతదేశంలో భగవంతుడు చేసినట్లు ఎక్కడాలేదు. ఋషుల శాపాలే వేరు. అణగ త్రొక్కబడిన జాతి హిబ్రూలు. వాళ్లు అణగ త్రొక్కబడినవారు గనుక విముక్తి పొందటానికి యీ క్షుద్ర విద్యలను ప్రయోగించి ఈజిప్టులోనుంచి లేచి వచ్చారు. మనదేశంలో వీనిని క్షుద్ర విద్యలుగా పరిగణిస్తారు. పామరులు వీటికి తృప్తి పడతారు. పండితులు వీనిని అంగీకరించరు. ఈ హిబ్రూ జాతి తొలుతటినుండి రాజకీయ ప్రాబల్యములేని జాతి, అణగత్రొక్కబడిన జాతి. దుర్దశలో ఉన్నవాడు భవిష్యత్తులో తనకు మంచి రోజులు వస్తవి అనుకోటం సహజం. వాళ్లు అనుకుంటూ ఉండేవాళ్ళు. భగవంతుడు వాళ్లల్లో ఉదయిస్తాడనుకునే వాళ్ళు. ఈ ఏసుక్రీస్తు పుట్టాడు. వాళ్లల్లో కొందరు అతడే యితడన్నారు. అన్నవాళ్లు క్రైస్తవులైనారు. కాదన్నవాళ్ళు యూదులుగానే మిగిలిపోయినారు. ఈ యూదులు కుశ ద్వీపమంతా ఆవరించారు. ఈ ఏసుక్రీస్తు కథ ఎట్లాఉన్నా భారతదేశమునుండి ఒక వేదాంతవేత్త ఆయన విశ్వబ్రాహ్మణుడని ప్రతీతి. అక్కడికిపోయి యీ వేదాంతాలన్నీ కథలలో పెట్టి చెప్పాడని కొందరు వ్రాశారు. మొత్తానికి అతను చెప్పినమాటలు కొంత కవిత్వంగా కొంత వేదాంతంగా ఉంటవి. ఆ పాశ్చాత్య నాగరకతలలో యీ మాత్రం వేదాంతం లేకపోయింది. పైగా ఈ

క్రిస్టియనులను రోము సామ్రాజ్యంలో చాలా బాధించారు. చంపారు. అణగ ద్రొక్కారు. మానవుడు విచిత్రమైన ప్రకృతి. క్రిందికి త్రొక్కినకొద్దీ పైకి లేస్తూ ఉంటాడు. అలా క్రైస్తవ మతం వృద్ధి పొందింది. కొందరు క్రైస్తవమత గురువులు బయలుదేరారు. వాళ్ళు తతంగం పెంచారు. దాన్ని పెద్ద మతాన్ని చేశారు. అనేకములు కల్పించారు. క్రీస్తు పుట్టాడో లేదో తెలియదు పుడితే పుట్టినరోజు తెలియదు ఈ క్రైస్తవ మత గురువులు పెద్ద సభచేసి యూరపులో క్రీస్తు శకాన్ని సృష్టించారు. ఎన్నో చమత్కారాలు చేశారు. మత మిల్లా ఉంటే ఆ యూరపు దేశముయొక్క తక్కిన విద్యలన్నీ గ్రీకు దేశంనుండి వెళ్ళినవి. ఆ గ్రీకుదేశంలోని సర్వ విద్యలు భారత దేశంనుండి వెళ్ళినవి. మానవ జీవితము నిత్యమూ రెండు ప్రవాహాలుగా వెళ్తూ ఉంటుంది. ఒక ప్రవాహం రాజ్యాంగం. రాజ్యం చేసేవాళ్ళు అధికారులు పన్నులు వసూలు చేసేవాళ్లు. ఈ మొదలైన ప్రవాహం ఈ ప్రవాహానికి విద్యలతో సంబంధం లేదు. పాండిత్యములతో సంబంధం లేదు.శిల్పములతో సంబంధం లేదు. దేశ నాగరకతతో సంబంధం లేదు. మతముతో సంబంధం లేదు. ఇవన్నీ కలిగిన జనులను పాలిస్తూ ఉంటారు. కాబట్టి వాళ్ళకి వీళ్ళతో కొంత స్పర్శ ఉంటుంది.అందుకునే సర్వదేశాలలో ఉండే గొప్ప గొప్ప రాజులు విద్యలను పోషించారు అన్నది వాళ్ళయందు అధిక గుణంగా చెబుతూఉంటారు నిజానికి కవిత్వము సంగీతము గణితశాస్త్రము జ్యోతిశ్శాస్త్రము

ప్రకృతి శాస్త్రమువీటితో రాజ్యాల కేమీసంబంధం లేదు.ఆధు'క పాశ్చాత్యనాగరకత మాత్రమే ప్రకృతి శాస్త్ర పరిశోధనా ఫలి తాలనుమారణాయుధ నిర్మాణం కోసము స్వీకరించారు. వాళ్ళ రాజ్య విస్తరణకు వాళ్ళ అధికార ప్రాబల్యానికి ఎంతవరకీ విద్యలు ఉపకరిస్తే అంతవరకూ స్వీకరిస్తారు. ఒక కవిని ఒక నాటకకర్తను గౌరవిస్తారు. గౌరవిస్తే వాళ్ళకు గొప్ప వస్తుం దనుకుంటే గౌరవిస్తారు. వాళ్ళను ఆశ్రయిస్తే గౌరవిస్తారు. యథార్థానికి యీ రెండు ప్రవాహాలు రెండు ప్రత్యేక ప్రవా హాలు. రెండవ ప్రవాహము సామాన్య జనులయందు వృద్ధి బొందుతుంది. అలెగ్జాండరు చక్రవర్తికి సోఫోకిల్స్‌కు ఏమి సంబంధం ఉంది ? ఇద్దరు ఒకదేశం వాళ్లు.ఒక జాతిలో పుట్టారు అంతే. భవిష్యత్ ప్రజ ఇదంతా ఒక నాగరకత అనుకోటమే తప్ప రాజ్యాలేలిన వాళ్ళందఱు ప్రపంచంలో ఒక జాతి అయితే శాస్త్ర శిల్ప కవితా సంగీతవిద్య లభ్యసించిన వాళ్లం దఱు ఒక జాతి అనవచ్చు. ఆ గిరీశదేశంలో సోక్రటీసు, ప్లాటో, ఎరిస్టాటిల్, యనార్సిగోరస్ అనే తత్త్వ శాస్త్రవేత్తలు ఉన్నారు. వీళ్ళందరూ భారతదేశ పండితులతో సంపర్కం కలవాళ్ళే. ఇక్కడ నేర్చుకున్న వాళ్ళే. ఈ పేర్లు కూడా సంస్కృతపు పేర్లతో సామ్యము కలవే. శుక్రదుడు, పలాదుడు అరిష్టతిలుడు, అనతుగురుడు ఇలాంటి శబ్దములయొక్క వికా రాలని చెప్పటానికి వీలున్నది. పెరికిల్స్ గొప్పరాజు. రాజ కీయ వేత్త. థెమిస్టాకిల్స్ అనేవాడొక గొప్ప రాజకీయ వేత్త

వాళ్ళ చరిత్రకారులు వ్రాసినవన్నీ మిగిలి ఉన్నవి. గ్రీకుల చరిత్ర వ్రాయబడి ఉన్నది. వ్రాసిన వాళ్ళు మాత్రం చాలా కల్పించి వ్రాశారు. యూరపుదేశానికి గ్రీకు నాగరకత మూలము గనుక దానికి పసుపు రాచి కుంకుమ పెట్టి పూలమిద్ద మండలు కడితేకాని శోభస్కరంగా ఉండదని తరువాతి వాళ్ళు చేశారు.

# 6

పతంజలిశాస్త్రి గొప్ప ధ్యానపరుడైనాడు విఠల్‌రావు తన మూలంగా బ్రతికాడన్న ఒక విశ్వాసాన్ని పెంచుకున్నాడు, తిరిగి తిరిగి ఆ దేవతామూర్తి అతనికి కనిపించటం మొదలు పెట్టింది ఇంటిదగ్గర నుంచి మళ్లీ ఎప్పుడు బయలుదేరి రావా లన్నా భార్యతో యిబ్బందిగానే యున్నది. ఆమె వెళ్లనివ్వదు. ఏడుస్తుంది. సాధింపు మాటలంటుంది. ఈసారి బ్రతిమాలి చెప్పాడు "నేనక్కడికి యిక్కడికి వెళుతున్నాను కనుకనే కదా అప్పు పెరగకండా యున్నది. లేకపోతే ఆ అప్పు యీ పాటికి ఏ పదివేలో పంౘెండువేలో అయి ఉండేది. ఆ షావు కారు యీ పది యెకరాలని గుటకాయిస్వాహా చేసేవాడు. అప్పుడు మనకు తినేందుకే తిండి ఉండేదికాదు. ఇప్పుడు సంవత్సరంమీద మూడు నాల్గు నెలలు అటూ యిటూ వెళ్లివస్తానేమో అప్పుడైతే ఎప్పుడూ ఇంట్లోఉండటానికి వీలుండదు. నీ వర్థం చేసుకోవాలి. ఏడ్చి నన్ను దుఃఖపెడితే బాగుండదు.

నిజానికి నీకు వ్యాధి అనేదేలేదు. అయ్యెయ్యో కాళ్లు పీసుకు పోతున్నవి. తల బ్రద్దలేసుకు పోతున్నది, అని నీయంతట నీవనుకోవటం నాప్రాణాలు తీయటం అంతే యిరావిడ ఒకటే పడుపులు ఒకటే సాధింపులు ఒకటే రద్దీచేసింది పాపం మా పతంజలిశాస్త్రి జీవుడు ఆ భార్య నెన్నడు ఏమీ అనలేదు. కసురుకోను కూడాలేదు. ఒక్క కఠినపుమాట అనలేదు. రెండువేలు ఒక్కసారి వచ్చేటప్పటికి మళ్ళీపోరు అక్కడిక పది పదిహేనురోజులుంటే యింకొక రెండు వేలువస్తే అని ఆశపుట్టే సరికి అప్పులో ఎక్కువభాగం తీరిపోతుంది. మిగిలిన రెండువేల అప్పు ఏమిచేస్తుందిలే అన్న ఊహాకలిగేటప్పటికి అక్కడికి వెళ్ళ టానికి యీ భార్య ఎక్కువ ప్రతిబంధకంగా కనిపించేటప్పటికి అతని పదియేండ్ల భార్యతోడి జీవితము స్మృతికి తగిలి యీ భార్య మూలంగా జీవిత సుఖమంతా చెడిపోయినదని తన యౌవనము వృధా అయినదని తన సుకుమార శృంగార రసస్వాదయుం వ్యర్థమైపోయినదని బూడిదతో పోసిన పన్నీరై పోయినదని ఒకానొక విషాదరేఖ అతని హృదయాంతరంలో బయలుదేరి అది కోపంగా వెలికివచ్చి యిట్లా అన్నాడు "నీ మూలంగా నా బ్రతుకు అంతా నాశనమైపోయింది. నీవలన నే ననుభవించిన సుఖములేదు. నా బ్రతుకల్లా బ్రతికి ఉన్న శవానికి పరిచర్య చేయటముతోటే సరిపోయింది. ఆ పుట్టిన కొడుకు కూడా చచ్చిపోయినాడు. నీవొక కుసిష్టిదానవు నీ కున్నంత ఈర్ష్య నీకున్నంత స్వార్థపరత్వము ఎవ్వరికీ ఉండవు.

ఇటువంటి గుణాలు ఉన్నదానికి భగవంతుడు సంతానాన్ని బ్రతుక నివ్వడు." అని దులుపుకొని యింట్లోంచి లేచి వెళ్ళి పోయినాడు. మరియింక ఆ భార్య ఆరోజు రోజుల్లా ఏడుపులు పెడబొబ్బలు తల మంచపు పట్టెకు వేసుకొని కొట్టుకోటాలు నురుసులు క్రక్కటాలు ఎంత ఖంగారు పరుచుకోవాలో అంత ఖంగారు పఱచుకొన్నది. పతంజలిశాస్త్రి ఏమీ కలిగించుకో లేదు. అతని కిల్లా అనిపించింది. "ఈవిడికి ఏమందూ పనిచేయ లేదు. నా మార్దవము, నా సౌకుమార్యము, నా అనుసరణము యేమైపోతుందో అనే నా భయము. వీటి మూలంగానే ఆమె వ్యాధి తగ్గటంలేదు. నేను కఠినంగా ఉంటే ఆమె బాగుపడు తుంది. బాగు పడవచ్చును. ఇది మానసికమైన వ్యాధి. దీనికిదే మందు."

మఱునాటికి ఆమె కొంత శాంతించింది. రెండురోజులు పతంజలిశాస్త్రి మాట్లాడలేదు ఊరివెంటనే తిరిగి వచ్చాడు. ఇంటిలో వంట చెయ్యటానికున్న శాస్త్రి, వేలువిడిచిన మేన మామ కూతురు అక్కగారితో చెప్పింది. "అవునమ్మా నీ మూలంగా బావ రొమ్ము గరిశలపడి పోతున్నది. ఆయన గనుక నిన్ను ఏలుతున్నాడు. ఇంకొకడైతే నిన్ను వదలిపెట్టి వేరే పెళ్ళి చేసికొనేవాడే. ఆయనకేమి ? మంచి చదువుకొన్న వాడు, అందమైనవాడు. పదియెకరాల పొలము కలవాడు, నలుగురిలో పేరుమోసినవాడు. నిజంపడితే అటువంటి భర్తను భార్య ఎంతైనా అనుసరించి ఉండాలి. ఆయన ప్రాణాన్ని

నీవు చాలా రొష్టు పెడుతున్నావు. నేనిట్లా అంటే నామీద కోపము వస్తుంది. నాకెందుకు ? ఏదో కాస్త సాహాయ్యము చేసిపెట్టమంటే వచ్చానుకాని నీకు కోపమువస్తే వెళ్ళి పోతాను. పూర్వానికిమల్లే నిన్నాయన యిప్పుడు అంటిపెట్టుకు కూర్చోడు. నీగతి ఏమవుతుందో చూసుకో" అని చాలా చెప్పింది. రెండు రోజులలో ఆవిడకూడా సర్దుకుంది. మూడవ రోజున ఆవిడే భర్తని పిలిచి "మీరువెళ్ళండి. నావల్ల మీరన్నట్లు మీ బ్రతుకంతా పాడైపోయింది. వెళ్ళి పనిచూసుకుండండి. నావల్ల మీరు సుఖపడ్డది లేదు" అని యేడ్చింది. ఇతను ఓదార్చాడు. పదిరోజులలో వస్తానన్నాడు. ఆ రోజునే బయలు దేరాడు. కాని యీ నాల్గయిదు రోజులు భార్యను తిట్టినా ఆమెతో మాట్లాడకపోయినా ఆమెకు ఆరోగ్యం సిద్ధించేందుకు కోసం తీవ్రంగా జపం చేయటం ప్రారంభించాడు. ఒక సమాధి ప్రాయమైన స్థితిలో ఆ దివ్యమూర్తి కనబడటం అచ్చముగ తెల్లగాఉన్న మూర్తి మరు నిముసములో నల్లపడి పోవటం జరుగుతూ వచ్చింది. అతనికర్థం కాలేదు. కనబడితే కనపడాలి మానివేస్తే మానివేయాలి, ఈ నల్లపడటం ఏమిటి ? తన భార్య చనిపోతుందా ? అతనా ఊహను పరిహరించుకుంటూ ఉన్నా ఆమె చనిపోతే తాను సుఖపడుతానన్న ఒక ఊహ వస్తూనే ఉంది. అతడు కష్టపడుతూనే ఉన్నాడు. భార్య ఇల్లా మాట్లాడిన తరువాత అతడు భార్యకు విభూతిపెట్టి తీర్థమిచ్చాడు. అతడు ప్రొద్దున్నే బయలుదేరుదా మనుకుంటు

న్నాడు. ఎనిమిదేండ్లనుండి ఎన్నడూలేక ఒక ఆశ్చర్యము జరిగింది. అతని భార్య అతనికంటె ముందర లేచి అతని ప్రయాణానికి సర్వప్రయత్నములు చేసింది. అతడు బయలుదేరి వెళ్ళాడు కాని అతనికేమీ తెలియలేదు. ఇక భార్యకు పర్వాలేదు. ఆమెయీ కొంచెము మంచిదారిలో పడినప్పుడే తానామెను వదలిపెట్టి పోవలసి వచ్చినదని మనసులో కష్టపడ్డాడు. కాని వెళ్ళక తప్పదు. వెళ్ళాడు. నవాబుపాలెం వచ్చి రెండుమూడు ఉపన్యాసాలు చేశాడు మళ్ళీ. విఠల్‌రావు యీయన తీర్థంకోసం ప్రతిరోజు వార్త పంపిస్తున్నాడు. ఆతను లేచి యింట్లో బాగా తిరుగుతున్నాడు. జపవేళ పతంజలిశాస్త్రికి తేజోమూర్తి కనిపిస్తూనే ఉన్నాడు. మళ్ళీ నల్లబడి పోతూనే ఉన్నాడు. విఠల్‌రావు క్రమంగా కోలుకుంటున్నాడు. ఆనాడు పతంజలిశాస్త్రి ఉపన్యాసము ఇలా ఉన్నది. "నేటి పాశ్చాత్య దేశాలయొక్క నాగరికతయొక్క పునాది గ్రీకులది. కొన్ని విషయాలు చెబుతాను. ఆ నాగరికతయొక్క స్వరూపం మీకు తెలుస్తుంది. పెరికిల్స్ అనేవాడు వాళ్ళ ఒక రాజు. గొప్ప రాజకీయవేత్త. స్పార్టా యుద్ధంలో చచ్చిపోయిన సైనికులకు సమాధిచేస్తూ అతనిచ్చిన ఉపన్యాసంలోని భాగమిది. "మన నగరానికి ఎవరినైనా రానిస్తాము. మన రహస్యాలను వాళ్ళు గ్రహిస్తారను భయం మనకు లేదు. మనం కృత్రిమంగా యుద్ధాలను గెలవము. మన ధైర్యసాహసాలమీదే మన మాధారపడి ఉంటాము. మన శత్రువులు చిన్నప్పటినుంచి యుద్ధశిక్షణ పొందుతారు. చాలా

శ్రమ పడతారు. మనం సుఖంగా బ్రతుకుతాము మనమే గెలుస్తామన్న ధైర్యం మనకెప్పుడూ ఉన్నది. మన విరోధులు యితరుల సాహాయ్యం లేకుండా మనమీదికి రావటానికి ఎప్పుడూ సాహసించలేరు. మన ధైర్యమే మన కవచము. తక్కినప్పుడు మనము సుఖంగా ఆటలలో నిమగ్నులమై ఉంటాము అవసరం వస్తే శత్రువులమీద సింహాలవలె దూకుతాము. శిల్ప సంగీత కవిత్వములంటే మనకు యిష్టము. వాటియందు రమిస్తాము కాని యుద్ధవేళ ఆ మార్దవాన్ని మన హృదయాలమీద రాజ్యం చేయనీయం" ఈ మాటలనుబట్టి గ్రీకు జాతియొక్క లక్షణాలు తెలిసికోవచ్చు. వాళ్ళు భోగలాలసులు కవితాది కళా ప్రియులు, యుద్ధవీరులు. ఇంకొక చిన్న భాగం కూడ తెనుగు చేసి మీకు వినిపిస్తాను. కోరిందియా ప్రజలు ఎథెన్సుమీద దండెత్తటానికి స్పార్టా నగరవాసులు సాహాయ మడిగారు ఆ అడిగిన మాటలువిని "ఎథెన్సు నగరవాసులెట్లాంటి వాళ్లో మీకు తెలియదు. వాళ్లు మీవంటి వాళ్లుకాదు, వాళ్లు పథకాలు వెతుకుతారు. కృత్రిమంగా సాధిస్తారు, మీరున్న దానితో సంతోష పడతారు. కొన్ని అవసరమైనవి కూడా చేయరు. వాళ్లు ధైర్యవంతులు, సాహసులు, నెత్తురు త్రాగేవాళ్లు. మీ రనవసరంగా జాగ్రత్త తీసుకుంటారు. మీ వివేకము కాని మీ శక్తినికాని మీరు నమ్మలేరు. వాళ్లు ఎప్పుడు పర రాజ్యాలనే ఆక్రమిద్దామని అనుకుంటారు. మీకు పర రాజ్యాలను ఆక్రమిద్దామంటే అసహ్యము. వాళ్ళుకాస్త గెలిస్తే ఎంతో గెలిచినట్లుగా ప్రవర్తిస్తారు. ఓడిపోతే అంతకంటే దిగాలుపడే

వాళ్ళు ఉండరు. వాళ్ళు మనుష్యులు కారు. వాళ్ళ నగరమే వాళ్లు. వాళ్ళకు వ్యక్తిగత జీవనమనేది లేదు. వాళ్ళొక యంత్రాలు. వాళ్లు వాళ్ళంతట సుఖంగా బ్రతకలేరు. ఇతరులను బ్రతకనివ్వరు. కోరింత్ ఏథెన్సు స్పార్టా అన్నీ గ్రీకు పట్టణాలే. ఒకళ్ళంటే ఒకళ్ళకు పడేదికాదు. ఏథెన్సు నగరం చాలా వృద్ధి పొందింది. మహాయుద్ధాలు చేసింది. పెద్ద రాజ్యాంగం నిర్మించింది. పెద్ద వర్తకం సాగించింది. ఏథెన్సు ప్రజల దుస్తులు వేరు. స్పార్టా ప్రజల దుస్తులు వేరు. స్పార్టాలో స్త్రీలు కొందరు దిగంబరులై వెళ్లేవాళ్ళట. ఈ వివస్త్రలైన స్త్రీలు వివస్త్రులైన పురుషులు కుస్తీలు పట్టేవాళ్లట. ఆ దేశంలో స్త్రీలు వట్టి భోగవస్తువులు. ఈ ప్రజాస్వామ్య రాజ్యాంగ పద్ధతి తొలుత గ్రీసుదేశంలో మొదలు పెట్టింది. ఆడవాళ్ళకు ఓటులేదు. స్త్రీలు తక్కువ వాళ్ళు. వాళ్లు యుద్ధాలకు పనికిరారు. వాళ్లు సంతానం కనటానికి, పిల్లలను పెంచేందుకే తప్ప మరెందుకూ పనికిరారు. వాళ్ళు యిళ్ళల్లోనుంచి బయటికి రావటానికే వీల్లేదు. ఎప్పుడూ భర్తృసేవే చేస్తూ ఉండాలి. పురుషుడు బహుమంది స్త్రీలతో సంబంధం కలిగి ఉండవచ్చు. ఈ భోగము జాతి స్త్రీలు ఎవరిని పెడ్లి చేసుకోవటానికి వీలులేదు. వాళ్ళ కూతుళ్ళు పెళ్లి చేసుకోటానికి వీలులేదు. అందుచేత అందఱు స్త్రీలు యిట్లా ఉన్నారనటానికి వీలులేదు. చాలామంది స్త్రీలు బాగా ప్రశక్తికి వచ్చినవాళ్ళు వాళ్ళల్లో ఉన్నారు. అన్ని దేశాలలో ఉన్నట్లే ఆ దేశములోను

ఉన్నారు. నెఫ్రెటిటీ అనే ఒకావిడ సేనా నాయకురాలు. ఆ దేశంలో చాలామంది బానిసలు ఉండేవాళ్లు. ఆ బానిసలు పనంతా చేసుకొని పోతుండగా పురుషులు సుఖంగా ఉండే వాళ్ళు. వాళ్ళదేశంలో నాటకాలు కుస్తీలు సంగీతాలు సమృద్ధిగా ఉండేవి. తగినంత అనీతి ఉన్నదని చెప్పవచ్చు. యూరపు దేశము ఒక విధమైన సైనిక శిక్షణను నేర్చుకున్నదంటే అది గ్రీకుల దగ్గరనుండి వచ్చినది. ఇవాళ యూరపులో మహా పరిశోధనలు జరుగుతూ ఉన్నవంటే ఒక శాస్త్రజ్ఞానం వృద్ధి పొందిందంటే ఒక సాహిత్య విద్య వృద్ధిపొందిందంటే అదంతా గ్రీకుల వరవడి. తత్త్వశాస్త్రము, గణితశాస్త్రము, ఖగోళ శాస్త్రము, సాహిత్యశాస్త్రం అన్నీ వాళ్లు గ్రీకులదగ్గరనుండే తెచ్చుకున్నారు. ఆ గ్రీకు లివన్నీ అక్కడికి వెళ్ళిన భారతదేశ పండితుల దగ్గర నేర్చుకున్నారు. వాళ్ళ పసుక్రీస్తు చెప్పిన విషయాలు కూడ భారతదేశము నుండి వెళ్లినవే. కాని పాశ్చాత్యులు తమ దురహంకారముచేత గిరీశ దేశములో యివన్నీ స్వతంత్రంగా ఉద్భవించినవి అని వ్రాసుకోవటమే కాకుండా ఖగోళ విద్య భారతీయులు వాళ్ళ దగ్గరనుంచి నేర్చుకున్నారని వ్రాశారు. వరాహ మిహిరాచార్యుడు క్రీస్తు పుట్టక ముందటివాడు ఆయన వ్రాసినది పంచ సిద్ధాంతిక. అదివరకున్న ఐదు సిద్ధాంతాలను క్రోడీకరించి వ్రాశాడు. వేదము అనాదిది. యజ్ఞ బోధకము యజ్ఞములు ఖగోళమునందలి గ్రహముల ననుకూలింప చేసుకునే కర్మలు.

# అష్టమ భాగము

## అహోవాలుకానదులు

## 1

పతంజలిశాస్త్రి అచ్చంగా భూగర్భతత్త్వ పరిశోధనా ఫలితాలు జంబూకుశ శాల్మలీ ద్వీపాలలోని నాగరకతలను గుఱించి మాత్రమే చెబితే ఆయనకు రెండు నెలలు ఎక్కువ అవుతవి, రెండు నెలలు చెప్పాలి ? చెబితేగాని చాలా రోజులు చెప్పాడనే అభిప్రాయము ప్రజలకు కలుగదు. ఈ సమన్వయంచేస్తూ మధ్య మధ్య రామయణాన్ని గురించి భారతాన్ని గురించి కూడా చెబుతూవచ్చాడు. మొత్తము మీద రామాయణమంతా చెప్పాడు. ఈ కథలన్నీ నడుమనడుమ అనుసంధానం చేస్తూ వచ్చాడు, మొత్తంమీద రామయణోపన్యాసాలు చేసినట్లే లెక్క. నవాబుపాలెంలో పతంజలిశాస్త్రి గారన్నాయన రామాయణోపన్యాసాలు చెబుతున్నాడు, అని అనుకుంటున్నారు గాని కుశప్లక్ష జంబూశాల్మలీ ద్వీపాలలోని ఆర్యులయొక్క పూర్వ

యాత్ర, స్థాపించిన రాజ్యాలు పొందిన మార్పులు, వీటిని గురించి చెబుతున్నాడని ఎవరూ అనుకోలేదు. ఆయన మళ్ళీ వచ్చి పదిహేనురోజులయింది గిరీశదేశాన్ని గురించి నాలుగైదుసార్లు చెప్పాడుతప్పతక్కినదంతా రామాయణాన్ని గురించే చెప్పాడు. ఒకరోజున విఠలరావుకి హఠాత్తుగా మళ్ళీ జబ్బు చేసింది. వాళ్లు కొట్టినప్పుడు తలమీద రెండు దెబ్బలు గాఢంగా కొట్టారు. మెదడులోని మాంసము కొంత ముద్దకట్టినది. అందుచేతనే స్మారకములేకుండా రెండు మూడురోజులుపడిఉన్నాడు. డాక్టర్లు ఏ మహాపట్టణానికో తీసుకొని వెళ్ళి శస్త్ర చికిత్స చేయించవలసి వస్తుందేమో అనుకున్నారు. కాని పతంజలిశాస్త్రి మంత్రజలంతో ఆ ఆపదతీరింది. మళ్ళీ యీరోజున తలలోని మాంసము ఏమి చెదరిందో మళ్ళీ స్మృతితప్పి పడిపోయినాడు. ఇంక లాభములేదు. మహానగరానికి తీసుకు వెళుదామనుకుంటున్నారు. తీసుకువెళ్ళినా ఆనాటి రాత్రిచూచి మరునాడు తీసుకుపోదామని. పతంజలిశాస్త్రి పోయి విఠలరావుని చూచాడు. రంగన్న షావుకారు "అయ్యో! ఇది మీచెయి దాటి పోయినట్లున్నది" అన్నాడు పతంజలి "నేను యీవేళ జపంచేస్తాను. రాత్రి ఏ రెండు గంటలకో తెచ్చి తీర్థమిస్తాను. నాకు సాధ్యమవుతుందో కాదో నా ఉపాసనా దైవము నాకు చెబుతాడు. ఆయన చెప్పకపోతే రేపుపొద్దున మీరు ఎట్లాగూ తీసుకువెళ్ళుతారుగదా" అని చిదంబరం యింటికి వచ్చాడు. జపం మీదకూర్చున్నాడు. రాత్రిపన్రెండు దాటింది. తేజో

మూ_ర్తి కనిపించాడు. ఆ తేజోమూ_ర్తి పతంజలితో యిల్లా అన్నట్లు పతంజలికి స్ఫురించింది. "ఇతనికి నిమ్మదిస్తుంది. నీకు యీ ఊళ్ళో చాలా లాభిస్తుంది. ఇతనికి ఒక సంవత్సరం యింకా ఆయుర్దాయం ఉన్నది. నెమ్మదించి మళ్ళీ బాగా తిరుగుతాడు. కాని నాగడి కుటుంబాన్ని నాశనము చేస్తాడు. అప్పుడు మళ్ళీ తిరగబెడుతుంది. అది చివర." అని మళ్ళీ ఏదో అన్నాడు. "నీవు జాగ్రత. వెంటనే మళ్ళీ నల్లని బొమ్మ కనిపించింది. పతంజలిశాస్త్రి తనకు మృత్యువు వస్తుంది అనుకున్నాడు. విఠలరావునుగురించి అంత విస్పష్టంగా వచ్చిన స్ఫురణ తన్ను గురించి ఎందుకురాలేదు ? విఠలరావును గుఱించి సంకల్పన చేసి తాను ధ్యాన నిమగ్నుడైనాడు. తన్ను గురించి తాను తన భవిష్యత్తును గురించి తెలిసికోవలెనని సంకల్పం చేయలేదు. అలా చేసి నాలుగైదు రోజులు తాను దేనిని గురించి జాగ్రత పడవలయునో తెలిసి కొందామనిపించింది. అప్పటికే ప్రొద్దు పోయింది. తీర్థము పుచ్చుకొని రంగన్న షాహుకారు యింటికి వెళ్ళాడు. విఠల్‌రావుకి తీర్థమిచ్చాడు. మఱునాటి ప్రొద్దుటికి లేచి తిరుగుతాడు అని చెప్పాడు. నాలుగైదు రోజులలో పూ_ర్తిగా నిమ్మదిస్తుంది అన్నాడు. నాలుగైదు రోజులలో విఠల్‌రావుకి పూ_ర్తిగా నిమ్మదించింది. ఊళ్ళో తిరగటం ప్రారంభించాడు. అదివరకు మాడుపట్టున సన్నగా నాదుగా ఉన్నదనే వాడు. ఇప్పుడదికూడా లేదు.

పతంజలిశాస్త్రి ఉపన్యాసాలు రెండే మిగిలాయి.

రెండో ఉపన్యాస మవటంతోటే ఆయనకు సన్మా
నము చేయాలి. ఆ మరునాడు ఆయన వెళ్ళిపోతాడు. పెద్ద
ప్రయత్నాలు సాగుతున్నవి. రంగన్న షాహుకారు తక్కిన
రెండువేలు యిస్తానన్నాడు. విఠలరావు ఇంకో వేయికూడా
యివ్వాలి అంటే అతనితల్లి అతని భార్య కొంచెము అభ్యంత
రము పెట్టారు పూర్వము విఠలరావు తన తల్లికి తన భార్యకు
ఎక్కువపడక విడిగా ఉండేవాడు. ఈ జబ్బు చేసిన తర్వాత
అత్తకోడలు ఒకటే అయినారు. వాళ్ళిద్దరు ఏకకంఠముగా
అంటే విఠలరావుకి సాధ్యము కాలేదు. కాని విఠల్‌రావు
తాను తన కారులోవెళ్ళి ఊరు మొత్తముమీద పెద్ద పెద్ద
షాహుకారుల దగ్గర మొత్తం మరి రెండువేలు చేశాడు. పది
పదిహేను ధోవతుల చాపులు నాలుగైదు కాశ్మీరు శాలువలు
చేతికి సింహతలాటపు మురుగులు నాలుగువేల రొక్కము పెద్ద
సన్మానము ఏర్పడింది. ఆ రోజు సాయంత్రము ఉపన్యాసము
బ్రహ్మాండముగా ఉన్నది అనుకున్నారు. రామ రావణ
యుద్ధాన్ని గురించి చెప్పాడు. రామాయణమంతా సాంఖ్య
మతం ప్రకారం అద్వైత మత ప్రకారం చాలా వ్యాఖ్యానం
చేశాడు. పురుషుడు, ప్రకృతి, జీవుడు, దేవాసుర విభాగము
మన దేశములో ఉండే యీ మతాలు తత్త్వాలు అన్నింటినీ
సమన్వయంచేసి బ్రహ్మాండముగా చెప్పాడు. జనము విరిసిపోయి
నారు. జనము మురిసి పోయినారు.

ఆనాటి రాత్రి తానింత బాగా చెప్పానని మరునాడు

తనకు జరుగబోయే సన్మానముయొక్క క్షణము అంతా ఆనోట ఆనోట తనకు తెలిసిన సంతోషం ఒకటి అతనిని పట్టుకోటానికి వీలులేకుండా ఉన్నది. కాని చదువుకున్న వాడు కనుక కొంత అదుపులో పెట్టుకున్నాడు. తన ధ్యానమునందు తనకు కనిపించిన తేజోమూర్తి విఠలరావు యొక్క భవిష్యత్తును గూర్చి చెప్పిన సంగతి మరచియే పోయినాడు. ఆ విఠల్ రావు యెంతో సత్పురుషుడని కృతజ్ఞుడని తనలో తాననుకోటమే కాదు.అందరి దగ్గర అతని ప్రశంస చేయటము ప్రారంభించాడు. జపము మొదలు పెట్టాడు. తన భవిష్యత్తు తాను తెలిసికొందామని. మనస్సు ఏమీ నిలువలేదు. ఎంత సేపటికి తన అప్పు అంతా ఒక్కసారి తీరిపోతున్నదని, సింహ తలాటపు మురుగులు వస్తున్నవని, రెండు మూడేండ్లదాకా తాను కట్టుకునే గుడ్డ కొనుక్కోనక్కరలేదని. తనకొక శాలువా ఉండగా యింకా నాలుగు శాలువలుంటవని, ఒకటి తన యింట్లో వంటచేసి పెడుతూఉన్న మేనమామ కూతురికి యిద్దామని, అది పేదరాలు సంతోషిస్తుందని, మళ్ళి ఏడాది అయింతర్వాత విఠలరావుకి జబ్బుచేస్తే తనకోసము వస్తారని, వస్తే తానేమీ చేయలేనని ఆవేళకి ఏ హృషీకేశమో వెళ్ళి నాలుగైదు నెలలు తీర్థయాత్రలు చేస్తే తాను వీళ్లకు అందడు. తన ప్రతిష్ఠ నిలుస్తుందని జపమంతా యిలాంటి ఊహలతో సాగింది. మఱునాడు ఉపన్యాసము ప్రారంభించాడు. "మనము యిదివఱకు నీలానది, యూపరతీశనది, గిరీశనది, గంగానది

నాలుగు నదులను గురించి తెలుసుకున్నాము. ఆయా ప్రాంతాల నాగరకతలన్నీ యెల్లా మనదేశంనుంచి వెళ్లినవో, యెల్లా వికారం పొందినవో, యెల్లా మారిపోయినవో, పాశ్చాత్యులు వాటన్నిటికి ఎల్లా దుర్వ్యాఖ్యానాలు చేశారో మన నాగరికత యొక్క పౌరాతన్యాన్ని మన సంస్కృతభాష యొక్క ప్రాధాన్యాన్ని కాదనటానికే వాళ్ళు సర్వ ప్రయత్నాలు చేశారని చూపించాను. ఇప్పుడు మరి రెండు నదులను గూర్చి చెప్పబోతున్నాను. మొత్తము ఆఱునదులు. త్రిగిరీశ, యూపరతీశ నదులు రెండూ ఇంచుమించుగా ఒకటే. అట్లాగే యిప్పుడు నేను చెప్పబోయే రెండు నదులుకూడా ఒకటే. ఇవి రెండూ నేడు రష్యా అని పిలువబడే దేశములో నున్నవి. ఒక నదిపేరు ఆపోనది. దానిని వాళ్లు ఆబ్ అంటారు. ఆపః అంటే నీరు. పకారము బకారమయినది. పంజాబ్ అంటున్నారుకదా! అల్లాగే! నదిపేరు వోలా. ఈ శబ్దము రెండవ నిజానికి నాలుకా. నాలుకా అంటే ఇసుక—నాలుకాసికతా. ఈ రెంటికీ యిసుక అనిపేరు. ఈ రెండు నదులు రష్యాలో యున్నవి. రాజ్య శబ్దమునకు రష్యా శబ్దము సన్నిహితముగా లేదా ? రాజ్య అన్నశబ్దము రష్యా అయినది. జకారము షకారమయినది. ఇంతే భేదము.

ప్రపంచంలో అనేక భూభాగాలు ఉన్నవి. ఒక్కొక్క భాగంలో ఒక్కొక్క విలక్షణత్వ మున్నట్లుంది. మన భారతదేశ మున్నది. ప్రథమ సృష్టి యిచ్చట జరిగింది. భగవంతుడు

ధర్మాన్ని మొదట యిచ్చట స్థాపించాడు. తాను దశావ తారాలు యిచ్చటనే ఎత్తాడు. ఎన్ని విప్లవాలు వచ్చినా వైదికధర్మము ఇచ్చట చెడిపోదు. సర్వనాశనం జరుగుతున్నది. అనిపించినప్పుడు కూడ మళ్ళీ ఆ చివరి నిమిషంలో తెలియ కుండా ఏ కారణమో కలిగి ఆ వేదమతము మళ్ళీ వృద్ధి పొందు తుంది. బౌద్ధమతము యిరువదైదు శతాబ్దాలు యథేచ్ఛముగా విజృంభించింది. ఇంక వేదమతము తలయెత్తదనుకొన్నారు. ఉత్పన్నమై పోయిందనుకొన్నారు. ఇంతలో వేతమతం మళ్ళీ పునరుద్ధరింప బడింది. మళ్ళీ తన ప్రభావాన్ని తానుపొందింది. ఈ విషయమే అనన్త మన్వంతరములమీద అనన్త కల్పముల మీద వేదమతానికి ఎట్టియెట్టి యిక్కట్టులు వచ్చినవో మళ్ళీ ఎల్లా యెల్లా సముద్ధరింప బడినదో చెప్పబడినది. పురాణాలలో ఈ విషయమే ప్రధానంగా పురాణాలు వ్రాయబడినవి. వేద మతము నిత్యమతము. దీనికి సనాతన మతమని పేరు. సనాతన మను శబ్దమునకు నిత్యము అని పేరు. ఏమిటయ్యా ఈనిత్యత్వం అంటే మానవుని యొక్క పరమ వివేకను నిత్యమైనది. వాడు పరమ చైతన్య స్వరూపమైన మాట నిత్యమైనది. పరమ యథార్థమైనది. పరమ వివేకియై పురుషుడు ఎప్పుడూ తాను పరబ్రహ్మ స్వరూపమని తెలిసికొంటాడు. మూఢులు, అల్ప జ్ఞులు, దురహంకారులు, స్వార్థపరులు లోకాన్ని సంగ్రహించే టందుకు మధ్యమధ్య కొన్నివందల యేండ్లో కొన్ని వేలయేండ్లో దుర్మతాలను పెంచికొని దుష్టరాజ్యాలు స్థాపించుకొని భోగ

వాంఛాపరాయణులై యిదే నిత్యమని యెంత ఏడ్చినా—
ఒక మోటుసామెత ఉన్నదే 'సముద్రములో కాకిరెట్ట'—ఈ
అనంత కాలంలో పరబ్రహ్మ స్వరూపమైన జీవునియొక్క అనంత
నిత్యత్వంలో యివన్నీ ఏమూలా ? మనుష్యుడు మహా బ్రతికితే
వంద ఏండ్లు బ్రతుకుతాడు. తరువాత శక్తి ఉడిగిపోతుంది.
మొదట యిరువది యేండ్లు బాలుడు. అంతటి దీర్ఘాయుష్కుల
సంఖ్య చాలా తక్కువ. ఈ రాజ్యాలు సంపాదించి దుర్మతా
లను వ్యాపింప చేసేవాళ్ళు ప్రతివాడు మహా దౌర్జన్యం చేస్తే
నలభై ఏండు చేస్తాడు. వాడు చచ్చిన తర్వాత కూడా వాడి
వంటివాళ్ళు వాడిమతాన్ని వాడి రాజ్యాన్ని సాగిస్తున్నా
రన్నది వాడికేమి తృప్తి ? వాడు యెక్కడ ఉన్నాడు ? ఈ
అల్పబుద్ధులకు తాము బ్రతికిన నలుబది యేండ్లలో యీ తృప్తి
మళ్ళీ అదే దురహంకారము. మళ్ళీ అదే దౌర్జన్యము. ఎవళ్ళో
బుద్ధిమంతులు పుడుతూనే ఉంటారు. ఇదంతా వ్యర్థమని వాళ్లు
గ్రహిస్తూనే ఉంటారు. ఎప్పుడో వాళ్ళకి ప్రాధాన్యం వస్తుంది.
ఆ భావాలు కలవాళ్ళు మహారాజు లవుతారు. రాజ్యాధికారు
లవుతారు. వైదికమతం పునరుద్ధరింప బడుతుంది. ఈ ఎగుడు
దిగుడ్లు సృష్టిలో యున్నవి. అహంకారాలు తాత్కాలికాలు.
ఈ భారతదేశము నిత్యమైనది అని పురాణాలు చెబుతున్నవి.
ఈ ధాత్రికి కల్పములు మన్వంతరములు కడచినవి. ఈ ధాత్రి
కనగా యీ ధర్మమునకు; తక్కిన భూఖండములయందు యీ
నిత్యత్వములేదు. ఏవో మతాలు రావటము ఏవో రాజ్యాలు

స్థాపించటం రెండు మూడు వందల యేండ్లో మహా అయితే ఒక వేయియేండ్లో వాటిప్రతిభ సాగటం వాటిదారిని అవి నశించిపోవటం ఒక మనుష్యుడికి జాతకం ఉన్నట్లే ఒకదేశానికి జాతక ముంటుంది. ఒక మతానికి జాతకముంటుంది. ఆ దేశం సామ్రాజ్యాన్ని నిర్మించుతుంది. కొన్నివందల యేండ్లు నడిమింటి తారవలె ఉంటుంది. పడిపోతుంది. ఇంక సోదెలోకికూడ రాదు. అట్లాగే అల్ప నాగరకతలు కూడా. మతాలు కూడా అంతే. ఎప్పుడో పుడుతుంది. కొన్ని వందలయేండ్లు ఉండీ ఉండనట్లు ఆమూలా ఆమూలా దేవులాడుతుంది. దానికి మంచి రోజు వస్తుంది. రెక్కలు విప్పుతుంది. తెగ విహరిస్తుంది. మంచి కాలము పోయేటప్పటికి రెక్కలు ఊడిపోతవి. మూలపడి పోతుంది. ఉంటే మంచంలోపడ్డ వాడికిమల్లె ఉంటుంది. లేక పోతే ఊడిపోతుంది. ప్రపంచంలో ఎందుచేత యిట్లా జరుగుతున్నది ? అన్న ప్రశ్న మహాబుద్ధిమంతుడు వేసుకొంటాడు. మానవుడు స్వార్థముచేత దురహంకారముచేత కామప్రవృత్తి చేత దౌర్జన్యంచేత క్రూరత్వంచేత పశువుగా ప్రవర్తిస్తున్నాడు. ఇది అధర్మము. భగవంతుడు దీన్ని సహించడు. పెఱుగనిస్తాడు పెఱుగనిస్తాడు. ఇలా ఉండగా ఒక్కొక్క భూభాగంలో ఒక్కొక్క విలక్షణత్వం ఉంటుంది. ఆ గడ్డలో మానవ బుద్ధికి అతీతమైన ఒక శక్తి ఉంటుంది. అది దుష్టశక్తియో మంచిశక్తియో తెలియదు. అనంత కాలముమీదకాని మనము తెలిసికొనే జ్ఞానము మనకు కలుగదు. మానవునకు ప్రత్యక్ష

మైనదే తెలియబడే సామాన్యమైన బుద్ధినే భగవంతుడిచ్చాడు. ఈ రష్యాదేశము ఒక విచిత్రమైన గడ్డ. వైదికమైన సనాతన మైన ధర్మం అక్కడ నశించవలెనని పరమాధోగతికి వెళ్ళవలె నని నిర్ణీతమైన విషయమేమో ! ధర్మమునందు బుద్ధికలిగి ఉండటం. అశక్తతచేత జారిపోవటం ఇదివేరు. అధర్మమే నిత్యమనుకొనటం వేరు. దైవము లేదు. మానవమే ఉన్నది. మానవుని భోగమే పరమార్థము. ఈ భావానికి రష్యా పాదు.

# 2

పతంజలిశాస్త్రి ఆనాడు మళ్లీ జపానికి కూర్చున్నాడు. ఏమీ సాగటంలేదు. ఆశ్చర్య పోయినాడు. ఈ మనస్సును అరికట్టి నటువంటి, యీ యింద్రియాలను జయించి నటువంటి యీ వాంఛలను అదుపులో పెట్టుకోగలిగి నటువంటి మహాను భావులు అమ్మయ్యో మనస్సు నిలిచిచస్తుందా ? తన కేమి ఒక రాజ్యములేదు మహా సైన్యాలులేవు. గెలువవలసిన రాజ్యాలులేవు. సంపాదించవలసినలక్షలులేవు. మునిగి పోతూ ఉన్న ఓడలులేవు. తగులబడి పోతవేమో అనే ధాన్యరాసులు లేవు. గడ్డివాములు లేవు. పశువులులేవు. ఏమైపోతారో అన్న సంతానం లేదు. ఇంటికిపోయి సుఖపడదా మనుకుంటే దానికి యోగ్యమైన భార్యకూడా యింటిదగ్గర లేదు. ఇంటికిపోవటం దుఃఖంకోసం. ఇల్లు, భార్య యిది అలవాటు, మానవుడు తక్కిన వాటికంటె యీ అలవాటుకి ఎక్కువదాసుడు. తన కారువేలు అప్పుఉన్నది. రెండువేలుతీర్చాడు. తక్కిన నాలుగు వేలు రేపు వచ్చేటట్టు ఉన్నవి. ఈ మనస్సు నిలవటంలేదు.

నిలిస్తే కాని ఆ దేవతామూర్తి కనబడదు ! అతను జాగ్రత్త అన్నాడు. నల్లబడి పోతున్నాడు. అదియేమిటో తెలిసికోవాలె నన్న వాంఛ తనకున్నది. అందులో తనకేదో అనిష్టం జరుగు తుంది. అనే అనుమానం ఉన్నది. ఈ అనుమానాన్ని అణగ త్రొక్కి రేపుజరగబోయే సన్మానాన్ని గురించి మనస్సు ఉవ్విళ్ళూరుతున్నది. ఏమి చిత్రముగా నున్నది ? అయిపోయి ఇంటికిపోయి వాళ్ళడబ్బు. వాళ్ళ మొఖాన పారవేసి. అమ్మయ్య అనుకొని తరువాత రెండు మూడు రోజులు గడుస్తేనే కాని మళ్ళీ యీ మనస్సు నిలువదు. అప్పుడు కాని ఆధ్యానమూర్తి కనిపించదు. ఈ పరమాత్మ విషయమునకు మనస్సుకొట్టు కోవటం హృదయం నిలువకపోవటం ఇది జంతు లక్షణమంటే అనేక పూర్వజన్మలలో అభ్యాసం చేసివుంటే కాని మహాపుణ్య కార్యాలు చేసివుంటే కాని యీ మనస్సు నిలువదు. పూర్వ మెప్పుడో కొంత పుణ్యంచేశాము. రకరకాల పుణ్యాలుచేశాము. ఒక పుణ్యానికి అన్నోదకాలు ఉన్నవి. ఒక పుణ్యానికి ఏదో చదువుకున్నాము. మరొక పుణ్యానికి వేదధర్మము మీద విశ్వాసం నిలిచింది. ఇంకొక పుణ్యానికి యిన్నాళ్ళు బ్రతికి ఉన్నాము. మరొక పుణ్యానికి ఆరోగ్యము ఉన్నది. పాపాలు చేశాము. ఒకదానికి ఒకడే ఒకడు కొడుకుపుట్టి పోవటమూ ఒక దానికి అటువంటి భార్య దొరకటం. అన్ని సామాన్య పుణ్యాలు సామాన్య పాపాలేకాని.నాస్తిక బుద్ధి ఏర్పడే మహా పాపంచేయలేదు. పరమ వైరాగ్యం ఉదయించే మహా పాపం.

చేయలేదు. సోఫియాకు సాముద్రిక శాస్త్రం అఖండంగా తెలుసునట ! నాకు జరుగబోయే ఆపదయేమో ఆవిడ చెప్ప కలుగునేమో. ఆవిడ చాలా పండితురాలు. ఎంతో వైదిక మత విశ్వాసము కలిగినది. చాలా యోగ్యురాలు. దయావతి. ఆ బంట్రోతుకి భార్య పోయిందంటే వందరూపాయలు యిచ్చి పంపిందట. యాచకులు ఎవళ్లు వెళ్లినా రూపాయికి తక్కువ కాకుండా యిస్తుందట. పండితులు వెళ్ళితే నాలుగైదు యిస్తుందట. అంత యోగ్యురాలేమి ? ఆమె కైస్తవుని పెండ్లియాడుట యేమి ? ఎవరు చెప్పగలరు ? కొందఱు కొందఱికి అన్నీ ఉంటవి. ఒక్క స్త్రీ సుఖముండదు. ఏ కర్మ పరిపాకమో ? రేపు సన్మానమైనప్పుడు ఆవిడచేత చేయి చూపించుకొని వెడతాను. మనస్సు ఎట్లాగో నిలువదు." అని పతంజలిశాస్త్రి జపం మానివేసి నిద్రకోసం కొంచెం జపం చేసి నిద్రపోయినాడు.

మఱునాడు ఉపన్యాసానికి ప్రాధాన్యము లేకపోయింది. సన్మానానికే ప్రాధాన్యము వచ్చింది. నాలుగువేల రెండువందల రూపాయలు వచ్చినవి. నాలుగువేలు రంగన్న షావుకారు ఊళ్ళో పోగుచేసినది మొత్తము. సోఫియా సభలో రెండు వందలు యిచ్చినది. ఆవిడను జనం తెగపొగిడారు. కుడిచేతికి సింహతలాటపు మురుగు వేశారు. ధోవతుల చాపులు శాలువలు అనుకున్న వాటికంటే ఎక్కువ వచ్చినవి. ఆ ఊళ్ళో పద్మశాలీలు ఎక్కువమంది. ముప్ఫై నలభై మగ్గాలు ఉన్నవి.

నెరవు పొడవు కలిగిన లక్కంచు యెనిమిది గజాల నూరో నంబరు ధోవతుల జతలు వచ్చినవి పదిహేను, పదహారు. అంతా దివ్యంగా ఉన్నది.

ఆరోజున పతంజలిశాస్త్రి చేసిన ఉపన్యాసం రెండు భాగాలు, మొదటి భాగం యిది. "ఆ రష్యా ఉంది. భారత దేశమునుంచి వెళ్ళిపోయిన అసురజాతి అస్సీరియా అన్న దేశం నుంచి అనగా జంబూ ద్వీపముయొక్క ఉత్తరభాగము నుండి కుశద్వీపము యొక్క ఉత్తరభాగము నుండి చాలా మంది వెళుతూ వచ్చారు. తక్కిన భాగాలకి వెళ్ళినవారు యితర వర్గాలవాళ్ళు, అసురులు అందరు బ్రాహ్మణులు. ద్రావిడులు కారు. వాళ్ళు యజ్ఞయాగాది క్రతువులు చేసేవారు. వాళ్లు తపస్సులు చేసేవాళ్ళు. వాళ్ళ తపస్సుకు వాళ్ళ క్రతువులు ఎంత సేపటికి ఐహికాన్ని సాధించేందుకు, శత్రువులను నిర్జిం చేందుకు, మూడు లోకాలని గెలిచేందుకు. గెచావులేకుండా చేసుకునేందుకు, దేవతల యజ్ఞాలు ధ్వంసం చేసేందుకు, అది ఒక విలక్షణమైనజాతి. వాళ్ళు అసురులు. పరమ క్రూరులు మాంసాహారులు. నరమాంస భోక్తలు, వాళ్ళు పెళ్ళిళ్ళు చేసు కుంటారు. ఇతరుల భార్యలను ఎత్తుకువస్తారు. వీళ్ళల్లో మరి గాఢిత మైనజాతి యింకొకటి పుట్టింది సస్త్ర గాఢితమని అంటారు. పిండి సన్నని గుడ్డలోపోసి చేతితో త్రిప్పుతూ ఉంటే సన్నని పిండి క్రిందికిపోయి బరక పైకి మిగులుతుంది. అది సన్నని పిండికాదు, నూకలు కావు. బరక పిండి. ఈ

క్రియను గాళితమంటారు. ఈ అసురులలో గాళితం చేయగా బరకపిండి జాతి తయారైంది. వాళ్ళ సిద్ధాంతాలు వేరు. పెళ్లిళ్లు చేసుకోరాదు. కొందరు ధనవంతులు. కొందరు పేదలు, ఉండకూడదు. అందఱు సమానులే! ఇదే జన్మ. ఇంకొక జన్మ ఉండదు. ఇల్లాంటి పది సిద్ధాంతాలు ఏర్పాటు చేసుకొన్నారు. ఇతరులను దోచుకు తినటము తప్ప ఇంకోటి ఉండదు. స్త్రీ సర్వ సామాన్యం ఆమెకు నియతంగా పురుషుడు ఉండకూడదు. కోరికల నణచుకోకూడదు. అది ప్రకృతి. బయటి ప్రకృతిని స్వాధీనం చేసికోవటమే పరమార్థం. ఆహారంలో విశేషత ఉండ కూడదు. మాంసం తిన్నకొద్దీ బలం వస్తుంది. శాకాహారం పనికి రాదు. మనుష్యులు బలహీనులయి పోతారు. చచ్చిన తరువాత చేసేదిలేదు. తల్లి, సోదరి యిల్లాంటివన్నీ అబద్ధాలు, ఇల్లాంటి బహు సిద్ధాంతాలు బయలుదేరినవి. వాటిని ప్రధాన అసురులు అంగీకరించలేదు. అందుచేత అల్లాంటివాళ్లు జంబూ ద్వీపము నుండి తండాలు తండాలుగా వెళ్ళకొట్టబడ్డారు. వాళ్ళందరు గాళితులైనారు. గాలులైనారు. వీళు రష్యా పోయినారు. మొదటి వాళ్ళకి ఆపోనది కనిపించింది. బ్రతికేందుకు మొదటిది గాలి. రెండవది నీరు. అది నీరు. అందుచేత ఆ నదికి ఆబ్ అని పేరు పెట్టారు. ఆదేశంలో అప్పుడు అడవి మృగాలు ఉండేవి. తోడేళ్ళు ఎక్కువ; మంచు సముద్రంలో తిరిగే సీలు మృగాలు యెక్కువ. ఆ మృగాలు వీళ్ళని చంపేవి. వీళ్ళు ఆ మృగాలను చంపేవారు. వాటిని వీళ్లు తినేవారు. వీళ్ళని అవి తినేవి.

మృగాలు నోటితో చంపుతవి, మనుష్యులు చేతులతో చంపు తారు. కర్రలు, గసికలు, కత్తులు, రాళ్లు వేటితో పడితే వాటితో చంపుతారు. వీళ్లు దాక్కోగలరు. పదిమంది క్రమ్మి మృగాన్ని చంపగలరు. ఉపాయంతో తోడేళ్ళ నోళ్ళల్లో కర్రలు పెట్టి కర్రలతో కొట్టి చంపగలరు. వీళ్ళు రకరకాలుగా చంపగలరు. మృగ మన్నది నూటికి కోటికి మనుష్యుల్ని చంపుతోంది. వీడో వాటిని సమృద్ధిగా చంపుతాడు. తోడేలు పరమ క్రూర మృగము. దానికి సింహానికి ఉన్న దర్జాలేదు. పెద్దపులికి ఉన్న కొంచెము వివేకము లేదు. ఈ గాలులు దాని మాంసము తిని ఆపోనది నీళ్లు త్రాగి యింకా పైకి పోయినకొద్దీ వాలుకానది కన్పించి అది యెక్కువభాగం ఇసుక అయినా వర్షే బహ్మాండంగా వస్తుంది. కనుక ఆ నీళ్ళుకూడా త్రాగి, దానికి వాలుకా నది అని పేరుపెట్టుకొని వాలుక అన్న పేరు వాల్గా కాగా భాష యేమో సంస్కృత వికారము, జ్ఞానమే మో మానవులది వృత్తి రాక్షసులది. ఆలోచన మానవులది. ఆహారం పరమ క్రూరమైనది. ఆజాతి తయారైంది. వివస్త్రిలు, జంతుచర్మములు స్త్రీ పురుష విభేద పరిజ్ఞానం లేనివాళ్ళు మళ్ళీ కత్తులు కఠారులు కలవాళ్లు. జనం తెగ పెరిగి పోయినారు. అప్పటికి కుశ ద్వీపంలో జర్మనీ, ఫ్రాన్సు, స్పెయిన్, స్విట్జర్లాండ్ మొదలయిన దేశాలు శీతోష్ణ పరిస్థితులవలన నిండిఉన్న జల మగుటవలన నివాసయోగ్యంగా ఉండేవికావు. అవి క్రమంగా ఆరిపోయి వృక్ష గుల్మాదులు బయలుదేరి యీశపీఠ భూమినుండి శిశిర

క్రీత ద్వీపాలనుండి లఘుద్వీపమునుండి జంబూ ద్వీపము క్రింది
భాగమునుండి గిరీశదేశమునుండి జనులువెళ్ళి ఆ దేశాలలో
వీలైన చోట్లనల్లా నివాసాలు ఏర్పాటుచు కొన్నారు. నివసించే
వాళ్ళు ఆటవికులు అయినా వచ్చిన దేశాలను బట్టి కొంత
నాగరకత కొంత సాధువృత్తి కలిగి ఉండేవాళ్లు. ఈ గాలులు
వాళ్ళమీదికి దండెత్తారు. ఫ్రాన్సు, స్పెయిను, జర్మనీ, ఇటలీ
మొదలయిన సర్వదేశాల మీదికి వరదలు వెళ్ళినట్లు వెళ్ళారు.
వాటి నాక్రమించుకున్నారు. కాని వాళ్ళ నాగరకత నేర్చు
కున్నారు. ఆ యూరపులో ఏ దేశములో అయినా యెక్కువ
మంది జనసంఖ్య గాలులు. ఆ దేశాలు నాగరకములైనవి. ఆ
నాగరకత రష్యాకు వెళ్లింది. దండెత్తి రావటానికి వీలులేదు.
ఇక్కడ రాజ్యాలు ఏర్పడ్డవి. తొలుత గ్రీకు మతము తరువాత
నాగరకతా అని చెప్పుకోదగ్గ క్రైస్తవమతం ప్రబలింది. రష్యా
కూడా మారింది. కాని తొట్టతొలుత వాళ్ళ సిద్ధాంతాలుఅనగా
అవమాన సిద్ధాంతాలు అసురుల సిద్ధాంతాలు కూడా కానివి
జంతుసిద్ధాంతాలు. ఏసిద్ధాంతాలతో మొదట గాలులు అక్కడకు
వచ్చారో ఆ సిద్ధాంతాలు ప్రబలంగా ఉన్న నేల అది. ఆ నేలలో
ఆ లక్షణం ఉన్నది కాబోలు. మళ్ళీ యీ నాటికి ఆ దేశపు
ప్రజలో నాగరకులై కూడా ఆధునిక ప్రకృతి శాస్త్ర విజ్ఞా
నంలో అమెరికాతో దీటైన లక్షణంఉండి కూడా ఆ సిద్ధాంతాల
వైపుకు మొగ్గుచూపి ఒక మతము అక్కడే బయలుదేరిందంటే
ఒకొక్కక్క భూభాగముయొక్క లక్షణం మధ్యమధ్య కలక

వేస్తూనే ఉంటుంది అని చెప్పాలి. ఆ సిద్ధాంతం నేడు అక్కడి కన్న కూడా చైనాలో ప్రబలిందంటే ఆ చైనాగడ్డలో ఏ రహస్యమైనా నిగూఢమైన జంతు లక్షణం వికసించేందుకు భగవంతు డేర్పాటు చేశాడో తెలిసికొనటం సాధ్యంకాదు." ఇది పతంజలిశాస్త్రి ఇచ్చిన ప్రథమోపన్యాసము. రెండవ భాగము సామాన్యమైనదే. సామాన్య మనగా ధర్మము, నీతి, దైవము, ఆధ్యాత్మికము వాటిని గూర్చినది. కొంత అందఱిని పొగడటం, విఠలరావు, వాళ్ళ నాన్న. సోఫియా అందటిని ప్రశంసించటం. సభ అయిపోయింది. ఇంటికి వచ్చాడు. డబ్బు జాగ్రత్త చేసుకొన్నాడు. రాత్రి పండ్రెండు అయినది. ఎవరి దారిన వాళ్లు వెళ్ళారు. ఏదో సంధ్యావందనమల్లే చేశాడు. పడుకొన్నాడు. అందరు పడుకొన్నారు. ప్రొద్దున్నే వెళతామనుకొన్నాడు. నిద్ర పట్టటంలేదు. తెల్లవారుకట్ట అయిదింటికి రైలు ఉన్నది. ఎల్లాగూ నిద్రపట్టదు. నాలుగువేలు తన చేతిలోకి రావటము ఒక యెత్తు, సోఫియా రెండువందలు ఇవ్వటం ఒక యెత్తుగా ఉన్నది వెళ్ళి ఆవిడకి వ్యక్తితః ముఖతః తన సంతోషం చెప్ప వలెననుకున్నాడు. చేయికూడా చూపించుకోవచ్చు ననుకున్నాడు. ఒంటిగంట కావస్తున్నది. మూడు మూడున్నర దాకా అక్కడఉంటే వచ్చి నాలుగింటికి స్నానముచేసి యెక్కా యెకిన రైలుకి పోవచ్చును. డబ్బు భద్రంగా తన జేబులోనే యున్నది. రెండు పెట్టెలు సర్దాడు, ఆవిడఉన్న బంగళా ఆ సందు చివరే యున్నది. ఆవిడ నిద్దురపోతూ ఉంటుందేమో!

పతవా లేదు. నిద్దుర లేపుదామనుకున్నాడు. వెళ్ళాడు. ఆవిడ నిద్ర పోవటములేదు. ఏదో చదువుకుంటున్నది. లేచింది. గౌర వించింది. సోమనాథశాస్త్రి మంచము విరుగగొట్టినప్పటినుండి ఆమె క్రిందనే పడుకొనుచున్నది. పతంజలిని కుర్చీలో కూర్చో మన్నది. ఆయన ప్రక్కమీదనే కూర్చున్నాడు. ఈయన ఆమె సౌందర్యాన్ని ఆమె ఔదార్యాన్ని కొంతసేపు మెచ్చుకొన్న తర్వాత, ఆమె అన్నదిగదా! "మీరు ప్రొద్దుననే వెళుతున్నారు కదా, నా చేత చేయి చూపించుకునేందుకు వచ్చారు కాబోలు" అన్నది. అత డాశ్చర్యపోయినాడు "ఈమె ఎవరో భ్రిష్ట యోగిని" అనుకున్నాడు. అవునన్నాడు. ఆమెయే ఇతని చేయి తీసికొని చూడటం ప్రారంభించింది. రక రకాలుగా చెప్పింది. "మీరు ఎనభై ఏళ్ళు బ్రతుకుతారు. మీ భార్య నిత్య వ్యాధిగ్రస్తురాలు. మీకు జీవితంలో ఒకప్పుడు ఒక దేవతా దర్శనం జరుగుతుంది. అది కొద్దిరోజులే ఉంటుంది. మాసి పోతుంది. కాని చివరిదాక భగవంతునిమీద నమ్మకముంటుంది. భక్తి భావము చెడిపోదు. జీవితంలో ఒక్కటే కళంకం ఉన్నది. ఆ కళంకం జరిగేందుకు కూడా ఇదే సమయం. అది కారణం గానే ఆ దేవతామూర్తి కనిపించటం మాసిపోతుంది. నీ స్త్రీ వాంఛకు భూమ్యాకాశాలు పట్టవు. అంత లాలసత ఉన్నది. సౌందర్యవతి అయిన స్త్రీని మీరు భావించకుండా ఉండలేరు. మీరు నిజంగా వాంఛిస్తే ఏ స్త్రీ అయినా మీకు ప్రాప్తిస్తుంది. కాని మీ జాతకంలో మీకు ఏ స్త్రీ కూడా లభించదు. ఒక్క

సారి మాత్రమే అది ఫలిస్తుంది. తరువాత మీ జాతకములో సుఖము లేదు. కష్టంలేదు. సామాన్యంగా వెళ్లిపోతుంది. ఇప్పుడు మీ వయస్సు ముప్పదియైదు; ఇంకా నలభై అయిదు ఏండ్లు బ్రతికిఉంటారు. మీ ఆస్తి పోదు. అది ఒక్కటే సుఖలక్షణం" అంటూంటే పతంజలికి నిద్రలేక పోవటమువల్ల మరి అనేక కారణాలవల్ల తన దురదృష్టాన్ని భావించటమువల్ల బలహీనత వల్ల కళ్ళవెంట నీళ్ళు గిఱ్ఱున తిరిగినవి. సోఫియా తనపైట చెరగుతో తుడిచింది. వాళ్ళకు తెలియకుండా కౌగిలించు కున్నారు. ఆమె ఓదారుస్తున్నది. ఓదార్పు అంతా సంగమాభి ముఖంగా నడచింది. ఆమె అట్లా ఓదార్చింది, ఇతడు సగము తనకోర్కె వెలారుస్తూ ఓదార్పబడ్డాడు.

తెలవారుకడ నాల్గు గంటలైనది. అతణ్ని ఆమె పంపిం చింది.

అతడు తన జన్మలో వ్రాసిఉన్నంత సుఖముపొంది జన్మ చరితార్థమైంది అనుకుంటూ వెళ్లాడు.

# న వ మ భా గ ము

## మలిల గంగానది

## 1

కమల మంచి వంటకత్తె. వంట చేసిందా ఆమె చేతివంట ఒకసారి తిన్నవాళ్లు మళ్ళీ వదిలి పెట్టలేరు. అప్పుడప్పుడు చిదంబరం భార్యతో సరాగా లాడుతూ ఉంటాడు. "నీవు చేసినవంటకి రుచి మరిగి కాని లేకపోతే నిన్ను ఎప్పుడో వదిలి పెట్టేవాడిని" అని. దానికి సమాధానం ఆవిడ చెబుతుంది. "మా నాయనకి దిక్కులేక మీ కిచ్చాడు" అని. సోఫియా 'మూడురోజులు ఆమె చేతివంట తిన్నది. తిన్నప్పుడల్లా అనుకున్నది. ఈ అమ్మాయి వంట ఎంత బాగా చేస్తుంది' అని. ఆ ప్రశంస బయటికి కూడా చేసింది. ఆడవాళ్ళని "మీవంట చాలా బాగా ఉందండి అంటే వాళ్ళు చాలా సంతోషిస్తారు. బాగా ఉండకపోయినా సరే బాగాఉందంటే ఎవడైనాసరే ఆ ఇంట్లో రెండు మూడురోజులు ఉండవచ్చు. మొట్టమొదట కమలకు

సోఫియామీద సుంత అభిముఖ్యము కలిగించటానికి కమల యొక్క వంటను సోఫియా మెచ్చుకోటము, ప్రత్యక్షంలోనే కాదు పరోక్షంలో కూడాను. సోఫియా మెచ్చుకున్నదని చిదంబరం రెండుసార్లు చెప్పాడు. పతంజలిశాస్త్రి చెప్పాడు ఒకసారి ఈ అభిముఖ్యముతోపాటు కమల మనస్సులో నిశ్చయించుకుంది. సోఫియాకి తన భర్తకి సంబంధం ఏమీ ఉండటానికి వీలు లేదని. తన భర్త సదాచారవంతుడు. ఎవరిని తాకినా వచ్చి స్నానముచేసి జపము చేసుకుంటాడు. మరీ తాకరాని వాళ్ళని తాకితే ఆ రాత్రి భోజనం మానివేస్తాడు. విడిగా వండుకుంటాడు. ప్రొద్దున్నే యజ్ఞోపవీతాలు చేసుకుంటాడు. బ్రాహ్మణ ధర్మ మందధిక విశ్వాసము కలవాడు. అటువంటి వాడు సోఫియాతో సంబంధం పెట్టుకోడు. వర్ధనకర్త అన్నప్పుడు కోపంలో నిజమనుకుంది తప్ప. ఛీ! ఛీ! చిదంబరం తనకు చిదానందకరమైన వస్తువు. మరిన్ని ఇంకోటి జరిగింది. సోఫియా తన చెయ్యి చూచింది. పసిపిల్లల చేతులు చూడకూడదుఅంటు. కొడుకుచేయి చూచింది. తనకు చెప్పిన ఒకటి రెండు విషయాలు తాను విశ్వసించ లేనంతగా ఉన్నవి. ఆమె చిన్నప్పుడు ఒక పాములది వచ్చి ఈమెచేత నాలుగు డోసెళ్ళ బియ్యం వేయించుకుని ఇంట్లోరెండు చీరెలు తనచేత ఇప్పించుకు వెళ్ళింది. అప్పుడు వాళ్ళ అమ్మ ఇంట్లోలేదు. తాను ఆ పాములదాని వెంటబడి పోయింది. ప్రొద్దు క్రుంకిన తరువాత వెదకి తనతండ్రి, మేనమామ తన్ను తీసుకువచ్చారు. ఈ సంగతి

చెప్పింది సోఫియా. ఆ దెబ్బతో కమల తల తిరిగిపోయింది. తన కొడుకు జాతకం చెప్పింది. వాడికి పద్దెనిమిదియేండ్లు వచ్చే టప్పటికి ఐ. ఏ. యస్. ప్యాసవుతాడుట. కలెక్టరవుతాడట. తన మగనికి రెండేండ్లలో పెద్ద ఉద్యోగ మవుతుందట, మొదటి సంగతి ఆశ్చర్యం కలిగించింది. తక్కిన రెండు ఆనందాన్ని కలిగించినవి. తరువాత సోఫియా రెండు మూడుసార్లు వచ్చింది. ఎప్పుడు వచ్చినా హద్దులలోనే ఉన్నది.వసారాలోనే కూర్చుంది తప్ప ఇంట్లోకి రాలేదు. తనచెల్లెలితో మాట్లాడినట్లే మాట్లాడు తుంది. ఆ వెనుక మూన్నాళ్ళక్రింద వచ్చినప్పుడు తానే సోఫియాను 'అక్కయ్యా' అని పిలిచింది.

స్థితి ఇట్లా ఉండగా పతంజలిశాస్త్రి ఆ తెల్లవారు కట్టనే వెళ్ళిపోయాడు. ఆయన వెళ్లిన రోజునే తానుకూడా వెళుదామని సోఫియా నిశ్చయించుకుంది. కాని, రెండురోజులు కమల చేతి అన్నం తిని వెళదామనుకున్నది. అంతే అనుకున్నదో ఇంకా ఏమన్నా అనుకున్నదో తెలియదు.

ఇట్లా ఉండగా సోఫియా తొలుత వచ్చినప్పుడు ఒక మోటారు కారుని అద్దెకు ఉంచి దాని బిల్లుచేసి పైకి పంపిస్తే ఆ డబ్బు వాళ్ళు మంజూరు చేయలేదు. కనుక కారుని తీసి వేసింది. ఆ కారును నడిపేవాడు బసనుంచి అన్నము తేనన్నాడు. కనుక బంగళా బంట్రోతుకే పది రూపాయలిచ్చి అన్నం తెప్పించుకుంటూ ఉండేది. ఇప్పుడు జైనూల్ వచ్చాడు. ఆమె జైనూల్‌తో నీవు నాకక్కరలేదు. నేను రెండు మూడు

రోజులలో వెళ్ళిపోతాను—ఈ మూడు రోజులలోయీ ఊళ్లో నా మేనమామ కొడుకు ఉన్నాడు. అతని ఇంట్లో భోంచేస్తా నన్నది. వాడు ఉద్యోగములో ప్రవేశించి పదిహేను రోజు లయింది. నెలకు ముప్పది రూపాయలు జీతం. సగం జీతం ఇవ్వబోయింది. వాడు నిండుజీతం ఇస్తేకాని పుచ్చుకోనన్నాడు ఇచ్చి వేసింది. వాడేమన్నాడంటే నేను నెలాఖరుదాకా నీ కొలువులో ఉన్నట్లే. పూటకూళ్ళ బసనుండి అన్నము తీసుకు రాకపోతేయేమి. ఈమూడు రోజులు యిక్కడే ఉంటానన్నాడు. వాడు ఈవిడ దగ్గర కుదిరినప్పటినుంచి సేవకుడువలె ఎప్పుడూ ప్రవర్తించలేదు. ఆమెవంక కోరగా చూడటం తన కామభావ మంతా విస్పష్టమయ్యేటట్లు చూడటం. ఆమెతో సరాగా లాడటం. ఆవిడ వస్తూఉంటే తొలగక పోవటం, ఏదైనా అందిస్తూ ఉంటే వేళ్ళకి వేళ్ళు కలపటం, కలిపినప్పుడు నవ్వటం వాడి స్థితి ఇల్లా ఉంది, సోఫియా వాడిని ఒక్కసారి మందలిస్తే సరిపోయేది కాని కొందఱు స్త్రీలు, పురుషులు తమ దెస శృంగారపు చేష్టలు చేస్తూఉంటే ఊరుకుంటారు. అది ఒక్కొ క్కప్పుడు కొంపమీదికి తెస్తుంది. వాడు ముప్పై రూపాయలు తీసుకుని "నేను మీ వెంట ఢిల్లీ వస్తాను. నన్ను తీసుకువెళ్లండి" అన్నాడు. ఆమె నవ్వింది. వాడు "నేను మిమ్మల్ని వదలిపెట్టి ఉండలేను" అన్నాడు. సోఫియా నవ్వనూలేదు. క్రోధము తెచ్చుకోనులేదు.

సోఫియా కమలతో అన్నది. నేనివాళ యిక్కడనే

'భోంచేస్తాను' అని. కమల వప్పుకున్నది. సోఫియా మళ్ళీ ఇల్లా అన్నది "నేను పతంజలిశాస్త్రిగారు వెళ్ళిన మఱునాడే వెళుదామనుకున్నాను. కాని ఢిల్లీనుంచి ఉత్తరాలు ఎదురు చూస్తున్నాను. నేనిట్లా బయలుదేరితే అవి అట్లా వస్తయ్యేమోనని, రెండురోజులు చూసి వెళుదామనుకుంటున్నాను. ఈ రెండు మూడు రోజులు నీవు కనుక అన్నము పెడుతానంటే ఉంటాను నా విస్తరి నేనే ఎత్తివేసుకుంటాను నీవు పసుపునీళ్ళు చల్లించుకో కావలిస్తే పుణ్యాహావాచనము చేయించుకో నేను మంచి నీళ్లు త్రాగిన చెంబు నిప్పులలో దొర్లించుకో" ఆవిడా నవ్వింది, ఈవిడా నవ్వింది—ఆ రాత్రి సోఫియా ఇక్కడే భోంచేసి, పతంజలిశాస్త్రి ఉపన్యాసాలను గురించి మాట్లాడుతూ తాను చిదంబరం కలిసివెళ్ళారు.బంగళాదాక వెళ్లేటప్పటికి అక్కడజైనూల్ ఉన్నాడు. సోఫియా"నీవు యిప్పుడుఇక్కడ ఎందుకు ఉన్నావు. నీవు వెళ్ళిపో."వాడు సోఫియావంక చిదంబరం వంక కోపంగా చూచాడు. వాడు కోపంగాచూడటం సోఫియాకు తెలియదు. జైనూల్ వెళ్ళిపోలేదు. అక్కడే ఉన్నాడు. సోఫియా చిదంబరంతో మాట్లాడి అతన్ని పంపించి వేసింది. జైనూల్ని వెళ్ళమన్నది. వాడు వెళుతూ "ఆ బ్రాహ్మడు ఇక్కడికి ఎందుకు వచ్చాడు?" అని కోపంగా అంటూ వెళ్ళాడు. సోఫియా వాడిని వెనక్కి పిలిచి, ఏమిటి నీ ఉద్దేశ్యం. నీవు ఎవడవు? అట్లా ఎందుకు మాట్లాడుతావు నిన్ను బంట్రోతుగా పెట్టుకోవటం నాదేతప్పు. రేపు నీమీద పోలీసులకు రిపోర్టు ఇస్తాను. కబర్దార్"

అన్నది. కొందఱు స్త్రీలుకాని కొందఱు పురుషులుకాని కోపంగా మాట్లాడనే లేరు. వాళ్ళ కోపపు మాటలు కూడా ఏదో నవ్వుతూ చెప్పినట్లే ఉంటుంది. అల్లాంటి వాళ్ళల్లో సోఫియా అగ్రేసరురాలు. ఏదో ఒయ్యారము, ఏదో కులుకు ఏ మాట మాట్లాడుతూ ఉన్నా ఉంటుంది. ఈవిడ కోపపడుతూ ఉంటే వాడది నిజమనుకోలేదు. అది ఒక వయ్యారమను కొన్నాడు. ఆ మాటలు కూడ తనయొక్క కామ ప్రవృత్తిని ఆమె అంగీకరించటమే అని దానికి దోహద ప్రాయమని అను కున్నాడు. 'నేను వెళతాను. మీకు ప్రక్కవేసి వెళతాను' అన్నాడు. ఆవిడ 'వద్దు' అన్నది. వాడు వినిపించుకోకుండా లోపలకు వెళ్ళాడు. ఊడ్చాడు. చాప వేశాడు. పైన పరుపు పరచాడు పెట్టెలోని క్రొత్త దుప్పటితీసి పఱచాడు. ఆమె లోపలికి వెళ్ళింది. ఆ చీరె మార్చి ఇంకొక చీరె కట్టుకొన్నది. వాడిని వెళ్ళమన్నది. వాడు నవ్వుతూ నిలుచున్నాడు. ఆమె కేమి చేయవలెనో తెలియలేదు. ఆ బంగళాచుట్టూ పెద్ద దొడ్డి. ఒక చిన్నతోట. రోడ్డుకీ బంగళాకీ చాల దూరమున్నది. వీడొక్కడే బంట్రోతు. ఎవరినైనా పిలిచినా పిలుపందేంత దూరములో ఎవ్వరూ ఉండరు. ఆమె ఆలోచించింది. సహజ ముగా కాముకురాలు. వాడు రూపసి. యువకుడు. అల్లరి చేసుకుంటే ఏమిలాభము ? వాడు మోటువాడు. వాడు తన్ను ఏమిచేసినా చేయవచ్చును. తాను ఎట్లాగూ రెండు మూడు రోజులలో వెళ్ళిపోతుంది. ఇది ఎవరికీ తెలియదు;

ఇల్లా అనుకుంటూ తాను వాకిట్లోకి వెళితే ప్రయోజనం లేదని వాడనుకొని వెళతాడనుకున్నది. వాకిట్లోకి పోబోయింది. వాడు చెయ్యి అడ్డం పెట్టాడు.నవ్వటం మొదలెట్టాడు.అప్పుడు సోఫియా ఒక్క తెలివి తక్కువ చేసింది. వాడిని లాగి చెంప కాయ కొట్టింది. వాడు ఆమె చేతులు పట్టుకొని గదిలోకి తోశాడు. చేతులు వదలిపెట్టలేదు. తలుపు వెయ్యలేదు. లైటు తియ్యలేదు. ఆమెను అరవ నివ్వలేదు. కొంత సేపటికి వాడు తలుపు వేశాడు. లైటు తీశాడు ఆమెలో కోపం విజృంభించి ఉన్నది. కాని ఏ మూలనో ఒకానొక అభిముఖ్యం లేదనటానికి వీలులేకుండా ఉంది. అనిష్టమైన ఒకపని జరిగితే తన కిష్టముకాని పని జరిగినదని మెడకోసుకునే వాళ్ళుంటారు. జరిగింది కదా? మనమేమి చేస్తాము ? అన్న ఉదాసీనత్వము కొందరు ప్రక టిస్తారు. సోఫియాలో ఆ ఉదాసీనత్వము కనిపించింది వాడు క్షమించు, నిన్ను చూచినప్పటినుంచి నేను నిన్ను ప్రేమించాను. నీవు నన్ను వదలిపెట్టిపోతే నేను రైలుక్రింద పడి చచ్చిపోదా మనుకొన్నాను. నీవు నన్ను బ్రతికించావు. నేను నిన్ను ప్రేమి స్తున్నాను. నీకు నామీద కోపముగా ఉంటే రేపు నామీద కేసుపెట్టు. నాకు యావజ్జీవము శిక్ష వేసినాసరే, నా మనస్సు శాంతించింది. నీవు నా బీబీవి. నా ప్రాణం నీ కాళ్ళదగ్గర అర్పిస్తాను, 'నీవు క్షమించాను అంటే వెళతాను' అని పట్టుకుని కూర్చున్నాడు. కొంత సేపటికి సోఫియా 'నీవు వెళ్ళిపోతే సరి' అన్నది. వాడు వెళ్ళిపోయినాడు. వాడు వెళ్ళిన తర్వాత

సోఫియా చాలాసేపు ఆలోచించింది. తలుపు వేయలేదు. దీపము తీయలేదు. నిద్ర రాలేదు. కొంతసేపటికి దీపం తీసివేసి గది తలుపు బయట తాళంవేసి చిదంబరం ఇంటికి వెళ్ళింది. వాళ్లు నిద్రపోతున్నారు. తలుపుతట్టింది. చిదంబరం తలుపు తీశాడు. ఇలా అన్నది. "నా కొక్క తెకూ అక్కడ పడుకోటం భయంగా ఉన్నది. నే నీ వసారాలో పడుకొంటా నాకొక చాపయిాయి. దిండు తెచ్చుకొన్నాను. కమల ఏమిచేస్తుంది ? ఆమె ఒక్కతే వాకిట్లో పడుకుంటే ఏమి బాగుంటుంది? వసారాలో ఆ చివర సోఫియా, యీ చివర ఇంకొక చాప వేసుకొని చిదంబరం పడుకొన్నారు. చిదంబరానికి నిద్రపట్టింది. సోఫియా ఆలోచించటం మొదలు పెట్టింది. తానీనాడే పతంజలి యెక్కినబండి ఎక్కి వెళ్లిపోవలసింది. వెళ్లకపోవటం పొరపాటు చేసింది. మళ్ళీ ఒకసారి చిదంబరాన్ని కలుసుకు వెళదామన్న కోరిక పుట్టింది. కాని మూలంగా ఆగింది. ఆ చిదంబరానికి తనమీద ప్రేమలేదు. అతని ప్రేమ అంతా కమలమీద ఉన్నది ఆ సంగతి తాను తెలిసికొన్నది. తానతనితో రెండు రాత్రులున్నది. అనుభవించింది తాను. అతను కాదు. ఒకానొక పరమ సుఖ నిమేషములో అతనికి తెలియకుండా వచ్చిన నిమేషములో తనను 'కమలా' అని పిలిచాడు. కావ్య పరిభాషలో దీనిని గోత్రస్ఖలన మంటారు. రతివేళ యితర స్త్రీ యొక్క పేరుతో పిలిస్తే కావ్యాలల్లో అంతకంటె పురుషుడు చేసే ద్రోహము ఉండదు. అంతకంటె కోపము ఉండదు. కాని తాను కోపము తెచ్చుకోలేదు. కోపము తెచ్చుకోటానికి

తనకు శక్తి లేదు. ఆ సోమనాథము తన్ను ప్రేమించాడు. అతను తనయందు రమించాడు. తాను చిదంబరాన్నిన్ని ప్రేమించింది. ఆతనియం దనుభవించింది. పతంజలి శాస్త్రియందు జాలి నెరపినది. ఈ జైనూలు, వీడొకడు. రావణాసురుడు రంభను చూసినట్లుగా చూశాడు—నిద్ర పట్టలేదు తెల్లవారింది.

మళ్ళీ పగలు ఒంటిగంటకు బండి ఉంది. ప్రొద్దున్నే జైనూలు వచ్చాడు వాడితో మాట్లాడలేదు. తాను ప్రయాణానికి అన్నింటికి సిద్ధం చేస్తున్నది. వాడు పెట్టె సర్దాడు. బెడ్డింగు చుట్టాడు. ఆమె ఏపని చేయపోతే వాడే ఆ పని అల్లా చేశాడు. ఆమె చెయ్యనిచ్చింది. అదంతా వాడు అంగీకార మనుకున్నాడు. చిదంబరం యింట్లో ఫోంచేసింది. తాను రైలుకి వెళుతున్నానన్నది. చిదంబరం కమల రైలుస్టేషనుకు వెళ్లారు. అది ప్యాసింజరు. ఆమె మొదటి తరగతి టిక్కెట్టు కొన్నది. కమలా చిదంబరాలు విడిగా ఆమెను పంపించటానికి వచ్చిన ఇద్దరు ఎవరో ఉండగా జైనూలు ఏమీ మాట్లాడటానికి వీలులేకపోయింది. ఆమె చివరకొక తప్పుచేసింది. రైలు బయలు దేరిన తరువాత జైనూలు ఆమెను చూచి నవ్వితే ఆమె తిరిగి నవ్వింది.

2

"నీవు నన్ను పెళ్లిచేసికొంటే నేను సుఖంగా చచ్చిపోతాను."

"నేను చేసికోకపోయినా చచ్చిపోతావు"

"వేయి జన్మలకైనా నీ భార్యగా పుట్టవలయుననే నా సంకల్పము.

"మీరు క్రైస్తవులు. మీకు పునర్జన్మలు లేవు."

"మా అన్నయ్య క్రైస్తవుడు. నేను హరిజన బాలికను. మేము శైవులము. మాకు జన్మలున్నవి. పూర్వము అరుంధతి వశిష్ఠుని పొందినట్లు వంద జన్మలెత్తి అయినా నీకు భార్యనై తీరుతాను."

బలేచాటున తెచ్చావు. నీ వరుంధతివి కావచ్చు. నాకు వశిష్ఠునకు పోలిక యేమిటి ? యేనుగుకు పీనుగుకు సాటి."

"నీవు ఎట్లాగో చెడ్డావు మాయింట్లో అన్నము తిన్నావు మాంసము కూడా తిన్నావు. నీ కన్న నేనే నయము మేము

మాలవాళ్లము. గొడ్డు మాంసము తినము. మాదిగవాళ్లు తింటారు. వాళ్లు చచ్చిన గొడ్డు మాంసము తింటారు. ఈ యింట్లో నీవు గొడ్డుమాంసము కూడా తిన్నావు. నన్ను పెళ్లి చేసికోవచ్చు. నేను నీ కన్న చెడిపోలేదు."

"నీవు యీ యింట్లో ఉండి గొడ్డు మాంసము ఎలా తినలేదు ?"

"గొడ్డు మాంసానికి బీఫ్ అంటారు. అవి పొట్లాలు వస్తే నాకు తెలుసు. నేను వాటిని ముట్టుకోను. మేము ముట్టుకోము."

"మీ అన్నయ్య తింటున్నాడు కదా ?"

"నీవు మీ కులములో చెడ్డావు. మీ అన్నయ్య మా కులములో చెడ్డాడు."

"మీ మధ్యా మాదిగల మధ్యా యింత భేదముందా ? బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులమధ్యే అనుకున్నాను. ఈ భేదాలు సర్వత్రా ఉన్నవన్నమాట. అవును. ఎక్కడ ఉండవు ?"

మా భేదాలు బ్రాహ్మణ బ్రాహ్మణేతరుల మధ్యవి కావు. నియోగుల వైదీకుల మధ్యఉన్న భేదాలవంటివి. మీరు అగ్రకులజులు మేము పెద్దింటి వారము."

"మీ కన్న మాదిగవాళ్లకే ఎక్కువ పట్టింపుటగదా."

"అబ్బో! వాళ్ల ఆచారాలకి అవధిలేదు. డొక్కల వాళ్లు

వాళ్లదగ్గర అడుక్కుతింటారు. మాదిగ వాళ్లు వాళ్లకి అన్నము పెట్టి అన్నము పెట్టిన చోట పసుపు నీళ్లతో అలుకుతారు. పసుపు లేకపోతే కోమటింటికిపోయి చిన్న పసుపుకొమ్ము అయినా కొనుక్కువస్తారు. అంతపట్టింపు మాకు లేదు."

"మరి మీ మీదపడి ఏడవకండా మా మీదపడి ఏడుస్తారేం ?"

"అంతేనా ? మీరు ఒక హరిజనుని మంత్రి చేశామనుకుంటారు; ఒక హరిజనుడికి గొప్ప యుద్యోగమిచ్చామనుకుంటారు. అంతా సముద్ధరించామనుకుంటారు. మాలవాడు మంత్రి అయితే మాదిగవాళ్ళకు చేయి విదల్చడు. మాదిగ వాడు అయితే మాలవాడికి విదల్చడు. నియోగి వైదీకులు నయం."

"నిజమే. నేను గొడ్డుమాంసము తిన్నాను. ఇష్టము లేకుండా తిన్నాను తినక తప్పిందికాదు. మీ అన్నయ్య తినిపించాడు. నేను చెడిపోతే కాని నిన్ను పెళ్ళిచేసుకోనని ఇట్లా చేశాడు. మొదట నా కిష్టము లేకుండానే తిన్నాను. తరువాత బాగానే ఉంది. నా జన్మ అంతా యింతే. చిన్నప్పుడు నేను ఉల్లిపాయను దగ్గరకు రానిచ్చేవాడిని కాను. బందరు చదువు కోటానికి వెళ్లాను. బందరు పకోడీలు చాలా ప్రసిద్ధి. ఒక స్నేహితుడు ఉల్లిపాయ పకోడీలు పెట్టాడు. తెలియకండా తిన్నాను. బ్రహ్మాండమైన రుచిగా ఉన్నవి. అతను తరువాత చెప్పాడు. రుచి మరగిన తరువాత చెప్పి యేమిలాభము ? ఆ ఊళ్ళో గరంమసాళా అని అమ్ముతారు. ఆ బందరు ఒక విచిత్ర

మైన ఊరు. ఆ ఊళ్లో నాలుగైదు వస్తువులు అంటే తినేవి అమ్ముతారు. బందరు లడ్డు, బందరు పకోడి, పునుకులు, పెసరట్లు గరమసాళా—యీ వస్తువులకు బందరు ప్రసిద్ధి. వీటిని గురించి చెబితే ఒక గ్రంథమవుతుంది. ఏతావతా అ గరమ్ మసాళాలో పచ్చి ఉల్లిపాయ సన్న సన్నని ముక్కలుగా తరిగిపోస్తారు. నాకు చివరకి అదికూడా తినటము అలవాటయినది. నాకు గొడ్డు మాంసము అలవాటయినది. నీవా మాంసము తినవు. నీవు నన్ను పెళ్ళిచేసుకొంటే ఆ మాంసము వండిపెట్టాలి. ఎలా కుదురు తుంది."

"నన్ను పెళ్ళిచేసుకోవటం నామ మాత్రానికి, నేను ఇంక పది రోజులకన్న బ్రతకను. నేను ఫలానా రోజున చచ్చి పోతానని మా వదిన చెప్పనే చెప్పినది కనుక నీకా భయము అక్కరలేదు."

"చచ్చేదానికి పెళ్లి ఎందుకు ?

"పెళ్లాడిన వాళ్ళందరు చావరా ? వాళ్ళిద్దరు భార్యా భర్తలు అని భగవంతుడు నమోదు చేసుకుంటాడు."

"నీవు చావటము నిజమైతే తప్పకుండా పెళ్లి చేసు కొంటాను."

"వదిన రేపుప్రొద్దుటికి వస్తుంది. నీ వావిడను కనుక్కో."

"ఆవిడకు తెలుసునా ?"

"ఆవిడకు తెలుసునా అనా? ఆవిడ ఎవరని నీ ఉద్దేశ్యం? లోకంలో దేవతలు వేరు రాక్షసులు వేరుగా ఉంటారు. ఆవిడ

రెండూ కలిసిన మనిషి; ఆవిడతో బాగా పరిచయమున్న వాడిమల్లే మాట్లాడుతున్నావు. ఈ మాత్రం తెలియదా ?"

"ఆవిడతో నాకున్న పరిచయం చెబితే నీవు నన్ను పెళ్లి చేసికోమని అడగవు."

"అలాగా ! మీ యిద్దరికి వరుస కాదుకదా ఆవిడ అట్లాంటిదే తమరుకూడా అట్లాంటివారేనా ? మీ యిష్టము చేసుకుంటే చేసుకో లేకపోతే యిల్లాగే చచ్చిపోతాను."

"చూశావా. నా కొంచెం స్వరూపం చెప్పేటప్పటికే నీకు మొఖము మొత్తింది. నా స్వరూపం నీకు పూర్తిగా చెబితే నన్ను పెళ్లిచేసుకోమని అడగనే అడగవు."

కావచ్చు. కాని అందరు మనుష్యులు అన్ని జన్మల లోను ఒకటే రీతిగా ఉంటారని నమ్మకంలేదు. నిన్ను పెళ్లి చేసుకుందామని అనుకున్నాను. నీవు ఒప్పుకుంటే ఇష్టమైనా నాకు అంగీకారం. లేకపోతే నిన్ను బలవంతం చెయ్యను. భర్త ఎటువంటివాడైనా భార్య అతనిని అనుసరించి ఉండాలి. ఇది సనాతన ధర్మము. నేను యింకో జన్మలోనైనా నీకు భార్య నవుతాను. ఈ రోజు మొదలు చనిపోయేవరకు మౌనవ్రత మవలంబిస్తాను. వదినె రేపు వస్తుంది. ఆవిడ భవిష్యత్తు ఆవిడకు తెలుసు. నాతో ఒకసారి చెప్పింది. ఎవడో ఆవిడను కత్తిపెట్టి పొడిచి చంపుతాడట. ఆవిడ యింకా రెండు మూడేండ్లకన్న ఎక్కువ బ్రతకదు."

సోమనాథం మేరీ దగ్గర నుంచి మాట్లాడకండా లెచి పోయినాడు. సోఫియాకి నిజంగా యింత తెలుసునా ? తెలిస్తే తనికి అబద్ధాలు చెప్పిందన్నమాట. జాకబ్ చచ్చి పోతాడని ఆ ఉద్యోగం తనకు వస్తుందని తరువాత తామిద్దరూ పెళ్లి చేసుకుంటారని ఈ మాటలు అన్నీ అబద్ధం. నవాబు పాలెంలో తన పీడ వదిలించుకునేందుకు ఈ మాటలు చెప్పి తన్ను తరిమివేసింది. ఇవన్నీ సోఫియా కెట్లా తెలుసు ? సోమ నాథం వెళ్లి మేరీ నడిగాడు మేరీ మౌనవ్రత మవలంబించింది. మాట్లాడలేదు.

మరునాడు సోఫియా వచ్చింది. సోమనాథం తాను మేరీ మాట్లాడిన సంగతులన్నీ పూసగ్రుచ్చినట్లు చెప్పాడు. సోఫియా నవ్వింది. ఒరే సోమనాథం ఆడవాళ్లు మొగవాళ్లని ఎంత తేలికగా మోసం చేస్తారనుకున్నావు. నీవు వెఱ్ఱివప్పవు. అది చెప్పిన మాటలన్నీ నిజమనుకున్నావా ? అది ఎంతదను కున్నావు. పోనీ అన్నది. ఇక్కడ సోమనాథం ఉద్యోగము బాగా నేసాగుతున్నది ఇంక తాను మేరీని చేసుకోడు.చేసికోడని దృఢమైనది. మేరీ ఎప్పుడు చచ్చిపోతుందో తెలియదు. జాకబ్ కూడా ఆ ఆశ వదిలిపెట్టుకున్నాడు. మళ్లీ ఇప్పుడు యీతనికి ఆ ఉద్యోగము తీసివేస్తే బాగుండదని ఊరుకున్నాడుతప్ప లేక పోతే యిదివరకే తీసివేసేవాడు. ఇతనిని ఒక్కటే అర్థించాడు జాకబు. మామేరీ చచ్చిపోయేవరకు నీవు రోజుకు ఒకసారివచ్చి ఆవిడను చూచి పోతూఉండు అన్నాడు. ఇతను నాల్గురోజుల

కొకసారి ఐదు రోజులకొకసారి వచ్చి చూస్తున్నాడు. కాని సోఫియా వచ్చిన తర్వాత ప్రతి రోజూ వచ్చి చూస్తున్నాడు. సోఫియాని చూడటానికి వస్తున్నాడో మేరీని చూడటానికి వస్తున్నాడో తెలియదు. జాగ్రత్తగా పరిశీలించి చూస్తే సోఫియా సోమనాథాన్ని ఏమీ లెక్కచేయటల్లేదనీ అతడు మాత్రం ఆవిడ వెంట కుక్కవలె పడి తిరుగుతున్నాడనీ తెలుస్తుంది.

గుజరాతులో ఒక పెద్దగనుల కంపెనీ ఉన్నది. దాని ప్రొప్రయిటరు ఓ పెద్ద షావుకారు. తండ్రి చచ్చిపోయినాడు. అతను యువకుడు. అధికారమంతా అతని చేతిలోకి వచ్చింది. ఒకసారి అతను, సోఫియా రూర్కిలో కలుసుకున్నారు. ఇద్దరూ సినీమాకు వెళ్ళారు. చాలా స్నేహంగా ఉన్నారు. సోఫియా స్నేహం చేసిందంటే తుదముట్టచేస్తుంది. అందులో ఆమె తల్చుకుంటే అవతలివాణ్ణి తాను దాసుణ్ణి చేస్తుంది. వాడు బ్రతికిఉండగా ఆమె చేయమన్న పనిని చేయకుండా ఉండలేడు. ఆవిడని చిదంబరం పిశాచ స్త్రీ అనుకున్నాడు. అతడు పిశాచ ప్రకృతి కాదు కనుక. పిశాచ ప్రకృతియైన పురుషుణ్ణి ఆవిడ మనసారా పొందితే వాడు బ్రతికి ఉన్నన్ని నాళ్లు ఆవిడ దాసుడు. ఆ సేటు అట్లాంటివాడు. ఆ సేటుకి ఉత్తరం వ్రాసింది.సోఫియా ఆంధ్రదేశంలో గుంటూరుజిల్లాలో నవాబుపాలెం అని ఒకఊరుఉంది. అది రైల్వేస్టేషను ఆ ఊళ్లో కె. చిదంబరం అని ఒక ఆయన ఉన్నాడు. ఎం. ఏ. ప్యాసై

నాడు. చాలా చదువుకున్నాడు. దైవభక్తిపరుడు విశ్వాసార్హుడు.

మనం కలుసుకున్నప్పుడు నీవు మీ కంపెనీలో ఎవర్నీ నమ్మటానికి వీల్లేదు. ఒకడ్ని నమ్మామా అంటే వాడు నెత్తిన చేయిపెట్టాడు అన్నమాట అన్నావు. "ఇతను అట్లాంటివాడు కాదు. కాసాబియాంక వంటివాడు. అతనికి ఉద్యోగము యివ్వాల్సిందే. అతను ఎం. ఏ. ప్యాసైనాడు. కావలిస్తే నాలుగైదుసార్లు పరీక్షించుకోవచ్చు ఇస్తూనే అయిదువందలు ఇవ్వాలి" అని వ్రాసింది. ఆ సేటు చిదంబరానికి ఉద్యోగమిచ్చాడు. ఇదంతా రెండు నెలలలో జరిగిపోయింది. ఈ పని సోఫియా చేసిందని కమలకి చిదంబరానికి యిద్దరికి తెలుసు. కమలకు సోఫియా అంటే బ్రహ్మాండమైన అభిమానం కలిగింది ఎక్కువ సంతోషించినవాడు చిదంబరం. ఈ ఉద్యోగం ఢిల్లీలో వేయిస్తుందేమో ఎట్లాగురా బాబు అనుకున్నాడు. ఢిల్లీలో వేస్తే భార్యాబిడ్డలను పోషించాలి కనుక ఉద్యోగానికి ఒప్పుకోక తప్పదు. ఒప్పుకోకపోతే కమల ప్రాణం తీస్తుంది. అసలు రహస్యం చెప్పటానికి వీలులేదు. తాను కూడా ఢిల్లీలోనే ఉంటే ఆ సోఫియా బాధ తాను పడలేడు. దానితోడి సంబంధం పట్టుమని పదిరోజులుంటే తన ఆయుర్దాయం సగానికి సగం క్షీణిస్తుందనీ అతను అనుకున్నాడు. ఈ స్థితిలో ఎక్కడో గుజరాతులో యీ ఉద్యోగం అవటం అతనికెంతో సంతోషహేతువయింది. అతనికి ఉద్యోగం యిప్పించింది సోఫియా అని

ఆ ఊళ్ళో అందరికి తెలిసింది. పెద్ద వీడ్కోలు సభ చేశారు. విఠలరావు కుటుంబాని కందరికీ క్రొత్త బట్టలు పెట్టాడు. రంగన్న షాహుకారు వాళ్ళందరికి మొదటి తరగతి టిక్కెట్లు తానేకొని అందరిని రైలులో ఎక్కించాడు. సోఫియా అలా తన మేనమామ కొడుకు కుటుంబాన్ని భద్రంచేసింది.

చెయ్యక్కరలేకపోయినా ఇంకొకపని చేసింది. ఆమె గొప్ప సాముద్రికశాస్త్రం తెలిసినదని నవాబుపాలెంలో అక్క డక్కడ పాక్కింది. ఒకరోజున విఠలరావువచ్చి చేయి చూపించుకున్నాడు. అతనికి ఎనభై ఏళ్ళు ఆయుర్దాయ మున్నదని చెప్పింది పడాదికంటె ఎక్కువ బ్రతకడని ఆవిడకు తెలుసు, మరిన్నీ ఆవిడకు ఇంకొకటి తెలుసు. పతంజలిశాస్త్రి యిచ్చిన మంత్రజలంచేత అప్పుడు అతని మృత్యువు తప్పినదని తెలుసు. అతని మృత్యుసమయాన్ని జాగ్రతగా లెక్క కట్టింది. పలానా నెలలో జరుగుతుందని లెక్కకట్టింది. ఆ నెల రాకముందే పతంజలిశాస్త్రికి ఉత్తరం వ్రాసింది. "మీరు రెండు నెలల్లో వెంటనే బయలుదేరి భార్యతోసహా బయలుదేరి తీర్థయాత్రలు చేయవలసింది. ఈ రెండునెలలు మీరు దక్షిణదేశంలో ఉండ వద్దు. మీరు ఎక్కడ ఉన్నారో ఎవ్వరికి తెలియకూడదు. పతంజలిశాస్త్రి యీ ఉత్తరం చూచుకున్నాడు. ఈ సంగతి మరచిపోయినాడు. జ్ఞాపకం వచ్చింది. ఇంత విస్పష్టంగా అతనికి కాల నిర్ణయం తెలియదు. ఆవిడ సాముద్రికం అఖండమైనదని అతనికి తెలుసు. పైగా ఆయన ఎప్పుడూ అర్ధరాత్రివేళ మేడమీద

పడుకుంటే ఆకాశంలో పోతూఉన్న దేవశాస్త్రి తన్ను అను గ్రహించిపోతే బ్రతికిఉన్న నాళ్ళు మళ్ళీ అటువంటిది లభించదని గట్టిగా తెలిసినా దానిని స్మరించుకుంటూ బ్రతికే జీవుడివలె సోఫియాని గురించి అనుకుంటూ ఉంటాడు. ఈ ఉత్తరం చూడటంతోటే పులకితశరీరుడైనాడు. తాను నవాబుపాలెంలో ఉపన్యాసాలిచ్చి పదినెలలు కావచ్చింది. పదకొండోనెల గడుస్తున్నది. అతను తీర్థయాత్రలకు బయలుదేరాడు.

సోఫియా యీ రెండు కుటుంబాలని యిల్లాతీర్చింది. కాని ఢిల్లీలో జరిగేకథ జరుగుతూనేయుంది. అది యేమిటంటే మేరీ చనిపోయింది. క్రైస్తవమతం ప్రకారం జాకబు ఆమెకు అంత్యక్రియలు చేస్తానన్నాడు. సోమనాథశాస్త్రి, సోఫియా దానికి అంగీకరించలేదు క్రిష్టియన్ ఫాదరీలు వచ్చారు. ఆవిడ ఆత్మను పవిత్రాత్మ దగ్గరికి పంపిస్తామన్నారు. అధికారం అన్న గారిదన్నారు. సోమనాథశాస్త్రి అధికారం వాళ్ళన్నగారిది కాదు. ఆవిడ నా భార్య. ఆ అధికారం నాది అన్నాడు. నీ భార్య అనటానికి ఋజువేమిటి అంటే సోమనాథశాస్త్రి ఋజువు చూపించాడు. మేరీ మెడలో మంగళసూత్ర మున్నది. మేరీ ఎల్లుండి చచ్చిపోతుందనగా సోఫియా సోమనాథశాస్త్రి చేత ఆమె మెడలో మంగళసూత్రం కట్టించింది. దానికి ఆవిడ సాక్ష్యం. మరిన్ని ఆ ఊళ్ళో తెలుగు హరిజనులు ఉన్నారు. వాళ్ళ ముగ్గురి ప్రత్యక్షంలో చేయించింది యీపని సోఫియా. పాపం క్రైస్తవులు ఏమిచేస్తారు ? వెళ్ళిపోయినారు. ఆవిడ

బ్రతికి ఉన్నప్పుడు ఆవిడమీద పవిత్రజలం చల్లింది లేదా యె పోతే ఆవిడ ఆత్మను నరకానికి పోనిమ్మనుకున్నారు. కాని వాళ్ళ మనస్సులలో ఒక్క ఆత్మని రక్షించలేక పోయినామే అని దిగులుగానే వుంది. కాని జాకబు సంతోషించాడు. తన చెల్లెలియొక్క చివరికోరిక తీరింది అని. ఈ కథ ఇట్లా జరిగింది. రోజులు గడుస్తూ ఉన్నాయి. క్రమక్రమంగా ఆ యింట్లో సోమనాథానికి స్థానం లేకపోయింది. చెల్లెలు చచ్చింది కాని సోమనాథం బావమఱది కాదనటానికి వీలులేకుండా ఉన్నది. బావమరదిని తనయింటికి రావటానికి వీలులేదు అనటానికి వీలు లేదు. పైగా ఆ బావమరది తనమీద ఆధారపడిలేడు. అసలు వచ్చిన ఇబ్బంది యెక్కడ ఉన్నదంటే సోమనాథానికి సోఫియాకి కల సంబంధం జాకబు అనుమాన పడటమే కాదు. కళ్ళారా చూశాడు. ఇంకొకటి కూడా గుర్తుపట్టాడు. అందులో సోఫియా తప్పేమిలేదు. ఆమెకు తనిమీద ప్రేమలేదు. సోమనాథమే దీనికి హేతువు. సోఫియా అతనిని ప్రేమించటంలేదు. సహజమైన కామ ప్రవృత్తిచేత అంగీకరిస్తున్నది. జాకబుకు నెయ్యి అని త్రాగటానికి వీలులేదు. నూనె అని నెత్తిన పోసుకోటానికి వీలులేకుండా యున్నది. ఉత్తమజాతి స్త్రీ తనకు లభించింది అని తనకు భార్య అయిందనీ అతనుపొందే గర్వానికి పదిరెట్లుగా ఆమె శీలవతి కాదన్న బాధ ఉన్నది. ఒకటి రెండుసార్లు సోమనాథం ఉద్యోగం తీయించేద్దామనుకున్నాడు. బోర్డువాళ్ళంగీకరించలేదు. ఇదివరకొకసారి సస్పెండు చేయించి

వేశావు. మళ్ళీ నువ్వే యిప్పించావు. ఆఫీసులో అందరు అతను సమర్థుడని చెబుతున్నారు అన్నారు. ఒక సభ్యు డన్నాడుకదా "ఎవరు తమ ఇంటిలోని వ్యవహారాలను ఆఫీసు లోకి తీసుకురాకూడదన్నాడు. అంటే తన్ను ఎత్తిపొడవటమే కదా? ఒకటి రెండుసార్లు సోమనాథాన్ని తన్నుదామను కున్నాడు. పుట్టుకలో తాను పంచముడు. సోమనాథం బ్రాహ్మ ణుడు. కాని ఆకృతీ విశేషముచేత, శాంతము మొదలైన గుణగణములచే తానే బ్రాహ్మణుడు. సోమనాథం హరిజనుడు. సోమనాథం వట్టి హరిజనుడే కాదు. హరిజనులు హైందవులు. భారతీయులు. సోమనాథం ఆటవికుడు. నీగ్రో బంటు.

# 3

సవాబు పాలెం పతంజలిశాస్త్రి వెళ్ళిన తరువాత కొంత వెలా తెలం పోయింది. సోఫియా ఆ మూడో రోజునే వెళ్ళటం విఠలరావుకి సంబంధించిన వాళ్ళకి బాగా లేదు. ఆవిడను ఆధారం చేసికొని ఆ పక్షం వాళ్ళు అన్ని వర్ణములు ఒకటే అనే సిద్ధాంతానికి కొంత ప్రచారము చేద్దామనుకున్నారు. ఆయన ఉపన్యాసాలు తమకు వ్యతిరేక మయినవి. ఊళ్లో పెద్ద వాళ్ళందఱు ఆయనకు అనుకూలించారు. సోఫియా కూడా ఆ ఉపన్యాసాలకే ప్రాధాన్యం యిచ్చింది. ఇంతలో విఠలరావుకీ ఆపద వచ్చింది. అతను మళ్ళీ బ్రతికి బయట పడటానికి పతంజలిశాస్త్రి హేతువు అన్నట్లు కనిపించింది. విఠలరావే మూరి పోయినాడు. వాళ్ల పక్షము వాళ్ళ వాదము, తాత్కాలికముగ తగ్గిపోయినది. చిదంబరం కూడా ఊళ్లో నుంచి వెళ్ళి పోయినాడు. చిదంబరం వృత్తిచేత తమకు శాబేదారువంటి వాడు అయినా అతడు పండితుడనీ ఆచారపరుడనీ సాధువనీ.

ఊళ్లో పెద్దలందరు అతను అంటే గౌరవముగా ఉండే వాళ్లు. ఇప్పుడు ఊళ్లో చిక్కు తీసినట్లుగా ఉన్నది. విఠలరావు కూడ మళ్ళీ పూర్వ మార్గానికే వచ్చాడు. తనకు పతంజలిశాస్త్రి అంటే వ్యక్తిగతంగా గౌరవమే కాని అయనవన్నీ ప్రాత సిద్ధాంతలని, తనకు తెలుసునని తాను తండ్రి చాటు వాడినని అందుచేత పతంజలిని గౌరవించానని చెప్పాడు. పతంజలిశాస్త్రి ఆఊరు రాకముందు వీళ్ళ వాదం వీళ్ల పక్షం ప్రబలంగా ఉండేది. పెద్దవాళ్ళెవళ్లూ జోక్యము కలిగించుకునే వాళ్లు కారు. గూడెంలో కొందఱు తురకపాలెంలో కొందఱు యీ సభలో సభ్యులు. వాళ్లందఱు కలిసి టీపార్టీలు చేసుకునే వాళ్లు. ఇప్పుడు మళ్లీ ఆ కథ మొదలు పెట్టవచ్చును. అనుకుంటూ ఉండగా విఠలరావు దానికి వ్యతిరేకమైనాడు. వర్ణ భేదమే బాగుందన్నాడు కొంతసేపు పతంజలిశాస్త్రికి వ్యతిరేకముగా మాట్లాడుతాడు, కొంతసేపు అనుకూలంగా మాట్లాడుతాడు. కనుక ఏమీ సాగలేదు. ఇట్లా ఉండగా తురకలలో పదిమంది యువకులు గండీలు పెట్టి దండాలు బస్కీలు తీస్తుంటారు. ప్రొద్దున్నే లేచి పరుగెత్తు తుంటారు. మల్లయుద్ధాలు చేస్తూంటారు కాని వాళ్లకి తినటానికి తిండిలేదు. అందుచేత వాళ్ల వ్యాయామము వాళ్లనే తినేస్తూ ఉంటుంది. అయినా చక్రాకృతికల రొమ్ములు సన్నని నడుములు కండెలు కట్టిన బాహువులు రొమ్ములు విరుచుకుని తిరగటాలు ఉండనే ఉన్నై. గూడెం వాళ్ళకి వీళ్ళకి సంఘర్షణం జరుగుతూనే ఉంటుంది కదా !

అందు కోసము వాళ్లు నిత్యం యీ ప్రియత్నం చేస్తూనే ఉంటారు. గూడెంలో యీ ప్రియత్నాలు ఏమీలేవు. వాళ్ళ బలంఅంతా పొలము పాకే నాగలిదున్నటం, గడ్డ విసటం బరువులు మోయటం ఇక్కడి బస్తాలు అక్కడ పారవేయటం పనులు చేయటంలో పరుగెత్త వలసిరావటం ప్రధానంగా గంజి త్రావటం యిదే వాళ్ళ బలం. తగాదాలు వస్తే దెబ్బలాటలు వస్తే ఎప్పుడూ గూడెం వాళ్లదే పైచేయి. అయినా విఠలరావుకి లేచి తిరగటం ప్రారంభించినప్పటి నుంచి మనస్సులో ఒక పట్టుదల పుట్టింది. నాగడి కుటుంబం నాశనం చేయవలె. వాడి కూతురుని ఏమి చేసినా చేయవచ్చు. కొడుకు లిద్దరిని మేనల్లుడిని బ్రితకనివ్వకూడదు. నాగడు ఉంటేయేమి ఊడితేయేమి? వాడి సంగతి పట్టనేలేదు. యథార్థానికి నాగడి కూతురు యొక్క యౌవనం ఒక్క విఠలరావునే అకర్షించలేదు. ఊళ్ళో ఉన్న కాముకులందరిని ఆకర్షించింది. అది యౌవనం యొక్క లక్షణం. ఇది కాముకుల యొక్క లక్షణం. ఆ వ్యాయామం చేసే పదిమంది తురక యువకులకు దానిమీద కన్ను లేకపోలేదు. కాని దాని జోలికిపోతే గూడెమంతా ఎదురు తిరుగుతుందని భయపడి ఊరుకున్నారు. ఒకనాడు విఠలరావు వాళ్ళ తాలెంఖానాకు వెళ్లాడు. వాళ్ళచేత కుస్తీలు పట్టించాడు. చూచాడు. సంతోషించాడు. మీకు తిండి ఏదిరా అన్నాడు. వాళ్ళకు పాతిక రూపాయలిచ్చాడు. బాదంపప్పు పాలు సమృద్ధిగా తినమన్నాడు. వాళ్ళు తెగ సంతోషించారు. బాదం పప్పు

విరగ తీయటం పాలల్లో కలుపుకోవటం, త్రాగటం, వ్యాయామం చేయటం. మళ్ళీ వారం రోజులకి వచ్చాడు విఠలరావు. మళ్ళీ డబ్బిచ్చాడు. మాంసం కూడా కొనుక్కు తినమన్నాడు. వాళ్ళ పని మూడు పువ్వులు ఆరు కాయలుగా యున్నది. మూడు నెలలు తిరిగేటప్పటికి ఒక్కొక్కడు అడివిదున్నలవలె తయారైనారు. దీనితోపాటు కఱ్ఱసాము కూడా నేర్వటం మొదలు పెట్టారు. వాళ్ళంటే ఊరికి భయం వేసింది. వాళ్ళు విఠలరావుకి దాసాను దాసులు. ఉమ్మి వేసి యెండేలోపుగా రమ్మంటే రావలసిందే. విఠలరావుకి వాళ్ళకి స్నేహమైంది. వాళ్ళకి ఏది కావలిస్తే అది విఠలరావు దగ్గరికి వస్తారు. తీసుకు వెళ్తారు.

ఈ స్నేహంలో ఈ కలసి మాట్లాడటంలో నాగడి కూతురి ప్రసక్తి అప్పడు అప్పుడూ వస్తుంది. వాళ్ళందరు దాని యందు కోరికను ప్రకటిస్తారు. అసభ్యంగా కూడా మాట్లాడుతారు. విఠలరావునకు దాన్ని గురించి వాళ్ళట్లా మాట్లాడటం యిష్టంలేదు. కాని దానిమీద పగతీర్చుకోవాలి. అనేక ప్రసంగాలమీద తేలిన సారాంశ మేమిటంటే దాన్ని రహస్యంగా ఎత్తుకురావాలి దాన్ని పాడుచేయాలి. దాని అన్నగార్ల నిద్దఱను వాళ్ళ బావమరదిని సున్నములోనికి ఎముక లేకుండా విరగ కొట్టాలి, ఇది తీర్మానమైంది. దీనిని ఆచరణలోనికి పెట్టటం ఎట్లాగాఅన్నది ప్రశ్న. పదిరోజులైన తరువాత ఒక పథకం వేశారు. పొలాలు కోశారు. కుప్పలు వేశారు.

కొన్ని కుప్పల ముంజేతనే నూరుస్తున్నారు.ఆ ఊళ్లోవ ర్తకులే కాకుండా యిద్దరు ముగ్గురు పెద్ద రైతులున్నారు నాగడు అతని కొడుకులు అతని మేనల్లుడు నలుగురూ కూడ ఒకరైతు దగ్గరే పాలేరుతనం చేస్తున్నారు. ఆయన పదిపుట్ల కువ్వని నూర్పటం మొదలు పెట్టాడు. పగలు రాత్రిళ్ళూ ఐదారు రోజులు వాళ్లు అక్కడే ఉంటారు. వాళ్ళకి పగలు పంద్రెండు గంటలకు నాగడి పెళ్ళాం కాని కూతురు కాని తట్టలలో అన్నాలు పెట్టి తీసుకు వెళతారు. పగలు రెండు జాములకు కోసిన పొలాలమీద యెవరూ యుండరు. కాడి గట్లమీది పెసరకాయ ముదరలేదు. జనుము కొంచెము పెరిగింది. ఈ కుప్ప దూరాన ఉన్నది. ఇంచు మించుగా రెండుమైళ్లు నడిచి పోవాలి. ఒక జనపచేను యేపుగా వచ్చింది. ఆకుప్పకు వెళ్ళే కాలిత్రోవ ఆ చేలోంచి వెళ్ళింది. జనుము నడుమెత్తున పెరిగింది. ఆ చేను వంద గజాల పొడుగున యున్నది. ఈ వస్తాదులలో యిద్దరు ముగ్గురు జనపచేలో దాక్కొని వెనుక నించి వచ్చి ఒకడు తట్ట లాక్కొని ఒకడు దాన్ని అరవకుండా నోరు మూసి లాక్కొరావచ్చు. లాక్కొరావటానికి కూడా వీలుగా ఉంది, ఎందుకంటే ఆ జనపచేను ప్రక్కనే పంట కాలువ ఉంది. ఆ కాలువకు కొంత దిగువపాటి మన్ను త్రవ్విన పెద్ద గోయి యున్నది. ఆ గొయి చాలా పొడుగుగా యున్నది. ఆ గోతి చివర ఒక గుడిసె యున్నది, అది పూర్వము ఒక ఎరుకలవాడి గుడిసె ఇప్పుడు వాడందులో లేడు పాడుపడి యున్నది.

అక్కడి నుంచి తేలిగ్గా దాన్ని తాలెంఖానాలోకి తీసుకు రావచ్చు అనుకున్నారు. తాలెంఖానా వచ్చి వాళ్ళు సోదా చూస్తారు. తాలెంఖానావద్దు మరెక్కడికైనా తీసుకుపోవాలి, ఎక్కడికి అన్నది ప్రశ్న అయినది. వాళ్ళు ఒకటి ఆలోచించారు. సోఫియా వెళ్ళిన తరువాత కూడ ప్రయాణీకుల బంగళా తాళపు చెవులు జైనూల్ దగ్గరే ఉంటున్నాయి. వాడితో సరీకై ప్రొద్దు క్రుంకే దాక ఎక్కడో అక్కడే ఉంచి ఆ రాత్రికి దాన్ని అక్కడికి చేరిస్తే ఎవళ్ళూ అనుమానపడడానికి కూడా వీల్లేదు. కాళ్ళు చేతులు కట్టి వేయటం పగలల్లా నోట్లో గుడ్డలు కుక్కటం వేళకి అన్నం పెట్టడం అందరూ విడతలు విడతలుగాపోయి అనుభవించటం పది పదిహేను రోజులయిన తరువాత వదిలి పెట్టడం, తరువాత దాని అబ్బతో చెప్పుకోమను. జనప చేలోనే అరవనుండా నోరు మూయటం ఎవళ్లు పట్టుకున్నారో. ఎక్కడికి తీసుకు వెళ్ళారో తెలియకండా కళ్ళు కట్టేయటం, పెద్ద దుప్పట్లో చుట్టి తీసుకువెళ్ళటం ఇదీ పథకం. ఇది పూర్తిగా కొనసాగిన తరువాత వీరలరావు అందరికీ తలా వందరూపాయలూ యివ్వటం. అంతా రహస్యమే. ఈ రహస్యం తెలిసిన వాళ్ళు పంద్రెండుగురు పదిమంది తురక వస్తాదులు, జైనూలు. వీరలరావు. పాలెములో గూడెములో ఊళ్లో ఉన్న పదివేల మందిలో ఈ పన్నిద్దరిని మినహాయిస్తే తక్కిన వాళ్లందరికీ ఏమీ తెలియదు.

నలుగురు వస్తాదులు జనపచేలో రెండు రోజులు కాపలా

వేశారు. ఆ రెండు రోజులు నాగడి పెండ్లామే అన్నము తీసుకువెళ్ళింది. ఎవరు తీసుకు వెళుతున్నారో ఊరి చివరే తెలుస్తుంది. ఆ చూచినవాడు వాళ్ళతో చెబుతాడు. మూడవ రోజున అతని కూతురు అన్నం పుచ్చుకుని బయలు దేరింది. వార్త అంచెల మీద వెళ్లింది. జొన్న చేలో కాపలా వేశారు. ఆమె చేలోకి సగానికి వెళ్ళేటప్పటికి ఆమె కేమి జరిగెనో తెలియదు. అన్నపు తట్టలాగడం స్మృతి తప్పే దెబ్బ తగలటం నోరు మూయటం కళ్ళు కప్పటం దుప్పటిలో చుట్ట బెట్టటం అన్నీ నిముషములో జరిగిపోయినవి. కాలవ కట్టమీదికి ఎక్కితే దూరానికి కనబడతారు కట్ట ఒకచోట తెగి ఉన్నది. ఆసందులో నుండి కాలువలోకి తీసుకు వెళ్ళారు. కాలవ అంతా బురద, ఈ బురద కాళ్ళతో అవతల గట్టుకి ఎక్కకూడదు అవతల వేరే యిద్దరు వచ్చారు తీసుకున్నారు. ఎరుకల వాని గుడిసెలోకి చేర్చారు. అక్కడ ఉంచితే భద్రం కాదనుకున్నారు. పీర్ల పంజాలో నుంచి కర్రలు పీర్ల యిత్తడి చిహ్నాలు కట్టలుకట్టి కాలవ దగ్గరకు తెచ్చారు. వాటిని స్నానం చేయించినట్లు నటించారు. తిరిగి వెళ్ళేటప్పుడు ఆ కట్టలతో బాటు నాగడి కూతురిని కూడా మోసుకు వెళ్లారు. చూచేవాళ్ళకేమీ తెలియ లేదు. ప్రొద్దుగ్రుంకే వేళకు ప్రయాణీకుల బంగాళాకు చేర్చారు.

నాగడు అతని కొడుకులు మేనల్లుడు ప్రొద్దు తిరిగే వరకూ బువ్వకోస మెదురు చూచారు. రాలేదు. వాళ్ళు బువ్వ

తిన్న తరువాత కూతురు తిరిగి వస్తుందని తల్లి ఎదురు చూచింది. రాలేదు. ప్రొద్దు వాటారే వేళకు అటు నాగడి పెద్దకొడుకు ఇటు తల్లి వెతకటానికి బయలుదేరారు. కలుసుకున్నారు. ఏమైనదంటే ఏమైనది ? పొలాలన్నీ గాలించారు. ఊరంతా వెతికారు. వెతికారంటే వీధులలో ఉంటుందా ? రెండురోజులు గడిచింది. మూడవరోజున పోలీసు సూపరింటెండెంటు వచ్చి ఆ ప్రయాణీకుల బంగళాలో మకాం చేశాడు. నాగడి కుటుంబం పాలేర్లుగా ఉన్న పెద్దరైతు ఫిర్యాదుచేశాడు. మా పాలేరు కూతురు కనపడటము లేదు. ఊళ్ళో పాలెం వాళ్లకి గూడెం వాళ్ళకి విరోధాలు. తురకపాలెం వాళ్ళు ఆ పిల్ల నెత్తుకు పోయినారని అనుమానం, మీరు వచ్చి దర్యాప్తు చేయవలసింది. ఇక్కడి తురకలు వస్తాదులు, చాలా ధూర్తులు. ఎవరినో సామాన్యుడిని పంపిస్తే తేలదు అని వ్రాశాడుఆయన. పెద్ద రైతు పలుకుబడి కలవాడు. కాంగ్రెసులో ప్రముఖుడు. అందుచేత పోలీసు సూపరింటెండెంటే వచ్చాడు. పదిమంది పోలీసులతో వచ్చాడు. జైనూలు ఏమి చేస్తాడు ? కొంపమీదికి వచ్చింది. పోలీసువాళ్లు ప్రొద్దుక్రుంకి వచ్చారు. వస్తారనీ ఎవరికీ తెలియదు. పాపం ఆ హరిజన బాలిక నిస్సహాయురాలుగా యుండి నోరెత్తుతే కొడుతున్నారు. వాడు ఏమి చేశాడంటే, ఆమెతో యిల్లా చెప్పాడు. "నీవు నా భార్యవని చెప్పి నిన్నిక్కడనించి తీసుకుపోతాను. నువ్వు ఏడ్చావంటే, నోరు ఎత్తావంటే యిదిగో కత్తితో పొడుస్తాను. నీవు చస్తావు. చస్తే నేను

చస్తాను. అంటే పాప మాపిల్లకి నోరుఎత్తే ఓపికకూడా లేదు.
మూగదానివలె వానివెంట బడిపోయింది. ఒకళ్ళిద్దరు పోలీసులు
చూచారు. వాడి పెళ్లాము అనుకున్నారు. ఆమెను తీసుకు
వెళ్ళి వాడు వస్తాదుల కప్పచెప్పాడు. వ్యవహారం ముంచుకు
వస్తే తనపేరు చెప్పకూడదని కట్టుదిట్టం చేశాడు. రాత్రి
ప్రొద్దు పోయేటప్పటికి పోలీసులు ప్రతి తురక యిల్లూ సోదా
చూస్తారని తెలిసిపోయింది. దాన్ని ఈ ఊళ్ళో ఉంచకూడదు.
అక్కడికి నాలుగుమైళ్ళ దూరంలో ఒక ఊరు ఉన్నది. అక్కడ
పది సాయిబుల ఇళ్ళు ఉన్నవి, అక్కడికి చేర్చాలి. అది నడవ
లేదు. బండిమీద తీసుకువెళ్లాలి. దాన్ని బండిలో కూర్చోపెట్టి
ముందర ఇద్దరు వస్తాదులు వెనుక యిద్దరు వస్తాదులు కఱ్ఱలు
పుచ్చుకొని ప్రొద్దుపోయిన తవారుత బయలుదేరి తెల్లవారక
ముందు ఆ ఊరు చేర్చాలి. ఇక్కడ వీళ్ళు ఇట్లా ప్రయత్నం
చేస్తుంటే నాగడి కొడుకులు అల్లుడూ ఇల్లా ఆలోచించారు.
వాళ్ళు పిల్లని ఊళ్ళోనే దాచిఉంచుతారు. రేపుప్రొద్దున సోదా
జరుగుతుంది గనుక ఇవాళ రాత్రి పరాయి ఊరికి తరలిస్తారు
అనిఊహించి ఊరుచుట్టూ కాపలా వేశారు. రాత్రి రెండుగంట
లకి ఆ బండి బయలుదేరింది. నాగడి కొడుకులు అల్లుడూ ఆ
వైపునే కావలా యున్నారు. వాళ్ల కర్మంకొద్దీ ఆ రోజున కృష్ణ
సప్తమి. గ్రుడ్డివెన్నెల వచ్చింది. వీళ్ళుముగ్గురూ వెళ్ళారు. బండి
ఆపమన్నారు. ఆ నలుగురు వస్తాదులు వీళ్ళ ముగ్గురను ఇంచు
మించుగా చంపివేశారు. కాని వాళ్ళకి కూడా పెద్ద దెబ్బలు
తగిలినవి. ఒకడికి మోకాలు విరిగినది. ఒకడికి తల పగిలింది.

ఒకడి వీపు పెట్లి పోయింది. ఇంకోడి ఒళ్ళంతా కండెలు కట్టింది. నాగడి అల్లుడు ఏమి చేశాడంటే బండి ఎద్దును ఊడదీశాడు. అది పారిపోయింది ఈ స్థితిలో తక్కినవైవు కాపలా కాసేవాళ్లు అయిదారుగురు వచ్చారు. ఈ వస్తాదులందఱు పారిపోయినారు. కాని మోకాటి డిప్ప ఊడినవాడు మాత్రం అక్కడ పడిఉన్నాడు. పోలీసులను పిలుచుకు వచ్చారు. బ్రహ్మాండమైన కేసు. జైనూలు తెల్లవారకముందే పారిపోయాడు. ఎక్కడికి పోయాడో తెలియదు. ఆ కేసు నాలుగు నెలలు సాగింది. రంగన్న షాహుకారు రెండు లక్షలు ఖర్చు పెట్టాడు. ఇదంతా విఠలరావు చేశాడని తెలిసిపోయింది. రంగన్న షాహుకారు ఊరుకునే వాడే. కాని పెండ్లాము పోరు ఎక్కువయి పోయింది. ఖర్చుపెట్టక తప్పలేదు. నెల నాళ్లల్లో నాగడి కూతురు చచ్చిపోయింది. అల్లుడు చచ్చిపోయినాడు. కొడుకులిద్దఱు అవధులై పోయినారు. నాగడు నిస్సారపడి పోయినాడు. ఒకరోజున రంగన్న షాహుకారు విఠలరావు పట్టణాన్నుంచి తిరిగి వస్తున్నారు. నాగడు వాళ్ళ ఇద్దఱను చూచాడు. విఠలరావును చూడటంతోనే వానికి దుఃఖము కోపము రెండూ పొంగి వచ్చినవి. పట్టుకోలేక విఠలరావుని ఇట్లా అన్నాడు. నీవు నా సంహారాన్ని ఇట్లా చేశావు. వారం తిరక్కముందు చస్తావు అన్నాడు. ఆ రాత్రికే విఠలరావు మూడు దెబ్బ తిరగబెట్టి మంచాన పడ్డాడు. పతంజలిశాస్త్రికి కబురు పెట్టాడు. వారము తిరుగకముందు విఠలరావు చనిపోయినాడు.

# 4

"విన్నారా ?"

"మళ్ళీ అదేమాట. చెప్పకండా వినటమెలా ఒక్కొక్క రికి ఒక్కొక్క దురలవాటు."

"సరే వినక్కరలేదు."

"అయితే చూచారా !"

"నీవు కాపరానికి వచ్చినప్పటినుంచి చూస్తూనే ఉన్నాను."

"సరే."

"ఈ ఉత్తరం చూడండి."

"అల్లా ఉత్తరమిచ్చి చూడ డి అంటే జావుటుంది."

అని చిదంబరం ఆమె ఇచ్చిన ఉత్తరాన్ని తీసికొన్నాడు. అది సోఫియా వ్రాసిన ఉత్తరం. ఇల్లా ఉంది. "ప్రియమైన చిదంబరానికి, నేను యిక్కడకు వచ్చాను. నీకు మంచి ఉద్యోగ

మైనదని నీవు వ్రాయకపోయినా నాకు తెలిసింది. నేను నీ
చేయిచూచి చెప్పానుగదా అన్నీ నేను చెప్పినట్లే జరుగు
తున్నవి. వాళ్ళ అన్నగారు సోమనాథం కులాసాగా ఉన్నా
డని కమలతో చెప్పవలసినది. అతడదివరకే చెడిపోయినాడు.
ఇప్పుడింకా చెడిపోయినాడు అనగా నా ఆడబిడ్డ అయిన
మేరీని పెండ్లిచేసికొన్నాడు. చేసికోలేదు. ఆమె పేరు మేరీ
కాదు. ఆమె క్రైస్తవరాలుకాదు. ఆమె కా పేరు వాళ్ళన్న
గారు పెట్టినది. ఆమెపేరు రేణుక అనుకుంటాను కొందరికి
రెండు పేర్లు ఉంటవి. నీకు నీ పేరు మనోహరమని నే ననుకో
లేదు. చిన్నప్పుడు నీ పేరు చిదంబరమని నాకు జ్ఞాపకము
అక్కడికివస్తే అందరు మనోహరం మనోహరం అంటం
మొదలు పెట్టారు. నేనే మరచిపోయినానేమో అనుకున్నాను.
నేను మొన్న మీ వాళ్ళయింటికి వెళ్ళాను. వాళ్ళు యిప్పుడు
నన్ను అప్పుడప్పుడు రానిస్తున్నారు. నేను నిన్ను గురించి
చెబుతూ మనోహరం మనోహరం అంటే మా పినతండ్రికి
వాళ్లకి ఎవరికి అర్థం కాలేదు. వాడిపేరు మనోహర మేమి
టమ్మా ? వాడిపేరు చిదంబరం అన్నారు. అందరూ చిదం
బరమే నన్నారు నాకూ బాగానే జ్ఞాపకము వచ్చినది, ఈ
మనోహరం అన్న పేరు ఎల్లా వచ్చినది ? ఈ పేరుతోనే చలా
మణి అవుతున్నావు కదా ? కే అంటే ఏమిటి ? కమలా
చిదంబరమనా ? కమలా మనోహరమనా ? అది నీ భార్య
పేరైై వుంటుంది. ఈమధ్య దేశంలో ఇంగ్లీషు సాంప్రదాయం

బలిసి ఆడవాళ్ళ పేర్లకి మగవాళ్ళ పేర్లు తగిలిస్తున్నారు. పేర్లల్లోనైనా అర్ధనారీశ్వరత్వము కొరకు. ఈ ఉత్తరం కమల చూస్తుందేమో ! నీవు ఎంత చెడ్డా మేనమామ కొడుకువు కదా. నీవు కమలా మనోహరానివా, సోఫియా మనోహరానివా ? మన భాషలో మనోహరుడని ప్రాణేశ్వరుడని రెండు మాటలున్నై. ప్రాణేశ్వరుడంటే భర్త. పూర్వము మొగుడు చస్తే సహగమనం చేసేవాళ్ళు కదా వాడి ప్రాణాలు పోతే వీడి ప్రాణాలు పోయేవి. అందుచేత పూర్వం ప్రాణేశ్వరుడన్న మాట బాగుండేది. ఇప్పుడు మనోహరుడే బాగున్నది. ఎవరైతే మన స్సును ఎవడు హరిస్తాడో ఆమెకు వాడు మనోహరుడు. కమలకు నీవు ప్రాణేశ్వరుడవు. కమలకు కోపము రాకుండా ఉంటే నాకు మనోహరుడవు అని నేననుకుంటే ఏమి లాభము? నవాబుపాలెంలో అందరికీ మనోహరుడవే! ఇప్పుడు గుజరాతు ఉద్యోగంలో కూడా మనోహరుడవే. ప్రాణేశ్వరుడెందుకు ? నాకు మనోహరుడవు. కమలకు చిదంబరుడవు. అది అట్లా ఉంచి నీకు నవాబుపాలెం కబుర్లు ఏమీ తెలియవనుకుంటాను. విఠల రావు నాగడి కూతురుని అపహరించాడట. అతని కొడుకులను అల్లుళ్ళను చంపించాడట. పెద్ద పోలీసు కేసు. ఆ ఊళ్ళో ఉన్న కొందఱు తురక యువకులను వస్తాదులుగా తయారుచేయించి వాళ్ళచేత యీ పని చేయించాడు. పోలీసులు వాళ్ళందరిని పట్టుకున్నారు. పెద్ద కేసు. కేసు జరుగుతున్నదట. అని ఒక వార్త. ఈ వార్త తెచ్చిన వారెవరంటే అక్కడ నేనుండగా

నాకు పూటకూళ్ల బసనుంచి అన్నంతెచ్చే బంట్రోతు వెళ్ళిపోతే బంట్రోతుగా ఒక తురక కుర్రవాణ్ణి కుదిర్చాను. వాడిపేరు జైనూలు, నీవు వాడిని చూచావు. వాడు ఇక్కడికి వచ్చాడు. వాడు చెప్పాడు. వాడు యీ వార్త తెచ్చాడు. వీడా ముఠా . ఉన్నాడని పారిపోయి వచ్చాడని నా అనుమానము వాడు మా జాకబుని ఉద్యోగం అడిగాడు. నేనీయవద్దన్నాను జాకబు యిచ్చాడు. ఇంకా చాలా ఉన్నై చెప్పటానికి. నీ వెక్కడో ఉన్నావు. నే నెక్కడో ఉన్నాను. వ్రాస్తే మాత్రం తప్పేమి ? జాకబు వాడిని నామీద కాపలాకోసం అట్టిపెట్టా డని నా అనుమానం. అదీ న్యాయమే. నేనేమి మంచిదానిని కనుకనా ? అసలు చెప్పవలసిన విషయ మేమిటంటే రేణుక చచ్చిపోయింది. క్షయ వ్యాధితో చచ్చిపోయింది. దానికి సోమ నాథాన్ని పెళ్ళిచేసికొని చచ్చిపోదామని కోరిక. జాలిచేతనో నా బలవంతం చేతనో సోమనాథం ఆ పని చేశాడు, ఇప్పుడతడు విధురుడు. నీవు పండితుడవు. ఈ మాట కర్థం తెలుసునను కుంటాను. భర్త చచ్చిన స్త్రీ విధవ. భార్యచచ్చిన పురుషుడు విధురుడు. నవాబుపాలెం కబురులు యింకా తెలియలేదు అక్కడివార్త మీకేమీ అందటంలేదనుకుంటాను ఆ నవాబు పాలెమంటే నాకెంతో యిష్టముగా నున్నది. నిన్ను సోమ నాథాన్ని పతంజలిశాస్త్రిని నేను కలిసికొన్నది అక్కడనే కదా. మరీ నిన్ను కలసికొన్నది మరచిపోలేను. కమల నన్ను చాలా అభిమానంతో చూచింది. ఆమెకు నా ఆశీస్సులు. మీరు

సుఖంగా బ్రతకండి. మీ బిడ్డ కలెక్టరవుతాడు. నీ జీతం వెయ్యి రూపాయల దాకా వెడుతుంది." ప్రేమతో సోఫియా ఉత్తరం చదివి చిదంబరం ఇందులో విన్నారా చూచారా అన్న విశేషము ఏమున్నది అని అడిగాడు. కమల "ఉత్తరం వెనుకవైపు చూడండి తాజాకలము ఉన్నది" అన్నది. చిదంబరం వెనక్కి త్రిప్పాడు. ఇలా ఉన్నది. "తా. క. బావా! సామాన్యంగా రెండో పెళ్ళిళ్లు చేసుకొన్న మగవాళ్ళు ఆ మొదటి భార్యమీద ప్రేమ వదిలిపెట్టలేక రెండవ పెళ్లానికి పుట్టింటి ఒక పేరు ఉన్నా ఈ రెండో పెళ్ళాన్ని ఆ మొదటి పెళ్ళాం పేరుతోనే పిలుస్తూంటారు. నీ పేరు అట్లాంటిది కాదుకదా! దీనిలో దురర్థం తీయకు. సంబంధించినంతవరకే అర్థంచేసికో, నీవు కమలకు చిదంబరానివి. నాకు మనోహరానివి."

మనోహరం చదివాడు. భార్యవంక చూచాడు. కమల యిల్లా అన్నది "ఇదీ చూచారా అన్నది. విన్నారా అన్నది. దీనిభావమేమి తిరుమలేశ.

చిదంబరం "నీ కనుమానంగా ఉన్నదా? దీని వెనుక ఏదో అర్థం లేకపోలేదు. నాకు తరువాత తరువాత జ్ఞాపకం వచ్చింది. పూర్వం నేను దానిని ఎప్పుడో కలుసుకున్నాను. అప్పుడు దానికి పదేళ్ళు. నాకు పదిహేనేళ్ళనుకుంటాను. మేమిద్దరం కలసి నాలుగైదు రోజులున్నాం. చాలా చనువుగా ఉన్నాం. బావా! నేను నిన్నే పెళ్ళిచేసుకుంటానన్నది. ఆటలలోని మాట. వాళ్ళెక్కడ? మనమెక్కడ? ఇంతకు నే సదృష్ట

వంతుణ్ణి గనుక అది నా భార్యకాలేదు. నీవైనావు. నేను ప్రపంచానికి మనోహరాన్నైనా నీకు చిదంబరాన్నే. నా మనస్సులో నేను చిదంబరాన్నే. నీవు దొరకటం నా అదృష్టం. నీ మూలంగానే నేను దీర్ఘాయుష్కుణ్ణవుతున్నాను. ప్రశాంతమైన సంసారసుఖ మనుభవిస్తున్నాను. పిచ్చి ఊహాలు చేయకు."

తరువాత నాలుగు రోజులైన తరువాత నవాబుపాలెం నుంచి ఒక ఉత్తరం వచ్చింది. వ్రాసిన అతని పేరు నీలమోహన రావు అతను చిదంబరం పనిచేసిన కచేరీలో తోడి ఉద్యోగి. ఆ ఉత్తరం యిల్లా ఉంది. "ప్రియమైన మనోహరంగారికి మీకు ఈ ఉత్తరం నేను ఎందుకు వ్రాస్తున్నానో నాకే తెలియదు. మీ రిక్కడినుంచి వెళ్లారేమో సుఖపడ్డారేమో. మా ఉద్యోగాలు భద్రంగాలేవు. ఈ ఆఫీసు మూసివేస్తారేమో అన్నట్లుగా ఉంది, ఈ ఊరంతా ఘోరంగా ఉంది. విఠలరావు నాగడి కూతుర్ని కొడుకుల్ని అల్లుడ్ని చంపించాడు. ఆ కూతుర్ని చాలామందిచేత మానభంగం చేయించాడు. అతడింత దుర్మార్గుడని చెప్పటానికి వీలులేదు. కొడుకును ఖైదులో పడకండా చేసేందుకు రంగన్న షావుకారు రెండులక్షలు ఖర్చుపెట్టాడు. అయినా విఠలరావుకి ఖైదు తప్పదు, ఉరితప్పదు అనే స్థితి వచ్చింది. కాని విఠలరావు చాలా అదృష్టవంతుడు రెండులక్షలు పోయినా మఱునాడు విఠలరావుని ఖైదుచేసి తీసుకువెడతారు అనగా ఆ రాత్రే విఠలరావు చనిపోయాడు, ఇతనిమీది అభి

యోగమంతా పోయినది. నాగడు వీరలరావుని శపించాడని చెప్పుకుంటున్నారు. వాడు పరమ సత్పురుషుడు న్యాయ్య శీలి. ఏ కులమైతేనేమి సత్పురుషులు సత్పురుషులే. ఈ పని అంతా పదిమంది తురక వస్తాదులచే చేయించాడు. వాళ్లందరికి పెద్ద పెద్ద శిక్షలు పడతవని అనుకుంటున్నారు. వీళ్ళుకాక యింకొకడున్నాడు. వాడు పారిపోయినాడు. పోలీసువాళ్లు వాడికోసం ఆరాలు తీస్తున్నారు. ఇట్లు నీలమోహనరావు."

కమల:- సోఫియా వ్రాసిన జైనూల్ అన్నవాడు వాడేనేమో.

చిదంబరం:- మనకేమి తెలుస్తుంది ? మనకెందుకు ? ఎవళ్లు ఎట్లాపోతే మనకెందుకు ? ఏ కట్టెను నిప్పు ఉంటే ఆ కట్టెను దహిస్తుంది.

కమల ;- అధర్మం మండుతూ ఉంటే యింకొక కట్టె పుల్ల తగిలించటమే మంచిది. అధర్మాన్ని తెలిసి ఉపేక్షించ కూడదు

చిదంబరం :- నీవు యజ్ఞాగ్నివి నేను చితాగ్నిని.

కమల :- కాదు కాదు మీరు చిదంబరం.

మళ్లీ రెండు రోజులకి ఢిల్లీ నుంచి ఇంకొక ఉత్తరం వచ్చినది ఈ ఉత్తరం వ్రాసినవాడు జాకబు. చిదంబరం చాలా ఆశ్చర్యపోయినాడు. ఇతను తనకు ఉత్తరము వ్రాయుటమేమి అని. ఉత్తరం యిల్లాఉంది. "చిదంబరం అనే మనోహరంగార్కి.. పొరపాటున నీ మేనమామ కూతిర్ని. పెండ్లిఆడిన జాకబ్

అన్నే నేను చిన్నప్పుడు మీరిద్దఱు పెండ్లి చేసికుందామనుకుంటే మీ సంసారాలలో ఉండే భేదాలవల్ల అది కుదరకపోవటమువల్ల ఆ సంగతి తెలియకుండా ఆమెను పెండ్లి చేసికొన్న నేను మీకు ఉత్తరం వ్రాయటం పెద్ద తప్పుకాదు. కాని మీరామెను పెండ్లి చేసికోలేదు అదృష్టవంతులు. ఆమె పరమదుష్టురాలు. దుర్జనురాలు. ఆమె మానవస్త్రీకాదు. పిశాచాలంటే నాకు నమ్మకము లేకపోయినా ఆమె నాకు పిశాచాలలో నమ్మకం కలిగించింది. నేను వ్రాయకూడనివి వ్రాస్తున్నాను. ఆమె శీలముచేత పశువు. వివాహబంధాలు అక్కరలేదు. వావివరుసలులేవు. కామమే ప్రధానము అని ఒక సంఘముఉంటే ఆమె ఆ సంఘములో పుట్టదగ్గస్త్రీ. ఆమె మిమ్మల్ని ప్రేమించానని నన్ను పెళ్లి చేసికోకముందే నాతోచెప్పింది. నేను అధునిక పద్ధతిగా నాభార్య అయిన తరువాత నాయందు వ్రతంగా ఉంటే చాలునని చేసుకున్నాను. ఆమెను గురించి చెప్పేందుకు పశువు అన్న మాటచాలదు. ఇక్కడి సంగతులు ఆమె మీకు చాలా వ్రాసింది అని నాకు తెలుసు. ఆమె స్త్రీ కాదు ఒక పిచ్చికుక్క. నీ భార్య అన్నగారైన సోమనాథ శాస్త్రికి ఆమెకు సంబంధం. ఆ సోమనాథశాస్త్రి నాకొక విచిత్రమైన భావమఅది సోఫియా సోమనాథాలిద్దఱు పశు సమాజమని ఒకటి ఉంటే అందులో పుట్టతగ్గవాళ్లు. జైనూల్ అని ఒక తురకవాడు వచ్చాడు. వాడికి సోఫియాకు సంబంధం ఉన్నదట. నాకు క్రమంగా తెలిసింది. ఆ సోఫియాకు ఫలా

నావాడితో సంబంధం ఉన్నదని చెప్పటం అనవసరం. వాడిని నేను యింట్లో బంట్రోతుగా పెట్టుకున్నాను. ఆమె ప్రవర్తన అరికట్టవచ్చునని. తాళపుచెవి దొంగకిస్తున్నానని తెలియలేదు. ఆమె యిద్దరితోడను ఒకొళ్ళకు తెలియకుండా ఒకొళ్ళతో ఉంటున్నది. వాడిని నిగ్గతీసి అడిగితే వాడు చెప్పాడు. కాని వాడికి సోమనాథము మీద చాలా కోపంగా ఉంది. సోమనాథాన్ని ఎప్పుడో చంపి వేస్తాడని భయంగా ఉన్నది. వాడిని నేనడిగాను. ఒరేయి, సోమనాథం ఎలాంటి వాడో నేనూ ఆలాంటి వాడినేగదా. నన్నెందుకు చంపవురా అన్నాను. వాడన్నాడుగదా "మీరు దానికి భర్త. ఆమె నన్ను పెళ్ళి చేసుకుంటే మీ యిద్దరి సంబంధం వదలి పోతుంది. సోమనాథం నాకు అడ్డంకిగా ఉన్నాడు" దుష్ప్రవర్తన కల వాళ్ళ ప్రవృత్తులు యిలా ఉంటవి. నేను యీ ఉత్తరం ఎందుకు వ్రాస్తున్నానంటే నేను నవాబు పాలెంలో ఎవరినీ ఎరుగను. ఈజైనూలు అక్కడ ఎవరినో చంపియో ఏ మహాదుష్కార్యము చేసియో పారిపోయి వచ్చినాడని నా ఊహ. మీకేమైనా తెలిస్తే వ్రాయవలసినది. నేను వాడిని గురించి పోలీసులకు రిపోర్టుచేస్తే వాడిమీద ఏ కేసు లేకపోతే వాడు నామీద ఏ అపచారం చేసినా చేయవచ్చు. ఇది కాకండ నాచెల్లెలు చనిపోయింది. భార్య యిల్లా ఉంది. సోమనాథం మూలంగా జైనూలు మూలంగా నా యిల్లు నాదికాకుండా ఉన్నది. మిమ్మల్ని ఎరక్కపోయినా యీ ఉత్తరం వ్రాసినందుకు

తమించాలి. జైనూల్ని గురించి ఏమైనా తెలిస్తే వ్రాయవలె"

ఇట్లు

జాకబ్

మళ్ళీ రెండు రోజులైన తరువాత యింకొక ఉత్తరం వచ్చింది. అది ఢిల్లీ నుంచే వచ్చింది. వ్రాసినది మాత్రం పతంజలిశాస్త్రి. "చిరంజీవి చిదంబరానికి. నిన్ను కమలని, పిల్లలని ఆశీర్వదించి వ్రాయునదేమనగా, నేను రెండు నెలలు నించి తీర్థయాత్రలు చేస్తున్నాను. భార్యతో సహా చేస్తున్నాను. మొన్న యీ ఊరు వచ్చాను. సోఫియాను గూర్చి విచారించి వాళ్ళ యింటికి వెళ్ళాను. పరమేశ్వరుని లీల లద్భుతములు. విఠలరావు చచ్చిపోతాడని నాకు తెలుసు. ఆ సమయానికి అక్కడ ఉండకండా ఉండేటందుకే నేను తీర్థయాత్రలు బయలు దేరాను. ఈ సంగతి సోఫియాకు తెలుసు నన్ను తీర్థయాత్ర లకు పొమ్మని వ్రాసింది. ఆ సోఫియాకి తనచావు తనకు తెలుసు. ఎవడో తనను కత్తిపెట్టి పొడుస్తాడు. తాను చస్తానని నవాబు పాలెంలో నాతో చెప్పింది. మేరీతో చెప్పిందట, మేరీ జాకబుతో చెప్పింది. కడచిన రాత్రి సోఫియా సోమనాథాలు గదిలో పడుకుని నిద్రపోతూ ఉండగా జైనూలు అన్న వాడు తలుపు తోసికొనిపోయి వాళ్ళిద్దరిని గుండెలలో కత్తితో పొడిచి చంపాడు. అప్పటికి రాత్రి రెండు గంటలైనదట. వాడు పారిపోయేవాడే బైటకు వచ్చాడు. పోలీసులు పట్టు కున్నారు. నవాబుపాలెములో కథ నీకు తెలుసునని జాకబు చెప్పాడు. ఈ జైనూలు ఆ నాగడి కూతురిని ప్రియాణీకుల

బంగళాలో ఉంచి ఆ వాళ్ళతో పరీక్షై ఆ కేసులో ఉన్నాడట.
అక్కడ నుంచి పోలీసులకు వార్తలువచ్చి వీడ్ని బంధించారు.
రెండూ కలిసినవి. ఇట్లు, ప్రేమతో. పతంజలిశాస్త్రి" కమల
అన్నదిగదా. "ఈ ఉత్తరం పతంజలిశాస్త్రిగారు వ్రాయటమే
సముచితముగా ఉన్నది. అయినదులు చెప్పాడు గాటూ
కలుషితమైన గంగ గంగగానే ప్రవహిస్తున్నది."

—సమాప్తం—